# శ్రీమదాంధ్ర మహాభవము

(శివభాగవత మహాకావ్యము)

"కవితావిశారద" "న్యాయవాది"

శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతము.

MAHADEVA PUBLICATIONS,
మహాదేవ ప్రచురణలు,
S.O. రామచంద్రపురము,
తూ॥గోదావరిజిల్లా A.P.

శ్రీరస్తు. శుభమస్తు. అవిఘ్నమస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

## (శిశుపాలవధ మహాకావ్యము)

"కవితావిశారద" "న్యాయవాది"

శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతము.





MAHADEVA PUBLICATIONS,

మహాదేవ ప్రచురణలు,

S. O. రామచంద్రపురము,

తూర్పుగోదావరిజిల్లా A. P.

వెల్యము : రు. 10-00. పోస్టేజి అదనము.

స ర్వ సా మ్య సం క లి త ము.

*  *  *



మ హా దే వ ప్ర చు ర ణ లు,
ర త్నం పే ట,
రామచంద్రపురం S. O.
తూర్పుగోదావరిజిల్లా.

*  *  *

ప్రథమ ముద్రణము 500 ప్రతులు.
మార్చి 1974.

*  *  *

ప్రాప్తిస్థానము :

1. మహాదేవ ప్రచురణలు,
Mahadeva Publications,
రామచంద్రపురం, తూర్పుగోదావరిజిల్లా, A. P.

2. విజ్ఞాన ప్రచార నిలయము,
కొత్తపేట, తూర్పుగోదావరిజిల్లా.

*Hahnemann Printing Press,*
*Kothapeta,* East Godavari Dist. (A. P.)

"కవితా విశారద"

## శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యులు, B. A., B. L. వకీలు.

జననము : విరోధినామ సంవత్సర చైత్ర బహుళ ద్వాదశీ
శుక్రవారము (26-4-1889).

నిర్యాణము : కీలకనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ విదియ
సోమవారము (7-10-1968).

# కృతి సమర్పణ

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య జగద్గురు శ్రీమచ్ఛంకర
భగవత్పాద ప్రతిష్ఠాపిత శ్రీ కాంచీకామకోటి పీఠాధిప 1008
శ్రీమచ్చంద్రశేఖ రేంద్రసరస్వతీ భగవత్పాదుల
పాదారవిందములయందు
సమర్పితము.

ఇట్లు
బుద్ధవరపు మహాదేవుఁడు.

# తొలి పలుకు



కూచిమంచి సోమసుందరకవి స్వగ్రామము తూర్పుగోదావరిజిల్లా పలివెల. వెంకమాంబ వీరి ధర్మపత్ని. ఈ పుణ్యదంపతుల సంతానము - సాంబశివరావు, దుర్గాంబ, పార్వతమ్మ, గౌరమ్మ, శంకరమ్మ, సూరమ్మ, మహాదేవుఁడు, సదాశివుఁడు. సోమసుందరకవి రచించిన కీర్తనలు, శతకములు ప్రజాదరణను బొందినవి. అట్లే, సాంబశివకవి విరచితమైన ఆంధ్ర కుమారసంభవము పేరెన్నికగాంచినది.

అట్టి విద్వత్కవి కుటుంబములో మహాదేవుడుగారు విరోధినామ సంవత్సర చైత్ర బహుళ ద్వాదశీ శుక్రవారము (26-4-1889) నాఁడు జన్మించిరి. బుద్ధవరపు శంకరమ్మగారు సంతానము లేనందున సోదరులగు మహాదేవుఁడుగారిని దత్తపుత్రునిగ స్వీకరించిరి.

మహాదేవుఁడుగారు నాజనకులగు శ్రీ నాగభూషణరావుగారికి మేనమామ. మహాదేవుఁడు గారియొద్ద రామచంద్రపురములో నుండి (1931-34) నేను హైస్కూలు చదువు పూర్తి చేసినాను. ఆసమయముననే వారు మాఘకావ్య రచన ప్రారంభించి 1938 లో పూర్తి చేసిరి. తదుపరి సూతసంహిత, చంపూరామాయణము, కువలయానందము, ఖండకావ్య సంపుటి యిత్యాది రచనలనుగూడ గావించిరి.

మహాదేవుఁడుగారు తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురమునందు పేరెన్నిక గల న్యాయవాది. వీరికి చిన్నవయస్సునందు కృష్ణవేణమ్మతో వివాహము జరిగెను. ఆమె కొలఁది సంవత్సరములు కాఁపురము చేసి స్వర్గస్థురాలయ్యెను. తదుపరి మహాదేవుఁడుగారు కూరపాటి సుబ్బారావుగారి పెద్ద కుమార్తెయగు మంగాయమ్మను వివాహమాడిరి. వివాహమైన కొలఁది నెలలలో మంగాయమ్మగారు ఆటలలో పడిపోవుటవల్ల (తుంటివద్ద) కాలు విరిగెను. ఆమెకు సంతానము కలుగదని ఆరోజులలో వైద్యనిపుణులు చెప్పుటవల్ల మహాదేవుఁడుగారి దత్తత తల్లియు, సోదరియు నగు శంకరమ్మగారును, అన్నయగు సాంబశివరావుగారును వంశాభివృద్ధికొఱకు మరియొక వివాహము చేసికొనక తప్పదని ఆయనను బలవంత పెట్టిరి. వారి ఆజ్ఞను ధిక్కరింపఁజాలక సత్తిరాజు బయ్యేశ్వరరావుగారి కుమార్తెయగు హనుమాయమ్మను వివాహమాడిరి. మహాదేవుఁడుగారు ఇరువురి భార్యలను సమానముగనే చూచుకొనెడివారు. అందుచే మంగాయమ్మగారికి వెంకాయమ్మ, కృష్ణవేణి, సుందరకృష్ణరావు, శంకరమ్మ, భాస్కరరావు, సీత, సుబ్బారావు, సత్యనారాయణ అనెడివారలు, హనుమాయమ్మగారికి శంకరమ్మ, నరసింహరావు, సూర్యనారాయణ, రామబయ్యేశ్వరరావు అనెడి వారలు జనించిరి. మగపిల్లలందరు విద్యావంతులై పెద్ద ఉద్యోగములను చేసికొనుచున్నారు. చి॥ సౌ॥ సీత మద్రాసులో ఫిలాసఫీ M. A. ప్యాసై, Ph. D. చేయుచున్నది. మహాదేవుఁడుగారి కొమార్తె లందఱుకూడ విద్యావతులైరి. వారిని దగిన వరులకిచ్చి వివాహము చేసిరి. అల్లుళ్ళందరు పెద్ద ఉద్యోగములు చేసికొనుచున్నారు.

మహాదేవుడుగారు వృత్తిచే న్యాయవాది, ప్రవృత్తిచే సారస్వతోపాసకుడు. నిరతాన్న ప్రదాత. విద్యార్థులపాలిటి కల్పతరువు. పెక్కుమంది వీరియింట భుజించి, చదువుకొని నేడున్నతోద్యోగములలో నున్నారు. వీరికి భారతీయ తీర్థపీఠమువారు "కవితా విశారద" అను బిరుదము నొసంగి గౌరవించిరి. అట్టి మహానుభావుడు ఇహపరముల కనుకూలమైన యున్నత జీవిత మనుభవించి తమ 79వ యేట కీలక ఆశ్వయుజ బహుళ విదియ సోమవారమునాడు (7-10-1968) బంధు మిత్రులను దుఃఖసాగరమున ముంచి అస్తమించిరి.

మహాదేవుడుగారి సతీమణి మంగాయమ్మగారును సంస్కృతాంధ్రగ్రంథములను పఠించిన విజ్ఞానవతి. ఇతరుల యనేక గ్రంథముల నచ్చొత్తించుటకు కారకులైన మహాదేవుడుగారు స్వవిషయమున నశ్రద్ధ యొనర్చిరి. వీరి కుమారులు ఉద్యోగములు చేసి కొనుచు దూరదేశముల నున్నందున యీ గ్రంథమును నచ్చొత్తించు భారమును మంగాయమ్మ గారు నాపైని నిడిరి. నాకున్న పాండిత్యమా స్వల్పము. బాధ్యతయా అనల్పము. "కవితా భూషణ" "విద్వత్కవిశేఖర" బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు సహజముగా దయామయులు. వీరికి మహాదేవుడుగారిమీద ఎంతో గౌరవము. అందువలన నేను అర్థించిన వెంటనే యీగ్రంథమును పరిష్కరించు బాధ్యతను స్వీకరించిరి. అంతేగాదు, నా మంద బుద్ధిచే ఏకాదశాశ్వాసము ఎటనో పోయినది. దానిని వీరుపూరించిరి. వారుచేసిన కృషి అమూల్యము - అసాధారణము.

ఇదేసమయమున ఆవిడి గ్రామ వాస్తవ్యులు "సహజపాండిత్య" శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మగారితో పరిచయ మేర్పడినది. కోరినవెంటనే వారు అచ్చు తప్పులను సరిచూచుట మాత్రమేగాక మహాదేవుడుగారి పేరుతో చక్రబంధమును గూడ రచించిరి. గ్రంథమున కనువైన ఉపోద్ఘాతములను శ్రీ శాస్త్రిగారు, శ్రీ శర్మగారును చేకూర్చిరి. అచ్చుతప్పులు వీరిని తప్పించుకొనినవి యింకనూ దొరలియుండవచ్చును. సహృదయులు వానిని తెలిపినచో ద్వితీయ ముద్రణలో సరిచేయగలమని మనవి.

ఈ మహాకావ్యమును సాహితీ ప్రపంచమున కందించిన మంగాయమ్మగారికి, శ్రీ శాస్త్రి గారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు. శ్రీ శర్మకు హృదయపూర్వక ఆశీస్సులు.

విద్యావంతురాలైన మంగాయమ్మగారు, ప్రాజ్ఞులైన వారి కుమారులు మహాదేవుడు గారు రచించిన తదితర గ్రంథములనుగూడ నచ్చొత్తించి త్వరలో సాహితీప్రియుల కరకమలముల కందించగలరని ఆశించుచున్నాను.

విజ్ఞాన ప్రచార నిలయము,
కొత్తపేట,
1-3-1974.

బుధజన విధేయుడు:
వేమవరపు వేంకటరమణశర్మ.

## "కవితా భూషణ," "విద్వత్కవి శేఖర"

## బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారి

## సమీక్ష

### శ్రీ గురుమూర్తయే నమః

ఇది మహాకవి మాఘుఁడు సంస్కృతమున రచించిన "శిశుపాలవధ" కావ్యమునకు "ఆంధ్ర మాఘము" అను పేర శ్రీబుద్ధవరపు మహాదేవామాత్యుని యాంధ్రీకరణము. ఈ మహాదేవకవి తొలుదొల్తనే శాస్త్రకావ్య మనఁబడు నీమాఘకావ్యము నాంధ్రీకరించుటలో సిద్ధహస్తు లయినప్పుడు సూతసంహిత, చంపూరామాయణము వంటి సరళములగు సంస్కృత కావ్యములను దెలిఁగించుట లెక్కయేమి? అనువాదమునఁ గల క్లేశము స్వతంత్రరచన మందుండదు. నుడికారపు సొంపులో నేభాష కాభాష కొక ప్రత్యేకత యుండును. కాన మూలమందలి యందచందము లనువాదమునఁ బ్రతిబింబింపఁ జేయవలెనన్నచో నుభయ భాషలందు నసమాన విశారదత్వ మావశ్యకము గదా! అట్టిశక్తిగలదు కావుననే మహాదేవకవి మాఘుని సారస్వతమును దెలిఁగింప నడుము కట్టెను.

ఈకావ్యము నొకరిద్దఱు ప్రాచీనాంధ్రకవులు పరివర్తన మొనరించిరనియు, అందును అద్యతనపూర్వుఁడగు గోపీనాథము వేంకటకవి రచించిన ఆంధ్రమాఘకావ్యము ముద్రితమును నైనది యని వినుకలి మాత్రమే కలదు. ఈయాంధ్రీకర్తయు దానిని జూచిన ట్లగపడదు.

ఆంధ్రీకరణమునఁ గల విశేషములను దెలిసికొనుటకు ముందుగా మాఘమహాకవిని, అతని కవితా శిల్పమును గూర్చి తెలిసికోవలసి యున్నది. అంతియ కాదు. అనన్య సాధ్యమగు నా సంస్కృత కావ్యమునఁ గల వైశిష్ట్యము నంతయు సర్వంకషముగా వెల్లడించిన వ్యాఖ్యాతృ శిరోమణి మల్లినాథసూరి సామర్థ్యమును మనకుఁ దెలియవలసినదే. కాన మాఘకావ్య ప్రచుర ప్రచారముతో నారంభించి మాఘ మల్లినాథ మహాదేవకవులను గూర్చి వరుసగా వివరించుట ప్రథమ కర్తవ్యము.

భారతవర్షమున నందును దెలుఁగునాఁట సంస్కృతాంధ్ర సాహిత్య సంపర్క మున్న ప్రతివ్యక్తియును "పంచకావ్యములు" అని పేరైనను వినియే యుండును. నిన్నమొన్నటిదాఁక కవి యైనవాఁడు ముందు సంస్కృత మేకొంచెమేని యభ్యసింపక తెనుఁగు కవిత్వమునకు శ్రీకారము చుట్టినాఁడు కాఁడు. ఏనాఁటివాఁడో కాని ప్రాచీనుఁ డగు "శేషప్ప" యను నరసింహ శతక కర్త "గణ యతి ప్రాస లక్షణము చూడఁగ లేదు పంచకావ్యశ్లోక పఠనలేదు, అమర కాండత్రయం బమరఁ జూడఁగలేదు శాస్త్రీయ గ్రంథముల్ చదువలేదు, నీకటాక్షంబున నే రచించితిఁ గాని ...." యని చేసిన విన్నపము వలనఁ దొల్లి తెలుఁగునాఁట సంస్కృతపంచకావ్యములు, అమరకోశము మొదలగు సంస్కృత కోశ గ్రంథ పాఠము సర్వసామాన్య మని తెల్లియు చున్నది. ఆపంచకావ్యములలో నైదవదియే యీమాఘకావ్యము.

కవి యీకావ్యమునకుఁ బెట్టిన పేరు "శిశుపాలవధ" యని, కాని భారవికృత మగు కిరాతార్జునీయమునకు "భారవి" యనియు, మురారి కృతమగు అనర్ఘరాఘవనాటకమునకు "మురారి" యనియు, కవినామమును బట్టి పేరు గలిగినట్లే మాఘకవి నామమునుబట్టి యీ శిశుపాలవధము "మాఘము" అనిపేరొందినది. "తేషామేవ కృతిం కరోమి వివృతిమ్ మాఘస్య సర్వంకషామ్" అనిమల్లినాథసూరి ప్రయోగము. "మాఘే మేఘేగతం వయః" అనియునాతఁడే యనినట్లుజనశ్రుతియుఁ గలదు. నవసర్గే గతే మాఘే నవశబ్దో నవిద్యతే" యని వందితసూక్తి.

పశ్చిమ భారతమున పంచకావ్యము లను వ్యవహారము లేదేమో కాని కాళిదాసత్రయ మనఁబడురఘువంశ, కుమారసంభవ,మేఘసందేశములనుకావ్యములకు "లఘుత్రయి"యనియు కిరాతార్జునీయ, శిశుపాలవధ, నైషధీయ చరితములకు "బృహత్త్రయి" యనియు, ఈ షట్కావ్యములును సంస్కృతము నేర్చుకొనువిద్యార్థుల పఠన పాఠముల నున్నవనియు, అందు బృహత్త్రయిలో మాఘకావ్యము నిఖిల మహాకావ్య లక్షణములతో, అతి ప్రసన్న గభీరార్థ నిబిడమై, అత్యుపయుక్త వ్యాకరణ ప్రయోగ ప్రాచుర్యము వలనఁ పాఠకునకు వ్యుత్పత్తి నిగలిగించున దగుటచే నాకావ్యముల కెల్ల నాయకమణివలె నున్న దనియు, శిశుపాలవధోపోద్ఘాతమునఁ గలదు. అది ప్రత్యక్షరము వాస్తవము.

## మాఘ మహాకవి

అట్టి మహాకావ్యకర్త యగు మాఘకవి గుజరాతు, మార్వారదేశముల సరిహద్దున "భినమాల్" యని నేఁడు చెప్పఁబడు "భిన్నమాలవ" యను గ్రామమున జన్మించె నని నేఁటిచారిత్రకుల నిర్ణయము. కాని యాతని కాలము విషయమై స్థిరమగు నిర్ణయము కష్టసాధ్యమైనది. ఈ యాంధ్రీకర్త కావ్యముఖమునఁ గూర్చిన "మాఘుని జీవితము" అను లఘుకావ్యమునందును మాఘుని కాలము సూచింపఁ బడలేదు.

మాఘుని జీవితమును దెలుపు గ్రంథములు మూఁ డున్నవి. (1) బల్లాల పండిత కృతమగు "భోజ ప్రబంధము" (2) జైనమేరుతుంగాచార్య కృతమగు "ప్రబంధ చింతామణి" (3) ప్రభాచంద్రుని "ప్రభావక చరిత్రము" అనునవి. వీనియందు మాఘుఁడెప్పటి వాఁడో తెలుపఁ బడలేదు. మూఁడవ దగు ప్రభావక చరిత్రమున "బహుశ్రుత మునీశేభ్యః ప్రాగ్గ్రంథేభ్యశ్చ కానిచిత్ ఉపశ్రుత్యేతివృత్తాని వర్ణయిష్యే కియంత్యపి" అను శ్లోకము ననుసరించిన తక్కిన రెండు గ్రంథములుగూడ జనశ్రుతుల యాధారముననే రూపొందిన వేమో యనిపించుచున్నది.

పై మూఁడిటియందును మాఘుఁడు భోజునికి సమకాలికుఁ డని కలదు. ప్రాచీన లేఖమాలలో జెప్పఁబడిన భోజుని శాసనమువలన "భోజుఁడు క్రీస్తుశకము 996-1051 సంవత్సరముల నడుమవాఁ డని కొందఱును, 1010 - 1050 సంవత్సరముల నడిమివాఁ డని కొందఱును నిర్ణయించినా" రని బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రులవారి "సంస్కృతకవి జీవితములు" అను గ్రంథమునఁ గలదు. దానిని బట్టిమాఘుఁడు పదిపదునొకండు శతాబ్దులలోనివాఁ డని తెలియుచున్నది.

కాని "కాశ్మీరీయుఁ డగు శ్రీ ఆనందవర్ధనాచార్యులు తన ధ్వన్యాలోకము రెండవ యుద్యోతమున "త్రాసాకులః పరిపతన్ (మాఘ 5-26) రమ్యా ఇతి ప్రాప్తవతీః" (మాఘ - 3-53) అను శిశుపాలవధమందలి శ్లోకముల నుదాహరించుటచేఁదొమ్మిదవ శతాబ్ది యుత్తర

భాగము వ్రాసిన ఆనందవర్ధనునికంటె మాఘుఁడు పూర్వుఁడని తెలియుచున్నది యని యొక మతము చూపి,

జర్మను దేశీయుఁడగు ప్రో॥ యాకోబి(Prof. Jacobi) పండితుని నిర్ణయానుసారము "మాఘుఁడు క్రి. శ. ఆఱవ శతాబ్ది కిటీవలివాఁడు మాత్రము కానేరఁడు" అనెడి నిర్ణయమే సమంజసము" అని సంస్కృత మాఘకావ్యోపోద్ఘాత కర్తయగు దుర్గాప్రసాద పండితుఁడు నిర్ణయించెను.

దీనిని బట్టి మాఘుని కాలము క్రిస్తుశకము పది పదునొకండు శతాబ్దులు కావనియు, ఆనందవర్ధను లుండెడి నవమ శతాబ్దికి పూర్వమే యనియు స్పష్టమగుచున్నది. ఇఁక అతొమ్మిదవ శతాబ్దికి పూర్వ మనునది, యెనిమిదవది గాని యేడవదిగాని, లేక యాకోబి పండితుఁడు చెప్పిన యాఱవ శతాబ్దిగాని కావచ్చునుగదా! ఇట్లు విభిన్నములైన నిర్ణయములను చూచియే కావచ్చును, ఆంధ్రీకర్త మహాదేవకవి తమ లఘుకావ్యమున మాఘుని కాలము మాట స్మరింపలేదేమో యనిపించుచున్నది.

మాఘుని జీవిత మన్నో మహావిభవముతో నారంభమై మహావిషాదముతో ముగిసినట్లు కనఁబడుచున్నది. ఈకావ్యము తుదిని గల కవివంశవర్ణనమునందు — [ఘూర్జర దేశమున] శ్రీవర్మలుఁ డనెడి రాజునకు సుప్రభదేవుఁ డనువాఁడు ప్రధానామాత్యుఁడుగా నుండెడివాఁడనియు, నాతని కొడుకు దత్తకుఁ డనియు, దత్తకుని కొడుకు మాఘకవి యనియు అతఁడే యీశిశుపాలవధ కావ్యకర్త యనియు మాత్రమే కలదు. కాని భోజప్రబంధాదులందు భోజునకు మాఘుఁడు సహాధ్యాయుఁడు, మిత్రుఁడు అనియును మహాభోగియే కాక, మహాత్యాగి యనియును, మహావిద్వాంసుఁడు, మహాకవియనియు, అమితత్యాగమువలన తుదకు దారిద్ర్యమునఁ బడి యర్థులకు లే దనలేక ప్రాణత్యాగము చేసె ననియుఁ గలదు. మహాదేవకవి యీ యితివృత్తమునే స్వీకరించి కరుణరస భరితముగా 92 పద్యములలో ధారాళమగు శయ్యలో మాఘకవిచరిత్ర మను పేర రచించుటచే, మరల చరిత్ర చర్వణముగా వ్రాయ నావశ్యకత లే దని ప్రకృతమున నావిషయము విరమింపఁబడుచున్నది.

ఇఁక మాఘుని సకల శాస్త్ర పాండిత్యమును నేరీతి తనకావ్యమునఁ బ్రదర్శించెనో వ్యాకరణాంశములను నాకు వదలి, తక్కిన వానినెల్ల చిరంజీవి గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ తన రచించిన భూమికయందు వివరముగా వ్రాసి యున్నాఁడు. నేను జూపిన వ్యాకరణ విశేషములనే కాక యాయా శాస్త్రసంప్రదాయములతో పాటు వ్యాకరణ విషయముల నాతఁ డందందు స్పృశింపక విడువలేదు. వివిదిషువులగు విద్యార్థులు మాఘుని బహుశాస్త్ర వైదుష్య మాభూమికయం దరయుదురుగాక!

మాఘుఁడు సకలశాస్త్రవేత్త యయ్యును ప్రత్యేకము వ్యాకరణ శాస్త్రరహస్యములను తన కవితయందు ప్రదర్శింప వేడుక గలవాఁ డనునది నిస్సంశయము. ఈకావ్యమందలి 1679 శ్లోకములలోను బంధ యమక చిత్ర కవిత్వ పూర్ణమగు పందొమ్మిదవ సర్గమునందుఁ గూడ వ్యాకరణ విచిత్రమగు పదప్రయోగము లేని శ్లోకమే లేదనిపింపఁ దక్కిన సర్గముల మాట చెప్పుట యెందులకు?

విక్రమశకము 1827 సంవత్సరమున లిఖితమైన యొక శిశుపాలవధ పుస్తక సమాప్తి యందు "ఇతి శ్రీ భిన్నమాలవ వాస్తవ్య దత్తకసూనో ర్మహావైయాకరణస్య మాఘస్య కృతౌ శిశుపాలవధే" అని యున్నట్లు నిర్ణయసాగర ముద్రాలయ ప్రతి యుపోద్ఘాతమున దుర్గాప్రసాదపండితునివాక్యము మాఘుని వ్యాకరణ పాండిత్యమును ధ్రువపఱుచుచున్నది. వ్యాకరణలక్ష్యముల కొఱకే యవతరించిన భట్టికావ్యమువలెఁ గాక, అప్రయత్నముగా తమకుఁ దామై వచ్చి చొచ్చినరీతిని ధారాళ మగు శయ్యలోఁ గనఁబడు విశిష్ట వ్యాకరణ పదప్రయోగములే మాఘుని మహావైయాకరణునిగా వశ్యవాక్కగు మహాకవిగాఁ జాటుచున్నవి.

"తావ ద్భా భారవే ర్భాతి యావ న్మాఘస్య నోదయః
ఉదితే తు పున ర్మాఘే భారవే ర్భా రవే రివ."

అను చాటూక్తివలన మాఘుఁడు భారవిని మించిన మహాకవి యనిపించును. కాని భారవికి తరువాతవాఁ డగుటచేతను, అతని కావ్యమును బెక్కుతావుల ననుకరించుటచేతను మాఘుఁడు భారవికి శిష్యప్రాయుఁ డనిపించును. కొన్ని యంశములందు భారవి నతిక్రమించినను గురువును మించిన శిష్యుఁ డనియే యనవచ్చును గాని తారతమ్య పరీక్ష యనుచితము కాకపోదు.

'యాకోబీ' పండితుని నిర్ణయానుసారము భారవి క్రీ. శ. 520 సంవత్సరముల నాఁటివాఁ డని "సంస్కృత కవిజీవిత" గ్రంథమున నుండుటచే మాఘుఁడు భారవికిఁ దరువాతవాఁ డగుట ధ్రువపడుచున్నది. మఱియు భారవికృతమగు కిరాతార్జునీయము నెదుటనుంచుకొనియే మాఘుఁడు శిశుపాలవధము రచించినట్లు బహిరంగముగాఁ గనఁబడును. భారవి "శ్రియః కురూణామ్" అని కిరాతార్జునీయమునకు శ్రీకారము చుట్టినాఁడు. మాఘుఁడును "శ్రియః పతిః" అని తన కావ్యారంభమున శ్రీకారము చుట్టెను. భారవి ప్రతిసర్గాంత శ్లోకమునను "లక్ష్మీ" శబ్దము మానక ప్రయోగించెను. మాఘుఁడు తనకావ్యము ప్రతిసర్గాంతమునను "శ్రీ" శబ్దమును ఘటించుచునే వచ్చెను. కిరాతార్జునీయము పదునైదవ సర్గ మంతయు యమక బంధ చిత్ర కవితామయము కాఁగా, శిశుపాలవధము పందొమ్మిదవ సర్గ మట్లే ప్రతిబింబించినట్లున్నది. వ్యాసుని యాదేశమున నర్జునుని వెంబడించిన గుహ్యకుని ముఖమున వెలసిన యింద్రకీల పర్వత వర్ణనమునకు సరిగా దారుకుఁ డను శ్రీ కృష్ణసారథి ముఖమున నిందు రైవతకాద్రివర్ణనము వెలసినది. ఋతువర్ణనము, నప్సరఃకాంతలు తమప్రియులతోఁ గూడి చేసిన జలక్రీడా, పుష్పాపచయ, మధుపాన, సురతాదుల వర్ణనలు భారవి చేసినట్లే దీనియందు శ్రీ కృష్ణుఁడును యాదవులును తమతమ ప్రియురాండ్రతో జలక్రీడాదులు చేసినట్లు మాఘుఁడు వర్ణించినాఁడు. అంతియే కాదు, మహాకావ్యమున నుండవలసిన వర్ణనములెన్నియో కిరాతార్జునీయచ్ఛాయనే యిందుఁ గనఁబడును.

మహాపండితుఁడు, మహాకవి యగు మాఘు నంతటివాఁడు పరుల పాదచ్ఛాయల నరుగు నంతటి యస్వతంత్రుఁడా? యందురేమో? కాదు. కాదు. అందులకై కొంచెము లోఁతుగా నరయవలసియున్నది. ఆకాలమున వర్ణనప్రధానము లగు ప్రబంధములకు ప్రభువులయుఁ బ్రజలయు నాదరణము హెచ్చుగా నుండెడిది. కావుననే యితివృత్తమున కంటె వర్ణనములందుఁ నిప్పుడు దృష్టి కేంద్రీకృతమై యుండెడిది. కథ కావలసినచోఁ బురాణేతిహాసములు పెక్కు

లుండనే యున్నవి అనుతలంపుతోఁ గథను నిమిత్తమాత్రము చేసికొని వర్ణనములందుఁ దమ ప్రతిభా వ్యుత్పత్తులను కవులు ప్రదర్శించుచు వచ్చిన ట్లగపడును. కిరాతార్జునీయ గాథ భారతమున 5అధ్యాయములందుఁ గలదు. దానిని గొనిభారవి 18సర్గములలో 1040 శ్లోకములలో వర్ణనల కనువుగా మార్చుకొనుచుఁ జెప్పెను. అట్లే మాఘుఁడును భారతమున 17 అధ్యాయ ములలోని గాథను స్వీకరించి 20సర్గములలో 1679 శ్లోకములతోఁ జెప్పెను. ఈ రెంటను కథ రేఖామాత్రముగాను వర్ణన చమత్కారము పరిపూర్ణముగాను గనఁబడును. ఈక్రమము నైష ధీయచరితము నకును సంక్రమించినది. అది యాకాలప్రభావ మనుకొనినచో భారవి మాఘులఁ గూర్చి తారతమ్య చర్చ యనావశ్యక మనిపించును. మాఘుని "ఘంటామాఘుఁ" డను బిరుద ముతోఁ బిలుచుటకాతని "ఉదయతివితతోర్ధ్వరశ్మిరజ్జా" (మాఘ. 4-20) అను శ్లోకవర్ణనా నైపుణ్యమువలననే కలిగినట్లు వల్లభ దేవుఁడు తన సందేహ విషౌషధి వ్యాఖ్య యందు పేర్కొనెను.

"సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ" అను రఘువంశమందలి శ్లోకమును బట్టి "దీపశిఖా కాళి దాసు" అను బిరుదము కాళిదాసునకు వచ్చినట్లే శిశుపాలవధ కావ్యము నాల్గవ సర్గమందలి యిరువదియవ శ్లోకవర్ణనమునకు నానందపరవశులగు రసజ్ఞులు మాఘుని" ఘంటా మాఘుఁ డ"ను బిరుదమునఁ బిలువఁ జొచ్చిరి యని పండితలోకమున ప్రసిద్ధి. కవితారంగమున మాఘుఁడు ఘంటలు దాల్చి వీరవిహార మొనర్చిన మహాదిగ్గజము కాదని యెవరనఁగలరు? కాని యాబిరుదమునకు హేతువు మల్లినాథసూరి యనినట్లు "పూర్ణా పునర్వర్ణనా" అనునదియే. ఈ ఘంటలు సంఘటించిన యాశ్లోకమునకు మహాదేవకవి యాంధ్రీకరణమును చూతము.

గీ. పైకి వెల్వడు కాంతులే పగ్గములుగ
నస్తమించుచు నుదయించు చర్కశశులు
పార్శ్వముల వ్రేలు గంటల భాతి మెఱయ
నద్రి దిగ్దంతి లీలల ననుకరించు,

అని ఇందు వర్ణ్యము రైవతకాద్రి, తమతమ కిరణములు కొండ మీఁదిభాగమునకుఁ బ్రసరించు చుండ — అస్తమించుచున్న సూర్యుఁడొక పార్శ్వ మునను ఉదయించుచున్న చంద్రుఁడొక పార్శ్వమునను వ్రేలుచుండఁగా —నడుమ నున్న కొండ —కుక్షిస్థానమునకు సూటిగా యిరుప్రక్కల వ్రేలాడుచుండు రెండు ఘంటలతోఁ గూడిన మహాదిగ్గజము వలె నున్నది అని భావము. ఇట్టి మనోహర మగు భావనపై - కావ్యమునకు జీవిత వైభవ మనఁ బడునట్టి వ్యంగ్యమును దీనియందు గలదని మల్లినాథ సూరి "తథా సూర్యాచంద్రమసౌ అస్యగిరేః కుక్షి సమాన కక్షం బిభ్రత ఇతి మహదౌన్న త్యం వ్యజ్యతే" అనెను. (సూర్యచంద్రులీకొండకు కుక్షిసమ ప్రదేశమున నున్నారనుట వలన నాకొండ యొక్క మహౌన్నత్యము ధ్వనించుచున్నది అని).

ఈ సర్గమున 68 పద్యములు గలవు. ఆద్యంతము పర్వతవర్ణనమే. అన్నిటిలో నీపద్య మందలి వర్ణనమే రసజ్ఞచిత్తాకర్షకమై "ఘంటామాఘుఁ" డను బిరుదమునకు హేతువైనదన్న మాట.

కవిస్వరూప నిరూపణమున రాజశేఖరుఁడు తన కావ్యమీమాంస యందు "ప్రతిభయు

వ్యుత్పత్తియును సమముగాఁ గలవాఁడు కవి" యనిచెప్పి, ప్రతిభ యన నవనవోన్మేషము గల బుద్ధివిశేషము, వ్యుత్పత్తి యన బహుజ్ఞత్వము అని కొందఱనిరి. ఉచితానుచిత వివేకము తనమతము అనెను. అట్టి ప్రతిభా వ్యుత్పత్తులు గల కవులు శాస్త్రకవి, కావ్యకవి, ఉభయకవి యని మూఁడు విధములని వారివారి స్వరూపముల నిరూపించి, అటు శాస్త్రమునందును, ఇటు కవిత్వమునందును గొప్పవాఁడగునో ఉభయకవి శ్రేష్ఠుఁడని విపులముగా చర్చించి నిరూపించినాఁడు.

దాని ననుసరించి నిదానముగాఁ బరిశీలించినచో మాఘుఁడు ఉభయకవి కోటిలోనికి వచ్చును. కావ్యకవి యెట్లయ్యెనో పిదప చూడవచ్చును. శాస్త్రకవి యెట్లయ్యెనో తొలుత నరయుదము. ఇతర శాస్త్రము లర్థాశ్రయములు వ్యాకరణ మన్ననో శబ్దాశ్రయము కాన చూడఁగనే కనిపించునది.

మహావైయాకరణులు మాఘుని ప్రయోగ వైచిత్రి నెట్లు విమర్శించి ప్రదర్శించిరో మచ్చునకు కొన్ని చూపఁబడును.

ఇందలి ప్రథమసర్గము ప్రథమశ్లోకమున నొక ప్రయోగ వైచిత్రి. "వసన్ దదర్శ" అను పదప్రయోగమును గూర్చి "ధాతు సంబంధే ప్రత్యయాః" అను పాణినీయ సూత్రము వృత్తి యందు - ధాత్వర్థానాంసంబంధే యత్రకాలే ప్రత్యయా ఉక్తాః, సుః విజంత తతోన్యత్రాపిస్యుః వాచ్యక్రియాయాః ప్రాధాన్యాత్ తదను రోధేన గుణభూత క్రియావాచిభ్యః ప్రత్యయాః "వసన్ దదర్శ భూతేలట్" అని సిద్ధాంతకౌముది యందు చర్చింపఁబడెను.

ఈశ్లోకమున వసుదేవుని యింటనుండిన శ్రీకృష్ణుఁ డొకనాఁడు మింటినుండి దిగివచ్చు నారదుని చూచెను. ఇది విషయము ప్రకృతము. ఆసందర్భమున వసుదేవ సద్మమున 'వసన్ దదర్శ' అనిప్రయుక్తమైనది. 'వసన్' అనునది వసధాతువుపై వర్తమానార్థమున శతృప్రత్యయము రాఁగా నైన రూపము. 'దదర్శ' అనునది దృశ్ ధాతు భూతార్థక లిడంతక్రియ. వసించుట అను వ్యాపారము గూడ దర్శన క్రియ వలెనే అతీతము (జరిగి పోయినది) అయినను, గుణభూతము అనఁగా అప్రధానమైనది కావున వర్తమానార్థమున రాఁదగిన శతృప్రత్యయము భూతార్థమున వచ్చినది. 'వసన్ దదర్శ' అనఁగా ఉషిత్వా దదర్శ - నివసించిచూచెను. అనియే కాని, వసన్ - ఇప్పుడు వసించుచున్నవాఁడై దదర్శ- మున్నెప్పుడో చూచెను అను నర్థ మిచుటఁ జెప్పరాదు. వసన దర్శన క్రియలు రెండును కృష్ణ కర్తృకములే. రెండును అతీతములే- (జరిగిపోయినవే—) అట్టియెడ వసధాతువునకు వర్తమానార్థకమగు శతృప్రత్యయము వచ్చుటకంటె వైచిత్రి యేమున్నది?

కావ్యవాఙ్మయమున "న భూతో న భవిష్యతి" యనఁదగిన ప్రయోగ విశేష మొకటి గలదు. అదియును ఆర్థిక విషయమే. ప్రథమ సర్గము 51 శ్లోకము. "పురీ మవస్కంద లునీహి నందనం" ఇత్యాది. దీనియందలి "అవస్కంద, లునీహి, ముషాణ, హర," యను నాలుగు లోడంత క్రియాపదముల యర్థనిర్ణయము వ్యాకరణ, తర్క, మీమాంసాది శాస్త్రములకు మంథాయమానమై మాఘుని మహావైయాకరణునిగాఁ జేసినది. అతని కవితామార్మికతకును నది నికషాయమాణ మైనది. ఆవిషయము చి॥గరిమెళ్ళ— శర్మ యీకావ్యమునకు వ్రాసిన 'భూమిక' యందు విపులీకరింపఁబడినది. అట చూడవచ్చును.

2సర్గము, 1శ్లోకము:- ఇందు కారకవైచిత్రి. 'మురంద్విషత్' అనురూపమును నిర్దేశించు చున్నవాఁడు అని తెనుఁగు భాషాపరిపాటిని కర్మవాచకమునకు ద్వితీయ న్యాయమే అనిపించును. కాని సంస్కృతమున నట్లుకాదు. ద్విష్ ధాతువునకు కర్మవాచకమగుమురశబ్దముకంటె 'కర్మణి ద్వితీయా' అను సామాన్యశాస్త్రముచే ద్వితీయప్రాప్తించెను. కాని 'ద్విష' ధాతువుకంటె 'ద్విషో మిత్రే' అనుసూత్రము చేత "శతృ" ప్రత్యయము రాఁగా ద్విషత్ అనురూపము సిద్ధించినది కాన కృదంతమగుటచే "కర్తృ కర్మణోః కృతి" అనుసూత్రము చే కృద్యోగమున కర్మవాచక ద్వితీయను బాధించి షష్ఠి వచ్చి 'మురస్య ద్విషత్' అనికావలసియున్నది. శతృప్రత్యయము కృత్తయ్యును 'నలోకావ్యయనిష్ఠా ఖలర్థతృనామ్' అనుసూత్రముచే ఆషష్ఠి బాధితము కాఁగా మరల "కర్మణి ద్వితీయా" అనుసూత్రముచే "మురంద్విషత్" అని ఒక్కరూపమే కావలసివచ్చినది. కాని "ద్విష శ్శతుర్వా" అను వార్తికముచే శత్రంతమగు 'ద్విషత్' అనుదానితో యోగము కలుగుటచే షష్ఠీ నిషేధము వికల్పముగా బాధితమై, మురస్య ద్విషత్, మురంద్విషత్ అను రెండు విధములును ప్రాప్తించు నని శాస్త్రము. ఈ రహస్యమునుజూపుటకే మాఘకవి ద్విషన్మురమ్ అని ప్రయోగించెను.

అభిచైద్యం:- 'లక్షణే నాభిప్రతీ' అనుసూత్రమున అవ్యయీభావ సమాసమైనను కావచ్చును. లేక 'అభిరభాగే' అను సూత్రమున కర్మప్రవచనీయ సంజ్ఞగల అభితోయోగమున ద్వితీయ వచ్చెనని యైనను చెప్పవచ్చునని వ్యాఖ్య.

2స, 4శ్లో. 'ఏకాకినో ఽపి పరితః పౌరుషేయ ఇవావృతాః' ఏకాకినః పౌరుషేయః అనురెండును తద్ధితాంతములు. అసహాయుఁ డను వర్థమున ఏక శబ్దముపై వచ్చిన ఆకిని ప్రత్యయముచే ఏకాకినః అనియైనది. "ఏకా దాకిని చ్చాసహాయే" అని పాణినీయము. అట్లే పౌరుషేయః "అనునది సర్వ పురుషాభ్యాం ణఢఞౌ" అను సూత్రముచే పురుషశబ్దములకు ఢఞ్ప్రత్యయము చేరఁగా సిద్ధించినరూపము. పురుషా ద్వధ వికార సమూహ తేనకృతేషు (భాష్యకార ప్రయోగాత్తేనే త్యవ్యద్వంద్వ మధ్యేనివేశః) అనువార్తికముచే "సమూహము' అను వర్థమున వచ్చినది అప్రత్యయము అని చెప్పి 'ఏకాకినోపి పరితః' ఇత్యాది మాఘుని యీప్రయోగమే కౌముదియం దుదాహరింపఁబడెను. దీనిచే మాఘుని ప్రామాణికత విశద మగుచున్నది.

2-23లో ఇంధనౌఘ ధక్ (కట్టెలగుంపును కాల్చునది) ఇదియొక కృదంత విశేషము. ఇంధనౌఘమును దహించునది అను వర్థమున "దహ భస్మీకరణే" అనుధాతువుపై క్విప్-ప్రత్యయము చేరఁగా 'దహ్' అనియైనది. దహ్ + క్విప్-అని యుండ "దాదే ర్ధాతో ర్ఘః" అను సూత్రముచే ఘత్వము రాఁగా దఘ్ అని అయి, ఏకాచో బశో భష్ ఝషంతస్య స్ధ్వోః' అను సూత్రముచే దకారముకు భష్భావము రాఁగా 'ధఘ్' అనియు, 'ఝలాం జ శోంతే' అను సూత్రముచే జశ్త్వము వచ్చి ధగ్ అనియు 'వావసానే' అనుసూత్రముచే చర్త్వమురాఁగా 'ధక్' అనియు (వికల్ప) రూపము సిద్ధించెను.

**2-24లో**— మహాభాష్యస్వరూపము బ్రకృతమున ఘటింపఁ బడినది. ఉద్ధవుఁ డను చున్నాఁడు. కృష్ణుని వాక్యము అల్పాక్షరము అర్థగంభీరమును కాన పాణినీయ సూత్రము వంటి దన్నమాట. ఆ కృష్ణునివాక్యమునకు నావాక్యములు భాష్యమువంటివి. అనఁగా కృష్ణ

వాక్యములకే వివరణ మని భావము. 'సూత్రస్థం పద మాదాయ వాక్యైః సూత్రాను సారిభిః స్వపదాని చ వర్ణ్యంతే భాష్యం భాష్యవిదో విదుః' అను భాష్య లక్షణమునకు లక్ష్యముగా చెప్పఁబడెను.

2–40లో 'ఆలిప్యాల మిదం .... అల మశ్రేయసే' అని "అలం' అను నవ్యయము రెండు చోట్లఁ గలదు. మొదటిది ప్రతిషేధార్థకము. రెండవది 'సమర్థము' అనునర్థము గలది. మొదటి 'అలం' నకు ఆలిప్య అనుదానితో సంబంధము. ఆ + లిప్ అనుధాతువునకు 'అలం ఖల్వోః ప్రతిషేధయోః ప్రాచాం క్త్వా' (అలం ఖలు అను ప్రతిషేధార్థకావ్యయము లుపపదములుగా నున్నపుడు ధాతువునకు క్త్వాప్రత్యయము వచ్చును. అనునర్థముగల) సూత్రముచే క్త్వాప్రత్యయము రాఁబోవ (ఆ + లిప్ + క్త్వా అనియుండ నున్నమాట) "సమాసే ఽనఞ్ పూర్వే క్త్వోల్యప్" అనుసూత్రముచే క్త్వాప్రత్యయమును బాధించి, ఆ + లిప్ + య = ఆలిప్య అనియై 'ఆలిప్య అలం' అని ప్రయోగార్హ మైనది.

ఇఁక రెండవదియగు 'సమర్థము' అను నర్థము గల 'అలం' ఉపపదముగా నున్నపుడు పూర్వపదమగు "అశ్రేయః "శబ్దమునకు నమః; స్వస్తి, స్వాహా, స్వధాలంవషడ్యోగాచ్చ" అనుసూత్రముచే చతుర్థీ కారకము వచ్చి 'అశ్రేయసే' అని యైనది. అశ్రేయసే అలం అనఁగా కీడొనర్ప సమర్థము అని భావము.

ఇంకొక విశేషము. మీఁది 'సమాసే' అనుసూత్రమున సమాసమున క్త్వాప్రత్యయమునకు ల్యబాదేశము నఞ్ పూర్వకమైనధాతువునకురాదని యున్న యంశమునకు–ఈసర్గమందలి 52శ్లోకమున అకృత్వా హేలయా" అని ప్రయోగించి మాఘుఁడే చూపెను. ఇచట కృఞ్ ధాతువు సమాసగతమైనను అది నఞ్‌తో సంబంధము కలదగుటచే ల్యప్పు రాక క్త్వాంతముగానే నిలిచి పోయినది.

2–45— మాజీవన్ యః పరావజ్ఞా దుఃఖదగ్ధోపి జీవతి తస్యాజననిరేవాస్తు జననీ క్లేశకారిణః అనఁగా శత్రు కృతావమానముచే తప్తుఁడయ్యును నెవఁడు (మాజీవన్ =) నీచజీవియై జీవించి యుండునో తల్లికి కేవలము క్లేశకారి యగు నానీచుఁడు (అజననిః) పుట్టకుండుట మేలు అని భావము. ఇందు "మా జ్యాక్రోశే ఇతి వాచ్యం' అను వార్త్తికముచే మాఙ్ ఉపపదముగా నుండ– నిందార్థమున (జీవ) ధాతువునకు శతృప్రత్యయము వచ్చి 'మాజీవన్' అని యగుట యొకటి 'ఆక్రోశే న ఞ్యనిః అనుదానిచే నఞ్ పూర్వక 'జని' ధాతువుపై నిందార్థమున 'అని' ప్రత్యయము (నికృష్టజన్మము అనునర్థమున) వచ్చి 'అజననిః అను రూపము నొందు టొకటి విశేషములు.

ఈప్రయోగ విశేషములను కౌముదియు గురుబాల ప్రబోధికయు ప్రమాణముగా స్వీకరించినవి.

2–2లో 'కథం' అనునర్థమున 'కథంకారమ్' అని ప్రయుక్తమైనది. 'అన్య, థైవం, కథ, మిత్థం సు, సిద్ధాప్రయోగశ్చేత్' ఇతి సూత్రేణ అనర్థకాదేవ కరోతేః (కథంపూర్వాత్) ణముల్, ఉదా: అన్యథాకారమ్, ఏవంకారమ్ కథంకారమ్ అని సిద్ధాంత కౌముది. ఇందనుప్రయుక్తమైన 'కారమ్' అను ణములంత 'కృఞ్ ధాతు రూపమున కర్థము వేఱుగా లేక కథమ్ అనుదానికి చేరిన దన్నమాట. ఇదొక వ్యాకరణ విశేషమే కదా!

2–63 'అస్మాక దంతి సాన్నిధ్యాత్' అను సమాసమందలి అస్మాక శబ్దమపురూపమైనది. యుష్మ దస్మచ్ఛబ్దములపై ఛప్రత్యయము రాఁగా యుష్మదీయః, అస్మదీయః, అని యు ఖఞ్

ప్రత్యయము రాఁగా—"యౌష్మాకీణః" "అస్మాకీనః" అనియు నగును. వీనికే లోకమున ప్రచుర ప్రయోగము. కాని "అణ్" ప్రత్యయము రాఁగా నైన 'ఆస్మాకః' అను తద్ధితాంతమునకు విరళ ప్రయోగము. అట్టి నిగూఢమైన యీపదమును మాఘునివంటి పదశాస్త్రవేత్తగాని ప్రయోగింపఁగలఁడా?

2-65 "యజతాం పాండవః, స్వర్గ మవత్వింద్రః తప త్వినః వయం హనామ ద్విషతః, సర్వః స్వార్థం సమీహతే" అను శ్లోకమున యజతాం, అవతు, తపతు, హనామ అను నాలుగు క్రియాపదములు లోడంతము లగుట మాత్రమే కాదు. యజించుఁగాక, రక్షించుఁగాక—ఇత్యాది విధ్యాద్యర్థమే కాక, ఆయాయి పనుల కుచితకాలము వచ్చినప్పుడు జరుగును అను నర్థ విశేష మునఁ బ్రయుక్తము లైనవి. అంతియ కాని యీపనులన్నియు నేకకాలమున జరుగు నను నర్థము కాదు. ఇదియొక ప్రయోగ చమత్కారము. ఈయర్థ మెట్లు వచ్చుననఁగా 'ప్రై షాతి నర్గప్రాప్త కాలేషు కృత్యాశ్చ' అను సూత్రమున కృత్యప్రత్యయముల కర్థము నిర్ణయించుచుతుది చకారముచే లోడంతరూపమునకుఁ గూడ "ప్రాప్తకాలమున "ననునర్థమందు ప్రయోగము సాధు వని సిద్ధించినది. ఆరహస్యమును మాఘుఁడిందు వెల్లడించెను. ఇట్టిదే యీసర్గమందలి 66శ్లోకమునఁ గలదు. 'శస్త్రైః సంపత్ ప్రాప్యతాం' అని కర్మార్థక లోడంతముగాఁ బ్రయుక్తము అచటఁగూడ నుచిత మగు కాలము ప్రాప్తించినపుడే శస్త్రములచే సంపద పొందఁబడుగాక అను నర్థము సిద్ధించుచున్నది.

2-70శ్లోకము రెండవపాదము రెండవ ఖండమున "ఖలూక్త్వాఖలు వాచికమ్" అని కలదు. ఇందు రెండు చిత్రమగు విషయములు "ఉక్త్వాఖలు" అనఁగా "వచింపరానిది" యని యర్థము. ఇందు రెండు 'ఖలు' అనుపదము లున్నవి. మొదటి 'ఖలు' అనునది ప్రతిషేధార్థకము. "వాచికంఖలు" అనునప్పటి "ఖలు" కేవలము వాక్యాలంకారము. అనఁగా అర్థరహితమైనది అన్న మాట. ఈరెండర్థములకును "నిషేధవాక్యాలంకార జిజ్ఞాసానునయే ఖలు" అను నమరనిఘంటువు గలదు. "ఉక్త్వా" అనుక్త్వార్థకమునకు వాచ్యం అను నర్థ మె ట్లన్నయెడ "అలం ఖల్వోః ప్రతిషేధయోః ప్రాచాంక్త్వా" అను సూత్రముచే ప్రతిషేధార్థకము లైన "అలంఖలు" అనివానితో యోగ మున్నపుడు ధాతువునకు క్త్వాప్రత్యయము రావలెను. కావున "వాచ్యం" అను కృదంతమునకు మాఱుగా "ఉక్త్వా" అని క్త్వాంతరూపము వచ్చినదే కాని "వాచ్యం" అనియే అర్థము. ఉక్త్వాఖలు=న వాచ్యం నవాచ్యం ఖల్వీత్యర్థః అద్యః "ఖలు' ప్రతిషేధార్థః, అన్యః వాక్యాలంకారః "నిషేధ" ఇత్యాది నా ఉభయత్రాపి అమరః, "అలం ఖల్వోః - ఇత్యాది సూత్రేణ క్త్వాప్రత్యయః" అను మల్లినాథసూరి వచనముల ననుసరించియే ముందు వివరింపఁబడినది. ఇంకొక శంక, 'ఖలూక్త్వాఖలు వాచికమ్' అనునది శ్లోకమున నాల్గవపాదము. అట్టియెడ పాదాదిని ఖలు అనునది ప్రయోగింపఁదగునా? "న పాదాదౌ ఖల్వాదయః" అనికావ్యాలంకార సూత్రవృత్తియందు వామనుఁడు పాదాదిని "ఖలు' మున్నగునవి యుండరాదని నిషేధించినాఁడుగాదా! అని—

దానికి మల్లినాథుఁడు "వామనుని నిషేధము ఉద్వేజ కాభిప్రాయమైనచో దుష్టము కాని నఞర్థ "ఖలు శబ్దముద్వేజకము కాదు. కావున పాదాదిని నఞ్ ప్రయోగమువలె "నాహం జానామి" ఇత్యాదులవలె దూష్యము కాదనెను. అనఁగా కేవల [నిరర్థక] వాక్యాలంకారములగు 'ఖలు' మున్నగునవి పాదాదినుండరాదు. కాని నఞర్థనకారమువలె నిషేధార్థముగల ఖలు శబ్దమువంటి అర్థవంతము లగు నవ్యయములు పాదాదిని బ్రయోగింపవచ్చు" నని సమర్థించెను.

వాక్యములకే వివరణ మని భావము. 'సూత్రస్థం పద మాదాయ వాక్యైః సూత్రాను సారిభిః స్వపదాని చ వర్ణ్యంతే భాష్యం భాష్యవిదో విదుః' అను భాష్య లక్షణమునకు లక్ష్యముగా చెప్పఁబడెను.

2-41లో 'అలప్యాలమిదం .... అల మశ్రేయసే' అని "అలం' అను నవ్యయము రెండు చోట్లఁ గలదు. మొదటిది ప్రతిషేధార్థకము. రెండవది 'సమర్థము' అనునర్థము గలది. మొదటి 'అలం' నకు అలప్య అనుదానితో సంబంధము. అ+లప్‌అనుధాతువునకు 'అలం ఖల్వోః ప్రతిషేధయోః ప్రాచాం క్త్వా' (అలం ఖలు అను ప్రతిషేధార్థకావ్యయము లుపపద ములుగా నున్నపుడు ధాతువునకు క్త్వాప్రత్యయము వచ్చును. అనునర్థముగల) సూత్రముచే క్త్వాప్రత్యయము రాఁబోవ (అ+లప్ + క్త్వా అనియుండ నున్నమాట) "సమాసేఽనఞ్‌పూర్వే క్త్వోల్యప్" అనుసూత్రముచే క్త్వాప్రత్యయమును బాధించి, అ+లప్+య=అలప్య అనియై 'అలప్య అలం' అని ప్రయోగార్హ మైనది.

ఇఁక రెండవదియగు 'సమర్థము' అను నర్థము గల 'అలం' ఉపపదముగా నున్న పుడు పూర్వపదమగు "అశ్రేయః "శబ్దమునకు నమః; స్వస్తి, స్వాహా, స్వధాలంవషడ్యోగాచ్చ" అనుసూత్రముచే చతుర్థీ కారకము వచ్చి 'అశ్రేయసే' అని యైనది. అశ్రేయసే అలం అనఁగా కీడొనర్ప సమర్థము అని భావము.

ఇంకొకవిశేషము. మీఁది 'సమాసే' అనుసూత్రమున సమాసమున క్త్వాప్రత్యయమునకు ల్యబాదేశమునఞ్ పూర్వకమైనధాతువునకురాదని యున్న యంశమునకు-ఈసర్గమందలి 52శ్లోక మునఅకృత్వా హేలయా"అనిప్రయోగించి మాఘుఁడే చూపెను. ఇచట కృఞ్‌ధాతువు సమాసగత మైనను అది నఞ్‌తో సంబంధము కల దగుటచే ల్యప్పు రాక క్త్వాంతముగానే నిలిచి పోయినది.

2-45— మాజీవన్ యః పరావజ్ఞా దుఃఖదగ్ధోపి జీవతి తస్యాజనని రే వాస్తు జననీ క్లేశకారిణః అనఁగా శత్రు కృతావమానముచే తప్తుఁ డయ్యును నెవఁడు (మాజీవన్=) నీచ జీవియై జీవించి యుండునో తల్లికి కేవలము క్లేశకారి యగు నానీచుఁడు (అజననిః) పుట్టకుం డుట మేలు అని భావము. ఇందు "మా జ్యాక్రోశే ఇతి వాచ్యం' అను వార్తికముచే మాజ్ ఉపపదముగా నుండ- నిందార్థమున (జీవ) ధాతువునకు శతృప్రత్యయము వచ్చి 'మాజీవన్' అని యగుట యొకటి 'ఆక్రోశే న ఞ్యనిః అనుదానిచే నఞ్‌పూర్వక 'జని' ధాతువుపై నిందా ర్థమున 'అని' ప్రత్యయము (నికృష్టజన్మము అనునర్థమున) వచ్చి 'అజననిః అను రూపము నొందు టొకటి విశేషములు.

ఈప్రయోగ విశేషములను కౌముదియు గురుబాల ప్రబోధికయుప్రమాణముగా స్వీకరించినవి.

2- 2లో 'కథం' అనునర్థమున 'కథంకారమ్' అనిప్రయుక్త మైనది. 'అన్య, థైవం, కథ, మిత్థం సు, సిద్ధాప్రయోగశ్చేత్' ఇతి సూత్రేణ అనర్థకాదేవ కరోతేః (కథంపూర్వాత్) ణముల్, ఉదా: అన్యథాకారమ్, ఏవంకారమ్‌కథంకారమ్ అనిసిద్ధాంత కౌముది. ఇందప్రయు క్తమైన 'కారమ్' అను ణములంత 'కృత ధాతు రూపమున కర్థము వేఱుగా లేక కథమ్ అనుదానికి చేరిన దన్నమాట. ఇదొక వ్యాకరణ విశేషమే కదా!

2-63 'ఆస్మాక దంతి సాన్నిధ్యాత్' అను సమాసమందలిఆస్మాక శబ్దముపురూప మైనది. యుష్మ దస్మచ్ఛబ్దములపై ఛప్రత్యయము రాఁగా యుష్మదీయః, అస్మదీయః, అనియు ఖఞ్

ప్రత్యయము రాఁగా—"యౌష్మాకీణః" "ఆస్మాకీనః" అనియు నగును. వీనికే లోకమున ప్రచుర ప్రయోగము. కాని "అణ్" ప్రత్యయము రాఁగా నైన 'ఆస్మాకః' అనుతద్ధితాంతమునకు విరళప్రయోగము. అట్టి నిగూఢమైన యీపదమును మాఘునివంటి పదశాస్త్రవేత్త గాని ప్రయోగింపఁగలఁడా?

2-65 "యజతాం పాండవః, స్వర్గ మవత్వింద్రః తప త్వినః వయం హనామ ద్విషతః, సర్వః స్వార్థం సమీహతే" అను శ్లోకమున యజతాం, అవతు, తపతు, హనామ అను నాలుగు క్రియాపదములు లోడంతము లగుట మాత్రమే కాదు. యజించుఁగాక, రక్షించుఁగాక—ఇత్యాది విధ్యాద్యర్థమే కాక, ఆయాయి పనుల కుచితకాలము వచ్చినప్పుడు జరుగును అను నర్థ విశేషమునఁ బ్రయుక్తము లైనవి. అంతియ కాని యీపనులన్నియు నేకకాలమున జరుగు నను నర్థము కాదు. ఇదియొక ప్రయోగ చమత్కారము. ఈయర్థ మెట్లు వచ్చుననఁగా 'ప్రై షాతి సర్గప్రాప్త కాలేషు కృత్యాశ్చ' అను సూత్రమున కృత్యప్రత్యయముల కర్థము నిర్ణయించుచుతుది చకారముచే లోడంతరూపమునకుఁ గూడ "ప్రాప్తకాలమున "నను నర్థమందు ప్రయోగము సాధు వని సిద్ధించినది. ఆరహస్యమును మాఘుఁడిందు వెల్లడించెను. ఇట్టిదే యీసర్గమందలి 66 శ్లోకమునఁ గలదు. 'శస్త్రైః సంపత్ ప్రాప్యతాం' అని కర్మార్థక లోడంతముగాఁ బ్రయుక్తము అచటఁగూడ నుచిత మగు కాలము ప్రాప్తించినపుడే శస్త్రములచే సంపద పొందఁబడుగాక అను నర్థము సిద్ధించుచున్నది.

2-70 శ్లోకము రెండవపాదము రెండవ ఖండమున "ఖ లూక్త్వాఖలు వాచికమ్" అని కలదు. ఇందు రెండు చిత్రమగు విషయములు "ఉక్త్వాఖలు" అనఁగా "వచింపరానిది" యని యర్థము. ఇందు రెండు 'ఖలు' అనుపదము లున్నవి. మొదటి 'ఖలు' అనునది ప్రతిషేధార్థకము. "వాచికంఖలు" అనునప్పటి "ఖలు" కేవలమువాక్యాలంకారము. అనఁగా అర్థరహిత మైనది అన్న మాట. ఈరెండర్థములకును "నిషేధవాక్యాలంకార జిజ్ఞాసానునయే ఖలు" అను నమరనిఘంటువు గలదు. "ఉక్త్వా" అనుక్త్వార్థకమునకు వాచ్యం అను నర్థ మె ట్లన్నయెడ "అలం ఖల్వోః ప్రతిషేధయోః ప్రాచాంక్త్వా" అను సూత్రముచే ప్రతిషేధార్థకము లైన "అలంఖలు" అనివానితో యోగ మున్నపుడు ధాతుపునకు క్త్వాప్రత్యయము రావలెను. కావున "వాచ్యం" అను కృదంతమునకు మాఱుగా "ఉక్త్వా" అని క్త్వాంతరూపము వచ్చినదే కాని "వాచ్యం" అనియే ఆర్థము. ఉక్త్వాఖలు=న వాచ్యం నవాచ్యం ఖల్విత్యర్థః ఆద్యః "ఖలు' ప్రతిషేధార్థః, అన్యః వాక్యాలంకారః "నిషేధ" ఇత్యాది నా ఉభయత్రాపి అమరః, "అలం ఖల్వోః - ఇత్యాది సూత్రేణ క్త్వాప్రత్యయః" అను మల్లినాథసూరి వచనముల ననుసరించియే ముందు వివరింపఁబడినది. ఇంకొక శంక, 'ఖ లూక్త్వాఖలు వాచికమ్' అనునది శ్లోకమున నాల్గవపాదము. అట్టియెడ పాదాదిని ఖలు అనునది ప్రయోగింపఁదగునా? "న పాదాదౌ ఖల్వాదయః" అనికావ్యాలంకార సూత్రవృత్తియందు వామనుఁడు పాదాదిని "ఖలు' మున్నగునవి యుండరాదని నిషేధించినాఁడుగాదా! అని—

దానికి మల్లినాథుఁడు "వామనుని నిషేధము ఉద్వేజ కాభిప్రాయమైనచో దుష్టము కాని నఞర్థ "ఖలు శబ్దముద్వేజకము కాదు. కావుప పాదాదిని నఞ్ ప్రయోగమువలె "నాహం జానామి" ఇత్యాదులవలె దూష్యము కాదనెను. అనఁగా కేవల [నిరర్థక] వాక్యాలంకారములగు 'ఖలు' మున్నగునవి పాదాదినుండరాదు. కాని నఞర్థనకారమువలె నిషేధార్థముగల ఖలు శబ్దమువంటి అర్థవంతము లగు నవ్యయములు పాదాదిని బ్రయోగింపవచ్చు" నని సమర్థించెను.

ఇట్టిదే 7-62శ్లోకము రెండవపాదము "ఇవ నితాం నతిమధ్యరంస భాగ్యైః" అని యుండ — 'న పాదాదౌ ఖల్వాదయ' ఇతివామనీయ నిషేధేఽపి ఇవ శబ్దస్య పాదాదౌప్రయోగః "కవే రౌద్దండ్యాత్" అని వాఖ్యయందు నిరాకరింపఁబడినది. మఱియు — 1?-44 లో "స్మాహ చలయతి భువం మరుతి" అని పాదారంభముననే 'స్మ' శబ్దము తోడి ఉక్తార్థము కలదు. అచట అహాస్మ = ఉవాచ, "లటఃస్మే' ఇతి భూతార్థే లట్;" యద్యపి "న పాదాదౌ ఖల్వాదయః ఇతివామనః కవిప్రౌఢ్యాస్మశబ్దస్య పాదాదౌప్రయోగః" అనివ్యాఖ్యయం దాక్షేపింపఁబడెను. కాని (7-22, 15-44) ఈరెండు తావులందలి "ఇవ, స్మ" అను నవ్యయము లర్థవంతములేకాని నిరర్థకములు కావు. అందు ఇవశబ్దము "నవాయధే వైవంసామ్యే" అనుఅమరోక్తిచే సామ్యార్థమున ప్రయుక్తము. స్మ శబ్దము "తు, హి, చ, స్మ, హ, వై, పాదపూరణే" అను నమరోక్తిచే సహజముగా నిరర్థకమే యయ్యును, "అహాస్మ' అను నీతావున అహాస్మ (= ఉవాచ) అనునెడ మాత్రము "లటఃస్మే" అను పాణినీయ సూత్రస్థమగు స్మ శబ్దము వర్తమానార్థముగల 'అహ' అనుదానిని భూతార్థముగ పరిణమింపఁ జేయుటలో నర్థవంత మగు చున్నది. కావున నీరెండు తావులందు వామనీయ నిషేధము తగుల దనిపించుచున్నది.

'న, అపి' మున్నగు నవ్యయము లర్థవంతము లగుటచే "నాహంజానామి, అపి ప్రసన్నేన మహర్షిణా త్వం" ఇత్యాది ప్రయోగములు పాదాది నుండుటచే దుష్టములు కావట్లె మాఘప్రయుక్తములగు "ఇవ, స్మ" యను నీరెండవ్యయములును పాదాదిపైనను అర్థవంతము అగుటవలన సాధువు లగుచుండ మల్లినాథసూరి యేల యాక్షేపించెనో దురూహముగా నున్నది.

నఞర్థ నకారమువలె నిషేధార్థము గలది కావున ఖలు శబ్దము పాదాదిని ప్రయోగింప వచ్చునని వెనుక సమర్థించియు, అర్థవంతములగు "ఇవ, స్మ" అవ్యయముల పాదాది ప్రయోగములను నిరాకరించుటకు ఖల్వాదు లేదేని గణముండి దానియందివి లేవనియాః తెలియకున్నది. 2-74లో "మ్రదీయసీ," 77లో 'స్థేయసీ,' 89లో 'ప్రథీయసీ', 100లో 'క్షోదీయసీ' మున్నగు నవి తద్ధితాంతములు. (ఈయసున్ అనునది తద్ధితప్రత్యయము). "మృదు, పృథు' అనుపదములకు ఈయసున్ ప్రత్యయము రాఁగా 'ర ఋతో హలాదేః' అనుసూత్రముచే ఋకారమునకు రకారాదేశము రాఁగా మ్రదీయసీ' ప్రథీయసీ, అనియైనవి. స్థిర శబ్దమునకు "ఈయసున్" చేరగా — 'ప్రియస్థిర ...' ఇత్యాది సూత్రముచే 'స్థ' అనునది ఆదేశమై స్థ + ఈయస్ = స్థేయస్ - [ఉగిత్వాత్ జీప్ వచ్చి] స్థేయసీ అని యైనది. అట్లే క్షుద్ర + ఈయసున్ అనియుండ స్థూల దూర — ఇత్యాది సూత్రముచే యణాదిపదమునకు (ర అనుదానికన్నమాట)లోపము రాఁగా "క్షుద్" అని యుండ పూర్వమునకు గుణము వచ్చి, క్షోద్ + ఈయస్ = క్షోదీయస్ అని రూపసిద్ధి కల్గెను.

3-25లో :- "సాహాయకమ్, యోపధా ద్గురూ పోత్తమా ద్వుఞ్" అనుసూత్రముచేసాహాయకమ్ సాధువు అని మల్లినాథసూరి సహాయాద్వా అను వార్తికముచే వుఞ్ ప్రత్యయము రాఁగా 'సాహాయకమ్ పక్షే సాహాయ్యమ్' అని యగును అనికౌముది. "ఈవార్తికము భాష్యమునలేదు." అని శేఖరకారుఁడనెనని బాలమనోరమ.

ఇట్లే కృదంతములును:—78.లో దురుదాహరః ఈషద్దుసులలోనిదుస్ పూర్వమందుండుటచే ఉదాహర్యః అనునర్థమునఖల్ప్రత్యయమురాఁగా — ఉదాహరః అనియైనది(దుర్ + ఉదాహరః 2-75 లో 'విశేషవిద్వాన్' విశేషజ్ఞుఁ డను నర్థమున ప్రౌఢప్రయోగము. "తవవిద్వానపి

తావకారణం" రఘు. (8-78)."ఆనందం బ్రహ్మణో విద్వాన్నబిభేతి కుతశ్చనేతి" (ఆనంద వల్లి). అంతేకాని పండితుఁడను నర్థము కాదు. 107 లో మందర క్షుబ్ధ క్షుభిత= మంథాద్రి రూప మంథనదండేన క్షుభితః, సాగరః అని వ్యాఖ్య. క్షుబ్ధము= కవ్వము అను నర్థమున "క్షుబ్ధ ధ్వాంత.. మంథమనః" ఇత్యాది సూత్రముచే నిపతిత రూపము. "క్షుబ్ధాన్యష్టౌ అనిట్కాని నిపాత్యంతే సముదాయేన మంథనాదిషు." అవికౌముది. "మంథాది ష్వేతే రూఢాఃఅవయవార్థాభినివేశో నకర్తవ్యః" అని బాలమనోరమ. వీని కవయవార్థము లేకుండ కవ్వము మున్నగు నర్థములందు నిపాతములు. 3-51 చిక్రంసాః— (మీఁది కుఱుకుట) క్రమేః సన్నంతాత్ అప్రత్యయాది త్యకారప్రత్యయే టాప్. అని వ్యాఖ్య. "క్రము" పాదవిక్షేపే అను ధాతువుపై ఇచ్ఛార్థమున సన్ ప్రత్యయము. అభ్యాసము. ఋత్వము, సన్‌ప్రత్యయ పరకత్వమున అభ్యాసమునకు ఇకారము, క్రమ్+స-క+క్రిమ్+స-చ+క్రిమ్+స-చి+క్రమ్+స-ఆకారాంత మగుటచే స్త్రీత్వవివక్షయందు టాప్-చిక్రంసా-అని రూపసిద్ధి.

ఈరీతిగా నెన్నియనిచెప్పఁగలము? అడు గడుగున నేదియో శబ్దవైచిత్రితప్పక యుండుఁగల దనిన నతిశయోక్తి కానేరదు. తిజంత వైచిత్రి తుదను సూచింపబడును. ఇతరము లగు విశేషములు కొన్నిచూపెదను.

3-65లో "ప్రజా ఇవాంగా దరవింద నాభేః" అని అరవింద నాభస్య అనుటకు మాఱుగా ప్రయుక్తము. పరిశీలింప నిట బహువ్రీహి సమాసాంతమున నాభి శబ్దమునకు అచ్‌ప్రత్యయ ప్రాప్తిలేదు. అయినను "పద్మనాభో మదురిపుః" అని అమరనిఘంటు ప్రభృతులందు అకారాంతముగాఁ గనబడుచున్న దని అ ప్రత్యత్నవపూర్వా త్సామలోమ్నః అని సామలోమ శబ్దములపై విధించినఅప్రత్యయమును(పైసూత్రము విభజించి అచ్‌అను వేఱు సూత్రముగా పఠించి) నాభి శబ్దమునకు సంఘటించి సాధుత్వమును కొందఱను రవ్యాఖ్యాతలు సాంధించిరి. ఈయోగవిభాగముఅనఁగా స్వూతమునేక దేశమును విభజించుట యసామాన్యము. కావున నదియిట న్యాయము కాదని ముకుటుఁడను నొక అమరవ్యాఖ్యాత ఈ మాఘకావ్య శ్లోకము నెత్తిచూపి 'పద్మనాభి' అనియే యుండ నగు నని నిర్ణయించెను. మాఘుని ప్రయోగ మనిన అంతటి ప్రమాణ మన్న మాట.

5-48లో 'కంఠే గుణః' కంఠవలయము ఆభరణ విశేషము అను నర్థమునఁ ప్రయుక్తము. ఇచట కంఠ శబ్ద సప్తమీ విభక్తి సమాసావస్థయందు లోపము లేకుండుట వైచిత్రి. "అమూర్ధమస్తకా త్స్వాంగా దకామే" అనుసూత్రముచే విభక్తికి లుగభావము.

5-64లో "మేదస్వీ" అని ప్రయుక్తము, మేదస్,మనస్,తేజస్ మున్నగు అస్‌అనుభాగము తుదినిగల శబ్దములకును మాయా, మేధా, స్రస్క్ అను శబ్దములకును మతుబర్థమున "విని" ప్రత్యయము వచ్చునని భావము.

6-7లో అనునాయికా= [భావిని] అనునయించుస్త్రీ యని యర్థము. "కుపిత స్త్రీః అను నేష్యంతీ" అని వ్యాఖ్య. "అను' పూర్వక నీఙ్ ధాతువుమీఁద 'తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయాం' ఇతి భవిష్యదర్థే ణ్వుల్‌ప్రత్యయః అని వ్యాఖ్య. ఇట్టి రహస్యము దెలిసి సరసముగా ప్రయోగింప నేర్చినవాఁడు మాఘకవి. 6-9లో రజితములు= ఆకర్షింపఁబడినవి-"రంజే ర్ణౌ మృగరమణే" అను దానిచే ఉపధా నకార లోపము. తవర్ణకము ఇడాగమము వచ్చి (రంజ్-రజ్+ఇ+త) రజిత అనియయ్యెను.

6-47 'సరజ సారణ కేసర చారుభిః' అని సరజన శబ్దము బహువ్రీహిగా విశేషణముగాఁ గనఁబడు చున్నది. దీనిని గూర్చి మల్లినాథసూరి ప్రకరణమున చూడఁదగును.

గ్రంథ మాద్యంతము నిట్టి విచిత్ర ప్రయోగముల కాటప ట్టయి యుండుటచే స్థాలీపులాకముగా కొన్నిమాత్రమే కృత్తద్ధిత సమాసములలో చూపఁగలిగితిని. సంస్కృతకవితకు (తిఙంత) క్రియాపద ప్రయోగము నికషాయమాణ మని యందురు. అందీతఁ డెంత దాఁక సిద్ధహస్తు డయ్యెనో యని చూడ నెంచిన నదిమాత్రము తక్కువగా నున్నదా? కావున అందును కొన్నియే ప్రదర్శింప యత్నింతును.

దుఃఖా కరోతి (2-11). దుఃఖ మనుభవింపఁజేయుచున్నది- దుఃఖ శబ్దముతోడి నామ ధాతువు కృఞ్ధా త్వనుప్రయోగ కాలమున "దుఃఖాత్ప్రాతిలోమ్యే" అనుదానిచే 'డాచ్' ప్రత్యయము రాఁగా అకారము మాత్రము మిగిలి—దుఃఖ + అ + కరోతి = దుఃఖాకరోతి అనియైనది.

"విదాంకుర్వంతు' [2-111] "విదజ్ఞానే" యనుధాతుసంబంధి లోడంత నిపాతరూపము "విదాంకుర్వంత్వి త్యన్యతరస్యామ్" అని కౌముది.

2-115 వైరాయితారః- ఇది ఋకారాంత ప్రథమా బహువచనాంత మగు (సుబంత) రూపము వలె నున్నది. కాని శబ్దవైర... కలహే ఏభ్యః కర్మభ్యః కరోత్యర్థే క్యఙ్ స్యాత్. తతః కర్తరి లుట్ అనెడి వ్యాఖ్యవలన — ద్వేషింపఁగలరు అను భవిష్య దర్థమునఁ బ్రయుక్తమైన క్యఙంత నామధాతువు వలని రూపము.

3-59. అధ్యూషుషః—'అధి' పూర్వకమగు 'వస'ధాతువుపై క్వసుప్రత్యయము చేరగానైన షష్ఠీ విభక్త్యంతమగు సుబంతరూపము. 'భాషాయాం సదవసశ్రువః' అను సూత్రముచే "వస" ధాతువునకు భూతసామాన్యమునందు వికల్పముగా లిట్టును, దానికి క్వసు ప్రత్యయమును రాఁగా - వస్ + క్వస్ అనియుండును. ఈ క్వసుప్రత్యయము లిట్టునకాదేశముకావున, అభ్యాసహలాదిశేషములువచ్చి వస్ + వస్ = క్వసుః- వ + వస్ + క్వసు అనియుండ— క్వసు ప్రత్యయము కిత్తుకావున 'వచి స్వపి యజాదీనాంకితి' అను సూత్రముచే వసధాతువునకు సంప్రసారణ పూర్వరూపములు రాఁగా- ఉ + ఉస్ = ఊస్ అనియగును. తరువాత —"శాసి వసి ఘసీనాం చ' అనుదానిచే షత్వము రాఁగా ఊష్ + వస్ అని యుండును. "వసోస్సంప్రసారణమ్"అను సూత్రముచే క్వసుప్రత్యయ సంబంధి వకారమునకుఁ గూడ సంప్రసారణము వచ్చి, ఊష్ + ఉస్ = ఊషుస్ అని యగును—తుదిసకారమునకు షత్వము- (ఊషుష్) షష్ఠీ ప్రత్యయమగు "ఙస్" పరముకాఁగా — ఊషుష్ + అస్ "ఊషుషః —అధి + ఊషుషః = అధ్యూషుషః- అను రూపము సిద్ధించును, ఇంత ప్రక్రియావిశేషము గలదు. కావుననే కౌముదీ కారుఁడు, "అధ్యూషుషోయామభవజ్జనస్య" ఇతిమాఘః అనియీశ్లోకభాగమునే యుదాహరించెను. మఱియు నిందొక కారకవైచిత్రి కలదు. 'ఊషుషః' అనుపదము వస ధాతుజన్యమే కాన్యయస్యాం = ఏద్వారకయందు, అధ్యూషుషః = వసించుచున్న, జనస్య = జనులకుఅనునర్థమున -యస్యాం అగు సప్తమికి మాఱుగా'ఉపాన్వధ్యాఙ్వసః' అనుసూత్రముచే ఉప, అను, అధి, ఆఙ్

అను నుపసర్గములు పూర్వమునఁ గల వసధాతువుయొక్క యాధారము కర్మకారకముగా మాఱును. కాన ఇచట వసధాతువునకు 'అధి'పూర్వమున నుండుటచే వసించుట కాధారమైన ద్వారక కర్మత్వము నొందుటచే ద్వారక యనెడి యర్థము చెప్పు యచ్ఛబ్దమునకు సప్తమి రాక "కర్మణి ద్వితీయా" అను సూత్రముచే "యాం" అని ద్వితీయా విభక్తి వచ్చినది. ఇట్టిదే ఆఙ్పూర్వకవసధాతువు — "ఆమావసద్దశరథః" అని చంపూరామాయణమునఁ గలదు.

9-11 లో. "న్యమిమీలయత్" అని కలదు. నిపూర్వకమగు మీలధాతువు యొక్క ణిజంత రూపము. అ + మీల + మీల + (ఇ + అ =) య + త్ —అని యుండ "ణౌ చఙ్యుపధాయా హ్రస్వః" అను సూత్రముచే "అ + మీ + మిల + యత్" అని ఉపధాహ్రస్వము నిత్యముగా ప్రాప్తింపఁగా "భ్రాజభాస, భాషదీప జీవమీల, పీడామన్యతరస్యాం" అను సూత్రముచే ఉపధాహ్రస్వము వికల్పముగా వచ్చుటచే న్యమీమిలయత్ న్యమిమీలయత్ అని రెండు రూపములు సిద్ధించును. అందు హ్రస్వపక్షమున లఘుపరకమగును. కాన సన్వద్భావము కలిగి అభ్యాసదీర్ఘము రాఁగా – "అమీమిలయత్" అగును. ఉత్తరఖండమున హ్రస్వము, పూర్వఖండమున దీర్ఘము. హ్రస్వము రానిపక్షమున లఘుపరకత్వమును, సన్వద్భావమును లేకపోవుటచేత అభ్యాసదీర్ఘము వచ్చి అమిమీలయత్ అగును. ఉత్తరఖండమున దీర్ఘమును, పూర్వఖండమున హ్రస్వమును వచ్చినవి.

9-2లో అమిమీత, 9-10 లో నిరకాసయత్ 9-25 నమస్కయత, 9-34 ఉదశిశ్వయత్, (= ఉచ్ఛ్వాసయతిస్మ) యనియర్థము. 10-52 అధాసీత్, 10-53 పర్యకూజి (భావేలుఙిరూపమ్) 10 - 62 శిశింజే—(భావేలిట్) 11-11 రిరంసయిషతి (రసయితుమిచ్ఛతి = ఆస్వాదింపఁగోరుచున్నాఁడు), 11-39 జగద-"గదవ్యక్తాయాంవాచి" అను ధాతువుపై లిట్టునందు -ఉత్తమపురుషైకవచనమున "ణలుత్తమోవా" అను సూత్రముచే వికల్పముగా ణిత్వము లేకపోవుటచే వృద్ధిరాక 'జగద' యను రూపము గూడ పొందును. (జగాద, జగద).

'బహు జగద పురస్తాత్తస్యమత్తాకిలాహం' అను నీమాఘశ్లోక పాదమునే కౌముదీకారుఁ డుదాహరించెను. ఇట్లే 'చకార' యనుకృఞ్ధాతు లిడంతోత్తమ పురుషైకవచనరూపము - వికల్పముగా 'జగద' వలెనే వృద్ధిరాని పక్షపు రూపము 'చకర అని. "చకర చకిల చాటు ప్రౌఢయోషిద్వ దస్య" అనియు నిందే ప్రయుక్తము. 'హినస్తి' (11-56), భినత్తి (11-58), అన్వయాసిషుః (12-3) "ఆరోహయతే" (12-5) ఆఙ్పూర్వకమగు రుహ ధాతువు లడంత, రూపము"రుహ బీజజన్మని ప్రాదుర్భావేచ"అనివరస్మైపదముగాపఠిత మగునీధాతువునకాత్మనేపదత్వము కలుగుటలో క్రియాఫలము కర్తృగామి యెట్లయ్యెనో మల్లినాథసూరి సర్వంకషయందును, ఘంటాపథమందును విపులముగాచర్చించి నాఁడు. సిద్ధాంత కౌముదియందునుఇట్టిప్రయోగము స్వీకరింపఁబడి "ణే రణౌయత్కర్మ...." ఇత్యాది సూత్రవివరణమునను వ్యాఖ్యలందును "ఆరోహయతే హస్తీ" అని "కరేణు రారోహ యతే నిషా దినం" అను నీశ్లోకపాదమునకు పరిపడునది గ్రహించి విపులముగా చర్చింపఁబడినది. 'చచాయిరే' (12-51) = దదృశుః [చూచిరి] అనివ్యాఖ్య. 'చాయృ' ధాతువునకు పూజానిశామనములు అర్థములుగాఁ జెప్పబడెను.

నిశామనము అన దర్శన మనుటకు "నిరీక్షణ నిశామనే" ఇతి దర్శన పర్యాయేషు భట్టమల్లిః అనియు వ్యాఖ్య. "శ్మశ్రూయమాణః" (12-54). శ్మశ్రు శబ్దముకంటె — "కర్తుః క్యజ్ సలోపశ్చ" ఉపమానా త్కర్తుః సుబంతా దాచారే క్యజ్ వా స్యాత్ సాంతస్య తు కర్తృవాచకస్య లోపో వా స్యాత్. [కజో, జిత్వా దాత్మనేప దమ్] అనుమాత్రము చేత "శ్మశ్రు + య + మ్ + అన—" అని యుండ— "అకృ త్సార్వధాతుకయోః" అను సూత్రము చే— దీర్ఘము వచ్చి 'శ్మశ్రూయమాణము" అని రూపసిద్ధి.

ఈరీతిగా ననాధారణ తిఙంత (క్రియాపద) రూపములను ప్రయోగించుటలో మాఘుని నేర్పు నిరుపమముగదా। 17-31 "బబృంహిరే గజపతయో మహానకాః, ప్రదధ్వను ర్జయతురగా జిహేషిరే" అను శ్లోకమున "బబృంహుః"అని పరస్మైపదము నాత్మనేపదముగా "బబృంహిరే" అని ప్రయోగించుటచింత్యము. అని-అతఏవభట్టమల్లః"క్రేషతే హేషతే౽శ్వానాం, హస్తినాం బృంహతీతిచ" ఇతి అని మల్లినాథసూరి వ్యాఖ్యయందాక్షేపించినాఁడు. పాణినీయ ధాతుపాఠమున "బృహి" ధాతువు పరస్మైపదముగానే యున్నది. మహా వైయాకరణుఁడగు మాఘుఁడు తెలియకయేయిట్లుప్రయోగించెనా?యనిసందేహము. మల్లినాథసూరి సర్వజ్ఞుఁడుగదా! అమరకోశము నాట్యవర్గమున నధికపాఠముగా కొన్నిప్రతులలో "పుష్పసాధారణేకాలేపికః కూజతిపంచమం ద్వైవతంహేషతే వాజీ నిషాదం బృంహతేగజః" అనునెడ"బృంహతే" అనిఆత్మనేపదముగా నున్న సంగతి యెఱుఁగని వాఁడా? ఈ ప్రయోగమును చింత్యమే యగునా? స్థూలదృష్టితో సూరి యట్లనినను, ఎచటనేని ఆత్మనేపద మనుట కాధారము లేకపోవదేమో అనిపించుచున్నది.

మఱియు (17-21) లో ఇట్లే వ్యత్యస్తముగా "అదంశయన్" అని కనఁబడఁగా దంశి ధాతువు ఆత్మనేపదము. అది పరస్మైపదముగానిట ప్రయుక్తమైనది. అని సంవర్మయతి పంనహ్యత్యాత్మనేపక్షీత్యమీ సందంశతే దంశయతే సంనాహే పదపంచకమ్ అను భట్టమల్లసూక్తిని జూపి—"కేచిత్తు చురాది షూభయపదిషు పఠంతి" అని సమాహిత మొనర్చిన మల్లినాథసూరి ధాతుపాఠము అసంపూర్ణము కావుననేదో యొకగణమున "బృహి" ధాతువు కూడ నుభయపదిగా పఠితమై యుంఁడునని దీనికిని సాధుత్వమేల చెప్పలేదో దురూహముగా నున్నది.

మాఘుఁడు శబ్దసంస్కారమునెడ మాత్రమేకాదు. అర్థానుగుణ శబ్దసృష్టియందును మిఁగుల స్వతంత్రుఁ డనిపించును. మగఁడు, భర్త— అనునర్థమున 10-42 లో వివోఢ 10-68 లో "అభిరుచితుఁడు" 8-68 లో "అభిమతుఁడు" 7-17 లో 'అనుపముఁడు' 9-73 లో 'పరిణాయకుఁడు' (పరిణేత) 10-45 లో'ఉపయంత' 10-59 లో 'ఇష్టతముఁడు' 11-65 లో 'పాణిగ్రాహకుఁడు' 11-57 లో 'రతిబంధువు' 10-28 లో 'చిత్తనాథుఁడు' అనియు— అగ్నియను నర్థమున ప్రసిద్ధమగు సప్తార్చిశ్శబ్దమే కాక, 20-53 లో 'సప్తరుచి' 20-59 లో 'అయుగ్మార్చి' అనియు మన్మథుఁడు అనునర్థమున 'మనసిశయుఁడు' అనియు, స్తనము అను నర్థమున 8-59 లో'ఉరసిరుహము' అనియు 10-56 లోఉరసిజముఅనియు తలవెంట్రుకలు అనునర్థమున 8-60 లో "శిరసిజములు" 7-62 లో 'శిరోజాతములు' అనియు— 'తుమ్మెద' అనునర్థమున 6-7 లో 'మధుకృత్తు' అనియు— భవిష్యత్తునందు ఓదార్పఁగల స్త్రీ యను నర్థమున 6-7 లో అనునాయికా అనియు, స్త్రీ అనునర్థమున 10-42లో 'నతభ్రువు' అనియు, ఎడఁబాయుచున్న స్త్రీ అనునర్థమున 6-62 లో 'వియువతి' అనియు— చక్రవాకము అనునర్థమున 9-15 లో

'హరిహేతిహూతి' యనియు- గుజ్జము అనునర్థమున 12-14 లో 'ముద్గభుక్కు' అనియు, నక్క అనునర్థమున 18-75 లో 'దీప్తజిహ్వ' అనియు, సారథికి 12-18 లో 'ప్రజేత' యనియు, కృష్ణపర్యాయములుగా 13-13 లో వసుదేవజన్మ 13-37 లో ప్రియరథాంగుఁడు 7-28 లో రథచరణధరుఁడు అనియు- 'ఇల్లు' నకు- 13-62 లో "అయనము" అనియు- సరస్సుకు 8-20 లో అంభోధి యనియు, ఉపదంశమునకు 10-10 లో 'విదంశము' అనియు-చంద్రకాంత ప్రతిమకు 9-35 లో 'ఇందు మణిదారువధువు' అనియు, అవయవార్థమును బట్టి, శాస్త్ర సమ్మతముగా కవి సృష్టించిన ట్లగపడును. ఇట్టి యపూర్వ పదముల కేవో నిఘంటువులో కవి ప్రయోగములో ఆధారములుగా నుండక మానవు.

అంతేకాని ఆలంకారికులు చెప్పిన అప్రయుక్త నేయార్థ దోషములలో నొకటి కావచ్చునని యల్పజ్ఞులమగు నస్మదాదుల బుద్ధికిఁ దోఁచినను ప్రకటించుట సాహసమే యగును. సంస్కృత సారస్వత మనంతము గదా! ఇట్టివి దుష్టములే యగునేని మల్లినాథ సూరి యెత్తి చూపక విడుచునా ?

మాఘుని యర్థగాంభీర్యాది విషయమున దృష్టి మరలింతము. "ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవమ్, దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయో గుణాః" అను చాటూక్తిచే ఉపమాలంకారాధిక్యము, అర్థగౌరవము, పదలాలిత్యము కలవని సుప్రసిద్ధము. కావుననే వసుచరిత్రమున "నిఖిల గుణంబులు నేర్పె నెవ్వఁడు" అని కవితాకన్య జనకులలో మాఘుని రామరాజభూషణుఁడు భూషించినాఁడు పాదపూరణార్థ మంగీకృతములైన "తు, హి, చ, స్మ, హ, వై" యను నవ్యయములు కూడ నిందు అర్థవంతములే కాని నిరర్థకములుగా లేవనినట్లే సూచింపఁబడి యున్నవి.

ఓజః ప్రసాద మాధుర్యాది గుణపూర్ణమై, ధ్వన్యలంకార, రసభావాములతో నిబిడమైన మాఘ మహాకవి కవితను సర్వజ్ఞుఁడగు మల్లినాథసూరి యంతవాఁడు జోహారులుచేయ నితరులు విమర్శింపఁ గలరా? సకల లక్షణ సంపన్న మనినఁ జాలును. ఈ విషయమున రసజ్ఞులగు సహృదయులే ప్రమాణము.

అలంకార విషయమున కాళిదాసున కుపమాప్రీతివలె మహాకవి మాఘున కర్థాంతరన్యాస ప్రీతి యెక్కువ యన్నట్లగపడును. కాని యాతని కవిత్వమున నన్నియలంకారములను గనఁబడును. ప్రథమ సర్గమున 19 విధములగు నలంకారములు గలవు. అందు ఉపమలు 9. అతిశయోక్తులు 7. అర్థాంతరన్యాసములు 6. తరువాత ఉత్ప్రేక్ష, కావ్యలింగము లెక్కలోనికి వచ్చును. శ్లేష, వ్యతిరేకాపహ్నవ, రూపక, విషమ, సమాసోక్తి, నిదర్శనాధిక, విభావనా, విరోధాభావ, విరోధ, పరివృత్తి, సముచ్చయాదులు క్రమముగా విరళములనవచ్చును. లోకజ్ఞతలో సాటిలేనివాఁడు మాఘుఁడని యర్థాంతరన్యాసాధిక్యము వెల్లడించును. అర్థాంతరన్యాసాధికత వేతే చెప్పఁబడును.

ఇందలి రసవిశేషములు ఆంధ్రీకరణ ప్రకరణమున స్పృశింపఁబడును. ఆంధ్రీకరణమున మాఘుని హృదయమును విప్పి చెప్పి యీ యాంధ్రీకర్తకే కాక యావత్ప్రపంచమునకును శాశ్వత మహోపకర్త యగు మల్లినాథ సూరిని స్మరించుటయు ముఖ్యమే కదా!

## మల్లినాథ సూరి

మహాకవి కాళిదాసు రచించిన రఘువంశ కుమారసంభవ మేఘసందేశము లనెడి

కావ్యత్రియమునకు "సంజీవని" యను వ్యాఖ్యానమును, భారవికృత మగు కిరాతార్జునీయమునకు 'ఘంటాపథము' అను వ్యాఖ్యానమును మాఘకవి కృతమగు శిశుపాలవధమునకు "సర్వంకష" యను వ్యాఖ్యానమును 'శ్రీహర్ష' కృతమగు నైషధీయచరితమునకు "జీవాతు" వను వ్యాఖ్యానమును క్రమవృద్ధి గలుగ రచియించి, పాఠక్రమమును సోపానపంక్తి వలెఁ దీర్చి దిద్దిన మహామనీషి మల్లినాథ మహామహోపాధ్యాయుఁడు. సంస్కృతభాష నభ్యసించెడి విద్యార్థులకు పఠనపాఠనములం దాక్రమమే నాఁటినుండి చిరకాలముగా నిలిచిపోయినది. అంతియ కాని కవులను బట్టి కాని కావ్యములను బట్టి కాని యాక్రమము రాలేదు.

మల్లినాథ సూరి వేద వేదాంగములే కాదు. శాస్త్రములే కాదు, కళలే కాదు, విద్యలే కాదు, సర్వమును నేర్చిన మహావిద్వాంసుఁడు అని యాయన వ్యాఖ్యలవలన విశదమగును. ముందుగా తన యర్హతను దెలుపుటకై వ్యాఖ్యానముఖమున—

"వాణీం కాణభుజీ మజీగణ, దవాశాసీ చ్చ వైయాసకీ
మంత స్తంత్ర మరంస్త; పన్నగగవీ గుంఫేషు చాజాగరిత్
వాచా మాచకల ద్రహస్య మఖిలం య శ్చాక్షపాదస్ఫురాం
లోకే భూ ద్యదుపజ్ఞమేవ విదుషాం సౌజన్యజన్యం యశః."

అనెను. కాణాద గౌతమ తర్కశాస్త్రములను, వేదాంతశాస్త్ర వజ్రకవచము లగు వ్యాసకృత బ్రహ్మసూత్రములను, పాతంజలాంతమగు పాణినీయమును క్షుణ్ణముగాఁ జదివి శిష్యసంఘమునకు బోధించి సార్థక మహామహోపాధ్యాయ బిరుదాంకితుఁ డైన సూరి మల్లినాథుఁ డని స్పష్టమగుచున్నది—

కాళిదాసత్రయ వ్యాఖ్యారంభములందు—

"మల్లినాథకవి స్సోఽయం మందాత్మానుజిఘృక్షయా
వ్యాచష్టే కాళిదాసస్య కావ్యత్రయ మనామయమ్."

మందబుద్ధుల ననుగ్రహింపఁ గోరి సర్వశాస్త్రజ్ఞుఁ డైన మల్లినాథసూరి కాళిదాసకృత కావ్యత్రయము నిరాకుల మగునట్లు వ్యాఖ్యానించుచున్నాఁడు. అనెను. అకావ్యముల కేమి యాకులత గలిగె నందురేమో యని—

"భారతీకాళిదాసస్య కువ్యాఖ్యా విషమూర్ఛితా
ఏషా సంజీవినీ వ్యాఖ్యా తా మద్యోజ్జీవయిష్యతి"

కాళిదాసునివాణి ఇంతకు మున్ను పెక్కురు చేసిన దుర్వ్యాఖ్య లనెడి విషముచే మూర్ఛితయై పడియున్నది యని చెప్పి- నా యీసంజీవిని యనెడి వ్యాఖ్య యావాణిని నుజ్జీవింపఁజేయును" అని అన్నట్లే చేసి చూపినాఁడు. ఇట్లు చెప్పుట యహంకార మనుకొందు రేమో యని—

"కాళిదాసగిరాం సారం కాళిదాసః సరస్వతీ,
చతుర్ముఖోఽథవా సాక్షా ద్వేత్తి నాన్యే తు మాదృశః"

కాళిదాసుని వాక్కులలోని సారమును కాళిదాసు, సరస్వతి, బ్రహ్మ యను ముగ్వురే సాక్షాత్తుగా తెలిసినవా రనిన మావంటి యితరులు తెలియని వారే యని వేఱ చెప్ప వలయునా? అని సవినయముగా కాళిదాసుని మహత్త్వ ముగ్గడించి యాతని కావ్యముల కుజ్జీవకమగు వ్యాఖ్యలను రచించెను.

పిదప బృహత్త్రయి యనఁబడు కిరాతార్జునీయ, శిశుపాలవధ, నైషధములకు వరుసగా ఘంటాపథము, సర్వంకష, జీవాతువు అను వ్యాఖ్యలను రచించి కృతార్థుఁ డైనాఁడు.

అందు నారికేళపాకమున వెలసిన భారవికృత కిరాతార్జునీయమును వ్యాఖ్యానింపఁ బూని

"నారికేళఫల సంమితం వచో, భారవే స్సపది త ద్విభజ్యతే
స్వాదయంతు రసగర్భనిర్భరం, సార మస్య రసికా యథేప్సితం" --అనెను.

భారవి పలుకులు నారికేళఫల సమానములు. కావున వానిని నేను పగులఁ గొట్టు చున్నాను. రసములతో నిండియున్న యావాక్కులలోని సారమును రసికు లాస్వాదింతురుగాక అని భారవి గొప్పదనమును జెప్పె.

నానానిబంధ విషమైక పదై ర్నితాంతం, సాళంక చంక్రమణ ఖిన్నధియాం మశంకం
క ర్తుం ప్రవేశ మిహ భారవి కావ్యబంధే ఘంటా పథం కమపి నూతన మాతనిష్యే॥

అనేకములగు వ్యాఖ్యలయందలి యెగుడు దిగుడు పదముల సంచారమువలన మిగుల ఖేద మంది'యున్న బుద్ధులు గలవారికి భారవి కవితయందు నిస్సంశయముగా బుద్ధిప్రసారము కలుగునట్లు రాచబాట యనఁ దగిన ఘంటాపథమును క్రొత్తగా రచించుచున్నాను। అని తన ప్రతిజ్ఞాప్రకారము సర్వమును అనఁగా మూలమందలి చిన్న పెద్ద పదములలో నేయొకటియు విడువక, మూలములో లేని యెట్టి పదమును స్వీకరింపక శాఖాచంక్రమముగా నిరపేక్షము లగు విషయములను దడవక యన్వయ ముఖమున వ్యాఖ్యానించెను.

ప్రకృష్ట మగు సర్వంకషను గూర్చి తరువాతఁ దెలిపెదను. ఆలవది యగు శ్రీహర్షుని నైషధమునకు వ్యాఖ్య చేయఁబూను నాఁటికి యామహనీయుఁడు మిగుల వృద్ధయినాఁ డనియు, వ్రాలిపోయిన కనుబొమ్మలను దారములచే మీఁదికి నెగఁ గట్టికొని, తాటాకుల ప్రతులను తడవి తడవి చదువుకొనుచు శిష్యులచేఁ జదివించుకొనుచు వ్యాఖ్యానించి వాఁ డనియు పండితలోకమున నొకవదంతి గలదు.

అది నిజ మగునో కాదో కాని సర్వంకష యంత జీవాతువు విపులీకరింపఁ బడలేదు కాని యాయన వేసిన సోపానమార్గముల వరుసగా నెక్కి వచ్చినవానికి నాజీవాతు సాహాయ్య మాత్రమున నైషధము సుసాధము కాకపోవ దని యామహనీయుని తలంపై యుండు నని కొందఱతలంపు.

తక్కినకావ్యములకు మల్లినాథునినాఁటి కెట్టి దుర్గతి పట్టినదో నైషధమునకును నట్టి దుర్గతియే పట్టియున్న దని సమంజస మగువ్యాఖ్య యిప్పుడు తాను రచించి శ్రీహర్షవాణిని బ్రకాశింపఁజేసెద, ననినట్లు.

"శ్రీమల్లినాథ విదుషా విదుషాం మతేన, తే నైవ నైషధ కథామృత కావ్యబంధః,
వ్యాఖ్యాస్యతే౽ద్య రస భావ గుణార్థ దోష సధ్వ న్యలంకృతి రహస్యవిదాం ముదే౽స్తు"

"క్షుద్రవ్యాఖ్యా విషార్తానాం శ్రీహర్ష కవిరాడ్గిరామ్.
ఉజ్జీవనాయ జీవాతు ర్టీయా దేష మయా కృతః"

అనఁగా రస భావ గు ణార్థ దోష ధ్వ న్యలంకారముల రహస్యముల నెఱిఁగిన వారి సంతసమునకై నైషధకథారూప మగు నమృతకావ్యము మల్లినాథపండితుఁ డిపుడు వ్యాఖ్యా నించు చున్నవాఁడు.

ఇంతకు మున్ను నీచములైన వ్యాఖ్య లనెడి విషముచే పీడితమగుచున్న శ్రీహర్ష కవిరాజరాజు వాక్కులను మరల సుజ్జీవింపఁజేయుటకై జీవాతు వనెడి యీవ్యాఖ్య చేయు చున్నాను. అని 'జీవాతుర్జీవనౌషధమ్।' అను జీవాతుశబ్ద మర్థవంత మొనర్చెను.

పాఠప్రవచనముల మిగుల వ్యాప్తి గల మీఁది యాఱుకావ్యములకు నద్దములవంటి వ్యాఖ్యలు రచించి సంస్కృత సారస్వతామృత పిపాసువులకు శాశ్వత మహోపకార మొనర్చిన మల్లినాథసూరి కేవలము భారతీయులకే కాక ఖండఖండాంతరస్థులగు ప్రాజ్ఞలోకమునకును ప్రణమ్యుఁ డైనవాఁడు. అట్టివాఁడు అంతవాఁగు మనఆంధ్రుఁ డగుట మన భాగ్యము గాదా?

"మాఘకావ్యమున కెనిమిది టీకలు గలవు. అందు మల్లినాథకృత సర్వంకష కాశ్మీరమునఁ దక్క యావద్భారతమున ప్రచారము గలది. తక్కిన టీకలవలెఁ గాక సర్వాంగ పరిపూర్ణ మయినది." అని శిశుపాల వధకా వ్యోపోద్ఘాతమునఁ గలదు. సంజీవినీ ఘంటాపథ వ్యాఖ్యలందు వలెనే గణేశ, శారదా ప్రార్థనానంతరము, తనపాండిత్యమును దెలుపు శ్లోకమును, అన్వ్యానాతిరిక్తముగా మూలానుసార మన్వయక్రమమున వ్యాఖ్యానింతు నను ప్రతిజ్ఞావాక్యమును చెప్పి మాఘకావ్యప్రశస్తి ధ్వనించునట్లు.—

> "యే శబ్దార్థ పరీక్షణ ప్రణయినో యే వా గుణాలంక్రియా
> శిక్షాకౌతుకినో విహర్తుమనసో యే చ ధ్వనే రధ్వని
> క్షుభ్య ద్భావతరంగితే రససుధాపూరే మిమంక్షంతి యే
> తేషా మేవ కృతే కరోమి వివృతిం మాఘస్య సర్వంకషామ్" అనెను.

శబ్దార్థముల పరిపూర్ణ వివరణమును, నోజః ప్రసాద మాధు ర్యాది గుణముల విశేషమును, అలంకార వైశిష్ట్యమును కావ్యమునకు ప్రాణభూత మగు ధ్వనివైవిధ్యమును, భావతరంగములతో నిబిడ మైన రసమను నమృతప్రవాహ స్వరూపమును సర్వంకషముగా నిందుఁ దెలుపఁబడు నని ప్రతిజ్ఞ చేసి యట్లే సాంతముగ వ్యాఖ్యానించెను.

మఱియు మాఘుని ధన్యతను తనధన్యతను గూర్చి యిట్లనెను:

> "నే తాస్మిన్ యదునందనః స భగవాన్ వీరః ప్రధానో రసః
> శృంగారాదిభి రంగవాన్ విజయతే పూర్ణా పున ర్వర్ణనా
> ఇంద్రప్రస్థగమా ద్యుపాయ విషయ శ్చైద్యావసాదః ఫలం
> ధన్యో మాఘకవి ర్వయం సుకృతిన స్తత్సూక్తి సంసేవనాత్"

ఈకావ్యమందు నాయకుఁడు కృష్ణభగవానుఁడు. శృంగారా ద్యంగరసములతోడి వీరరసము ప్రధానరసము. ఇందలి ప్రతివర్ణనము పరిపూర్ణము. ప్రధానవిషయము ఇంద్ర ప్రస్థ ప్రయాణాదికము. ఫలము శిశుపాలుని వధించుట. ఈవిధముగాఁ జతుర్విధ పురుషార్థ సాధక మయ్యు, బహిరంగముగా సామాన్య కావ్యమువలె రచింప నేర్చిన మాఘకవి ధన్యుఁడు. ఆతనిసూక్తులను సేవించు భాగ్యము కలుగుటచేత మేము ధన్యులము [''వయంతు, కృతినః" అను పాఠమున కృతికుశలఇత్యపి అనుటవలన మాఘుఁడు ధన్యుఁడు మేము నేర్పరులము అని యసంగతార్థ మగుటచే — "వయం సుకృతినః" అని పాఠమైయుండనోపు నని ఆపాఠము స్వీకరింపఁబడినది. ''సుకృతీ పుణ్యవాన్ ధన్యః'' అని— అమరకోశము.]

ఈసర్వంకష ఆయన వ్యాఖ్యానరూప తపస్సునకు ఫలశ్రుతి. వ్యాఖ్యానించునపుడు

గ్రంథకారుని పక్షమునే సమర్థింప విశ్వయత్నము చేయును. కాని యేయుపాయమునకును లోఁగని ప్రమాద మేరవంత కనఁబడినను మల్లినాథసూరి బహిర్గత మొనర్ప వెనుదీయని దోషజ్ఞుఁడు కాని దోషైకదృక్కు మాత్రము కాఁడు.

"వసన్ దదర్శ'' పురీమవస్కందా" "ఖలూ క్త్వా ఖలు వాచకమ్." మున్నగు స్థలములందు గ్రంథకర్తను సంపూర్ణముగా సమర్థించినాఁడు. ఇంకను ''సరజసమ్" అనుపదసమర్థనమును అట్టిదే. 'స' పూర్వరజః శబ్దముతోడి సమాసము టజంతముగా నిపాతము. అవ్యయీభావమే కాని బహువ్రీహికా సేర దని "న సరజస మి త్యనవ్యయీభావే'' అని వామనుఁడు కంఠతః నిషేధించి చెప్పినను, అచతు రేత్యాది సూత్రమున అవ్యయీభావమే యగు నని సిద్ధాంతకౌముదియం దున్నను "సరజ సారుణ కేసర చారుభిః'' (6-47.) అను చెడను, ''సరజసమకరంద నిర్భరాసు" (7-42) అను తావునను బహువ్రీహ్యర్థమునఁ గనరాఁగా ''ఇది సాకల్యార్థమున అవ్యయీభావసమాసము. అచతు రేత్యాది సూత్రముచే నిపతింపఁబడినది. అకారణమున సరజస్క మని బహువ్రీహ్యర్థము లక్ష్యము. ఈయర్థమున మహాకవి ప్రయోగ బాహుళ్యము కలదు. కాన ముఖ్యార్థముగానైనను స్వీకరింపవచ్చును. అవ్యయీభావము మహాకవిప్రయోగములందు ప్రాయికముగా గనఁబడుచున్నది. అనుపక్ష మాశ్రయించి క్వాచిత్కమగు బహువ్రీహ్యర్థమును సాధువే యగుచున్నది. అని సమర్థించెను.

సహ రజసా సరజసం, అచతురేత్యాదినా సాకల్యార్థే అవ్యయీభావే సమాసాంతో నిపాతితః,బహువ్రీహ్యర్థే లక్షణయాతు సరజస్క ఇత్యర్థః అతఏవ 'నసరజస మి త్యనవ్యయీభావే' ఇతి వామనః అథవా మహాకవిప్రయోగ ప్రాచుర్యదర్శనా దవ్యయీభావదర్శనం ప్రాయిక మితి పక్షాశ్రయణాత్ బహువ్రీహ్యర్థేపి సాధురేవ। అనివ్యాఖ్య.

ఈరీతిగా ఇచట సమర్థించియు-

"కస్తూరికామృగ విమర్ద సుగంధి రేతి.........వాయుః'' 4-61.

కస్తూరికా మృగాణాం విమర్దేన సంఘర్షణేన సుగంధిః శోభన గంధః (వాయుః) యద్యపి గంధస్యేత్త్వే తదేకాంతగ్రహణం కర్తవ్య మిత్యుక్తం, తథాపి నిరంకుశాః కవయః, ఇ త్యపర్యనుయోగః, అని వ్యాఖ్యానించెను. అనఁగా గంధస్యేదుత్పూతి సు సుర భిభ్యఃఅను సూత్రముచే సుశబ్దమునకు పరమం దున్న గంధశబ్దము నకు ఇత్వముచేయ 'సుగంధి' యగును. కాని అగంధము ఏకాంతము-నైసర్గికమయిననే ఇత్వము చేయవలె ననువార్తికముచే ఈసుగంధము ఏకదేశమందువలెనే అపిభక్తమై వాయువునందు కనఁబడుట లేదు. అయినను కవి యిట్లునిరంకుశముగా ప్రయోగించెనని మల్లినాథుఁ డీప్రయోగమును నిరసించెను.

ఇచటనే కాదు. రఘువంశము 4 సర్గము 45 శ్లోక మందలి ''గజదాన సుగంధినా" అనుదాని వ్యాఖ్యయందు గజానాం, దానేన మదేన, సుగంధినా సురభిగంధినా,—గంధస్యే త్యాదినా ఇకారాదేశః సమాసాంతః- యద్యపి గంధస్యేత్వే త దేకాంతగ్రహణం కర్తవ్యం ఇతినైసర్గిక గంధవివక్షాయా మేవ ఇకారాదేశః, తథాపి నిరంకుశాః కవయః, తథా చ మాఘకావ్యే "వపు రయుక్చద గుచ్ఛసుగంధయః స్వతతగా స్తతగానగిరోశిభిః" "ఇతి. నైషధేచ, అపాం హిత్వప్తాయ నవారిధారా స్వాదు స్సుగంధిః స్వదతే తుషారా ఇతి"నకర్మధార యాన్మత్వర్థీయ ఇతి నిషేధాత్ ఇని ప్రత్యయాంతోపి జఘన్య ఏవ"అని అప్రయోగమునేకాదు

మాఘమందలి మఱొక ప్రయోగమును నైషధప్రయోగమును గూడ నిరసించెను.

6_20 లో నిభృతాక్షరం— లక్షణయా స్థిరనాదం యథాతథేత్యర్థః అథవా సర్వః శబ్దో వర్ణాత్మక ఏవ.వ్యంజక విశేషాభావా దస్ఫుట ఇతి మత మాశ్రిత్య సర్వపఠీవాః కవయ ఇతి'

అనఁగా:- నిభృత = స్థిరమైన, అక్షరం = లక్షణచే ధ్వని గలది యని యర్థము చెప్పవలెను. తుమ్మెదల కక్షరోచ్చారణము లేదు కాన. లేదా, సకలశబ్దములు వర్ణాత్మకములే. వ్యంజక విశేషము అనఁగా ఆయక్షరములను స్పష్టపఱచు సాధనము లేదు కాన అస్ఫుటోచ్చారణము లేకపోవదు- అను మతమూఁది చెప్పవలెను. కవులు సర్వ పఠీనులు గదా! అనెను.

6. స. 43 శ్లో. నాల్గవపాదము అతిక్లిష్టము, అతిసూక్ష్మము నగు నర్థము గలది. "నమహతా మహతాః క్వచ నారయః" అని. న, మహతాం, అహతాః, క్వ, చ, నః అరయః అవి పద విభాగము. "మహతాం అరయః = గొప్పవారి శత్రువులు, క్వచ = ఎక్కడనుగూడ, అహతాః = కొట్టఁబడనివారు, నఇతిన = కానివారన్నమాటలేదు అనఁగా- సర్వత్ర కొట్టఁబడిన వారు తప్పక యగుదురు అనిభావము. క్లిష్టతమమగు నీభావమును సుగమ మగునట్లు మల్లినాథసూరి '' అత్ర ద్వితీయ నిషేధ ప్రాపితస్య హననస్య తృతీయే న నిషేధః, పునః క్వ ఇతి క్వశబ్దసామర్థ్యాత్ ప్రకృతార్థ పర్యవసానమ్. అనెను" ఈశ్లోకమున నాలుగు నిషేధములు గలవు. "అహతాః" అను సమాసఘటిత నఞ్ శబ్దరూపమగు 'అ.' మొదటి నిషేధము. నమహతామ్ అనునప్పటి 'న' రెండవ నిషేధము. నారయః అనునప్పటి "న" మూఁడవ నిషేధము. క్వ = అనునది నాల్గవ నిషేధము. నహతాః, అనునప్పటి మొదటి నిషేధము హననములేమిని చెప్పు చున్నది. రెండవ నిషేధము మరల హననమును జెప్పు చున్నది. మూఁడవ నిషేధము అట్లు కలిగిన హననమును లేకుండఁజేయుచున్నది. కాన మరల హననమునకు అభావముకల్గినది. నాల్గవ నిషేధము (క్వ) హననము లేకపోవుటను బాధించుటచేత- హననము ధ్రువమని తాత్పర్యము. ఇద్ది నారికేళ పాకమునకును నుదాహరణ మగుచున్నది.

6_48. లేఁత యెండకు నెఱ్ఱవాటి నీటియందున్న పద్మము మదపాటల మగు స్త్రీముఖమును ననుకరించు చుండుటచే నాపద్మమును చూచిన యెవనికి నుత్సుకత్వము కలిగింపదు? అనఁగా ప్రతియువకునకు ప్రియాముఖ దర్శనోత్సుకత్వము కలుగు నని భావము. రంగరాజను నొక వ్యాఖ్యాత 'ఈవర్ణనమున స్త్రీముఖసాదృశ్యము వలన, కమలము తన కాధారమైన నీటియందు పురుషున కుత్కంఠ కలిగించునది' అనెనఁట. ఆవ్యాఖ్య కాకి నల్లగా నున్నది కాన మేడ తెల్లగా నున్నది యనిన ట్లసంగతముగా నున్నది అని యాక్షేపించెను.

"ఏతేన స్త్రీముఖ సాదృశ్యా త్కమలం స్వాధారాంభసి పుంసః ఉత్సుకతా మాలంభయ" దితి రంగరాజవ్యాఖ్యానం "కాకస్య కార్ష్ణ్యా ద్ధవళః ప్రాసాద" ఇతివ దసంగతం మంతవ్యం" అని సహేతుకముగా నుపాలంభించెను.

గ్రంథకారుని యందుఁగాని యితరవ్యాఖ్యాతలందుఁగాని యెట్టిలోపము కనఁబడినను ఎత్తిచూపుటకు మల్లినాథుఁడు మొగమోట పడని ధీరుఁడు.

10_8. శ్లో. ఇందలి భావము చాల సుకుమారముగా నున్నది—. మధుపానము చేయు చున్న కాముకులు కలువలపరిమళమును నాసికలచేతను, మద్యరసమును ముఖములచేతను,

ఒక్కమాఱుగ ద్రాగినారు అనికలదు. దీనిపై మల్లినాథుఁడు- "గంధమును రసమును వేర్వే ఱింద్రియములచే క్రమముగా గ్రహింపఁ దగినవైనను, ఆరెండింద్రియము లేకకాలమున గంధరసములతో సంబంధము గలవౌటచే ఒక్కమాఱుగా గ్రహించినవి" అని భావము.

కాని యిది కుదురునా అని శంకించుకొని మనస్సు మిక్కిలి వేగముగా సంచరించుట వలన ఒక్కమాఱుగా రెండు పనులును జరిగి నట్లు తోఁచును. సుసూక్ష్మముగా పరిశీలించెడి అణుపరిమాణ వాదులు '' నూఱు తామర రేకుల దొంతరపై బాణము గ్రుచ్చి నపుడు రేకుల నన్నిటి నేకకాలమున భేదించి నట్లగపడినను మన మూహింపలేని వ్యవధానము గ్రుచ్చుకొనుట యం దున్నట్లే, ఆరెండింద్రి యముల గ్రహణ క్రియయందును సుసూక్ష్మవ్యవధాన ముండితీఱు' నందురు. మధ్యమపరిణామవాదులు నిజముగా (యౌగపద్యమున) ఒక్క మాఱుగనే జరిగి యుండు నందురు. కవు లన్ననో సార్వపథీనులు. అనఁగా వారి కేమార్గ మప్పటికి రుచించునో దానిని స్వీకరింతురు. కావున ఈవిచార మింతతో చాలింతము. అని మల్లినాథుఁడు సుకుమారముగా మూదలించి విడిచినాఁడు. "భిన్నేంద్రియ గ్రాహ్యావపి గంధరసౌ యుగపత్ స్వేంద్రియ సంబంధా ద్యుగపదేవ గృహీతా విత్యర్థః. అత్ర మనసః ఆశుసంచారా ద్యౌగపద్యాభిమానః శతప త్త్ర శరవ్యతిభేద వ దిత్యణు పరిమాణ వాదినః. వా స్తవమేవ యౌగపద్య మితి మధ్యమ పరిమాణ వాదినః. సార్వప థీనా స్తు కవయః ఇత్యల మతివల్లవితేన. ఇతి.

మల్లినాథుని సూక్ష్మేక్షిక కింతకంటె దృష్టాంత మేమికావలెను? ఇట్టిదే యాష్ఠికమగు నింకొక సూక్ష్మవిచారణమున నిటు మాఘునకు నటు భారవికిని మూదలింపు.

10-33 సతుల తనువుల సొరును సొరునిండు, జవ్వనపుఁ గల్మి కల్మిని శంబరారి సంపదయు దానిఁ బ్రియసంగ సమయ భూష । యైన మదమును గై సేసి యాదగించె. 10-33: అనుపద్యమున సతుల దేహములను సొరును, ఆసొరును నిండు జవ్వనమును—ఆజవ్వనమును, మదన సంప త్తియు, ఆమదనసంపదను మదమును, ఆమదమును ప్రియునితోడికూటమియును (వరుసగా) అలంకరించినవి. అనిచెప్పఁదగియుండ మహాకవులకుండెడి యుద్వేగము వలన "ప్రియసంగసమయ భూష మగు మదమును" అని విశేషణముగాఁ బ్రయు క్త మైనది. ఇట్లే భారవియు "శుచి భూషయతి'' యను శ్లోకమున శరీరమునకు శుచియగు శాస్త్రమును, ఆశాస్త్రమునునకు ప్రశాంతియును, అప్రశాంతికి పరాక్రమమును, ఆపరాక్రమమునకు నీతియును ఆనీతికి కార్యసిద్ధియును వరుసగా నలంకారము లగును అనిచెప్పవలసి యుండ ఆపరాక్రమమునకు నీతిచే నాపాదింపఁబడు కార్యసిద్ధి భూషణమగును. "స నయాపాదితసిద్ధి భూషణః" అని విశేషణముగా ప్రయోగించెను. అని నిశ్శంకముగా సర్వంకషయందు మూదలించిన సమదృష్టి మల్లినాథుఁడు.

"బబృహింరే" అను బృహిధాతువుయొక్క ఆత్మనేపదిత్వమును, పాదాదిని ''ఇవ, స్మ" శబ్దప్రయోగములును కవే రౌద్ధండ్యా దిత్యాదిగా సూరిచే నిరాకృతములైన వానికి మాఘునిప్రశ స్తిగల వెనుకటి ప్రకరణమున నాయల్పబుద్ధికిఁ దోఁచిన యుపప త్తుల నేవో చూపితిని.

అంతమాత్రమున మల్లినాథుని సామాన్యునిగా నెవరేని తలంచిరేని యాగురుధిక్కార దోషమునకు నేను బాత్రుఁడను గావలసి వచ్చును. కావున న న్నన్యథా తలంపవలదని

విద్వల్లోకమును గోరెదను.

ధన్యో మాఘకవి – ర్వయం సుకృతిన స్తత్సూక్తి సంసేవనాత్॥ అనిన మల్లినాథసూరి వలెనే–మాఘ మల్లినాధుల వలన మహాదేవకవియు, ఆముష్యర సూక్తి సేవనలవలన నేనును ధన్యుఁడను అనుకొనుచు నీప్రస్తావమింతటితో ముగించి మహాదేవకవి యాంధ్రీకరణమును గూర్చి కొలఁదిగా సమీక్షింతును.

## మ హా దే వా మా త్య క వి

"అట్టి సకలశాస్త్ర నిష్ణాతుఁడును వశ్యవాక్కును మహాకవియు నైన మాఘుఁడు సంస్కృతమున రచించిన శిశుపాలవధకావ్యమును దెలిఁగించిన కవిచంద్రులలో ఈమహాదేవకవి యొకరు" అని మున్నే తెలిపియుంటిని. మూల మగు సంస్కృత కావ్యమందలి భావమును జక్కఁగ గ్రహించి జీర్ణ మొనర్చుకొని తెనుఁగుఁదన ముట్టిపడ మరల ఛందోబంధమున సరళమగు శయ్యలో నద్దములోవలెఁ బ్రతిబింబింపఁ జేయుట యనిన సులభము కాని పని. మూల గ్రంథకర్తకంటె యథాతథముగా భాషాంతరీకరించు వానిదే కష్టము.

"ఉ. ఈసరసోక్తికావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్ల వీఁడు మఱి చేయుట యేటిది యంచుఁ జెప్పఁగా
జేసి యనాదరం బిరక చేయకుఁడీ విబుధాఁడు తూఁటుగా
నేసిన, నందె పాఱ మఱి యేసినవానిద సూటి గావునన్"

అని యైదు వందల యేండ్లనాఁడే కొఱవి గోపరాజు తన "సింహాసనద్వాత్రింశికయం"ద నుభవపూర్వకముగాఁ జెప్పినాఁడు. అట్లగుచో నాంధ్రకవు లీక్లేశమున కేల సిద్ధపడిరి? సంస్కృతము ననే యాయానంద మనుభవింప లేక పోయిరా అని యందు రేమో యని యాతఁడే

చ. తెలుఁగున కెల్లఁ దల్లి యగుఁ దెల్లము సంస్కృతభాష యందులోఁ
బలుకు లెఱుంగుచోఁ "బదవిభాగము, నన్వయ, మర్థ" మంచు నీ
మలకలకంటె నందుల సమర్థము తేటతెనుంగ యొప్పు నా
కొలఁది ప్రియంబు గాదె చెఱకుల్ దినుకంటె రసంబు గ్రోలినన్

అనెను. "సంస్కృతము తెలుఁగునకుఁ దల్లియే యగును. దాని రసమునే తెనుఁగున ననాయాసముగా నాస్వాదింప"వచ్చు నని యాంధ్రీకృత కావ్యములే మిన్న అని చక్కఁగ నిర్ధరించెను.

సరే అది యటుండ నిండు. శ్రీమహాదేవకవి బి. ఏ., బి. ఎల్. ప్యా సయి యుత్తమ న్యాయవాదిగా ప్రసిద్ధి కెక్కిన లౌకికవ్యాపార మగ్నుఁడు గదా! ఆయన కీకవిత్వలోలత యెట్లు కల్గెను? దానికై సంస్కృ తాంధ్రములం దెంత పరిశ్రమింపవలెను? పరిశ్రమించినను కవిత్వబీజము సహజముగ నుండవలదా? యని నచో— అది వారి వంశానుగతికమే కాని యీయననాఁడే కలిగిన విశేషము కాదు. ఈయన దత్తుఁ డగుటచే బుద్ధవరపు వంశమువాఁ డయ్యెను. కాని తండ్రి తాతల నాఁటి నుండియుఁ గవిత్వమునకు నిలయ మైన కూచిమంచి వారి వంశమున జన్మించినవాఁడు. జనకుఁ డగు సోమసుందర కవియు, నన్న యగు సాంబశివకవియుఁ జక్కని సంస్కృ తాంధ్ర సాహిత్యసంపన్నులై పెక్కు కావ్యములు రచించి ప్రసిద్ధి కెక్కినవారు. జన్మవంశ వాసనాగత మయి నదియే

కాని మహాదేవకవి కవిత బలాదాకృష్యమాణ కాదు. కావుననే యాంధ్రీకరణమట్లు లేక యీకావ్యము స్వతంత్రమట్లగపడుచున్నది.

నిలువ నిమిషమైన నవకాశము లభింపని పత్నీద్వయ సంతతి సంతతులు— సమానులం దుత్తమశ్లోకుఁ డనిపించుకొన్న లౌకికవ్యాపార మగు న్యాయవాదివృత్తి— తన్ను రేయింబవలు విడువకున్నను, నానువంశికమగు కవితాశక్తిని బ్రదర్శింప నవకాశ మెట్లు కలిగెనో? కలుగుఁగాక! మఱొక సామాన్య కావ్యము గాక మాఘకావ్యమువంటి శాస్త్రకావ్యమును దెలిఁగించుట మహాదేవకవి కెట్లు సాధ్య మయ్యెనో అనిపించును. జీవితాంతము నీయొక్క కావ్యరచనముతోఁ గూర్చుండెనా? ఇది గాక సూతసంహిత, చంపూరామాయణమును, కువలయానందమును గూడఁ దెనిఁగించెనే! లక్ష్మీ కటాక్షముతోపాటు సరస్వతీ కటాక్షమును సంపూర్ణముగా నీమహాదేవామాత్యునకు జన్మాంతర సుకృత విశేషమువలన వశంవదములై యుండనోపు.

ఈయన రచించిన సూతసంహితా, చంపూరామాయణాదులఁ గూర్చియుఁ వీరి తండ్రిగారగు కూచిమంచి సోమసుందరకవి యొక్కయు, నన్న యగు సాంబశివకవి యొక్కయు పాండిత్య కవిత్వముల విశేషములఁగూర్చి చిరంజీవి గరిమెళ్ల అ. స. శే. సోమయాజి శర్మ యేత త్కావ్య భూమికయందు వివరించి యుండుటచే యావిషయమును చర్వితచర్వణము చేయక నాసమీక్షయందు మాఘుని వ్యాకరణ రహస్య విశేషములను నాశక్తికొలఁది కొన్నిటిని మాత్రమే యెత్తి చూపి రస భావ గుణాలంకారాదుల మాటయెత్తనైతిని. దానికి హేతు వేమన:— మాఘుని సంస్కృత శ్లోకముల నుదాహరించినచో వానికిఁ దెనుఁగున వ్యాఖ్యానింపక తప్పదు. ఆంధ్రీకరణము మూలమునకుఁ బ్రతిబింబమే కావున ఆంధ్రపద్యముల నుదాహరించుచు వివరించినచో మహాదేవకవి నైపుణ్యమును మాఘుని హృదయమును గూడ వెల్లడి యగునుగదా యని రస భావ గుణాలంకారాది కావ్యలక్షణ విమర్శ మిచటికిఁ దేఁబడినది. ఏకక్రియ ద్వ్యర్థకరి యగు నని తలంపు.

మల్లినాథసూరి తనవ్యాఖ్య యగు సర్వంకష యారంభమున "నేతాస్మి యదునందనః స భగవాన్ వీరః ప్రధానో రసః, శృంగారాదిభి రంగవాన్ విజయతే పూర్ణా పున ర్వర్ణనా" అనిన సూక్తి చొప్పున నిందు— నాయకుఁడు శ్రీకృష్ణుఁడు, శృంగారాదు లగు నితర రసము లంగములుగాఁ గల వీరముఅంగి (ప్రధాన) రసము. అష్టాదశవర్ణములలో నేయొకటి రెండో దక్క మిగిలిన వర్ణనములు పరిపూర్ణములై యున్నవి. నాయకుఁడు శ్రీకృష్ణుఁడు మొదటిసర్గము మొదటిపద్యముననే "సిరిమోహించిన వన్నెలాఁడు" అని ప్రత్యక్ష మగును. ప్రతినాయకుఁ డగు శిశుపాలుని దౌష్ట్యమును నారదుఁడు విపులముగా వచింప విని ఆసర్గము తుదిని—

ఆరీతిన్ ముని చెప్పి మి న్నొరసి పూర్ణేందుద్యుతిన్ వెల్గ నోం
కారంబున్ బ్రకటించి చైద్యునెడ నల్కం గొన్న యాశౌరి—

అనుపద్యమున శిశుపాలునిసంహరింతు నని ప్రతిన పూను నాహరియే కనఁబడును. తుట్టతుదిని ప్రతిజ్ఞానుసారము శిశుపాలుని వధింప, వానితేజోంశ మొకటి కృష్ణునిలోఁ జొచ్చుటతో కావ్యము ముగియును.

"నయతి వృత్తం ఫలం ప్రాప్నోతి చ నాయకః" ఇతివృత్తము నాశ్రయించుచు లేక నడిపించుచు ఫలమును బొందువాఁడు నాయకుఁ డను లక్షణము చొప్పున శిశుపాలవధరూప

పైనఫలము శ్రీకృష్ణునియందే విశ్రమించుచున్నది. కాన నాయకుఁడు శ్రీకృష్ణుఁడే యగుచున్నాఁడు.

శ్రీమన్నారాయణుని యవతారములలోఁ గొన్ని యైశ్వర్య (నియంతృత్వ) ప్రదర్శకములు. కొన్ని ధర్మప్రదర్శకములు, కొన్ని కీర్తి, కొన్ని సౌందర్యము, కొన్ని జ్ఞానము, కొన్ని వైరాగ్యమును బ్రదర్శించునవి. ఈ షడ్విధలక్షణములే కాక మాధుర్యమునకుఁ గూడ మహాసముద్రమై నిఖిలశక్తి యుక్తమై సమస్తావతారములను నంతర్భూతములఁ గావించుకొన్నది శ్రీకృష్ణావతారము. మఱియు భగవంతునకు అంశావతారము, అంశాంశావతారము, ఆవేశావతారము, కళావతారము, పరిపూర్ణావతారము, పరిపూర్ణతమావతారము అని యాఱు విధములుగా నింకొకయవతార విభాగము చేయఁబడి, యావిభాగమున........ చతుర్వ్యూహాత్మక మైనట్టియు, నవరసముల కాటప ట్టయినట్టియు వీర్యాతిశయాస్పద మైనట్టియు, శ్రీరామ నృసింహ, నర నారాయణాదులు పరిపూ ర్ణావతారములు. అసంఖ్యేయ బ్రహ్మాండాధిపతియై, సర్వతేజస్సులను తన తేజస్సులో లీనము చేసికొని, జ్ఞాన ఘన మైన శ్రీకృష్ణపరమాత్మ "పరిపూర్ణతమావతారము" అని గర్గసంహితాదుల ననుసరించి మాగురువర్యులు బ్రహ్మశ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రులవారు రచించిన "ఆస్తిక్యము" అను గ్రంథము, 71, 72, 73, పుటలందుఁ గలదు.

కావున నాయకుఁడు శ్రీకృష్ణుఁ డనఁగానే మహానాయక సకలలక్షణ పరిపూర్ణుఁ డని మరలఁ జెప్పనక్కఱ లేదుగదా!

"క. కులము మహాభాగ్యము, నుజ్జ్వలత యుదారత మహోవిశాలత ధర్మాకలనయు వైదగ్ధియు నన నిల నాయక గుణము లమరు" అని నరస భూపాలీయమున నాయకగుణము లేదు అనిచెప్పఁబడినది. కాని దానికి మూలమగు ప్రతాపరుద్రీయమున "ధార్మికత్వాదయో గుణాః" అని ఆదిపద ముచే మహామహత్వము, పాండిత్యము మున్నగు గుణములును సూచితము లగుచున్నవి. అని దశరూపకమున నిరువది రెండుగా నిరూపింపఁబడినది. అది విషయాంతరము.

ఇందు మొదటిపద్యమున వస్తునిర్దేశముగా శ్రీకృష్ణుఁడు గ్రహింపఁబడెను. అందలి విశేషణములను బట్టి నాయకగుణములు పెక్కు ధ్వనితము లగుచున్నవి.

> "సిరి మోహించిన వన్నెలాఁడు భువనశ్రేణీభరంబున్ నిజో
> దర మధ్యంబునఁ దాల్చి సర్వజగతీ త్రాణార్థమై దేహముల్
> వరియింపం గల జాణ శౌరి వసుదేవ ప్రాజ్య హర్మ్యాంతర
> స్ఫురదావాసుఁడు గాంచె నింగి డిగు నంభోజాత జా తాత్మజున్"
> "శ్రియఃపతిః శ్రీమతి శాసితుం జగ జ్జగన్నివాసో వసుదేవసద్మని
> వసన్ దద ర్శావతరంత మంబరా ద్ధిరణ్యగర్భాంగ భువం మునిం హరిః"

అను శ్లోక మాపద్యమునకు మూలము.

మహాదేవకవి యాంధ్రీకరణము మక్కికి మక్కిగా వెలువడినది కాదు. పెక్కుతావులందు కాకను పోవదు. అదృష్టితోడనే చూడవలసియున్నది. తెలుఁగుజాతీయమున కనుకూలముగా మూలమునఁ గనఁబడిన తావులందుఁ దెలుఁగుజాతీయమునకే ప్రాధాన్యమిచ్చును.

అదియును సార్వత్రికము కాదు. స్వేచ్ఛానువాదమున మూలానుసారిగా నుండును. మచ్చున కీపద్యమును విమర్శించి చూతము. మూలమున 'శ్రియఃపతిః' అనుదానికి "సిరి మోహించిన వన్నెలాఁడు" అని యాంధ్రీకరణము. 'శ్రియఃపతిః' అనఁగా లక్ష్మికి పతి యనిమాత్రమే యర్థము. 'పాతే ర్డతిః'॥ అనెడి ఉణాదిసూత్రముచే పతి యనఁగా రక్షకుఁ డని యర్థము. మహాదేవకవి యంతమాత్రమున తృప్తిపడక శ్రీశబ్దము మాని తెనిఁగించుచున్నట్లు స్ఫురింప తద్భవమగు "సిరి' శబ్దమును గ్రహించి "సిరిమోహించిన వన్నెలాఁడు" అనుట వలన నాయక గుణము లైన మహాభాగ్యము, ఉజ్జ్వలత, వైదగ్ధి యనుగుణములు వ్యక్తము లగుచున్నవి. సిరి మోహించిన వన్నెలాఁడు అను కూర్పులో తానై సిరిని మోహించిన రసికుఁ డనియే కాక, సిరియే తా నయి మోహించిన రసికుఁ డనియు సొగసైన వ్యంగ్యముకూడ గుర్తింపనై యున్నది. 'జగన్నివాసః' అను పదమునకు 'జగతా మాధారభూతః, కుక్షిస్థాఖిల భువన ఇతి యావత్' అను మల్లినాథసూరి వ్యాఖ్య ననుసరించి "నిజోదర మధ్యంబున భువన శ్రేణీభరంబును దాల్చి" యని వివరణ పూర్వకముగాఁ దెనిఁగింపఁబడినది. "జగత్ శాసితుం" అను దాని యాధారమున 'సర్వజగతీ త్రాణార్థమై దేహముల్ వరియింపంగల జాణ' అను పెంపక మున నొక విశేషము లేకపోలేదు. 'జగత్ శాసితుం' జగత్తును శాసించుటకు అనఁగా దుష్ట శిక్షణ శిష్టరక్షణములు చేయుట యగును. కాన ఆరెండు కార్యములకు నరదేహమే కాక తిర్యగ్దేహములనుగూడఁ బెక్కు ధరించు నలవాటు గలవాఁ డని స్ఫురింపఁజేయుట మెచ్చఁ దగినది. ఈవిశేషణమువలన మహోవిశాలత, ప్రతాపాతిశయము, రక్షణదీక్ష మున్నగు నాయకగుణములు స్ఫురించుచున్నవి. 'వసుదేవ సద్మని వసన్' యను దానికి వసుదేవ ప్రాజ్య హర్మ్యాంతర స్ఫుర దావాసుఁడు అని తెనిఁగించుటలో కులీనతమాత్రమే కాక గృహమను నర్థముగల సద్మశబ్దమును మాని, హర్మ్యాది ధనినాం వాసః అను నమరసూక్తిచే లక్ష్మీయుక్త మగు సౌధము అనియు ప్రాజ్యము అనుటవలన ఆసౌధము గూడ నమిత మగు ధనధాన్యాదులతో నిండియున్న దనియు మాత్రమే కాక, నింగినుండి దిగి వచ్చు నారదుని జూచుటలో గృహమం దుండి చూచె ననుటకన్న ఎత్తుగా నుండు మేడపై నుండి చూచె ననుటలోని యౌచిత్యము మనసున నిడుకొని మహాదేవకవి యంతగాఁ బెంచిన ట్లగపడుచున్నది. అంతియే కాదు 'శ్రీమతి' యనుదానిలోని మతుప్ప్రత్యయము ప్రశంసార్థమున (అధిక మగు శ్రీ గలది యనునర్థమున) వచ్చినది. కాని కేవలము అస్త్యర్థమాత్రమున వచ్చినది కా దనియే ప్రాజ్యశబ్దము ప్రయుక్తము. ఈరీతిగా సవిమర్శదృష్టితో మహాదేవకవి యాంధ్రీ కరణము సాగిన దని మచ్చున కీపద్యము చూపఁబడినది. ఆలంకారికులు చెప్పిన నాయక గుణములతో నిండియున్న దనియుఁ దెల్పుటకై యింత విపులీకరింపఁబడినది. కాని యిట్లు ప్రతిపద్యమును వివరింపఁబూనిన గ్రంథవిస్తరమగును గాన నీమార్గము విడిచి రసవిషయమై యరయుదము.

మహానాయక గుణ పరిపూర్ణుఁడు కృష్ణుఁడు నాయకుఁడు. ప్రధానరసము వీరము అని ముందు తెల్పియుంటిమి. వీరరసమునకు స్థాయిభావము ఉత్సాహము గదా! ఆయుత్సాహము కృష్ణునందు నారదుని ప్రబోధవాక్య జనితముగాఁ బ్రథమాశ్వాసమున నంకురించి, ద్వితీయాశ్వాస మున ఉద్ధవ బలరాముల వాకోవాక్యములలోఁ జక్కఁగా పల్లవితమై, క్రమముగా ఇంద్రప్రస్థ

ప్రయాణరూపమున కోరకితమైనది. ప్రయాణకాలమున వర్ణిత మైన శృంగారరూపమైన అంగరసముచే భంగ మొందక క్రమవృద్ధి నందినది. ఈయుత్సాహ మంతయు శిశుపాలుని వధించువేళకు ప్రత్యక్షమైన క్రోధమున కుద్బోధక మైనది. కావునఁ గృష్ణుని హృదయమునఁ గలిగిన యుత్సాహము విజాతీయమగు శృంగార రసముచే స్థూణా ఖననన్యాయమున దృఢపడె ననియే తెలియఁదగును.

గీ. "గరిమ నదు లెన్ని గలిసినఁ గప్పుకొనుచు, జలధి గనుపట్టు రీతి సంచారిభావ సంచయము లెన్ని గలిసిన మించనీక, తాన కనుపట్టు భావంబు స్థాయి దలఁప" అని నరసభూపాలీయము. దీని కాధారమగు దశరూపకమున

"సజాతీయై ర్విజాతీయై రతిరస్కృత మూర్తిమాన్
యావ ద్రసం, వ ర్తమానః స్థాయీ భావ ఉదా హృతః"

అని కలదు. సజాతీయ విజాతీయ భావములచే భంగ మొందక రసస్ఫూర్తి పర్యంతము సహృదయ హృదయముల నిలుచునట్టి భావమే స్థాయి యనఁబడు" ననిలక్షణము.

మూఁడవ యాశ్వాసము నారంభమున

క. "ధనదుని దిశ విడిచి యగస్త్యుని మార్గము చేర తపనుచొప్పున యుద్ధా భినివేశ ముడిగి హరి య్యొయ్యన నిందప్రస్థనగరి - కరుగఁగ వెడలెన్" అను పద్యము మూలమునకుఁ బ్రతిబింబము. సూర్యుఁ డుత్తరాయణము (ఉత్తరదిక్సంచారము) మాని దక్షిణదిక్కునకు వెడలినట్లే యుద్ధాభినివేశము మాని హరి యింద్రప్రస్థమునకు వెడలెను. అనుటచే బలరా మోద్ధవుల వాక్యములవలనఁ గలిగిన యుద్ధోత్సాహము తొలఁగినట్లు కనిపించునే కాని కృష్ణుని హృదయమున శత్రువునెడఁ గలిగిన క్రోధము స్తంభించియే యున్న దని "అనేన హరేః క్రోధః కార్యవశా దంత స్తంభితో, న త్వేకాంతతో నివృత్త ఇతి సూచితమ్" అని మల్లినాథసూరి వాక్యము.

కృష్ణుని ప్రయాణ సన్నాహమున కృష్ణుని వేషధారణము శృంగారరసమున కర్హ మనిపించినను వీరమునకు సరిపడనిదిమాత్రము కాదు. ఛత్ర చామర కిరీ టాంగదా సర్వాభరణ ధారణమును, యౌవనమునఁ బిక్కటిల్లిన కుచములు గల కాంత లిరుప్రక్క నున్నా రనుటయు శృంగారరస సంబంధమైనను, శత్రుసంహార సాధనములగు శంఖ చక్ర గదా ఖడ్గ ధనురాదులు స్వయముగా వచ్చుట, వానిని కృష్ణుఁడు స్వీకరించుట- అంతర్గత క్రోధమైన మనస్సున స్మరించుటయే కారణము. చూ (14 మొదలు 21)

ఈయాభరణములను నాయుధములను దాల్చి శ్రీకృష్ణుఁడు

గీ. ఇష్టసిద్ధిని సాధించి యెల్ల దిశల కడ్డులేకచరించుచు నరుగు పుష్య
మనురథమ్ము మహారథుం డయ్యు హరి వ సించెఁ బుష్యస్థితేందుని చెలువు గాంచి"

అని మహారథుఁ డయ్యును పుష్యరథము నెక్కె నని మహాదేవకని తెనుఁగు. మూలమున "మహారథః పుష్యరథం రథాంగీ" -మహారథుఁ డగు హరి పుష్యరథము నెక్కె "నని మాత్రమే యుండ---- మహారథుఁ డయ్యును పుష్యరథము నెక్కె ననెడి యనువాదమున చక్కని స్వారస్యము బయలుపడుచున్నది. అమరకోశమున "యానే చక్రిణి యుద్ధార్థే శతాంగః స్యందనో రథః, అసౌ పుష్యరథ శ్చక్రయానం న సమరాయ యత్" అని

యుద్ధార్థమగు చక్రయానము "శతాంగ స్యందన రథ పద వాచ్యమగు ననియు" యుద్ధార్థమునకుఁ గానట్టి చక్రయానము "పుష్యరథము" అనఁబడుననియు నుండుటవలన హరి యెక్కినరథము యుద్ధార్థముకానిదే కాని హరిమాత్రము మహారథుఁ డనుటవలన 'ఆత్మానం సారథిం చాశ్వాన్ రక్షన్ యుద్ధ్యేత యో నరః, స మహారథసంజ్ఞః స్యాత్.........'ఇత్యాది సూక్తివలన యుద్ధమున నతినిపుణుఁ డని తెలియుచున్నది. మూలమున "మహారథ" విశేషణము సామాన్యముగా కనిపించుచున్నది. ఆవిశేషణమునే హరికి నంతర్గతముగా నుత్సాహబీజ మున్నట్లు వ్యక్తము కావలె నని మహాదేవకవి "మహారథుఁ డయ్యును— అనఁగా హృదయ గత మగు వీరరస స్థాయిభావ మైన యుత్సాహ మంతర్గతముగా నున్నను దానిని బయలు పఱుపక, యుద్ధేతరసమయముల౦ దెక్కెడు సామాన్యరథ మెక్కి వెడలె నని అప్యర్థక మగు "అయ్యును" అను నవ్యయము నధికముగాఁ జేర్చి, తన విమర్శనపాటవమును వెల్లడించెను. ఇట్టి సజాతీయభావము లెన్ని పైఁబడినను కృష్ణుని మనస్సునందలి స్థాయిభావమైన యుత్సాహము తిరస్కృతము కాలేదు. కావున నది యంతయు వీరరసవిషయమే యయ్యెను.

ఇట్లే యుద్ధవీరమునకు విజాతీయ మగు శృంగారముచేతను నతిరస్కృతము కావలె నని యెంచియే మాఘమహాకవి అంగరసములలోఁ బ్రధానముగా శృంగారరసమును విభావానుభావ సంచారిభావ పరిపుష్టము నొనర్చి సప్తమాష్టమ నవమ దశమాశ్వాసముల నాల్గింటను సాంగోపాంగముగా వర్ణించెను. ఆవిషయ మంతయును చెక్కు చెదరకుండ మహాదేవకవి తెనిఁగించుటలో నెంతయు నైపుణ్యము ప్రకటించుట ముదావహము.

## శృంగార రసము

శృంగారమునకు స్థాయిభావము రతి. ఈరతి యనునది నాయికానాయకుల కొండొరులపైఁ గలుగు ననురాగ రూప బీజము. (కాని సురతము కాదు.) దానికి నాయికానాయకు లిరువురును ఆలంబనము. కావున వారు ఆలంబన విభావము అగుదురు. ప్రచ్ఛన్నముగా నున్న యీరతిని యుక్తవయస్సు, ఆభరణాదికము, చేష్టలు, మలయానిల, చంద్రాదులు (తటస్థములు) ఉద్దీపింపఁజేయునవి కాన వానిని ఉద్దీపనవిభావములు అనిరి. ఈకావ్యమునఁ గలుగు నాలంబ నోద్దీపనవిభావములను సందర్భోచితముగాఁ దెలుపుచు నేయేనాయికా నాయకు లిందు గ్రహింపఁబడిరో యరయుదము.

> "క. అంత సహజ మధురాకృతు, లింతులు హరియించు చెల్లహృదయములు వనా
> భ్యంతర భూములఁ బద మిడు, నంత విలాసములు వారియందుఁ బద మిడెన్"

అనుపద్యమున నాయికలు ముందుగా శృంగారచేష్టలచే నాయకుల హృదయములను హరించి రని కలదు. ఉద్దీపనవిభావములలోని వగు చేష్ట లిందుఁ జెప్పఁబడె నన్నమాట.

> గీ. చెలువ యొకరిత యిటు నట్టు మెలఁగె నఖర, పాళిరుచు లింద్రచాప కల్పన మొనర్ప
> వలయములు మ్రోయ మృదుబాహువల్లి సారె, సారెకు నితంబమున నుండి జాఱుచుండ. 7.4

ఈపద్యమున నాయికయొక్క గుణములు అనఁగా రూప యౌవనాదులు గమ్యమానములు. మ్రోయుచున్న వలయములు ఆభరణములు. నఖకాంతు లింద్రచాపములవలె మెఱయుచుండఁగా, నితంబమునఁజేర్చిన బాహువల్లి జాఱుచుండఁగా, నిటునటు తిరుగుటమొదలగునవి శృంగార చేష్టలు. తటస్థము లనఁబడు వసంత, మలయానిల, శుక, పిక, కేకి, భృంగాదులు ముందుగానే వర్ణింపఁబడినవి. కావున ఉద్దీపనవిభావములు పుష్కలముగా వర్ణితము లయ్యె నన్నమాట.

యుద్ధార్థమగు చక్రయానము. "శతాంగ స్యందన రథ పద వాచ్యమగు ననియు" యుద్ధార్థమునకుఁ గానట్టి చక్రయానము "పుష్యరథము" అనఁబడుననియు నుండుటవలన హరి యెక్కినరథము యుద్ధార్థముకానిదే కాని హరిమాత్రము మహారథుఁ డనుటవలన 'ఆత్మానం సారథిం చాశ్వాన్ రక్షన్ యుద్ధ్యేత యో నరః, స మహారథసంజ్ఞః స్యాత్.........' ఇత్యాది సూక్తివలన యుద్ధమున నతినిపుణుఁ డని తెలియుచున్నది. మూలమున "మహారథ" విశేషణము సామాన్యముగా కనిపించుచున్నది. ఆవిశేషణమునే హరికి నంతర్గతముగా నుత్సాహబీజ మున్నట్లు వ్యక్తము కావలె నని మహాదేవకవి "మహారథుఁ డయ్యును— అనఁగా హృదయ గత మగు వీరరస స్థాయిభావ మైన యుత్సాహ మంతర్గతముగా నున్నను దానిని బయలు పఱుపక, యుద్ధేతరసమయములం దెక్కెడు సామాన్యరథ మెక్కి వెడలె నని అప్యర్థక మగు "అయ్యును" అను నవ్యయము నధికముగాఁ జేర్చి, తన విమర్శనపాటవమును వెల్లడించెను. ఇట్టి సజాతీయభావము లెన్ని పైఁబడినను కృష్ణుని మనస్సునందలి స్థాయిభావమైన యుత్సాహము తిరస్కృతము కాలేదు. కావున నది యంతయు వీరరసవిషయమే యయ్యెను.

ఇట్లే యుద్ధవీరమునకు విజాతీయ మగు శృంగారముచేతను నతిరస్కృతము కావలె నని యెంచియే మాఘమహాకవి అంగరసములలోఁ బ్రధానముగా శృంగారరసమును విభావానుభావ సంచారిభావ పరిపుష్టము నొనర్చి సప్తమాష్టమ నవమ దశమాశ్వాసముల నాల్గింటను సాంగోపాంగముగా వర్ణించెను. ఆవిషయ మంతయును చెక్కు చెదరకుండ మహాదేవకవి తెనిఁగించుటలో నెంతయు నైపుణ్యము ప్రకటించుట ముదావహము.

శృంగార రసము

శృంగారమునకు స్థాయిభావము రతి. ఈరతి యనునది నాయికానాయకుల కొండొరులపైఁ గలుగు ననురాగ రూప బీజము. (కాని సురతము కాదు.) దానికి నాయికానాయకు లిరువురును ఆలంబనము. కావున వారు ఆలంబన విభావము లగుదురు. ప్రచ్ఛన్నముగా నున్న యారతిని యుక్తవయస్సు, ఆభరణాదికము, చేష్టలు, మలయానిల, చంద్రాదులు (తటస్థములు) ఉద్దీపింపఁజేయునవి కాన వానిని ఉద్దీపనవిభావములు అనిరి. ఈకావ్యమునఁ గలుగు నాలంబ నోద్దీపనవిభావములను సందర్భోచితముగాఁ దెలుపుచు నేయేనాయికా నాయకు లిందు గ్రహింపఁబడిరో యరయుదము.

> "క. అంత సహజ మధురాకృతు, లింతులు హరియించు చెల్ల హృదయములు వనా
> భ్యంతర భూములఁ బద మిషు, నంత విలాసములు వారియందుఁ బద మిడెన్"

అనుపద్యమున నాయికలు ముందుగా శృంగారచేష్టలచే నాయకుల హృదయములను హరించి రని కలదు. ఉద్దీపనవిభావములలోని వగు చేష్ట లిందుఁ జెప్పఁబడె నన్నమాట.

> గీ. చెలువ యొకరిత యిటు నట్టు మెలఁగె నఖర, పాళిరుచు లింద్రచాప కల్పన మొనర్ప
> వలయములు మ్రోయ మృదుబాహువల్లి సారె, సారెకు నితంబమున నుండి జాఱుచుండ. 7.4

ఈపద్యమున నాయికయొక్క గుణములు అనఁగా రూప యౌవనాదులు గమ్యమానములు. మ్రోయుచున్న వలయములు ఆభరణములు. నఖకాంతు లింద్రచాపములవలె మెఱయుచుండఁగా, నితంబమునఁజేర్చిన బాహువల్లి జాఱుచుండఁగా, నిటునటు తిరుగుటమొదలగునవి శృంగార చేష్టలు. తటస్థము లనఁబడు వసంత, మలయానిల, శుక, పిక, కేకి, భృంగాదులు ముందుగానే వర్ణింపఁబడినవి. కావున ఉద్దీపనవిభావములు పుష్కలముగా వర్ణితము లయ్యె నన్నమాట.

రసమునకు నాయికానాయకు లాలంబనవిభావము లగుట ఘటమునకు మృత్తువలె సమవాయికారణ మనినారు. అందు నాయికలలో శృంగారనాయిక లెనిమిదివిధములుగాఁ జెప్పబడిరి. ఈప్రకరణమున నేయేశృంగారనాయిక లిందు వర్ణింపఁబడిరో చూతము.

ఈ7 అశ్వాసము 7, 8 పద్యములందు ఖండితనాయిక చెప్పఁబడుచున్నది. ఖండిత యనునది యష్టవిధశృంగారనాయికలలో నొకతె. 'విభుఁ డన్యసతిఁ బొంది వేకువ రాఁ గుందు నబల ఖండిత...అని నరసభూపాలీయమున నున్నది. కాని "జ్ఞాతే న్యాసంగవికృతేః ఖండి తేర్ష్యాకషాయితా" అను దశరూపక లక్షణము సమంజసముగా నున్నది.

ఈ7, 8 సీసపద్యములలోని భావము మూలమం దైదు శ్లోకములలోనిది. మహాదేవకవి యాభావము నంతయును వ్యాఖ్యాన మొనర్చినట్లు రెండు సీసపద్యములలోఁ జక్కఁగా వర్ణించెను.

వీని యనంతర పద్యముల రెంటను "స్వాధీనపతిక" యను శృంగారనాయిక వర్ణింపఁ బడెను. "వరుఁడు కైవసమైన వనిత స్వాధీనపతిక...అని తల్లక్షణమున కనుగుణముగా మూలమును, మూలమునకుఁ బ్రతిబింబముగాఁ జిన్నచిన్న మాటలలో నాంధ్రీకరణమును నెంతయు సొగసుగా నున్నవి. వనవిహారమున నాయికకంటె నాయకుఁడు వేగముగా నడచు చుండఁ గాంచి చెలికత్తె నిందింపఁగా, నాయకుఁ డాఁగి, నాయికను దనముందు నడిపించుచుఁ దా నామె ననుసరించి నడచెను.

గీ. వెన్కఁబడి యుండ నెచ్చెలివేగ మేఁగఁ, దగునె? ముందటి కేఁగ నోమగలరాజ!
కుచ నితంబ భరమ్మునఁ గోమలాంగి, కడు వెతంబడు టీవెఱుంగనిదె చెపుమ? (9)

గీ. అని యొక వయస్య నిందింప నతివ వచ్చు, నందమక నాఁగి యామె ముందడుగులిడుచు
నడుచుచుండఁగ- వెన్కనాతఁడును మెల్ల, నడుచు నడుగులఁ బుడమిఁ గొల్చెడుననంగ.

తరువాతపద్యమునఁ గలహాంతరిత వర్ణింపఁబడెను.

గీ....అల్కఁ నధిపుఁ దెగడి యనుశయముఁ జెందు సతి కలహాంతరిత... అని లక్షణమునకు

గీ. వాఁడు నను వీడి యవమానపఱచినాఁడు, నావెతకుఁ గుల్కుచుందువు నీవు మెచ్చ
నతని పజ్జ కిదే యేన యరుగుదాన, ననుచు నల్కనుబలె నాడె నబల చెలికి.

అనుపద్యము లక్ష్యముగా సరిపడినది. ప్రౌఢ యగు కలహాంతరిత కానఁ దప్పు చెలికత్తెపై మోపి తా నయి యనునయింప వెడలుచున్న దని భావము.

తరువాతి 6 పద్యములందు స్వాధీనపతికయే వర్ణింపబడెను. నాయిక స్వాధీనపతిక యైనప్పుడు సాధారణముగా నాయకుఁడు అనుకూలుఁడుగా నుండును. కొన్నియెడల భేదింపను వచ్చును. (దక్షిణ ధృష్ట, శఠులలో నేయొకఁడో కావచ్చును.) ఇచట నాయికా నాయకులు కలసి సంచరించునపుడు నాయకుని ముందటను వెనుకను, పార్శ్వభాగములందును నాయిక యనుసరించు విలాసము వైదర్భీరీతిలో, ప్రసాదగుణము మెఱయ ద్రాక్షాపాకమున వర్ణిత మయ్యెను. (చూ. 11 పద్యము మొదలు 16 ప. దాఁక).

పిదప పుష్పావచయము:— (పూవులు కోయుట) దీనియందు శృంగారము పొంగి పొరల మధురభావములతో వర్ణింపఁబడెను.

ఆ. క్రొత్త పెండ్లియైన కోమలి మో మెత్తి, ప్రియుఁడు బల్మి ముద్దు పెట్టుకొనియెఁ,
బూల గోయు వ్యాజమున నెఱుఁగని యట్లు, అటు చరించె జాణయగు వయస్య.

అనుపద్యమున నాయిక, స్వీయ, నవోఢ, ముగ్ధ. ముగ్ధ కావున సిగ్గుచేఁ దన సన్నిధి నైన యెడ దొలగి పోవునేమో యని చెలికత్తె పూవులు గోయునెపమున దూరమున కరిగినది. తొలఁగుటయే తడవుగా నాయకుఁ డాముద్ధరాలి మొగ మెత్తి ముద్దిడుకొనెను నాయిక ప్రౌఢయైనచో చెలికత్తె చెంగట నైనను నాయకుని యుత్కంఠ కార్యరూప మొంద వచ్చును. కావుననే "క్రొత్త పెండ్లియైన కోమలి" అని ప్రయుక్తము. "అభినవోఢవధూః" అని మూలమున నున్నపదమునకుఁ దెలుఁగుఁదన ముట్టిపడ "క్రొత్త పెండ్లియైన కోమలి" యను నాంధ్రీకరణము మెచ్చఁదగినది.

29 సీసమాలికలో:- ఒకచెలి తనతోడ విహరించుచు పతి యొక్కెడఁ గొంతసేపు డాఁగి యుండి, మరల వచ్చి యాచెలి యెదుటనుండి చనుచుండఁగా, వానిని జూచియును, నాచెలి వానిని జూడనట్లే వయ్యెదఁ జాఱఁగా... నెత్తైన కొమ్మ నున్న పువ్వులు కోయు నెపమున మొగము మీఁది కెత్తి యాతని చూడక యాలసించుచుండెను. అంత నెచ్చెలులు "నీపతి యదే యెదుట నున్నాఁ" డని పల్కఁ దెలియనటు నటించి, పూలుకోయుట మాని, తొట్రుపాటుతో జాఱిన కట్టుపుట్టము సవరించుకొనుచు, "భయ సంభ్రమములతో భావజు నానచేఁ దమి హెచ్చఁ గిలికించిత మ్మొనర్చె" న దని కలదు. ఇందలి భావసౌందర్యము వర్ణనాతీతము. మూలమున నాలుశ్లోకములం దున్న భావమును మహాదేవకవి 12 సీసపాదములును 4 గీతపాదములు గల యొకమాలికయందు వ్యాఖ్యా నానపేక్షముగాఁ దెనిఁగించెను.

మూలమున "కృత భయపరితోష సంనిపాతం" అను విశేషణము గలదు. దానికి భర్తృసందర్శనముచే భయము సంతోషము నొక్కమాఱు కలిగి యొండొంటితో సంకీర్ణము లైనవి అనిభావము. "అదియే కిలికించితము" అని వ్యాఖ్య చేయఁబడెను. కాని మూలమున "కిలికించితము" అనుపేరు చెప్పఁబడక "కృత భయపరితోష సంనిపాతం కిమపి రసేన రసాంతరం భజంతీ" అని ధ్వనింపఁ జేయఁబడెను. కిలికించిత లక్షణము:- అలుక కలుక ముదము నశ్రువుఁ గలిసినఁ గిలికించితము...అని నరసభూపాలీయమునఁ గలదు. ప్రియ సంగమమువలన భయక్రోధ హర్ష బాష్పాదుల సాంకర్యము కిలికించితము- అనెడి లక్షణమునకు మూలమున స్వశబ్దముచే వాచ్యము గాక వ్యంగ్య మగుచుండఁగా మహాదేవకవి వ్యాఖ్యానమందుఁ బ్రతిపదముగా నీయఁబడిన దనియో, స్పష్టప్రతిపత్తికొఱకో, కాని "తమి హెచ్చఁ గిలికించిత మ్మొనర్చె" అని స్వశబ్ద వాచ్య మొనర్చెను. అలంకారికు లిట్టిది స్వశబ్ద వాచ్యత్వ మని నిరసింతురు. "వ్యభిచారి రస స్థాయి భావానాం శబ్ద వాచ్యతా,...రసే దోషా స్యు రీదృశాః" అని శాస్త్రసిద్ధాంతము.

ఆ పుష్పాపచయ క్రీడయందు నాయికా నాయకులు తమహృదయములఁ గల వలపు ప్రకటింపఁ గోరి యొండొరుల మేనులందు నఖక్షతము లొనర్చుకొనువారు. ఆగోటినొక్కులను మాఘుఁడు మిగులఁ జమత్కారముగాఁ జెప్పెను. ఆగోటినొక్కులు కామినీ కాముకుల హృద్గత మగు కోరికను దెలుపుటకై వ్రాసిన మన్మథ లేఖలయందలి యక్షరము లనెను. ఆయక్షరములు చిగురాకులపై వ్రాసినచో పఠింప శక్యము కాని వగు నని పులకించిన దేహములందు వ్రాసిరఁట. అంతమాత్రముననే ఆయక్షరములయందలి యర్థము స్ఫుట మగుచున్నదఁట. అట్టి మదనలేఖలను ప్రేయసీ ప్రియులు పరస్పరము పంపిరఁట! ఏమి కల్పనము! నారికేళపాక మనఁగా ఇదియే కదా!

"కిసలయశకలే ష్వలేఖనీయాః, పులకిని కేవల మంగకే నిధేయాః
నఖపద లిపయోఽపి దీపితార్థాః, ప్రణిదధిరే దయితైః రనంగలేఖాః"

**అనిమూలము —**

చ. కిసలయ ఖండపాళుల లిఖింపఁ "బఠింప నశక్య" మంచు నొ,య్యా సపులకాంగ
కంబుల నఖాంకలిపిన్ లిఖితంబు లయ్యు నా, రసినను ప్రస్ఫుటార్థ మయి రాజిలు మన్మథ
లేఖలన్ బ్రియం, బెసఁగ ఘటించుకొందు రితరేతరమున్ బ్రియులున్ బ్రియల్ దగన్.— అని
రచింపఁ దగియున్నమ మహాదేవకవి సందేహము లేకుండునట్లు

సీ. తునిసిన చిగురాకులను లిఖించినఁ బఠింపఁగ నసాధ్యమ్ములై పరఁగు ననియుఁ
గేవలమ్మును బులకించిన యంగక, మందఁ గూర్పఁగ ననువౌ నటంచుఁ
గ్రొవ్వాఁడి గోళ్ల నొక్కులె యక్కరములుగా, బమ్మెరగొన వ్రాయఁబడిన వయ్యు
నారసి నంతన యాకళింపఁగ వ్యక్త, మగునట్టి యర్థము అమరు ననియు
నైన మన్మథలేఖ లేయాఁక లేక, యమ్మహీధర వనుల విహారకేళి
వశత నెసలారు యువతీ యువకులచేతఁ బ్రణిహితము లయ్యె నితరేతరమును ప్రీతి.

అని తెనుఁగుఁదనము మెఱయ ననువదించుట మెచ్చఁ దగినది.

ఈరీతిగాఁ బుష్పాపచయకేళియందు రాసిక్యము బహుముఖముల వెల్లడియగు నట్లు వర్ణించి, జలక్రీడకు వారి నందఱ నభిముఖులఁ జేసెను. వారు జలక్రీడకు నెండలో వచ్చునపుడు సూర్యకిరణ స్పర్శము విచిత్రముగా వర్ణింపఁబడెను. జలపక్షులను గాని పద్మ కువలయాది జలపుష్పములను గాని వర్ణించునపుడు ప్రకృత యాదవకాంతల విలాసము లావణ్యమును విడిచి లేనే లేవు. పిదప జలకేళి యారంభమున

ఆ. చలికిఁదలఁకి కలికి సరసియొడ్డునఁ గూరు, చుండు టరసి నవ్వు చువిదఁకరయు:
గము విదల్చి పిలసనముఁ గనువాంఛ మృగండు నీట నిలిచి యుండి తడిపె.

ఈపద్యము తెనుఁగుననే తొలుత మొలచినట్లు లేదా? అనువాదమున కీపద్యము మచ్చుతునుక యనవచ్చును. రమ్యమైన భావముతోఁ బ్రసాద గుణభరితమై ద్రాక్షాపాకమున మిలమిలలాడి పోవుచున్నది.

పిదప మగువలు సరసిలో దిగునప్పటి శృంగారచేష్టలును, వారివారి ప్రియులతో సరిసమానముగా జలయంత్రములు పూని యుదకములతోఁ జల్లులాటయును మనోహరముగా వర్ణింపఁబడినది.

మహాదేవకవి మూలమందలి యెట్టి పశిష్టవ్యాకరణ ప్రయోగము నైనను నచ్చతెలుఁగు పదములతోఁ దెలుపఁ గుతూహలి యయ్యు నీక్రిందిపద్యమందలి "అస్మాక, అనపాయిని" యను శబ్దములను మూలమునుండి గ్రహింపవమానలేఁ డయ్యెను.

"అస్మాకీ యువతిదృశా మసౌ తనోతి, చ్ఛాయైవ శ్రియ మనపాయినీం కి మేభిః"
ఇత్యాది మూలశ్లోకమునకు

క. యువతుల చూడ్కులఁ కనప్పాయి విభాపాదకము లయ్యు, నిదె యా స్మాక
చ్ఛవు లవి స్వగుణము గప్పిన,రవరవ మనుఁగాటుకలఁ గరంచె జలంబుల్.

అని యాంధ్రీకరణము. మూలమున స్త్రీలింగము లగు ఛాయా, శ్రీశబ్దములకు విశేష ణములు గావునను వ్యస్తములు గావునను వానికి విశేషణములగు 'అస్మాక, అనపాయి'

శబ్దములు ఈకారాంత స్త్రీలింగములై "ఆస్మాకీ, అనపాయినీ" అను రూపము లొందినవి. తెలుఁగున నా రెండుతావులందును గర్మధారయముగాఁ జూపనెంచ--- ఆస్మాకీ చ సా విభా-- అనపాయినీ చ సా ఛవిః-- అను విగ్రహవాక్యములను బట్టి "పుంవ త్కర్మధారయ జాతీయ దేశీయేషు" అను పాణినీయముచే ఆరెండువిశేషణములను పుంవద్భావము నొంది 'ఆస్మాకచ్ఛవి' యని "అనపాయివిభా" అని యగు నని యావ్యాకరణవిశేషము చూప నెంచి మహాదేవకవి కర్మధారయ సమాసముగాఁ బ్రయోగించెను. ఇట్టి విశిష్ట ప్రయోగము లందందు లేకపోలేదు.

మాఘునకు వక్రోక్తియే కావ్యజీవిత మనిన కుంతకుఁడు గురు వేమో యనిపించును. జలకేళి మాని సరసినుండి తడియాఱని యంగకములతో తీరమునకు వచ్చిన కాంతలఁ గూర్చి

గీ. బొట్టునీరు లేఁగెఁ బోయెను బూలదండ, లంబరము కాపులను బాసె, నంగరాగ
మరిగె స్వేదిలంబు వోయిన యార్తినిబలె, జారుతర రూపలుగ జేసె స్మరుఁడు స్త్రీల.

గీ. అంబుసేచన జాత శీతార్తిని బలె, శీతపవన కంపిత మౌచు నూతనాంశు
కమ్ము నవయౌవనోష్మ కర్కశము లైన, కామినీకుచతటములఁ గౌఁగిలించె.

గీ. అంగముల నంటఁ దమ్మంటినట్టి లవణి, మంబు రూ పొంది నట్టుల యంబు లురల
నలపై నాడనేర్చిన వలువకొంగు, లడర జెలిపిందు బ్రియులతో వెడలె సరసి.

ఇందు మొదటిపద్యమున తిలక, కుసుమమాలి, కాంగరాగములు స్నానముచేఁ బోయినను కట్టుపుట్టముల కావిరంగు జలసంపర్కమున దిగిపోయినను, దేహగతమగు కామవిలాసములచే మగల మనసుల నాకర్షించుచున్నా రని భావము. రెండవ పద్యమున తడిసిన కట్టుబట్ట చల్లగాలికిఁ గదలుచుండ స్త్రీలు తమకుచములు కప్పువడునట్లు వయ్యెదగాఁ దాల్చి రని భావము. మూఁడవపద్యమున తడిసిన వగుటచే నంగముల నంటి నీటిబిందువులు రాలుచుండగాఁ నీటిపైఁ దేలియాడు కొంగులు గల కట్టుపుట్టములతో వనితలు తమ ప్రియులతో సరసులనుండి వెడలి వచ్చిరని భావము, ఈమూడువిధము లగు భావములకును మూఁడు విధములగు విచిత్ర కల్పనలు.

సరసిలో దిగిరి. క్రీడించిరి. ఒడ్డునకు వచ్చిరి. అని మూఁడు వాక్యములలోఁ జెప్పఁ దగిన విషయమున కీకల్పనము ఈవక్రోక్తి యెందులకు? అనెడు రసికుల కిది విసువు పుట్టింప వచ్చును. కాని భావుకుల క ట్లుండదు కావుననే మహాకవు లిట్టి వక్రోక్తి మానఁజాలరు,

అది య టుండుగాక. పిదప సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనములు. నాయికల యలంకరణ వర్ణనము. ఆవర్ణనమున వాసకసజ్జికా నాయికల వైవిధ్యము తెలుపఁబడినది. "ప్రియాగమవేళ గృహముఁ దనువు, సవరించు నింతి వాసకసజ్జ..." అని శృంగార నాయిక లలో నొకనాయిక.

ఉత్సాహ :- ప్రియుఁడు గీము చేరు నని యెఱింగి మేటి జాణలే
యయినఁ జారునేత్ర లలరులందుఁ బూఁతలందు మే
లయిన చేలలందు "నిదియె యదియె యోగ్య" మంచు ని
శ్చయము చేయఁజాల రవియు జానుమీఱి యొప్పినన్. (9-50)

గీ. అతివ కౌఁగిలిసుఖమున కంతరమ్ము, గలుగు నను భీతిచే మెయిగంధ మలఁద
దనవలేపనమే దేహమునకుఁదగున్కు గరము నిజహృదయేశు సంగమములందు. (9-51)

గీ. ఆస్యకమలోద్గత మ్మగు ననిలములను, నాసికారంధ్రమునఁ జొరన్ దనదు పాణి
పల్లవతలంబునను వీచి భామ మోము, తావి గుర్తించి మెల్ల సంతసము గాంచె (9-52)

ఇట్లు స్వభావసిద్ధమును నౌచిత్యపూర్ణము నగు నీభావము తెనుఁగు పద్యమున మిగుల మంజులముగా మెఱయుచున్నది.

పిదప నొక కలహాంతరిత – (అల్క నధిపుఁ దెగడి, యనుశయముఁ జెందు సతి యన్న మాట) పశ్చాత్తప్తయై దూతిని నాయకునికడ కంపుచు– ననుఁ జుల్కన సేయని గతి, మన మున దయఁ జూచు రీతిని మానిని! ప్రియుచెంతను జేరి కుశల మడుగుము, మఱియుఁ దప్పు చేసిన ప్రియు ననాదరము చేసిన యిట్టినేనె యాతనిని విడువలేక వెడలితినా, "ఇంతేని యభిమాన మొదవని దానవే నీవు" అని యందు వేమొ? "పొలఁతీ నాథుఁ దిరస్కరించి యటుపైఁ బూవంగ లేనైతిగా యలుకన్ ధైర్యముతోడ నాతనిపయిన్ హా" యన్న నీతోడనే పలుకన్ నావిధి యెందుసం గలదొకో పద్మాక్షిరో! సాహసంబులుసో, దానను నేను నీతెగువఁ జేయంజాల విక్కంబుగన్" అను మాటలవలన నాయిక తనచెలికత్తె బోధించిన విధమున నాయకునిపై మానము వహింపఁజాలక, యాతఁడు వెడలి పోయిన పిదపఁ బశ్చాత్తాపము నొందు చున్న దని తెలియుచున్నది అంతియ కాదు. వానికడ కేఁగి తప్పులు పట్టకమ్మ యతని నేరంబు లనుమన మరయకుంటి మంచు నిశ్చయ మొనరించి దూతి నంపిన దఁట.

'విరహోత్క' యైన నాయికయొక్క దూతి యొకతె, నాయకుని జేరి నాయికయొక్క విరహవేదన నిట్లు చెప్పుచున్నది.

"ఎవఁడు మద్రూపకీర్తి హరించె నతని, యెడఁ బ్రసన్నత వహియించు నిది" యటంచు, నీయెడల నీను చేఁబలె నీరజాక్షి, నక్కటా! మారుఁ డదయుఁడై స్రుక్కఁజేసె, అకట యిందీవరాక్షి కోణాధరంబు, కరము వెచ్చని యూర్పులఁ గంది యిగుర, నపుడ వేసిన తమలంపుటాకు కెంపు, రసము వసమర్థమై పోయె ద్రవము గూర్ప, మఱియు-ఎంత పదనైన వో తావి కంతుశరము! అంతరము లేక కర్కశ మగు పయోధ, రములమండల మావరణముగ దాఁగి, వర్ది చెలి మానసంబు చెండాడివైచె. చెడును విష మయి విపరీతసేవవలన, నమృత మైనను సర్వమ్ము ననుట తెల్లము, అమృతజనితంబ యైన హిమాంశు వెల్గు, అతివ దహియించు విరహమునఁ గదఁగి' అవి. సంస్కృతమందు గాఢ పాకమున గూఢభావనిబిడ మగు మాఘకవి వాక్కును మహాదేవకవి తేటతెల్లమగు తెలుఁగుపలుకులలో నన్వయక్లేశ మెంతయు లేవిధతి విస్పష్టముగాఁ బలికెను.

నవోఢ యనఁ గ్రొత్త పెండ్లికూఁతురన్నమాట. సామాన్యముగా నది ముగ్ధ యయియే యుండును. ఆమె మౌగ్ధ్య మీక్రింది పద్యమునఁ జూడఁదగును.

గీ. తనదు వెనుకనుండి దయితుని గురుబింబ, మంతరమునఁ దాల్చు నద్ద మధిక
భరముగల్గి మిగులవడఁకు నవోఢ క, రానమండి యెట్లయైనఁ బడదు".

ఒకబాల యద్దమున తనరూపు చూచుకొనుచుండ వెనుకవైపున నాయకుఁడు వచ్చి నిలుచుండెను. అంత నతని ప్రతిబింబము బాల కభిముఖముగా నద్దమునందుఁ గనఁబడఁగా భయకంపములను బొందినది. కాని చేతినుండి యద్దము మాత్రము జాఱలేదు. అద్దములోని ప్రియుని చాయ గురుబింబమగుటచే (అవదమునకు పెద్దనీడ యనియు పూజ్యమైన నీడయనియు

నర్థము లగుటచే) భర్తయం దామెకుఁ గల పూజ్యభావమున చేతులు వణఁకుచున్నను, అర్ధము బరువెక్కినను ఆమె యాయర్ధమును విడువలేదు అని భావము. ఆంధ్రీకరణము మూలము నకుఁ బ్రతిబింబముగానే యున్నది. కాని యందలిసొగ సేమియు దిగజాఱలేదు. ఈభావము నవోఢ యొక్క ముగ్ధాత్వమును జెప్పక చెప్పుచున్నది.

ప్రణయమును కోపమును శబల మైనయెడ ప్రణయకోప మగు నను నర్థమును జెప్పకయే ఈక్రింది నాయికానాయకుల చేష్టలచేత ఆపదము వ్యాఖ్యానింపఁబడిన సొగసు గాంచఁదగును.

గీ॥ వెలఁది యీసునఁ బతిని మున్ వెడలఁగొట్టెఁ, గదలి వాఁడేఁగుచోఁ గృతకముగఁ దుమ్మెఁ.
దాని కలరూ పెటింగి యాతఁడును నిలిచె, నపశకునశంక వగచుచు నాఁగినట్లు.

పతి చేసిన తప్పిదమునకు నాయిక యీర్ష్య నొంది వానిని వెడలఁగొట్టినది. అతఁడు వెడలు చుండఁగా రానితుమ్ము తుమ్మినది. వరుఁడును "అది దొంగతుమ్ము" అని గ్రహించియు, అపశకున శంకచేత వెడలకున్నట్లు వెడలక నిలిచెనఁట. ఎంత సుకుమారమైన కోప ప్రసాద ములు! ఈభావము కంచెను మహాదేవకవి రచన యెంతయో ప్రసన్నముగ నున్నది.

మధుపాన వర్ణనము :— మద మనెడి సంచారిభావ ద్యోతనార్థము కవులు కావ్యములం దీమధుపానవర్ణన మొనర్చుచుందురు. "మదము మదిరాదికృత సమ్మదమోహ వ్యతికరంబు" అని నరసభూపాలీయము. మద్యా ద్యుపయోగజన్మా ఉల్లాసాఖ్యః శయన, హసితాదిహేతు, శ్చిత్తవృత్తి విశేషో మదః ("మద్యపానాదులవలనఁ గలుగునదియు, శయన హసితాదులను గలిగించునదియు నగు నుల్లాసరూప మగు చిత్తవృత్తి విశేషము") అని యొకరును, "సంమో హానందసందోహో మదో మద్యోపయోగజః" (మద్యమును సేవించుటచేఁ గలుగు సంమో హానందముల కలయికయే మదము) అని యొకరును జెప్పుచున్నారు.

ఇందు మదకరమగు నీమద్యపానము 33 పద్యములలో వర్ణింపఁ బడినది. మధుపానము వలని మదము (క్షైవ్యము)చే నాయికలకు నాయకులయెడఁ గలుగు సందేహములును, కోపము లును తొలఁగిపోయి ప్రేమమున నుభయులును సుఖింతు రనుభావ మీక్రింది పద్యమున ప్రస్ఫుట మగుచున్నది.

ఉ. లాలనసేసి సంధియములన్ దగ మానిచి చెప్ప వాల్ప కా
కాలములోనఁ గోపము వికావికలై చనఁ దోలి యాకృతిన్
దాలిచినట్టి ప్రేమఁ గడుఁ ద్రావఁగఁజేసిరి మద్యసారమున్
గ్రోలు నెపంబు వెట్టి తమకొమ్మలఁ దప్పికదీఱఁ గాముకుల్. (10-2)

ఆమధువు గ్రోలునప్పటి ప్రేయసీప్రియుల విలాసములు పరిపరివిధముల నుండు నని కవులు వర్ణింతురు.

గీ॥ ప్రియతమా దత్త మద్యమ్ము ప్రీతిఁ గ్రోలు, ప్రియున కెంతయు రసవంత మయి రహించు టరుదె?....

ప్రియురాలు కొంచెము త్రావి ప్రియున కిచ్చినమద్య మెంతయు రసవంతముగా నున్నదఁట. చేతితో నిచ్చినమాత్రనే యంత రుచ్య మయ్యెనే? ముఖముతో నిచ్చినఁ జెప్పున దేమి యన్నట్లు

ఉ. ఏయది మున్ను త్రావినదియేనియు నామధువే యపూర్వమో
కాయమువోలెఁ గ్రొత్తరుచి దాల్చి ప్రియున్ దనియించె నంతటన్

ప్రియపై గోపులవేళఁ బెదవిన్ జనియించిన తీపి దావిలోఁ
బాయక లీనమై కలయఁబాఱుట యెన్నఁగ ముఖ్యహేతు వౌ. (10-7)

అను పద్యమున విశదీకరింపఁబడినది. మూలమునకు వన్నెవెట్టిన యనువాదమును, అనువాదమునకుఁ దోవఁజూపిన మూలమును పరస్పర భూష్యభూషణములై మెఱయుచున్నవి.

క్రమముగా మదము (కైపు) హెచ్చి ధాతువునం దణఁగియున్న యర్థవిశేషములను నుపసర్గము బయలుపఱచునట్లు కామినుల యంగములం దణఁగి యుండిన విలాసములను బయలుపఱచెను. అది వ్యాకరణ శాస్త్రరహస్యము మూలానుసార మాంధ్రీకృతమై యెంతయు మనోహరముగా నున్నది.

క. ధాతు నిలీనార్థములకు, ద్యోతక ముపసర్గ మైనయోజ వధూటీ
గాత్రాంగ లీన లీలా, ద్యోతక మయి మధుమదంబు దోఁచెన్ బెలుచన్.

అను పద్యమువలన మహాదేవకవికిఁ గల శబ్దశాస్త్రపరిచితి ప్రకటమగుచున్నది.

మధుపానానంతర మది మదముచే నితరకామినులవలెఁ బూర్ణముగా సిగ్గును వదలలేక యొక ముగ్ధ తల వంచియే కనుఱెప్పలు మాత్రము కొంచె మెగనెత్తి పతిముఖమును జూచుచుండె నఁట.

ఈరీతిగాఁ గొందఱు నాయికలకు సిగ్గు పోవుచుండఁ గొందఱను వదలలే దనినట్లు వర్ణింపఁబడెను. మఱియు వశిపరించు కాంతలకును, పొలయలుక గన్న కామినులకును పానము సహాయకారి యయ్యెనఁట. అట్లే

చ. "అలుకను మాన్పఁజాలి రతి కాస జనింపఁగఁజేసి, సోగక
న్నులకును రాగసంపదల మాల్కొనఁ జూపుచు, వేగవేగ స
ల్లలితము గాఁగ మానసములన్ గరఁగించి నిజాధినాథులం
బలె మదిరామదం బసితవారిజనేత్రల కయ్యె నయ్యెడన్".

అని మధుపాన ప్రసంగము పూర్తియైన పిదప.

## సురత వర్ణనము

సురతలీలఁ జెప్పఁ దలఁచి ముందుగా బాహ్యరతి విషయము లైన వివిధములగు కౌఁగిళ్లు, చుంబనములు, అధరపానము, కుచగ్రహణము, వస్త్రస్రంసనము మున్నగు చేష్టలు వర్ణితము లయ్యెను. పిదప అభ్యంతర సురతక్రియ అగు పురుషాయిత, మణితాది వివిధ క్రియలు వర్ణితము లయ్యెను.

మత్తకోకిల. జారివల్కులు సీత్కృతంబులు "జాలు న" న్గను పల్కులున్
మేలు దెల్పెడి మాత్తులున్ రతి మీఱు పావురపల్కులున్
తీఁగ బేరులు కొమ్మ లోఁగిఁ జెలింప మ్రోసెడి మ్రోఁతలున్
బాల కయ్యెను గామసూత్రపు భవ్యలక్ష్యము లయ్యెడన్.

అని యిట్లు కామశాస్త్రగత సూత్రములకు లక్ష్యములుగా మాఘమహాకవి వర్ణించిన శృంగార విలాసము లన్నియు మహాదేవకవి ప్రతిభావిశేషమున గ్రహించి, తన యనువాదమున ప్రతిఫలింపఁజేసెను.

పిదప సురతవేగ సూచకముగా చెదరిన వస్త్ర మాల్యాభరణాదులు సురతావసానమున

లజ్జాభరమువలనఁ గలుగు విభ్రమములు, నఖక్షత దంతక్ష తాంకములును వర్ణితము లైనను బునారతమును, రాత్రి యెల్ల జాగరణమును గూడ వర్ణించి కాని కవి యూఱట నందలేదు.

చ. బడలిక దీఱఁగాఁ బ్రథమ భావజకేఁ ళ్యవసాన మైన య
య్యెడలఁ బ్రియుల్ తమిన్ సతుల కిచ్చెడు బిగ్గకవుంగిలింతలే
పడఁతుల కాత్మలందు సుమబాణవికారము రేఁచిపెట్టి దం
దడిగ ద్వితీయ మైన సురతంబునకున్ మొద లయ్యె వెండియున్. (10-88)

మ. మివులన్ లేఁతచివుళ్లతో విరులతో మెత్తందనం బొప్పి మే
లవుసెజ్జల్ విలసిల్లుచున్న నెడ మావంతేని లేకుండఁ గ్రొం
బువువిల్కాని దురంబునన్ గెరలు పువ్వుంబోండ్ల కాళయ్యలం
దవురా! యొక్క-క్షణంబునున్ క్షణద తానై పండుకో నీ దయో! (10-89)

అని వీరరసమున కంగమైన శృంగార మిట్లు సాంగోపాంగముగా వర్ణింపఁబడిన యీ మహాకావ్యమువంటి దింకొకటి లే దేమో యనిపించుచున్నది. కావుననే మల్లినాథసూరి క్షుభ్య ద్భావతరంగిత మగు రససుధాపూరముగా నీకావ్యమును బేర్కొనెను.

తక్కిన యంగరసములైన హాస్య, రౌద్ర, బీభ, త్సాద్భుత, భయాన కాదు లగు రసములు స్పృశింపఁబడినవే. కాని యింత విపులముగా విభా, వానుభావ, సాత్విక, వ్యభిచా ర్యాదులు పరిపూర్ణముగాఁ జెప్పఁబడినాట్లు కన్పట్టదు.

హా స్య ము.

చ. వింతగ నవ్వి రొక్కవతి ప్రేక్షకు లెల్లఁ గరేణు భీతయై
గంతులు వైచుచున్ బఱచు గర్దభి వీఁపున జీనువాసి, యొ
క్కింతిపురంపు టింతి గళితాంబర మైన నితంబబింబ మొ
క్కింతయు మాటికో నెఱుఁగకే యిలఁ గూలుట గాంచి యెంతయున్. (7-7)

యాదవసేనల ప్రయాణమున నొక యంతఃపురకాంత యొక యాఁడుకంచరగాడిద నెక్కి బయలుదేఱఁగా అగర్దభి యేనుఁగునకు భయపడి గంతులు వేయుచుఁ బరుగెత్తఁగా, దాని వీఁపున నున్న యాకాంత పిఱుఁదులనుండి జాఱిన కట్టుబట్టను సవరించుకొననైనను లేక దిస్సమొలతోఁ గ్రిందఁ బడఁగా నామెను జూచిన వా రెల్ల గొల్లుమని నవ్విరఁట. ఈహాస్యము కొంచెముగా నవధులు దాఁటిన దనిపించుచున్నది.

రౌ ద్ర ర స ము.

ధర్మజుని యాగమున శ్రీకృష్ణున కర్ఘ్య మి మ్మన్న భీష్ముని, కృష్ణుని శిశుపాలుఁడు నిందింప విని భీష్ముఁడు

ఉ. ఈసభ నచ్యుతార్చనము నేను విధించుట కెవ్వఁ డోర్వలేఁ
డాసభికుండు వింట గొనయమ్ముసు నెక్కిడి డాయ రావలెన్
రోసము పీస మున్న-మదరుల్ తలఁగాచికొనుండు నేలపై
వేసిన యీమదంఘ్రి నిదె పెట్టెద నౌదల నింద డారయన్.

అని పల్కినపల్కులందును, అపల్కుల కులికిన శిశుపాలపక్షపు రాజులచేష్టలందును శిశు పాలుని దూత కృష్ణుఁడున్న సభకు వచ్చి భీష్ముని గృష్ణుని నిందింప వినిన పాండవపక్షపు రాజులయు కృష్ణునిపక్షపురాజుల చేష్టలందును రౌద్రము మూర్తమైనట్లు వర్ణింపఁబడినది.

కరుణరస మొక్కటిదక్క, బీభత్సాద్భుత భయానక రసములు యుద్ధరంగమున విపుల ముగా వర్ణింపఁబడినవి. శాంతమును రసమే యను పక్షమున ప్రథము సర్గమునందు వర్ణింపఁ బడిన నారదుని యాకారమందు వ్యక్త మగుచున్నది. కావుననే శిశుపాలవధ కావ్యము రస సుధాపూర మైనది.

గు ణ ము లు.

ఇందు ఓజస్సు నామమాత్రము గాని ప్రసాద మాధుర్యము లను రెండు గుణములు పరిపూర్ణములు.

రీతులఁ బరికింప గౌడీరీతి దక్కఁ దక్కిన పాంచాలియు నన్నిటిని మించి వైదర్భియు సర్వత్ర గనఁబడును. గ్రంథవిస్తరభీతిచే వానిని బరికించుభారము పాఠకులకే వదలి, ప్రబంధమున కుండవలసిన యష్టాదశవర్ణనలఁ గూర్చి కొంచెము సూచించెదను.

"నగ రార్ణవ శైలర్తు చంద్రా ర్కోదయ వర్ణనైః
ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవైః
విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః
మంత్రద్యూత (దూత్య. పా.) ప్రయా ణాజి నాయ కాభ్యుదయైరపి.
అలంకృత మసంక్షిప్తం రసభావ నిరంతరం
... ... ... ....
కావ్యం కల్పాంతరస్థాయి జాయేత సదలంకృతి
న్యూన మ ప్యత్ర యైః కైశ్చి దంగైః కావ్యం న దుష్యతి".

అని కావ్యాదర్శమున దండ్యాచార్యుఁడు చెప్పిన కావ్యవర్ణనములలో వివాహ కుమారోదయ వర్ణనములవంటి వేయొకటి రెండో తక్కఁ దక్కిన యావద్వర్ణనలతో నీమాఘకావ్యము నిండి యున్నది.

అట్టికావ్యము నంతయు యథామూలముగా నాంధ్రీకరింపఁ బూని కృతార్థత గన్న మహాదేవామాత్యుని ప్రతిభా వ్యుత్పత్తులఁ గూర్చి యెంత వ్రాసినను బూర్ణము కా దని యం దందు సూచించి యున్నాను. ఛందోవిషయమునను సంస్కృతాంధ్ర భాషా విషయము లందును గల విశేషములు భూమికయందు గరిమెళ్ల...శర్మ చూపి యుండుటచే వానిని బున రుక్తముగా నేను జెప్పమానితిని. దైవానుగ్రహమున కీ॥ శే॥ మహాదేవామాత్యుని సూత సంహితయు, చంపూరామాయణమును గూడ నచిరకాలమున ముద్రితమై వెలువడుఁగాక యని నాకోరిక.

మా ఘు ని అ ర్థాం త ర న్యా సా లం కా ర ము.

"ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవమ్,
దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయో గుణాః"

అనెడి సూక్తిచే కాళిదాసువలె ఉపమాలంకారవిశేషమును, భారవివలె నర్థగౌరవమును, దండివలె పదలాలిత్యమును గలుగ మాఘుఁడు కావ్యరచన మొనర్పఁగలఁ డనియే కాని కేవలము అర్థాంతరన్యాసములనే హెచ్చుగాఁ గూర్చ నను వాడుక లేకున్నను ఆధునిక విమర్శకులు కొందఱు మాఘుని యర్థాంతరన్యాసములం దొక ప్రత్యేకత కల దనినారు,

కాని ఆప్రత్యేకత వారు వివరింపలేదు. ఆదృష్టితోఁ బరీక్షించిన నందలి కొంత విశేషమైనను కనబడునుగదా యని యత్నము.

శిశుపాలవధ కావ్యమున మొత్తము 1679 శ్లోకములు గలవు. అందు రమారమి 80 శ్లోకములందు మాత్రము అర్థాంతరన్యాసము కనఁబడును. అంతమాత్రమున నంత ప్రసిద్ధికలుగదు. కాని వానియందు చమత్కారమో లోకజ్ఞతయో లేక రెండునో యుండవలె నని యాశింతము.

తర్క-న్యాయ సిద్ధము అగు నలంకారములలో అర్థాంతరన్యాస మొకటి. సామాన్యముచే విశేషము గాని, విశేషముచే సామాన్యము గాని, కార్యముచే కారణము గాని, కారణముచే కార్యము గాని యెచట సమర్థింపఁబడునో అచట అర్థాంతరన్యాస ముండు నని చతుర్విధముగా లాక్షణికుల విభాషము.

1 ఆశ్వాసము- 14 పద్యము. ఇందు ఆదిపురుషుఁ డగు కృష్ణుఁడు తనయింటికి అతిథియై వచ్చిన నారదుని యథావిధిగా పూజించెను. అనునది ప్రస్తుత మగు నర్థ విశేషము. కృష్ణుఁడు జగదాది పురుషుఁడు. అట్టివాఁడు నారదునివంటి యొకతపస్విని పూజించుట యేమి అను నర్థమునందలి యసంగతిని సమర్థించుటకై- "అందఱుకును బూజ్యు లైన మహానుభావు లెంతయో పుణ్యము చేసికొన్నవారి యిండ్లకుఁ గాని రారు." అను లోకసామాన్య మగు నర్థముచే సమర్థింపఁబడినది. కావున ఈపద్యమున అలంకార మర్థాంతరన్యాసము. లోకమున గృహమునకు వచ్చిన అతిథులను పూజింపవలెను అను సామాన్యవిధి ప్రకారము కృష్ణుఁడు నారదుని పూజించె నని తెలియుచున్నది.

1. ఆ. 17. లో. "వచ్చిన నారదునకు కృష్ణుఁ డర్ఘ్యాదుల నొసఁగి తృప్తిపఱచె" ననునది ప్రస్తుత మగు నర్థము. నారదుని సంతృప్తి కృష్ణున కావశ్యక కృత్యము. మహాత్ముల యాశ యేమన- అర్యజనులను తమవారిగాఁ జేసికొను యత్నమే. అను సామాన్యవాక్యముచే నారదుని పూజ్యభావమును, కృష్ణుని పూజ్య పూజాపరత్వమును వెల్లడి యగుచున్నవి.

1. ఆ. 67. లో:- తన్నుఁ జంపుటకే భగవంతుఁడు రామాకారముతో నరుఁడై పుట్టె నని తెలిసియు, రావణుఁడు సీతను విడనాడ డయ్యెను. ఏ మన లోకములో అభిమానధనులు తాము పట్టినది మంచిదైనను చెడ్డదైనను విడువరు. ఆకారణముచేత సీతను విడువలేదు. అను కార్యము సమర్థింపఁ బడినది. కావున నిందు కారణముచేత కార్యము సమర్థింపఁబడిన యర్థాతరన్యాస విశేషము.

1. ఆ. 72. లో శిశుపాలుఁడు వెనుకటి జన్మములందువలెనే జయేచ్ఛచే లోకుల నిప్పుడును బాధించుచున్నాఁడు. అనునది ప్రకృతార్థము. ప్రాణి యెన్నిజన్మము లెత్తినను ప్రకృతి (అనఁగా స్వభావము) మాత్రము విడువదు. అను లోకసామాన్యార్థముచే సమర్థింపఁ బడెను. కాన నర్థాంతరన్యాసాలంకారము. అం దొకవిశేష మే మన- ప్రాణికి వెనుకటి జన్మమునందలి స్వభావము విడువదు. అను నది ప్రత్యక్షము కాని విషయము. దానికై పతివ్రత జన్మాంతరమునఁగూడ తనపతిలోకములనే పొందు ననెడి శాస్త్రసిద్ధ మగు ప్రసిద్ధోపమానము చెప్పఁబడుటచే నట్లే జన్మాంతరమునను ప్రకృతి ప్రాణిని విడువ దను శాస్త్రప్రత్యక్ష మగు సామాన్యార్థముచే సమర్థింపఁబడినది. కాన అర్థాంతరన్యాసమయ్యెను.

1. ఆ. 73. లో. శిశుపాలుఁడు దైవముచే తిరస్కరించెను. కాన వానిని నీవే యవశ్యము చంపన లెను. అనునది ప్రస్తుత మగు నర్థము. దుష్టవర్తనముచే పాపము పండిన వానిని ఉత్తములగు శూరులు విడువక చంపివేయఁదగుదు రను సామాన్య మగు నర్థముచే ప్రస్తుతార్థము సమర్థింపఁబడెను. కాన అర్థాంతరన్యాసము.

ఇచట నీయలంకారమున, పాపాత్ముఁడు కావున శిశుపాలుఁ డెట్లును చచ్చును. నీవు నిమిత్తమాత్రుఁడ వైననే చాలును. అనుభావమే పైరీతిని చమత్కరింపఁబడినది. కాన అలంకారత్వము కలిగినది.

ఈరీతిగా ఉపమోత్ప్రేక్షాద్యలంకారములు యంతరాంతరములం దీయలంకారము గంభీరార్థముతో చమత్కృతిజనకమై గ్రంథ మంతటను గనఁబడును.

వాని నన్నిటిని వరుసగా వివరింపఁబూనుట గ్రంథవిస్తరహేతు వగు నని వాని వాని సంఖ్యలతో (వ్యాఖ్యయందు మల్లినాథసూరి చెప్పినవాని ననుసరించి) చూపెదను.

(2) ఆశ్వాసము 13, 57, 72-పద్యములలోఁ గలదు (అందు 72లో సామాన్యము విశేషముచే సమర్థింపఁబడినది).
(3) ఆశ్వాసము. 29, 31, 37. (ఇందు 31 లో శ్లేషోత్థాపితము.)
(4) ఆ. 77, 63. (5) ఆ. 6, 14, 19, 27, 41, 42, 44, 47, 56, 57.
(6) ఆ. 43. (7) ఆ. 1, 23, 29, 32, 39, 41, 44, 47.
(8) ఆ. 7, 10, 12, 18, 20, 22, 28, 46, 54, 55, 57, 58, 60.
(9) ఆ. 5, 6, 12, 16, 23, 29, 33, 43, 44, 57, 68.
(10) ఆ. 18, 21, 28, 79.
(11) ఆ. 25, 33, 35, 57, 59, 64. (64. పద్యము మూలమందుఁ గల 'హీ' శబ్దప్రయోగమునకు భోజుఁడు 3 లక్షలు బహూకరించె నఁట.)
(12) ఆ. 32. (13) ఆ. 17. (15) ఆ. 1, 22, 50, 51, 53, 94, 98.
(17) ఆ. 15. (18) ఆ. 22, 63, 65; (19) ఆ. 113.

మొత్తము రమారమి 80-పద్యములం దీయర్థాంతరన్యాసము గనఁబడుచున్నది.

అలంకార నిర్ణయము రత్నపరీక్ష వంటిది. వ్యాకరణముచే శబ్దనిర్ణయము చేసినట్లు, అలంకారశాస్త్రముచే కొన్ని కొన్ని తావులందు "ఇద మిత్థ" మ్మని అలంకారము నిర్ణయించుట కష్ట మగును. మచ్చునకు ఈకావ్యము ప్రథమాశ్వాసము 12 పద్యమునందు "క్రిందికి వచ్చుచున్న రవిరీతి" అను దాని మూలమున 'పతత్పతంగ ప్రతిమః' అని కలదు. మల్లినాథుఁడా శ్లోకవ్యాఖ్యయందు- "పతత్పతంగప్రతిమ ఇత్యత్ర పతంగస్య పతనాసంభవా దియ మభూతోపమేతి ఆచార్య దండి ప్రభృతయో బభణుః, అతఏవ అప్రసిద్ధస్య ఉపమాన త్వాయోగా దుత్ప్రేక్షేత్యాధుని కాలంకారాః" అనెను.

"ఆకాశమునుండి క్రిందపడుచున్న సూర్యునివలె నాకసమునుండి నారదుఁడు భూమికి దిగుచుండెను" అనుటవలన సూర్యపతన మభూతము (ఎన్నఁడును జరుగనిది) కాన "అభూతోపమ" అని ఆచార్య దండి ప్రభృతు లనిరి. అప్రసిద్ధమున కుపమానత్వము కలుగదు. కాన ఉత్ప్రేక్ష యని నవీనాలంకారికు లనిరి. అవి నిర్ధరింపలేక మతద్వయమును చూపి విడిచిపెట్టెను.

మల్లినాథుఁ డిట్టి విచారణ మీకావ్యవ్యాఖ్యయందే కాక యితరగ్రంథముల వ్యాఖ్యలందును చేయవలసివచ్చినది. కావున నీప్రసంగము నింతతో ముగించుచు దిక్ప్రదర్శనముగా నాయొనర్చిన యీసమీక్షయందేవేని లోపము లున్నచో నాసాహసమును మన్నింప సహృదయులగు విద్వత్ప్రకాండుల వేడుచున్నాను.

## స్వ వి ష య ము.

కొత్తపేట వాస్తవ్యులును, సుప్రసిద్ధ హోమ్యోపతి డాక్టరులును మాత్రమే కాక అనేకము లైన హోమ్యోపతి వైద్యగ్రంథములను ఆంగ్లమునుండి సులభ మగు తెలుఁగు భాషలోనికి పరివర్తన మొనర్చి యావదాంధ్రమున ప్రఖ్యాతు లైన నామిత్రులు శ్రీయుత వేమవరపు వేంకట రమణ శర్మగారు, తమ సన్నిహిత బంధువు లగు శ్రీ బుద్ధవరపు మహాదేవ కవిగారు- కవితావిశారద బిరుదాంకితులు- మాఘ మహాకవి కృతమగు సంస్కృత శిశుపాలవధ కావ్యము నాంధ్రీకరించి, ముద్రింప యత్నించుచు కీర్తిశేషు లైనా రనియు, వారి ధర్మపత్ని శ్రీమతి మంగాయమ్మగా రది ముద్రిత మైనచో కనులార చూడఁగోరుచున్నా రనియుఁ, దెలిపి చిత్తుప్రతిగా నున్న యాకావ్యము సరిచూచి పెట్టుఁ డని మైత్రీపురస్సరముగా ఆ భారము నామీఁద మోపినారు. మిత్రుల వాక్యమును త్రోసిపుచ్చ లేక యీ మహాసాహసకృత్యమునకుఁ బూనక తప్పినది కాదు. శ్రీమతి మంగాయమ్మగారి ఆజ్ఞాప్రకారము శ్రీ వేంకటరమణశర్మగారు తమ హానెమాన్ ప్రింటింగ్ ప్రెస్సు నందు మిక్కిలి శ్రద్ధతో గ్రంథ మంతయు ముద్రించి, రూపకల్పనము చేసినట్లే నాచేత సమీక్షను, గరిమెళ్ల అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మచే భూమికను వ్రాయించి, వానికిని రూపకల్పనము చేసినారు.

చిత్తుప్రతి సవరణలోను, ముద్రణకాలమున అచ్చుసవరణలోను, నాకంటెను రాత్రిం దివము శ్రద్ధ వహించి నాబరు వంతయు వహించిన చి॥ గరిమెళ్ల అచ్యుత సత్యశేషగిరిసోమయాజి శర్మ నాకంటె వయసున చిన్నవాఁ డగుటచే నతనిని హృదయపూర్వకముగా ఆశీర్వదించుచు శ్రీ వేంకటరమణ శర్మ గారికిని, శ్రీమతి బుద్ధవరపు మంగాయమ్మ గారికిని, వారి వారి పుత్ర పుత్రికా పరంపరకును నిరంతర శుభాభ్యుదయములు గలుగున ట్లాశాసించుచున్నాను.

ఇట్లు
విద్వజ్జన విధేయుఁడు,
వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి.

కొమానపల్లి,
కోనసీమ,
28—1—1974.



# భూ మి క

శ్రీ రా మ చ న్ద్రా య న మః

కం. శ్రీమహిళావరు హరు నజు
ద్వైమాతురుఁ గొలిచి బుధ కవరకవ్యాంధ్ర
శ్రీమాఘకావ్యమునకున్
భూమిక రచియింతు సుకవి బుధజన కరుణన్.

కం. "హాటకగర్భ వధూటీ, లాటన చలితాంఘ్రి నూపు-రారావశ్రీ
పాటచ్చరములు తేనియ, తేటలు మాకూచిమంచి తిమ్మయ మాటల్".

అని సమకాలికకవులచే మన్ననలు వడసి వాసవదత్తాపరిణయము, సేతుఖండము, గౌరీకల్యాణము మొదలగు కృతులు రచించిన వక్కలంక వీరభద్రకవికి సహపాఠియై దెందులూరి లింగనారాధ్యులవద్ద సకలవిద్యలను గఱచి, పరసకవితాసామ్రాజ్య పట్టభద్రుఁడై (1) రుక్మిణీ పరిణయము, (2) రాజశేఖరవిలాసము, (3) సింహాచల మహాత్మ్యము, (4) సర్పపుర మహాత్మ్యము, (5) శివలీలావిలాసము, (6) రసికజనమనోభిరామము, (7) సారంగధర చరిత్రము, (8) సాగరసంగమహాత్మ్యము, (9) కుక్కుటేశ్వరశతకము, (10) సర్వలక్షణసారసంగ్రహము, (11) అచ్చతెలుఁగు రామాయణము, (12) అచ్చతెనుఁగు నీలాసుందరీ పరిణయము మొదలగు మ్నగునుగుణ ప్రబంధములను రచించి, తనకృతులను జీవితమును పీఠికాపుర కుక్కుటేశ్వర వకే యంకితము గావించి, యప్పటి పిఠాపురప్రభువగు రావునీలాద్రి మాధవనృపాలునిచేఁ బూజితుఁడై "కవిసార్వభౌమ" బిరుదము నంది, చరమదశలో సన్న్యసించి కుక్కుటేశ్వర స్వామి సన్నిధిలో శివసాయుజ్యమొందిన కూచిమంచి తిమ్మకవి పేరెఱుంగనివా రాంధ్రభాషా పరిచితులలో నరుదు. ఆమహానుభావుఁ డేశుభముహూర్తమునఁ దనకృతులకు శ్రీకారము చుట్టినాఁడో గాని వారివంశమున నేఁటికిని కవితానర్తకి నృత్యమొనర్చుచునే యున్నది.

## -: కూచిమంచి కవి పరంపర :-

ఈకవి తమ్ముఁడగు కూచిమంచి జగ్గకవి సుభద్రాపరిణయము, జానకీపరిణయము, సోమదేవరాజీయము, ద్వివదరాధాకృష్ణ చరిత్రము, చంద్రరేఖావిలాపము మొదలగు కృతులను రచించినాఁడు. జగ్గకవి మనుమఁడగు కూచిమంచి వేంకటరాయఁడు సుకవిమనోరంజనమను ఛందోలక్షణగ్రంధమును రచించినాఁడు. ఈవంశములోనే కూచిమంచి సోమసుందరకవి జనించినాఁడు. వీరు కౌండిన్యసగోత్రులు. తూర్పుగోదావరి యందలి పలివెల గ్రామము వీరి నివాసభూమి. వీరిపూర్వులలోఁ దిమ్మకవియే కాక, తక్కినవారు గూడ భగవద్భక్తులు, పండితులునై నట్లు

సీ. నిజసుతాయుత భవానీకుఁ డుగ్రజపాల, పేరరా జేవంశ-నిభవకర్త
యసు వసు ధీ శివై-కాప్త కుల్ పేరరాట్, వృథురాజు లేకులా-బ్ధిని జనించి

రష్టది జ్ఞానాగ్ర-యాయి సీతారామ, శాస్త్రి యేయన్వయ-జలధిఁ గలిగె
నృపతి సత్కృతి నిరా-దృతి తిమ్మకవిసార్వ, భౌముఁ డేసంతతి-హార్దిఁ బొడమె
తే॥ నే యభిజనాబ్ధి గోపాల-కృష్ణమంత్రి, గలిగె సంతతి విచ్ఛేద-విలయ జలధి
మగ్న గోపాలపుర సుసం-స్థాన భూస, ముద్ధరణ దంష్ట్రిమూర్తి సముజ్జ్వలహరి.

అను కుమారసంభ వావతారికాపద్యములను బట్టి తెలియుచున్నది. కుమారసంభ వావతారికయందు వీరివంశక్రమమి ట్లీయఁబడినది.

కూచిమంచిభైరవార్యునకు సుందరరాముఁడు భూపామాత్యుఁడును జనించిరి. సుందర రామునకు భూపతియు, రాజప్పయు నుదయించిరి. భూపతికి నరరాజు, రామనయుఁ బుట్టిరి. నరరాజునకు సోమన పుట్టెను. సోమనకు సత్యనారాయణ పుట్టెను. రామనకు సుబ్బరాయుఁడు, నరరాజు, భూపతి, నరసామాత్యుఁడు నను నల్వుర పుత్త్రులు గల్గిరి. రాజప్పకు వేంకటరామ దీక్షితుఁడు, పుల్లయామాత్యుఁడు గల్గిరి. వారిలో వేంకటరామదీక్షితునకు రాజప్ప, వీరరాజు జన్మించిరి. రాజప్పకు గోపాలకృష్ణమంత్రి సుతుఁడయ్యెను. వానికి వేంకటరావు పుట్టెను. వీరరాజునకు సూర్యనారాయణ యుదయించెను. పుల్లయామాత్యునకుఁ దనయర్థాంగియగు వెంగమాంబిక యందు సోమసుందరుఁడు జన్మించెను. ఈ సోమసుందరునిగూర్చి కుమార సంభవము నందిట్లు చెప్పఁబడినది.

సీ. తన పథమార్గి తా-ర్థమునఁ గొన్న ధనాంశ, ముల సస్యపూర్తి వి-పులల కొసంగెఁ
దాఁ దరందా రైన-తటి బహుద్విజుల చేల్, మాన్యంపుఁ బట్టాల- మలయఁ జేసెఁ
జేనఁ బెరఁటఁ బండు- శ్రేష్ఠారతతినెల్లఁ, బుడికె నెప్పటికప్పె- భూసురులకుఁ
బ్రస్థానములు మూఁడు- రసనాగ్రి మందుంచి, బ్రహ్మంబు కరబద-రం బొనర్చె
తే. విమలమతి దేశకాలపా-త్రముల నరసి, విధివిహిత సర్వదానముల్- పేర్మి సలిపె
ధరణి నుతి కెక్క- సప్తసం-తతులు నిలిపె, నట్టి కృతిపతి కెవ్వరీ- దఖిల జగతి.
క. చేయని సద్దానము, వి, చ్చేయని తీర్థమ్ము వఠన-సేయని గీర్వా
ణీ యాంధ్రగ్రంథము లే, దా యనఘున కంద్రు తజ్ఞ- లగు విబుధవరుల్.

ఈ సోమసుందరయ్య పండితుఁడు, కవి. శ్రీ కొప్పులింగేశ్వరస్వామి భక్తుఁడు. ఈయిన కవిత్వము ధారాళమై భక్తిరసము పెల్లుబుకుచుండును. ఈయన నాలుగు కృతులు రచించినారు.

-: శ్రీ కొ ప్పు లిం గే శ్వ ర శ త క ము :-

మ. మరుకేశన్ ముసు వేశ్య కిచ్చిన భవ-న్మాల్యంబె పూజారి దా
నరగన్ భూపతి కివ్వ నందొక శిరో-జంబున్నఁ జర్చింపఁగాఁ
బరఁగన్ వాఁడది స్వామిదే యని వచిం-పన్ వాని రక్షింప నీ
శిరమం దప్పుడు కొప్పు దాల్చితటయో- శ్రీ కొప్పులింగేశ్వరా!

మ. అరమేనన్ జవరాలు పెన్నడలలో- నవ్వేలుపుం జాలు వ
ల్వ లహిన్ బెబ్బులితోలు చందురుని న-వ్వంజాలు మైడాలు చే
నరుదౌ ముమ్మొనవాలు వెండిమల చె-ల్వౌ ప్రోలు గ్రాలంగ బల్
సిరి మీఱన్ జగమేలు మేటి దొరవౌ- శ్రీ కొప్పులింగేశ్వరా!

దీనిని బలివెల దేవస్థానము వారు ప్రకటించిరి.

-: భక్తచింతామణి శతకము :-

మ. విలసద్భద్ర తురంగ! రంగదజహద్విజ్ఞాన యోగాతి ని
ర్మల యోగి ప్రియసంగ! సంగర రిపుప్రాణాని లాహార కృ
ద్బలవద్బాణ భుజంగ! జంగమ పురీ దాహ క్రియాచంగ! ప
ల్వల పుర్యంబుజ సంగిభృంగ! శివ! సాంబా! భక్తచింతామణీ.

శా. రిక్తాహారుఁ డొకండు పేర్మి శివరాత్రి న్వేశ్యతోఁ గూడి సం
సక్తిం దత్కుచసీమ నీకు నొకపుష్పం బుంచి యర్చించినన్
రక్తిం బ్రోచితి వౌర భక్తసులభ ప్రఖ్యాతి నీయందె సు
వ్యక్తంబైనది గాని లేదెచట సాంబా భక్తచింతామణీ.

దీనిని వావిళ్ళవారు ప్రకటించిరి.

-: శ్రీ కొప్పులింగేశ్వర దండకము :-

ఇందు వేశ్యా నిర్ముక్తమగు మాల్యముచేఁ బూజించిన పూజారిని రక్షించుటకు శివుఁడు కొప్పును దాల్చిన కథ హృద్యముగా వర్ణింపఁ బడినది. ఇది యీ గ్రంథాంతమునఁ జేర్పఁబడినది.

-: శ్రీమదుమా కొప్పులింగేశ్వర కీర్తనలు :-

భక్తిని వేదాంతమును బోధించుచుఁ గొప్పులింగనిపై వ్రాయబడిన 108 కీర్తనల గ్రంథము.

17 వ కీర్తన.

1. శివయోగము దాఁ జేసిన వానికి। వివిధ కర్మములు వెయ్యేలా?
భవహర యనుచును బలికిన వానికిఁ। బరనిష్ఠలతోఁ బనియేలా? ॥శివ॥
2. క్షితిఁ దలిదండ్రుల సేవఁ జేసినను। నితర సురార్చన లిఁకనేలా?
పతి దైవంబని భావించిన సతి। కితరవ్రతంబుల కత లేలా? ॥శివ॥
3. అరయఁగ నమృతం బానిన వానికిఁ బరిపరి మందుల పనియేలా?
పరతత్త్వార్థం బెఱిఁగిన జ్ఞానికి మఱి కర్మారంభము లేలా? ॥శివ॥
4. ప్రీతిగ శివు నర్చించిన వానికి ఖ్యాతపదవు లడుగఁగ నేలా?
చేతిలోన నవనీతము పెట్టుక నేతికొఱకుఁ జింతిల నేలా? ॥శివ॥
5. ఇలను గొప్పు లింగేశుని భక్తిని గొలిచిన సిరులకుఁ గొదువేలా?
తలఁపున సుందరదాస రక్షకుఁడు గలిగిన బలు భాగ్యము లేలా? ॥శివ॥

కీర్తన—95. తోడిరాగము. (మంగళహారతి).

పార్వతీ మనోహరాయ బాలచన్ద్ర శేఖరాయ, సర్వలోక వన్దితాయ జయ సుమఙ్గళమ్.
భానుకోటి భాస్వరాయ పాలి తేన్ద్రిరేశ్వరాయ, దీనలోక బాన్ధవాయ దివ్య మఙ్గళమ్. ॥పార్వతీ॥
కాలగర్వ భఞ్జనాయ కలిజనైక రక్షణాయ, నీలనీల కన్ధరాయ నిత్య మఙ్గళమ్ ॥పార్వతీ॥
ఆగమాన్త సంస్తుతాయ యోగిహృదయసంస్థితాయ, భోగిరాజ కఙ్కణాయ భూరి మఙ్గళమ్॥పా.
వినతభక్త రక్షణాయ విమతదైత్య శిక్షకాయ, మనసిజాఙ్గ దాహకాయ మహిత మఙ్గళమ్॥పా॥
అమల కొప్పులిఙ్గ నామ సుమహితాయ పలివెలపుర, విమలదివ్య మన్దిరాయ విజయమఙ్గళమ్॥పా
సోమసున్ద రాన్తరఙ్గ కామితాఖిల ప్రదాయ, శ్రీమదిన్దు శేఖరాయ సిద్ధ మఙ్గళమ్॥ పార్వతీ॥

దీనిని గూడఁ బలివెల దేవస్థానమువారు ప్రకటించిరి.

వీరిశతకములు రామదాసు గారి దాశరథిశతకమును గీర్తనలు రామదాస కీర్తనలను దలఁపునకుఁ దెచ్చును. దాశరథి శతకమును గీర్తనలను రచించి భద్రాద్రిరాముని సేవించి కంచర్లగోపన్న గారు రామదాసులై తరించినట్లే కొప్పులింగేశ్వర, భక్తచింతామణి శతకములు, కొప్పులింగేశ్వర దండకము, కొప్పులింగేశ్వర కీర్తనలు రచించి శ్రీ కొప్పులింగేశ్వర స్వామిని సేవించి సోమసుందరకవిగారు కొప్పులింగేశ్వరదాసులై తరించినారు. సోమసుందరకవి ధర్మపత్ని వేంకమాంబ. ఈ పుణ్యదంపతులకు సాంబశివుఁడు, సదాశివుఁడు, మహాదేవుఁడు నను ముప్వురు పుత్త్రులు జన్మించిరి. వీరిలో సాంబయ్యగారు సాహిత్యనిష్ణాతులు. కవిత్వము నందు సిద్ధహస్తులు. వీరు కాళిదాసమహాకవి రచించిన కుమారసంభవ మహాకావ్యమును యథామాతృకముగా నాంధ్రీకరించిరి. మొదటి యెనిమిది సర్గములు గలపుస్తకము 1926 లోఁ బ్రకటింపఁ బడినది. తక్కిన తొమ్మిది సర్గములు నచ్చు కావలయును. వీరి యనువాదశైలి తెలియుటకుఁ గొన్నిపద్యములు.

శ్లో॥ త్వమేవ హవ్యం హోతాచ, భోజ్యమ్భోక్తా చ శాశ్వతః
వేద్యఞ్చ వేదితా చాఽసి, ధ్యాతా ధ్యేయఞ్చ యత్పరమ్ ॥ (2–15).

క. హోతయు హవ్యము నీవే, జ్ఞాతయు జ్ఞేయంబునున్ స–నాతన విభవా
ధ్యాతయుఁ బరమ ధ్యేయము, నోతండ్రీ నిత్యభోక్త–యును భోజ్యంబున్.

శ్లో॥ ప్రతిగ్రహీతుమ్ ప్రణయిప్రియత్వాత్, త్రిలోచన స్తా ముపచక్రమే చ:
సమ్మోహనం నామ చ పుష్పధన్వా, ధను ష్యమోఘం సమధత్త బాణమ్॥ (3–66).

శా. దానిం గైకొనఁ జూచె భక్తజనవా–త్సల్యంబునన్ శంభుఁ డా
లోనన్ సూనశరుండు వింటఁ దొడిగెన్– లోకత్రయీ జంతు సం
తా నానూన మనోఽబ్ధిలీన ధృతిగో–త్రచ్ఛేద నావంధ్య వి
జ్ఞాన శ్రీజిత వజ్రిశస్త్రిమగు నా– సమ్మోహనాఖ్యాస్త్రమున్.

శ్లో. క్రోధమ్ ప్రభో సంహర సంహరేతి, యావ ద్గిరః ఖే మరుతాం చరన్తి
తావ త్సవహ్ని ర్భవ నేత్ర జన్మా, భస్మావశేష మ్మదనం చకార. (3–72).

శా. ఏలా? మానుము మాను మాగ్రహము స్వా–మీ యంచుఁ బ్రార్థించు వా
క్యాళుల్ దేవముఖోద్గతంబులు దివిన్– వ్యాపించు నాలోన నా
నీలగ్రీవ లలాట దృగ్జనిత వ–హ్నిజ్వాల నాభీలమౌ
లీలం గాలెను దుంటవిల్తుని మొదల్– వే భస్మశేషంబుగన్.

శ్లో. దివం యది ప్రార్థయసే వృథాశ్రమః, పితుః ప్రదేశా స్తవదేవ భూమయః.
అథోపయన్తార మలం సమాధినా, న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్. (5–45).

మ. అమరావాసము గోరుదే నది వృథా–యాసంబు దివ్యప్రదే
శము లౌనే కద నిన్నుగన్న యయ యీ– శైలాన్వయాంభోధిచం
ద్రము చో ట్లల్లనుగాక వేడెదొ వరున్ జాలున్ దపఃక్లేశముల్
నెమకంగాఁ బడుఁగాక తానె మణి యన్వేషించునే యొక్కనిన్.

శ్లో. వధూ ర్ద్విధాత్రా ప్రతినన్ద్యతే స్మ, కల్యాణి వీరప్రసవా భవేతి
వాచస్పతిః సన్నపి సోఽష్టమూర్తా, త్వాశాస్య చిన్తాస్తిమితో బభూవ॥ (7–87).

చ. కనుమ సుమంగలీ సుతు నఖండ పరాక్రమ శాలి నంచు దీ
వన యిడెఁ బెండ్లికూఁతునకు వారిజసంభవుఁ డష్టమూర్తి యం
దునఁ దగఁ జేర్కొనం జను మనోరథ మేమని యంచుఁ జింతలో
మునిఁగి విముగ్ధుఁ డయ్యెను విధుం డతఁ డయ్యెను బల్కఁగల్కికిన్.

శ్లో. ఇతి విషమశరారేః సూనునా జిష్ణునాజౌ, త్రిభువన వరశల్యే ప్రోద్ధృతే దానవేన్ద్రైః।
బలరిపు రథ నాక స్యాధిపత్యమ్ ప్రపద్య, వ్యజయత సురచూడా రత్నఘృష్టాగ్రపాదః॥

మంగళమహాశ్రీవృత్తము :-

ఈ రహిని జిష్ణుఁ డసమేషు హరసూనువరుఁ, దైత్యుల సమిద్ధరణి నెంతే
నీరస జగత్త్రితయ హృద్వికట శల్యు నసు, రేంద్రుఁ బెకలింపఁగ వెసన్ జం
భారి మఱలంగఁ ద్రిదశాలయ విభుత్వ పద, మంది కడు రాజిలె ఆసద్బృం
దారక శిరోమణి వితాన పరిదీప్త పద, తామరస మంగళమహాశ్రీన్.

ఇట్లు మంగళమహాశ్రీతోఁ బ్రబంధమును ముగించినారు. ఇందుఁ బదునాలవ యాశ్వాసమున వివిధవృత్తములను వాడి ఛందశ్శాస్త్ర పాటవమును, నామధాత్వాది ప్రయోగములచే వ్యాకరణపాండిత్యమును బ్రదర్శించినారు. వీరి కనర్ఘరాఘవము, లక్ష్మీసహస్రము వంటి యుత్తమ సాహిత్యగ్రంథములు జిహ్వాగ్రమున నుండెడివని వాడుక. అందువలననే కుమారసంభవము వంటి మహాకావ్యమును సుందరముగాఁ దెనిఁగింపఁ గలిగినారు. ఈ యాంధ్రకుమారసంభవకావ్యము వీరి తండ్రిగారగు సోమసుందరకవిగారి కంకితము గావింపఁ బడినది. ఈ సాంబకవిగారు కొత్తపేఁట, యమలాపురము మొదలగు గ్రామములయందలి యున్నతపాఠశాలలలో నాంధ్రోపాధ్యాయులుగాఁ బనిచేసినారు.

## బుద్ధవరపు మహాదేవకవి.

వీరిలోఁ దృతీయపుత్త్రులగు మహాదేవుఁడు గారే ప్రస్తుత కృతికర్తలు. వీరు స్వస్తిశ్రీ చాంద్రమాన విరోధి నామసంవత్సర చైత్ర బహుళద్వాదశీ శుక్రవారము నాఁడుదయము పూర్వాభాద్రానక్షత్ర ద్వితీయచరణయుక్త మిధునలగ్నమున సూర్యోదయాది ఘ. ౧౦-౧౩. విఘడియల కనఁగా 24-9-1889 నాఁ డుదయము గ. 9-48 నిమిషములకు జన్మించిరి. వీరు న్యాయవిద్య [B. A., B. L.] యందుఁ బట్టభద్రులై న్యాయవాదులుగాఁ బనిచేసిరి. రామచంద్రపుర వాస్తవ్యులగు బుద్ధవరపు లక్ష్మీనరసింహము, శంకరమ్మ (మహాదేవుఁడుగారి సోదరి) దంపతులు వీరినిదత్తపుత్త్రులుగా స్వీకరించిరి. అప్పటినుండియు వీరు బుద్ధవరపు మహాదేవుఁడు గారైనారు.

వీరు బాల్యము నుండియు నాంగ్లవిద్యనే యభ్యసించి, తద్వృత్తియందే నిమగ్నులైనను వంశపారంపర్యముగా వచ్చు కవిత్వవిద్య వీరిని విడనాడలేదు. వీరు సంస్కృతాంధ్ర సాహిత్య గ్రంథములనే గాక, వ్యాకరణము, వేదాంతము మొదలగు శాస్త్రములలోఁ గూడఁ గృతశ్రములైనట్లు వీరి గ్రంథాలయము, వీరు రచించిన కృతులు ఋజువు పఱచుచున్నవి. వీరు (1) శిశుపాలవధము (2) సూతసంహిత (3) చంపూరామాయణము (4) కువలయానందము నను నాల్గుకృతులు రచించిరి. పఠన పాఠనములలో నున్న సంస్కృత పంచకావ్యములలో నొకటియై మాఘకవిచే రచింపఁబడిన శిశుపాలవధమున కాంధ్రానువాదము ప్రస్తుతకావ్యము.

దీనినిగూర్చి తెలుసుకొనుటకు ముందు మూలగ్రంథమును గూర్చియుఁ దత్కర్తయగు మాఘకవిని గూర్చియుఁ దెలుసుకొనుట ముఖ్యము.

## మా ఘుఁ డు.

మాఘుని పితామహుఁడు సుప్రభదేవుఁడు. ఈతఁడు తత్కాలమున ఘూర్జరదేశము (గుజరాతు) ను బరిపాలించిన శ్రీవర్మలు నాస్థానములో నమాత్యపదవి నలంకరించినాఁడు. ఈతని పుత్త్రుఁడు దత్తకుఁడు. ఇతఁడు నిరంతర వితరణ శీలుఁడై సర్వాశ్రయుఁడని పేరొందినాఁడు. ఈ దత్తకుని సుతుఁడగు మాఘుఁడు శిశుపాలవధకర్త. ఈ విషయము మాఘకవి తనకావ్యము చివర నైదుశ్లోకములలో రచించిన కవివంశవర్ణనమును బట్టి తెలియుచున్నది. మాఘకవి చరిత్రము బల్లాలకవి రచించిన భోజచరిత్రము నందు, మేరుతుంగాచార్యుఁడు రచించిన ప్రబంధచింతామణి యందును, ప్రభాచంద్రుఁడు రచించిన ప్రభావక చరితమునందును విపులముగా వర్ణింపఁబడినది.

మాఘుని భార్య భోజునకు శిశుపాలవధకావ్యమును జూపుటయు, నందలి ప్రభాతవర్ణనములో నున్న 'కుముదవనమపశ్రి' (11-64) యను శ్లోకమును జదివి యందలి 'శ్రీ' యను నక్షరప్రయోగమునకు మెచ్చుకొని భోజుఁడామెకు మూఁడులక్షల రూప్యము లొసంగుటయు, దారిలో నాధనమును యాచకుల కామె పంచిపెట్టుటయు, నంత నిర్ధనుఁడైన మాఘుని యొద్ద కర్థులు వచ్చి యతని యవస్థను గాంచి వెడలుటయు, వారిని గాంచి వేదనలేక విలపించి మాఘుఁడు పరలోక గతుఁడగుటయు, భోజుఁ డతనికి నర్మదాతీరమున దహన సంస్కారములు గావించుటయు, మాఘపత్ని పతితో సహగమించుటయు ననునది బల్లాలకవి భోజచరిత్రములోఁ జెప్పఁబడినది.

మేరుతుంగాచార్యుని ప్రబంధచింతామణిలో మాఘుని పాండిత్యము విని భోజరాజు శ్రీమాలానగరము నుండి యాతని రప్పించి తన యాస్థానములో నుంచుకొనుటయు, నచ్చట శీతలబాధ సహింపలేక మాఘుఁడు భోజునిచే ననుజ్ఞాతుఁడై తిరిగి శ్రీమాలానగరమున కేఁగుటయుఁ, గతిపయదినంబుల భోజుఁడు తన మిత్రుని గాంచుటకై శ్రీమాలాపురమున కరుదెంచి మాఘుని వైభవముగాంచి సిగ్గిలి తన పురము చేరుటయు, దత్తకుఁడు తనపుత్త్రుఁడగు మాఘుని జాతకము విని దారిద్ర్యబాధ కలుగకుండ ధనమును భూస్థాపితమొనర్చి మాఘునకొసంగుటయు మాఘుఁడు తన నిరంతరదానధర్మముల వలన నిర్ధనుఁడై ధారానగరమున కేఁగి తన కావ్యమును భోజునకుఁజూపి కొంత ద్రవ్యమును దేవలసినదిగా భోజునొద్దకుఁ దన ధర్మపత్నిని బంపుటయుఁ జెప్పిన పిదపఁ దక్కినకథ భోజచరిత్రములో వలెనే వర్ణింపబడినఁది. ఈ ప్రబంధచింతామణి C. H. Tawney అను పండితునిచే నాంగ్లభాషలోని కనువదింపఁబడి The Asiatic Society, Calcutta వారిచేఁ బ్రకటింపఁబడినది.

ప్రభావకచరితము నందు

శ్లో. నృపః శ్రీవర్మలాతాఖ్యః శత్రుమర్మ భిదా క్షమః
తస్య సుప్రభదేవోఽస్తి మన్త్రీ మితతపాః కిల
తస్య పుత్త్రౌ పుభా వంసా వివ విశ్వమ్భరక్షమౌ
ఆద్యో దత్తః స్ఫురద్వృత్తో ద్వితీయశ్చ శుభఙ్కరః

శ్లో. తస్య శ్రీభోజభూపాల బాలమిత్రం కవీశ్వరః, శ్రీమాఘో నన్దనో బ్రాహ్మీస్యన్దనః శీలచన్దనః
బదంయుగీన లోకస్య సార సారస్వతాయితమ్, శిశుపాలవధం కావ్యమ్ ప్రశస్తిర్యస్యశాశ్వతీ.

మొదలగు శ్లోకములలో మాఘచరిత్రమును ప్రభాచంద్రుఁడు వర్ణించినాఁడు.

మహాదేవుఁడుగారు భోజప్రబంధ, ప్రబంధచింతామణులలో వర్ణింపఁబడిన యితివృత్తమును గైకొని మృదుమధుర భణితిలో రసవత్తరముగా 92 పద్యములలో మాఘచరిత్రమును విస్తరించి సంతరించినారు. అందు భోజచరిత్రములోని యనువాద పద్యములకు మూలశ్లోకములాయాపుటల యధస్సూచికలో నీయఁబడినవి. సుప్రభదేవుని వర్ణించుచు మాఘకవి వంశవర్ణన శ్లోకములనే యనువదించినాఁడు.

"సర్వాధికారీ సుకృతాధికారః" అనునది మూలము. మ. "శుభకార్యవ్రత శీలుఁడ"నునది యనువాదము, 'కాలేమితం తథ్యముదర్కపథ్యమ్'మూలము చ. 'సమయ మెఱింగి' యనువాదము, 'సర్వేణ సర్వాశ్రియ ఇత్యనిన్ద్యమ్' మూలము. మ. 'పితృదత్తంబగు దత్తకాభిధకు' అనువాదము.

ఇందలిమాఘచరిత్రములో మాఘునిజననము. భోజునితో విద్యాభ్యాసము, దత్తకునకు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు మాఘుని జాతకము చెప్పుట, మాఘభోజుల సమాగమము, మాఘునివితరణము మొదలగు ఘట్టములు హృద్యముగా వర్ణింపఁబడినవి. అందు

చ. కటి విటు కాలిపోవ నెటు గల్గను బిచ్చము పెట్టువాఁడు...

శా. పంచ ప్రాణము లారఁ బొం దెచటికో......

అను పద్యములందుఁ గరుణ రసము పెల్లుబుకు చున్నది. మాఘుఁ డింతటి వదాన్యశిఖామణి కాఁబట్టియే తరువాతికవులు దానమున శిబి, కర్ణ, దధీచి, జీమూతవాహనులతోఁ బాటు మాఘుని గూడ నుపమించుచు వచ్చిరి. 'కాశీమజిలీకథలు' పదునాకొండవ భాగము నందలి పాటలీపుత్రము కథలోఁ బుత్రకునితో సంభాషించుచుఁ బాటలికకుఁ గధలు చెప్పునవ్వా తనభర్తవృత్తాంతము నెఱింగించుచు "అప్పా యిప్పుడు నాపూర్వస్థితిని జెప్పిన నీకును విచారము రాక మానదు. నా భర్త వందితకంఠీరవుండని బిరుదు వహించిరి. ఇప్పుడున్న రాజుగారి తండ్రి యాయనను నందల మెక్కించి యూరేఁగించెడివారు. నాపతి యతివదాన్యుఁ డగుట మాఘకవివలె వచ్చిన సొమ్మంతయు వెంటనే యర్థిసాత్కృతము చేయుచుండువారు" అను సందర్భమున శ్రీమధిరసుబ్బన్నదీక్షితులు దానశీలుఁడగు నవ్వాభర్తను మాఘమహాకవితోఁ బోల్చిరి. మాఘుఁడు తన సతీమణితో నాకలోకంబున కేఁగునపుడు.

సీ. సుర కార్యమునకుఁ జెచ్చెర వెన్నెముక నిచ్చి, నల్లదధీచి కే లందియాయ...మా.చ. 87.

అను పద్యము మాఘుని యవిరళ వితరణ గరిమను.

సీ. చరణ విన్యాసంబు సరణి తెల్పెదొ సుమీ, దాని నేర్చెను గవితకు నితండు....మా.చ. 90.

అను పద్యము మాఘుని కవితా పాండితీ పటిమను నిరూపించునవై కవిచరిత్ర పద్యములలో నెల్ల రత్నములై యొప్పారు చున్నవి. మహాదేవుఁడుగారు తమ యాంధ్రశిశుపాలవధకు మకుటాయమానముగా నీమాఘచరిత్రను రచించి ముందుగాఁ బొందుపఱచుట యెంతయు రమణీయముగా నున్నది.

-: మా ఘ క వి కు ల ము :-

మాఘకవి పూర్వు లమాత్యులుగా నుండుటచేతను, మాఘుఁడు సత్కులసంజాతుఁ డని పెక్కురు వ్రాయుటచేతను, 'శ్రీమాలీ' యను బ్రాహ్మణజాతి, శ్రీమాలగ్రామమునఁ గలదని మణిప్రభాకారులు చెప్పుట చేతను వీరు బ్రాహ్మణులని తెలియుచున్నది. ఇఁక "శిశుపాలవధంబున శ్రియః పతిః శ్రీమతి" యని వణిజ్మ్రుముండును." నను నప్పకవి వచనమున కాధార మాలోచనీయము.

-: మా ఘు ని ని వా స ము :-

ప్రాచీనప్రతులలో శిశుపాలవధ కావ్యాంతగద్యమున 'ఇతి శ్రీభిన్నమాలవవాస్తవ్య దత్తకసూనోర్మహావైయాకరణస్య మాఘస్య కృతౌ శిశుపాలవధే మహాకావ్యే' అని యుండుటయు, నాభిన్నమాలవ మనుగ్రామము గుజరాతు మారవాడ దేశప్రాంతము నందున్న భిన్నమాలా గ్రామమే యగుననియుఁగొందఱు చెప్పుచున్నా రని మాఘకావ్యోపొద్ఘాతములో దుర్గాప్రసావ పండితులు వ్రాసినారు. భిన్నమాలవ మను గ్రామమే ప్రభావక చరితములోఁ జెప్పఁబడిన శ్రీమాలగ్రామము కావచ్చు ననియు, నీ శ్రీమాల నగరము గుజరాతునకు, రాజస్థానమునకు మధ్యనున్నదనియు, నిప్పుడు గూడ నచట 'శ్రీమాలీ' యను బ్రాహ్మణజాతి గలదనియుఁ జెప్పి, చిన్నది యగు రైవతకాద్రిని బరమోత్కృష్టముగా వర్ణించుటకు జన్మభూమిపైఁ గల ప్రేమయే కారణమనియు నందుచే గుజరాతులోని శ్రీమాలగ్రామమే మాఘకవి నివాసస్థాన మని మాఘ కావ్యమునకు 'మణిప్రభ' యను హిందీవ్యాఖ్యానమును రచించిన పండిత శ్రీహర గోవింద శాస్త్రిగారు వక్కాణించుచున్నారు.

-: మా ఘు ని కా ల ము :-

ధారాధీశ్వరుఁడగు భోజరాజునకు సమకాలికుఁ డగుటచే మాఘకవి పదునొకొండవ శతాబ్దమునకుఁ జెందినవాఁడని కొందఱు దలంచుచున్నారు. కాని ధ్వన్యాలోకమును రచించిన యానందవర్ధనాచార్యులు ద్వితీయోద్ద్యోతమునందలి "అలఙ్కారాన్తరస్యాపి" యను కారికా వృత్తిలో "త్రాసాకులః పరిపతన్ పరితో నికేతాన్ (5-26) రమ్యా ఇతి ప్రాప్తవతీ పతాకాః" (3-53) అను శిశుపాలవధ శ్లోకముల నుదాహరించినారు. క్రీ. శ. 855-883 లోఁ గాశ్మీరమును బాలించిన యవంతివర్మ యాస్థానములో నానందవర్ధను లుండుటచే మాఘుఁడు 9వ శతాబ్దమునకుఁ బూర్వుఁడు. కావ్యాలంకార సూత్రములను రచించిన వామనుఁడు "సమ్భావ్య ధర్మ తదుత్కర్షకల్ప నాతిశయోక్తిః (4-3-10)" అను సూత్రవృత్తిలో "సమ్భావ్యస్య ధర్మస్య తదుత్కర్షస్య చ కల్పనాఽతిశయోక్తిః. యథా-ఉభౌ యది వ్యోమ్ని పృథక్ప్రవాహౌ (3-8)" అని మాఘశ్లోకము నుదాహరించినాఁడు. ధ్వన్యాలోక లోచనములో "యద్యపి చ ధ్వనిశబ్ద సఙ్కీర్తనేన కావ్యలక్షణ విధాయిభి ర్గుణవృత్తి రన్యో వా నకశ్చిత్ప్రకారః ప్రకాశితః తథా ప్యముఖ్యవృత్త్యా కావ్యేషు వ్యవహారం దర్శయతా ధ్వనిమార్గో మనాక్ స్పృష్టోఽపి న లక్షిత ఇతి పరికల్ప్యైవ ముక్తమ్. భాక్తమాహు స్తమన్యే ఇతి" అను పంక్తుల వ్యాఖ్యానములో "నను కేనైతదుక్తం ధ్వని ర్గుణవృత్తి రిత్యాశఙ్క్యాహ-యద్యపి చేతి। అన్యో వేతి। గుణాలఙ్కార ప్రకార ఇతియావత్। దర్శయతేతి। భట్టోద్భట వామనాదినా। భామహేనోక్తం-శబ్దా శ్ఛన్దోఽభిధానార్థా ఇతి. అభిధానస్య శబ్దాద్భేదం వ్యాఖ్యాతుమ్ భట్టోద్భటో

విభాషే "శబ్దానా మభిధాన మభిధావ్యాపారో ముఖ్యోగుణవృత్తి శ్చ" ఇతి వామనోఽపి "సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిరితి"-అను సందర్భమునను "అత్ర సత్యామపి వ్యంగ్యప్రతీతౌ వాచ్యస్యైవ చారుత్వ ముత్కర్షవదితి తస్యైవ ప్రాధాన్య వివక్షా" అను పంక్తిని వ్యాఖ్యానించుచు "తస్యైవేతి- వాచ్యస్యైవేతి యావత్. వామనాభిప్రాయే ణాయమాక్షేపః, భామహాభిప్రాయేణతు సమాసోక్తి రిత్యము మాశయం హృదయే గృహీత్వా సమాసోక్త్యాక్షేపయో ర్యుక్త్యేదమేక మేవోదాహరణం వ్యతరద్గ్రన్థకృత్" అని చెప్పి శ్రీమదాచార్యాభినవగుప్తపాదులు ధ్వన్యాలోకములో నానందవర్ధనులు వామనమతమును గూడఁ బర్యాలోచించినట్లు చెప్పుటచే వామనుఁడు 9వ శతాబ్దమునకుఁ బూర్వుఁడని తెలియుచున్నది. మఱియును గాశ్మీరప్రభువగు జయాపీడు నాస్థానములోను, రాష్ట్రకూటవంశుఁడగు గోవిందుని యాస్థానములోను వామనుఁ డున్నట్లు చరిత్రకారులు చెప్పుచున్నారు. జయాపీడుని కాలము క్రీ. 779-819. గోవిందుని కాలము 794-813. కాఁబట్టి వామనుఁ డష్టమశతాబ్దాంతిమ భాగములో నున్నట్లు సిద్ధించుటచే మాఘుఁ డెట్టి పరిస్థితులలోను 8వ శతాబ్దమున కీవలివాఁడు కాఁడు. నిర్ణయసాగరప్రతి కుపోద్ఘాతము వ్రాయుచు శ్రీదుర్గాప్రసాదపండితులు "ఉపమితి భవప్రపఞ్చకథా సమాప్తౌ (962) మితో గ్రన్థనిర్మాణ సంవత్సరో లిఖితః ఏతదేవావలమ్బ్య జార్మణ్య దేశవాసీ క్లాటపణ్డితః (Dr. F. Klatt) మాఘకవే రపి సత్తాం క్రిస్తాబ్దీయ దశమ శతకారమ్భే స్థిరీకరోతి। తద్దేశీయో. యాకోబీ పణ్డితస్తు (Prof. Jacobi). "We therefore cannot place Magha later than about the middle of the Sixth century" ఇతివదన్ క్రిస్తాబ్దీయ షష్ఠ శతకమధ్యభాగాన్నార్వాచీనో మాఘకవి రితి నిశ్చినోతి. యాకోబీ మతమేవ మమాపి సమ్మతమ్" అని క్లాట్, జాకోబీ పండితుల యభిప్రాయములను జూపి క్రీ. శ. 6వ శతాబ్ది మధ్యభాగము మాఘకవి కాలమన్న జాకోబీ యభిప్రాయమే తమకుఁగూడ సమ్మతమని వ్రాసిరి. మాఘకవి తన శిశుపాలవధలో "అనుత్సూత్రపదన్యాసా" అను శ్లోకములో జినేంద్రబుద్ధి రచించిన న్యాసగ్రంథమును స్మరించుటచే నాఱవశతాబ్దముకంటెఁ బ్రాచీనుఁడు కాఁజాలఁడు.

ఇది యెంతయు నిట్లుండ శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తమ సంస్కృతకవి జీవితములో "వామన జయాదిత్యాభ్యామ్ పాణినిసూత్రాణాం వృత్తిర్నిర్మితా, తత్కాలః శా. 570 భవే దితి ద్వైమత్యమ్. తస్యావృత్తే ర్జినేన్ద్రబుద్ధిః న్యాసాఖ్యం వ్యాఖ్యానం రచితవాన్. తత్కాలశ్చ శా. 620 భవేదితి బహూనామ్ భావనా. పాణినీయాభిమానినా తద్వృత్తి వ్యాపాకర్షిత బుద్ధినా మల్లినాథసూరిణా న్యాసోద్ద్యోతనామకం వ్యాఖ్యానం నిర్మితమ్. సోఽయం సూరిః శిశుపాలవధ ద్వితీయసర్గ స్యాస్య—

శ్లో. అనుత్సూత్ర పద న్యాసా సద్వృత్తిః సన్నిబన్ధనా, శబ్దవిద్యేవ నో భాతి రాజనీతి రపస్పశా॥ అర్థం వివృణ్వన్ వృత్తి న్యాస శబ్దయోః "కాశికావృత్తిః తద్వ్యాఖ్యాన గ్రన్థవిశేష ఇతి శ్లేషార్థం లిఖితవాన్. న్యాసోద్ద్యోతరచనా ద్గ్రన్థనిర్మాత స్మరణమే వాత్రకారణం నతు తద్వ్యాఖ్యయోః శిశుపాలవధస్య చ పౌర్వాపర్య విజ్ఞానమ్. చాటుకథా శ్రుత్యా దిఙ్నాగ కాళిదాసౌ సమకాలా వితి శ్రుత్వాపి మాఘేనోఽయం వ్యాఖ్యాతా. కవి కాల నివా సాది చరితాంశ విజ్ఞాతా. వళవతీతి విదిత మేతత్. ఏవంచ శ్లోకేఽస్మిన్ చారముశేష పరవృత్తాన్త

జ్ఞానమ్ ప్రధానమ్. ఉపమానోపమేయయో రపస్పశే త్యేకం శ్లిష్ట విశేషణ మత్ర యథా సమ్యగస్వేతి, న తథా పూర్వార్ధగత శ్లిష్ట విశేషణా నీతి విమృశతాం వేద్యమ్భవే దేవ.

తే నాత్ర వృత్తి న్యాస శబ్దౌ శ్లిష్టా వితి బుద్ధ్వా, తద్గ్రన్థాభ్యాం శిశుపాలవధః పర ఇతి యదుచ్యతే కైశ్చి త్పరిశోధకై స్తదనాలోచిత రమణీయమ్ భవేత్కిల. తథా చ హరదత్తేన మాఘకవిః స్మృతః పదమఞ్జర్యామ్. పదమఞ్జరీ వాక్యాని కాని చిద్గృహీతాని న్యాసే. అథ జినేన్ద్రబుద్ధేః న్యాసా చ్ఛిశుపాలవధః పూర్వ ఇత్యత్ర కా శఙ్కా?" అని వ్రాసినాడు. ఇది చింత్యము. పై శ్లోకవ్యాఖ్యానములో న్యాసశబ్దమునకు వృత్తివ్యాఖ్యాన గ్రంథవిశేషమని, వృత్తి శబ్దమునకుఁ గాశికాఖ్య సూత్రవ్యాఖ్యాన గ్రంథ విశేషమని, పస్పశ శబ్దమునకు శాస్త్రారమ్భ సమర్థకమగు నుపోద్ఘాత సందర్భ గ్రంథమనియు శబ్దవిద్యా పరముగా మల్లినాథసూరి యర్థము చెప్పినాఁడు. పాణినిమహర్షి రచించిన యష్టాధ్యాయికి వామనుఁడు, జయాదిత్యుఁడు ననునిద్దఱు పండితులు "కాశికావృత్తి" యనుపేరు గల వ్యాఖ్యానగ్రంథమును రచించిరి. అష్టాధ్యాయీ వ్యాఖ్యాన పరంపరలోఁ బతంజలిభగవానుని మహాభాష్యము తరువాత సంతతిగౌరవముగలగ్రంథము కాశికావృత్తి. ఇత్సింగ్ [i-Tsing] అను చీనా యాత్రికుఁడు క్రీ. 661 సంవత్సరమునకు ముందు జయాదిత్యుఁడు మరణించెనని వ్రాయుటచే నాఱవశతాబ్దము నందీ వ్యాఖ్యానగ్రంథము నిర్మింపఁబడినదని తెలియుచున్నది. ఈకాశికావృత్తిపై జినేంద్రబుద్ధి న్యాసమను వ్యాఖ్యానమును రచించెను. ప్రస్తుతము మన కుపలభ్యమానములగు కాశికా వ్యాఖ్యానములలోనికెల్ల నిదియేప్రాచీనమైనది. కాశికావృత్తికి హరదత్తుఁ డను పండితుడు పదమంజరి యనువ్యాఖ్యను రచించెను. ఈతఁడు పదమంజరిలో మాఘశ్లోకముల నుదాహరించినాఁడు. న్యాస పదమంజరులతోఁ గలిపి సంపూర్ణముగాఁ గాశికావృత్తిని ప్రాచ్యభారతీ గ్రంథమాల [Tara-Publications, Varanasi] వారు ప్రకటించినారు. పదమంజరీ వాక్యములను దన న్యాసములో జినేంద్రబుద్ధిగ్రహించినాఁడనియు, నందుచే హరదత్తుని కంటె న్యాసకారు డర్వాచీనుఁ డనియు మల్లాదివారి యభిప్రాయము. ఇది సరిగాదు న్యాసకారుని వాక్యములను హరదత్తుఁడే తనపదమంజరిలో గ్రహించినాఁడు. శ్రీజినేంద్రబుద్ధి.

శ్లో. జయన్తి తే సదాసన్తః సర్వథా యై రుపార్జితమ్
గుణానాం సుమహద్బృన్దం దోషాణాంచ విమార్జనమ్
అన్యతః సార మాదాయ కృతైషా కాశికా యథా
వృత్తి స్తస్యా యథాశక్తి క్రియతే పఞ్చికా తథా

అని తన న్యాసము నారంభించినాఁడు. దీనికిఁ గాశికా వివరణపంచిక యని నామాంతరము.

హరదత్తుఁడు మంగళ మొనరించి పదమంజరిని బ్రారంభించుచు.

శ్లో. అవిచారిత రమణీయం, కామం వ్యాఖ్యాశత మ్భవతు వృత్తేః
హృదయఙ్గమా భవిష్యతి, గుణగృహ్యాణా మియం వ్యాఖ్యా.

అని చెప్పి తనకు ముందుఁ గాశికకు వ్యాఖ్యలున్న ట్లుటంకించినాఁడు. "క్ఙితిచ" (1-1-5) అను సూత్రవృత్తికి వ్యాఖ్యానము వ్రాయుచు

"ప్రక్రియా తర్క గహన ప్రవిష్టో హృష్టమానసః, హరదత్తహరిః స్వైరం విహరన్ కేన వార్యతే." అను శ్లోకములోఁ బూర్వగ్రంథములకంటెఁ దనగ్రంథమే పాండిత్యపూర్ణ

మైన దను తన యభిప్రాయమును వెల్లడించినాఁడు. పదమంజరిలో హరదత్తుఁడు కేచిత్తు, అన్యేతు, అపరే, యని న్యాసమతమునే చెప్పినాఁడు. ఉదాహరణమునకు:

మదోఽనుపసర్గే (3-3-67) అను సూత్రమునందు మదోఽనుపసర్గే॥ విద్యామద ఇతి. విద్యయా మదః. 'కర్తృకరణే' ఇత్యాదినా సమాసః. ఉన్మాదఇది.॥ అత్రాపి 'కుగతిప్రాదయః' ఇతి 'వ్యధజపోరనుపసర్గే' ఇత్యత్రైవ మదిగ్రహణే కర్తవ్యే మదోఽనుపసర్గే ఇతి సూత్రప్రణయన మస్య విధే రనిత్యత్వ జ్ఞాపనార్థమ్, తేన మాద ఇతి సిద్ధమ్ భవతి. — అని న్యాసము.

అపర ఆహ- 'మదోఽనుపసర్గే' ఇతి సూత్ర ప్రణయన మస్య విధే రనిత్యత్వ జ్ఞాపనార్థమ్ తేన మాద ఇతి సిద్ధమ్, భవతి ఇతి. నా త్ర ప్తభాషితమస్తి- అని పదమంజరి.

ఈ యుదాహరణములో 'అపర ఆహ' అని చెప్పి 'నా త్రా ప్తభాషిత మస్తి' అని హరదత్తుఁడు తన యసమ్మతి చూపినది న్యాసము. బహుషు బహువచనమ్ (1-4-21) అను వృత్తివ్యాఖ్యలో ఇహ కేషాఞ్చిత్ 'స్వార్థ ద్రవ్య లిఙ్గ సంఖ్యా కర్మాద్యాత్మకః పఞ్చకః ప్రాతిపదికార్థః' ఇతి దర్శనమ్. కేషాఞ్చిత్ 'స్వార్థ ద్రవ్య లిఙ్గాత్మక స్త్రికః ప్రాతిపదికార్థః' ఇతి. తత్రస్వార్థో విశేషణమ్, స్వరూప జాతి గుణ ద్రవ్యాణి... ... ... ... ... లిఙ్గం స్త్రీత్వాది, సంఖ్యైకత్వాది, కర్మాదయో వక్ష్యమాణాః కారక విశేషాః తత్ర పూర్వోక్తయో ర్దర్శనయో ర్ద్వితీయం దర్శనం తదిహ వృత్తికారే ణాశ్రితమ్- న్యాసము. ఇహ కేచి న్మన్యన్తే- స్వార్థ ద్రవ్య లిఙ్గ సంఖ్యా కర్మాద్యాత్మకః పఞ్చకః ప్రాతిపదికార్థ ఇతి- ఆదిత త్రిక ఇత్యన్యే. తత్రశబ్ద ప్రవృత్తి నిమిత్తం స్వార్థః, స చానేకప్రకారః... ... లిఙ్గం స్త్రీత్వాది. సంఖ్యా ఏకత్వాది. కర్మాదయో వక్ష్యమాణాః కారక విశేషాః' తదిహ ద్వితీయం దర్శనం వృత్తికారే ణాశ్రితమ్- పదమఞ్జరి.

ఇట్లు పెక్కుచోట్ల న్యాస వాక్యములను హరదత్తుఁడు గ్రహించినాఁడు. ఇంత కంటెను స్పష్టముగా 'బిస్తాచ్చ' (5-1-31) అను సూత్రవ్యాఖ్యలో 'ద్విబిస్తమ్, ద్వైబిస్తికమ్. అను పదములను వ్యాఖ్యానించుచు- ద్విబిస్తమితి ద్వౌ బిస్తౌ పరిమాణ మస్యేతితఞ్, తస్యలుక్. ద్వైబిస్తిక మితి ఉత్తర పదవృద్ధిః- అని న్యాసకారుఁడు చెప్పినాఁడు.

బిస్తాచ్చ॥ చకారే ణానుకృష్యత ఇతి. తేన చానుకృష్టముత్తరత్ర నానువర్తతే ఇత్యుత్తర త్రామవృత్త్యభావ ఇతి భావః- అనివాసి.

అపరిమాణ బిస్తాచిత కమ్బల్యేభ్యో న తద్ధితలుకి (4-1-22) అను సూత్రగతవ్యాఖ్యలో

యద్యేవమ్, ఉన్మానమపి పరిమాణం న స్యాత్? కశ్చిదాహ- ఇష్ట మేవైతత్. ఉన్మానమపి నైవాత్ర పరిమాణ గ్రహణేన గృహ్యతే. ద్వాభ్యాం నిష్కాభ్యాం క్రీతా ప్రాగ్వతీయస్య ఠఞో 'ద్విత్రి పూర్వాన్నిష్కాత్' ఇతిలుక్, ద్వినిష్కా, త్రినిష్కేతి భవతీతి. అపర ఆహ-బిస్త కమ్బల్యో గ్రహణం జ్ఞాపకమ్, ఉన్మాన మప్యత్ర పరిమాణగ్రహణేన గృహ్యత ఇతి., తయో రున్మానవిశేషత్వాత్, "న్యాసకారస్తు" ద్వౌ బిస్తౌ పరిమాణమస్యేతి విగృహ్ణన్ బిస్తమ్ పరిమాణమ్ మన్యతే.- అని పదమంజరిలో బిస్తశబ్దమునకుఁ బరిమాణార్థమును జెప్పిన న్యాసకారుని నామనిర్దేశపూర్వకముగా హరదత్తమిశ్రుఁడు స్మరించినాఁడు. దీని వలనఁ బదమంజరీకారుఁడగు హరదత్తుని కంటె న్యాసకారుఁడగు జినేంద్రబుద్ధియే యతిప్రాచీనుఁ డని తేలినది.

మఱియు హర్షచరితము నందు బాణభట్టారకుఁడు 'ప్రసన్న వృత్తయో గృహీతవాక్యాః

కృతయుగ పదన్యాసాలోక ఇవ వ్యాకరణేఽపి' అను సందర్భమున వృత్తిని, న్యాసమును స్మరించినాఁడు. బాణభట్టు 606-647 లో రాజ్యము చేసిన హర్షవర్ధనుని యాస్థానము నందుండుటచే 7వ శతాబ్దమునకుఁ బూర్వమే న్యాసము వ్యాప్తిలోనికి వచ్చినట్లు తెలియుచున్నది. కాఁబట్టి 'అనుత్సూత్రపదన్యాసా' యను శ్లోకమున కర్థము చెప్పుటలో మల్లినాథ వ్యాఖ్యానమే మన కుపాదేయము.

ప్రకృతము ననుసరింతము. 7వ శతాబ్దమునకుఁ బూర్వుఁడగు న్యాసకారుని కంటె నర్వాచీనుఁ డగుటచేతను, 8వ శతాబ్దములో నున్న కావ్యాలంకారసూత్రకర్త యగు వామనుని కంటెఁ బ్రాచీనుఁ డగుట చేతను, మాఘకవి 7వ శతాబ్దములో నున్నట్లు నిశ్చయింపవచ్చును. క్రీ. 625 కాలమునకుఁ జెందిన యొక వసంతగడ్ ప్రాంతశిలాలేఖనములో 'వర్మలాత' యను నామ ముల్లేఖింపబడినట్లు, నందుచే సప్తమశతక ప్రారంభము మాఘకవి కాలమనియు నాచార్య శ్రీరామచంద్రమిశ్రులు సంస్కృతసాహిత్యేతిహాసములో వ్రాసినారు.

## శి శు పా ల వ ధ

సంస్కృతవాఙ్మయమున వందలకొలఁది మహాకావ్యములున్నను, రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, కిరాతార్జునీయము, శిశుపాలవధ యనునవి పంచకావ్యము లని ప్రసిద్ధి నొంది పఠనపాఠనములలో ననుస్యూతముగా వచ్చుచున్నవి. ఇందు మొదటి మూఁడుకావ్యములు మహాకవికాళిదాసుచే రచింపఁబడుటచేఁ గాళిదాసత్రయమనియుఁ దక్కిన రెండును భారవి, మాఘ, మహాకవులచే రచింపఁబడుటచే భారవి, మాఘము అనియు గ్రంథకర్తల నామములతోఁ గూడఁ బిలువఁబడుచున్నవి. సాధారణముగా సంస్కృతసాహిత్యము నభ్యసించు విద్యార్థులు ముందుగా నీపంచకావ్యములను జదివినపిదప శ్రీహర్ష విరచితమగు నైషధకావ్యమును బఠింతురు. కొందఱు రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశములను లఘుత్రయియనియుఁ, గిరాతార్జునీయ, శిశుపాలవధ, నైషధములను బృహత్త్రయి యనియు వ్యవహరించుచున్నారు. మాఘుని శిశుపాలవధ ప్రకృతము గావున దానిని గూర్చి విచారింతము.

శ్రీవిష్ణుపురాణములో:- "పున రప్యచ్యుత వినిపాత మాత్రమఖిలభూమణ్డలశ్లాఘ్య చేదిరాజకులే జన్మ అవ్యాహతైశ్వర్యం శిశుపాలత్వేఽ ప్యవాప. తత్ర త్వఖిలానామేవ స భగవన్నామ్నాం త్వఙ్కారకారణ మభవత్. తతశ్చ తత్కాలకృతానాం తేషా మశేషాణా మేవాచ్యుతనామ్నా మనవరత మనేకజన్మసు వర్ధితవిద్వే షానుబన్ధిచిత్తో వినిన్దన సన్తర్జ నాదిషూచ్చారణ మకరోత్. తచ్చ రూప ముత్ఫుల్లపద్మ దలామలాక్ష మత్యుజ్జ్వలపీతవస్త్రధా ర్యమలకిరీట కేయూరహారకటకాదిశోభిత ముదారచతుర్బాహు శఙ్ఖచక్రగదాధర మతిప్రరూఢ వైరానుభావా దటనభోజన స్నానాసన శయనాది ష్వశేషావస్థాన్తరేషు నాన్య త్రోపాయయా వస్యచేతసః. తత స్తమేవాక్రోశే షూచ్చారయం స్తమేవ హృదయేనధారయ న్నాత్మవధాయ యావద్భగవద్ధ స్త చక్రాంశుమాలోజ్జ్వల మక్షయతేజస్స్వరూపమ్ బ్రహ్మభూత మపగతద్వే షాదిదోషమ్ భగవ న్త మద్రాక్షీత్. తావచ్చ భగవచ్చక్రే ణాశువ్యాపాదిత స్తత్స్మరణదగ్ధాఖిల సఞ్చయో భగవ న్తముపనీత స్తస్మిన్నేవ లయ ముపయయౌ. (4-15)" అని శిశుపాలుని కథ సంక్షేపముగాఁ జెప్పఁబడినది. శ్రీమద్భాగవతమునందు దశమస్కంధో త్తరభాగములో 75వ యధ్యాయములో 54 శ్లోకములలో నీకథ చెప్పఁబడినది. శ్రీమన్మహాభారతమున సభాపర్వములో

౪౩ మొదలు ౪౫ వఱకుఁ బదమూఁడధ్యాయములలో శిశుపాలవధ విస్తారముగా వర్ణింపఁబడినది. మాఘకవి భారతములోని యితివృత్తమును గైకొని తనకావ్యమును రచించినాఁడు. ఇతివృత్తము మాత్రమే కాదు. కొన్నిచోట్ల భారతశ్లోకములను, గొన్నిచోట్ల పదములనుగూడఁ దనకావ్యములో ననువదించినాఁడు.

శ్లో. అపరాధశతం క్షామ్యం, మయా హ్యస్య పితృష్వసః।
పుత్త్రస్య తే వధార్హస్య, మా త్వం శోకే మనః కృథాః॥ (భార)
శ్లో. సహిష్యే శతమాగాంసి, సూనో స్త ఇతి యత్త్వయా।
ప్రతీక్ష్యం తత్ప్రతిజ్ఞాయై, పితృష్వస్రే ప్రతిశ్రుతమ్॥ (శిశు).
శ్లో. తైస్తైశ్చ బహుభిస్తత్ర ధర్మరాజ మవర్ధయత్
కథం ను మమ కౌరవ్యో రత్నదానైః సమాప్నుయాత్.
యాని తత్ర మహీపేభ్యో లబ్ధం వా ధన ముత్తమమ్
తాని రత్నాని సర్వాణి విప్రాణామ్ ప్రదదౌ తదా. (భార).
మృగ్యమాణ మపి యద్దురాసదం, భూరిసార ముపనీయ తత్స్వయమ్.
ఆసనావసర కాంక్షిణో బహి, స్తస్య రత్న ముపదీకృతం నృపాః.
ఏక ఏవ వసు యద్దదౌ నృప, స్తత్సమాపక మతర్క్యత క్రతోః
త్యాగశాలిని తపస్సుతే యయు స్సర్వపార్థివ ధనా న్యపేక్షయమ్. (శిశు).
ఆచార్య మృత్విజశ్చైవ సంయుజశ్చ యుధిష్ఠిర
స్నాతకశ్చ ప్రియశ్చాహుః షడర్ఘ్యార్హాన్ నృపం తథా. (భార).
స్నాతకం గురుమభీష్ట మృత్విజం సంయుజా చ సహ మేదినీపతిమ్
అర్ఘ్యభాజ ఇతి కీర్తయన్తి షట్ తే చ తే యుగపదాగతా స్సదః. (శిశు)
అథవాఽభ్యర్చనీయోఽయం యుష్మాకమ్ మధుసూదనః
కింరాజభి రిహానీతై రవమానాయ భారత. (భార).
యది వార్చనీయతమ ఏష కిమపి భవతామ్ పృథాసుతాః
శౌరి, రవనిపతిభి ర్నిఖిలై రవమాననార్థమిహ కిం నిమన్త్రితైః. (శిశు)
అయుక్తా మాత్మనః పూజాం త్వమ్పున ర్బహు మన్యసే
హవిషః ప్రాప్య నిష్యన్దమ్ ప్రాశితా శ్వేవ నిర్జనే. (భార).
మృగవిద్విషా మివ యదిత్థ మజని మిషతా పృథాసుతైః.
అస్య వపశువ ఇవాపచితిః పరిభావ ఏవ భవతామ్ భువోఽధిపాః. (శిశు).
చేతనారహితం కాష్ఠం యద్యనేన నిపాతితమ్.
పాదేన శకటమ్ భీష్మ తత్ర కిం? కృత మద్భుతమ్. (భార).
శకటవ్యథాప తరుభఙ్గ ధరణీధర ధారణాదికమ్
కర్మ యదయ మకరో త్తరలః స్థిరచేతసాంక ఇవ తేన విస్మయః. (శిశు)
సోవష్టాతనం వా మే దహనం వా కటాగ్నినా
క్రియతాం మూర్ధ్ని వో న్యస్తమ్మయేదం సకలమ్ పదమ్ (భార).
విహితమ్ మయాద్య సదసీద మపమృషిత మచ్యుతార్చనమ్.
యస్య నమయతు స చాపమయం చరణః కృతః శిరసి సర్వభూభృతామ్ (శిశు)

శ్రీకృష్ణుఁడే యర్ఘ్యమున కర్హుఁడని ధర్మరాజునకు భీష్ముఁ డుపదేశించుచు శ్రీకృష్ణుని మాహాత్మ్యము వెల్లడించుటకై మధుకైటభసంహారము, వరాహ, నరసింహ, వామన, దత్తాత్రేయ, పరశురామ, రామ, శ్రీకృష్ణ కల్క్యవతారముల నుపన్యసించినట్లు భారతమున విపులముగావర్ణింపఁబడినది. అట్లే మాఘుఁడు తనకావ్యములో నర్ఘ్యమునకు శ్రీకృష్ణపరమాత్మయే యర్హుఁడని చెప్పు భీష్మునిచేఁ గ్రమముగా మధుకైటభసంహారము వరాహ ద్యవతారవర్ణనముల తో శ్రీకృష్ణ స్తవము చేయించినాఁడు.

## భా ర వి – మా ఘుఁ డు.

మాఘకవినాఁటికే భారవి కిరాతార్జునీయము లోకములో వన్నె కెక్కుటచే నాకావ్యము కన్నఁ దనకావ్యమే మిన్నయై యెక్కువ ప్రసిద్ధి నొందవలె నని స్పర్ధవూని మాఘకవి తన శిశుపాలవధ రచన సాగించినాఁడు. భారవి "శ్రియఃకురూణామ్" అని తన కావ్యమును శ్రీకారముతో మొదలుపెట్టఁగా మాఘుఁడు "శ్రియఃపతిః" అని తన కావ్యమును శ్రీకారముతో నారంభించినాఁడు. భారవి ధర్మరాజునకు వనేచరునిచే దుర్యోధనుని యౌన్నత్యమును జెప్పింపఁగా మాఘుఁడు శ్రీకృష్ణునకు నారదునిచే శిశుపాలుని యౌద్ధత్యమును జెప్పించినాఁడు. భారవి ప్రథమసర్గాంతమున, ద్వితీయసర్గములోను ద్రౌపదీ, భీమ, ధర్మరాజుల సంవాదములో రాజనీతిని వర్ణింపఁగా మాఘుఁడు ద్వితీయసర్గమున బలరామ శ్రీకృష్ణోద్ధవుల మంత్రాలోచనములో రాజనీతిని వర్ణించినాఁడు. మూఁడవసర్గములో భారవి యర్జునుని యాత్రను వర్ణింపఁగా మూఁడవసర్గములో మాఘుఁడు శ్రీకృష్ణుని ప్రస్థానము వర్ణించినాఁడు. భారవి 4వ సర్గములో శరదృతువర్ణనము, 5వ సర్గములో వివిధవృత్తములతో, యమకశ్లోకములతో హిమాలయమును వర్ణింప, మాఘుఁడు 4వ సర్గములో వివిధవృత్తములతో యమకశ్లోకములతో రైవతకాద్రిని వర్ణించి, 6వ సర్గములోఁ బూర్తిగా యమకశ్లోకములతో, విచిత్రవృత్తములతో షడృతు వర్ణనము గావించినాఁడు. భారవి 7వ సర్గములో గంధర్వులయొక్కయు గణికాస్త్రీల యొక్కయు విలాసములు, నింద్రకీలాద్రిపై వారిసన్నివేశమును వర్ణింప, మాఘుఁడు 5వ సర్గములో రైవతకాద్రిపై శ్రీకృష్ణుని సేనానివేశమును వర్ణించినాఁడు. భారవి 8వ సర్గములో గంధర్వుల పుష్పాపచయము, జలక్రీడ వర్ణింప, మాఘుఁడు 7వ సర్గమున యాదవ యాదవాంగనల విలాసములు, పుష్పాపచయమును వర్ణించి 8వ సర్గమునఁ బూర్తిగా జలక్రీడను వర్ణించినాఁడు. భారవి 9వ సర్గమున సంధ్యావర్ణనము, చంద్రోదయవర్ణనము, గంధర్వుల పానగోష్ఠి సురత వర్ణనములు ప్రభాతవర్ణనము గావింప, మాఘుఁడు 9వ సర్గములో, సంధ్యా చంద్రోదయములు, దౌత్యము, 10వ సర్గమున యాదవుల పానగోష్ఠి సురతవర్ణనములు 11వ సర్గములోఁ బూర్తిగాఁ బ్రభాతవర్ణనము గావించినాఁడు. 13వ సర్గాంతమున శివుని దూతయగు వనేచరుఁడు వచ్చి శివప్రభావమును జెప్పుట యుపాలంభవాక్యములు పల్కుట 14వ సర్గప్రారంభములో నర్జునుఁడు దూతకు సమాధానము చెప్పుట భారవి వర్ణింప, 16వ సర్గములో శ్రీకృష్ణునొద్దకు శిశుపాలుని దూత వచ్చి నిందాస్తుతులు వచ్చునట్లు శ్లిష్టవాక్యములు పల్కుట, శ్రీకృష్ణుని కనుసన్నచే సాత్యకి దూతకు సమాధానము చెప్పుట, దూత శిశుపాలుని పరాక్రమము నుపన్యసించుటయు మాఘుఁడు మిక్కిలి చమత్కారముగా వర్ణించినాఁడు. 14వ సర్గములో దూతవాక్యములువిని మాయాకిరాతకుఁడగు శివుఁడు సేనలతో వచ్చుటయు,

నాసేనతో నర్జునుఁడు యుద్ధముచేయుటయు భారవి వర్ణింప, 17వ సర్గములో దూతవాక్యములు విని శ్రీకృష్ణపక్షమువారు సంక్షోభించుటయు, శ్రీకృష్ణుని సేన యుద్ధమునకేఁగుటయు వర్ణించి, 18వ సర్గమునఁ బూర్తిగా నుభయసేనల ఘోరయుద్ధమును మాఘుఁడు వర్ణించినాఁడు. భారవి 15వ సర్గములో నేకాక్షరి, నిరోష్ఠ్యము, గోమూత్రికా సర్వతోభద్రబంధములు మొదలగు చిత్రకవిత్వముతో యుద్ధమును వర్ణింప, మాఘుఁడు 19వ సర్గములో నేకాక్షరి, యతాలవ్యము, గోమూత్రికా, సర్వతోభద్ర, మురజ, చక్రబంధములు మొదలగు చిత్రకవిత్వము భారవికంటె నెక్కువగా వాడి యుద్ధమును వర్ణించినాఁడు. భారవి తన కావ్యములోఁ బ్రతిసర్గాంత శ్లోకము లోను "లక్ష్మి" శబ్దమును వాడఁగా, మాఘుఁడు తన కావ్యమునఁ బ్రతిసర్గాంత శ్లోకములోను "శ్రీ" శబ్దమును వాడి యంతకంటెఁ జమత్కారమును జూపినాఁడు. అందువలననే భారవికి 'లక్ష్మ్యంక' కావ్యమనియు, మాఘమునకు 'శ్ర్యంక' కావ్యమనియు వ్యవహారము వచ్చినది. భారవి తనకావ్యమున కితివృత్తము భారతమునుండి గైకొనఁగా, మాఘుఁడు కూడ భారతమునుండియే గైకొనినాఁడు. "అవివేకః పరమాపదామ్ పదమ్ (2-30)" అను భారవి వాక్యములోని సొగసును గ్రహించి "స్ఫుట మాపదామ్ పద మనాత్మవేదితా (15-22)" యని మాఘుఁడు కూడ వాడుకొనినాఁడు. కొన్నిచోట్ల భారవి శ్లోకములకుఁ బ్రతిబింబశ్లోకములు గూడ రచించినాఁడు.

పృథుకదమ్బ కదమ్బక రాజితం, గ్రథిత మాల తమాల వనాకులమ్
లఘుతుషార తుషారజల శ్చ్యుతం, ధృత సదాన సదానన దన్తినమ్. (5-9) భారవి.
నవపలాశ పలాశవనమ్ పురః, స్ఫుటపరాగ పరాగత పఙ్కజమ్
మృదుల తాన్త లతాన్త మలోకయత్, స సురభిం సురభిం సుమనోభరైః. (6-2)
మాఘుఁడు.

భారత, భాగవతములలో శ్రీకృష్ణుఁడు సభలోనే శిశుపాలుని శిరమును సుదర్శన చక్రముతో ఖండించినట్లు చెప్పఁబడినను భారవి కావ్యములోని శివార్జునయుద్ధమువలె వర్ణింపఁ దలఁచి శ్రీకృష్ణునకు, శిశుపాలునకు వెక్కటికయ్యమును 20వ సర్గములో వర్ణించినాఁడు. భారవి తన కావ్యమును 18 సర్గములలో 1040 శ్లోకములలో రచింపఁగా, మాఘుఁడు తన కావ్యము 20 సర్గములలో 1673 శ్లోకములలో రచించినాఁడు. భారవివంటి మహాకవితోఁ బోటీకి నిలఁబడి తానుగూడ "మహాకవి" యైనాఁడు "వరం విరోధోఽపి సమమ్ మహాత్మభిః" అను భారవికవి సూక్తి మాఘకవి యెడ సార్థకమైనది. అందువలననే ధనపాలుఁడు

మాఘేన విఘ్నితోత్సాహా, నోత్సహన్తే పదక్రమే,
స్మరన్తి భారవే రేవ, కవయః కపయో యథా.

మాఘమాసమునందు సూర్యుని తీవ్రమగు నెండను స్మరించుచుఁ గాళ్ళు కాలుటవలన నుత్సాహము లేక కోఁతులెట్లు తమపాదములను ముందువేయుట కుత్సహించుటలేదో యట్లే మాఘకావ్య మతిక్లిష్టమగుటచే విఘ్నితోత్సాహులై భారవి కిరాతార్జునీయమును స్మరించుచు మాఘమునందలి పదక్రమమునందుఁ గవులు చొచ్చుటలేదని తిలకమంజరిలోఁ జెప్పినాఁడు.

ఈ శిశుపాలవధ కావ్యమునకు దుర్గాప్రసాదపండితులు చెప్పిన ప్రకారము (1) వల్లభదేవకృత సందేహవిషౌషధి, (2) రంగరాజ కృతవ్యాఖ్య, (3) ఏకనాథ కృతవ్యాఖ్య, (4)

చారిత్రవర్ధన కృతవ్యాఖ్య, (5) మల్లినాథకృత సర్వంకష, (6) భరతమల్లికకృత సుబోధ, (7) దినకరమిశ్రికృత సుబోధిని, (8) గోపాలకృత హాసంతి, అను 8 వ్యాఖ్యలున్నవి. వీనిలోనికెల్ల మల్లినాధ వ్యాఖ్యానమే సర్వాంగపరిపూర్ణమై ప్రామాణికమైనదై దేశములో నెల్లచోట్లఁ బ్రచారము గాంచినది. ఒక్క కాశ్మీరములో మాత్రము వల్లభదేవుని వ్యాఖ్యయే ప్రచారము నొందినది.

## మ ల్లి నా థుఁ డు.

ఆంధ్రదేశమునఁ బుట్టి సంస్కృతములో నుద్దండపండితులై తమ యమూల్య గ్రంథ రత్నములచే గీర్వాణ సరస్వతి నలంకరించి, తమ విమలయశశ్చంద్రికల నాసేతుశీతాచలము వ్యాపింపఁజేసిన కపర్దిస్వామి, అన్నంభట్టు, జగన్నాధ పండితరాయలు, కవికళానిధి కృష్ణభట్టు, రామచంద్రబుధేంద్రుఁడు, నీలకంఠుఁడు మొదలగు కొలఁదిమంది పండితులలో మల్లినాథుఁ డగ్రగణ్యుఁడు. మల్లినాధుఁడు, పెద్దిభట్టు నను వా రిద్దఱును సోదరులనియు, వారిలోఁ బెద్దిభట్టార కుఁడు విద్వాంసుఁడై గ్రంథములను రచించి యన్నగారి యందలి భక్త్యతిశయముచేఁ దన గ్రంథములను మల్లినాథుని పేరుతో వెలయించెననియు జనశ్రుతి కలదు. మల్లినాథసూరి వంశజుఁడగు నారాయణ పండితుఁడు రచించిన పదయోజనమను చంపూరామాయణ వ్యాఖ్యానము లోనివిగా "కోలచె ల్మాన్వయాబ్ధీన్దు ర్మల్లినాథో మహాయశాః, శతావధాన విఖ్యాతో వీరరుద్రాభివర్ణితః. మల్లినాథాత్మజః శ్రీమాన్ కపర్దీ మన్త్రకోవిదః, అఖిల శ్రౌతకల్పస్య కారికావృత్తి మాతనోత్. కపర్దితనయో ధీమాన్ మల్లినాథోఽ గ్రజః స్మృతః, ద్వితీయ స్తనయో ధీమాన్ పెద్దిభట్టో మహోదయః. మహోపాధ్యాయ అఖ్యాతః సర్వదేశేషు సత్కృతః, పూతులేయకరీతా దివ్యే సర్వజ్ఞే నాభివర్ణితః. గణాధిప ప్రసాదేన ప్రోచే మన్త్ర వరాన్ బహూన్, నైషధ జ్యోతిషాదీనాం వ్యాఖ్యాతాఽ భూజ్జగద్గురుః. పెద్దిభట్టసుతః శ్రీమాన్ కుమారస్వామి సంజ్ఞకః, ప్రతాపరుద్రీయాఖ్యాన వ్యాఖ్యాతా విద్వదగ్రిమః॥" అను శ్లోకములను శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మీఁగడతఱకలను వ్యాససంపుటిలో నుదా హరించినారు. ఈశ్లోకములు వ్యాఖ్యానము రచించినవాఁడు పెద్దిభట్టనియే చెప్పుచున్నవి. 'పెద్దిభట్ట గృహిణీ విరాజతే' అను శ్లోకములోఁ గూడ నీపేరే యున్నది. సాంప్రదాయికులు పెద్దిభట్ట వ్యాఖ్యానము అనియే నుడువుదురు. అయినను బెద్దిభట్టులవారు గ్రంథాంతగద్యములలో నన్నగారి పేరుంచుటచే మనము గూడ మల్లినాధునే గ్రంథకర్తగా వ్యవహరింతము. వీరి యింటిపేరు 'కోలాచల' యని ముద్రితప్రతులలోఁ గలదు. 'కొలచెల్మ' యని నారాయణ పండితుఁడు చెప్పుటచే నిదియే గ్రాహ్యము. వీరిది పండితవంశము. మల్లినాథుని తాత యగు మల్లినాథుఁడు శతావధానము లొనర్చి ప్రతాపరుద్రునిచేఁ గనకాభిషేక సత్కారమంది నట్లు పైశ్లోకములలోనే కలదు. తండ్రియగు కపర్దిస్వామి గొప్పవిద్వాంసుఁడు. ఈతఁడు కల్పమునకుఁ జెందిన యాపస్తంబ శ్రౌత, శుల్బ, గృహ్య సూత్రములకు భాష్యములు నాపస్తంబ గృహ్యకారికలు, దర్శపూర్ణమాసభాష్యము, భారద్వాజ గృహ్యసూత్రభాష్యము, మొదలగునవి రచించినాఁడు. ఈతఁ డెక్కువగా నాపస్తంబకల్పమునకే భాష్యములను రచించుటచే వీరు కృష్ణయజుర్వేదశాఖకుఁ జెందినవా రనిచెప్పవచ్చును. ఈతని పుత్త్ర రత్నమే మన మాఘకావ్యవ్యాఖ్యాత యగు మల్లినాథుఁడు. ఈతనికిఁ బదవాక్యప్రమాణ పారావారపారీణుఁ డనియు, మహోపాధ్యాయుఁ డనియు బిరుదులు గలవు. పద మనఁగా

వ్యాకరణము. వాక్య మనఁగా మీమాంస. ప్రమాణ మనఁగాఁ దర్కము. ఈమూఁడు శాస్త్రములందును బారంగతులగు వారికే యీబిరుదము చెల్లును. "ఈక్షతేర్నాశబ్దమ్ (1-1-5)" అను వేదాంతసూత్రమున కుపోద్ఘాతభాష్యము వ్రాయుచు "తత్ర పదవాక్యప్రమాణజ్ఞే నాచార్యేణ వేదాన్తవాక్యానామ్ బ్రహ్మావగతిప్రదర్శనాయ వాక్యాభాస యుక్త్యాభాస ప్రతిపత్తయః పూర్వ పక్షీకృత్య నిరాక్రియన్తే" అను సందర్భమున నీపదవాక్యప్రమాణజ్ఞ బిరుదము బాదరాయణ మహర్షులకు విశేషణముగా మొట్టమొదట శ్రీ శంకర భగవత్పాదాచార్యులచే వాడఁబడినది. సర్వశాస్త్రములయందును సిద్ధాంతస్థాపనము చేయఁగలవానికే మహోపాధ్యాయ బిరుదము చెల్లును. మల్లినాథుఁడు వైశేషిక, వేదాంత, మీమాంసా దర్శనములలోను, పాతంజల వ్యాకరణ మహాభాష్యములోను, న్యాయదర్శనములోను మహాపండితుఁడైనట్లు

"వాణీం కాణభుజీ మజీగణత్......"

అను శ్లోకములోఁ దానే చెప్పుకొనినాఁడు. ఈతనికి ముందుఁగల ప్రాచీనుల కువ్యాఖ్యలను ఖండించి, యన్వయరీతిని వ్యాఖ్యలను రచించుటచే నఖండ భారతమండలమున నీతని వ్యాఖ్యానములే పఠనపాఠనములలో మిక్కిలి ప్రచారమును గాంచినవి. అట్లు ప్రచారము నొందుటకుఁ గారణము

"ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా।
నామూలం లిఖ్యతే కించి న్నానపేక్షిత ముచ్యతే॥

అన్వయముఖముగానే వ్యాఖ్యానములను రచించుచున్నాను. మూలములోలేనిదివ్రాయను. అక్కరలేనిది చెప్పను. అని తన వ్యాఖ్యానములలోఁ బ్రతిజ్ఞచేసి చిట్టచివరవఱకుఁ బాటించి నాఁడు. "తత్రేహ నామాని తు 'నానపేక్షితముచ్యతే' ఇతి ప్రతిజ్ఞా భఙ్గభయా న్నలిఖ్యన్త ఇతి సర్వ మవదాతమ్" అనుచోటఁ బ్రతిజ్ఞోల్లంఘనము గావింపనట్లు తానే స్పష్టపఱచినాఁడు. ఈతఁడు వ్రాసిన వ్యాఖ్యానములలోనెల్ల మేఘసందేశ వ్యాఖ్యానము, మాఘకావ్యవ్యాఖ్యానము రెండే పెద్దవి. మాఘవ్యాఖ్యానమే మిక్కిలి పట్టుదలతో వ్రాసినట్లు

"యే శబ్దార్థపరీక్షణప్రవణయినో.........మాఘస్య సర్వఙ్కషామ్॥"

అను శపథశ్లోకములో స్వయముగాఁ దెలిపినాఁడు. ఈతఁడు వృద్ధుఁడై శ్రీహర్షనైషధము పకు వ్యాఖ్య సంక్షేపముగా రచించుచుండఁగా నొకరు "నైషధమువంటి కావ్యమునకుఁ దొందరగా వ్యాఖ్య రచింపనేల?" యని ప్రశ్నింపఁగా 'మాఘే మేఘే గతం వయః' అని యీతఁడు సమాధానము చెప్పినట్లు పెద్దలు నుడువుదురు. నిజమున కీతని వ్యాఖ్యలు లేనిచోఁ గావ్యము లింత సులువుగా నర్థ మయ్యెడివిగావు. రసార్ణవసుధాకరము, సంగీతరత్నాకరవ్యాఖ్య, రత్న పాంచాలికా నాటకము రచించిన సర్వజ్ఞసింగభూపాలుఁ డీతనికిఁ గనకాభిషేకమును గావించి నాఁడు. దీనికి "మాతులేయ క్రతౌ దివ్యే సర్వజ్ఞే నాభివర్షితః" అను నారాయణపండితుని వాక్యమే ప్రమాణము. ఈతఁడు సింగభూపాలుని కాలములో నున్నట్లు

కిం వాపసా చీకిరి బాకిరేణ, కిం దారుణా వంకరటింకరేణ।
సర్వజ్ఞభూపాల విలోకనార్థం వైదుష్య మేకం విదుషాం సహాయమ్॥

అని మల్లినాథునిచేఁ జెప్పఁబడినట్లు పేటూరివారిచే నుదాహరింపఁబడిన శ్లోకము గూడ నిరూపించుచున్నది. సింగభూపాలునకు సమకాలికుఁ డగుటచే నీతఁడు 14వ శతాబ్దమునకుఁ జెందినవాఁడు. మల్లినాథుఁడు కేవలము కావ్యములకే కాక, శాస్త్రగ్రంథములకుఁ గూడ వ్యాఖ్యలు రచించినాఁడు.

-: మ ల్లి నా థు ని కృ తు లు :-

కాళిదాసత్రియమునకు 'సంజీవినీ' వ్యాఖ్యలు (4) భారవి కిరాతార్జునీయమునకు "ఘంటాపథ" వ్యాఖ్య (5) మాఘుని శిశుపాలవధమునకు "సర్వంకషా" వ్యాఖ్య (6) శ్రీహర్షుని నైషధమునకు "జీవాతు" వ్యాఖ్య (7) భట్టికావ్యమునకు "సర్వపథీన" వ్యాఖ్య. ఇవి కావ్య వ్యాఖ్యానములు. శాస్త్రములందు వైశేషికదర్శనములో (8) శివాదిత్యుని "సప్తపదార్థీ"కి "నిష్కంటకా" వ్యాఖ్య, న్యాయదర్శనములో (9) వరదరాజు "తార్కికరక్షాసారసంగ్రహము" నకు "నిష్కంటకా" వ్యాఖ్య, మీమాంసాదర్శనములో (10) కుమారిలభట్టపాదుల "తంత్రవార్తికము" నకు వ్యాఖ్య.

ఈతఁడు వ్యాకరణములో జినేంద్రబుద్ధి రచించిన న్యాసమునకు న్యాసోద్ద్యోతమను వ్యాఖ్యానము రచించినట్లు కొందఱు చెప్పుచున్నారు. ఈగ్రంథ మిపుడు కానరాదు. ఇవిగాక జ్యోతిషగ్రంథము, ఏకావళీవ్యాఖ్య, సర్వమంజరీ వ్యాఖ్య (పరిమళము) మొదలగు గ్రంథములు గూడ మల్లినాథుఁడు రచించినట్లు వేటూరివారు చెప్పుచున్నారు. అమరకోశటీక, ఉదారకావ్య వ్యాఖ్య, రఘువీరచరితము కూడ నీతఁడు రచించినట్లు పండితశివదత్త శర్మగారు చెప్పుచున్నారు. వీనిలో షట్కావ్యవ్యాఖ్యానములు, సప్తపదార్థీనిష్కంటక, తార్కికరక్షాసార సంగ్రహ నిష్కంటకలు ముద్రితములు. తక్కిన వచ్చు కావలయును. మల్లినాథుని గ్రంథములన్నియుఁ బ్రకటింపఁబడక పోవుట మన దురదృష్టము. ఈతని కుమారుఁడగు కుమారస్వామి సోమిపీథి విద్యానాథుని ప్రతాపరుద్రీయమునకు రత్నాపణమను వ్యాఖ్య రచించినాఁడు. ఈతఁడు రత్నాపణములోఁ బెద్దిభట్టు, తాను, మల్లినాథుని సుతులుగాఁ జెప్పినాఁడు.

మాఘుఁడు కేవలకవియే కాక, సర్వశాస్త్రముల యందలి రహస్యములను బాగుగా నెఱిఁగిన మహామనీషి. ఈతఁడు తన కావ్యములో నడుగడుగునఁ దన పాండిత్యమును బ్రదర్శించుచునే వచ్చినాఁడు. క్షేమేంద్రుఁడు తన కవికంఠాభరణము నందలి పరిచయప్రాప్తి యను పంచమసంధిలో

శ్లో. "న చ పరిచయహీనః కేవలే కావ్యకష్టే, కుకవి రభినివిష్టః స్పష్టశబ్దప్రవిష్టః।
విబుధసగసి పృష్టః క్లిష్టధీర్వేత్తి వక్తుం, నవ ఇవ నగరాన్తర్గహ్వరే కోఽప్యదృష్టః॥

అథ పరిచయ చారుత్వ మాహ:- తత్ర తర్క, వ్యాకరణ, భరత, చాణక్య, వాత్స్యాయన, భారత, రామాయణ, మోక్షోపా యాత్మజ్ఞాన, ధాతువాద, రత్నపరీక్ష, వైద్యక, జ్యోతిష, ధనుర్వేద, గజ, తురగ, పురుషలక్షణ, ద్యూ తే.న్ద్రజాల ప్రకీర్ణేషు పరిచయః కవిసామ్రాజ్య వ్యఞ్జనః అని చెప్పి వివిధకావ్యముల నుండి తత్తచ్ఛాస్త్రపరిచయ శ్లోకముల నుదాహరించి తనగ్రంథమును ముగించినాఁడు. మాఘకవి తనకావ్యములో సకలశాస్త్రములను నెట్లు పరిచయము చేసినాఁడో క్రమముగా మల్లినాథుని సర్వంకషాసహాయమునఁ బరిశీలింతము.

-: మా ఘ మ హా క వి స ర్వ తం త్ర స్వ తం త్ర త :-

వ్యాకరణశాస్త్ర పరిచయము :-

అనుత్సూత్ర పదన్యాసా, సద్వృత్తిః సన్నిబన్ధనా।
శబ్దవిద్యేవ నో భాతి, రాజనీతి రపస్పశా॥ (2-112)

కం. "వాసి ననుత్సూత్ర పద న్యాసయు-" అని యాంధ్రమాఘము. ఈశ్లోక ముద్దవుఁడు

శ్రీకృష్ణునకు రాజనీతినుపదేశించు సందర్భములోనిది. నీతిశాస్త్రమునకు విరుద్ధమైన పదవ్యవహారము లేనిది, భృత్యామాత్యాదులకు మంచిజీవనము, పారితోషికములు గల్గించునది యయ్యును (స్పశులు) చారులు లేనిచో రాజనీతి, సూత్రాక్షరములచే నర్థమునుబ్రతిపాదించు న్యాసమను వ్యాఖ్యానగ్రంథము గలదియుఁ గాశిక యను వృత్తిగ్రంథము గలదియు, వ్యాకరణ నిబంధన మగు మహాభాష్యము గలదియు నయ్యును బస్పశాహ్నికము లేని శబ్దవిద్య (వ్యాకరణశాస్త్రము) వలె శోభింపదని భావము. పతంజలి మహర్షులు రచించిన మహాభాష్యములోని మొదటి యాహ్నికమునకుఁ బస్పశాహ్నిక మని పేరు. "రక్షోహాగమ లఘ్వసన్దేహాః ప్రయోజనమ్" అని వ్యాకరణ శాస్త్రాధ్యయన ప్రయోజనములు విపులముగాఁ జర్చింపఁబడుటచే మహాభాష్యములో నీ పస్పశాహ్నికమే ముఖ్యమైన దని భావము.

శ్లో. సంక్షిప్త స్యాప్యతోఽస్యైవ, వాక్య స్యార్థగరీయసః
సువిస్తరతరా వాచో భాష్యభూతా భవన్తు మే॥ (2-24).

సీ. విస్తృతం బైన వాగ్వితతి.........ఆ. మా. (2-23).

శ్రీకృష్ణునకు బలరాముఁడు నీతి నెఱిఁగించు సందర్భము. సంక్షిప్తములయ్యు నర్థగంభీరములై సూత్రప్రాయముగా శ్రీకృష్ణుఁడు పల్కిన పల్కులకు విస్తరములగు నావాక్యములు భాష్యభూతము లగు నని భావము.

అల్పాక్షర మసన్దిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్। అస్తోభ మనవద్యఞ్చ సూత్రం సూత్రవిదో విదుః॥
అని సూత్రలక్షణము. శ్రీమద్వాచస్పతిమిశ్రులు భామతిలో,

లఘూని సూచితార్థాని, స్వల్పాక్షర పదాని చ।
సర్వతః సారభూతాని, సూత్రాణ్యాహు ర్మనీషిణః॥

అను సూత్రలక్షణ శ్లోకము నుదాహరించిరి.

సూత్రస్థమ్ పదమాదాయ, వాక్యైః స్సూత్రానుసారిభిః.
స్వపదాని చ వర్ణ్యన్తే భాష్యమ్ భాష్యవిదో విదుః॥

అనునది భాష్యలక్షణము. ఇందు భాష్యమనఁగా వ్యాకరణ మహాభాష్యమే యభిప్రేతమైనట్లు "విశశ్యతాం శేషగవీః 2-68" (అంత శేషుని యవతార మైన రాము వీరభాషణము... ఆ. మా. 2-60) అనుచోట శేషశబ్దమును వాడి కవి ధ్వనింపఁ జేసినాఁడు. ఆదిశేషుఁడే బలరాముఁడై పుట్టుటయు నతఁడే పతంజలియై పుట్టివ్యాకరణ భాష్యమును రచించుటచేతను "శేషగవీః" అని ప్రయుక్తమైనది. సాధారణముగా సంస్కృతములో ముందు సూత్రగ్రంథములు, వానిపై భాష్యములు, నాభాష్యములపై వార్తికములు పుట్టినవి. కాని వ్యాకరణశాస్త్రమునందు మాత్రము ముందు పాణినిసూత్రములు, వానికి వరరుచి వార్తికములు వ్రాయఁగా నాసూత్రవార్తికములపైఁ బతంజలి భాష్యము పుట్టినది. సంస్కృతములో సకలశాస్త్రములకు భాష్యములున్నను సూత్రవార్తికముల రెంటిని వ్యాఖ్యానించుటచేఁ బతంజలి భాష్యమునకే మహాభాష్య మనుపేరు రూఢమైనది.

శ్లో. పత్త్యషేవ చిర మప్రకృతత్వా, దప్రకాశిత మదిద్యుత దక్షే.
విభ్రమమ్ మధుమదః ప్రమదానాం, ధాతులీన ముపసర్గ ఇవార్థమ్॥

కం. ధాతు విలీ నార్థములకు...  ...ఆ. మా. (10-15)

ఈ శ్లోకము పానగోష్ఠిని వర్ణించు సందర్భము లోనిది. పాణినిచే రచింపఁబడిన దశ గణిలోని భూవాదులకు ధాతువు అనిపేరు. "భూ-సత్తాయామ్" భూ ధాతువున కుండుట యని యర్థ మనియిట్లు ధాతుపాఠములో వాని కొక్క యర్థమే పేర్కొనినను "ధాతూనామనేకార్థ." అని చెప్పఁబడుటచే ధాతువులకుఁ బెక్కర్థములుండును. కాని యాయర్థము లుపసర్గ సంయోగము లేనిచో ద్యోతకములు గావు. ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్ దుర్, వి, ఆజ్, ని, అధి, అపి, అతి, సు, ఉత్, అభి, ప్రతి, పరి, ఉప, యనునవి యుపసర్గములు. ఇవి ధాతువులతోఁ గూడి యనేకార్థము లొసఁగును. ప్రహారమనఁగా దెబ్బ. ఆహారమనఁగా భోజనము. సంహారమనఁగాఁ జంపుట. ఇట్లే విహార పరిహారాదులు. ఇచట ప్ర, ఆజ్, సమ్, మొదలగు నుపసర్గములు చేరి వేఱువే ఱర్థములను బోధించుచున్నవి. ఈ యుపసర్గములు ధాతువులపైఁ జేరి యెట్లు ధాతులీనములైన యర్థములను ద్యోతక మొనర్చుచున్నవో యట్లే మధుపానమదము స్త్రీల యంగములలో నెల్లప్పుడు నప్రకాశితముగా నున్న లావణ్యమును బ్రకాశింపఁ జేసినదని భావము.

శ్లో. సఙ్జ హి నిగదితుం విభక్తిభి, ర్వ్యక్తిభిశ్చ నిఖిలాభి రాగమే.
తత్ర కర్మణి విపర్యణీనమ న్మన్త్ర మూహకుశలాః ప్రయోగిణ.॥

ఉ. ఉన్నది యున్నటుల్... ... ... ...ఆ. మా. (14-23).

ధర్మజునిచే యాగమును జేయించు ఋత్విజు లందఱు నూహకుశలు లగుటచే లింగ, వచన, విభక్తి, విపరిణామమును జక్కగాఁ జేసి వేదమంత్రములు సరిగాఁ బఠించిరని భావము. సర్వలింగజ్ఞాపక పదముల తోడను, సర్వవిభక్త్యంత పదముల తోడను వేదములందు మంత్రములు చెప్పఁబడ లేదు. యజ్ఞమును జేయించు పురుషుఁడు వానిని యథావిధిగా విపరిణామ మొనర్పవలెను. వ్యాకరణము రానివాఁ డట్టి విపరిణామ మొనరింపలేఁడు గావున వ్యాకరణమును బఠింపవలెనని మహాభాష్యకారులు చెప్పినారు. ఏ యాగమునందు సకలాంగములు నుపదేశింపఁబడినవో దానికిఁ బ్రకృతి యనియు, నట్లు కానిదానికి వికృతియనియు సంజ్ఞలు. ప్రకృతివలె వికృతి నొనర్పవలె నని మీమాంసాసమయము. 'అగ్నయే త్వా జుష్టం నిర్వపామి' అని యగ్నియంత్రము. "సౌర్యం చరుం నిర్వపే ద్బ్రహ్మవర్చసకామః" అను సూర్యు నుద్దేశించి చేయు చరుద్రవ్యక యాగమునందు "సూర్యాయ త్వాం జుష్టం నిర్వపామి" అని విపరిణామమొనర్పవలెను. "అగ్నయే" అనుచోట "సూర్యాయ" అని చేయు విపరిణామమున కూహ మనిపేరు.

శ్లో. సంశయాయ దధతో స్సరూపతాం దూరభిన్నఫలయోః క్రియామ్ ప్రతి.
శబ్దశాసనవిదః సమాసయో ర్విగ్రహం వ్యవససుః స్వరేణ తే॥

తే. సంశయము గల్గు నటు... ... ...ఆ. మా. (14-24).

వ్యాకరణశాస్త్రమునందు నిపుణులగు ఋత్విజులు సారూప్యముచే సందేహమును గలిగించి వేఱుగా ఫలితముల నొసంగు సమాసములయొక్క విగ్రహమును స్వరోచ్చారణము చేతనే నిశ్చయించి రని భావము.

శ్లో. "దుష్టః శబ్దః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థ మాహ.
స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేన్ద్రశత్రుః స్వరతోఽపరాధాత్"

స్వరదోషమువలనఁ గాని, వర్ణదోషమువలనఁ గాని యన్యార్థమునిచ్చు దుష్టశబ్దము కోరిన యర్థమొసంగక వజ్రాయుధమై యాగము చేయు వానిని హింసించునని భావము.

పూర్వము తన పుత్త్రుఁడగు విశ్వరూపుఁ డనువానినింద్రుఁడు వధింపఁగా గోపించి త్వష్ట యను వాఁ డింద్రుని జంపెడు శక్తిగల పుత్త్రుని గోరి వృత్రాసురునకై యాగ మొనర్చెను. ఇంద్రుని జంపెడువాఁ డనునర్థము వచ్చునట్లు "స్వాహేన్ద్రశత్రుర్వర్ధస్వ" (తై. సం. 2-4-12) అను మంత్రము నుచ్చరించుచుఁ దత్పురుషసమాసముగా నందుఁ బ్రయోగింప వలసిన యంతోదాత్తస్వరమునకుఁ బదులు ప్రమాదవశమున నాద్యుదాత్త స్వరము పఠించుటచే బహువ్రీహ్యర్థము వచ్చి యింద్రుఁడే హింసకుఁడై పుట్టిన వృత్రాసురుని వధించెను. ఇట్లు స్వరము మారినంతనే యర్థము మారి యనర్థములు వచ్చునుగాన ధర్మజుని ఋత్విజులు స్వరమును సరిగా నుచ్చరించి రనిభావము.

శ్లో. పరితః ప్రమితాక్షరాఽపి సర్వం విషయమ్ ప్రాప్తవతీ గతా ప్రతిష్ఠామ్
న ఖలు ప్రతిహన్యతే కుతశ్చిత్ పరిభాషేవ గరీయసీ యదాజ్ఞా॥

ఆ. వె. అతని యానతి... ... ... ...ఆ. మా. (16-80).

శ్రీకృష్ణునొద్ద దూత శిశుపాలుని పరాక్రమమును వర్ణించు సందర్భము. మితాక్షరములు గలదైనను దేశమునందంతటను వ్యాపించి ప్రమాణముగలదై గౌరవమును గల్గిన శిశుపాలుని యాజ్ఞ; మితాక్షరములతోఁ గూడి శాస్త్రము నందంతటను వర్తించు పరిభాషవలె నొప్పుచున్న దని భావము. "ఇకో గుణవృద్ధీ" మొదలగు వానికి వ్యాకరణశాస్త్రమునఁ బరిభాష అని పేరు. పరిభాష యేకదేశమందున్నను సర్వశాస్త్రమును దీపమువలెఁ బ్రకాశింపఁజేయు నని భాష్య కారులవచనము.

శ్లో. నిపాతిత సుహృ త్స్వామి, పితృవ్య భ్రాతృ మాతులమ్
పాణినీయ మివాలోకి ధీరై స్తత్సమరాజిరమ్॥

తే. అనుపమంబైన... ... ... ...ఆ. మా. (19-72).

వీరశయ్యను బొందిన మిత్రులు, ప్రభువులు, పితృసోదరులు, సోదరులు, మేనమామలు, గల యారణరంగము "సుహృద్దుర్హృదౌ" మొదలగు నిపాతన సూత్రములు గల పాణినివ్యాకరణ మువలె నున్నదని భావము.

ప్రకృతి ప్రత్యయములచే సాధింపఁబడని శబ్దముల సాధుత్వమునకై రచింపఁబడు సూత్రములకు నిపాతన సూత్రము లనిపేరు. "సుహృద్దుర్హృదౌ మిత్రామిత్రయోః" (5-4-150) అను సూత్రములో హృదయ శబ్దమునకు హృద్భావము, "స్వామిన్నైశ్వర్యే" (5-2-126) అను సూత్రములో మత్వర్థీయ స్వామిశబ్దము, "పితృవ్య మాతుల మాతామహ పితామహాః" (4-2-36) అను సూత్రములో వ్యదుల్ఙంతములు "నప్తృనేష్టృ" ...... నిపతింపఁ బడుటచే నిట్లుచెప్పఁబడినది.

దురాచార విపక్త్రి మాపదః (1-73):- అను శ్లోకములో విపక్త్రిమ శబ్దము వాడఁబడినది. దురాచారముచేతఁ గాలపరిపాకముచేత వచ్చిన యాపద లనిభావము. 'వి' పూర్వక 'పచి' ధాతువునకు 'డ్వితః క్త్రిః' (3-3-82) అను సూత్రముచే క్త్రిప్రత్యయము "క్త్రేర్మమ్నిత్యమ్" (4-4-20) అను సూత్రముచే మప్ప్రత్యయము రాఁగా విపక్త్రిమమను

రూప మేర్పడును. "అన్యూనాఘూర్జిత పత్త్రిమాపదురువాధ్యుల్ (1-73)" అని తెనుఁగునఁ గూడ వాడఁబడినది.

రామోష్ఠబిమ్బచుమ్బన చుఞ్చునా (2-14):- అనుచోట "తేన విత్త శ్చుఞ్చుప్ చణపౌ" (5-2-26) అను సూత్రముచే విధింపఁబడిన చుంచుప్ప్రత్యయమును మాఘుఁడు వాడఁగా "వల్లి ఘాధర బింబ చుంబన చణమగు" (2-14) అని చణప్ప్రత్యయమును మహాదేవుఁడు గారు వాడిరి.

సరజస మకరన్ద నిర్భరాసు (7-42):- అచతుర విచతుర సుచతుర స్త్రీపుంస ధేన్వనడుహ ర్క్సామ వాఙ్మన సాక్షిభ్రువ దారగవోర్వష్ఠీవ పదష్ఠీవ నక్తన్దివ రాత్రిన్దివాహర్దివ సరజస నిఃశ్రేయస పురుషాయుష ద్వ్యాయుష త్ర్యాయుష, ర్గ్యజుష, జాతోక్ష మహోక్ష వృద్ధోక్షోపశున గోష్ఠశ్వాః (5-4-77)" అను సూత్రమునందజంతముగా నిపతింపఁ బడుటచే సరజసశబ్దము సాధువు. ఇది సాకల్యమున నవ్యయీభావము. "అవ్యయీభావే చాకాలే" (6-3-81) అను సూత్రముచే నవ్యయీభావమునందు" సహస్యసః సంజ్ఞాయామ్" (6-?-78) అను సూత్రముచే సహశబ్దమునకు సభావమువచ్చి యజంతనిపాతముచే "సరజస" మని యగును. రజోభిః పరాగైః సహ అను విగ్రహమున "తేన సహేతి తుల్యయోగే" (2-2-28) అను సూత్రముచే బహువ్రీహియందు "వోపసర్జనస్య" (6-3-82) అను సూత్రముచే సహ శబ్దమునకు సభావమువచ్చి బహువ్రీహి యగుటచే నజంతముకాక సరజః పఙ్కజమ్ అని యగును. "తతోఽవ్యయీభావః, సహరజసా సరజసమ్" అని భాష్యకారులు. ప్రౌఢమనోరమలో సరజః పఙ్కజ మితి-కథంతర్హి? "సరజస మపహాయ కేతకీనామ్ ప్రసవమ్" (కిరాత. 10-26) ఇత్యాది, "సరజస మకరన్ద నిర్భరాసు ప్రసవ విభూతిషు భూరుహాం విరక్తః" (మాఘ-7-42) ఇతి? ప్రమాద ఏవాయ మిత్యాహుః" అని భారవి మాఘప్రయోగములు ప్రమాదములే యని భట్టోజీదీక్షితులు. బృహచ్ఛబ్దేందుశేఖరములో సరజః పఙ్కజమితి- "సరజస మపహాయ కేతకీనామ్ ప్రసవ" మితి పుంలిఙ్గ పుష్పవాచి ప్రసవ విశేషణత్వేన ద్వితీయాన్తం సాధు. యది తు తద్వాచి ప్రసవశబ్దస్య నపుంసకత్వమేవ, తదా ప్రమాద ఇతి బోధ్యమ్. "సరజస మకరన్ద నిర్భరాస్వి"తి తు ప్రమాద ఏవేతి బోధ్యమ్" ప్రసవశబ్దమునకుఁ బుం స్త్వవివక్షయందు "సరజసమ్" అనునది ద్వితీయాంతముగా నన్వయించి భారవిప్రయోగమునకు సాధుత్వ పక్షము చూపి, మాఘప్రయోగము ప్రమాదమే యని భట్టనాగేశులు చెప్పిరి. సర్వంకషలో సహరజసా సరజసమ్. అవ్యయ మిత్యాదినా సాకల్యార్థేఽవ్యయీభావః. అచతుర ఇతి సమాసాన్త నిపాతః తేన సరజస్కఽ ఇతి బహువ్రీహ్యర్థోలక్ష్యః, ముఖ్యోవా. మహాకవి ప్రయోగ బాహుల్యాత్. అన్యయీభావ దర్శనం తు ప్రాయిక మిత్యుక్తమ్ ప్రాక్. (అత ఏవ న సరజస మిత్యనవ్యయీ భావ ఇతి వామనః. అథ వా మహాకవిప్రయోగ దర్శనాదవ్యయీభావ దర్శనమ్ ప్రాయికమితి పక్షాశ్రయణా ద్బహువ్రీహ్యర్థోఽపి సాధురేవ (6-47)' మహాకవి ప్రయోగబాహుళ్యమువలన సరజసశబ్దమునకు లక్షణచే బహువ్రీహ్యర్థము కూడ సాధువే యని మల్లినాథుఁడు. "సరజసతా మవనేరపాం నిపాతః" (10-20) అని భారవి ప్రయోగము.

సరస్వతీకంఠాభరణము నందలి "స్త్రీపుంస ధేన్వనడుహ ర్గ్యజుష ర్క్సామ వాఙ్మన

పాక్షత్రువ దారగ వౌరక్షీవ వదష్ఠీ వాహోరాత్ర రాత్రిందివ నక్తన్ది వాహర్దివ సరజస పురుషాయుష ద్వ్యాయుష త్ర్యాయుష జాతోక్ష మహోక్ష వృద్ధోక్షోపశున గోష్ఠశ్వాః" (5-4-92) అను శోజసూత్రమునకు హృదయహారిణి యను వ్యాఖ్యలో "సరజసమితి సాకల్యేఽవ్యయీభావః సరజస మభ్యవహరతి. బహువ్రీహిర్వా. సరజస మపహాయ కేతికీనామ్ ప్రసవమ్ ఇతి" అని సరజసమును బహువ్రీహిగాఁ గూడ నారాయణదండ నాథుఁడు పేర్కొనినాఁడు. ఆంధ్రమాఘములో నదే "సరజస సమరంద జాత ప్రసవ కుజములు" (7-32) అని వాడఁబడినది.

తవ వరద కరోతు సుప్రాత మహ్నామయం నాయకః [11-67]:- సుప్రాత సుశ్వ సుదివ శారికుక్ష చతుర శ్రైణీపద అజపద ప్రోష్ఠపదాః [5-4-120]. అను సూత్రమున బహువ్రీహ్యర్థమున నచ్ప్రత్యయాంతముగా నిపతింపఁబడుటచే నచ్ప్రత్యయాంతమై "టి" లోపము గలిగి సుప్రాత మని యేర్పడును. శోభనమైన ప్రాతః కాలము కలది సుప్రాతము. సుప్రభాత మని యర్థము. నీకు సుప్రాత మొనరించుఁ గాక నేఁడు. ఆ. మా. [11-67].

కూలంకషోపాంత సరితః [12-60] - సర్వ కూ లాభ్ర కరీషేషు కషః [3-2-42] అను సూత్రముచేఁ గూలశబ్దమునకుఁ బరమగు "కష్" ధాతువునకు "ఖచ్" ప్రత్యయము వచ్చి "కూలమ్ కషతి" యను విగ్రహమున సుబ్లోపమై ముమాగమము వచ్చి కూలంకషమని యేర్పడును. కూలంకషోపనదుల... ... ...ఆ మా. [12-60].

పుణ్యా మృగ్యజుష మధ్యగీషత [14-21]:- "అచతుర" సూత్రములో ద్వంద్వైకవద్భావమున 'అచ్' ప్రత్యయాంతముగా ఋగ్యజుష శబ్దము నిపతింపఁబడినది. ఎలమి నధ్యయనించిరి ఋగ్యజుషము. ఆ. మా. [14-21].

తథాపి వాచాలతయా యునక్తి మామ్ [1-40]:- వాచో బహవోఽస్య సన్తి యను విగ్రహమున "వాచ్" శబ్దమునకు 'ఆలజ టచౌ బహుభాషిణి' [5-2-125] అను సూత్రముచే 'ఆలచ్' ప్రత్యయము రాఁగా 'వాచాల' యని యేర్పడి తల్ప్రత్యయము చేరఁగా 'వాచాలత' యని యగును. ఒక వాచాలత యుద్భవించి... ... ...ఆ. మా. [1-40].

ఇట్లే తక్కిన ప్రయోగముల ప్రక్రియ యెఱుంగవలయును.

ఈ కావ్యములో మిక్కిలి విచిత్రప్రయోగములు గల శ్లోకము.

శ్లో॥ పురీమవస్కన్ద లునీహి నన్దనమ్ ముషాణ రత్నాని హరామరాఙ్గనాః,
విగృహ్య చక్రే నముచిద్విషా బలీ య ఇత్థ మస్వాస్థ్య మహర్దివం దివః. (1-51)

శ్రీకృష్ణునకు నారదుఁడు రావణుఁ డొనర్చిన దుండగములను జెప్పు సందర్భము. బలవంతుఁడగు రావణుఁ డింద్రునితో విరోధించి యమరావతి నాక్రమించెను. నందనవనమును ఛేదించెను, రత్నములను దొంగిలించెను. అప్సరఃస్త్రీల నపహరించెను. ఈ విధముగాఁ బ్రతిదినము దాడిచేసి స్వర్గమున కస్వాస్థ్యము చేకూర్చెను. అని దీని భావము.

ఇందు అవస్కన్ద, లునీహి, ముషాణ, హర, యనునవి లోణ్మధ్యమపురుషములను బోధించు క్రియాపదములు. అనఁగాః అవస్కన్ద = అవరోధింపుము; లునీహి : ఛేదింపుము ముషాణ : దొంగిలింపుము; హర = అపహరింపుము; అని యర్థము. ప్రథమపురుషబోధక మగు రావణపదమునకు మధ్యమ పురుష క్రియలతో నన్వయము గుదురదు. ఇచట

మల్లినాథుఁడు 'బలీ' యను పదమున కన్వయించు నట్లు వరోధించెను, ఛేదించెను, దొంగిలించెను, హరించెను; అనియన్నిక్రియల యందును పౌనఃపున్యార్థమునుజెప్పి "అత్రా'వస్కన్దే త్యాదౌ 'క్రియాసమభిహారే లోట్, లోటో హిస్వౌ వా చ తధ్వమోః' ఇ త్యనువృత్తౌ 'సముచ్చయేఽ న్యతరస్యామ్' ఇతి ఏకల్పేన కాలసామాన్యే లోట్. తస్య యథాసఙ్గ్రహం సర్వత్రి జాదేశో హిస్వౌ చ. ప్రకరణాదినా త్వర్థ విశే షావసానమ్ 'అతోహేః' ఇతి యథాయోగ్యం హిలుక్. పౌనఃపున్యమ్ భృశార్థో వా క్రియాసమభిహారః అవస్కన్దనాది క్రియావిశేషాణాం సముచ్చయః క్రియాసమభిహారః. తత్సామాన్యస్య 'సముచ్చయే సామాన్య వచనస్య' ఇ త్యనుప్రయోగః చక్రే ఇతి." "క్రియాసమభిహారే...., సముచ్చయే...." అను సూత్రముల వలన సర్వకాల సామాన్యమగు లోట్టు ప్రయోగింపఁబడిన దనియు 'సముచ్చయే సామాన్య వచనస్య' అను సూత్రము వలన నవస్కందాది క్రియాసమభిహారమునకుఁ 'జక్రే' యను ననుప్రయోగము చేయఁబడిన దనియు వ్యాఖ్యాన మొనర్చినాఁడు.

సిద్ధాంత కౌముదిలోఁ బై సూత్రములకు వృత్తివ్రాయుచు "ఏతేన పురీమవస్కన్ద.... ఇతివ్యాఖ్యాతమ్. అవస్కన్ద లవనాది రూపా భూతానద్యతనపరోక్షా ఏకకర్తృకాఅస్వాస్థ్యక్రియేత్యర్థాత్. ఇహ పునఃపునశ్చస్కన్దేత్యాదిరర్థ ఇతి వ్యాఖ్యానమ్ భ్రమమూలకమేవ. ద్వితీయ సూత్రే 'క్రియాసమభిహారే' ఇత్యస్యాననువృత్తేః. లోడన్తస్య ద్విత్వాపత్తేశ్చ. పురీమవస్కన్దేత్యాది మధ్యమ పురుషైకవచన మిత్యపి కేషాఞ్చి ద్భ్రమఏవ పురుషవచన సంజ్ఞే ఇహ నేత్యుక్తత్వాత్." భూతానద్యతన పరోక్షమును బోధించు నవస్కంద లవనాదుల కేక కర్తృక మగు నస్వాస్థ్యక్రియ తోడనే యన్వయము. ద్వితీయసూత్రమున 'క్రియా సమభిహార'సూత్రానువృత్తి లేనందునను, (పునఃపునశ్చస్కన్ద) మాటిమాటికి నవరోధించె ననునర్థము చెప్పిన వ్యాఖ్యానము భ్రమమూలకము. ఇచట 'పురీమవస్కన్ద' మొదలగు వానికి మధ్యమపురుషైకవచనార్థము చెప్పుట కూడఁ గొందఱి భ్రమయే. ఇచటఁ బురుష వచన సంజ్ఞలు పేర్కొనఁబడలేదని భట్టోజీదీక్షితులు మల్లినాథునివ్యాఖ్యను ఖండించినారు. ఇచ్చటఁబాణినీయ సూత్రముల యర్థమును గ్రమముగా విచారింపవలయును.

క్రియాసమభిహారే లోట్, లోటో హిస్వౌ వా చ తధ్వమోః (3-4-2): క్రియాసమభిహార మనఁగాఁ బౌనఃపున్యము. పౌనఃపున్యార్థమును బోధింపవలసినపుడు 'లోట్టు' వచ్చును. ఆ లోట్టునకు 'హి-స్వ' ప్రత్యయములు వచ్చును. ఇచ్చటఁ బురుషవచనవివక్ష లేక యన్ని కాలము లందును బరస్మైపదమున 'హి' ప్రత్యయము, నాత్మనేపదమున 'స్వ' ప్రత్యయము వచ్చును. 'త-ధ్వమ్' ప్రత్యయముల విషయమున లోట్టునకు 'హి—స్వ' ప్రత్యయములు వచ్చును. పక్షమున, త - ధ్వమ్ ప్రత్యయములు వచ్చును. సముచ్చయేఽ న్యతరస్యామ్ (8-4-3): అనేక క్రియా సముచ్చయమునందు గూడఁ బై రీతిని లోట్టునకు హి— స్వ ప్రత్యయములు వచ్చును. ఇచట ఛన్దోఽధీష్వ వ్యాకరణమ ధీష్వ నిరుక్తమధీష్వే త్యేవాయ మధీతే అనఁగా ఛందో వ్యాకరణ నిరుక్తములను మాటిమాటికి నధ్యయనము చేయుచున్నాఁ డనిభావము.

యథావి ధ్యనుప్రయోగః పూర్వస్మిన్ (3-4-4): ఈ లోడ్విధానమునందు లోడంతముగా నేధాతువు ప్రయోగింపఁబడినదో యాధాతువునే యనుప్రయోగ ధాతువుగాఁ బ్రయోగింపవల

యును. అనఁగా 'లునీహిలునీ హీత్యేవాయం లునాతి' యని ప్రయోగింపవలయును గాని 'లునీహి లునీహీ త్యేవాయం ఛినత్తి' యని లోట్ప్రయుక్తధాతువునకు భిన్నధాతువును బ్రయోగింపరాదు.

సముచ్చయే సామాన్యవచనస్య (3-4-5): సముచ్చయమునందు లోడ్విధిలో సామా న్యార్థకమగు ధాతువు ననుప్రయోగింపవలయును 'ఓదనమ్భుంక్ష్వ, సక్తూన్ పిబ, ధానాః ఖాదేత్యేవాయ మభ్యవహరతి' అని సముచ్చయమునందుఁ బ్రయోగింపవలయును.

'క్రియాసమభిహారే ద్వే వాచ్యే' అను వార్తికమువలన క్రియాసమభిహారధాతువునకు ద్విత్వము వచ్చును. అనఁగాఁ బై మాఘశ్లోకములో "అవస్కన్ద అవస్కన్ద: లునీహి లునీహి" యని ద్విర్వచన మున్నపుడే పౌనఃపున్యార్థమును జెప్పవలయునుగాని లేకపోవుటవలనఁ జెప్ప రాదు. ఇది యిట్లుండ

"అథైతయోః పథోర్న కతరేణచన తా నీమాని క్షుద్రాణ్యసకృదావర్తీని భూతాని భవన్తి జాయస్వ మ్రియస్వే త్యేత త్తృతీయగ్ం స్థానం తేనాసౌ లోకో న సమ్పూర్యతే తస్మా జ్జుగుప్సేత తదేష శ్లోకః. (5-10-8)" అను ఛాందోగ్యోపనిషద్వాక్యమునకు భాష్యములో "అత ఉభయమార్గపరిభ్రష్టా హ్యసకృజ్జాయన్తే మ్రియన్తే చేత్యర్థః. తేషాం జనన మరణ సన్తతే రనుకరణ మిదముచ్యతే" అనుచోట "జాయస్వ మ్రియస్వ" యను క్రియాపదముల కుభయమార్గపరిభ్రష్టులు మాటిమాటికిఁ బుట్టుచున్నారు, చచ్చుచున్నారను నర్థమును శ్రీ శంకరా చార్యులు చెప్పిరి. ఈ భాష్యవ్యాఖ్యానములో "పౌనఃపున్యేన లోణ్మధ్యమైకవచనా త్తయోః పర్యాఖ్యాతేషు విధానాత్ పునఃపున ర్జాయన్తే మ్రియన్తే చేత్యస్మిన్నర్థే జాయస్వ మ్రియస్వేతి ప్రయోగ ఇత్యాహ" అని యానందగిరి పూజ్యపాదులు 'జాయస్వ' 'మ్రియస్వ' యను లోణ్మధ్యమైకవచనక్రియాపదములు పౌనఃపున్యమున 'జాయన్తే మ్రియన్తే' యను నర్థమునఁ బ్రయోగింపఁబడినట్లు చెప్పుచున్నారు.

ఇట్లే 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యనుచోటఁ బ్రహ్మసూత్ర శాంకరభాష్యవ్యాఖ్య యగు భామతిలో 'అథాస్య పురుషధౌరేయస్యా మభవోపపత్తిభ్యా మేవంసునిపుణం నిరూపయతః ఆ చ సత్యలోకాదా చావీచే ర్జాయస్వ మ్రియస్వేతి విపరివర్తమానం క్షణ ముహూర్త యా మాహోరా త్రార్ధమాస మాస ర్త్వయన వత్సర యుగ చతుర్యుగ మన్వన్తర ప్రలయ మహా ప్రలయ మహాసర్గా వాన్తరసర్గ సంసారసాగరోర్మిభి రనిశ ముహ్యమానం తాపత్రయపరీత మాత్మానం జీవలోకం చావలోక్య, అస్మిన్ సంసారమణ్డలే అనిత్యాశుచిదుఃఖాత్మకమ్ ప్రసంఖ్యాన ముపావర్తతే' అనుచోట ద్విర్వచనరహితముగానే షడ్దర్శనచక్రవర్తులగు వాచస్పతిమిశ్రులు ప్రయోగించినారు. ఈభామతీవ్యాఖ్యానమగు వేదాంతకల్పతరువులో 'జాయస్వ మ్రియస్వేతి–పునఃపున ర్జాయతే మ్రియతే చేత్యర్థః. 'క్రియాసమభిహారే లోట్' ఇతి పౌనఃపున్యే సర్వలకారాపవాదేన లోటః స్వాదేశస్య చ విధానాత్' అని ద్విత్వాభావము లేకపోయినను క్రియాసమభిహారసూత్రమువలనఁ బౌనఃపున్యార్థమునందు లోట్టు, స్వాదేశము వచ్చినదని భగవదమలానందాచార్యులు చెప్పినారు.

వైయాకరణమూర్ధన్యులగు నాగేశభట్టపాదులు కౌముదిని వ్యాఖ్యానించుచు వార్తికమున 'ద్వేవాచ్యే' అని చెప్పుటవలన పైమాఘశ్లోకములో ద్విర్వచనప్రయోగము లేనందున 'క్రియా సమభిహారే లోట్' అను సూత్రముచేఁ బౌనఃపున్యార్థము చెప్పరాదు. అను ప్రయోగమగు

'చ్రకే' తోనన్వయించి యస్వాస్థ్యమును జేకూర్చెనని చెప్పవలయును లేక బలియగు రావణుఁడు 'అవస్కన్ద = అవరోధింపుము' మొదలగు క్రియలతో సేవకులను బ్రేరణ మొన ర్చియస్వాస్థ్యమును జేకూర్చెనని చెప్పవలయును. 'అహర్దివమ్' అనియుండుటచేఁ బౌనః పున్యార్థమును జెప్పవచ్చును. భాష్యకారు లనుప్రయోగవిధిని నిరాకరించుటచే 'జాయస్వ మ్రియస్వ' అను శ్రుతిలో ననుప్రయోగ మక్కరలేదు. అసకృత్పదము వలన శ్రుతిలోఁ బౌనః పున్యార్థము వచ్చును. అట్లే వాచస్పతి ప్రయోగములోఁ బలుమాఱులు 'చ, చ' యని యుండుటచేఁ బౌనఃపున్యార్థము చెప్పవలయును. 'క్రియాసమభిహారే లోట్' అను సూత్ర ముచేఁ బౌనఃపున్యార్థము చెప్పు కల్పతరువు చింత్య మని అమ్మయ్యహవ్యబ్దేందు శేఖరములలో విపులముగాఁ జర్చించినారు. ఇదియంతయు నాలోడించి బాల మనోరమలో 'బలియగు రావణుఁ డింద్రునితో విరోధించి యమరావతి యొక్క యవస్కందనము, నందనవన లవ నము, రత్నముల మోషణము, నమరాంగనల హరణము నీవిధముగా నహర్దివము స్వర్గ మున కస్వాస్థ్యము చేకూర్చెనని యర్థ'మని మీమాంసకశిరోమణులగు వాసుదేవ దీక్షితులు చెప్పినారు. కల్పతరుపరిమళములో "క్రియాసమభిహారే ఇతి—' క్రియాసమభిహారే లోట్ లోటో హిస్వౌ' ఇతి పాణిని సూత్రేణ , క్రియాపౌనఃపున్య వివక్షాయాం సర్వలకారాపవాదేన లోడ్విహితః; తస్య పరస్మైపదాత్మనేపదయో ర్యథాక్రమం హిస్వౌ వాదేశౌ చ విహితౌ. నను క్రియాసమభిహారే లునీహి లునీ హీత్యేవాయం లునాతి 'ఇత్యాద్యుదాహరణాన్త రేష్వివ' 'జాయస్వ జాయస్వేత్యేవేమాని జాయన్తే' మ్రియస్వ మ్రియస్వేత్యేవ మ్రియన్తే. ఇతి ద్విర్భావ స్తస్య తస్య ధాతో రనుప్రయోగశ్చ ప్రాప్నోతీతి తత్సూత్ర వార్తికే ద్విర్భావానుశాస నాత్; "యథావిధ్యనుప్రయోగః పూర్వస్మిన్" ఇతి సూత్రేణ క్రియాసమభిహారే తస్యైవ ధాతో రనుప్రయోగనియమాచ్చ; నైష దోషః; క్రియాసమభిహారవత్ జనన మరణ క్రియాద్వయ సముచ్చయ స్యాప్యత్ర వివక్షితత్వాత్, సముచ్చయేఽ న్యతరస్యా మితిసూత్రేణ సముచ్చ యేఽపి లోణ్మధ్యమ పురుషైకవచనవిధా నాత్. తత్ర హి న ద్విర్భావవార్తిక మస్తి; నాపి యథావిధ్యనుప్రయోగవిధాన మస్తి; కిన్తు 'సముచ్చయే సామాన్య వచనస్య' తిసూత్రేణ తావత్క్రియావిశేషానుగత సామాన్యవచన స్యాను ప్రయోగో విహితః 'ఓదనమ్ భుంక్ష్వ, క్షీరమ్ పిబ; ధానాః ఖాద ఇత్యేవ మభ్యవహరతి' ఇత్యాది తదుదాహరణమ్. ఇహాపి జనన మరణానుగత సామాన్యరూప వివరివృత్తి వాచినోఽనుప్రయోగోఽస్తి — 'అసకృదావర్తని భూతాని భవన్తి' ఇతి. క్రియాసమభిహార సముచ్చయో భయవివక్షాయాం చ సముచ్చయ వివక్షాప్రయుక్తమేవ కార్యమ్ భవతి,' విప్రతి షేధే పరంకార్య మితి స్మరణాత్" 'సముచ్చ యేఽ న్యతరస్యామ్' అనుసూత్రమునందు 'క్రియాసమభిహారే ద్వే వాచ్యే' అను వార్తికము పఠింపక పోవుటచే ద్విర్భావము లేక పోయినను బౌనఃపున్యార్థము చెల్లునని సర్వతంత్రస్వతంత్రు లగు నప్పయ దీక్షితులు పరిష్కరించినారు. ఇట్లు రెండుపక్షములు గూడ నున్నవని గ్రహింప వలయును.

ఉ. కట్టిఁడియై మహేంద్రువయిఁ గట్టలుకన్ వహియించి పాకజి
త్పట్టన మాక్రమించెఁ జెఱపట్టె సురాంగనలన్ మహార్ఘమై
నట్టి మణుల్ హరించె నురుమాడెను నందనమెల్ల బెక్కుమా
ర్లిట్టులహర్దివంబు గననీఁడ సురారి దివంబునస్వస్థతన్.

అని మహాదేవుఁడుగారు పెక్కుమార్లు అహర్దివ మనికూడఁ బ్రయోగించినారు. శ్లోకములో నవస్కందలవనాది క్రియాసముచ్చయ ముండుటచేఁ బౌనఃపున్యార్థము వచ్చును గాన దానికిఁ దెలుఁగులోఁ బెక్కుమార్లను పదము ప్రయుక్తమైనది.

ఈశ్లోకము మాఘమహాకవి వ్యాకరణ పాండిత్యమునకు నికషోపలము. ఇట్టి వ్యాకరణరహస్య ప్రయోగములు మురారిమహాకవి యనర్ఘరాఘవమునఁ గూడఁగనఁబడును. అందువలననే.

శ్లో. మురారి పదచిన్తా చేత్ తథా మాఘే రతిం కురు.
మురారి పదచిన్తా చేత్ తథా మాఽఘే రతిం కురు.

మురారి పదప్రయోగనైపుణ్యము తెలిసినచో మాఘకావ్యమును జదువుము. విష్ణుమూర్తి (మురారి) పదచింతయున్నచోఁ బాపములొనర్పకు మను శ్లోకమును బెద్దలు చెప్పిరి.

రాజనీతి పరిచయము.

శ్లో. షడ్గుణా శ్శక్తయ స్తిస్రః సిద్ధయ శ్చోదయా స్త్రయః।
గ్రన్థానధీత్య వ్యాకర్తు మితిదుర్మేధసోఽప్యలమ్ (2-26)
తే. గీ. ఆఱుగుణముల ........ ఆ. మా. (2-24).

ఇవి బలరాముని పలుకులు. ఆఱుగుణములు, మూఁడుశక్తులు, మూఁడుసిద్ధులు, మూఁడుదయములు. వీనిని వ్యాఖ్యానము చేయుటకు బృహస్పతి, శుక్ర, చాణక్య, కామందకాది నీతిశాస్త్రముల నభ్యసించి మందబుద్ధులు గూడ సమర్థులగుదురు. అనఁగా గ్రంథమున నభ్యసించినను దీనినెట్లు కార్యరూపమున నాచరింపవలయునో రాజనీతిజ్ఞులగు శ్రీకృష్ణాదు లెఱుఁగుదురు గాని, యుద్ధవాదులు తెలియనేరరని భావము.

శ్లో. సన్ధి ర్నా విగ్రహో యాన మాసనం ద్వైధ మాశ్రయః।
షడ్గుణా శ్శక్తయ స్తిస్రః ప్రభా వోత్సాహ మన్త్రజాః।
క్షయః స్థానం చ వృద్ధిశ్చ త్రివర్గో నీతవేదినామ్ అనియమరము.

(1) సంధి (2) విగ్రహము (3) యానము (4) ఆసనము (5) ద్వైధీభావము (6) సమాశ్రయము. అనునవి యాఱుగుణములు. ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి యనునవి మూఁడు శక్తులు. ఈ మూఁడు శక్తులవలన సాధింపఁదగినవి ప్రభుసిద్ధి, మంత్రసిద్ధి, ఉత్సాహసిద్ధి యనునవి మూడుసిద్ధులు. వృద్ధి, క్షయము, స్థానము ననునవి మూఁడుదయములు. విజిగీషువు—శత్రువు వీరల మైత్రి సంధి: వీరల విరోధము విగ్రహము; విజిగీషువు శత్రువుపైకి దండయాత్ర చేయుట యానము వీరు ప్రతిబద్ధశక్తులై కాలము కొఱకు వేచియుండుట యాసనము. ప్రబల దుర్బలుల వాచికమగు నాత్మసమర్పణము ద్వైధీభావము. (బలవంతులగు నిద్దఱు శత్రువుల నడుమ నుండెడువాఁడు వారిరువురతోఁ బ్రత్యేకముగా నీవాఁడ నని చెప్పుట. అం దొకనిచే సంధి చేసుకొనుట, యొకనితోఁ గలహించుట ద్వైధమని శబ్దరత్నాకరము). శత్రువుచేఁ బీడింపఁబడినవాఁడై వాని నాశ్రయించుట సంశ్రయము. కోశదండముల వలనఁ బుట్టిన తేజస్సు ప్రభావము. చేయఁదగిన కార్యములకై యొనర్చు స్థిరప్రయత్న ముత్సాహము. ఈ షడ్గుణచింతనము రాజ్యాంగమంత్రము.

శ్లో. సఖా గరీయాన్ శత్రుశ్చ కృత్రిమ స్తౌహి కార్యతః.
స్యాతా మమిత్రౌ మిత్రే చ సహజ ప్రాకృతా వపి. (2-36).
సీ. అరి ప్రాకృతుండైన ... ... ... ఆ. మా. (2-31).

నిర్నిమిత్తముగా నుపకారము చేయువాఁడు కృత్రిమమిత్రుఁడు. అట్లే నిర్నిమిత్తముగా నపకారమొనర్చువాఁడు కృత్రిమశత్రువు. పినతల్లి పెదతల్లి బిడ్డలు, మేనత్త మేనమామ బిడ్డలు సహజమిత్రులు. పినతండ్రి పెదతండ్రి బిడ్డలు వారి సంతతి సహజశత్రువులు. తన సరిహద్దు దేశమున నున్నవాఁడు ప్రాకృతశత్రువు. వాని కవ్వలిప్రక్కనున్నవాఁడు మొదటివానికిఁ బ్రాకృతమిత్రుఁడు. కారణమేమన రెండవవానికి మూఁడవవాఁడు సరిహద్దున నుండుటవలన శత్రువై మొదటివానికి మిత్రుఁడగును. సహజప్రాకృతులగు మిత్రశత్రువుల యందు మిత్రత్వ శత్రుత్వములు నియతములు గావు. అనఁగా నొకమాఱు మిత్రులై యుప కార మొనర్చి మఱియొక్కమాఱు శత్రువులై యపకార మొనర్పవచ్చును. కృత్రిమమిత్ర శత్రులు నిమిత్తమాత్రు లగుటచే నుపకారాపకార భయము వారివలన నుండదు. కాఁబట్టి కృత్రిమ, సహజ, ప్రాకృతులగు మిత్రశత్రువులలోఁ గృత్రిమ మిత్రశత్రువులే శ్రేష్ఠులని భావము. ఇచటఁ గృత్రిముఁ డనఁగాఁ గపటియని యర్థముగాదు.

శ్లో. స్వశ క్త్యుపచయే కేచిత్, పరస్య వ్యసనే஽పరే
యానమాహు స్తదాసీనం త్వా ముత్థాపయతి ద్వయమ్. (2-57)
కం. తనబలము పెరుగ ... ... ... ఆ. మా. (2-50).

ఇది బలరాముని రాజనీతి. తన చతురంగాదులు, ప్రభుదండములు మొదలగు బలవృద్ధి కల్గినపుడు శత్రువుపై దండెత్తవలెనని కొందఱు చెప్పిరి. శత్రువు వ్యసనలోలుఁడైనపుడు దండు వెడలవలెనని కొందఱు చెప్పిరి. ఈ రెండును నీకు సమకూరినవి గాన నిది దండెత్తు టకు సరియగు సమయ మనిభావము.

శ్లో. "ప్రాయేణ సన్తో వ్యసనే రిపూణాం, యాతవ్య మిత్యేవ సమాదిశన్తి
తథా విపక్షే వ్యసనానపేక్షో, క్షమో ద్విషన్తమ్ ముదితః ప్రతీయాత్."

శత్రువు వ్యసనలోలుఁడు కాఁగాఁ బ్రతిఘటింపవలెనని ప్రాయికముగాఁ బెద్ద లాదేశించు చున్నారు. శత్రువు వ్యసనలోలుఁడు గాకపోయినను దాను స్వబలవృద్ధివలన సమర్థుఁడై శత్రువుపై కేఁగవలయునని కామందకుఁడు నీతిశాస్త్రమునఁ జెప్పినాఁడు.

శ్లో. "అన్యే ష్వపితు కాలేషు యదా పశ్యే ద్ధ్రువం జయమ్
తదా యాయా ద్విగృహ్యైవ, వ్యసనే చోత్థితే రిపోః". (7-183)

మార్గశీర్ష చైత్రాది శుభమాసములందే గాక, తక్కిన కాలములలోఁ గూడఁ దనకు జయము సిద్ధించునను నమ్మక మున్నచో శత్రువు వ్యసనలోలుఁడై విపన్నుఁడై నపుడే దండెత్తవలె నని మనువుచెప్పినాఁడు.

శ్లో. బుద్ధిశస్త్రః ప్రకృత్యఙ్గో ఘనసంవృతి కఞ్చుకః
చారేక్షణో దూతముఖః పురుషః కో஽పి పార్థివః. (2-82)
సీ. అవ్యాహతంబును నత్యంతతీక్ష్ణంబు ... ... ... ఆ. మా. (2-63)

బుద్ధియే యాయుధము, స్వామ్యాది రాజ్యాంగప్రకృతులే శరీరావయవములు, గొప్పదగు

మంత్రగుప్తియే కవచము. గూఢచారులే కన్నులు, రాయబారము ఇరుపు దూతయే వాక్కులుగాఁ గల్గిన లోకోత్తరపురుషుఁడు ప్రమాదములేని రాజగునని భావము. బుద్ధిబలము లేనిచో శత్రువుల వలన భంగమొందును గాన రాజు బుద్ధిశస్త్రుఁడు కావలయును. రాజ్య సప్తాంగ ప్రకృతి వైకల్యము వలన రాజు వైకల్య మొందును గానఁ బ్రకృత్యంగుఁడు గావలయును. మంత్రాలోచనము లేనిచో రాజ్యము భంగమొందును గాన గుప్తమంత్ర కవచుఁడు కావలయును. గూఢచారులు లేనిచో స్వపరమండలవృత్తాంతజ్ఞాన ముండదు గావునఁ జారేక్షణుఁడు కావలయును.

"గావః పశ్యన్తి గన్ధేన వేదైః పశ్యన్తి పణ్డితాః
చారైః పశ్యన్తి రాజాన శ్చక్షుర్భ్యా మితరే జనాః".

గోవులు వాసనవలన వస్తువులను గాంచును (పసిగట్టును). సర్వవిషయములను వేదములతోఁ బండితులు పరికింతురు. రాజులు చారుల వలన రాజ్యవిషయము లవలోకింతురు. ఇతరులగు సామాన్యమానవులు కన్నులతోఁ గాంతురని చెప్పఁబడినది. 'స్వ పర మణ్డల కార్యావలోకనే చారా శ్చక్షూంషి క్షితిపాలనామ్' భూపాలకులకు స్వపరకార్యమండల కార్య ములను జూచుటయందు గూఢచారులే కన్నులని నీతివాక్యామృతము. దూతలు లేనిచో రాజకార్యములందు మూఁగవానివలె రాజునకు వాగ్వ్యవహారసిద్ధి యుండదు గాన దూత ముఖుఁడు గావలెనని చెప్పఁబడినది. ఇట్టిలక్షణములు గల రాజపాయము లేక కుశలుఁడగు నని యుద్ధవుని రాజనీతి. ఈకావ్యము నందలి రాజనీతి చూపవలె నన్నచో ద్వితీయ షోడశ సర్గములలోని శ్లోకములన్నియు నుదాహరింపవలసి వచ్చును. మచ్చునకు నాల్గు చూపఁబడినవి. రాజనీతిలోని శ్లోకములు మిక్కిలి కష్టమైన వగుటచే నీద్వితీయ సర్గ శ్లోకముల కెత్తితేల్చని మనదేశమున వ్యవహారమున్నట్లు శ్రీమల్లాదిసూర్యనారాయణశాస్త్రిగారు సంస్కృతకవిజీవితములోఁ జెప్పిరి.

## దేవయోనివిశేష పరిచయము

బిమ్బోష్ఠమ్ బహుమనుతే తురఙ్గవక్త్ర శ్చుమ్బన్తమ్ముఖ మిహ కిన్నరమ్ ప్రియాయాః
శ్లిష్యన్తమ్ముహు రితరోఽపి తన్నిజస్త్రీ ముత్తుఙ్గస్తన భరభఙ్గ భీరు మధ్యామ్ (4-38)

తే. గీ. ప్రియయను బింబోష్ఠి ... .... ... అ. మా. (4-38)

ప్రియయొక్క దొండపండు వంటి మోవిని ముద్దాడు కిన్నరుని (అశ్వాంగము, మనుష్యముఖము గల వానిని) గాంచి తురంగవక్త్రుఁడు (గంధర్వుఁడు) మెచ్చుకొను చున్నాఁడు. అట్లే యున్నతైన గుబ్బల బరువునకు విఱుగునను భయముచే జవజవలాడు నడుము గల తనజవరాలిని గౌఁగిలించుకొను తురంముఖుని గాంచి కిన్నరుఁడు మెచ్చుకొను చున్నాఁడు. కిన్నరుఁడు మనుష్యముఖుఁ డగుటచేఁ బ్రియను జుంబించుటకు సమర్థుఁడు గాని యశ్వాంగుఁ డగుటచేఁ గౌఁగిలించుకొనుటకు సమర్థుఁడు గాఁడు. రెండవవాఁడు (గంధర్వుఁడు) మనుష్యాంగుఁడగుటచేఁ దన భార్యను గౌఁగిలించుకొనుటకు సమర్థుఁడు గాని యశ్వముఖుఁడగుటచే ముద్దిడుకొనుటకు సమర్థుఁడుగాఁడు. కాఁబట్టి యొకనిని గాంచి యొకఁడు సంతసించుచున్నాఁడని భావము. లోకములో దుర్లభమైనదే ప్రియమగుచుండు నని భావము. ఈవర్ణనము వలన రైవతకాచలము దేవతావిహారయోగ్య మని భావము.

మాఘకవి యీశ్లోకములోఁ గిన్నరులను మనుష్యముఖులు నశ్వాంగులుగాను గంధర్వుల నశ్వముఖులు మానవాంగులు గాను వర్ణించినాఁడు. రామరాజభూషణుఁడు వసుచరిత్రలో

మ. హరిమై సాదిశిరంబు సాదిమెయి జాత్యశ్వోత్తమాంగంబు గూ
డ రణోర్విన్ రఘునాథశౌరి యసిఁ జెండన్ దివ్యమందార వృ
ష్టి రహిం బ్రాణయుతంబులై గగనవాటిం బర్వ గంధర్వ కి
న్నర రూపంబులు దాల్చి సారె కవి యానందించుఁ దచ్చౌర్యమున్.

రఘునాథశౌరి యుద్ధమున ఖడ్గముచే రౌతును గుఱ్ఱమును ఖండింపఁగా రౌతుతల గుఱ్ఱముయొక్క మొండెము మీఁదను, గుఱ్ఱము శిరస్సు రౌతు మొండెము మీఁదను బడి యవి యాకాశమున నెగిరినవి. రఘునాథుని శౌర్యముగాంచి దేవతలు మందారపుష్పములు వర్షింపఁగా నీవృష్టి కపి సజీవములై గంధర్వ కిన్నర రూపములు దాల్చి దేవతలతోఁ గలిసి యవికూడ నతని శౌర్యమును గాంచి యానందించిన వని భావము. ఇచ్చట గుఱ్ఱముయొక్క మొండెముపై రౌతుతల పడి గంధర్వుఁడైనట్లు, నశ్వముఖము రౌతు శరీరముపైఁబడి కిన్నరుఁడైనట్లును వర్ణింపఁబడినది. అనఁగా గంధర్వులు మనుష్యముఖము గలిగి యశ్వదేహము గలవారనియుఁ గిన్నరు లశ్వముఖము గలిగి మానవదేహము గలవారనియు రామరాజభూషణుని యభిప్రాయము. ఇచట వసుచరిత్రవ్యాఖ్యాతలు పై మాఘశ్లోకమును బ్రమాణముగాఁ గైకొని వ్యత్క్రమాన్వయము చెప్పి గంధర్వుల తురంగముఖులు గాను, కిన్నరులు మనుష్యముఖులు గాను వ్రాసినారు. ఇదిచింత్యము. 'స్యాత్కిన్నరః కిమ్పురుష స్తురఙ్గవదనో మయుః' అని యమరకోశములోను

'కిన్నరాః స్యుః కిమ్పురుషా మయవోఽశ్వముఖాశ్చతే' అని వైజయంతీకోశములోను కిన్నరులే తురంగముఖులుగాఁ జెప్పబడినది. కాదంబరిలోఁ జంద్రాపీడుఁడు కిన్నరద్వయమును గాంచిన సందర్భమున 'కిమనేన గృహీతేనాగృహీతేన వా కిన్నరయుగళేన ప్రయోజనమ్: .... .... కస్మాచ్చ మయా నిష్ప్రయోజన మిద మనుసృత మశ్వముఖద్వయమ్' అనుచోట బాణభట్టు కిన్నరుల నశ్వముఖులుగాఁ బేర్కొనినాఁడు. సూర్యశతకములో.

మారోపాన్తే సుమేరో ర్నువతి కృతనతౌ నాకధామ్నాం నికాయే
వీక్ష్య వ్రీడావతీనామ్ ప్రతికుహరముఖం కిన్నరీణామ్ ముఖాని
సూతేఽసూయత్యపీషజ్జడగతి వహతాం కన్ధరాగ్రై ర్వ్యలద్భి
ర్వాహానాం వ్యస్యతాద్వ స్సమమసమహరే ర్హేషితం కల్మషాణి॥

సూర్యుని రథము మేరుపర్వత మార్గమున వచ్చుచుండఁగా దేవతులందరు నమస్కరించు చున్నారు. అందు సిగ్గుచేఁ దలవంచుకొనిన కిన్నరస్త్రీలను గాంచి సూర్యాశ్వములు మెడలను బ్రక్కకుఁ ద్రిప్పి మెల్లఁగా నడచుచున్నవి. అపుడు సూతుఁడగు ననూరుఁడు కోపించుచుండఁగా [వడివడిగాఁదోలుచుండఁగా] నాగుఱ్ఱములు సకిలించుచుఁ జేయు శబ్దములు మిమ్ములను రక్షించుగాఁక. ఇచటఁ గిన్నరస్త్రీ లశ్వముఖులు గాన వారిని గాంచి యాఁడు గుఱ్ఱములని భ్రమించి సూర్యాశ్వములు వారిపై పునకు మెడలు ద్రిప్పి మెల్లఁగా నడచుచున్న వని భావము. ఇట్లు మయూరమహాకవి కూడఁ గిన్నరుల నశ్వముఖులుగా వర్ణించినాఁడు. 'కిన్నరీణామ్ = అశ్వముఖీ నామ్' అని త్రిభువనపాలవ్యాఖ్య.

ఉద్వేజయ త్యఙ్గులీ ... ... మన్దం గతి మశ్వముఖ్యః॥ (1-11)

అను కుమారసంభవ శ్లోకవ్యాఖ్యలో "అశ్వానా మ్ముఖా నీవముఖాని యాసాం తా అశ్వముఖ్యః కిన్నరస్త్రియః ఉష్ట్రముఖవ త్సమాసః స్యాత్కిన్నరః కిమ్పురుష స్తురఙ్గవదనో మయుః" ఇత్యమరః' అని మల్లినాథుడు. 'యక్షోఽథ తురగాయనః గన్ధర్వో గాతు గాన్ధర్వో' అని వైజయంతి. వీనినిఁబట్టి రామరాజభూషణుని భావమే సరియైనదని నిర్ణయింపవలసి యున్నది.

ఈమాఘకవి ననుసరించియే కాఁబోలు

మ. కమఁగొంటేః సకలేందుబింబ ముఖీః యీగంధర్వులం బంకజా
సన గేహి న్యుపదిష్ట గీతరచనా సర్వంకష ప్రజ్ఞులన్.
కన దుత్తుంగ విమాన చాడులఁదురంగ గ్రీవులన్ నిర్ఝరీ
జనతా వృత్త సహాయ లాలసుల యక్షగ్రామ వాస్తవ్యులన్ (2(83)

అని గంధర్వుల నశ్వముఖులుగా ముక్కుతిమ్మన పారిజాతాపహరణమున వర్ణించి వాఁడు. వీనిసాధుత్వమునకై రెండు పక్షములునున్నట్లంగీకరింపవలయును.

## జ్యోతిషశాస్త్ర పరిచయము

పవనాత్మజేన్ద్రసుత మధ్యవర్తినా, నితరాం మరీచి రుచిరేణ చక్రిణా।
దధతేవ యోగ ముభయగ్రహాన్తర, స్థితికారితం దురుధరాఖ్య మిన్దునా॥ (13-22).

కం. భీమార్జున మధ్యస్థితుఁడై ... ... ... ఆ. మా. (13-22)

భీముఁడు నర్జునుఁడు నిరువైపులనుండఁగా మధ్య నున్న శ్రీకృష్ణుఁడు రెండుగ్రహముల మధ్యనుండి దురుధరాయోగమును బొందిన చంద్రునివలెఁ బ్రకాశించె నని భావము.

ఈ దురుధరాయోగము బృహజ్జాతకమున నిట్లుచెప్పఁబడినది.

హిత్వార్కం సునఫాఽనఫా దురుధరాః స్వాన్త్యోభయస్థై ర్గ్రహైః
శీతాంశోః కథితోఽన్యథా తు బహుభిః కేమద్రుమోఽన్యై స్త్వసౌ
కేన్ద్రే శీతకరేఽథవా గ్రహయుతే కేమద్రుమో నేష్యతే
కేచి త్కేన్ద్ర నవాంశకేషు చ వద న్త్యుక్తి ప్రసిద్ధా న తే॥ (13-6).

కల్యాణవర్మ సారావళిలో

రవివర్జం ద్వాదశగై, రనఫా చన్ద్రా ద్ద్వితీయగై స్సునఫా।
ఉభయస్థితై ర్దురుధరా, కేమద్రుమ సంజ్ఞకోఽతోఽన్యః॥

సూర్యుఁడుకాక తక్కిన కుజ, గురు, శని, బుధ, శుక్రులలో నెవరైనను జంద్రునకు రెండవయింట నున్నచో సునఫాయోగము ద్వాదశమున నున్నచో ననఫాయోగము. రెండుప్రక్కల నుండఁగా ద్వితీయ ద్వాదశ స్థానములందున్నచో దురుధరా యోగము. ఈ మూఁడు యోగములు పట్టనిచో నది కేమద్రుమయోగ మని కొందఱిమతము. ఒకప్రక్కఁ గుజాదులుండి రెండవప్రక్క సూర్యుఁడున్నచోఁ దురుధరాయోగము కల్గదు, కాని రెండు వైపుల గుజాదులుండఁగా సూర్యుఁడు కలిసినను యోగము చెడదు. 180 విధములుగా నీ దురుధరాయోగము లేర్పడవచ్చును. ఈయోగఫలితమును

శ్లో. ఉత్పన్నభోగ సుఖ భు గ్ధన వాహనాఢ్య
స్త్యాగాన్వితో దురుధరా ప్రభవః సుభృత్యః (13-9) అని వరాహమిహిరాచార్యులును

దీపముల నార్పినను వెన్నెలకాంతులు వైడూర్యముల పైఁబడి యెక్కువ వెలుఁగు నిచ్చు చున్నవని భావము.

"అవిదూరే విదూర్యస్య గిరే రుత్తుఙ్గరోధసః, కోగబాలిక సీమా న్తే మణే స్తస్యా కరో౽భవత్."

వైడూర్యములు విదూరపర్వతమునఁ బుట్టు నని వృద్ధభటుఁడు రత్నశాస్త్రములోఁ జెప్పినాఁడు. విదూరదేశములోఁ బుట్టుమణులు వైడూర్యము లని కొందఱు చెప్పుదురు.

మార్జారనేత్ర సఙ్కాశం రసాలప్రతిమం హిహా
కఠినం నిర్మలమ్ పుణ్యం వైడూర్యమేవ మఙ్గళమ్.

అను శ్లోకములో వైడూర్యము పిల్లికన్ను వలె నుండునని చండేశ్వరుఁడు రత్నదీపికలోఁ జెప్పినాఁడు

ఆ. వె. పగలు గొంది గానఁబడెడు బిడాలంబు, కన్నుఁ బోలె వెల్గు గల్గి నూలు
దిరుగు నట్టు మీఁదఁ దెరఁబారు వైడూర్య, రత్నమునకు దీప్రయత్నమునకు.

అని యాంధ్రరత్నశాస్త్రము. అందువలననే పిల్లికన్నుఱాయి యని వైడూర్యమునకుఁ దెలుఁగుపేరు.

సీ. "పిల్లికన్ రతనంపుఁ బెద్దమందసములు। పొద్దుగల్నాడెంపు మిద్దియలును"

(రా. సుం. 9) అని కూచిమంచితిమ్మకవి. రాత్రిఅందు వైడూర్యములు పిల్లికన్నుల వలెఁ బ్రకాశించు ననియు నివియున్నచోట టకెలుకలు రావనియుఁ గొందఱు చెప్పుదురు.

శ్లో. ఉరగేన్ద్ర మూర్ధరుహ రత్న సన్నిధే, ర్మహ దున్నతస్య రసితైః పయోముచః
అభవ న్యదఙ్గణభువః సముచ్ఛ్వస, న్నవ వాలవాయజ మణిస్థలాఙ్కురాః॥ (13-58)
ఆ. వె. పాఁపఱేండ్ల తలల... ... ...ఆ. మా. (13-58).

ఇది మయసభావర్ణనము. వాలవాయమనఁగా వైడూర్యములు పుట్టుదేశవిశేషము. అందుఁ బుట్టునది గాన వాలవాయజ మన వైడూర్యము. పాముల పడగల యందుఁ బుట్టిన నాగమణులు దగ్గఱగా నున్నపుడు మేఘములు గర్జించుచుండగా నాసభాంగణము వైడూర్యముల కుద్భవస్థాన మగుచున్నదని భావము. సర్పముల శిరోమణులు సన్నిధి లోనున్నపుడకాలమునఁ గూడ మేఘములు గర్జించుననియు నెచ్చట నీనాగమణులు మేఘగర్జితములు గల్గునో యదియే విదూర. భూమియనియు మల్లినాథుఁడీ శ్లోకవ్యాఖ్యలోఁజెప్పినాఁడు.

రామాయణ పరిచయము:_

ఏకస్మి న్నధికపయః శ్రియం వహ న్త్యః
సంక్షోభమ్ పవనభువా జవేన నీతాః
వాల్మీకే రరహిత రామ లక్ష్మణానాం
సాధర్మ్యం దధతి గిరామ్ మహాసరస్యః [4-59].

ఈశ్లోకమునందు రైవతకాద్రియందలి సరస్సులు వాల్మీకి వాక్కులవలె నున్నవని వర్ణింపఁ బడినవి. అధికపయః శ్రియం వహ న్త్యః = పయస్సనఁగా నీరు గనుక నెక్కువ జలసమృద్ధిని వహించుచున్న వని సరస్సుల పరమగు నర్థము. కపులనఁగాఁ గోతులు సుగ్రీవుఁడు అంగదుఁడు మొదలగు వానరుల గుణాలంకార శోభను వహించుచున్న వని వాల్మీకి వాక్కుల పరమగు నర్థము. సంక్షోభమ్ పవనభువా జవేన నీతా. = వాయుజన్యమగు వేగముచే

కోపించిన నాయికచేఁ దిరస్కృతుఁడై నాయకుఁడు వెడలుచుండఁగా నాయిక వానిని నాపుటకై కృతకముగాఁ దుమ్మెను. అది దొంగతుమ్మని తెలిసియు నాయకుఁ డపశకునమునకు భయపడినట్లు మరలి వచ్చి నాయికతోఁ గూడెనని భావము.

శ్లో. 'కార్యోద్యమే న శస్తం, క్షుతం న యాత్రాప్రదేశయో శ్చస్తమ్'

తుమ్ము కార్యారంభమునందును బ్రయాణకాలమునందును దుశ్శకునమని శకునప్రదీపమున లావణ్యశర్మ చెప్పినాఁడు.

శ్లో. వ్రజతః క్వ తాత వజసీతి? పరిచయ గతార్థ మస్ఫుటమ్
ధైర్య మభివ దుదితం శిశునా జననీ నిభర్త్స్యన విరుద్ధ మన్యునా॥ (15-87)

ఉ. పోవఁగ సిద్ధమైన .... ... ... ... అ. మా. (15-96).

శిశుపాలుని సైనికుఁడొకఁడు యుద్ధమునకేఁగు చుండఁగాఁదల్లి వలదనుటచే మిక్కిలి కోపించిన పిల్లవాఁడు నాన్నా? యెక్కడకు వెళ్ళుచున్నా వని యస్ఫుటముగా నడుగఁగా వానైనికుని ధైర్యము పోయెనని భావము. ఇచ్చట 'వ్రజసి' యనుటకుఁ బదులు మాటలు సరిగారాని శిశువు గాన 'వజసి' యని వాడఁబడినది. 'వజ-వ్రజ గతౌ' యని ధాతుపాఠ ముండుటచే నీప్రయోగము మిక్కిలి చమత్కారముగా నున్నది. ప్రయాణ మగుచుండఁగా నెక్కడకని యడుగుట యపశకునము. యోగయాత్రయందు

శ్లో. యానాశ్చనారా వివతనమ్ బృహతీవ కాచిద్ గర్భేణ భారబృహతీ స్వపురః స్థితాస్త్రీ।
ఆగచ్ఛ తిష్ఠ కుతః ఇత్యాది మర్థవాచి శబ్దాశ్చ రాజగమనే ప్రతిషేధకాః స్యుః॥

ప్రయాణ మగుచుండఁగాఁబడుట, గర్భిణీస్త్రీ మొదలగు వారెదురుగావచ్చుట, యితర జను లిటువచ్చి కూర్చొనుము ఎక్కడకు? ఆగుము, మొదలగునవి పల్కుట దుశ్శకునములని చెప్పఁబడినది.

శ్లో. అభివర్తి వల్లభతమస్య పిగల దమలాయతాంశుకా।
భూమివఖని రభసేన యతీ విరరాజ కాచన సమమ్ మహోల్కయా॥ (15-92)

ఉ. పుడమిని మింట నట్లు ... ... ... అ. మా. (15-10)

జారెడు పైఁటతో వేగముగా భూమిపైమగని కెదురుగా వచ్చునొక కాంత యుజ్జ్వలత్వముతో నాకాశమునఁ బ్రకాశించు నుల్కవలె నొప్పెనని భావము. శకున ప్రదీపమున

శ్లో. ప్రతిమూర్ధ్వచ్చ్యవోల్కా ప్రపాత కేతు ప్రబోధ నిర్ఘాతాః
వృష్టికర కామవాతా రాజ్ఞామ్ ప్రస్థానవిఘ్నాయ॥

ప్రయాణసమయమున నుల్కాపాతము, తోఁకచుక్క పొడుచుట, పిడుగులుపడుట, వడగండ్లవాన కురియుట, పెద్దగాలులువీచుట రాజులకు విఘ్నములు (అపజయము మొదలగునవి) కల్గించునని లావణ్యశర్మ చెప్పినాఁడు.

ఇట్లే శిశుపాలుని సైనికులు యుద్ధమున కేఁగుచుండఁగా వారి భార్యలు కన్నీరు కార్చుట, వారి [illegible] క్రిందఁబడుట, కన్ను అదురుట, బంధుజన లేడ్చుట మొదలగు దుశ్శకునములు వర్ణింపఁబడినవి.

రత్నశాస్త్ర పరిచయము :-

"ముక్తమ్ ముక్తాగౌర మిహ క్షీర మివాభ్రై, ర్వాపీ ష్వన్తర్లీన మహానీల దలాసు
శస్త్రీశ్యామై రంశుభి రాశుద్రిత మమ్భ, శ్ఛాయా మచ్ఛా మృచ్ఛతి నీలీసలిలస్య." (4-44)

మ. ననుముత్యంబుల డాలు.... .... ....ఆ. మా. (4-44).

ఇది రైవతకాద్రివర్ణనము. రైవతకాద్రియందలి నడబావులలో నప్పుడే మేఘములు గురిసిన నీరు ముత్యముల రంగు గలిగి పాలవలె నున్నది. ఆ బావులందున్న యింద్రనీలమణుల కాంతులు చురకత్తులవలె నల్లని వై పైకెగఁజిమ్ముటచే నానీరంతయు నీలీసలిలము (నీల మను పేరు గల యొక యౌషధపత్రరసము) వలె నల్లగా నొప్పు చున్నదనిభావము.

పయో మధ్యే క్షిపే న్నీలం సునీలం తత్పయో భవేత్
ఇన్ద్రనీలస్య పజ్ఞేయో రత్నశాస్త్ర విశారదైః
ఏతద్గుణవిశిష్టస్య లోకానాం హితకారకః
పరీక్షా శక్రనీలస్య బుధై రేవమ్ ప్రకీర్తితా. (ర. దీ. 4-14, 15)

ఇంద్రనీలములను పాలలో నుంచినచోఁ బాలు నీలవర్ణమును బొందును. ఇది యింద్రనీలమునకుఁ బరీక్ష. పాలను నల్లగా మార్చునదియే నీలమణులలో శ్రేష్ఠమైనది. యని చండేశ్వరుఁడు రత్నదీపిక యందుఁ జెప్పినాఁడు. అందుచే బావులలో స్వచ్ఛమై పాలవలెఁ దెల్లగా నున్ననీరు క్రిందనున్న యింద్రనీలకాంతులు పడుటచే నల్లగా నున్నదని వర్ణింపఁబడినది.

ఉద్భిద్య విద్విష ఇవ ప్రసభమ్ మృగేన్ద్రా
నిన్ద్రాను జామచర భూపతయోఽ ధ్యవాత్సుః
వన్యేభ మస్తక నిఖాత నఖాగ్రముక్త
ముక్తాఫల ప్రకర భా. జ్ఞే గుహా గృహాణి. (5-12)

మ. కరికుంభంబులఁ జీల్చుచో... ... ...ఆ. మా. [5-12].

శ్రీకృష్ణ ననుచరులగు రాజులు సింహములను శత్రువులవలెనే చంపి, యేనుఁగుల కుంభస్థలములను జీల్చు నాసింహముల గోళ్ళనుండి జాఱి పడిన ముత్యముల ప్రోవులు గల గుహల నధివసించి రనిభావము.

ద్విపేన్ద్ర జీమూత వరాహ శంఖ, మత్స్యాహి శుక్త్యుద్భవ వేణుజాని
ముక్తాఫలాని ప్రథితాని లోకే, తేషాం హి శుక్త్యుద్భవ మేవ భూరి.

ఏనుఁగుల కుంభములు...మొదలగు వానియందు ముత్యములు పుట్టు నని రత్నశాస్త్ర మునందు వృద్ధభటుఁడు. క. జలధర ఫణిఫణ కీచక, జలచర కరి మస్తకేష శంఖ వరాహో జ్జ్వలదంష్ట్ర శుక్తు లుదరం, బుల ముత్యము లొదవు వర్ణములు వివిధములై. అని యాంధ్ర రత్నశాస్త్రము.

రతౌ హ్రియా యత్ర నిశామ్య దీపాన్, జాలాగతాభ్యోఽ ధిగృహం గృహిణ్యః
బిభ్యు ర్బిడాలేక్షణ భీషణాభ్యో, వైడూర్య కుడ్యేషు శశిద్యుతిభ్యః. [3-45]

ఉ. అందలి గేహినుల్ ఆ. మా. [3-45].

సంభోగకాలమున సిగ్గుచే స్త్రీలు దీపముల నార్పియు వైడూర్యములు పొదగఁబడిన కిటికీలనుండి పిల్లికన్నులవలె భయంకరములై వచ్చు చంద్రకిరణములకు భయపడిరి.

దీపముల నార్పినను వెన్నెలకాంతులు వైడూర్యముల పైఁబడి యెక్కువ వెలుఁగు నిచ్చు చున్నవని భావము.

"అవిదూరే విదూరస్య గిరే రుత్తుఙ్గరోధసః, కోగబోలిక సీమా న్తే మణే స్తస్యా కరోఽభవత్."

వైడూర్యములు విదూరపర్వతమునఁ బుట్టు నని వృద్ధభటుఁడు రత్నశాస్త్రములోఁ జెప్పినాఁడు. విదూరదేశములోఁ బుట్టుమణులు వైడూర్యము లని కొందఱు చెప్పుదురు.

మార్జారనేత్ర సఙ్కాశం రసాలప్రతిమం హిహా
కఠినం నిర్మలమ్ పుణ్యం వైడూర్యమేవ మఙ్గళమ్.

అను శ్లోకములో వైడూర్యము పిల్లికన్ను వలె నుండునని చండేశ్వరుఁడు రత్నదీపికలోఁ జెప్పినాఁడు

ఆ. వె. పగలు గొంది గానఁబడెకు బిడాలంబు, కన్నుఁ బోలె వెల్గు గల్గి నూలు
దిరుగు పట్టు మీఁదఁ దెరఁజారు వైడూర్య, రత్నమునకు దీప్రయత్నమునకు.

అని యాంధ్రరత్నశాస్త్రము. అందువలననే పిల్లికన్నుఱాయి యని వైడూర్యమునకుఁ దెలుఁగుపేరు.

సీ. "పిల్లికన్ రతనంపుఁ బెద్దమందసములు। పొ్రిద్దుగల్నాదెంపు మిద్దియలును"
(రా. సుం. 8) అని కూచిమంచితిమ్మకవి. రాత్రులందు వైడూర్యములు పిల్లికన్నులవలెఁ బ్రకాశించు ననియు నివియున్నచోట టకెలుకలు రావనియుఁ గొందఱు చెప్పుదురు.

శ్లో. ఉరగేన్ద్ర మూర్ధరుహ రత్న సన్నిధే, ర్ముహు రున్నతస్య రసితైః పయోముచః
అభవ న్యదఙ్గణభువః సముచ్ఛ్రిస, న్నవ వాలవాయజ మణిస్థలాఙ్కురాః॥ (13-58)
ఆ. వె. పాఁవఱేండ్ల తలల... ... ...అ. మా. (13-58).

ఇది మయసభావర్ణనము. వాలవాయమనఁగా వైడూర్యములు పుట్టుదేశవిశేషము. అందుఁ బుట్టునది గాన వాలవాయజ మన వైడూర్యము. పాముల పడగల యందుఁ బుట్టిన నాగమణులు దగ్గఱగా నున్నపుడు మేఘములు గర్జించుచుండగా నాసభాంగణము వైడూర్యముల కుద్భవస్థాన మగుచున్నదని భావము. సర్పముల శిరోమణులు సన్నిధి లోనున్నపుడకాలమునఁ గూడ మేఘములు గర్జించుననియు నెచ్చట నీనాగమణులు మేఘగర్జితములు గల్గునో యదియే విదూర. భూమియనియు మల్లినాథుఁడీ శ్లోకవ్యాఖ్యలోఁ జెప్పినాఁడు.

**రామాయణ పరిచయము:-**

ఏకస్మి న్నధికపయః శ్రియం వహ న్త్యః
సంక్షోభమ్ పవనభువా జవేన నీతాః
వాల్మీకే రరహిత రామ లక్ష్మణానాం
సాధర్మ్యం దధతి గిరామ్ మహాసరస్యః [4-59].

ఈశ్లోకమునందు రైవతకాద్రియందలి సరస్సులు వాల్మీకి వాక్కులవలె నున్నవని వర్ణింపఁ బడినవి. అధికపయః శ్రియం వహ న్త్యః = పయస్సనఁగా నీరు గనుక నెక్కువ జలసమృద్ధిని వహించుచున్న వని సరస్సుల పరమగు నర్థము. కపులనఁగాఁ గోతులు సుగ్రీవుఁడు అంగదుఁడు మొదలగు వానరుల గుణాలంకార శోభను వహించుచున్న వని వాల్మీకి వాక్కుల పరమగు నర్థము. సంక్షోభమ్ పవనభువా జవేన నీతాః = వాయుజన్యమగు వేగముచే

సంక్షోభమును బొందిన వని స. వ. హనుమంతుని వేగవర్ణనముచేతఁ బ్రాగల్భ్యమును బొందిన వని వా. వా. వ. అరహిత రామ లక్ష్మణానామ్: ఎడఁబాటులేని యాఁగుబెగ్గురు పక్షులు గలవని స. వ. ఎడఁబాటు లేని రామలక్ష్మణులు గలవని వా. వా. వ. మహా సరస్యో వాల్మీకే ర్గిరాం సాధర్మ్యం దధతి = ఇట్లు పెద్దపెద్ద జలాశయములు వాల్మీకి వాక్కుల సాధ్యర్మ్యమును గల్గియున్న వనిభావము. శ్లేషానుప్రాణితోపమ. మహాదేవుఁడుగారు,

సీ. అధికవి శ్రీలుననధిక వయశ్శ్రీలు, వటు కమనీయ సంపత్తిఁ జెలఁగ [4-59].

అను సీసములో 'భరిత కబంధ భంగములను' అను క్రొత్తవిశేషణము చేర్చి మిక్కిలి సమర్థతతోఁ దెనిఁగించినారు.

శ్లో. అథ లక్ష్మణానుగత కాన్తవపు ర్జలధిం విలంఘ్య శశి దాశరథిః
పరివారితః పరిత ఋక్షగణై స్తిమిరౌఘ రాక్షసకులమ్ బిభిదే. (9-31)

తే. ఋక్ష సేవక సంఘ మెల్లెడలఁ గొల్వ... ... ...ఆ. మా. (9-31)

ఇది చంద్రోదయవర్ణనము. ఇందుఁ జంద్రుఁడే రాముఁ డని యారోపింపఁబడినది. లక్ష్మణానుగత కాన్తవపుః = లక్ష్మణ మనఁగా లాంఛనము. లాంఛనముతోఁ గూడిన సుందర శరీరము గలవాఁడని చంద్రపరమైన యర్థము. లక్ష్మణునిచే ననుసరింపఁబడిన సుందరశరీరము గలవాఁడని రామపరమగు నర్థము. పరివారితః పరిత ఋక్షగణైః = ఋక్షము లనఁగా నక్షత్రములు; ఎలుఁగుబంట్లు. అంతటఁజుట్టఁబడిన నక్షత్రసమూహము గలవాఁడని చం. వ. చుట్టును జాంబవంతుఁడు మొదలగు భల్లూకసైన్యముతోఁగూడిన వాఁడని రా. వ. జలధిం విలంఘ్య: సముద్రమునుండి పుట్టినవాఁడని చం. వ. సేతువుగట్టి సముద్రమును దాఁటినవాఁడని రా. వ. అట్టి శశిదాశరథి చీఁకటి యనురాక్షస. కులమును భేదించె ననిభావము. శ్లేషానుప్రాణితరూపకము.

## పురాణపరిచయము:-

ఈకావ్యమునందు 2-39 [ఆ. మా. 2-33] లో శ్రీకృష్ణుఁడు నరకాసురునిపై దండెత్తిన కథ; 4-2లో వింధ్యపర్వతము సూర్యునడ్డగించిన కథ; 5-31లో నింద్రుఁడు వజ్రాయుధముతోఁ బర్వతముల రెక్కలను ఖండించిన కథ; 5-66లో గరుత్మంతుఁడు మ్లేచ్ఛులను భక్షించుచు వారిలోఁ గంఠమును దహించెడు విప్రుని వదలిపెట్టిన కథ; 8-64లో సముద్రమథన కాలమున క్షీరసాగరమున లక్ష్మి యవతరించిన కథ; 11-3లో శ్రీకృష్ణుఁడు శైశవమున శకటాసురుని బాదఘాతమునఁ గూల్చిన కథ; 11-56లో నింద్రుఁడు వృత్రాసురుని వధించిన కథ; 14వ సర్గమున భీష్మస్తుతిలో శ్రీకృష్ణుని వివిధావతారములు; 15-24లో ముచుకుందుని కథ; 15వ సర్గమున శ్రీకృష్ణుఁడు కువలయాపీడ మను గజమును, కేశి, చాణూరుఁడు మొదలగు రక్కసులను సంహరించిన కథ మొదలగు పురాణకథలు పరిచయము చేయఁబడినవి.

## సంగీతశాస్త్రపరిచయము:-

శ్లో. రణద్భి రాఘట్టనయా నభస్వతః, పృథగ్విభిన్న శ్రుతిమణ్డలైః స్వరైః
స్ఫుటీభవ ద్గ్రామవిశేష మూర్ఛనా మవేక్షమాణమ్ మహతీమ్ ముహుర్ముహుః (1-10)

చ. సతతము వీణెతంతి... ... ...ఆ. మా. [1-10].

ఆకాశము నుండి క్రిందికి దిగుచుండఁగా వాయుతరంగముల తాఁకిడికి ధ్వనులొనర్చుచు విభిన్నములగు శ్రుతుల సమూహములు గలిగిన స్వరములచే స్పష్టముగా షడ్జాదిమిళిత

మగు గ్రామముల క్రమముతో మూర్ఛనలు గలిగిన మహతి యను తన వీణను మాటిమాటికిఁ జూచునట్టి నారదుని శ్రీకృష్ణుఁడు గాంచెను.

"విశ్వవసో స్తు బృహతీ, తుమ్బురో స్తు కళావతీ,
మహతీ నారదస్య స్యాత్, సరస్వత్యా స్తు కచ్ఛపీ॥" [3-9-119]

విశ్వావసుని వీణ పేరు బృహతి, తుంబురుని వీణ పేరు కళావతి, నారదుని వీణ పేరు మహతి, సరస్వతి వీణపేరు కచ్ఛపి యని వైజయంతికోశములో యాదవ ప్రకాశులు చెప్పిరి.

"ప్రథమశ్రవణా చ్ఛబ్దః శ్రూయతే హ్రస్వమాత్రకః।
సా శ్రుతిః సమ్పరిజ్ఞేయా స్వరావయవలక్షణా॥
శ్రుత్యన న్తర భావీ యఃస్నిగ్ధోఽనురణనాత్మకః
స్వతో రఞ్జయతి శ్రోతు శ్చిత్తం స స్వర ఉచ్యతే."

'శ్రుత్యానన్తర మనురణనం స్వరః' స్వరమునకుఁ బ్రారంభమున వచ్చు హ్రస్వమాత్రకమైన శబ్దవిశేషమునకు శ్రుతి యనిపేరు. శ్రుతి కనంతరమున వినువానికి మనోరంజనము కలిగించు మధురమగు నమరణనధ్వనికి [శ్రుతివెంబడి మ్రోఁగు అనుధ్వనికి] స్వరమనిపేరు.

శ్లో॥ శ్రుతిభ్యః స్యుః స్వరాః షడ్జ ర్షభ గాన్ధార మధ్యమాః పఞ్చమో ధైవత శ్చాథ నిషాద ఇతి స ప్తతే తేషాం సంజ్ఞాః సరిగమపధనీ త్యపరా మతాః' శ్రుతికి వెంబడి వచ్చు స్వరములు షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము, అని యేడు విధములు. స-రి-గ-మ-ప-ధ-ని యని వీనికి వరుసఁగా సంజ్ఞలు. వీనికే సప్తస్వరము లనిపేరు.

శ్లో. 'చతు శ్చతు శ్చత శ్చైవషడ్జ మధ్యమ పఞ్చమాః
ద్వే ద్వే నిషాద గాన్ధారౌ, త్రి స్త్రి రృషభ ధైవతౌ.'

రెండురెండు శ్రుతులతోఁ గూడినవి నిషాద గాంధారములు. మూఁడుమూఁడు శ్రుతులతోఁ గూడినవి ఋషభ ధైవతములు. నాల్గు నాల్గు నాల్గు శ్రుతులతోఁ గూడినవి షడ్జ మధ్యమ పంచమములు.

శ్లో. యథా కుటుమ్బినః సర్వేఽప్యేకీ భూతా భవ న్తి హి
తథా స్వరాణాం సన్దోహో గ్రామ ఇత్యభిధీయతే.
షడ్జగ్రామో భవేదాదౌ మధ్యమగ్రామ ఏవ చ.
గాన్ధారగ్రామ ఇత్యేతద్గ్రామత్రయ ముదాహృతమ్.
నన్ద్యావర్తోఽథ జీమూతః సుభద్రో గ్రామకాః త్రయః
షడ్జ మధ్యమ గాన్ధారా త్రయాణాం జన్మహేతవః.
క్రమాత్ స్వరాణాం సప్తానా మారోహ శ్చావరోహణమ్.
సా మూర్ఛే త్యుచ్యతే గ్రామస్థా ఏతాః స ప్త స ప్తచ.

కుటుంబములోని జనులందఱు నొక్కచోటఁ గలియునట్లు కలిసిన యీస్వరముల సమూహమునకు గ్రామ మనిపేరు. ఈ గ్రామములు షడ్జగ్రామము, మధ్యమగ్రామము, గాంధారగ్రామము, అని మూఁడు విధములు. ఈషడ్జ, మధ్యమ, గాంధారముల నుండి పుట్టునవి నంద్యావర్తము, జీమూతము, సుభద్రము, అని త్రివిధ గ్రామములు. క్రమముగా

నీ సప్తస్వరముల యారోహ ణావరోహణములకు మూర్ఛన యని పేరు. మూఁడు గ్రామము లందును ప్రత్యేకముగా మఱల నేడు నేడు మూర్ఛన లేర్పడి మొత్త మిరువదియొక్క మూర్ఛనలగు నని రత్నాకరమునఁ జెప్పఁబడినది.

'శ్రుతిసమధిక ముచ్చైః పఞ్చమమ్ పీడయన్తః, సతత మృషభ హీనమ్ భిన్నకీకృత్య షడ్జమ్ ప్రణిజగదు రకాకు శ్రావక స్నిగ్ధ కణ్ఠాః, పరిణతి మితి రాత్రే ర్మాగధా మాధవాయ.' [11-1]

చ. శ్రుతు విరువొందఁగా... ... ...ఆ. మా. [11-1].

మధురమైన కంఠస్వరము గలిగిన వైతాళికులు పంచమ, ఋషభ, షడ్జ స్వరములను వదలి వీణెలు మేళమించి తెల్లవాఱుచున్న దని శ్రీకృష్ణుని మేలుకొలుపుటకై యుచ్చైరవ మునఁ బ్రభాతగీతములను బాడి రనిభావము.

'షడ్జమ్ మయూరో వదతి గావ స్త్వృషభ భాషిణః.
అజాదికం తు గాన్ధారంక్రౌఞ్చః క్వణతి మధ్యమమ్.'
'పుష్పసాధారణే కాలే పికః కూజతి పఞ్చమమ్,
ధైవతం హేషతే వాజీ నిషాదమ్ బృంహతే గజః.'

నెమిలికూఁతల ననుకరించు స్వరము షడ్జము. అవుల యంబారమువలె నుండునది ఋషభము. మేఁకలు మొదలగువాని స్వరము ననుకరించునది గాంధారము. క్రౌంచపక్షి కూఁతలవలె నుండునది మధ్యమము. కోకిలకూఁతలవలె నుండునది పంచమము. గుఱ్ఱముల హేషలవలె నుండునది ధైవతము. ఏనుఁగుల బృంహితమువలె నుండునది నిషాదము. అని యమరకోశమునఁ జెప్పఁబడినది. షడ్జస్వరము ప్రభాతకాలమున నిషిద్ధము.

"ప్రభాతే సుతరాం నిన్ద్య ఋషభః పఞ్చమోఽపి చ
జనయే త్ప్రధనం హ్యాజౌ పఞ్చత్వమ్ పఞ్చమోఽపి చ
పఞ్చమస్య విశేషోఽయం కథితః పూర్వసూరిభిః
ప్రగే ప్రగీతో జనయే ద్దశషస్య విపర్యయమ్."

ప్రాతఃకాలమునందు ఋషభస్వరము పాడినచో యుద్ధము, పంచమస్వరము పాడినచో మరణము వచ్చునని భరతమహర్షులు నిందితములుగాఁ జెప్పుటచే వైతాళికు లాస్వరములను వీడినట్లు మాఘకవి చెప్పినాఁడు.

నాట్యశాస్త్రపరిచయము:-

"భవద్గిరా మవసర ప్రదానాయ వచాంసి నః
పూర్వరఙ్గః ప్రసఙ్గాయ నాటకీయస్య వస్తునః. [2-8].

ఆ. వె. మీరు పలుకఁ దగు.... ....ఆ. మా. (2-8).

బలరామోద్ధవులతో మంత్రాలోచనము చేయునపుడు మొదట శ్రీకృష్ణుఁడు పలికిన పలుకులు. నాటకము నందలి కథావస్తువునకుఁ బూర్వరంగ మెట్లో యట్లే నాపలుకులు మీరు చెప్పఁబోవు నీతుల కవసరప్రసంగము కల్గించునని భావము.

"య న్నాట్యవస్తునః పూర్వం రఙ్గ విఘ్నోపశాన్తయే, కుశీలవాః ప్రకుర్వన్తి పూర్వ రఙ్గః ప్రకీర్తితః" నాటకవస్తువునకు ముందుగా రంగస్థలమునందు విఘ్నములు రాకుండుటకై కుశీలవులు [కథకులు] గీతవాద్యాదులతో ముందుగాఁ జేయు నాందీపాఠమునకుఁ బూర్వరంగ

మని పేరని వసంతరాజీయమునఁ జెప్పఁబడినది. ఈ నాందీపాఠమునందు నాటక కథావస్తువు కూడ సంక్షేపముగా సూచింపఁబడును.

అనవద్య వాద్య లయగామి కోమలం నవగీత మప్యనవగీతతాం దధత్
స్ఫుట సాత్త్వికాఙ్గిక మనృత్య దుజ్జ్వలం సవిలాసలాసక విలాసినీజనః (13-66)

మ. సవిలాసంబుగ లాసకీజనము ... ... ... ఆ. మా. 13-66.

శ్రీకృష్ణుఁడు ధర్మజుని సభకేతెంచిన సందర్భము. అనవద్యములగు వంశాది వాద్యములయొక్క ద్రుత, మధ్య, విలంబితము అను త్రివిధలయలకు సరిపడునట్లు దోషములేని గీతము పాడుచు స్తంభాది సాత్త్విక భావములతోడను, భ్రూవిక్షేపాదులగు నాంగికభావముల తోడను విలాసములతోఁ గూడిన యాటవెలఁదులు మనోహరముగా నృత్యము సల్పిరని భావము.

తతం వీణాదికం వాద్య మానద్ధమ్ మురజాదికమ్,
వంశాదికం తు సుషిరం కాంస్యతాలాదికం ఘనమ్,
చతుర్విధ మిదం వాద్యం వాదిత్రాతోద్యనామకమ్.

తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము అని వాద్యములు నాల్గు విధములు. వీణ మొదలగువాని వాద్యము తతము. డోలు, మద్దెల మొదలగువాని వాద్య మానద్ధము. పిల్లనగ్రోవి మొదలగువాని వాద్యము సుషిరము. కరచు తాళములు మొదలగువాని వాద్యము ఘనము. ఈ చతుర్విధ వాద్యములకు వాదిత్రమని యాతోద్యమని నామములు.

ఈవాద్యముల లయ కమవుగా సమకాలమున గీతములు పాడవలయును. "పదార్థాభినయో నామ జ్ఞేయో వాగఙ్గసత్త్వజః" అని భరతముని వచనము. నృత్యము సల్పునపుడు గీతములలోని భావములను గనుబొమ లెగురవైచుచు, చేతులు ద్రిప్పుట మొదలగు నాంగిక భావములతోఁ దెలియఁజేయుట కభినయ మనిపేరు.

భావాశ్రియమ్తు నృత్యం స్యా న్నృత్తం తాలలయాశ్రయమ్
ఆద్యమ్ పదార్థాభినయో మార్గో దేశీ తథా పరః ॥

భావాశ్రియమైనది నృత్యము. తాలలయాశ్రియమైనది నృత్తము. పదార్థాభినయము గల నృత్యమునకు మార్గమని పేరు. పదార్థాభినయము లేక సామాన్యమైన దానికి దేశి యని పేరు. అని దశరూపకమున ధనంజయుఁడు చెప్పెనాఁడు. ఈశ్లోకమున నవగీతమయ్యు, ననవగీతమని చెప్పుటచే విరోధాభాసము.

స్వాదయన్ రస మనేకసంస్కృత ప్రాకృతై రకృత పాత్రసత్కారైః
భావశుద్ధిసహితై ర్ముదం జనో, నాటకై రివ బభార భోజనైః. (14-50)

తే. సంకరముగాని ప్రాకృత ... ... ... ఆ. మా. (14-50)

ఈ శ్లోకములో భోజనములు నాటకములవలె నున్నట్లు వర్ణింపఁబడినది. ప్రకృతి సిద్ధములై యే సంస్కారములు లేక స్వాదువులైన మామిడిపండ్లు మొదలగునవి ప్రాకృతములు. ఇంగువ, జీలకఱ్ఱ మొదలగు వానిచే సంస్కరింపఁబడినవి సంస్కృతములు. వగరు, తీఁపి, ఉప్పు, కారము, చేఁదు, పులుపు. ఇవి షడ్రసములు. పదార్థముల స్వచ్ఛత్వము భావశుద్ధి, కంచము, గిన్నె మొదలగునవి భోజనపాత్రలు. సంస్కృతభాష, ప్రాకృత

భాష, మాటలాడు దుష్యంతుఁడు శకుంతల, మొదలగు పాత్రలయందు సాంకర్యము లేనివి, రత్యాదిస్థాయిభావముల శుద్ధి కలిగినవి నాటకములు. ఇట్టి నాటకముల యందలి శృంగారాది రసముల నాస్వాదించి యెట్లానందము పొందుదురో యట్లే షడ్రసోపేతమైన భోజనములు భుజించి ధర్మజుని యజ్ఞమునకు వచ్చిన జను లానందించి రనిభావము.

పాఠ్యన్తు సంస్కృతం న్నృణా మనీచానాం కృతాత్మనామ్
లిఙ్గినీనామ్ మహాదేవ్యా మ న్త్రిజావేశ్యయోః క్వచిత్
స్త్రీణాన్తు ప్రాకృతమ్ ప్రాయః సౌరసే న్యధమేషు చ ॥

కులీనులగు మహారాజులు, యోగులు, యోగినులు మొదలగు పాత్రలు సంస్కృతమును వాడవలయును. సందర్భానుసారముగాఁ గొన్నిచోట్ల రాణికి దగ్గరవారగు మంత్రికుమారికలు, ను త్తమవేశ్యలు కూడ సంస్కృతము నుపయోగింపవచ్చును. సాధారణముగా స్త్రీలు ప్రాకృత భాషనే వాడవలయును. అట్లే యధమపాత్రలు సౌరసేని మొదలగు భాషలు వాడవలయు నని ధనంజయుఁడు దశరూపకమున వివరించినాఁడు. ఈపాత్రల భాషలయందు సాంకర్యము కల్గఁగూడదు. అందుచేఁ బాత్రల సాంకర్యములేనివని మాఘకవి చెప్పినాఁడు. ఇట్లు 2-79, 20-45, మొదలగుచోట్ల నాట్యశాస్త్రము పరిచయము చేయఁబడినది.

## అలంకార శాస్త్ర పరిచయము :

శ్లో. క్షణశయతవిబుద్ధాః కల్పయ న్తః ప్రయోగా
నుదధిమహతి రాజ్యే కావ్యవద్దుర్విగాహే
గహన మపరరాత్ర ప్రా ప్త బుద్ధిప్రసాదాః
కవయ ఇవ మహీపా శ్చి న్తయ న్త్యర్థజాతమ్ ॥ (11-6)

చ. క్షణశయిత ప్రబుద్ధులు ... ... ... అ. మా. (11-6).

ఇది ప్రభాతవర్ణనము. ఒక్కక్షణము నిద్రించి లేచి నాల్గవయామమున నిర్మలబుద్ధి గలవారై రసభావాదులతో సముద్రమువలె గంభీరమై, యవగాహనము చేసికొనుటకు శక్యము గానిదై యతిగహనమైన కావ్యమున రసానుగుణ్యముగా రమణీయపద ప్రయోగముల నెట్లు కవు లాలోచింతురో యట్లే రాజులు కూడ నొక్కక్షణము నిద్రించి లేచి, రాత్రి నాల్గవ యామమువ నిర్మలబుద్ధి గలవారై రథగజతురగ పదాతులతో సముద్రగంభీరమై దుర్విగాహమై చొర శక్యముగాని రాజ్యమున సామదానాద్యుపాయములను ధర్మార్థకామరూపములగు త్రివర్గము లను జింతించుచున్నా రనిభావము.

బ్రాహ్మే ముహూ ర్తే చోత్థాయ చి న్తయే దాత్మనో హితమ్
ధర్మార్థకామాన్ స్వేకాలే యథాశ క్తి న హాపయేత్. (యాజ్ఞ-ఆచా-(115).

బ్రాహ్మముహూ ర్తమున లేచి యాత్మహితమును విచారింపవలయును. కాలానుగుణ ముగా ధర్మార్థకామములను యథాశ క్తి సేవింపవలయును గాని త్యజింపరాదని యోగియాజ్ఞ వల్క్యమహర్షులు తమస్మృతిలోఁ జెప్పిరి. ధర్మావిరుద్ధముగా నర్థకామములు సేవింపవలె నని రహస్యము. కావ్యాలంకార సూత్రములో "రాత్రియామ స్తురీయః కాలః" (1-3-20) అనఁగా రాత్రియందు నాల్గవయామమునఁ జి త్తప్రసన్నత కల్గును గాన నపుడు కావ్యరచన చేయవలయు నని వామనుఁడు చెప్పెను. రాజులు రాజ్యచింత చేయుటకుఁ, గవులు కావ్య

ములు రచించుటకుఁ దెల్లవారు జామే ప్రశస్తమైన దని పై మాఘశ్లోకమునకు భావము.

విషమం సర్వతోభద్ర చక్ర గోమూత్రికాదిభిః
శ్లోకై రివ మహాకావ్యం వ్యూహ స్తదభవద్బలమ్ ॥ (-9-41)

మ. కుతలంబందున .... .... .... ఆ. మా. (19-40)

ఇది యుద్ధవర్ణనము. సర్వతోభద్రవ్యూహము, చక్రవ్యూహము, గోమూత్రికా వ్యూహము, పద్మవ్యూహము మొదలగు వ్యూహములతో నాశిశుపాలుని సైన్యము సర్వతోభద్ర బంధము, చక్రబంధము, గోమూత్రికాబంధము మొదలగు బంధములు గల శిశుపాలవధము వంటి మహాకావ్యమువలె దురవగ్రాహమైన దని భావము.

ఇరువదిరెండు వర్ణనములు గలది మహాప్రబంధమని యప్పకవి, యిరువదినాల్గు వర్ణనములు గలది మహాకావ్యమని సాహిత్యదర్పణమున విశ్వనాధుఁడు, ముప్పదిరెండువర్ణనములు గలది మహాకావ్యమని యలంకారశేఖరమునఁ గేశవమిశ్రుండును జెప్పిరి. అష్టాదశవర్ణనములు గలది మహాకావ్యమని కావ్యాదర్శమున దండియు, మందారమరందచంపువునందుఁ గృష్ణ కవియుఁ, బ్రతాపరుద్రీయమునందు విద్యానాధుఁడును జెప్పిరి. ఇట్లు 2-83, 2-86, 20-24 మొదలగుచోట్ల నలంకారశాస్త్రము పరిచయము చేయఁబడినది.

కామశాస్త్ర పరిచయము :

సీత్కృతాని మణితం కరుణోక్తిః స్నిగ్ధ ముక్త మల మర్థవచాంసి
హాస భూషణ రవాశ్చ రమణ్యాః కామసూత్ర పదతా ముపజగ్ముః (10-75)

మత్త. జాలిపల్కులు సీత్కృతంబులు ... ... ... ఆ. మా. (10-75)

రమణియొక్క దంతక్షతకాలమునఁ జేయు సీత్కృతములు, రత్యానందమునఁజేయు కంఠకూజితములు, కాపుమను దీనోక్తులు, ప్రియవచనములు, చాలును వలదను నిషేధవచనములు, నవ్వు, భూషణముల ధ్వనులు, వాత్స్యాయనముని రచించిన కామసూత్రలక్షణములై యొప్పె నని భావము.

సూ : పారావత పరభృత హారీత శుక మధుకర దాత్యూహ హంస కారండవ లావక విరుతాని సీత్కృతభూయిష్ఠాని వికల్పశః ప్రయుఞ్జీత." రతికాలమునందు నాయిక యానంద ముతోఁ బావురము కోయిల మొదలగువాని స్వరమువలె, నొనర్చు రతికూజితములు సీత్కృతములు.

"సూ : అమ్బార్థా శ్శబ్దా వారణార్థ మోక్షణార్థాశ్చాల మర్థాస్తే చార్థ యోగాత్" అమ్మ! వలదు, వదలుము, చాలుమ మొదలుగా స్త్రీలు రతికాలమునఁ జేయుశబ్దములు సీత్కృతము అని వాత్స్యాయనులు చెప్పిరి.

స్మరరాగమయీ వసు స్తమిస్రా పరితస్తార రవేరసత్యవశ్యామ్
ప్రియమాప దివాఽపి కోకిలే స్త్రీ రభితస్తారరవే రసత్యవశ్యామ్. (6-70)

ఆ. వె. తనకు శరము గాని ... ... ... ఆ. మా. (6-70)

మన్మధరాగరూపమగు మగు కోకిలయే చీఁకటియై సూర్యమండలము నాచ్ఛాదించినది. అవఁగా సంభోగలంపటయు నను దుష్టేచ్ఛయే పగటివేళఁ గూడ రాత్రిబుద్ధిని గల్గఁజేసినది. అందువలననే యుచ్చతరధ్వనితోఁ గోకిల కూయుచుండఁగా నాఁడుకోయిల దివామైథునము గూడదను నిషేధమును మఱ్ఱలంఘించి ప్రియుని స్వయముగా నభిసరించిన దని భావము.

"ముగ్ధాయాః స్మరలలితేషు చక్రవాక్యా, నిశ్శఙ్కం దయితతమేన చుమ్బితాయాః.
ప్రాణేశా నభివిదధు ర్విధూతహస్తా, స్సీత్కారం సముచిత ముత్తరం తరుణ్యః. (8-12).

ఆ. మా. ముగుదచక్రవాకి... ... ...ఆ. మా. (8-13).

ప్రియునిచే నిశ్శంకముగా ముద్దిడుకోఁబడిన ముగ్ధచక్రవాకి కామకేళియందుఁ జేయవలసిన యోగ్యమగు సీత్కారమును యాదవాంగనలు తమప్రియుల యొద్ద చేతులు విదుల్చుచు నొనర్చిరనిభావము.

ఇందు మొకటిశ్లోకమునఁ గోకిలరతియు, రెండవశ్లోకమునఁ జక్రవాకరతియు వర్ణింపఁబడినవి. ఇట్టి పశుపక్ష్యాదితిర్యగ్రతిని వర్ణించుట రసాభాసమని కొంద రాలంకారికులు దలంచిరి. కాని యేకావళి యందు- "అపరేతు రసాభాసం తిర్యక్షు ప్రచక్షతే. తన్న పరీక్షక్షమమ్. తేష్వపి విభావాదిసమ్భవాత్. విభావాదిజ్ఞానశూన్యా స్తిర్యఞ్చో న భాన మర్హన్తి రసస్యేతిచేన్న; మనుష్యేష్వపి కేషుచిత్ తథాభూతేషు రసవిషయభావాభావప్రసఙ్గాత్. అత్ర విభావాది సమ్భవోఽపి రసమ్ప్రతి ప్రయోజకః. న విభావాదిజ్ఞానమ్. తతశ్చ తిరశ్చా మప్యేవ రసః" కొందఱు తిర్యక్కుల రతియందు రసాభాసమును జెప్పుచున్నారు. వాని యందుఁగూడ విభావాదిసంభవముండుట వలన నది పరీక్ష కాగు విషయము గాదు. విభావాది జ్ఞానశూన్యములగు తిర్యక్కులు రసపాత్రముల కర్హములు గావన్నచో నది సరిగాదు. అట్లే యైనచోఁ దిర్యక్కులతో సమానులగు మనుష్యులయందుఁ గూడ రసవిషయభావము లేకపోవవలసివచ్చును. ఇచ్చట విభావాది సంభవము గూడ రసమునకుఁ బ్రయోజకమే. కేవలము విభావాదిజ్ఞానము మాత్రమే కాదు. అందువలనఁ దిర్యక్కులయందు గూడ రసము గలదని విద్యాధరుఁడు ప్రతిపాదించినాఁడు. శ్రీసన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారి వచనము నుదాహరించుచు శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారు తమ మనుచరిత్రపీఠికలోఁ దిర్యగ్రతి రసమే యగునని నిర్ణయించినారు. 'రతాన్తే శ్లథీభూతగాత్రాణాం కామినాం తిర్యగాదిసమ్భోగదర్శనమ్ పునః కామోద్దీపకమ్ భవతి.' ప్రథమసురతాంతమునం దలసటచెంది విడివడిన శరీరములు గల కాముకులకుఁ దిర్యగాదిసంభోగమును జూచినచో మఱలఁ గామోద్దీపక మగునని కామశాస్త్రమునఁ జెప్పఁబడినది. ఎదుట యాదవ తరుణులను కామక్రీడలవర్ణింపఁదలపెట్టిన వాఁడగుటచే వారికిఁ గామోద్దీపకమును గల్గించు కోకిలరతి, చక్రవాకరతి, ముందుగా మాఘకవి వర్ణించెనని తలంపవలయును.

## వైద్యశాస్త్ర పరిచయము:-

"చతుర్థోపాయసాధ్యే తు, రిపౌ సాన్త్వ మపక్రియా, స్వేద్య మామజ్వరమ్ ప్రాజ్ఞః, కోఽమ్భసా పరిషిఞ్చతి॥ (2-54). తే. నాలవయుపాయమునఁగాని... ...ఆ. మా. (2-46). సామ, భేద, దాన, దండోపాయములలో నాల్గవదగు దండముచే సాధింపవలసిన శత్రువునందు సామముపయోగించుట హానియగును. స్వేదనిర్గమనముచేఁ దగ్గింపఁదగు నామజ్వరమును (అపక్వజ్వరమును) నీటితో నేప్రాజ్ఞుఁడు పరిషేచనము చేయును? నీరు తగులుటవలన నామజ్వర మెట్లెక్కువయగునో యట్లే సామమువలన శత్రువు రెచ్చిపోవు ననిభావము.

"లాలాప్రసేకో హృల్లాస, హృదయాశు ద్ధ్యరోచకాః, తన్ద్రాలస్య విపాకాస్య, వైరస్యం గురుగాత్రతా॥, క్షున్నాశో బహుమూత్రత్వం స్తబ్ధతా బలవాన్ జ్వరః ఆమజ్వరస్య విఙ్గాని... ..

"జన్తో ర్జ్వరవిము క్తస్య స్నానం కుర్యాత్ పునర్జ్వరమ్, తస్మా జ్జ్వరవిముక్తోఽపి

స్నానం విషమివ త్యజేత్." లాలాస్రవణము, కునికిపాటులు, నోరు బిరుసెక్కుట, యాఁకలి లేకపోవుట, మూత్ర మెక్కువయగుట, స్తబ్ధముగా నుండుట, మొదలగునవి యామజ్వరలక్షణములు. జ్వరము తగ్గినవెంటనే స్నానము చేసినచో జ్వరమెక్కువ యగును. కాఁబట్టి జ్వరము తగ్గినను రోగి స్నానమును విషమువలెఁ ద్యజింపవలయునని వైద్యశాస్త్రమునఁ జెప్పఁబడినది.

"షాడ్గుణ్య ముపయుఞ్జీత, శ క్త్యపేక్షో రసాయనమ్, భవ న్త్యస్యైవ మఙ్గాని, స్థాస్నూని బలవ న్తిచ." (2-93). తే. షడ్గుణాఖ్య నౌషధ రసాయనంబు... ....ఆ. మా. (2-84) ప్రభుశక్తి, మంత్రశక్తి, యుత్సాహశక్తి; యీబలమును గోరు రాజు సంధి, విగ్రహము మొదలగు గుణషట్కము నుపయోగింపవలయును. అట్లు చేయుచో స్వామ్యాది రాజ్యసప్తాంగములు బలవంతములై స్థిరపడుననిభావము.

"స్వామీ జనపదోఽమాత్యః కోశో దుర్గ బలం సుహృత్, రాజ్యం సప్త ప్రకృత్యఙ్గం నీతిజ్ఞాః సంప్రచక్షతే." స్వామి, అమాత్యుఁడు, కోశము దుర్గము, బలము, స్నేహితులు, ఇవి రాజ్యసప్తాంగములు. బలమును గోరు మనుష్యుఁడు మధురామ్ల లవణ తిక్తకటు కషాయ షడ్గుణోపేతములగు పూర్ణచంద్రోదయము, స్వర్ణసిందూరము మొదలగు రసాయనములు సేవించినచో శరీరావయవములు స్థిరములు బలవంతములు నగు ననిభావము. ఇట్లు 2-84, 2-87; 12-25; 15-2; 20-75; మొదలగు చోట్ల వైద్యశాస్త్రము పరిచయము చేయఁబడినది.

## ధనుర్వేద పరిచయము:-

ధనుర్వేదము యజుర్వేదమున కుపవేదము. ఇది విశ్వామిత్రమహర్షి ప్రణీతము. ఇందు నాలుగు పాదములు గలవు. మొదటిపాదమున ధనుర్లక్షణములు, ముక్తాముక్తాది చతుర్విధాయుధ విభాగము, శస్త్రనిరూపణము, బ్రాహ్మ వైష్ణవ పాశుపతాది మహాస్త్రనిరూపణము, వాని మంత్రములు మొదలగు నవి చెప్పఁబడినవి. ఈకావ్యమున యుద్ధవర్ణనమున ముక్తాముక్తాద్యాయుధములు, శ్రీకృష్ణ శిశుపాలుర ద్వంద్వయుద్ధమున స్వాపనాస్త్రము, నాగాస్త్రము, గరుడాస్త్రము, అగ్నేయాస్త్రము, మేఘాస్త్రము వీని ప్రయోగములు విపులముగా వర్ణింపఁబడినవి.

## మంత్రశాస్త్ర పరిచయము:-

"తన్త్రావాపవిదా యోగై ర్మణ్డలా న్యధితిష్ఠతా, సునిగ్రహా నరేన్ద్రేణ ఫణీన్ద్రా ఇవ శత్రవః. (2-88). తే. తంత్ర మావాప మెఱిఁగి ... ...ఆ. మా. (2-80). గారుడము మొదలగు మంత్రములు, తెల్లయుపరిసేలు మొదలగు నౌషధములు, దేవతాధ్యానములు, మాహేంద్రాది దేవతాయతనములు వీని నమష్ఠించు విషవైద్యునకుఁ బాములెట్లు సులభముగా వశమగునో యట్లే స్వపరరాష్ట్ర చింతనము, సామాద్యుపాయములు, వీనిచే బరమండరములనతిక్రమించు రాజులకు శత్రువులు సులభముగా వశమగుదు రనిభావము. మంత్రములచేతను, తెల్లయుసిరి మొదలగు నౌషధులచేతను బాములు వశమగుట లోకప్రసిద్ధము.

## అశ్వశాస్త్ర పరిచయము :

శ్లో. ఆవర్తినః శుభఫలప్రద శుక్తియుక్తాః సమ్పన్నదేవమణయో భృతరన్ధ్రభాగాః
అశ్వాః వ్యధు ర్వసుమతీ మతిలోచమానా స్తూర్ణమ్ పయోధయ ఇవోర్మిభి రాపత న్తః.

సీ. అలికమాదిగ ... ... ... ఆ. మా. (5-4).

ఇందు గుఱ్ఱములు సముద్రములవలె నున్నవని వర్ణింపఁబడినవి. దశస్థానములందును ధ్రువము అనుపేరుగల సుళ్ళు గలవి, రాజ్యలాభాది శుభఫలంబుల నొసఁగు శుక్తులను సుళ్ళు గలవి, మెడలందు దేవమణులను సుళ్ళు గలవి, బలిసియుండుటచేఁ బూడ్చఁ బడిన పార్శ్వ రంధ్రములు (బలిసిన డొక్కలు) గలవి, కంఠమునం దతిశయించిన రోచమానములను సుళ్ళు గలవి, యూర్ములను గతివిశేషములతోఁ బరుగిడునవియు నగు గుఱ్ఱములు - నీటిసుళ్ళు గలవి, ముక్తాఫలముల నొసఁగు ముత్యపుఁ జిప్పలు గలవి, కౌస్తుభాది దివ్యమణులచే సంపన్నములైనవి, నిండిన పల్లపుభూముల కన్నములు గలవి, మిక్కిలి ప్రకాశించునవి, పెద్దపెద్ద యలలతోఁ బ్రవహించునవియు నగు సముద్రముల వలె భూమి నంతటిని శీఘ్రముగా నాచ్ఛాదించె నని భావము.

ఆవర్త మనఁగా సుడి. "శ్లో. ద్వౌ వురస్యౌ, శిరస్యౌ ద్వౌ, ద్వౌ ద్వౌ రన్ధ్రోపరన్ధ్రయోః ఏకో భాలే హ్యపానే చ దశావర్తా ధ్రువాః స్మృతాః" వక్షఃస్థలమున రెండు, శిరస్సున రెండు, పొట్టక్రిందనుండు రంధ్రస్థానమున రెండు, నుదుట నొకటి, గుదస్థానమునం దొకటి గల పదిసుళ్ళకు ధ్రువము లనిపేరు. "శ్లో. ఉరసి ద్వౌ, శిరసి ద్వౌ, తథైవ రన్ధ్రోపరన్ధ్రయోర్ద్వౌ ద్వౌ। ఏకం లలాటమధ్యే, విద్యా దేకమ్ ప్రపానేతత్॥ అని నకులుఁడు. అపక్షమున గుదస్థానమునకుఁ బదులు నాసిక గ్రహింపవలయును. "శ్లో. వక్షఃస్థాః శుక్తయ స్తిస్ర ఊర్ధ్వరోమా జయావహాః" నిక్కినవెండ్రుకలతో వక్షఃస్థలమునందేర్పడిన ముత్యపుఁజిప్పల వంటి మూఁడుసుళ్ళు శుక్తులు. ఇట్టి శుక్తులు గల గుఱ్ఱము జయము నొసఁగును. "శ్లో. ఆవర్తో రోమజో దేవమణి స్త్వేష నిగాలజః నిగాలస్తు గళోద్దేశే" (వైజయంతి) గుఱ్ఱములకు మెడసమీపమునందుండు సుడికి 'దేవమణి' యని పేరు. "శ్లో. కణ్ఠజో రోచమానశ్చ స్వామిసౌభాగ్యవర్ధనః" (వైజయంతి) కంఠమునందున్న సుడికి 'రోచమాన' మనిపేరు. రోచమానము గల గుఱ్ఱము స్వామికి సౌభాగ్యము చేకూర్చును. "పఙ్క్తీకృతానా మశ్వానాం నమనోన్నమనాకృతిః అతివేగ సమాయుక్తా గతి రూర్మి రుదాహృతాః" (వైజయంతి) గుఱ్ఱములన్నియు నొకపంక్తిలోఁ బరుగిడుచు నొక్కసారి క్రిందికి వంగి మరల నొక్కసారి పైకి దూఁకుచు వేగముగా నేఁగునపుడు సముద్రతరంగములవలె నుండును గాన నాగతి కూర్మి యనిపేరు. అధికము నకులుని యశ్వశాస్త్రమునం దనుసంధేయము.

> తేజోనిరోధసమతావహితేన యన్త్రా సమ్యక్కశాత్రయ విచారవతా నియుక్తః
> అరట్టజ శ్చటులనిష్ఠురపాత ముచ్చై శ్చిత్రం చకార పద మర్థపులాయితేన.

తే. ద్వివిధవేగమ్ములన్ మాన్పి ... ... ... ఆ. మా. (5-10).

తీవ్రవేగమునుండి సమవేగములో నడిపించుటలోఁ గుశలుఁడు, కొరడాతో మూఁడు విధములుగాఁ దాడించుట తెలిసినవాఁడు, నగు రౌతుచే నియుక్తమగు నారట్ట (అరబ్బు) దేశమునఁ బుట్టిన గుఱ్ఱము భూమిపై డెక్కలను మెల్లగను గట్టిగను గ్రుచ్చుచుఁ బులయను గతి విశేషముతో నర్ధమండలాకారముగా విచిత్రరూపముతోఁ బరుగిడె ననిభావము.

తేజస్సనఁగా సత్త్వగుణవికారమైన యంతస్సార విశేషమగు దర్పము. "తేజో నిసర్గజం సత్వం వాజినాం స్ఫురణం రజః క్రోధ స్తమ ఇతి జ్ఞేయా స్త్రయోఽపి సహజా గుణాః" గుర్రములకు స్వాభావికముగాఁ బుట్టు సత్త్వగుణము తేజస్సు. దేహమ్ము నంగ

షులు నదురుట రజోగుణము. క్రోధము తమోగుణము. ఇవి యశ్వములకు సహజములు, "ఘాతాసు యోజితానాం చ నిసర్గా త్ప్రేరణం వినా అవిచ్ఛిన్న మివాభాతి, తత్తేజ స్సతతోత్థితమ్ కశాపాదాది ఘాతై ర్యత్ సాధ్వసాత్ స్ఫురితం తు తత్" సతతోత్థితము, భయోత్థితమ్మని తేజస్సు రెండు విధములు. ప్రయాణము చేయుచుండఁగా నెట్టి ప్రేరణము లేకుండ నెడతెగని గతి కల్గియుండుట సతతోత్థితము. కొరడాతోఁ గొట్టినపుడు భయముతో వణఁకుచు సాధ్వసము కల్గియుండుట భయోత్థితము. కశా (కొరడా) ఘాతములు మూఁడు విధములు.

"మృదునై కేన ఘాతేన దణ్డకాలేషు యోజయేత్ తీక్ష్ణమ్మధ్యమ్ పునర్ద్వాభ్యాం జఘన్యం నిష్ఠురై స్త్రిభిః ఉపవేశేఽథ నిద్రాయాం స్ఖలితే దుష్టచేష్టితే బడబాలోకనౌత్సుక్యే బహుగర్విత హ్రేషితే సన్త్రాసే చ దురుత్థానే విమార్గగమనే భయే శిక్షాత్యాగస్య సమయే సఞ్జాతే చిత్తవిభ్రమే దణ్డః ప్రయోజ్యో వాహానాం కాలేషు ద్వాదశస్వపి గ్రీవాయామ్ భీతమాహన్యా త్త్రిస్తాంశ్చైవ చ వాజినమ్ విభ్రాన్తచిత్త మధరే త్యక్తశిక్షం చ తాడయేత్ ప్రహేషితం స్కన్ధబాహ్వో ర్బడబాలోకినం తథా ఉపవేశే చ నిద్రాయాం కటిదేశే చ తాడయేత్ దుశ్చేష్టితమ్ముఖేహన్యా దున్మార్గప్రస్థితం తథా జఘనే స్ఖలితం హన్యాన్నేత్రమార్గే దురుత్థితమ్ యో మన్దప్రకృతి ర్వాజీ తం సర్వత్రైవతాడయేత్". ఉత్తమాశ్వమును శిక్షించు కాలమున మృదువుగా నొకదెబ్బ కొట్టవలయును. కొంచెము పెంకెదైనచో రెండుదెబ్బలు కొట్టవలయును, అధమజాత్యశ్వమును నిష్ఠురముగా మూఁడుదెబ్బలు గొట్టవలయును.

శిక్ష లేక విభ్రాంతచిత్తమైనదానిని గ్రిందిదౌడ యందు, సకిలించుచు నాఁడుగుఱ్ఱమును గాంచుదానిని మూఁపు, కాళ్ళయందుఁ, బరుండినదానిని నిద్రించుదానిని గటియందు, దుశ్చేష్టితమై (మెడ్వారీచేయుచు) మార్గముతప్పి నడచుదానిని ముఖమునందు, దారిలోఁబడి లేవనిదానిని మొలయందుఁ గొట్టవలయును. ఎప్పుడు పెంకెతనముతో నున్నదాని నన్నిచోట్లఁ గొట్టవలయు నని భోజుఁడు, "హేషితే తాడయే న్మూర్ధ్ని జానుభ్యాం చలితే తథా క్రుద్ధే ఉరసి హన్తవ్యో భ్రాన్తచిత్తే తథోదరే భీతంచ తాడయేత్పశ్చాన్ముఖే చోన్మార్గగామినమ్ జ్ఞాత్వా దోషం చ రూపం చ స్థానే ష్వేతేషు తాడయేత్" సకిలించుదానిని శిరస్సునందు, వణఁకుగలదానిని మోఁకాళ్ళయందుఁ, గోపించినదానిని వక్షమునందు, భ్రాంతినొందినదానిని బొట్టయందు, భయపడుదానిని బృష్ఠమందుఁ, బ్రిక్కటోవలఁ జరించుదానిని ముఖమునందుఁ దాడింపవలయునని నకులుఁడును జెప్పెరి.

"క్షిపతి సమవిశేషా నుత్క్షిప త్యగ్రపాదాన్ప్రసరతి పురతోఽశ్వః సాధుధారా పులాఖ్యా, విలసతి పమపాదోత్క్షేపణాకుఞ్చనానాం కరుణ మిహ గతిజ్ఞాః ప్రాహు రస్యై పులాఖ్యామ్" కాళ్ళు సమముగా నుంచి ముందరి కాళ్ళపాదము లెత్తి ముందఱకు సాఁగుచు మంచి నడక కల్గిన హయగతికిఁ 'ఖిలి' యనిపేరు. నాల్గుకాళ్ళు సమముగా ముడుచుచుఁ జాఁచుచు సమముగా నడచు గతి 'పుల' యని కొందఱిమతము. ఇట్టి పులతోఁ గూడిన హయవల్గనము పులాయితము. "శతార్ధార్ధ క్రమాదూనై ర్మణ్డలాయిత వల్గితైః ఉన్ముఖ స్యాశ్వముఖ్యస్యగతి ర్రర్ధపులాయితమ్. పార్ష్ణి ప్రధానమ్ ప్రపధాయ రాగా ద్వల్గాం శ్లథీకృత్య వహేత్పులాఖ్యామ్" వంద, యేఁబది, యిట్లు క్రమముగాఁ దగ్గుచు మండలాకారముగాఁ దిరుగిడుచు మీఁదు చూచు జాత్యశ్వముయొక్క గతి కర్ధపులాయిత మనిపేరు. గుఱ్ఱపు నడుమునకు రౌతు తనకాలిమడమతోఁ దండెము వేసి, మధ్యబంధము నుండి కళ్ళెపుఁద్రాడు వదులుచేసి పులాయితమ్ము

చేయింపవలయు నని హయలీలావతి యందుఁ జెప్పఁబడినది. అరట్ట మనఁగా జాత్యశ్వములు పుట్టు దేశవిశేషము. "అరట్టజా స్సుజఘనా అదీర్ఘపృష్ఠాః సుకుష్ఠికా బలినః స్థూలాక్షికూట శంఖా స్తేజో జవ సారయు క్తాః స్యుః" బలిసిన మొలగలవి, పొట్టివి యగు పృష్ఠభాగములు గలవి, బలిసిన చీలమండలు గలవి. స్థూలముగా నున్న కన్నులమధ్యభాగము, గట్టివియగు కన్నుల ప్రక్కయెముకలు గలవి, తేజస్సు, జవముగలవి యారట్టజాశ్వములని నకులుఁడశ్వ శాస్త్రము నందుఁ జెప్పినాఁడు.

"ద న్తాలికాధరణ నిశ్చలపాణియుగ్మ మర్ధోదితో హరి గిరోదయశైలమూర్ధ్నః, స్తోకేన నాక్రమత వల్లభపాల ముచ్చైః శ్రీవృక్షకీ పురుషకోన్నమి తాగ్రకాయః" (5-56) సీ. వక్షం బుపై మోముపై.... ....ఆ. మా. (5-56). పురుషక మనఁగా నశ్వముల స్థితివిశేషము. పురుషకముచే నెత్తఁబడిన పూర్వదేహము గలది, శ్రీవృక్షకమను సుడిగలదియునై తూర్పుఁ గొండపై సగముదయించిన సూర్యునివలె నొప్పు గుఱ్ఱము కళ్ళెపుఁద్రాటిని గ్రహించుటకు స్థిరముగా నుంచిన చేతులుగల రౌతును గొంచెము కూడ నతిక్రమింపక రౌతునకు వశమై యుండె ననిభావము. ఈవర్ణనము వలన సాదియొక్క వల్గాగ్రహణ నైపుణ్యము వ్యక్తము. "పశ్చిమే నాగ్రపాదేనభువి స్థిత్యాగ్రపాదయోః ఊర్ధ్వప్రేరణయా స్థానమశ్వానామ్ పురుషః స్మృతః" గుఱ్ఱము వెనుకకాళ్ళను భూమిపైనుంచి ముందరికాళ్ళను పైకెత్తి శరీరము నెత్తి యుంచు స్థితికిఁ బురుషక మనిపేరు. "వక్షోభవాన ర్త చతుష్టయం చ కణ్ఠోభవేద్యస్య చ రోచ మానః శ్రీవృక్షకీ నామ హయః స భర్తుః శ్రీపుత్త్రపౌత్త్రాది వివృద్ధయే స్యాత్" వక్షమునందు నాలుగు సుళ్ళు, కంఠము నందు రోచమానమను సుడి యున్న గుఱ్ఱమునకు 'శ్రీవృక్షకి' యనిపేరు. ఈ గుఱ్ఱము భర్తకుఁ బుత్త్రపౌత్త్రాభివృద్ధి కల్గఁజేయును.

"అవ్యాకులమ్ ప్రకృత ముత్తరదేయకర్మ ధారాః ప్రసాధయితు మవ్యతికీర్ణరూపాః సిద్ధమ్ ముఖే నవసు వీథిషు కశ్చి దశ్వం వల్గా విభాగకుశలో గమయామ్బభూవ" (5-60). సీ. పదునాల్గు తెఱఁగుల... ...ఆ. మా. (5-60).

కళ్ళెపుఁద్రాళ్ళను విభజించి పట్టుకొనుచు, షడ్విధ ప్రేరణములతో నడిపించుట యందు నేర్పుగల రౌతు, భయములేక, చతుష్క మనుపేరుగల గతివిశేషమునందు ముఖసిద్ధి నొంది సజ్జితమగు గుఱ్ఱమును యుద్ధోత్తరకాలమునఁ బ్రయోగింపవలసిన యసంకీర్ణములగు ధారలను బరిచయము చేయుటకై తొమ్మిదివీథులయందు నడిపింపఁ జొచ్చెనని భావము. "ఉత్థిప్తా శిథిలా తథోత్తరవతీ మన్దా చ వైహాయసీ విక్షిప్తైకకరా ర్ధకన్ధరస మాకీర్ణా విభక్తా తథా, అత్యుక్షిప్తత లోద్ధృతే ఖలు తథా వ్యాగూఢ గోకర్ణికే వాహానాం కథితా శ్చతుర్దశవిధా వల్గాప్రభేదా అమీ" వల్గయనఁగా గళ్ళెపుఁద్రాడు (1) ఉత్థిప్త (2) శిథిల (3) ఉత్తర వతి (4) మంద (5) వైహాయసి (6) విక్షిప్త [7] ఏకకర [8] అర్ధకంధరసమ [9] ఆకీర్ణ [ఉత్కీర్ణయని పాఠాంతరము] [10] విభక్త [11] అత్యుత్క్షిప్తతల (12) ఉద్ధృత (13) వ్యా గూఢ (14) గోకర్ణికయని కళ్ళెపుఁద్రాళ్ళు పదునాల్గు విధము లని 'హయలీలావతి.' "వల్గాశ్చ సమ్ప్రవక్ష్యామి మునిభ ర్యాః ప్రకీర్తితాః పుష్పవన్తీ చ గోకర్ణీ తూలోత్థాలా చలా తృషా, నామఖణ్డీ పుష్పధారా దృఢముష్టీ చతుః స్తనీ ద్విహస్తా చైకహస్తా చ సుభగా శోభనా మతా." ఇత్యేతే ద్వాదశవల్గా మునిభిర్యాః పరికీర్తితాః (1) పుష్పవంతి (2) గోకర్ణి (3) తూలోత్థాల

(4) చల (5) తృష (6) నామఖండి (7) పుష్పధార (8) దృఢముష్టి (9) చతుస్త్సని (10) ద్విహస్త (11) ఏకహస్త (12) సుభగ (శోభన) యను వల్గలు పండ్రెండువిధములని యశ్వశాస్త్రమునందు నకులుఁడు. ఈవల్గలను విభజించి ప్రయోగించుట వల్గావిభాగకుశలత. ఇచట వల్గాగ్రహణముచే రాగాదిప్రేరణములు కూడ గ్రహింపవలయును. "వాహనమ్ ప్రతి వాహానాం షడ్విధమ్ ప్రేరణం విదుః రాగ-వల్గా-కశా-పార్ష్ణి-ప్రతోద-రవభేదతః" అని భోజుఁడు, రాగ మనఁగా నశ్వముల మధ్యబంధవిశేషము. (నడుమునకుఁ గట్టు తోలుపటకా. లంగురాగశబ్ద మపూర్వముగాన దీనియర్థమింకను విచారింపవలయును) మధ్యబంధమునురెండు చేతులతోఁ బట్టుకొని ప్రేరేపించుట రాగప్రేరణము (1) కళ్ళెపుఁద్రాళ్ళను వదలుచు లాఁగుచుఁ బ్రేరేపించుట వల్గాప్రేరణము (2) కొరడాతోఁ గొట్టుచుఁ బ్రేరేపించుట కశాప్రేరణము కాలి మడమలతోఁ దన్నుచుఁ బ్రేరేపించుట పార్ష్ణిప్రేరణము. (4) మునికోలతోఁ గొట్టుచుఁ బ్రేరేపించుట ప్రతోదప్రేరణము (5) ఈలలు మొదలగు నుత్సాహవర్ధనములగు శబ్దవిశేషములతోఁ బ్రేరేపించుట రవప్రేరణము. ఇవి షడ్విధప్రేరణములు. చతుష్క మను గతి యందు గుఱ్ఱము పొందు స్థితివిశేషమునకు 'ముఖసిద్ధి' యని పేరు.

"సృక్వాధరోష్ఠసితఫేనలవాభిరామఫూత్కారవాయుపథ మున్నత కన్ధరాగ్రమ్ నీత్వోపకుఞ్చితముఖం నవలోహసామ్య మశ్వం చతుష్కసమయే ముఖసిద్ధ మాహుః" నెలవులయందుఁ గ్రిందిదౌడయందుఁ దెల్లనినురువులు గ్రిక్కుట, ఫూత్కారములొనర్చుట, మెడను బైకెత్తి ముఖమును గ్రిందికి వంచుట, దేహమంతయుఁ గ్రొత్తయనుపముద్ద వలెనగుట చతుష్కగతి యందు ముఖసిద్ధి పొందిన యశ్వలక్షణమని 'రేవతోత్తరము'నఁ జెప్పఁబడినది. "అశ్వానాం తు గతి ర్ధారా విభిన్నా సా చ పఞ్చధా అస్కందితం ధౌరితికం రేచితం వల్గితమ్ ప్లుతమ్" అని వైజయంతి. "ఆస్కన్దితం ధౌరితకం రేచితం వల్గితమ్ ప్లుతమ్ గతయోఽమూ పఞ్చ ధారాః" అనియమరము. గుఱ్ఱముల నడకలకు ధారలనిపేరు. అవి 1. అస్కందితము 2. ధౌరితకము 3. రేచితము 4. వల్గితము. 5. ప్లుతము నని యైదు విధములు [అతివేగము, అతి మందము గాని నడక 'ఆస్కందితము.' అంతకంటె చక్కని నడక 'ధౌరితము.' తాళగతితోఁ బరుగెత్తుట 'రేచితము.' మీఁదికి కాళ్ళు కదలించుచు వేగముగాఁ బోవుట 'వల్గితము.' అంతట సమముగాఁ బరుగెత్తుట 'ప్లుతము'- అని శ్రీ వెంపరాలవారి ప్రభావతీప్రద్యుమ్నవ్యాఖ్య]. "ధారాః పఞ్చ ప్రవక్ష్యామి మునిభిర్యాః ప్రకీర్తితాః ప్రథమా విక్రమా ధారా ద్వితీయా పులకా స్మృతా. తృతీయా పూర్ణకణ్ఠీ తు చతుర్థీ త్వరితా స్మృతా పఞ్చమీ చైవ యా ధారా నిరాలమ్బా ప్రకీర్తితా" 1. విక్రమ (సామాన్యగమనము) 2. పులక [నాల్గుకాళ్ళను నొక్కసారి యెత్తి వేగముగాఁ బరుగిడుట. దీనికే 'చతుష్కగతి' యనిపేరు]. 3. పూర్ణకంఠి (ముఖమును ముందలకుఁ జాఁచుచుఁ బరుగిడుట 4. త్వరిత (స్వేచ్ఛగాఁ బరుగిడుట 5. నిరాలంబ(అంగలతో బరుగిడుట). ఇవి పంచధారలని నకులుఁడు. "గతిః పులా చతుష్కా చ తద్వన్మధ్యజవా పరా పూర్ణవేగా తథా చాన్యాపఞ్చధారాః ప్రకీర్తితాః ఏకైకా త్రివిధా ధారా హయశిక్షావిదౌ స్మృతా అల్పా మధ్యా తథా దీర్ఘా జ్ఞాత్వైతా యోజయేత్క్రమాత్" 1. పుల 2. చతుష్క 3. మధ్యజవ 4. పర 5. పూర్ణవేగ యనిధారలైదు. మరలనొక్కొక్కధార 1. అల్ప 2. మధ్య 3. దీర్ఘ యని మూఁడువిధములు. మొత్తము 15 ధారలగును. ఈధారలను గ్రమముగా నెఱిఁగి ప్రయో

గింపవలయు నని కొందఱిపక్షము. ఈధారలను బరిచయము చేయుటకై గుఱ్ఱముల కేర్పఱచిన సంచారప్రదేశములకు వీథులని పేరు. "వీథ్యః స్తిస్రో ధరాణాం లక్ష్మీ మధ్యోత్తమాః క్రమాత్ తాసాం స్యా ద్ధనుషామ్మాన మశీతి ర్నవతి శ్శతం లక్ష్మీమధ్యోత్తమానాంతు వాజినాం వీథికాః స్మృతాః నవానాం కథితా వీథ్యో దుష్టానాం క్రమణక్రమే అన్యేషా మపి సర్వత్ర గతిదార్ఢ్యార్థ మీరితాః సమోన్నతా సా విషమామ్బుకీర్ణా శుద్ధా నతాగ్రా తృణవీరుదాఢ్యా స్థాణుప్రకీ ర్ణోపలసమ్ప్ర కీర్ణా పార్శ్వోన్నతాఖ్యా నవధేతి వీథ్యః సర్వవీథీషు యో వాజీదృఢశిక్షా సమన్వితః తేన రాజా రణే నిత్యం మృగయాయా మ్మువం వ్రజేత్" ఎనుబదిధనుస్సుల మధ్య దూరము గల వీధి లక్ష్మి, తొంబది ధనుస్సుల మధ్యదూరముగల వీథిమధ్య నూఱువిండ్ల దూరముగల వీథి 'యుత్తమ.' ఈవీథులు తొమ్మిది విధములు. 1. ముందు సమముగానుండి వెళ్ళనకొలఁది బర్వతమువలె నెత్తుగానుండునది 'సమోన్నత'. 2. ఒకచోట నెత్తుగను మరియొకచోట లోఁతుగను గొన్నిచోట్ల గోఁతులుగను నుండునది 'విషమ' 3. ఎగుడుదిగుడుగా నుండు క్రిందిభాగము కనపడకుండ నీటితో నిండి యుండునది. 'అంబుకీర్ణ.' 4. ఎగుడుదిగుడులు లేక సమముగా నుండునది 'శుద్ధ.' 5. పోయినకొలఁది సొరంగమువలెఁ బల్లముగా నుండునది 'నతాగ్ర' 6. గడ్డితోఁ, బొదలతో నిండియుండునది 'తృణవీరుదాఢ్య' 7. మ్రోళ్ళతో నిండి యుండునది 'స్థాణుప్రకీర్ణ' 8. శిలలతో నిండియుండునది 'యుపలసంప్రకీర్ణ' 9. ఒకప్రక్క లోఁతుగనుండి మఱియొకప్రక్క నెత్తుగా నుండునది 'పార్శ్వోన్నత'. పెంకె. గుఱ్ఱములను లొంగతీయుటకు మంచిగుఱ్ఱములను గతిదార్ఢ్యము కల్గుటకు నీనవవీథులయందు శిక్షింపవలయును. అన్నివీథులయందు శిక్షపొందిన గుఱ్ఱము రాజునకు యుద్ధములోను, వేఁటయందును సంతోషము కల్గఁజేయు నని భోజుఁడుచెప్పినాఁడు. "ఉరసాలి వరశ్వాలీపృథులో మధ్యనామకః ఆలీఢ. శోభనై రజ్ఞైః ప్రత్యాలీఢ స్తథాపరః ఉపధేనవ ఉక్తం చ పాదచాలీ చ సర్వగః నిర్దిష్టా వీధయ స్త్వేతాః" 1. ఉరసాలి 2. వరశ్వాలి 3. పృధులము 4. మధ్యమ 5. ఆలీఢము 6. ప్రత్యాలీఢము 7. ఉపధేనవము 8. పాదచాలి 9. సర్వగము. ఇవి నవవీథు లని కొందఱిమతము.

గజశాస్త్ర పరిచయము :

జజ్ఞే జనై ర్ముకులితాక్ష మనాదదానే సంరబ్ధ హస్తిపక నిష్ఠుర చోదనాభిః
గమ్భీరవేదిని పురః కవలం కరీన్ద్రే మన్దోఽపి నామ నమహా నవగృహ్య సాధ్యః

తే. కుపితుఁడౌ మావటీనిచే ... ... ... ఆ. మా. (5-49)

గంభీరవేది యను నొక యేనుఁగు కోపముతో మావటివాఁ డంకుశాదులతోఁ గఠోరముగాఁ దర్జించుచున్నను దనకు ముందుంచిన కవణము గైకొనలేదు. ఆగజమును జూచి గొప్పవాఁడు మందుఁడైనను నితరులవశములో నుండఁడు గదా! యని జనులు తలంచి రని భావము. ఇందు "గంభీరవేది" యను గజము వర్ణింపఁబడినది. గంభీర మనఁగా మందము. దాని నెఱిఁగిన గజము గంభీరవేది. "త్వగ్భేదా చ్ఛోణిత స్రావా న్మాంసస్య చ్యవనా దపి ఆత్మానం యో న జానాతి తస్య గమ్భీరవేదితా॥" చర్మము తెగినను రక్తము కాఱుచున్నను మాంసము తెగిపడుచున్నను దన్ను దాఁదెలియని లక్షణము గల యేనుఁగు గంభీరవేది యని రాజపుత్రీయము నందును "చిరకాలేన యో వేత్తి శిక్షామ్ పరిచితా మపి గమ్భీరవేదీ విజ్ఞేయః స గజో గజవేదిభిః" పరిచయమునొందిన శిక్షను గూడఁ జిరకాలమునకు (ఆలస్యముగా) గ్రహించు గజము గంభీరవేది యని "మృగచర్మీయము" నందుఁ జెప్పఁబడినది.

మహీయసా మ్మహతి దిగన్తదన్తినా మనీకజే రజసి ముఖానుషఙ్గిణి
విసారితా మఙ్విహత కోకిలావలీ మలీమసా జలదమదామ్బురాజయః ॥

ఉ. ఆకసమున్ స్పృశించెను ... ... ... ఆ. మా. (17-55)

దిగంతములను నేనుఁగులు సైన్యముచే నెగురకొట్టఁబడిన ధూళి ముఖములందుఁ బడఁగాఁ గోకిలలవలె నల్లగా నుండు మబ్బులను మదరేఖలను గార్చె ననిభావము.

ధూళి యెగిరిన కొలఁది యేనుఁగులకు మదమెక్కి యవి సంతసించును. "స్త్రియో జారేణ తుష్యన్తి గావః స్వచ్ఛన్దచారతః కుఞ్జరాః పాంసువర్షేణ బ్రాహ్మణాః పరనిన్దయా" స్త్రీలు జారులవలన సంతసింతురు. ఆవులు స్వచ్ఛందముగాఁ దిరుగుట వలన సంతసించును. ఏనుఁగులు ధూళి యెగిరినకొలఁది సంతసించును. బ్రాహ్మణులు పరులను నిందించుటవలన సంతసింతురని మహాభారతమున బాదరాయణులు చెప్పిరి. ఇందు దిగంతములే యేనుఁగు లని చెప్పఁబడుటచే శ్లిష్టరూపకము.

మదామ్బుసా పరిగలితేన సప్తధా గజాఙ్గనః శమితరజశ్చయానఘః
ఉపర్యవస్థితఘనపాంసుమణ్డలా నలోకయ త్తతపటమణ్డపానివ. (17-68)

క. కరకటమేహననేత్ర ... ... ... ఆ. మా. (17-66)

ఏడు స్థానములనుండి స్రవించిన మదజలముచే గజసమూహము క్రిందనున్న ధూళి నణఁచివైచినది. ఇఁక నేనుఁగులకుఁ బైనున్న ధూళి మండలము వస్త్రమండపమువలె నొప్పిన దనిభావము. "దానం కపోలయో స్సేధు ఽక్ష్ణోః శ్రుతో్యస్తు సాగరః కరాగ్రేశీకరః సిక్యం స్తనాగ్రే మేహనే మదః హృదయే ఘర్మసలిలమ్ మేఘస్తు చరణవ్రజే సంజ్ఞా యాష్టమదాహ్యేతే జాయన్తే భద్రదన్తినామ్" అని భద్రగజముల కష్టమదస్థానములు చెప్పఁబడినను గజశాస్త్రమునందు "కరాత్కటాభ్యామ్ మేఢ్రాచ్చ నేత్రాభ్యాం చ మదస్రుతిః" అని పాలకావ్య మహర్షి సప్తమదస్థానములు పేర్కొనుటచే 'సప్తధా' యని మాఘకవి చెప్పినాఁడు. "తొండము రెండుకపోలములు, శిశ్నము, గుదము, రెండునేత్రములు సప్తమదస్థానము" లని మణిప్రభావ్యాఖ్య. "కరాన్నాసారన్ధ్రాభ్యా మిత్యర్థః" అని మల్లినాథుని ఘంటాపథవ్యాఖ్య. "కరే రన్ధ్రద్వితయ సద్భావాత్ సప్తస్థానాన్యత్రబోధ్యాని" - అని యాదవాభ్యుదయవ్యాఖ్య. తొండమునందలి రెండురంధ్రములు, రెండు గండములు, మేహనము, రెండుకన్నులు సప్త మదస్థానములు.

సాన్ద్రత్వక్కాః పృష్ఠలగ్నాస్త్రిషకక్షా అఙ్గేం శోభా మాప్నువ న్తీః శ్చతుర్థీమ్
కల్పస్యాన్తే మారుతేనోపమన్నాః శ్చైలశ్చాణ్ణాం గణ్డశైలా ఇవేభాః ॥ (18-6)

చ. నలువది యేండ్లయీడునకు ... ... ... ఆ. మా. (18-6)

ఏనుఁగు నడుమునందుఁ గట్టెడు తోలుత్రాడునకుఁ గక్ష యనిపేరు. దట్టములగు కవచములు గలవి, వృష్ఠములందుఁ గట్టఁబడిన కక్షలు గలవి, నాల్గవ దశయందుఁ గల్గెడు శరీరశోభ గలవి యగు నేనుఁగులు ప్రళయమారుతముచేఁ బొర్లింపఁబడిన పర్వతములవలెఁ దీవ్రముగాఁ జలించెనని భావము. 120 సంవత్సరములు వయస్సుగల యేనుఁగులకు 12 దశలు సంభవించును. దశకుఁ బదివత్సరములు. అందు నాల్గవదశ వచ్చినంతనే యేనుఁగులకుఁ బ్రౌఢశోభ గల్గును.

సన్థానాదిషు జాతసుస్థిరబలో గృహ్ణాతి యు క్తమ్ మదం
నిదాఘిణః పఘితద న్ధివై రిమనసా ప్రీతఃకరాధూననాత్
కేశోర్ధ్వ శ్చపలశ్చ సన్ధిషు యువా యూథప్రయోగాశ్రియః
కల్యాణాహ్వయ వేతి వారణ ఇహ ప్రాప్తశ్చతుర్థీం దశామ్.

అంగసంధులు బలియుట, మదమును బొందుట, తొండము నాడించుటయందుఁ బ్రీతి కల్గియుండుట, సిక్కినవెండ్రుకలు గల్గియుండుట, చపలత్వమును బొందుట యౌవనముగలిగి గజయూథములతోఁ గూడుట యివి చతుర్థదశ పొందిన గజలక్షణములు. ఈ చతుర్థదశ యందలి గజమునకుఁ గళ్యాణ మనిపేరని పాలకావ్యమహర్షి గజశాస్త్రమునఁ జెప్పఁబడినది.

ఉష్ట్రపరిచయము:—

సార్ధం కథఞ్చి దుచితైః పిచుమర్ధపత్రై రాస్యాన్తరాళ గతమామ్రదళమ్ మ్రదీయః
దానేరకః సపది సంవలితం నిషాదై ర్విప్రమ్ పురా పతగరాడివ నిర్జగార॥ [5-66]

చ॥ నెటి యలవాటుగాఁ దినెడు ... ... ... ఆ. మా. ౫-66. ఒంటెపేఁ పాకులను దినుచు దానితోఁ బాటు కంఠమునఁ జొచ్చిన మృదువైన మామిడి చిగురును, బూర్వకాలమున గరుత్మంతుఁడు కంఠగతుఁడగు బ్రాహ్మణుని వదిలిన ట్లుమ్మి వేసె ననిభావము. ఒంటెలు వేఁపరొట్టను బ్రీతిగాఁ దినుననియు, మామిడి చిగురు వాని కిష్టముగాదను రహస్యము నిందు మాఘకవి వెల్లడించినాఁడు. గరుత్మంతుఁ డమృతము నకై యేఁగుచు సముద్రోదరంబున నున్న నిషాదులను మ్రింగి వారితోఁ గంఠ మునందుఁ జొచ్చిన బ్రాహ్మణుని విడిచిపెట్టిన కథ మహాభారతాదిపర్వమునఁ గలదు. ఈకావ్యమునందు లొట్టిపిట్టలు తక్కినచోట్ల కూడఁ జక్కఁగా వర్ణింపఁబడినవి.

బౌద్ధమతపరిచయము:—

సర్వకార్యశరీరేషు ముక్త్వాఙ్గస్కన్ధపఞ్చకమ్
సౌగతానా మివాత్మాన్యో నాస్తి మన్త్రో మహీభృతామ్ (2-28)

సీ. అయిదు స్కంధంబుల ... ... ... ఆ. మా. (2-25)

బౌద్ధమతస్థులకు సర్వశరీరములందును బంచస్కంధములు తప్ప వేఱే యాత్మ యను పదార్థ మెట్లు లేదో యట్లే రాజులకు సంధి మొదలగు సర్వకార్యములందును గార్యారంభము మొదలగు నైదంగములు తప్ప వేఱే మంత్రము లేదని భావము.

"సహాయాః సాధనోపాయా విభాగో దేశకాలయోః
విపత్తేశ్చ ప్రతీకారః సిద్ధిః పఞ్చా" ఙ్గమిష్యతే కార్యము లారంభించు నుపాయము, కార్యసిద్ధికై పురుషద్రవ్యసంపత్తు, దేశకాలముల విభాగము. ఆపదలను రూపుమాపుటకుఁ బ్రతీకారము, కార్యసిద్ధి—ఇవిరాజులు చేకూర్చుకొనవలసిన పంచాంగములని కామందకుఁడు నీతిశాస్త్రములోఁ జెప్పినాఁడు.

ఇట్లే బౌద్ధమతమున రూపస్కంధము, వేదనాస్కంధము, విజ్ఞానస్కంధము, సంజ్ఞాస్కంధము, సంస్కారస్కంధము—అను నైదు స్కంధములు ప్రసిద్ధములు. ఇంద్రియవిషయప్రపంచము రూపస్కంధ మనియు, నీవిషయములచే ననుభవించు సుఖదుఃఖాద్యనుభవము వేదనాస్కంధ మనియుఁ, జిత్తవిస్మరణము లేక ప్రవాహముగా వచ్చు నాలయ

విజ్ఞానము విజ్ఞానస్కంధ మనియు, చిత్తమునఁ గల్గు రాగద్వేషములు, మదమానములు, ధర్మాధర్మములు మొదలగు వాసనాప్రపంచమునకు సంస్కారస్కంధ మనియు నీపంచ స్కంధములకంటె నితరమగు నాత్మపదార్థ మే శరీరమునందును లేదనియు బౌద్ధమత సిద్ధాంతము.

శ్రుతిపరిచయము; —

రుచిధామ్ని భర్తరి భృశం విమలాః పరలోక మభ్యుపగతే వివిశుః
జ్వలనం త్విషః కథమి వేతరథా సులభోఽన్య జన్మని స ఏవ పతిః॥ (9-13)
ఉ. కాంతుల కుప్పపట్టగు ... ... ... అ. మా. [9—14]

ఇది సూర్యాస్తమయ వర్ణనము. తమ భర్తయగు తేజోధాముఁడు సూర్యుఁడు పరలోకమును బొందినంతనే విశుద్ధశీలలై పతివ్రతలగు ప్రభారమణు లగ్ని యందుఁ బ్రవేశించిరి. అట్లుగానిచో నితరజన్మములం దాతఁడే యెట్లు వారికి భర్తయగును?

"మృతే యా మ్రియతే పత్యౌ సాస్త్రీ జ్ఞేయా పతివ్రతా"

భర్తచనిపోయినపుడు వానితో నెవ్వతె సహగమించునో యా స్త్రీపతివ్రత 'తేనైవ సహ మోదతే' అట్లగ్నిప్రవేశమొనర్చిన సతీమణి భర్తతో నన్యజన్మమునఁగూడ మోదమునొందు నని ధర్మశాస్త్రము. "శ్రు అగ్నింవా వాదిత్యః సాయమనుప్రవిశతి. ఉద్యన్తంవా వాదిత్యమగ్నిరను సమారోహతి.

"సాయంసంధ్యయందు సూర్యకాంతు లగ్నిలోఁ బ్రవేశించును. మరల ప్రాతఃకాలమునందు దయించెడు సూర్యునం దాయగ్ని కాంతులు ప్రవేశించు నని వేదమునఁజెప్పఁబడినది. ఇచట సూర్యుఁడు నాయకుఁడు. ప్రభలు నాయికలు. సూర్యుఁ డస్తమించినంతనే శ్రుతియందుఁ జెప్పబడినట్లు ప్రభాకాంత లగ్నిప్రవేశమొనర్చిరి. అందు వలననేమరలఁ బ్రాతఃకాలమునఁ దమ భర్తయగు సూర్యుని బొందఁగల్గుచున్నారని కవి చమత్కారముగా సతీసహగమనము నిందు సమర్థించినాఁడు.

నానావిధావిష్కృతసామజస్వరః సహస్రవర్త్మా చపలై ర్దురధ్యయః
గాన్ధర్వభూయిష్ఠతయా సమానతాంస సామవేదస్య దధౌ జలోదధిః॥ (12-11)
శా. నానాభంగుల మించు సామజ ... ... అ. మా. 12-11

నానావిధములగు నేనుఁగుల బృంహితధ్వనులు, పెక్కు గుఱ్ఱములు వీనితో బహుమార్గములఁ జరించుచుఁ జపలులకుఁ బొంద శక్యముగాని యానేనాసముద్రము, బృహద్ర థన్తరాదిసామోత్థిత స్వరములుగలది, సహస్రశాఖలు గలది, గాంధర విద్యవలె గాన ప్రధానమైనది, యల్పులకుఁ జదువశక్యము గానిది యగు సామవేదముతో తుల్యత్వమును బొందెనని భావము.

సప్తభేద పరికల్పిత స్వరం సామ సామవిదసఙ్గ ముజ్జగౌ।
తత్ర సూనృతగిరశ్చ సూరయః పుణ్యమృగ్యజుష మధ్యగీషత [14-21]
తే. సామవేదంబు ... ... అ. మా. (14-21)

ధర్మజ్ఞుఁడు చేయు యాగమునం దుద్గాత కరవిన్యాస పూర్వకముగా సప్తస్వరములతో బృహద్రథన్తరాది సామవేదమును గానము చేసెను. పుణ్యసత్యవాక్కులు విద్వాం

సులు నగు హోత, యధ్వర్యుఁడు శ్రేయస్కరములగు ఋగ్వేదము, యజుర్వేదము పఠించిరని భావము.

(1) కృష్టము (2) ప్రథమము [3] ద్వితీయము [4] తృతీయము (5) చతుర్థము (6) మంద్రము (7) అతిస్వార్యము. ఇవి సామవేదమునకు సప్తస్వరములని తైత్తిరీయ ప్రాతి శాఖ్యము (అధ్యా. 23. సూ. 14) నందుఁ జెప్పఁబడినది. 'అగ్న ఆయాహి వీతయే' యని మొదలుగాఁ గలది సామవేదము. 'అగ్నిమీళే పురోహితమ్' అని మొదలుగాఁ గలది ఋగ్వేదము. 'ఇషేత్వోర్జేత్వావాయవః' అని మొదలుగాఁ గలది యజుర్వేదము. "యదృచైవ హోత్రం కురుతే యజుషాధ్వర్యవం సామ్నోద్గీయమ్" అని శ్రుతి. 'అధ్వ ర్యూద్గాతృ హోతారో యజుస్సామ ర్గ్విదః క్రమాత్' అని యమరము. యజ్ఞమునందు హోత, అధ్వర్యుఁడు, ఉద్గాత మొదలగువా రుందురు. హోత ఋగ్వేదముతోడ, అధ్వర్యుఁడు యజుర్వేదము తోడ నుద్గాత సామవేదముతోడను యజ్ఞప్రయోగములను నిర్వర్తింతురు.

స్మృతిపరిచయము:-

"బలావలేపా దధునాపి పూర్వవత్, ప్రబాధ్యతే తేన జగజ్జిగీషుణా,
సతీవ యోషిత్ ప్రకృతిః సునిశ్చలా, పుమాంస మభ్యేతి భవాన్తరేష్వపి. (1-72).
మ. బలగర్వంబునఁ దొంటి .. ...ఆ. మా. (1-72).

విశుద్ధస్వభావముగల పతివ్రత జన్మాంతరములందుఁ గూడఁ దన భర్తనే యెట్లు పొందుచున్నదో యట్లే పూర్వజన్మములందు వలె నీజన్మమునందుఁ గూడ బలగర్వముతో జయేచ్ఛువగు శిశుపాలునిచే జగత్తు బాధింపఁ బడుచున్నదనిభావము. "పతిం యా నాభిచరతి మనోవాక్కాయ సంయతా సా భర్తుర్లోక మాప్నోతి. సద్భిః సాధ్వీతి చోచ్యతే." (5-64) మనోవాక్కాయ కర్మముల భర్త నన్యభావముతో నే స్త్రీ చూడదో యామె సజ్జనులచే సాధ్వియని కొనియాడఁబడుచు భర్తపొందిన లోకమునే పొందుచుండునని మనుస్మృతి.

"చిరరతిపరిఖేద ప్రాప్తనిద్రాసుఖానాం, చరమ మపి శయిత్వా పూర్వమేవ ప్రబుద్ధాః అపరిచలితగాత్రాః కుర్వతే న ప్రియాణా, మశిథిల భుజచక్రాశ్లేషభేదం తరుణ్యః." (11-13) క. చిరరతినలసిప్రియులు... ...ఆ. మా. (11-13). భర్తలు నిద్రించిన పిదప నిద్రించినను వారికంటెఁ బూర్వమే మేలుకొనిన వారై యెక్కువ సంభోగముచే నలసటచెంది సుఖముగా నిద్రించుచున్న ప్రియుల గాఢపుఁగౌఁగిలిని వేఱుచేయుటలే దనిభావము. "సుప్తే పశ్చాచ్చ యా శేతే పూర్వమేవ ప్రబుధ్యతే నాన్యం కామయతే చిత్తే సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా." భర్త నిద్రించిన పిదప నిద్రించుచు నతనికంటె ముందుగనే లేచుచు మనస్సులో నితరు నే స్త్రీ కామింపదో యామె పతివ్రత యని ధర్మశాస్త్రము. "జలమ్ పిబే న్నాఞ్జలినా, నశయానమ్ ప్రబోధయేత్ నాక్షైః క్రీడే న్నధర్మఘ్నై ర్వ్యాధితై ర్వా న సంవిశేత్ (యాజ్ఞ- ఆచా-138) దోసిలితో నీరు త్రాగరాదు. నిద్రించిన వానిని లేపరాదు. పాచికలతో నాడరాదు. ధర్మఘ్నుల తోడను, వ్యాధిపీడితులతోడను బరుండరా దని యోగియాజ్ఞవల్క్యుల వచనము. కౌఁగిలి విడిపించినచో భర్తలకు నిద్రాభంగ మగు నను భయముతో యాదవస్త్రీ లట్టే భర్తల కౌఁగిలిలో నుండి రని వర్ణింపఁబడినది.

"ఆగతా ద్వ్యవసితేన చేతసా, సత్త్వసమ్భవవికారి మానసః

తతస్త్రినాభవ దసౌ మహాహవే శాత్రవా దివ పరాఙ్ముఖోఽర్థినః" (14-44).

చ. విన మితవైరియైన.... ....ఆ. మా. [14-44].

సత్త్వసంపదగల ధర్మరాజు యుద్ధమునందు శత్రువున కెట్లు పరాఙ్ముఖుఁడు కాఁడో, యట్లే యజ్ఞమునందు యాచకునకుఁ బరాఙ్ముఖుఁడు కాలేదు. అనఁగా నిరంతరదానముచే నర్థుల సంతోషపఱచె ననిభావము.

"ఆహవే ష్వనివర్తిత్వమ్ ప్రజానాం చైవపాలనమ్ శుశ్రూషా బ్రాహ్మణానాం చ రాజ్ఞాం శ్రేయస్కరమ్ పరమ్" [మను. 7-88]. యుద్ధములో వెనుకకు మఱలకుండుట, ప్రజలను బాలించుట, బ్రాహ్మణుల సేవచేయుట, రాజులకు శ్రేయస్కర మని మనుస్మృతియందుఁ జెప్పఁబడినది. "పూర్వమేవ కిల సృష్టవానప స్తాసు వీర్యమనివార్య మాదధే తచ్చ కారణ మభూద్ధిరణ్మయమ్ బ్రహ్మణోఽ సృజదసా విదం జగత్." 14-67. కం. మునుదా సృజించి... ...ఆ. మా. 14-67. ఇది భీష్మ స్తవము. ఈహరియే మొదట నీటిని సృజించి యందుఁ దన యమోఘవీర్య ముంచెను. సువర్ణరూపమగు నా వీర్యమే బ్రహ్మ పుట్టుకకుఁ గారణమైనది. బ్రహ్మ యీ జగత్తును సృజించె ననిభావము. "తతః స్వయమ్భూ ర్భగవా నవక్తో వ్యఞ్జయన్నిదమ్ మహాభూతాది వృత్తౌజాః ప్రాదురాసీ త్తమోనుదః సోఽభిధ్యాయ శరీరాత్ స్వాత్ సిసృక్షు ర్వివిధాః ప్రజాః అప ఏవ ససర్జాదౌ తాసుబీజ మవాసృజత్ తదణ్డ మభద్దైమం సహస్రాంశు సమప్రభమ్ తస్మిన్ జజ్ఞే స్వయమ్ బ్రహ్మా సర్వలోక పితామహః" [మను. 1-6,8,9]. తమస్సును భేదించి తన యంతట తానే మహాభూతప్రకాశకుఁడై యవ్యక్తుఁడగు పరమాత్మ యుద్భవించెను. అతఁడు సకలప్రజలను సృజింపఁ గోరి మొదట నీటిని సృష్టించి యందు బీజము నుంచెను. అదియే సూర్యకాంతిగల హేమాండ మయ్యెను. అందు బ్రహ్మ జన్మించి సకలలోకములను సృష్టించె నని మనుస్మృతి.

"సముల్లసద్దివకరవక్త్రకాన్తయో, రజస్వలాః పరిమలితామ్బరశ్రియః

దిగఙ్గనాః క్షణ మవిలోక నక్షమాః, శరీరిణామ్ పరిహరణీయతాం యయుః" 17-61.

ఉ. తమ్ములవిందు నెమ్మొగము... ..ఆ. మా. 17-61.

ప్రకాశించెడు సూర్యుని వంటి కాంతి కలవారు, దుమ్ముతో నిండినవారు (రజస్వలఁగా నార్తవము గమక వెలుపల నున్నవారు) మలినమగు నాకాశశోభ గలవారు (వెలఁగు మాసిన వారు) చూచుటకు యోగ్యులుగానివారునగు దిక్కులను కాంతలు క్షణకాలము ప్రాణులకుఁ బరిహరింపఁ దగినవారు (సంభోగించుటకవర్జ్యులు) గా నైరని భావము. "నాకాల్యాం నారీ మభిరమయేత్. రజస్వలాం చ" (గౌ. ధ-1-9-29,30) రోగముచే నస్వస్థ యగు స్త్రీని రమింపరాదు. ముట్టైన స్త్రీని గూడ ముట్టరాదని గౌతమమహర్షులు ధర్మసూత్రమునఁ జెప్పిరి.

## న్యాయదర్శన పరిచయము:-

"వ్యక్తమ్ బలీయాన్ యది హేతురాగమా, దపూరయత్ సా జలధిం న జాహ్నవీ

గఙ్గౌఘ నిర్భర్త్సిత శమ్భుకన్ధరా, సువర్ణ మర్ణః కథ మన్యథాస్య తత్" (12-69).

చ. నిగమముకంటె యుక్తి... ...ఆ. మా. (12-69).

ఆగమముకంటె హేతువు (అనుమానప్రమాణమును నిరూపించు పంచావయవములలో హేతువు ముఖ్యముగాన నిచట హేతు వనఁగా ననుమాన మని గ్రహింపవలయును), బలీయ

మైనచో యమునానదియే సముద్రమును బూరించినది గాని గంగ కాదు. అది సత్యము. అట్లు కానిచో గంగాజలక్షాళితమైన శివుని కంఠమువలె నా సముద్రజల మెట్లుండును? అనఁగా "గంగా సాగరపూణీ" యని వేదము చెప్పిన ప్రకారము గంగయే సముద్రమును బూరించినచో గంగాజలమువలె సముద్రజలము గూడ దెల్లఁగానే యుండవలయును. కాని శివునికంఠమువలె నల్లగా సముద్రజల ముండుటచే నల్లని జలముగల యమునయే సముద్రమును బూరించిన దని భావము. గ్రావాప్లవనవాక్యమువలె "గఙ్గా సాగర పూరణీ" యను నాగమవాక్యమునకుఁ గూడ వేఱర్థము చెప్పవలయునని కవి చమత్కృతి.

"అనుసన్తతిపాతినః పటుత్వం దధతః శుద్ధిభృతో గృహీతపక్షాః
వదనాదివ వాదినోఽథ శబ్దాః క్షితభర్తు ర్ధనుషః శరాః ప్రససుః. (20-11).
కం. ఎడతెగక పరఁగి.... ....ఆ. మా. (20-11).

వాచకత్వశక్తి గలవియై, శాస్త్రసమ్మతములై, గ్రహింపఁబడిన పక్షములు (నిత్యత్వాది సాధ్యార్థములు) గలిగిన శబ్దములు (ప్రతిజ్ఞాహేత్వాదులు) వాది నోటినుండి యెట్లు వెలువడునో యట్లే గుటికలవై లక్ష్యభేద పాటవము గలిగి శుద్ధలోహముతోఁ జేయఁబడి, కంకాదిపత్రములు గలిగిన బాణములు శిశుపాలుని ధనుస్సునుండి వెలువడిన వని భావము.

సందిగ్ధసాధ్యవంతము పక్షము. అనఁగా దేనియందు సాధ్యము యొక్క సందేహ ముండునో యదిపక్షము. పర్వతము వహ్నిమంతమా? కాదా? యనునది సందేహము. వహ్ని సాధ్యము. ధూమవత్త్వహేతువుచే సాధ్యమగు వహ్నియొక్క సందేహము గలిగియుండుట వలనఁ బర్వతము పక్షము. అనుమిత్యుద్దేశ్యత్వము పక్షత్వమని నవీనులు. "సూ. ప్రతిజ్ఞా హేతూదాహర ణోపనయ నిగమనా న్యవయవాః" (1-1-32) అని యక్షపాదులవారి సూత్రము. అనుమానించిన విషయము నితరునిచే నొప్పింపఁజేయుటకు 1. ప్రతిజ్ఞ 2. హేతువు 3. ఉదాహరణము 4. ఉపనయము 5. నిగమనము; అను నైదింటిని వాదమున నుపయోగింతురు. తర్కశాస్త్రములో వీనికిఁ బంచావయవములనిపేరు. పర్వతమునందలి పొగవలన నిప్పు గలదని యనుమానించి యితరుల నంగీకరింపఁ జేయవలసినపు డీపంచావయవము లిట్లు ప్రయోగింపఁబడును.

1. పర్వతము వహ్నిమంతము-అని ప్రతిజ్ఞ (పర్వతోవహ్నిమాన్) 2. పొగ కలిగి యుండుటవలన-అని హేతువు. (ధూమవత్త్వాత్) 3. ఏది యేది పొగను కలిగియుండునో యది యగ్నిని గలిగియుండును వంటయింటివలె-అని యుదాహరణము. (యో యో ధూమవాన్ సోఽ-గ్నిమాన్ యథా మహానసః) 4. అట్లే యిదియును. (వంటయింటివలెనే పర్వతమును)-అని యుపనయము (తథాచాయమ్). 5. కావున నిదియట్టిదే [పొగనుగలిగి యున్నది కావున యీపర్వతము కూడ వంటయింటివలె వహ్నిమంతము]- అని నిగమనము [తస్మాత్తథేతి].

"ఇషువర్ష మనేక మేకవీర స్తదరిప్రచ్యుత మచ్యుతః పృషత్కైః.
అథ వాదికృతమ్ ప్రమాణ మన్యైః ప్రతివాదీవ నిరాకరో త్ప్రమాణైః. [20-28]
ఉ. తూపుల జల్లువానలను.... ....ఆ. మా. [20-18].

వాది చూపిన ప్రమాణములను బ్రతివాది యన్యప్రమాణములతో నెట్లు నిరాకరించునో యట్లే లోకైకవీరుఁడగు శ్రీకృష్ణుఁడు శత్రుబాణవర్షమును దన బాణములతో ఖండించెనని భావము. ప్రమ యనఁగా యథార్థానుభవ మనియుఁ, గరణమనఁగా నసాధారణకారణ మనియుఁ,

ప్రమాకరణమే ప్రమాణమనియుఁ దర్కశాస్త్రవ్యవహారము. ప్రమాణములను గూర్చి న్యాయదర్శనము విపులముగాఁ జర్చించి తక్కిన శాస్త్రములకు మార్గదర్శక మైనది. గౌతమమహర్షి మొదలుకొని యుదయనాచార్యుల వఱకుఁ గల ప్రాచీనన్యాయశాస్త్రముతోఁ బ్రమేయవిచారమున కెక్కువ ప్రాధాన్యము నీయఁగా శ్రీగంగేశోపాధ్యాయులవారి 'తత్త్వచింతామణి' వెలువడిన పిదప నవ్యన్యాయశాస్త్రమునఁ బ్రమాణవిచారమున కెక్కువప్రాధాన్య మీయఁబడినది. ఒక్కొక్క శాస్త్రములోఁ గొన్నికొన్ని ప్రమాణము లంగీకరింపఁబడినవి. ఆయా శాస్త్రకారులు వారి ప్రమాణములను సాధించి ప్రబలయుక్తులతో నితరశాస్త్రప్రమాణములను ఖండింతురు. ఈ ప్రామాణ్యవాదమునందు: ప్రత్యక్ష మొక్కటియే చార్వాకులకుఁ బ్రమాణము. ప్రత్యక్షము, అనుమానము, రెండే వైశేషికులకు బౌద్ధులకుఁ బ్రమాణములు. ప్రత్యక్షము, పరోక్షము రెండే స్యాద్వాదులగు జైనులకుఁ బ్రమాణములు. ప్రత్యక్షము, అనుమానము, శబ్దము నను మూఁడే సాంఖ్యులకు, యోగులకుఁ బ్రమాణములు. ప్రత్యక్షానుమానోపమానశబ్దములు నాలుగు నైయాయికులకుఁ బ్రమాణములు. పరతఃప్రమాణవాదులగు తార్కికుల కనుమానప్రమాణమే ప్రాణము. అర్థాపత్తితో నైదును ప్రాభాకరులకు, అనుపలబ్ధితో నాఱును భాట్టమీమాంసకులకు వేదాంతులకుఁ బ్రమాణములు. స్వతఃప్రమాణవాదులగు వీరికి శబ్ద[వేద] ప్రమాణమే ప్రాణము. సంభవైతిహ్యములతో నెనిమిది పౌరాణికులకుఁ జేష్టతోఁ దొమ్మిది తాంత్రికులకుఁ బ్రమాణములు.

## వైశేషిక దర్శన పరిచయము:-

"అప్యనారభమాణస్య, విభో రుత్పాదితాః పరైః,
వ్రజన్తి గుణతా మర్థాః, శబ్దా ఇవ విహాయసః. [2-91].
క. ఏపని తాఁ జేయక... ...ఆ. మా. 2-82.

జయేచ్ఛగల సమర్థుఁ డగు రాజు తా నే కార్యములను బ్రారంభింపకపోయినను నితరులచే నాకార్యములను చేయించి, విభు [సర్వత్రవ్యాపించునది] వగు నాకాశము స్తబ్ధమయ్యును శబ్దముల గుణత్వము నెట్లు పొందునో యట్లే సర్వార్థములను బొందునని భావము.

"శ్రోత్రగ్రాహ్యో యోఽర్థః స శబ్దః" [2-2-21] "పరిశేషా ల్లిఙ్గ మాకాశస్య" [2-1-2] మొదలగు వైశేషిక సూత్రములలో శబ్దాకాశములను గూర్చి కణాదమహర్షులు చెప్పినారు. శ్రోత్రము [చెవి] చే గ్రహింపఁబడు గుణము గలది శబ్దము. శబ్దమున కాశ్రయ మాకాశము. శబ్దము ధ్వన్యాత్మకము, వర్ణాత్మకము నని రెండు విధములు. డోలు మొదలగు వాని నుండి పుట్టు శబ్దము ధ్వన్యాత్మకము. సంస్కృతము, తెలుఁగు మొదలగు భాషారూపములు గలది వర్ణాత్మకము. భేరీదండ సంయోగము కలుగు నపుడు భేర్యాకాశసంయోగముచే ధ్వన్యాత్మకమగు శబ్దము పుట్టును. వీచీతరంగన్యాయమునఁ గాని, కదంబముకుళన్యాయమునఁగాని యిట్లు పుట్టిన శబ్దముల నుండి శబ్దసంతానము లుద్భవింపఁగా శ్రోత్రశష్కుల్యవచ్ఛిన్నమగు నాకాశము గ్రహించుటచే మనము వానిని వినఁగల్గుచున్నాము. సర్వత్ర వ్యాపించి సర్వమూర్తద్రవ్యసంయోగము కలిగి యున్న శూన్యపదార్థమున కాకాశమని పేరు. శష్కులి యనఁగాఁ జెవికి ముందు భాగము. శ్రవణవివర సంజ్ఞక [చెవి యందలి రంధ్రము] మగు నాకాశమే శ్రోత్రము. ఇట్లాకాశము స్తబ్ధముగా నున్నను శబ్ద ప్రవాహమునకుఁ గారణ మగుటచే నిందిట్లు వర్ణింపఁబడినది.

సాంఖ్యదర్శన పరిచయము :

శ్లో. ఉపాసితారం నిగృహీతమానసై ర్గృహీత మధ్యాత్మదృశా కథఞ్చన
బహిర్వికారమ్ ప్రకృతేః పృథగ్విదుః పురాతనం త్వామ్ పురుషమ్ పురావిదః

తే. మనసు నేకాగ్రముగఁ జేసి ... ... ... అ. మా. (1-33).

నారదుఁ డొనర్చిన శ్రీకృష్ణ స్తవము. పూర్వతత్త్వజ్ఞులగు కపిలాది మహర్షులు సంయమచిత్తులై యాధ్యాత్మికదృష్టితోఁ గ్రియాశూన్యుఁడు, మహదాదివికారములకంటె విలక్షణుఁడు, సత్త్వరజస్తమోగుణాత్మికయగు ప్రకృతికంటె భిన్నుఁడు నగు పురాణపురుషుఁడ వని నిన్నే వక్కాణించుచున్నా రనిభావము.

శ్లో. "మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త
షోడశకశ్చ వికారో న ప్రకృతి ర్నవికృతిః పురుషః" (కారిక 3.)

మూలప్రకృతి, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచమహాభూతములు, మనస్సు. ఇవి యిరువది నాలుగు తత్త్వములు. ప్రకృతి వికృతులకు భిన్నుఁడు, కూటస్థనిత్యుఁడు, నపరిణామియగువాఁడు పురుషుఁడు (పరమాత్మ). అని సాంఖ్యాకారికయం దీశ్వరకృష్ణులు చెప్పినారు. "అజా మేకాం లోహితశుక్లకృష్ణామ్" అని శ్రుతి కూడ నిట్లే చెప్పుచున్నది. 'అజ' యనఁగాఁ బుట్టుక లేనిది. 'ఏక' యనఁగా సజాతీయద్వితీయరహిత. లోహితశుక్లకృష్ణవర్ణ యైనది ప్రకృతి. సత్త్వరజస్తమోగుణాత్మిక. రాగాత్మకమగుటచే నెఱ్ఱనిది రజోగుణము. ప్రకాశాత్మకమగుటచేఁ దెల్లనిది సత్త్వగుణము. ఆవరణాత్మకమగుటచే నల్లనిది తమోగుణము. ఈ త్రిగుణాత్మకయగు ప్రకృతికంటె వేఱైనవాఁడు పురుషుఁడని సాంఖ్యప్రవచనము.

శ్లో. విజయా స్త్వయి సేనాయాః సాక్షిమాత్రేఽపదిశ్యతామ్
ఫలభాజి సమీక్ష్యోక్తే బుద్ధే ర్భోగ ఇవాత్మని. (2-59)

తే. కాన నీవు తటస్థుఁడై ... ... ... అ. మా. (2-51)

బుద్ధియొక్క సుఖదుఃఖాద్యనుభవమగు భోగ ముదాసీనమగు నాత్మము నందె ట్లారోపింపఁబడుచున్నదో యట్లే నీవు సాక్షిమాత్రముగా నుండి సేన పొందెడు జయము నీదిగా నెంచుమని బలరాముఁడు శ్రీకృష్ణునకుఁ జెప్పిన రాజనీతి.

శ్లో. "తస్మాత్తత్సంయోగా దచేతనం చేతనావదివలిఙ్గమ్
గుణకర్తృత్వేఽపి తథా కర్తేవ భవత్యుదాసీనః" (కారిక 20)

శ్లో. సర్వమ్ ప్రత్యుపయోగం యస్మాత్ పురుషస్య సాధయతి బుద్ధిః
సైవ చ విశినష్టి పునః ప్రధానపురుషాన్తరం సూక్ష్మమ్" (కారిక 37)

బుద్ధ్యాదిక మచేతనమైనను జేతనసన్నిధానముచేఁ జేతనమువలె నగును. అనఁగా నేను జేయుచున్నాను. చూచుచున్నా నను ప్రత్యయము గల్గును. పరిణతములగు గుణముల కృతిమత్త్వము గలిగి యున్నను వాని ప్రతిబింబమువంటి వాఁడగుటచే నుదాసీనుఁడగు పురుషుఁడు భోక్తవలె భాసించును. పురుషుని యొక్క శబ్దాదుల యుపభోగమును బుద్ధియే సాధించును. ఇది యత్యంత సూక్ష్మమైనదై ప్రధానపురుషుల భేదమును గల్గఁజేయును. అనఁగా భోక్తృత్వము బుద్ధిగుణమైనను పురుషగుణమువలె భాసించు నని సాంఖ్యులమతము.

శ్లో. మైత్ర్యాది చిత్తపరికర్మవిదో విధాయ క్లేశప్రహాణ మిహ లబ్ధసబీజయోగః
ఖ్యాతిం చ సత్త్వపురుషాన్యత యాధిగమ్య వాఞ్ఛన్తి తా మపి సమాధిభృతో నిరోద్ధుమ్.
సీ. మఱియు భోగస్థాన ... ... ... ఆ. మా. (4-55)

ఇది రైవతకాద్రివర్ణనము. మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష, యనునవి నాల్గు చిత్తవృత్తులు. పుణ్యములొనర్చు వారితో మైత్రి, దుఃఖించు వారియందుఁ గరుణ, సుఖించు వారియందు సంతోషము, పాపులయం దుపేక్ష. ఇవి చిత్తకర్మములు. అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము ననునవి పంచక్లేశములు. అనాత్మము నందాత్మబుద్ధి మొదలగు విపర్యయజ్ఞాన మవిద్య. అహంకార మస్మిత. అనుకూల వస్తువులను బొందవలెనను కోరిక రాగము. ప్రతికూలవస్తువులం దుండెడు రోషము ద్వేషము. కార్యాకార్యములం దాగ్రహ మభినివేశము. మైత్రి మొదలగు చిత్తవృత్తుల నెఱిఁగి యంతఃకరణ మలినములను బోఁగొట్టుకొనిన వారు, నవిద్యాది పంచక్లేశములను వదలినవారు, సబీజయోగమును సాధించినవారు నగు యోగులు ప్రకృతి పురుషులు భిన్నులని యెఱిఁగి దానిని గూడ వీడి సమాధిచే స్వయంప్రకాశత్వము నొందఁగోరుచున్నారు. అనఁగా యోగులకుఁ గూడ నీరైవతకాద్రి నిలయ మనిభావము. ఇందు సమాధిశబ్దముచే నష్టవిధయోగాంగములను గ్రహింపవలయును. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి - ఇవి యష్టాంగములు.

శ్లో. రఙ్గస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీ యథా నృత్యాత్
పురుషస్య తథాత్మానమ్ ప్రకాశ్య వినివర్తతే ప్రకృతిః (కారిక 59)

శ్లో. ప్రాప్తే శరీరభేదే చరితార్థత్వాత్ ప్రధానవినివృత్తౌ
ఏకాన్తిక మాత్యన్తిక ముభయం కైవల్య మాప్నోతి. (కారిక 68)

నర్తకి (నాట్యోపాధ్యాయి) నాటక మాడు పురుషులకు నృత్యము చూపి [ఇట్లు చేయవలెనని చెప్పి] నృత్యమునుండి యెట్లు మఱలునో యట్లే ప్రకృతికూడ నాత్మసందర్శనమను స్వస్వరూపమును బురుషునకుఁ జూపి తొలఁగిపోవును. ప్రారబ్ధకర్మభోగానంతరము శరీరము నశింపఁగా జ్ఞానముచేఁ జరితార్థుఁడై ప్రధానము కూడ నివర్తింపఁగా నవశ్యంభావి, యవినాశి, దుఃఖత్రయరహితము నగు మోక్షమును బురుషుఁడు పొందు నని శ్రీమదీశ్వరకృష్ణమహామునులు సాంఖ్యకారికలలోఁ జెప్పిరి. ప్రకృతి మఱలఁగాఁ బురుషుఁడు పొందు స్వస్వరూపావస్థానమే మోక్ష మని సాంఖ్యదర్శన సిద్ధాంతము.

తస్య సాంఖ్యపురుషేణ తుల్యతాం బిభ్రతః స్వయ మకుర్వతః క్రియాః
కర్తృతా తదుపలమ్భతోఽభవ ద్వృత్తిభాజి కరణే యథర్త్విజి. [14-19]

సీ. తాను గ్రియమాని ... ... ... ఆ. మా. [14-19]

తాను స్వయముగాఁ గ్రియల నొనర్పకపోయినను యజ్ఞమునందు ఋత్విజుఁ డొనర్చు క్రియాకలాపమునకు సాంఖ్యపురుషునితోఁ దుల్యుఁడగు ధర్మరాజు కర్తృత్వమును బొందెనని భావము. స్వయముగాఁ బుణ్యపాపముల భోక్త కాకపోయినను, నెఱుపువస్తువునకు దగ్గఱగా నున్న స్ఫటిక మెఱుపు నెట్లు పొందునో యట్లు బుద్ధి సన్నిధానమువలం దుండుటచే నాత్మమునకుఁ గర్తృత్వము గల్గు నట్లు ఋత్విజు లొనర్చు క్రియల కర్తృత్వము ధర్మరాజును బొందెనని భావము. ఆత్మమునందుఁ గర్తృత్వారోపణము "విజయాస్త్వయి" యను శ్లోకమున వివరింపఁబడినది.

యోగదర్శన పరిచయము :

సర్వవేదిన మనాది మాస్థితం దేహినా మపి జిఘృక్షయా వపుః
క్లేశకర్మఫలభోగవర్జితమ్ పుంవిశేష మము మీశ్వరం విదుః॥ (14-62)
చ. జనులు తలంతు రీఘనుని ... .... ఆ. మూ. (14-62)

ఇది భీష్మస్తవము. అది (పుట్టుక) లేనివాఁడు, సర్వజ్ఞుఁడు, సర్వప్రాణుల ననుగ్రహించుటకై దేహమును దాల్చినవాఁడు క్లేశములు, కర్మములు, వానిఫలములు, వానిభోగములు లేనివాఁడు నగు నీ పురుషవిశేషునే యీశ్వరునిగా (యోగులు) నిరూపించుచున్నా రని భావము. శ్రీమత్పతంజలిభగవానులు యోగదర్శనమునం దిట్లు సూత్రించిరి. 'సూ. అవిద్యాస్మితా రాగద్వేషాభినివేశాః పఞ్చ క్లేశాః (2-3)' అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము, అనునవి యైదు క్లేశములు. "సూ. అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచి సుఖాత్మఖ్యాతి రవిద్యా" (2-5), అనిత్యములగు వస్తువులందు నిత్యత్వబుద్ధి, శుచిలేనివానియందు శుచిత్వబుద్ధి, దుఃఖమునందు సుఖత్వబుద్ధి, యనాత్మమునం దాత్మత్వబుద్ధి కలిగియుండుట 'యవిద్య' "సూ. దృగ్దర్శనయో రేకాత్మతేవాస్మితా" (2-6) దృక్కనఁగాఁ జూచువాఁడు ద్రష్ట. దర్శన మనఁగా జూచుటకుఁ గరణమగు నదిబుద్ధి. ఈ రెండు శక్తులకు భేదము లేదనెడి యేకాత్మతాబుద్ధి 'యస్మిత' "సూ. సుఖానుశయీ రాగః" (2-7) సుఖము, దానిసాధనము, వీనియందుఁగల తృష్ణ 'రాగము' "సూ. దుఃఖానుశయీ ద్వేషః" [2-8] దుఃఖములను బ్రతిఘటింప వలయు ననెడు క్రోధము 'ద్వేషము' "సూ. స్వరసవాహీ విదుషోఽపి తథారూఢోఽభినివేశః" 2-9 పూర్వపూర్వజన్మసంస్కారముచేఁ బండితునందుఁ గూడఁ బ్రసిద్ధమగు మరణాదిభయమున 'కభినివేశమ' నిపేరు. "సూ. క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్టజన్మవేదనీయః" 2-12 వర్తమానజన్మము దృష్టము. భవిష్యజ్జన్మ మదృష్టము. ఈజన్మముల భోగము లఁ జేఁ దెలియఁ దగినది, క్లేశమూలమైనది యగు పుణ్యాపుణ్యరూపము 'కర్మాశయము' "సూ. సతిమూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః" 2-13 క్లేశముతోఁ గూడిన కర్మాశయము విపాకఫలమునకుఁ గారణమగును, జాతి (జన్మము), ఆయువు (జీవనకాలము), భోగము [సుఖదుఃఖాద్యనుభవము] అని విపాకము మూఁడు విధములు. క్లేశకర్మ విపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః" 1-24 ఇట్టి యవిద్యాదిక్లేశములు, పుణ్యాపాపకర్మములు, తత్ఫలములగు జాతిభోగాదివిపాకములు, వానిని వెంబడించు నాశయములు (వాసనాప్రపంచము) వీనిచే మూఁడుకాలములందు స్పృశింపఁబడని పురుషవిశేషుఁడే యీశ్వరుఁడని యోగదర్శనసిద్ధాంతము.

మీమాంసాదర్శన పరిచయము:—

ప్రతిశరణ మశీర్ణజ్యోతి రగ్న్యాహితానాం విధివిహితవిరిద్ధైః సామిధేనీ రధీత్య
కృతగురుదురితౌఘధ్వంస మధ్వర్యు వర్యైర్హుత మయ ముపలీఢే సాధు సాన్నాయ్య మగ్నిః॥ 11-41

మ. కృతఘోరాఘఘటావినాశముగ ... ... ఆ. మూ. 11-41

ప్రతిగృహమునందును [అగ్నిహోత్రశాలలందు] శాస్త్రోక్త విధిప్రకారము నాద్గ స్వరములతోడను సామిధేనీమంత్రములను జదువుచుఁ జేసిన మహాపాపము లన్నియుఁ బటాపంచలగునట్లుగా నధ్వర్యుశ్రేష్ఠులు సాన్నాయ్యమును వేల్చుచుండఁగా నగ్నిహోత్రుఁ డాస్వాదించుచున్నాఁడని భావము.

అగ్నిని బ్రజ్వలింపఁ జేయుటకై పఠించు 'ప్రవోవాజా' మొదలగు మంత్రములకు సామిధేనీమంత్రము లనిపేరు. ఇచట సామిధేనీశబ్దముచే యాజ్యాపురోనువాక్యాది మంత్రములను గూడ గ్రహింపవలయును. "ఐన్ద్రం దధ్య మమావాస్యాయా మైన్ద్రమ్ పయో౽ మావాస్యాయామ్" అమావాస్యనాఁడు దధి [పెరుగు] తో నింద్రుని గూర్చి హోమము చేయవలయును. అమావాస్యనాఁడు పయస్సు [పాల]తో నింద్రుని గూర్చి హోమము చేయవలయునను వాక్యములచే విధింపఁబడిన దధిపయస్సులకు 'సాన్నాయ్య' మనిపేరు. ఈకావ్యమున ముందు చంద్రాస్తమయము వర్ణించి పిదపఁ బ్రభాతకాలమును వర్ణించుటచే నమావాస్య కాదనుట స్పష్టము, అమావాస్యనాఁడు విధింపఁబడిన సాన్నాయ్య హోమము శుక్లపక్షములోఁ జేయఁబడినట్లు చెప్పుట శాస్త్రవిరుద్ధము. కాన నిచట మాఘకవిచే సాన్నాయ్యశబ్దము సామాన్య హవిర్మాత్రపరముగాఁ బ్రయోగింపబడిన దని గ్రహింపవలెను. శబ్దకౌస్తుభమునందు 'అపాయ్య, స్నానాయ్య, నికాయ్య, ధాయ్యమాన, హవిర్నివాస, సామిధేనీషు'. 3-1-26 సూత్రవ్యాఖ్యానములో సాన్నాయ్య శబ్దమును యథాశ్రుతగ్రాహియగు మాఘుఁడు హవిర్మాత్రమునఁ బ్రయోగించెను. ఇచట మాత్రము దధిపయోవిషయక మెందు వలనఁ గాదని ప్రశ్నింపరాదు. చంద్రాస్తమయ వర్ణనపూర్వకముగా సూర్యోదయమును వర్ణించుచు నందుఁ బఠించుటచేఁ గృష్ణప్రతిపద్విషయ మగుటచే నీదధిపయోయోగ మచట సంభవింపదు. హవిర్విశేషవాచకమగు సాన్నాయ్య శబ్దము సామాన్యహోమపరముగాఁ గాని, విశేషాంతరముగాఁ గాని బోధ్య" మని భట్టోజీదీక్షితులు గూడఁ జెప్పినారు. అగ్నిహోత్రమున కొక్కఁడే ఋత్విజుఁడైనను బ్రతిగృహమునందు నందఱును నగ్నిహోత్రములు చేయుచుండుటచే నిచట నధ్వర్యు లని బహువచనము వాడఁబడినది.

శబ్దితా మనపశబ్ద ముచ్చకై ర్వాక్యలక్షణవిదో౽ నువాక్యయా
యాజ్యయా యజనకర్మిణో౽ త్యజన్ ద్రవ్యజాత మపదిశ్య దేవతామ్.

తే. యాజ్ఞికులు ... ... ... అ. మా. (14-20)

మీమాంసాశాస్త్రజ్ఞులై యజ్ఞక్రియలను జేయించు నచటి ఋత్విజులపశబ్దములను వీడి యనువాక్యామంత్రములతో నుచ్చైస్స్వరమున దేవతల నుద్దేశించి యాజ్యామంత్రములతో ద్రవ్యజాతము నగ్ని యందు హోమము చేసిరని భావము.

"పురో౽నువాక్య మనూచ్యయా యాజ్యయా జుహోతి" యను శ్రుతిచే ననువాక్యామంత్రములతో దేవతల నాహ్వానింపవలయును. దేవతల నాహ్వానించు ఋఙ్మంత్రమున 'కనువాక్య' యనిపేరు. 'ప్రశాస్త' యీ యనువాక్యలను బఠింపవలయును. అతఁడు లేనిచో 'హోత' యీ యనువాక్యలను బఠింపవలయును. 'ఉచ్చై ర్ఋచా క్రియతే' యను విధివలన ఋఙ్మంత్రము లుచ్చైస్స్వరమునఁ బఠింపఁబడినట్లు చెప్పఁబడినది. పశుపురోడా

శాదిహవిస్సమూహము ద్రవ్యజాతము. ఇంద్రాదిదేవతల నుద్దేశించి యీ హవిస్సులను వేల్చు నపుడు హోతపఠింపవలసిన యజ్ఞాంగ సాధనమగు ఋఙ్మంత్రమునకు 'యాజ్య' యని పేరు. "యాజ్యయాజుహోతి" యను శ్రుతివలన యాజ్యచే హోమము లాచరించినట్లు చెప్పఁబడినది. "దేవతోద్దేశేన ద్రవ్యత్యాగో యాగః" దేవతల నుద్దేశించి చేయు ద్రవ్యత్యాగమే యాగమని మీమాంసాసిద్ధాంత మగుటచే నిచట దేవతల నుద్దేశించి ద్రవ్యజాతము హోమము చేయఁబడి నట్లు చెప్పఁబడినది. మైత్రావరుణుఁడు దేవతల నాహ్వానించు ననువాక్యలను బఠింపఁగా హోత యాదేవతల నుద్దేశించి యాజ్యలను బఠింపఁగా నధ్వర్యుఁడు సమకాలమున వషట్కార ముతో సోమాది హవిస్సమూహము నగ్నియందు వదలి హోమమొనర్చె నని భావము.

బద్ధదర్భమయకాఞ్చిదామయా వీక్షితాని యజమానజాయయా
శుష్మణి ప్రణయనాదిసంస్కృతే తై ర్హవీంషి జుహవామ్బభూవిరే.

తే. దర్భమయకాంచిదామంబు ... ... ... ఆ. మా. (14-22)

యజమానుని భార్య యగు సోమిదమ్మ దర్భలతోఁ జేయఁబడిన యొడ్డాణమును ధరించి చూచుచుండఁగాఁ బ్రణయనాదులచేఁ సంస్కరింపఁబడిన యగ్నియందు హవిస్సులను ఋత్విజులు హోమముచేసి రనిభావము.

"అశాసానా సౌమనస మిత్యుత్తరేణ గార్హపత్య మూర్ధ్వజ్ఞు మాసీనామ్ పత్నీ సన్నహ్య తిష్ఠన్తీం వా వాచయతీ త్యేకే మౌఞ్జేన దామ్నాన్యతరతః పాశేన యోక్త్రేణ చ". గొంతు గూర్చొనియున్న సోమిదమ్మ కాగ్నీధ్రుఁడు దర్భల యొడ్డాణము కట్టి యామెచే మంత్రములు పఠింపఁ జేయవలయునని యాపస్తంబమహర్షులు చెప్పుటచే 'బద్ధదర్భమయకాంచిదామ' యని వర్ణింపఁబడినది. 'పత్న్యవేక్షితే' యను మంత్రములో నాజ్యమునకుఁ బత్న్యవేక్షణ సంస్కారము విధింపఁబడుటచే నిచట సోమిదమ్మ చూచుచుండఁగా హవిస్సులు వేల్వఁబడినట్లు వర్ణితము. ప్రణయన మనఁగా గార్హపత్యాగ్నిని మంత్రములతో నాహవనీయస్థానమునం దుంచుట. ఆదిశబ్దముచేఁ బరిస్తరణము, సమిదాధానము, సమ్మార్జనము మొదలగు సంస్కారములను గూడ గ్రహింపవలయును. ఇచట యజమానుఁడు ధర్మరాజు. సోమిదమ్మ ద్రౌపది.

శ్లో. స్పర్శ ముష్ణ ముచితం దధచ్ఛిఖీ యద్దదాహ హవి రద్భుతం న తత్
గన్ధతోఽపి హుతహవ్యసమ్భవా ద్దేహినా మదహ దోఘ మంహసామ్.

ఉ. అంటిన వెచ్చనై ... ... ... ఆ. మా. (14-27)

స్వాభావికములగు స్పర్శోష్ణములు ధరించు నాయగ్నిహోత్రుఁడు నెయ్యి, పాలు మొదలగు హోమద్రవ్యములను భస్మముచేయుట విచిత్రము గాదు. మఱేమన హోమగంధమును వాసన చూచినవారి మహాపాపములను గూడ భస్మము చేసె ననునది విచిత్ర మని భావము.

యాగమందలి హోమగంధము నాఘ్రాణించిన వారి పాపములు నశించును. మహాభారతము నందాశ్వమేధపర్వమున "శ్లో. తం వపాధూమగన్ధం తు, ధర్మరాజః సహానుజైః ఉపాజిఘ్రు ద్యథాశాస్త్రం సర్వపాపాపహం తదా" అశ్వమేధయాగ మొనర్చి సర్వపాపములు పోఁగొట్టున దగుటచే వపాధూమగంధమును ధర్మరాజు తమ్ములతోఁ గూడి యాఘ్రాణించెనని వ్యాస మహర్షులు కూడవర్ణించిరి.

వేదాంత దర్శన పరిచయము :

శ్లో. ఉదీర్ణరాగప్రతిరోధకం జనై రభీక్ష్ణ మక్షుణ్ణతయాతిదుర్గమమ్
ఉపేయుషా మోక్షపథమ్ మనస్వినః స్త్వమగ్రభూమి ర్నిరపాయసంశ్రయా॥

శా. కామాద్యుద్ధతచోరరోధన ... ... ... ఆ. మా. (1-52)

చోరాబాధలతోఁ గూడిన దుర్గమ మగు నరణ్యమునందున్న బాటసారి కషాయ రహిత మగు స్థానమువలె సంసారవిషయకములగు రాగాదిప్రతిబంధకము లతోఁ గూడి చేఁపటపు దుర్గమ మగు మోక్షమార్గమును బ్రవేశించిన పరిశుద్ధమనస్కునకుఁ బునరావృత్తి రహితమగు గమ్యస్థానము నీవే యని నారదకృత శ్రీకృష్ణ స్తవము. శ్రీకృష్ణుఁడే మోక్షస్థానమనియుఁ నతనిఁ జేరినవానికిఁ బునరావృత్తి లేదనియు భావము.

"తమేవ విదిత్వాఽతిమృత్యు మేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ" (శ్వేతాశ్వతరోపనిషత్తు) మోక్షమును గోరువాఁడు ప్రత్యగభిన్న పరబ్రహ్మమును దనస్వరూపముగా నెఱిఁగి మృత్యువును దాఁటును. స్వస్వరూపప్రాప్తికి జ్ఞానమొక్కటి తప్ప వేఱగు మార్గములేదు. పరబ్రహ్మప్రాప్తియే మోక్షము. "న స పునరావర్తతే" అట్టి బ్రహ్మైక్యము నొందిన వాఁడు తిరిగి సంసారబాధలందుఁ జిక్కుకొనఁడని యుపనిషత్తులు చెప్పుచున్నవి.

ధ్యేయ మేక మపథే స్థితం ధియః స్తుత్య ముత్తమ మతీతవాక్పథమ్
ఆమనన్తి యముపాస్య మాదరా ద్దూరవర్తిన మతీవ యోగినః. (14-60)

తే. ధ్యేయుఁడే కాని కుజ్ఞాని దృష్టి పడఁడు ...... ఆ. మా. (14-60)

ఇది భీష్మకృత శ్రీకృష్ణస్తవము. అద్వితీయుడు, సర్వోత్తముఁడు నగు శ్రీకృష్ణుని ధ్యానింపఁ దగినవాఁడనియు, బుద్ధికందనివాఁడనియు, స్తోత్రము చేయఁదగినవాఁడనియు వాక్కుల కందని వాఁడనియును పాసింపఁ దగినవాఁడనియు, మిక్కిలి దూరముగా నుండు వాఁడనియు, నారదాదియోగులు చెప్పుచున్నారని భావము.

'ఏకమేవాద్వితీయమ్ బ్రహ్మ' 'నేహ నానాస్తి కిఞ్చన' అద్వితీయమగు బ్రహ్మమొక్కటియే సత్యమైనది. నానాత్మకముగా బ్రతిభాసించునదంతయు మిథ్యయని శ్రుతి చెప్పుట చే నొక్కఁడేయనిచెప్పబడినది.' ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో, మన్తవ్యోనిదిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మనో వా అరే దర్శనేన, శ్రవణేన, మత్యా విజ్ఞానేనేదగ్ం సర్వంవిదితమ్. మైత్రేయీ యీయాత్మమును దర్శింపవలయును. గురువేదమూలకముగా వినవలయును' మనన మొనర్పవలయును. దర్శనముచే, శ్రవణముచే మననముచే, ధ్యానముచే నీయాత్మము తెలియఁబడినచో సర్వమూ తెలియఁబడు నని యాజ్ఞవల్క్యు లుపదేశించినట్లు బృహదారణ్యకము. 'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ ఆనన్దమ్ బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన' ఏయానందస్వరూపమగు పరబ్రహ్మమునుండి వాక్కులు మనస్సుతోఁగలిసి పొందలేక వెనుకకు మఱలుచున్నవో యట్టి బ్రహ్మము యొక్క యానందమును, బొందుచుఁ బండితుఁ డెవ్వడును భయము నొందఁడని తైత్తిరీయము.

భక్తిమన్త ఇహ భక్తవత్సలే సన్తతస్మరణరీణకల్మషాః
యాన్తి నిర్వహణ మస్య సంసృతిక్లేశనాటక విడమ్బనావిధేః (14-63)

చ. అవిరము భక్తవత్సలుని ... ... ఆ. మా. (14-63)

భక్తప్రియుఁడగు నీ హరియందు, భక్తిగల జనులెల్లప్పుడు నీతని స్మరించుచు క్షీణపాపులై క్లేశరూపకమగు సంసారనాటకమును ముగించి ముక్తులగుచున్నా రని భావము.

సూ. 'అథాతో భక్తిజిజ్ఞాసా' 'సా పరానురక్తి రీశ్వరే' ఈశ్వరునందుఁగల్గెడు పరానురాగమే భక్తియని శాండిల్యమహర్షుల భక్తిదర్శనము.

శ్లో. యోన హృష్యతి నద్వేష్టి న శోచతి న కాంక్షతి శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యః స మే ప్రియః (12-17) ఇష్టప్రాప్తివలన సంతసింపని వాఁడు, ననిష్టప్రాప్తిని ద్వేషింపనివాఁడు, నిష్టవస్తువియోగమున శోకింపనివాఁడు, ప్రాపింపని వస్తువును గోరని వాఁడు. భక్తిగలవాఁడు నాకుఁ బ్రియుఁడు 'మద్భక్తో యాన్తి మామపి' నాభక్తులు నన్నే చేరుదు రని గీతాచార్యుల వచనము.

అదితా మజననాయ దేహినా మన్తతాత్మా దధతేఽ నపాయినే
బిభ్రతే భువమ ధః సదాధ చబ్రహ్మణోఽప్యుపరి తిష్ఠతే నమః (14-65).
తా ననాది ... ... ఉ. మా. (14-65)

దేహులజన్మనాశములకుఁ గారణమైనవాఁడును, జన్మరహితుఁడును మూఁడు కాలము లందు నపరిచ్ఛిన్నస్వరూపుఁడును, భూమినిధరించువాఁడును, బ్రహ్మలోకమునకుఁ బైఁగా నుండువాఁడును నగు శ్రీకృష్ణునకు నమస్కారమని భీష్మస్తవము.

'జన్మాద్యస్యయతః' యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి.' దేనినుండి యీభూతములు జనించు చున్నవో పుట్టిన భూతములు దేనివలన జీవించుచున్నవో ప్రళయకాలమున దేనితోఁ దాదాత్మ్యమును బొందుచున్నవో యది బ్రహ్మమని బ్రహ్మసూత్ర తైత్తిరీయోపనిషత్తులందు వర్ణితము.

రహితం కలాభి రఖిలాభి రకృత రసభావసంవిదమ్
క్షేత్రవిదమపదిశన్తి జనాః పురబాహ్యమేన మగతం విదగ్ధతామ్ (15-3)
సీ. రసభావముల ... .... ఆ. మా. (15-39)

ఇది నిందాస్తుతులు వచ్చునట్లు శ్రీకృష్ణుని శిశుపాలుఁడు పల్కిన పల్కులు. ఈతఁడు కర్షకుఁడు, పురబాహ్యుడు, కళాహీనుఁడు, రసాదిపాండిత్యహీనుఁడు నని జనులు చెప్పుచు న్నారని నింద. ఇతఁడుక్షేత్రజ్ఞుఁడు, నిష్కలుఁడు పదార్థానురాగము లేని చిద్రూపుఁడు దేహముకంటె భిన్నుఁడు, నదాహ్యుఁడు నగు నాత్మస్వరూపుఁడని స్తుతిపక్షము.

"నైనం ఛిన్దన్తి శస్త్రాణి, నైనం దహతి పావకః నచైనం క్లేదయన్త్యాపో, న శోషయతి మారుతః" (2-23) ఆత్మము నాయుధములు ఖండింపలేవు, నిప్పుదహింపలేదు, నీరు తడుపలేదు. గాలి యెండింపలేదు.

"క్షేత్రజ్ఞం చాపి మావిద్ధి సర్వక్షేత్రేషు భారత" సర్వక్షేత్రములందున్న క్షేత్రజ్ఞుఁడ నేనే యని శ్రీకృష్ణుని గీతావచనములు.

అభిహన్యతే యదభిహన్తి పరిభవతి యచ్చ తప్యతే
నాస్య భవతి వచనీయమిదం చపలాత్మికా ప్రకృతి రేవ హీదృశీ. (15-14)
తే. కొట్టఁబడుఁ ... ... ఆ. మా. (15-43)

ఈతఁడితరులచే దాడింపఁబడుచు వారినిజంపును. ఇతరులచే బాధలొందును. వారిని బాధించును. ఈవిషయమింతఁగాఁ జెప్పనక్కఱలేదు. ఈతని ప్రకృతియే చపలమైనది యని నింద. ఈపరమాత్మ యితరులచే బాధలొందును. వారినిబాధించును మొదలగునవి చెప్పరాదు. మారణాదులు తమోగుణజన్యములు. ఈ పరమపురుషుఁడు నిర్గుణుఁడు. ఈతనిబుద్ధి యనేక విధములుకాఁజాల దని స్తుతి.

యఏనం వేత్తి హన్తారం యశ్చైనమ్ మన్యతే హతమ్

ఉభౌ తౌ న విజానీతోనాయం హన్తి నహన్యతే. [2-19]

ఈదేహిని జంపువానిగను జచ్చువానిగను నెవరు తలంతురో వారిద్దఱు నవివేకులగుటచే నాత్మస్వరూపము నెఱుఁగరు. అవిక్రియమగు నీయాత్మము దేనినిజంపదు. దేనిచేతను జంపఁబడదని భగవద్గీత. ఈకావ్యమున నారదస్తవము, భీష్మస్తవము, శిశుపాలవాక్యములు, మొదలగుచోట్ల వేదాంతశాస్త్రము ప్రచురముగాఁ బ్రతిపాదింపఁబడినది. గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించుచున్నాను.

మాఘకవి సకలశాస్త్రములందు నెంతటి పండితుఁడో యంతఁగాఁ బ్రకృతిని నిశితపరీక్ష యొనర్చి యద్భుతకల్పన లొనర్పఁ గల చతురుఁడు.

శ్లో. చిత్రంసయా కృత్రిమపత్త్రిపంక్తేః కపోతపాలీషు నికేతనానామ్

మార్జార మప్యాయతనిశ్చలాఙ్గంయస్యాం జనః కృత్రిమమేవ మేనే (3-51)

ఉ. తీవిగ నింటిముంగిట ... ... ... ఆ. మా. (3-51)

ఇండ్లయందు దారువులపైఁ జెక్కఁబడిన కృత్రిమపక్షులను గాంచి, వానిని బట్టుటకై కదలకుండినపిల్లిని జూచిజనులు కృత్రిమమార్జాలమని తలంచిరి. ఇచ్చట, కృత్రిమపక్షులను గాంచి నిజమగు పక్షులని పిల్లి భ్రాంతిపడినది. కదలకుండిన నిజమగు పిల్లిని గాంచి కృత్రిమమైనదని జనులు భ్రాంతి నొందిరి ఎలుకలనుబట్టుటకుఁ బొంచియుండిన పిల్లిని గాంచినచో మనకుఁ గూడ నీ దృశ్యము గోచరమగును.

శ్లో. నవా నధోఽధో బృహతః పయోధరాన్, సమూఢకర్పూరపరాగపాణ్డురమ్

క్షణం క్షణోత్క్షిప్తగజేన్ద్రకృత్తినా, స్ఫుటోపమమ్ భూతిసతేన శమ్భునా (1-4)

ఉ. చారుతుషారహీర ... ... ... ఆ. మా. (1-4)

నల్లని పెద్దమేఘముల క్రిందనుండి పుంజీకృతమగు కర్పూరముతో సమమగు తెల్లని వన్నెగల యా నారదుఁడు భుజముపై నల్లని చర్మమును ధరించి విభూతివలన మిక్కిలి తెల్లని దేహముకలవాఁడై తాండవమాడు శివునితో స్ఫుటముగా సాదృశ్యము నొందె నని భావము. ఇట్టి కవి కాళిదాసుతో సమముగా నుపమాలంకారమును వాడఁగలఁడు.

శ్లో. స్పృశన్తి శరవత్తీక్ష్ణా స్తోకమన్తర్విశన్తి చ

బహుస్పృశాఽపి స్థూలేన స్థీయతే బహిరశ్మవత్ (2-78)

తే. బుద్ధిసూక్ష్మప్రకాండులు ... ... ... ఆ. మా. (2-70)

నిశితబుద్ధి గల ప్రాజ్ఞులు బాణమువలె స్వల్పముగా స్పృశించి కార్యాంతరమున నాటిగాఁ జొరఁగలరు. స్థూలబుద్ధు లెక్కువస్థానమునందు స్పర్శగలిగి బైటనుండు ఱాయివలెఁ గార్యాకార్యములందు బహిస్స్థితినే కల్గియుందురు. మూఢు అల్పకార్యమునకుఁ గూడ

బహుప్రయాసము నొందుటచే వారికార్యము కొండత్రవ్వి యెలుకను బట్టినట్లు పరిహాసాస్పదముగా నుండు ననిభావము.

శ్లో. తీక్ష్ణా నారుంతుదా బుద్ధిః, కర్మ శాన్తం ప్రతాపవత్
నోపతాపి మనః సోష్మ వాగేకా వాగ్మినః స్మృతః (2-109)

తే. ఉత్తమునకు వాచ్య ... ... అ.మా. (2-100)

సత్పురుషులబుద్ధి సునిశితముగా నుండును. కాని మర్మపీడాకరముగాదు. వారు చేయు కార్యములు ప్రతాపముతోఁ గూడి యుండును. కానిశాంతముగా నుండును. చిత్తము కులశీలాద్యభిమానోష్ణమై యుండును. కాని యితరులను సంతప్తులఁ జేయరు. సత్పురుషుల మాటలు, చేఁతలు, నొక్కవిధముగా నుండునని భావము. ఇట్లీతఁడు భారవితో సమముగా నర్థగౌరవములగు వచనములు చెప్పఁగలఁడు.

శ్లో. వదనసౌరభలోభపరిభ్రమ ద్భ్రమరసంభ్రమ సమ్భృతశోభయా
చలితయా విదధే కలమేఖలాకలకలోఽలకలోలదృశాఽన్యయా. (6-14)
మధురయా మధుబోధితమాధవీమధుసమృద్ధిసమేధితమేధయా
మధుకరాఙ్గనయా ముహురున్మదధ్వనిభృతా నిభృతాక్షరముజ్జగే. (6-20)

ఇట్లు పదలాలిత్యమునం దీతఁడు దండ్యాచార్యులతోఁ దులతూఁగఁగలఁడు. కావుననే 'ఉపమా కాళిదాసస్య, భారవేరర్థగౌరవమ్. దణ్డినః పదలాలిత్యమ్, మాఘే సన్తి త్రయో గుణాః.' అనుపొగడ్త వడసినాఁడు. దీనినే.

చ."వివిధపదానుయోజనఁ బ్రవీణుఁడు దండి; పమంచి తార్థగౌరవమునఁ బెద్ద భారవి; ధురంధరుఁ డయ్యుపమాకవిత్వసత్త్వవణతఁ గాళిదాసు; త్రివిధంబున మాఘుఁడు మేటి నాఁగనిట్లవనిఁ బొగడ్త కెక్కిన మహాకవులన్ బ్రణుతింతు నాద్యులన్"

అనిభోజరాజీయములో ననంతామాత్యుఁ డాంధ్రీకరించినాఁడు. ఇట్లుమాఘుఁడు "వైయాకరణ శిరోమణి" "సాహిత్యసామ్రాజ్యచక్రవర్తి" యగుటచే నిటు వైయాకరణులు, నటాలంకారికులు నీతని కావ్యమును వారిగ్రంథములం దుదాహరించి మిక్కిలిగౌరవము చూపినారు. కావ్యాలంకారసూత్రము: ధ్వన్యాలోకలోచనములు, వ్యక్తివివేకము, వక్రోక్తిజీవితము, కావ్యప్రకాశిక, కువలయానందము మొదలగు నలంకారగ్రంథములందు; పదమంజరి, ధాతువృత్తి, భాషావృత్తి, సిద్ధాంతకౌముది, మనోరమ, శబ్దేందుశేఖరము. కృదంతరూపములు మొదలగు వ్యాకరణగ్రంథములందు నీతని శ్లోకములు ప్రమాణముగా స్వీకరింపఁబడినవి. మాఘకవి రచించినదీ శిశుపాలవధకావ్యము దక్కఁ దక్కిన కృతు లేమియుఁ గానవచ్చుట లేదు.

శ్లో. శీలం శైలతటాత్పతత్వభిజనః సన్దహ్యతాం వహ్నినా
మాశౌర్యం జగతి శ్రితస్య విఫలక్లేశస్య నామాప్యహమ్
శౌర్యే వైరిణి వజ్రమాశు నిపతత్వర్థోఽస్తు మే సర్వదా
యేనైకేన వినా గుణాస్తృణవసుప్రాయా స్సమస్తా అమీ

శ్లో. నారీనితమ్బఫలకే ప్రతిబధ్యమానా హంసీవ హేమరసనా మధురం రరాస
తన్మోచనార్థమివ నూపురరాజహంసాశ్చక్రన్దు రార్తముఖరం చరణావలగ్నాః

అను శ్లోకములు సుభాషితావలి యందును

బుభుక్షితై ర్వ్యాకరణం న భుజ్యతే, పిపాసితైః కావ్యరసం న పీయతే
న విద్యయా కేనచిదుద్ధృతం కులం హిరణ్యమేవార్జయ నిష్ఫలాః కలాః
అను శ్లోక మౌచిత్య విచారచర్చ యందు
స జయతి గిరికన్యామిశ్రితార్ధ్యమూర్తిః త్రిపురయువతిలీలా నిర్మమభ్రంశహేతుః
ఉపచయవతి యస్య ప్రోన్నతైః కస్తనత్వా దుపరి భుజగహారః స్థానవైషమ్యమేతి

అను శ్లోకము సదుక్తికర్ణామృతమునందును, మాఘునివిగాను దాహరింపఁబడుటచే మాఘకవి నేతొకకృతిని గూడ రచించిన ట్లవమానించుటకు వీలున్నది. లేదా యవి మాఘుని చాటువులు గావచ్చును. మాఘప్రయోగముల లోని కొన్నిదోషములను మల్లినాథుఁడు, మల్లినాథవ్యాఖ్యలోని కొన్నిదోషములను శ్రీదుర్గాప్రసాదద్వివేదులును జూపిరి. వాని చర్చ కిది తావు గాదు. మాఘకవి వచోమాహాత్మ్యము నెంత పొగడినను దనివి దీరదు గాన నీవిషయము నిటులుంచి మహాదేవకవి యాంధ్రమాఘములోని విశేషములను గొంచెము తెలిసికొందము.

## ఆంధ్రమాఘ విశిష్టత

వ్యాకరణరహస్యప్రయోగ బాహుళ్యము, శబ్దాలంకారప్రాచుర్యము నర్థగాంభీర్యము గలిగి సర్వశాస్త్రసంప్రదాయమయమగు మాఘమువంటి ప్రౌఢకావ్యమును దెనిఁగించుటకు పనుము కట్టిన మహాదేవకవి గారి మహోద్యమమే వారి పాండిత్యమును గవితాసామర్థ్యమును వేనోళ్ళ వెల్లడించుచున్నది. పింగళిసూరన్నగారి కళాపూర్ణోదయము, పురాణము పిచ్చయశాస్త్రిగారి విజయాశ్వచరిత్రము మొదలగు రెండు, మూఁడు కావ్యములు తప్పఁ దక్కిన యాంధ్రకృతులన్నియు సంస్కృత గ్రంథముల కనువాదములే. కవిత్రయము వారు, భాస్కరుఁడు, పోతనామాత్యుఁడు వంటి మహాకవు లితిహాసపురాణములను దెనిఁగించుచు రాఁగా శ్రీనాథకవిసార్వభౌముఁడు కవితార్కికసార్వభౌముఁడగు శ్రీహర్షుఁడు రచించిన నైషధకావ్యము నాంధ్రీకరించి మహాకావ్యానువాదమునఁ దక్కిన కవులకు మార్గదర్శకుఁడయ్యెను. శ్రీనాథుఁడు మూలమునందలి పట్టులను గొన్నిచోట్లఁ గుదించి యాంధ్రభాషామగుణ్యముగాఁ జంపూపద్ధతిలోఁ దన యనువాదమును సాఁగించెను. మహాదేవకవి తనకావ్యమును నిర్వచనముగను, యథామాతృకముగను రచించుట విశేషము. నన్నయభట్టారకుఁడు మొదలు నేఁటి పఱకుఁ గల సాంప్రదాయికులగు నాంధ్రకవులు తమ కృతు లందిష్టదేవతా ప్రార్థనము షష్ఠ్యంతములు, నాశ్వాసాంతపద్యములు గూర్చుచునే వచ్చిరి. సంస్కృతమునం దీనియమ మున్నట్లుగానరాదు. మహాదేవుఁడుగా రాంధ్రసంప్రదాయము వీడి సంస్కృతకవుల్లివలె

ఉ. "శ్రీజినదేవు నానతి .... .... ఘూర్జరదేశ మిమ్మహిన్"

అను పద్యము మొదలుగాఁ గల మాఘకవి చరిత్రముతోఁ గావ్యము నారంభించిరి. 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్' ఆశీర్వాదముతోఁ గాని యిష్టదేవతా నమస్కారముతోఁగాని, వస్తునిర్దేశముతోఁగాని ప్రబంధము నారంభింపవలయు నను కాలంకారికు. వచనానుసారముగ మాఘకవి నివాసస్థాన మగు ఘూర్జర దేశమను వస్తువు నిర్దేశింపఁబడినది. మాఘచరిత్రమును బొందుపఱచిన మేరు

తుంగాచార్యుఁడు, ప్రభాచంద్రుఁడు జైనకవులగుటచేతను, ఘూర్జరదేశమునందు జైనమత మున కెక్కువ వ్యాప్తి యుండుటచేతను, జినుని నానతి శిరసావహించునది, యతని వాక్యామృతమును గ్రోలునది యిహపరములను హస్తమణిగా నొనర్చునది ఘూర్జరదేశ మని చెప్పఁబడినది. వైదికమార్గావలంబి యైనను మాఘకవి తనకావ్యమున బౌద్ధాదిమత మును బరిచయ మొనర్చినట్లే, మహాదేవకవి శంకరాద్వైతమతావలంబి యైనను దన కావ్యమును శ్రీజినదేవుని ప్రస్తావనతోఁ బ్రారంభించి పరమతసహనమును వెల్లడించెను మూలశ్లోకముల యందలి సొగసు చెడకుండ భావములు ప్రస్ఫుట మగునట్లు వీరి యను వాద మొప్పుచున్నది.

సటాచ్ఛటాభిన్నఘనేన బిభ్రతా, నృసింహః సైంహీ మతనుం తనుం త్వయా.
స ముగ్ధకాన్తాస్తనసఙ్గభఙ్గురై రురోవిదారమ్ ప్రతిచస్కరే నఖైః

శా. ఆకాశస్థపయోదభేదనచణంబౌ కేసరశ్రేణి గ్రీ
వాక్రమస్థలి జాలువాఱ హరిరూపం బర్థమందుస్ మను
ష్యాకారం బఱమేనఁ గైకొని నృసింహా ముగ్ధకాంతాకుచో
త్సేకక్రీడల మెత్తనైన నఖపంక్తిన్ జీల్చవే దైత్యునిన్. (1-47)

హిరణ్యకశిపుని జీల్చిన నృసింహావతారమును శ్రీకృష్ణునకు జ్ఞాపకము చేయుచు నారదుఁ డొనర్చిన స్తవమిది. కొన్నిచోట్ల మూలము నందలి భావము తేటతెల్ల మగు నట్లు పెంచి వ్రాయఁబడినది.

పరస్యమర్మా .... ...ఫణినామ్భుజఙ్గతా

సీ. పరమర్మభేదనపాటవాంచితకళా, విభవపారీణత విడిచిపెట్టి,
లోకప్రసిద్ధదుర్లోలద్విజిహ్వతా, యోగ్యదుర్వర్తన ముజ్జగించి,
ఋజుమార్గగామిసద్ద్విజులకనిష్టమౌ, వక్రస్వభావ మవ్వలకుద్రోఁచి,
బహుళమహాపాపభరహేతుకంబైన, స్వీయభుజంగతాచేష్ట మాని,
తే. యాత్మచక్షుఃశ్రవస్త్వంబు నవలఁ ద్రోచి, కర్ణయుగముల ధరియించి కరచరణము
లదర నెమ్మేన వంకర నడక మాని, పాఁపజాతియు నానీచు భక్తిఁ గొలిచె (1-63)

నాగులందఱు భయపడి రావణుని సేవించుట యందముగాఁ దెనిఁగింపఁ బడినవి.

19, 20, ఆశ్వాసములలోని సీసము లన్నియు మూలమును బెంచి వ్రాయఁబడినవి. అనువాదమైనను గొన్ని సొంత పద్యముల వలె నలరారుచున్నవి.

సీ. "కనదుదయాద్రిశృంగప్రాంగణమ్ములం దనురాగ మెసఁగఁ దోఁగాడనేర్చి"....(పుట 159) సూర్యోదయవర్ణనముగల యీ సీసపద్యము చదువునపుడు కాశీఖండములో సూర్యోదయ వర్ణనమునఁ గల శ్రీనాథుని సీసపద్యములు జ్ఞాపకము రాకమానవు. ఇందుఁ బాదముల చివర నంత్యానుప్రాసము గూడఁ గూర్పఁబడినది. ఇట్లే

సీ. 'గెలుపొ? యచ్చరకన్నె వలపొ? గైకొందునంచును మాటలూఱు నాతనికి ముదము .... ... (19-70) అను యుద్ధవర్ణనమునందలి సీసమెంతయు సహజముగా నున్నది.

ఉ. మందబియ్యశ్వరచ్చలుగ మ్రాఁకుల నీడలఁ గూరుచుండి క
ల్లుం దనుపారఁ గ్రోలుచు నెలుంగుల నొత్తిలి పల్కు చట్టిటుల్

చిందులు ద్రొక్కుచుండియును శ్రీహరి యంచు స్వనామకీర్తనల్
గ్రందుగఁ బాడు గ్రామ్యజనకాండముఁ గాంచె ముకుందుఁ డర్మిలిన్ (12-38)

ఈపద్యమునందుఁ గల్లుద్రావి గంతులువైచు గ్రామ్యజనుల వర్ణనము కన్నులకుఁ గట్టినట్లున్నది.

ప్రాజా ఇవాజ్ఞా దరవిన్దనాభే శమ్భోర్జటాజూటతటాదివాపః
ముఖాదివాథ శ్రుతయో విధాతుః పురా న్నిరీయుర్మురజి న్ధ్వజిన్యః

మ. జలజాతోద్భవు మోముఁదమ్ముల నొగిన్ జన్మించు వేదాల మం
జులశీతాంశుకిరీట మస్తకజటాజూటోద్గతాంబూర్ములన్
జలజాక్షాంగకజాతజాతమగు విశ్వప్రాణులం బోలి యా
నలినాక్షోరుచమూతతుల్ వెడలె సన్నాహంబుతో ద్వారకన్ (3-11)

'పరామృశత్కఠినకఠోరకామినీకుచస్థలప్రమృషితచన్దనంవపుః'

వధూజనాత్యున్నత కర్కశస్తనతటోద్ధురమర్దనసంప్రమృష్టచంచన్నవచందనంబయి (17-11) ఇట్లు కొన్నిచోట్ల మూలశ్లోకములలోని సమాసములు తెలుఁగుతోనికి దేఁబడినవి. రూపక విరోధాభాసా ద్యలంకారములే గాక మూలములో శ్లేషాలంకారములు గల శ్లోకములన్నియు సులభముగాఁ దెలుఁగులోనికి వచ్చినవి.

తే. గీ. మొగముపైఁ జంద్రకళగల సొగసు గాంచి
కంటి చూపునఁ గామవిగ్రహము మాపి
విమలసలిలావగాహనవిధిని మెఱసి
యషమూర్తి యష్టమమూర్తి యయ్యె నపుడు. [14-18]

యజ్ఞ మొనర్చు ధర్మజునకు శివునకు శ్లేష. చంద్రునివలె ముఖమునందుఁ గళ గలవాఁడు ధర్మరాజు. చంద్రకళను ధరియించినవాఁడు శివుఁడు. నిశ్చలదృష్టివలనఁ గామక్రోధములు లేనివాఁడు ధర్మరాజు. చూపుచే మన్మథశరీరమును భస్మమొనర్చినవాఁడు శివుఁడు. యజ్ఞదీక్షతోఁ బవిత్రజలములందు స్నానమొనర్చినవాఁడు ధర్మజుఁడు. గంగాజలావగాహనమున మెఱయువాఁడు శివుఁడు. ఇట్లే తక్కినచోట్ల గ్రహింపవలయును. ఇట్టి యర్థశ్లేషలు పనువాదములోనికిఁ దెచ్చుట సులభమగును గాని శబ్దశ్లేషలు గల శ్లోకములను దెనిఁగించుట కష్టసాధ్యము. శ్లో. "ఊతనోదధివిలోడనమ్ ప్రతి త్వద్వినాథ వయ ముత్సహామహే" అను శ్లోకమునందు దేవతలు గొల్లలు హరిని స్తుతించుట వర్ణింపఁబడినది. తండ్రీ! నీవు లేక సముద్రమును [న + ఉదధి] మథించుటకు మేము సమర్థులము గామని దేవతల పక్షము. నీవు లేక పెరుగును [నో + దధి] ద్రచ్చుటకు మేముత్సహింప మని గొల్లల పక్షము. ఇందు 'న + ఉదధివిలోడనమ్' అనియు, 'నో + దధివిలోడనమ్' అనియు శబ్దశ్లేష వాడఁబడినది. "లేదు, కాదు" అను నర్థము నిచ్చు "నో, న" యను నవ్యయము లాంధ్రమలో లేవు. ఈశబ్దశ్లేషము నెంత చక్కఁగాఁ దెనిఁగించిరో చూతము.

తే. గీ. కనవహోదధిఁ ద్రచ్చ నీకంటె మమ్ము నరయు వానిని...... [14-83]

'కనము + అహో + దధి' అని గొల్లలపక్షము. అహో = ఆశ్చర్యము; దధిన్ = పెరుగును; ద్రచ్చి నీకంటె మమ్మునరయు వానినిగనమని గొల్లలు, కనన్ = చూడఁగా;

మహా + ఉదధి = గొప్పదగు పాల సముద్రమును ద్రచ్చ నీకంటె మమ్ము నరయు వానిని గన మని దేవతలపక్షము. ఇట్టి పట్టులే కవి సామర్థ్యమును వెల్లడించును. ఇట్లే మూలము నందలి యమకములతోఁ గూడిన శబ్దాలంకారములను దెనుఁగునఁ గూర్చెదరు.

రాజీవ రాజీ వశలోలభృఙ్గమ్, ముష్ణన్త ముష్ణం తతిభి స్తరూణామ్
కాన్తాలకాన్తా లలనా స్సురాణాం రక్షోభి రక్షోభిత ముద్వహన్తమ్ (4-9)

తే. అచట రాజీవ రాజీ వశాళు లమర నుష్ణ ముష్ణత్తరుచ్ఛాయ లొప్పుమీఱు
మఱియుఁ గాంతాలకాంతలై వఱలు సురల సుదతులకు సోఁకుమూఁకల సోఁకు లేదు 4-9

అచట; రాజీవ = పద్మముల; రాజీ = పంక్తులకు; వశ = అధీనములగు; అళులు = తుమ్మెదలు; అమరన్; ఉష్ణమ్ = ఎండవేఁడిని, ముష్ణత్ = హరించుచున్న; తరుచ్ఛాయలు = చెట్లనీడలు, ఒప్పన్; కాంత = రమ్యములగు, అలకాంతలై = ముంగురులగలవారై, వఱలు : ఒప్పుచున్న, సురలసుదతులకు : దేవతాస్త్రీలకు, సోఁకుమూఁకల: రాక్షసజనముయొక్కసోఁకు = అవేశము, లేదు. రైవతకాద్రియందు విహరించు దేవతాస్త్రీలకు రక్కసుల దాడి లేదనిభావము. మూలములో 'రక్షోభి రక్షోభిత' యను దానికి 'సోఁకు మూఁక'లసోక ని యచ్చతెనుఁగు వాడుట చమత్కారముగా నున్నది.

నవపలాశపలాశవనమ్పురః .... ... (6-2)

తే. నవపలాశ పలాశవనంబు మఱియు స్ఫుటపరాగపరాగ తాంభోరుహంబు
మృదుల తాంత లతాంత సంపదలఁ బొదలు సురభి సురభిని గనులారఁ గాంచెశౌరి 6-2

నవ : క్రొత్తవియగు, పలాశ : ఆకులుగల, పలాశవనంబు : మోదుఁగుచెట్లవనముగలది, స్ఫుట : వికసించినవి, పరాగ : పుప్పొళ్ళచేత, పరాగత : వ్యాప్తములగు, అంభోరుహంబు : పద్మములుగలది, మృదుల: కోమలములైనవి, తాంత : ఎండవుఁగొంచెమువాడినవియగు, లతాంత : చిగుళ్ళయొక్క, సంపదలన్ : శోభచేత, పొదలు: వృద్ధిపొందుచున్న, సురభిన్: సువాసనలుగలది. యగు సురభిన్ : వసంతమును, కనులారఁ గృష్ణుఁడుగాంచెనని భావము.

దధత్యురోజద్వయ ముర్వశీతలమ్భువోగతేవ స్వయ ముర్వశీ తలమ్
విభో ముఖేనాప్రతిమేన కాచన, శ్రియాఽధికా లీమ్పశ్రితిమేనకా చన

తే ఉర్వశీతల కుచముల నొప్పునొకతె యుర్వరఁ జరించు నుర్వశి వుద్ది యయ్యెఁ
దన్ముఖమ్ము తులారహితమ్ము మెఱసె మేనక తదీయసౌందర్యమేన కనద. (9-86)

అశీతలమనఁగా శీతలము గానిది యుష్ణము. మిక్కిలి వేడివి యగు స్తనములు గల యొక యింతి భూమికి దిగిన యుర్వశి వలె నున్నది. సాటిలేని సౌందర్యముతో నొప్పు ముఖముగల యా స్త్రీసౌందర్యము మేనక యను నప్సరసకుఁ గొంచెమైనను లేదని భావము 'అప్రతిమేన కాచన' యని మూలమునందుండ (సౌందర్యము + ఏన) సౌందర్యమేన కనద యని తెలుఁగులోఁ జక్కఁగాఁ గూర్చఁబడినది

వికచకమలగన్ధై రన్ధయన్ భృఙ్గమాలాః సురభితమకరన్దమ్ మన్ద మావాతి వాతః
ప్రమదమదనమాద్యద్యౌవనోద్దామరామారమణరభసఖేదస్వేదవిచ్ఛేదదక్షః

మ. మదనుండున్ మదమున్ ముదంబు వొదివింపన్ యౌవనోద్రిక్తలౌ
ముదితల్ వొందు రతిశ్రమాంబులి శ్రమంబుల్ దిట్టమై నెట్టుచున్

మదభృంగాళి స్ఫుటాబ్జగంధముల నంధంబౌ నటుల్ సేయుచున్
గదిరెన్ మెల్లఁగ గాలి తేనెలకు సౌగంధ్యంబు సంధిల్లఁగన్. (ఆ. మా. 11-19)

పై శ్లోకవ్యాఖ్యలో "శ్లేషః ప్రసాదం సమతా, మాధుర్యం సుకుమారతా అర్థవ్యక్తి రుదాత్తత్వ మోజః కాన్తి సమాధయః॥ ఇత్యాచార్యోక్తదశగుణాః ప్రాయేణాత్రసమ్భవ న్తీతినిపుణై రున్నేయాః" అని మల్లినాథసూరి చెప్పినాఁడు. 'ముదంబు నొదవింపన్ యౌవనో ద్రిక్తలౌ, గాలితేనెలకు సౌగంధ్యంబు సంధిల్లగన్' అను చోట్ల శైథిల్య గాఢత్వముల మిశ్రణముచేఁ బ్రసాదము. 'మదనుండుద్ మదమున్ ముదంబు నొందివింపన్' అను చోట మొదటినుండి చివర వఱకు నొక రీతిగా నుండుటచే సమత. 'ఉద్రిక్త, రతిశ్ర మాంబుల, దిట్టయై నెట్టుచున్' అనుచోట సంయుక్తాక్షరములకు ముందు హ్రస్వాక్షర ముల ప్రాచుర్యముండుటచే నోజస్సు 'శ్రమాంబుల భ్రమంబున్, అనుచోట బిందుపూర్వక సరళాక్షరము లుండుటచే సుకుమారత' మదమందున్ 'మదమున్ ముదమందు నొదవింపన్, గాలితేనెలకు' అనుచోట సంయోగపరహ్రస్వాక్షరములు లేక పదములు విడివిడిగా నుండుటచే మాధుర్యము. స్ఫుటాబ్జ, ఉద్రిక్త' అను పదములందు సంయుక్తాక్షరము లుండుటచే నుదారత. అర్థముస్ఫుటముగా వ్యక్తమగుటచే నర్థవ్యక్తి, ఇట్లు తెలుఁగు పద్యములోఁ గూడ నీగుణములు సంభవించుచున్నవి.

'దెసదెస గల్గు వస్తువుల' (3-76) అను పద్యమునందు వస్తువులను దక్కిన దీవులలో నమ్మి యచటి యమూల్యవస్తువులను గొని యోడలపై వర్తకులు తెచ్చుచున్నారని వర్ణిం పఁబడుటచే మాఘకవి నాఁటికే మన భారతదేశమున కితరద్వీపములతో వర్తకవ్యాపార సంబంధమున్నదని స్పష్టము. "వింతగ వచ్చి రొక్కపతి" (5-7) అను పద్యమును బట్టి యాకాలమున యాత్రలందుఁ గంచరగాడిదల నుపయోగించెడి వారనియు, 'పల్లకి మున్నగాఁ గలుగు' (5-17) అను పద్యమునందు రాణుల మేలిముసుఁగులు వర్ణింపఁబడు టచే మాఘకవి కాలమున ఘరదాపద్ధతి యమలులో నున్నట్లు తెలియుచున్నది. 'కాంతుల కుప్పిపట్టగు' (9-13) అను పద్యమునుబట్టి మాఘకవికాలమున సతీసహగమనము దేశ ములోఁ బ్రచారముగల యాచారముగా నున్నట్లు వ్యక్తము. 'అంతవానికి ... పతిచితన హ్నిలో నటికె సాధ్వి' (మా. చ. 86) అను పద్యమునఁ జెప్పఁబడిన సతీమతల్లి యగు మాఘుని భార్యయే పై విషయమును నిరూపించుచున్నది.

మహాదేవకవి యిట్లు మూలములోని యొక్క శ్లోకమును గూడ విడువకుండ యథా మాతృకముగా నాంధ్రశిశుపాలవధకావ్యమును సంతరించెను, మూలకావ్యమునందుఁ బదు నైదవ సర్గమున 'యదపూపజస్త్వమిహ' (15-14) అను శ్లోకము వఱకుఁ గల 24శ్లోక ములు ప్రక్షిప్తము అని వల్లభదేవుఁడు వ్యాఖ్య వ్రాయలేదు. మల్లినాథుఁడు వ్యాఖ్యానిం చెను. అట్లే 'తను సర్వ ఏవసమవేక్ష్య' అను శ్లోకము మొదలుకొని 'యదువాచ దుష్టమతి రేష' అను శ్లోకము వఱకుఁ గల 34శ్లోకములు ప్రక్షిప్తము అని మల్లినాథుఁడు వ్యాఖ్య వ్రాయలేదు. వల్లభదేవుఁడు వ్యాఖ్యానించెను. మహాదేవుఁడుగారు మల్లినాథుఁడు వ్యాఖ్యా నించిన వానిని యథాతథముగాఁ దెనిఁగించుచు, వల్లభదేవవ్యాఖ్యాతములై నిందాస్తుతుల గల శ్లోకములను విడువలేక 'సీ. గుణమున్న నెవఁడేని ... ...' (5-48) అను పద్యము వఱకుఁ గల పదిపద్యములలో 34శ్లోకముల భావమును గూడ నిమిడ్చినారు.

వ్యాకరణ విశేషములు:—

చ. మును వృషపర్వుఁ డన్నసురముఖ్యునకై మయుఁడన్ సురారి శి
ల్పి నిపుణతన్ రచించుటకు బిందుసరంబున నుండి ... ... (14-50)

అను + అసురముఖ్యుడు = అన్నసురముఖ్యుఁడు. 'లుక్సంశ్లేషౌ నాచి ద్విత్వస్య' అను చింతామణి సూత్రముచే నిది యసాధువైనను సూ. కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి (సంధి-3) అని సూత్రించి "సర్వము న్నతని దివ్యకళామయ మంచు" మొదలగు ప్రయోగముల నుదాహరించి, నన్నయభట్టారకుఁడు "అన్నిష్ట సఖి నూఁది యున్నదాని" అని ప్రయోగించి "లుక్సంశ్లేషౌనాచిద్విత్వస్య" అని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగవైరళ్యసూచనార్థంబని యెఱుంగునది యని ప్రౌఢవ్యాకరణకారులు చెప్పుటచేఁ బైప్రయోగము సాధు వగుచున్నది

బిందుసరంబు:— సూ. సాంతంబుల తుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు. (తత్సమ-80) ఉరము — ఉరస్సు ... ... బహుళగ్రహణంబునం జేసి పయః ప్రభృతుల సకారంబునకు లోపంబు లేదు. పయస్సు, వయస్సు, సరస్సు, అని చిన్నయ సూరిగారు చెప్పుటచే "బిందుసరస్సు" అని యుండవలయును గాని.

ఆ. అట్టి బిందుసరమునందున్న వివిధరత్నోపకరణచయము లొనరఁ గొనియె సభా-1-9

సీ. బిందుసరంబులోఁ గుందనపుందమ్మి పేరులేకుండఁగఁ బెల్లగించి (ప్రభా-1-20

అని నన్నయభట్టారకులు, పింగళిసూరన్నగారు ప్రయోగించుటచే "బిందుసరంబు" ను ప్రయోగము సాధువు.

ఉ. ఈ సభ నచ్యుతార్చనము నేను విధించుట కెవ్వఁ డోర్వలేఁ
డా సభికుండు ... ... (అ. మా. 15-56)

ఇందు సభికుఁ డని ప్రయోగింపఁబడినది. "సభాయా యః" (4-4-105) అను పాణిని సూత్రముచే సభ్యుఁడని యగును. "సభాసద స్సభాస్తారా స్సభ్యాస్సామాజికాశ్చ తే" "సభికాద్యూతకారకాః" అని యమరము. "సభ్యా స్సామాజికా శ్చ సభికా ద్యూతకారకాః" వైజయంతి. ఈ యమరసింహ, యాదవప్రకాశుల వచనానుసారము సభ్యుఁ డనఁగా సభలో నుండువాడనియు, సభికుఁ డనఁగా జూదమాడించు వాఁడనియుఁ దెలియుచున్నది. మన తెలుగు కవులు మాత్రము సభ యందున్నవాఁడను నర్థమునఁ గూడ సభికశబ్దమును బ్రయోగించుచున్నారు.

ఉ. ఈ సభికుల్ కనుంగొనఁగ నిట్లయితిన్ వగ నాకు వింతయే (విరా. 2-176)

చ. అని పలుకంగ నా సభికు లప్పు డెఱింగి ... .... (మిత్రభే-562)

అని తిక్కనగారు, దూబగుంట నారాయణకవి ప్రయోగించుటచే నిందుఁగూడ సభికుఁ డని ప్రయోగింపఁబడినది.

ఉ. నింపిన మద్యసారమున ... ... గాంక్షింపుచుఁ గూలె ... (10-5)

సూ. పకారంబు కొన్నియెడల శత్రర్థపక చువర్ణంబునకుం గానంబడియెడి (ప్రౌఢ క్రియా-17) అను సూత్రమువలనఁ "గాంక్షింపుచు" నను రూపము సాధువు. ఈ కావ్యమునందలి రంభోరూజనంబు (13-38) దివౌకలావళి (14-28), వగలన్ [2-58],

చూచుటకు [5-54], వృద్ధు [14-70], అసుర [14-73], దూతుఁడు [16-16], మొదలగు ప్రయోగములు గ్రంథకర్త సంస్కృతాంధ్ర వ్యాకరణ సంస్కారమును వెల్లడించుచున్నవి

ఛందో విశేషములు:—

సంస్కృతకావ్యమున మాఘకవి వివిధవృత్తములను వాడినట్లే మహాదేవకవి యిందు సామాన్యములగు చంప కోత్పల శార్దూల మత్తేభములు, కందము, సీసము, తేటగీతి, యాటవెలఁది మున్నగునవి యే కాక, యుత్సాహ లాలు, మత్తకోకిలవృత్తములు రెండు, ప్రమాణవృత్త మొకటి వాడిరి. పుష్పాపచయాది వర్ణనములందు సాధారణముగా నాంధ్ర కవులు రగడలు వాడుదురు. వీరట్టిచోట్ల సీసమాలికలు వాడినారు కందపద్యము యొక్క రెండు నాల్గు చరణములందు మొదటిమూఁడుగణములకుఁ బదులు నాల్గు నగణములు గాని నగణ, గలములు గానివాడినచో నడకయందొక విధమగు సొగసు వచ్చును. ఇది తిక్కన కెక్కువ ప్రీతి.

క. అనవుడు భూపతి పిలువం, బనిచె నతని నవఁడు నతడ భయభక్తులతో.

క. కలితభుజుండై యొక్కఁడు, తొలఁగి చనియె నేమి చెప్పదుం గురునాథా.

ఇట్లే క. స్థగితేతరపరిమళమై, మగువ పొలుపు దెలుపు నొక్క మారుత మెలసెన్

అని పెద్దనగారు గూడ వాడిరి.

ఇందుఁ గూడ నిట్టినియమము పాటించిన కొన్నికందములగపడును.

క. రిపువధమగు నేవిఁ బురం, దరుని యురము ద్రఢిమ మెనయుతం బులకలఁ గ్రి
క్కిరియు చనుమొనల శచి తాం, దరఁగ గవుఁగిలించు నొత్తునకుఁ దాకుకొనన్ 1-74
కలన నతని నభిగమింపఁగాఁదగునీకున్. [16-13]
జనులు పొగడ మాటపల్కె సంరంభముతోన్ (16-16)

యతి విశేషములు :—

లం, కాపురి కేఁగి చంపితివి-జ్ఞావక మున్నదె ? ... ... ఆ. మా. (1-68)

క. "జ్ఞానము కేవలకృప సజ్ఞానికి నుపదేశవిధి ప్ర-కాశము చేయన్"

అను తిక్కనగారి ప్రయోగ ముదాహరించి 'క-జ్ఞ' వర్ణములను విశేషపఱులుగా నప్పకవి పేర్కొనినాఁడు.

నీయెదుట శాస్త్రమెవ్వఁడు-నేని ... ... ఆ. మా. (2-67)

"ఎట్టి మహాక్రూరకర్ముఁ-డేనియుఁ నెట్టన హరి తలఁపు గలిగె-నేని" అని యుదాహరించి యేని శబ్దమున నచ్చుతోడను, వ్యంజనముతోడను యతి కుదురునని నిత్యయతిగా నప్పకవి పేర్కొనినాఁడు.

అవ భవదీయదర్శనము-కంటె (1-31)
విభు, కై పరసంపాదితమ్ము-అగు (2-82)
ప్రాణమ్ము లెల్లం బు-కంటె (19-70)

వీనిని బంచమీవిభక్తివిరామములుగా నప్పకవి చెప్పినాఁడు.

ఉ. పట్టికిఁ బుట్టు వొందిన శు-భాహము నందు ... ... [మాఘ. క. చ. 24]

ఇట్టి యఖండయతు లీకావ్యమునందు విశేషిగాఁ గలవు.

ఉ. భానుసహస్ర భాసివృష-బాధిపుఁ డన్నటు లర్థయు క్తమై
పూనినచో నఖండవడి పొల్పగు నాదికవిప్రణీతమై.

అని కవిజనాశ్రయమునఁ దీయతి యంగీకరింపఁబడినది.

ఉ. ఎల్లరు సంతసించి ప్రక-టించిన ... ... [మా. చ. 9]

ఉ. హేలమెయిన్ గ్రహించి విని-పించెను ... ... [అ. మా. 3-21]

ఇట్టి యించుగాగమయతులు గూడ నిందుఁ బెక్కు-చోట్లఁ గలవు.

క. కాంచనచేలుని దమి నుతి, యించె ననఁగ భిన్నవిరతి-యేపారుఁ గృతిన్
గొంచక పోషించెన్ విను, తించె ననఁగ భిన్నవిరతి-యేపారుఁ గృతిన్.

అని సులక్షణసారమునం లింగగుంటతిమ్మకవి యీ యతి నంగీకరించెను. రేఫలకారములకు, రేఫళకటరేఫములకు యతులు చెల్లవని యప్పకవి చెప్పినను బూర్వకవులు వాడుటచే నీ కావ్యమునఁ గూడ వాడఁబడినవి.

## ప్రాస విశేషములు :-

రేఫళకటరేఫములకుఁ బ్రాసమైత్రి యప్పకవి యంగీకరింపకపోయినను బెక్కుమంది పూర్వకవులు వాడుటచే నిందుఁ గూడ వాడఁబడినది.

రేణువుల్ దొరఁగిన-యేనివాడి [6-48]

ఇందు 'న-ణ' లకుఁ బ్రాసము వాడఁబడినది. కొందఱు పూర్వకవులు దీనిని వాడిరి.

చ. విరిసిన కందళంబు లొదవించిన లాలన నుబ్బుమబ్బు ప
య్యెర ప్రసవన్నిజేళలగు నమ్మల వంతలఁ గూల్చుటల్ వనా
వళులను బట్టి వంచు టొకపాటివె యెంచ మనస్వినీజనం
బుల మదిలోని గుట్టునె సమూలము గూల్చెడి చెట్టుముందటన్. [6-10]

ఇందు ర-ళ-ల-లకుఁ బ్రాసము వాడఁబడినది. లళలకుఁ బ్రాసమైత్రి గలదు. రలలకు యతి గూర్చిన వారేగాని ప్రాసమునందు వాడిన పూర్వకవు లరుదు. కాకుత్స్థవిజయము నందలి 'ర-ల' ప్రాసముగల యొక పద్యము నుదాహరించి సంధిగతప్రాసముగా నప్పకవి పేర్కొనినాఁడు.

ఉ. అల్లన లింగమంత్రిసుతుఁ డత్రిజుగోత్రుఁడు నాదిశాఖి కం
చెర్లకులోద్భవుండు ... ... ...

అనుచోట దాశరథి శతకములో దామదాసుగారు దీనిని వాడిరి.

తే. ఆగతుల నగణిత ప్రీతియాతులైన (10-20)

ఇందు రేఫఘటిత సంయుక్తాక్షరమగు 'ప్ర' అను దానికి ముందున్న 'త' యనునది లఘువుగా వాడఁబడినది. ఇట్టివానిని గొందఱు ప్రయోగించుచున్నారు.

పు, పులకయిచేయి మెత్తి భుజమూలగతంబగు (7-28)

ఇందు "పు-మూ" లకు యతివాడఁబడినది. "పు, పు, బు, భు" లకు 'ము' వర్ణముతో యతిమైత్రి యుండుటచేతను 'ప-వ' లకు యతిమైత్రి యుండుటచేతను వీరిట్లు వాడియుందురు. పూర్వకవుల ప్రయోగములం దిట్టిది మృగ్యంబు.

ఉ. ఈతని దానతోయ ... ... క్ష్మాతలిఁ బర్వ ... ... (మా. క. చ. 31)

స్థలమునకు స్థలి, తటమునకుఁ దటి యను రూపము లున్నట్లు తలమునకుఁ దలి యను రూపముండదు.

ఇట్టివి ప్రమాదము అని చెప్పుట కంటె వారి యభిరుచిని బట్టి మహా దేవుఁడుగారు స్వతంత్రించి ప్రయోగించి రనుటయే న్యాయము. అంత్యానుప్రాసములు, దుష్కరప్రాసములు వాడుచుఁ బద్యముల నవలీలగా నడిపించుటలో నాంధ్రవాఙ్మయమునందుఁ బోతనగారి దగ్రతాంబూలము. ఈ కావ్యమునందుఁ గఠినప్రాసములు విరివిగా లేకపోయి నను వాడిన చోటులందు మాత్రము పద్యములు హేలగా సాగినవి.

ఉ. సస్యము నోమ నేర్చుఁ గల చాన యొకర్తుక లేళ్ళనుండి యా
పస్యము గావనేర్చు కరసారస మెత్తికె పాడ గాన సా
రస్యవశంవదమ్మయి కురంగము లిట్టటు చూడ కిందుబిం
బాస్య ముఖంబునే కనుచు నట్టు నిలంబడె నాశ్వినంబునన్. (8-49)

క. ఉర్వీశుఁ డెవఁడు తనతల, గర్వంబునఁ జైద్యు కాళ్ళకడఁ జేర్చెఁడో యా
దుర్వృత్తు నెత్తిమీఁద వ, ఖర్వోద్ధతి నాతఁ డెడమకా లిడి త్రొక్కున్. (16-88)

ఇట్లే ర్మ, ంధ, ర్భ, ద్య, క్ష, ంద్ర, త్య, క్త, వ్య, గ్ర, ర్ధ, శ్చ, మున్నగు కఠినప్రాసము లిందుఁగలవు.

ఉ. కూరుఁడు, వైరిచొ ప్పెరచు చొప్పులఁ గ్రూరుఁడు ... ... (19-102)

సీ. దురితంబు లెల్లను దునుమాడు మరమీట ... ... (19-144)

ఈ రెండు పద్యములందు నంత్యానుప్రాసము వాడఁబడినది.

చిత్ర కవిత్వము :-

మాఘమహాకవి పందొమ్మిదవ సర్గమున సర్వతోభద్ర, మురజ, గోమూత్రికా, చక్ర బంధములు, ద్వ్యక్షరి, ఏకాక్షరి, ప్రతిలోమయమకము, అర్థత్రయవాచి, అతాలవ్యము మొదలగు చిత్రకవిత్వముతో నింపినాఁడు. ఈ యాంధ్రమాఘమునందు మూలములోవలె నెక్కువగాఁ జిత్రకవిత్వము లేదుగాని పదునాఱవ యాశ్వాసములో నొక సర్వతః ప్రాససీసము, పందొమ్మి దవ యాశ్వాసములో నొకసర్వతఃప్రాసగీతము, నొక గోమూత్రికాబంధము, కావ్యాంతమున నొక చక్రబంధము గలవు.

సీ. భంగంబు నొందించు రంగదుద్ధతి నుత్తమాంగంబు లెత్త నభంగురగతి. (16-72)

అనునది సర్వతఃప్రాససీసము. ఇం దిఱువదినాల్గు చోట్ల నొకప్రాసమే వాడవలయు నన్న నిట్టి దానిని వ్రాయుట యెంత క్లేశమో పద్యానయ లూహింతురుగాక!

తే. గబ్బి బెబ్బులి బొబ్బలా గుబ్బుకొనఁగ (19-21)

అను తేటగీతిలో సర్వత్ర నొకప్రాసమే వాడఁబడినది. ప్రతిసర్గాంత శ్లోకమునందును భారవి 'లక్ష్మి' శబ్దమును, మాఘుఁడు 'శ్రీ' శబ్దమును హర్షుఁడు నైషధములో శ్రీహర్షమహాకవి 'ఆనంద' శబ్దమును బ్రయోగించినాఁడు. ఈయాంధ్రకృతిలో 2, 12, 13, 15, 16, 18, 19, 20 ఆశ్వాసాంతపద్యములలో శ్రీకారము కూర్పఁబడినది.

ఇట్టి విశేషము లింకను గలవు గాని గ్రంథగౌరవభయముచే నింతటితో నీప్రస్తావన విరమించుచున్నాను. ఇప్పు డిది సౌశీల్య కరకమలములచే నలంకరించబడినది గావున నీకావ్య

వైశిష్ట్యమును దామే కరతలామకము గావించుకొందురు. ఈ కావ్యవిషయమున మాఘ, మల్లినాథ, మహాదేవకవులను మూర్తిత్రయ మెంత ముఖ్యమో యట్లే దీనిని బ్రకటించుటకుఁ బూనుకొనిన శ్రీ బుద్ధవరపు మంగాయమ్మగారు (మహాదేవకవి భార్య) దీనిని స్వీయ (హనెమాన్) ముద్రణాలయమున, సర్వాంగసుందరముగా నచ్చొత్తించిన శ్రీ వేమవరపు వేంకటరమణశర్మగారు, శ్రీమదాంధ్రమాఘమును బరిష్కరించుటయే కాక, యిందలి యేకాదశా శ్వాసమును బూరించిన బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు కూడ నంతముఖ్యులు గాన నీమూర్తిత్రయమునకుఁ గూడ నానమోవాకములు.

## మహాదేవకవి యితరకృతులు :

### కువలయానందము :

సర్వతంత్రస్వతంత్రులు, శతాధిక గ్రంథకర్తలు నగు నప్పయ్యదీక్షితులవారిచే రచింపఁ బడి, పఠనపాఠనములలో మిక్కిలి ప్రసిద్ధి గాంచిన కువలయానందమను నలంకారశాస్త్రమున కాంధ్రానువాదము. ఇందలి వృత్తిభాగమును వదలి లక్ష్యలక్షణశ్లోకములను మహాదేవుఁడు గారు తెనిఁగించినారు.

### విరోధాభాసము :

ఆభాసత్వే విరోధస్య, విరోధాభాస ఇష్యతే
వినాఽపితన్వి! హారేణ, వక్షోజౌ తవహారిణౌ ॥
ప్రతీపభూపై రివ కిం తతో భియా, విరుద్ధధర్మైరపి భేత్తృతోజ్ఝితా
అమిత్రజిన్మిత్రజిదోజసా స య, ద్విచారదృక్చారదృగప్యవర్తత ॥

తే. పలుకులందువిరోధ మాభాసమైన నది తదాభాసమై యొప్పు నమలకృతుల
హారములు గల్గకుండిన హారియశము నీదు కుచములకే సుమ్ము నిర్మలాంగి!

తే. చారదృష్టియు నగును విచారదృష్టి మిత్రజేతయై వెలయు నమిత్రజేత
నలుఁడు గానఁ బ్రతీపభూనాథు లెల్ల భేదగుణముల విడచి సేవింత్రువాని.

### అప్రస్తుత ప్రశంస :

శ్లో. ఆబద్ధకృత్రిమ సటాజటిలాంసభిత్తి
రారోపితో మృగపతేః పదవీం యది శ్వా
మత్తేభకుమ్భతటపాటనలమ్పటస్య
నాదం కరిష్యతి కథం ? హరిణాధిపస్య ॥

ఉ. సింగపుజూలు నొక్కటి రచించి మెడం దగిలించుకొంచుఁ జా
లంగ మృగాధినాథచిరలబ్ధమహోన్నతపీఠి నెక్కి యు
ప్పొంగును గాని కుక్క యెటు వోలును జేయఁగ నన్యమత్తసా
రంగహృదంతరమ్ములఁ గరమ్ము పగుల్పఁగఁ జాలు గర్జలన్.

### ఆక్షేపాలంకారము :

సాహిత్యపాథోనిధిమన్థనోత్థం, కర్ణామృతం రక్షత హే కవీన్ద్రాః!
యత్తస్య దైత్యా ఇవ లుణ్ఠనాయ, కావ్యార్థచోరాః ప్రగుణీభవన్తి.

గృహ్ణన్తు సర్వే యది వా యథేచ్ఛం నాస్తి క్షతిః క్వాపి కవీశ్వరాణామ్
రత్నేషు లుప్తేషు బహుష్వమర్త్యై రద్యాపి రత్నాకర ఏవ సిన్ధుః.

మ. ఉరుసాహిత్యపయోధిఁ ద్రచ్చుతరి లో నుత్పన్నమౌ కర్ణప
ర్వరసాంచత్సుధఁ గాచుకొండు కవులారా! దొంగలున్నారు కా
వ్యరమన్ దొంగిల; దొంగిలించినను లోపం బేమియున్ లేదు లెం
డరయన్ రత్న మెవండు గొన్న జనవఖ్యాతుల్ దగన్ వార్ధివే.

చంపూ రామాయణము :

గచ్ఛతా దశరథేన నిర్వృతిమ్ భూభుజా మసులభామ్ భుజాబలాత్
మాతులస్య నగరే యుధాజితః స్థాపితౌ భరతలక్ష్మణానుజౌ.
అథ దశరథః పుత్త్రం రామం స్వత త్రిజగత్పతిం
స్వవిషయమహీమాత్రే కర్తుమ్ పతిం విదధే మతిమ్
భువనభరణే కల్యం కల్యాణభూధర మాదరాత్
స్వగృహవటలీధుర్య స్తమ్భం విధాతుమనా ఇవ. (అయోధ్యాకాండము)

కం. కేవలము బాహుబలమున, భూవరుల కలభ్యమైన పుత్త్రసుఖావి
ర్భావంబున దశరథప్రు, ధ్వీవిభుఁ డుప్పొంగె నెల్ల వేళల యందున్.

తే. మేనమామ యుధాజిత్తుతోన యంత, భరతశత్రుఘ్నులను బంపెఁ బంపలేక
దశరథుఁడు ముచ్చటన్నది తనకుఁ దనదు, మామ కొక్కటియే యను మాటలెటులఁగి.

తే. త్రిజగతీసార్వభౌమసుస్థితికిఁ దగిన, రాముఁ దనదేశమునకు మాత్రంబెపతిగఁ
జేయఁగా నిశ్చయము చేసి చెలఁగుచుండె, దశరథక్షోణిపాలుండు తనమనమున.

శ్లో. ప్రవిశ్య విపినమ్ మహత్తదను మైథిలీవల్లభో
మహాబలసమన్విత శ్చలితనీలశైలచ్ఛవిః
నిశాచరదవానలప్రశమనం విధాతుం శరై
శ్చచార సశరాసన స్ఫురపథే తటిత్వానివ. (అరణ్యకాండము)

ఉ. ఆయెడ రామదేవుఁడు వనాంతముఁ జొచ్చెఁ జరద్వనీలశై
లాయితగేయకాయుఁడు మహాబలసంయుతుఁ డప్రమేయ దై
తేయ దవానలమ్ము శరదీప్తుల నారుప విల్లుఁబూని బల్
తోయదవం క్తి నింగిపయిఁ దోఁచెడి భంగి నను గ్రహించుచున్.

నాఽహం సుకేతుతనయా న చ సప్తసాలీ
వాలీ న చ త్రిభువనప్రథితప్రభావః
తారాఽస్మి వజ్రహృదయా విశిఖై రభేద్యా
ధన్వీ కథమ్ భవసి? రాఘవ మామవిద్వా. (కిష్కింధాకాండము)

ఉ. తాటక పంచ సెంచకుము తాళము లేడనుచున్ భ్రమింప కె
వ్వాటను ముజ్జగంబులను వాసికి నెక్కిన వాలిగాను బ
ల్పాటవ మొప్పు నీయలఁగులన్ మథియింపఁగ రాని వజ్రపుం
గాటపుడెందమున్ గలుగు కట్టిఁడి తారను గాని రాఘవా.

క. నను బొలియింపక నీ కై, ట్లనువుపఱున్ వింటిదాల్పు లందున బలుమే
టను బిదుదము నీవింతయు, మనమున నూహింతొ? లేదొ? మనువంశమణీ.
ఉజ్జృమ్భితస్య తరసా సరసా పజేతుమ్ పాదౌ పయోధికలితౌ పవమానసూనోః
స్ఫోత్తమాజ్గ మభజద్గగనస్రవ న్తీ వీచీచయస్ఖలితశీకరమాలభారి.
తే. కడు విజృంభించి పాదముల్ కదలి వఱకు, విస్తరింపఁగ సౌదల వేల్పుటేటి
తరఁగ దొంతుల తుంపురుల్ దాల్చునటుల నింగిదాఁకంగ నిగిడించి నెగడె మిగుల.
దేవ! తస్యాః ప్రతిష్ఠాసూ నసూ న్కైకపాలితాన్
ముద్రయిత్వా ప్రపన్నో౽హం త్వదభిజ్ఞానముద్రియా. (సుందరకాండము)
ఉ. భూమిజ బొందినుండి విడిపో సమకట్టిన ప్రాణవాయు వా
శామహనీయ బంధనవశమ్మయియుంటఁ ద్వదంగుళీయ ము
ద్రామలచారుముద్ర నిడి ప్రాణదనం బెటువోవకుండఁగా
నేమముచేసి వచ్చితిని నీకడ కర్కకులప్రభూత్తమా.
భోజుఁడు చంపువుగా రచింపఁగా మహాదేవుఁడుగారు నిర్వచనముగాఁ దెనిఁగించినారు.

## సూ త సం హి త ;

స్కాందపురాణమునందు (1) సనత్కుమారసంహిత, (2) సూతసంహిత (3) శాంకర సంహిత, (4) వైష్ణవసంహిత, (5) బ్రహ్మసంహిత (6) సౌరసంహిత యను నాఱు సంహితలు గలవు. సూతసంహితయందు [1] శివమాహాత్మ్య ఖండము [2] జ్ఞానయోగ ఖండము [3] ముక్తిఖండము [4] యజ్ఞవైభవఖండము అను నాల్గు ఖండములు గలవు. సూతసంహిత యాఱువేల శ్లోకముల గ్రంథము. సర్వజ్ఞులగు మాధవాచార్యులు సూతసంహితకుఁ దాత్పర్యదీపిక యను వ్యాఖ్య రచించిరి. మహాదేవుఁడుగారీసూతసంహితను గూడ యథా మాతృకముగా నాంధ్రీకరించిరి.

కైలాసశిఖరే రమ్యే నానారత్నసమాకులే
నానారత్నసమాకీర్ణే నానామూలఫలోదకే
నానావల్లీసమాకీర్ణే నానామృగసమాకులే
నానావృక్షసమాకీర్ణే నానాయోగిసమావృతే
నానాసిద్ధసమాకీర్ణే నానామౌనిసమావృతే
నానాదేవసమాకీర్ణే నానాచారణసేవితే
నానాయక్షసమాకీర్ణే నానాగన్ధర్వసేవితే.

సీ. ఒకచోట నానాలతోర్వీజసముదయం, బ్బొకటనానాలతాంతోత్కరమ్ము
నొకసీమ నానాఫలోత్కృష్టకందౌఘ, మొకట నానాస్వాదుయోగ్యసలిల
మొకకేవ నానావిధోజ్జ్వలమ్మనిగణ, మ్మొకటనానాకురంగకఁఁలమ్ము
నొకచాయ నానాసురకృతార్థబృందమ్ము, నొకట నానాకిన్నరకృతివితతి
తే. చెలువు దయివార నమృతాంశుశేఖరాల, యమ్ము సౌమ్ములకెల్లను సౌమ్ము నగుచు
వెలయు ముల్లోకములఁ బేరు పెంపుఁగని పిలాససంపద నడరి కైలాసశిఖరి.
శ్లో. యజ్ఞైర్దైవత్వ మాప్నోతి, తపోభి ర్బ్రహ్మణఃపదమ్
దానై ర్భోగా నవాప్నోతి, జ్ఞానా ద్బ్రహ్మాధిగచ్ఛతి.

కర్మణా కేచి దిచ్ఛన్తి కైవల్యమ్ మునిసత్తమ
తే మూఢా మునిశార్దూల! ప్లవాత్యేత ఇతి శ్రుతిః.

కం. దానమున భోగమున్ జ, స్నానం దెఱగంటితనము నాకీకజని
స్థానముఁ దపమున నిస్సీమానందము జ్ఞానమునను బ్రాప్తంబు యగున్.

కం. జ్ఞానమునఁగాదు కర్మము, చే నొఁగైవల్యమంచుఁ జెనటులుమౌఢ్యం
బూనివచింతురు శ్రుతికది, యానువిరుద్ధం బదింత యరయరుగాదే.

అథవా సత్య మీశానం జ్ఞాన మానన్ద మద్వయమ్
అనన్త మమలం నిత్య మాదిమధ్యాన్తవర్జితమ్.
తథాऽస్థూల మనాకాశ మసంస్పృశ్య మచక్షుషమ్
నరసం నచ గన్ధాఖ్య మప్రమేయ మనూపమమ్.
సర్వాధారం జగద్రూప మమూర్తమ్ మూర్తమవ్యయమ్
అదృశ్యం దృశ్యమన్తస్థమ్ బహిస్థం సర్వతోముఖమ్.
సర్వతః పాణిపాదం చ సర్వకారణకారణమ్
సర్వజ్ఞత్వాదిసంయుక్తం సోऽహ మిత్యేవ చిన్తయేత్.

సీ. అవ్యయుం డాదిమధ్యాంతశూన్యుఁ డనంతుఁ, డనలుఁ డద్వయుఁడు ననఘుఁడు పుణ్యుఁ
డహ్రస్వుఁ డస్థూలుఁ డస్పృశ్యుఁ డద్రేశ్యుఁ, డంసుఁ డగంధుండు నప్రమేయుఁ
డనుపముఁ డక్రియుఁ డజ్ఞాతరూపుండు, సర్వతోముఖుఁడును సర్వగుండు
సర్వజ్ఞుఁడును సర్వసాక్షియు సచ్చిదా, నందస్వరూపుఁ డానందమయుఁడు

తే. కారణంబుల కెల్లను గారణంబు, నద్భుతుం డార్తిహరుఁడగు హరు హిమాద్రి
జామనోహరు నెవ నిల్పి సంతతమ్ము, సోऽహమని ధ్యానమును జేయు చొప్పకండు.

అథవా విష్ణు మవ్యక్త మాధారం దేవనాయకమ్
శఙ్ఖచక్రధరం దేవమ్ పద్మహస్తం సులోచనమ్.
కిరీటకేయూరధరమ్ పీతామ్బరధరంహరిమ్
శ్రీవత్సవక్షసం విష్ణుమ్ పూర్ణచన్ద్రనిభాననమ్.
పద్మపుష్పదలాభోష్ఠం సుప్రసన్నం శుచిస్మితమ్
శుద్ధస్ఫటికసఙ్కాశ మహమిత్యేవ చిన్తయేత్.

సీ. పసుపువన్నాయ బల్ పసలొల్కు పచ్చని, పట్టుపుట్టము మేనఁ గట్టువాని
నొకచేత శంఖంబు నొకచేతఁ జక్రంబు, నిరుకేలఁ దమ్మిపూ లెనయువానిఁ
దలకిరీటంబు బాహులను గేయూరంబు, లధరోష్ఠమున నవ్వు లలరువాని
నెదను శ్రీవత్సమ్ము నిందిరాదేవితో, సమముగా ధరియింపఁ జాలువానిఁ

తే. బద్మలోచను బద్మాస్యుఁ బద్మనాభుఁ, బద్మభవుతండ్రిఁ బద్మకుం బ్రాణనాథు
విష్ణు మనమున నెలకొల్పి విభవమెసఁగ, సోऽహమని ధ్యానముం జేయు చొప్పకండు.

శ్లో. అథవా దేవదేవేశమ్ బ్రహ్మాణమ్ పరమేష్ఠినమ్
అక్షమాలాధరం దేవం కమణ్డలుకరామ్బుజమ్.
వరదాభయహస్తం చ వాగ్దేవ్యా సహితం సదా
కున్దేన్దుసదృశాకార మహమిత్యేవచిన్తయేత్.

సీ. తనయెద నిర్మలంబును దెల్పు కై వడి, స్ఫటికాక్షమాలఁ జేపట్టువాని
తా నిండుకుండని తగఁ జెప్పనో యన, జలకమండలువు చే నిలుపువాని
నిరుచేతులం గల్గు నీఁగియే ఫలమన, వరదాభయదకరద్వయము వానిఁ
బల్కు పల్కినఁ బ్రియవలెఁ దోఁప వలెనన, బలుకులచెలి పజ్జ మెలఁగువాని

తే. స్వచ్ఛకుందేందునీహారవర్ణ మొప్పు, వాని భువనప్రణేతయౌ వాని నజుని
నలసురజ్యేష్ఠు నంతరంగాంతరమున, సోఽహమని ధ్యానముంజేయుచొప్పొకండు.

మహాదేవుఁడుగారు రచించిన గ్రంథములలో నిదియే పెద్దది. ఇందలి కవిత్వము పరిపక్వస్థితి నొందుటచే నిదియే వీరి చివరికృతి యని నా యభిప్రాయము. శిశుపాలవధ వంటి మహాకావ్యమును, భోజరామాయణము వంటి చంపువును, సూతసంహిత వంటి పురాణ గ్రంథమును, కువలయానందము వంటి యలంకారశాస్త్ర గ్రంథమును దెనిఁగించిన కవితా సంపత్తి గలవారగుటచే వీరికి జయపురమహారాజులగు విక్రమదేవవర్మగారు "కవితావిశారద" బిరుదము నొసంగి గౌరవించినారు. వీరి పుత్త్రికలు, పుత్త్రులు భాషాప్రియులే గానఁ దక్కిన మూఁడుకృతులను గూడఁ బ్రకటించి వెలుఁగునకుఁ దెత్తురుగాక.

ఇట్టి యుద్గ్రంథములను రచించి వీరు కీలకనామసంవత్స రాశ్వయుజ ద్వితీయా సోమవారము (7-10-1968) సాయంత్ర మూఁడుగంటలకు భౌతికదేహమును వీడి

కం. క్షితి నెవ్వని నామము సత్కృతి నెన్ని దినంబులుండు దివి నా పుణ్యా
వ్రితుఁ డంత కాలముండును, ధృతి నింద్రద్యుమ్ను నునికి దృష్టాంతముగాన్.

అను నప్పకవి స్మరణానుసారము స్వర్గము నలంకరించిరి.

శ్లో. జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజమ్ భయమ్.

"మఙ్గళాదీని మఙ్గళమధ్యాని మఙ్గళాన్తాని హి శాస్త్రాణిప్రథన్తే వీరపురుషాణి భవన్త్యాయుష్మత్పురుషాణి చాఽధ్యేతారశ్చ మఙ్గళయుక్తా యథా స్యురితి" యను మహాభాష్యకారుల స్మరణము ననుసరించి

శా. కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరిక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
బ్రేమన్ మీరలు భక్తి నేము నిదె [illegible] రిం గంటి మెట్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుఁ డైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా.

అను భాగవతవచనానుసారముగా

మ. హరిమేనత్త కుమారు భౌతికశరీరాభ్యంతరమ్మందు ని
ర్భరతేజోఽంశ మొకండు వెల్వడి వడిం బద్మాక్షు మైఁ జొచ్చె భూ
వరులీక్షించుచు నబ్బురంపడ నభస్వద్భావితానమ్ము చి
మ్మ బుధుల్ జేయనఁ గ్రొవ్విరు ల్గురియఁగన్ మార్మ్రోయఁగన్ దుందుభుల్.

అని శిశుపాలుని దివ్యతేజస్సు శ్రీకృష్ణునితోఁ గలియుట యను మంగళాంతముగా నీకావ్యము ముగింపఁబడినది. ఇట్టి మాఘకావ్యామృతమును జనులందఱుఁ గ్రోలునట్లు వ్యాఖ్య రచించి

శ్లో. నేతాఽస్మిన్ యదునన్దనః స భగవాన్ వీరః ప్రధానో రసః
శృఙ్గారాదిభి రఙ్గవాన్ విజయతే పూర్ణా పునర్వర్ణనా

ఇన్ద్రప్రస్థగమాద్యుపాయవిషయ శ్చైద్యావసాదః ఫలం
ధన్యో మాఘకవి ర్వయం తు కృతిన స్తత్సూక్తిసంసేవనాత్.

అని మల్లినాథుఁడు తన యానందమును వెల్లడించినాఁడు. అట్లే యాంధ్రజను లందఱు నవగతమగునట్లు మహాదేవకవి మాఘమును దెనిఁగించి కృతకృత్యులైనారు. ఈ యాంధ్ర శిశుపాలవధ కథా సుధా సు ధారలు తనివితీఱఁ గ్రోలి యాంధ్రజను లందఱుఁ బవిత్రు లగుదురుగాక.

నీరక్షీరవివేకన్యాయమున నీభూమికయందలి దోషసందోహమును బరిత్యజించి గుణ లేశమున్నచో గ్రహించి నన్ననుగ్రహింపుఁడని పండితహంసులను వేడుకొనుచు నీ మాఘ సాహిత్యమును గూర్చి నాలుగుమాటలు వ్రాయుట కవకాశమొసంగిన యీకావ్యనాయకుఁ డగు శ్రీకృష్ణపరమాత్మను మాటిమాటికి ధ్యానించుచు నిప్పటికే పెద్దదగుటచే నీ భూమికనింతటితో ముగించుచున్నాను.

సీ. శ్రీమాఘకవిరాజ । శిశుపాలవధకావ్య
మాంధ్రభాష రచించి । యలరె నెవ్వఁ
డాంధ్రభాషాయోష । కవతంసభూషగా
శ్రీసూతసంహిత । చెప్పె నెవ్వఁ
డల భోజరాజ రా । మాయణచంపువు
త్రైలింగభాషలో । వ్రాసె నెవఁడు
తెల్గుపల్కుల నప్ప । దీక్షితకృతమైన
కువలయానందంబు । గూర్చె నెవఁడు

తే. భాసురాంధ్రాంగ్లగీర్వాణ । భాషలందు
సంప్రదాయజ్ఞుఁడైనట్టి । చతురుఁ డెవ్వఁ
డట్టి ఘను బుద్ధవరపువం । శాబ్ధిచంద్రు
బుధు మహాదేవకవిచంద్రుఁ । బొగడఁ దరమె ?

శ్రీ మ త్ప ర మే శ్వ రా ర్ప ణ మ స్తు.

అ వి డి,
3-2-1974.

ఇట్లు,
స క ల సు క వి బు ధ జ న వి ధే యుఁ డు,
గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ.

# విషయసూచిక




| | పుట |
|---|---|
| మాఘకవి చరిత్రము | 1 |
| ప్రథమాశ్వాసము | |
| నారదాగమనము | 19 |
| శ్రీకృష్ణునకు నారదుండింద్ర సందేశ మెఱింగించుట | 25 |
| ద్వితీయాశ్వాసము | |
| మంత్రాలోచనము | 31 |
| శ్రీకృష్ణుఁడు బలరామోద్ధవులతో మంత్రాలోచనము చేయుట | 32 |
| బలరాముఁడు స్వాభిప్రాయముఁ జెప్పుట | 34 |
| శ్రీకృష్ణున కుద్ధవుఁడు స్వాభిమతంబు నెఱింగించుట | 41 |
| తృతీయాశ్వాసము | |
| శ్రీకృష్ణుని ప్రస్థాన వర్ణనము | 50 |
| ద్వారకాపుర వర్ణనము | 54 |
| సముద్ర వర్ణనము | 60 |
| చతుర్థాశ్వాసము | |
| రైవతకాద్రి వర్ణనము | 63 |
| దారుకుఁడు రైవతకాద్రిని వర్ణించుట | 65 |
| పంచమాశ్వాసము | |
| స్కంధావార సన్నివేశాది వర్ణనము | 75 |
| గజవర్ణనము | 80 |
| అశ్వవర్ణనము | 83 |
| వృషభవర్ణనము | 85 |
| షష్ఠాశ్వాసము | |
| షడృతువర్ణనము | 87 |
| వసంతర్తువర్ణనము | 87 |
| విశేషకము | 90 |
| గ్రీష్మర్తువర్ణనము | 90 |
| వర్షర్తువర్ణనము | 91 |
| శరదృతువర్ణనము | 93 |
| హేమంతర్తువర్ణనము | 95 |
| శిశిరఋతువర్ణనము | 96 |
| వసంతవర్ణనము | 97 |
| గ్రీష్మఋతువు | 98 |
| వర్షఋతువు | 98 |
| శరదృతువు | 98 |
| హేమంతము | 99 |
| శిశిరవర్ణనము | 99 |
| సప్తమాశ్వాసము | |
| వనవిహారవర్ణనము | 100 |
| ఉపవనవర్ణనము | 103 |
| పుష్పాపచయవర్ణనము | 105 |
| అష్టమాశ్వాసము | |
| జలక్రీడావర్ణనము | 113 |
| జలప్రవేశవర్ణనము | 115 |
| జలక్రీడావర్ణనము | 117 |
| నవమాశ్వాసము | |
| సూర్యాస్తమయవర్ణనము | 124 |
| సంధ్యావర్ణనము | 126 |
| చంద్రోదయవర్ణనము | 127 |
| ప్రసాధనవర్ణనము | 130 |
| దౌత్యవర్ణనము | 132 |
| దశమాశ్వాసము | |
| మధుపానవర్ణనము | 137 |
| సురతవర్ణనము | 142 |
| సురతావసానవర్ణనము | 148 |
| ఏకాదశాశ్వాసము | |
| శ్రీకృష్ణుని వైతాళికులు మేలుకొలుపుట | 151 |
| ద్వాదశాశ్వాసము | |
| శ్రీకృష్ణుని ప్రస్థానవర్ణనము | 163 |
| సేనానివేశవర్ణనము | 170 |
| యమునానదీవర్ణనము | 172 |
| త్రయోదశాశ్వాసము | |

| | పుట |
|---|---|
| హస్తిపురప్రవేశము | 175 |
| **చతుర్దశాశ్వాసము** | |
| రాజసూయయాగవర్ణనము | 186 |
| అర్ఘ్యమునకై భీష్మకృత కృష్ణమహిమ వర్ణనము | 194 |
| **పంచదశాశ్వాసము** | |
| శిశుపాలుని యసూయ | 200 |
| **షోడశాశ్వాసము** | |
| శిశుపాలదూత వాక్యములు | 217 |
| దూతకు సాత్యకి ప్రతివచనము | 219 |
| **సప్తదశాశ్వాసము** | |
| కృష్ణసభాసంక్షోభము | 230 |
| యాదవసేనా సన్నాహవర్ణనము | 233 |
| సేనాప్రస్థాన వర్ణనము | 234 |
| **అష్టాదశాశ్వాసము** | |
| ఉభయసేనల సమావేశము | 241 |
| తుములయుద్ధ వర్ణనము | 242 |
| గజయుద్ధము | 245 |
| రణరంగమందు బీభత్సము | 250 |
| **ఏకోనవింశాశ్వాసము** | |
| ఉభయసేనల యుద్ధవర్ణనము | 253 |
| చిత్రయుద్ధవర్ణనము | 258 |
| శ్రీయాదవసేనలు శిశుపాలునితోఁ దలపడి పోరుట | 259 |
| గజయుద్ధవర్ణనము | 262 |
| శ్రీకృష్ణుడు యుద్ధమున శత్రుసేనలఁ దునుమాడుట | 265 |
| **వింశాశ్వాసము** | |
| శ్రీకృష్ణుని శిశుపాలుఁడు యుద్ధమునకుఁ బిలుచుట | 273 |
| శ్రీకృష్ణునిపై శిశుపాలుఁడు క్రుద్ధుఁడై బాణములు ప్రయోగించుట | 274 |
| కృష్ణుఁడు శరవృష్టిఁగురియించి శత్రుసేనలను జెల్లాచెదులొనర్చుట | 275 |
| శ్రీకృష్ణునిపై శిశుపాలుఁడు స్వాపనాస్త్రమును బ్రయోగించుట | 277 |
| స్వాపనాస్త్రముచే శ్రీకృష్ణుని సేనలు నిద్రించుట | 278 |
| శ్రీకృష్ణుని దివ్యతేజస్సుచే స్వాపనాస్త్రము వమ్మగుట | 278 |
| శిశుపాలుఁడు నానాస్త్రములను బ్రయోగించుట | 279 |
| శ్రీకృష్ణుని భ్రూభంగముచే ధ్వజస్థ గరుత్మంతునుండి గరుడసమూహము పుట్టుట | 281 |
| గరుడసమూహము భుజగసందోహమును బాఱఁద్రోలుట | 281 |
| శిశుపాలుఁ డాగ్నేయాస్త్రమును బ్రయోగించుట | 282 |
| శ్రీకృష్ణుఁడు మేఘాస్త్రమును బ్రయోగించి యాగ్నేయాస్త్రమును జల్లార్చుట | 283 |
| శ్రీకృష్ణ ప్రయుక్తమగు సుదర్శనము శిశుపాలుని శిరమును ద్రుంచుట | 285 |
| శిశుపాలుని తేజస్సు శ్రీకృష్ణునిలోఁ గలియుట | 285 |
| సోమసుందరకవి విరచిత కొప్పులింగేశ్వర దండకము | 289 |
| తప్పొప్పుల పట్టిక | 292 |




శ్రీరస్తు　　　　　　శుభమస్తు.　　　　　　అవిఘ్నమస్తు

శ్రీమన్మహాగణాధిపతయేనమః.

# మాఘకవి చరిత్రము

......✻......

శ్రీజినదేవు నానతిధరించి శిరంబునఁ బూజితన్,యశో
రాజితతద్వచోనిచయరమ్యసుధారసలేశజిహ్వికా
భార్జితపుణ్యమై, యిహపరంబుల హస్తమణిం బొనర్చి భూ
మీజనముల్ నుతింప నెలమిం గనె ఘూర్జరదేశ మిమ్మహిన్. 1

ఉ. ధర్మపరాయణుండు, కృతదానమహావిభవుండు, ధీరతా
ధర్మశిలోచ్చయప్రభుఁడు, వైభవనిర్జితనిర్జరేశుఁడున్
నిర్మలవర్తనుండు, ధరణీవరులందున మేటియైన శ్రీ
వర్మలుఁడాధరారమణి ప్రాణవిభుండయి కీర్తి గైకొనెన్. 2

తే. అన్ని గుణగణముల రాజు ననుకరించు
నట్టి మంత్రీశ్వరుఁడు లేక యవని నెట్లు
పాలనము సేయనగు నని భావమందుఁ
దలఁచి సచివోత్తముని దా వెదకుచునుండ. 3

సీ. అమరు లందఱకుఁ బంచాంగంబు చెప్పనే
　　కాని చెప్పెనె బుద్ధి కాంతకింత?
దితిజ సంతాన నీతిప్రదుండగుఁ గాని
　　యవనీతి నేకాక్షి యయ్యెఁ గాదె?
యష్టాదశపురాణ కష్టరచనఁ జేసె
　　నేకాని శుకిఁ జూచి నెరపె రక్తి
కౌరవపతి పజ్జఁ జేరి నీతుల విని
　　పించెనేగాని జేయించెనొక్కొ?

తే. యనుచుఁ దత్పూర్వనయవేత్త లందుఁ దప్పు
లరసి యుపదేశమే కాక యాచరణము
గలిగి వెలసిన మంత్రిపుంగవుని నొకనిఁ
గోరి నిల్పెను సర్వాధికారిఁ జేసి. 4

కం. ధీవరుఁ డాతఁడు సుప్రభ
దేవుండనువాఁడు త్రిజగతీవలయమునన్
జేవగల సచివమణుల ప్రి
భావములంజూపి యొసఁగుఁ బ్రభునకు జయముల్. 5

మ. శుభకార్యవ్రత శీలుఁ డస్ఖలితదృక్కోభామలుండర్కస
న్నిభతేజుండపరావనీవిభుఁడు నిర్ణిద్రుండు శ్రీవర్మల
ప్రభుసర్వాధికృతోల్లసద్విభవుఁడున్ రాజద్యశోమూర్తి సు
ప్రభదేవుండలరారు దూరితరజోభ్రాజద్గుణుండై సదా. 6

చ. సమయమెఱింగి యాసచివసత్తముఁడాడెడిపల్కులెప్డు త
థ్యములుమితాక్షరంబులునుదర్కహితంబులునౌట నుంతయ
డ్డము నెలవీయకాయతిఁ గడంగి నృపాలుఁడు నిచ్చ శ్రేయమొ
య్యమదిఁ దలంచి సల్పునుజనాంచిత వాక్యముప్రాజ్ఞుఁడున్బలెన్. 7

తే. ప్రజకు రాజున కన్యోన్యరక్తి నెఱపు
ముచ్చటలు మీఱ నామంత్రిముఖ్యుఁ డెలమి
నాయికానాయకులకు స్వాంతముల రక్తి
మనిచి యుప్పొంగు చేటునిమాడ్కి నెపుడు. 8

ఉ. ఎల్లరు సంతసించి ప్రకటించిన దీవన లెల్ల వీర్యసం
పుల్లములై ఫలాకృతినిఁ బొందెనొ నా సచివావతంస మ
త్యుల్లసితాంతరంగుఁడయి యొప్పఁగ నందనుఁ దుద్భవించి రా
జిల్లెఁ బయోనిధిం బొడము శీతమయూఖునిచాయఁ గాంచుచున్. 9

తే. గుణములను విన్నుఁ బోలెడు కొమరుఁ గనుమ
యంచు సుప్రభు దీవించు మంచివారి
పలుకు నవరించి తండ్రినింగెలుచు గుణము
లెసఁగు సుతునీయ బ్రహ్మ హర్షించె నతఁడు. 10

తే. బహుజనాశీర్వచన దత్త మహితుఁడగుట
దత్తకుండని పేరిడెఁ దండ్రి సుతున
కధికగుణవంతుఁ డెప్డు యథార్థగరిమ
మోటువడకుండఁ బోషింప నుత్సహింత్రు. 11

మ. పితృదత్తంబగు దత్తకాభిధకు బల్వెంపొప్పఁగాఁ జేసి యా
శ్రితు లెల్లన్ దయివారునట్లు సకల శ్రేయంబులంగూర్చి తాఁ
జతురుండై మును వారలిచ్చిననొగిన్ సర్వాశ్రయాభిఖ్య స్వా
ర్జితముంజేసి గణించె నిట్టిదిగదా వృత్తంబు మాన్యాళికిన్. 12

తే. అనయుఁ డైనట్టి తనయుఁడు తన యఘమునఁ
దండ్రి పేరును జెఱుచుట తథ్యమట్లు
సునయుఁ డైనట్టి తనయుఁడు తనగుణమునఁ
దండ్రి పేరును పెంచు నుదారగతుల. 13

తే. అంకభాగమ్ము చేతను నంకెనొకటిఁ
జేర్చి గుణియింప, నంకంబు క్షీణమగును
మఱియుఁ బూర్ణాంకగుణితానఁ బొరయు వృద్ధి
కుమతి సుమతులచేఁ దండ్రి క్రుంగుఁ బొంగు. 14

ఉ. తండ్రినిమించు పుత్రుఁడని తన్నుజనుల్ నుతియించికొల్వఁగాఁ
దండ్రిని దన్నుఁ బోలియొక ధన్యకుమారుని బొందఁ గోరి బల్
వేండ్రము నొ తపంబు సరవిన్ బొనరించెను దత్తకుండు గై
కొంద్రు విశుద్ధసత్త్వ లెదఁ గోరిన గోర్కె తపోబలంబునన్. 15

ఉ. దత్తకుఁడంతఁ గొమ్మనెల దప్పినదాదిగ దౌహృదేచ్ఛలన్
జిత్తము వచ్చునట్లువిరచించి ముదంబులఁ గూర్చి పూన్కితో
నెత్తఱినెట్టి వస్తువున నిచ్ఛజనించిన తోడుతోన నా
బిత్తరి కాళ్లముందరను బెట్టును నత్తఱి నట్టి వస్తువున్. 16

సీ. రసపాకసౌష్ఠవ రాజితరామాయ
ణాదికావ్యము లొక్క యదనునందు
నౌచిత్యచర్చాభరాత్తవిమర్శన
గ్రంథంబులను నొక్క కాలమందు

నుపమాద్యలంకార సూపపాదనపటు
శాస్త్రార్థముల నొక్క సమయమందు
నాద్యంతయుతము శ బ్దాగమం బావృత్తి
తతి గూర్చుచును నొక్క తరుణమందు.

తే. తర్కమీమాంసలను నొక్క తఱిని మఱియు
విశ్రుతచ్ఛందమును నొక్క వేళ నతఁడు
చెల్వకును జెప్ప గర్భస్థ శిశువు నేర్చె
మాతృగర్భస్థుఁ డౌ నభి మన్యు పగిది. 17

కం. గర్భిణి యగు వాపొలఁతుక
నిర్భర మగు శ్రద్ధఁ జలిపె నిరతము భక్త్యా
విర్భావముతో భారత
మర్భకునకు నట్టి రుచియు నలవడు టరుదే. 18

కం. ఆమె సభాపర్వంబును
వేమరు పఠియించి పొక్కు విధములు చూడన్
శ్రీమానవతీజాని
శ్రీమాహాత్మ్యముల భక్తి చెలఁగుట డోఁచున్. 19

కం. పుంభావసరస్వతియై
సంభావ్యం బగుచు మంచి సమయమునందున్
డింభకుఁ డొకఁ డుదయించెను
గంభీరపయోధి శీత కరుఁడున్ బోలెన్. 20

తే. అఘము లెయ్యవి నాతని నంటకుండుఁ
గాత మవి దీవన లొసంగి పూతమైన
మాఘనామంబు పెట్టిరి మాత్రపితలు
ఒక్క శుభకరం బైన ముహూర్తమందు. 21

కం. భోజునకు సహాధ్యాయిగ
తాఁజదివెను జదువులను వ తఁడు వరకవితా
తేజముల నొందఁగోరున్
భూజనమతపద్యశబ్దములకు బొందఁగఁ గోరున్. 22

తే. ఆటలందును పాటల × యందు నెపుడు
కవుల పేరులు సత్కవి × కావ్యములును
కవియశస్సులు కవిరుచుల్ × గాక వేఱు
ముచ్చటకు నైన స్మరియింపఁ × బోవఁ డతఁడు. 23

ఉ. ఇట్టుల కొన్ని వత్సరము × లేగిన వెన్కను దత్తకుం డొగిన్
బిట్టికిఁ బుట్టు వొందిన శు × భాహమునందు మహోత్సవంబు స
మ్రాట్టునకున్ బలెన్ సలిపి × మానితదానములెల్ల జందెపుం
గట్టుల కిచ్చి తన్నెను జ × గంబులు మెచ్చఁగఁజుట్ట లౌ ననన్. 24

కం. అచ్చటఁ జేరిన భూమివి
ద్యచ్చరులఁ ద్రికాలవేది × జ్యోతిషవిద్యా
విచ్చతురుఁ డొకఁడు దత్తకు
మచ్చిక మెయిఁ జేరి భావి × మాఘచరిత్రన్. 25

కం. "వినఁ గోరిక యుండినచో
వినిపించెద" నన్న నతఁడు × వీనుల విప్పుం
గన చేసి భావిచరితన్
వినిపింపు మనంగ గణక × విభుఁ డిటు పల్కెన్. 26

కం. సిరి, చదువుల విరిబోణియు
వరియింపుదు రితని సకల × వైభవములకున్
మఱి సరి యెవ్వరు లేరని
స్థిర, సుస్థిరకీర్తి నితఁడు × చేకొనుఁజుమ్మీ. 27

మ. ధనధాన్యంబులు పాడిపంటలును ను × ద్యానావళుల్ లోగిళుల్
ఘనసౌధంబులు వాహనంబులు నన × ర్ఘప్రస్తరస్తోమముల్
మనుఁ జీనాంబరముల్ విభూషణములున్ × నూత్నంపుభోగంబులున్
ధనముల్ రేఁ బవలున్ భజించు నితనిన్ × దాపించుచున్ నిచ్చలున్. 28

కం. పరులయెడ దోస మెంచెడు
తరుణంబున "నాస్తి దుష్ట × తా" యను, దీనుల్
దరిఁజేరుచు యాచింపఁగ
సిరి వదలుచు "నాస్తి" యనుచుఁ × జెప్పం డెపుడున్. 29

చ. చదువులసాని వీని కను ≈ సన్నులలోన మెలంగు పట్ల సం
పద లిడు లేమ యీమహిత ≈ భావము రంజిల సేవ సేయు న
య్యదనున సీతనిం గనిన ≈ నంబుజసూతియు, నంబుజాక్షుఁడున్
మొదలికి మోసమయ్యె నని ≈ ముక్కుదు రీసు జనింప లోపలన్. 30

ఉ. ఈతని దానతోయము ల ≈ నేకనదీనదసంఘతోయమై
క్ష్మాతలిఁ బర్వ నందున స ≈ మంచిత మై తగు నీటితుంపురుల్
ప్రీతిగ మందమారుతము ≈ వీచుచుఁ జల్లిన చల్వతాఁకులన్
జేతము పల్లవించు నటు ≈ చెల్వుగఁ జూచును దైవభూజముల్. 31

ఉ. ఈతని సత్కవిత్వము ర ≈ చింపనివారలు గల్గ రెందు ధీ
చాతురి, శబ్దసౌష్ఠవము, ≈ శైలిమృదుత్వము లెన్ని యెన్ని వా
ణీతరుణీలలామ మది ≈ నింపదు కోర్కుల వేఱుచోట వి
ఖ్యాతచతుర్ముఖోదితస ≈ మంజసఫక్కియు వెక్కసం బనున్. 32

ఉ. కాని యితండు వృద్ధుఁడగు ≈ కాలమునన్ నుడిచేదెమిన్న తా
నూనుచు రక్తి యీతనికి ≈ నొయ్యఁ గరంబును బట్టి త్రిప్పెడున్
శ్రీనళినాక్షి యీఘనుని చెంత త్యజించి చలించి మాయమై
యేనిలయానకో చని యు ≈ పేక్ష యొనర్చును వీనిపై సదా. 33

మ. అనుచున్ జోస్యము చెప్ప వానికి ధనం ≈ బర్పించి శ్రీదత్తకుం
డనిపెన్ జయ్యన నీపయిన్ దలఁచె నా ≈ హా యర్భకుం డెంత కుం
దునొ దారిద్ర్యము గాసి పెట్టుతఱి నీ ≈ దుష్టస్థితిన్ మాన్ప నా
కమవేదా క్షా యభాగ్య మట్టు లగునే ≈ యత్నంబునన్ వానికిన్. 34

కం. చేనైన యుపాయము నె
ట్టైనను చేయంగవలయు ≈ నని గంభీరా
నూనమనోఽంబుధి ద్రచ్చఁగ
వానికి నొక యూహ మొదవె ≈ వనటయు మానెన్. 35

శా. నూఱేండ్లే గద! యాయు వెవ్వరికిని ≈ న్నూఱేండ్లకున్ జాలు న
ట్లే రెట్టించి ధనంబు గూర్చి యిడఁ గా ≈ నీతండు తా వృద్ధుఁడై
యేరీతిన్ దురపిల్లు లేవడిని, విం ≈ కేపద్ధతిన్ జూడనే
పారన్ బాలుని గాసిదప్పెడి యుపా ≈ యం బింకలేదం చొగిన్. 36

కం. నవనిధులఁ బోలు ధనములు
సవిస్తరముగాఁగఁ గూర్చి సరగునఁ గడవల్
వివిధములఁ దెచ్చి నింపి స
చివవరుఁ డెవ రెఱుఁగకుండ క్షితిఁ బాతించెన్. 37

కం. తన కవసానావసరము
చనుదెంచు టెఱింగి యతఁడు సన్మతి తనయున్
సనయున్ దరిఁ జేరిచి చెవి
వినిపించెను గుప్తవిత్త విధ మది యెల్లన్. 38

తే. తనువుఁ జాలించు తండ్రికిఁ దనయుఁ డెట్లు
చరమకర్మంబు దీర్పఁగా శాస్త్రము విధి
యించె నటు శ్రద్ధతో నిర్వహించి సౌర
పురముఁ జేరిచె మాఘుఁ డమోఘనయుఁడు. 39

కం. తానున్ భార్యయు శ్రీమా
లానగరమునన్ వసించి లాలితగతి వి
ద్యానిపుణులతోఁ గాలము
మానుగఁ గడపుచును నుండె మహితాత్ముండై. 40

ఉ. బట్టులు యాచకుల్ కవులు పండితవర్యులుఁ జేరి చుట్టునున్
ముట్టి సభాంతరంబునను బొల్పుగ మాఘకవీంద్రు సంస్తుతుల్
వెట్టికి జేసి రీయవని విత్తము విద్యయుఁ జూరగొంటచేఁ
గిట్టనివా డొకం డితని కిన్ గనుపట్టఁడు ధాత్రిలోపలన్. 41

ఉ. "పండితసత్తముండు కవివర్యుఁడు పాత్రి మెఱుంగు దానశౌం
డుం" డను కీర్తి మాఘునకు నూల్కొన భోజధరాపతీశుఁ డా
పండితమండనున్ దనదు పజ్జకునుం బిలపించి పిమ్మటన్
నిండిన భక్తి నాదరము నీటుఁగ జూపి ఘటించె స్నేహమున్. 42

తే. తాను దినియెడు బోనమే తనదు మిత్ర
వరున కిడి వేడ్క సల్లాప సరణిఁ దీర్చి
హారతుల నిచ్చి తన శయ్యా నావసథము
నందు తన శయ్యకును తుల్య మైన శయ్య. 43

చ. అమరిచి భోజరాజు శశి ꠰ రావసరాగతరాత్రి యాట శీ
తము నడుపంగఁజాలు నని ꠰ దట్టపు సన్నని యున్ని సేలువల్
దమకముతోడ నిచ్చి కవి ꠰ తల్లజు నిద్దురపుచ్చి యచ్చటన్
నిముసమువోలె యానిశిని ꠰ నెమ్మని బుచ్చెను తాను ధన్యుఁడై. 44

తే. తెల్లవాఱఁగ లేచి యా ꠰ ధీవరుండు
భూవరుం గాంచి మాయూరు ꠰ పో ననుజ్ఞ
నీయవే యని వేడఁగా ꠰ నేమి యిట్టు
లనఁగఁ గత మని తర్కించి ꠰ మనసునందు. 45

తే. నెచ్చెలీ! యిన్నినాళ్లకు ꠰ వచ్చినావు
కరుణతోఁ గొన్ని నాళ్లేని ꠰ గడుపు మిటను
ఊరి నమ్మక వచ్చితి ꠰ వోయి యిట్లు
పోదు నంచును బలుకంగఁ ꠰ బోలు నాకొ? 46

తే. అనుచుఁ జనవున భోజరా ꠰ జాడునట్టి
పలుకు వినియును బోవఁగా ꠰ నెలవు నీయు
మనుచు మాఘుఁడు వేడ జ ꠰ నాధిపుఁడును
వెండి యిట్లను స్నేహంబు ꠰ పెంపు గదుర. 47

తే. ఓగిరమునందు వెబ్బర ꠰ యుండెనేమొ
వెజ్జసుఖ మింతలోపంబుఁ ꠰ జెందెనేమొ
యెఱుఁగనేరను మిత్రమా ꠰ యంతమాత్ర
మాన తీరాదె నీకు నే ꠰ నన్యుఁడ నాకొ. 48

తే. మాఘుఁ డదె వేవి భోజన ꠰ మాత్ర మెట్టు
లైనఁ గానిమ్మది విచార్య ꠰ మగునె నాకు
సీతువున రేయ చాల గా ꠰ సిల్లి నాఁడఁ
బోయవచ్చెద నిప్పట్ల ꠰ పోవనిమ్ము. 49

తే. అనుచుఁ బల్కిన భోజధ ꠰ రాధినేత
మనము చిన్నపుచ్చుకొని య ꠰ తనిని గొంత
దవ్వు సాగఁగ నంపి మీఁ ꠰ దటను నంతి
పురములోనికిఁ దా పోవ ꠰ ముద్ర నేఁగె. 50

చ. అరిగెను గొన్నివత్సరము ♦ లావల మాఘుని మన్కి యెట్టిదో
యరయఁగఁ గోర్కి పుట్టుటయు ♦ నాజనపాలుఁడు తా స్వయంబుగాఁ
బరిమితసంఖ్య నొప్పు పరి ♦ వారముతోడుగ మాఘపండితున్
దరిసెనముం బొనర్పఁగ ను ♦ దారతఁ దత్పురి కేఁగె నొయ్యనన్. 51

తే. పెద్ద నగరిని బోలు కో ♦ విదుని నగరు
నొచ్చి యద్భుత మందుచుఁ ♦ జూచి భోజ
నృపతి మెచ్చుచు నుండఁగా ♦ నే స్తకాఁడు
వచ్చె నని మాఘుఁడెదురేఁగి ♦ ముచ్చటలర. 52

తే. తెచ్చి నెన రచ్చుపడఁగ నా ♦ తిథ్య మిచ్చి
హెచ్చరించుచు సేమంబు ♦ లెఱుఁగ నడిగి
తనదు పడకింటి కాతని ♦ గొనుచు నచట
నిలుపఁగవిరాజు రాజును ♦ నివ్వెఱపడె. 53

సీ. ధగధగద్ధగలతోఁ ♦ దళుకు లీనెడు మగ
రాల డాల్ బలు కొఁగ ♦ డాలు గాఁగ
మరకతమాణిక్య ♦ సురుచిరస్థగితభూ
ములు చక్కనో తివా ♦ సులుసు గాఁగ
లౌకికవైదికా ♦ స్తోకప్రబంధంబు
లెనసిన యగరు వా ♦ సనలు గాఁగ
సరసకావ్యాలాప ♦ చర్చావిధానముల్
తాంబూలచర్వణ ♦ తతులు గాఁగ

తే. సీతురాతిరి నింతైన ♦ సీతు గనక
నుక్కపెట్టుటవలెఁ దోఁచి ♦ యక్కజముగ
మలయచందనచారుచ ♦ ర్చలను తాళ
వృంతవీజనసంగతి ♦ వెలసె గృహము. 54

తే. వేస్గ విస్లేల వచ్చు న ♦ వేళ యనుచు
వెఱఁగుపడు భోజనృపతికి ♦ విబుధవరుఁడు
పల్కె నిట్టిది గద శీత ♦ బాధనుడుపు
వడు వటంచును నుత్సాహ ♦ మడపలేక. 55

కం. భోగము యోగము మాఘుని
కేగద నను బోంట్లు సేయు ƒ నట్టి సపర్యల్
తూఁగునె తుల యివ్వానికి
నేగతి నొరు లీయఁ గలరె ƒ యిట్టి సుఖంబుల్. 56

కం. అని సంతస మందుచు భో
జనృపతి తన దేశమునకు ƒ సపరిజనముగాఁ
జనుదెంచె మరల యచ్చెరు
వును బొందుచు మాఘు సిరికి ƒ భోగాయతికిన్. 57

తే. చదివి చేపట్టనట్టి శా ƒ స్త్రంబు లేదు
గడఁగి రుచి గొననట్టి భో ƒ గంబు లేద
యరసి చేయని యట్టి పు ƒ ణ్యంబు లేదు
లేదు మాఘునికిఁ గొఱంత ƒ లేదు లేదు. 58

సీ. భావగాంభీర్యసం ƒ భాషణంబుల నెట్టి
విబుధుండు ముక్కుపై ƒ వ్రేలిడుకొను
వరసవాగ్రచనైక ƒ సామర్థ్యమున నెట్టి
కవిరాజు స్వోత్కర్ష ƒ కలన మాను
సురుచిరవృత్తసం ƒ శుద్ధి బుద్ధిని నెట్టి
ముని తనలోని లో ƒ టును గనుఁగొను
భోగానుభవసిద్ధ ƒ పూర్ణత్వమున నెట్టి
రాజేంద్రుఁడేని శి ƒ రంబు వంచు
తే. నెల్లవేళల దానంబు ƒ లిచ్చుపట్ల
నెంతవాఁడును గ్రిందిచే ƒ యిగ నగుఁగద
మాఘకవి కాతఁ డెన్న సా ƒ మాన్యుఁ డొక్కొ
తచ్చరిత్రంబు తలఁపఁ జి ƒ త్రంబుగాదె. 59

సీ. సకలవాంఛలఁ దీర్చు ƒ సౌరభూరుహములు
వాక్చాతురిని నింత ƒ వఱలఁ గలవె?
తాను దోఁచిన వేళ ƒ దాన మిచ్చు ఘనాళి
యెల్లవేళల దాన ƒ మీయఁ గలదె?

పట్టి బాధింప సంపద లిచ్చు నంభోధి
యడిగినతోడనే యిడుట గలదె?
యొక పక్షికిని తను వొసఁగి యాఁకలి దీర్చు
యత్నుఁ డెల్లర కీయ దక్షుఁ డగునె?

తే. యంచు యాచకు లెల్లరు నంచితాత్మ
లందునఁదదీయదానశీలైకజనిత
హర్ష ముప్పొంగ ఘనపులకాళి తనుల
మొలక లెత్తంగ వాంఛితములను గొంద్రు. 60

తే. తల్లిపాలకుఁ దమకించు దారకులటు
తల్లితొడపైకి నుఱుకఁగాఁ దహతహలను
జెలఁగు బిడ్డలవలె యాచకులు కవీంద్రు
డాసి ఫలసిద్ధి గండ్రదృష్టం బదేమొ. 61

కం. మాత కగు గాసి తలఁపక
పోతంబులు పొదుగులందుఁ బొడిచిపొడిచియున్
బ్రీతిగఁ బాలుం గ్రోలెడి
భాతిని యాచకులు మాఘు బాధింతు రయో!. 62

తే. ఇటుల నొక కొన్ని వత్సరా లేఁగుసరికి
తండ్రి యిచ్చిన ధన మెల్ల దఱిఁగిపోయె
మాన్యములును గుదువవోయె మఱియు వాన
లేమికిని నెట్టి పంటలు లేకపోయె. 63

తే. నిరతవితరణశీలుఁడా వరగుణుండు
చేయునది లేక తొల్లిటి చెల్మి దలఁచి
పురమునందున్న తాను కాఁపురము మాని
భోజభూపతి పురిఁ జేరె ముదితతోడ. 64

కం. ఊరక యా ప్రభుధనములఁ
గోరుట కిష్టంబు గాక కోమలిచేతన్
దా రచియించిన శ్లోకం
బారాజున కంపి తా గృహంబున నుండెన్. 65

తే. ఆమెయును రాజసౌధప § ర్యంత మేఁగి
తనదు రాకను సేవక § జనముచేత
ప్రభున కెఱిఁగించికొని యుక్క § అలము దీర్చు
కొనఁగ నారాజు పొంతకుఁ § జనెఁ జవమున. 66

కం. విద్యాభోజుఁడు గావున
సద్యఃఫల మీయఁ గోరి § సరగునఁ జేతన్
బద్యంబు నంది కర మ్మన
వద్యం బగు ఫణితి దానిఁ § బఠియించె నిట్టుల్. 67

*చ. కలువ మొగంబు వాడెను, జో § కొట్టపు డాల్ గనెఁ దమ్మిమొగ్గలున్
దొలఁగె ముదంబు సంతసము § త్రుంపఁ బెసలారెను జక్రవాకికిన్
నెల కుదయంబు వోయె నవ § నీరజమిత్త్రుఁడు వాసిఁగాంచె, ని
ట్టులగద కర్మపాకము క § ఠుతున్ హతదైవకృపాళి కెల్లెడన్. 68

చ. సదయుఁడు రాజు పద్దెమును § సాంతముగా విని దాని సృష్టికిన్
మదిఁ గడు మెచ్చి యుగ్రారు పొక్కఁమా ర్కిఁగుడించి, "త్రిలక్షమిత్తు నీ
యదనున భోజనంబునకు" § నంచు నొసంగి కవీశు రేపు నే
నుదయము చూడ వత్తు నని § యుత్సుకుఁడై వెసఁ బంపె నగ్గలిన్. 69

కం. లక్షత్రితయము గొని బ
ద్మాశియు నృపుగృహమ్ము వెడలు § టది యెటు కనిరో
యాక్షణమె యాఁగ పదుప్తన
భిక్షుకు లాయమ్మఁ జుట్టఁ § బెట్టిరి తరుచై. 70

కం. కలిగిన తమ తమ యిబ్బం
దుల నర్థులు దెలుపఁ బతికిఁ § దుల్యయయిన యా
పొలఁతి యొసఁగె లక్షత్రయ
మలఘుదయన్ మనసు కరఁగి § యర్థార్థులకున్. 71

---

* శ్లో. కుముదవన మపశ్రి, శ్రీమదమ్భోజషణ్డం
త్యజతి ముద ములూకః ప్రీతిమాం శ్చక్రవాకః ।
ఉదయ మహిమరశ్మి ర్యాతి, శీతాంశు రస్తం
హతవిధిలసితానాం హీ! విచిత్రో విపాకః ॥ (శి. వ. 11-64)

తే. మూఁడు లక్షలు నొక గడ్డి పోఁచ కైనఁగఁ
దెంపునను నిచ్చి పిదప సాధ్వీలలామ
భర్తృపజ్జకుఁ జనుదెంచి వర్తమాన
మెల్ల సాంతముగా వివరించి చెప్పె. 72

తే. అరయ మనుజుఁడు తాఱుమాఱైన నన్నేని
సహజశీలంబు విడువంగఁ జాలఁ డంచుఁ
దెలుపు కైవడిఁ బండితుం డలరి యందు
నతివ దాతృత్వముం గొని యాడె నిట్లు. 73

కం. నారీరూప మొదవు నా
క్షీరధి వే యనుచు నిన్నుఁ గీర్తింతుఁ జెలీ!
నారీతతిలో భర్త్రా
చారము నెఱవేర్పునదియె సతి యగును గదా. 74

తే. అనుచు సంతోష మొదవంగ నాడు నవస
రమున నొక యాచకుఁడు వచ్చి రభసమునను
కరవిభూషితదానకంకణున కెలమిఁ
బెద్ద గొంతెత్తి యిట్లని విన్నవించె. 75

*ఉ. వేఁడిమి వెలుంగు కాఁకలకు వేగిన కొండలకు దావవహ్నిసం
పీడిత కాననంబునకుఁ బెల్లగు చల్లదనంబు గూర్చి బల్
పోఁడిమి మై నదీవధము ఖుం బరిపూర్తిగ నింపి రిక్తమై
నాఁడవు నేటికిట్టుల ఘనా! మఱి యీ డెవరయ్య నీ కిలన్. 76

* శ్లో. ఆశ్వాస్య పర్వతకులం తపనోష్మతప్త
ముద్దామదావవిధురాణి చ కాననాని ।
నానానదీనదశతాని చ పూరయిత్వా
రిక్తోఽసి యజ్జలద సైవ తవోత్తమశ్రీః ॥ (భో. చ.)

• మ. అని యాచించిన వానిఁ జూచి కవి సు ॥ న్నయ్యెన్ ధనం బెల్ల మె
త్తని నామానస మెప్పు డీయఁగను సి ॥ద్ధం బీదురాశా ప్తి యా
చన నాకొప్పదు గూడ దాత్మవధయున్ ॥ సాగింపరాదో క్షణం
బును నాలస్యము సేయ కింకఁ బయనం ॥ బున్ బ్రాణసందోహమా! 77

* శా. దారిద్ర్యానలకీల లెట్టులొకో శాం ॥ తంబౌను సంతోష మన్
వారిస్తోమముఁ జిల్కరించిన మనో ॥ వాంఛాళిభగ్నంబులై
గారింపంబడు నర్థిబృందముల నేఁ ॥ గాంచంగ నాగుండెలో
నౌరా! పుట్టెడుఁ బెద్దమంట లెటు శ ॥ క్యంబౌను వారింపఁగన్. 78

** చ. కలి విటు కాలిపోవ నెట ॥ గల్గును బిచ్చము పెట్టువాఁడు, సుం
దరి ఋణ మెట్లు పుట్టు? ధన ॥ ధాన్యము లిచ్చి యెవండు కర్మముల్
వఱలఁగఁ జేయు విప్రుల ది ॥ వాకరబింబము గ్రుంకె భుక్తియున్
దొరుకదు జీవయాత్ర కడు ॥ దుర్లభ మౌ విధి యిట్లు వ్రానెనా? 79

చ. అని నిజజాయతోఁ బలికి ॥ యాతఁడు చాల విషణ్ణుఁ డౌటఁ గ
న్గొవి యిట నుండ నింక మన ॥ కున్ బని యేమని కోర్కి తీఱకే
చని రెటకో తదర్థిజన ॥ సంఘము వారిని జూడలేక యా
యనకనులొయ్య మూసికొనె ॥ యార్చె నిటుల్ శిలలున్ద్రవింపగన్ 80

• శ్లో. అర్థా న సన్తి న చ ముఞ్చతి మాం దురాశా
త్యాగాన్నసఙ్కుచతి దుర్లలితం మనోమే ।
యాచ్ఞాచలాఘవకరీ స్వవధే చ పాపమ్
ప్రాణాస్స్వయంవ్రజత కిన్నువిలమ్బితేన॥ (భో. చ.)

* శ్లో. దారిద్ర్యానల సన్తాపశ్శాన్తస్సన్తోషవారిణా ।
యాచకాశావిఘాతాన్తర్దాహః కే నోపశామ్యతి. ॥ (భో. చ.)

** శ్లో. నభిక్షా దుర్భిక్షే పతతిదురవస్థాః కథమృణం
లభన్తే కర్మాణి ద్విజపరివృఢాన్ కారయతికః? ।
అదత్త్వైవ గ్రాసం గ్రహపతిరసౌ వస్తమయతే
క్వయామః? కిం కుర్మః? గృహిణి! గహనో జీవనవిధిః॥ (భో. చ.)

* శా. పంచప్రాణములార! పొం డెచటికో § వ్యర్థాశులై యర్థులి
ట్లెంచన్ రాని యవస్థలం బడుచుఁ దా § మిట్లేఁగుచున్నారు తత్
ప్రాంచత్స్వార్థతకన్న నెద్ది వలయున్ § భాగ్యంబు? వెన్వెన్కనే
కించిత్కాల ముపేక్ష సేయకయె సా § గింపుండు మీయానముల్. 81

మ. అని కంఠోక్తిగ నాజ్ఞలన్ నుడువ తన్ § బ్రాణానిలం బట్లు చే
సెనుగా చేయకయుండు టెట్లు మఱివా § సిన్ వన్నెయుం గాంచి స
జ్జనసాంగత్యము చేసి యుత్తమకవీ § శాజ్ఞల్ శిరంబందు బూ
నినవారేగద ధర్మమార్గగురుతా § నిర్వాహకుల్ భూమిపైన్. 82

తే. ఎల్లవృత్తాంత మెఱిఁగి భో § జేశ్వరుండు
స్వయముగా వచ్చి మాఘుని § పత్నితోన
తాను దుఃఖింపఁగా రాలు § లోన కరఁగి
నీరులై పాఱునట్లయ్యె § నిక్కముగను. 83

కం. మాయిల్లు విడిచి వచ్చితి
మే యని శోకింప నిప్పు § డే నీపురి మా
దే యనుచుఁ దలఁచెదను నే
నోయనఘా! మీఁది కార్య § మూహింపఁ గదే. 84

కం. అని మాఘు కొమ్మ నుడివిన
జననాథుడు వనట కొంత § శాంతింపఁగ మె
ల్లన మిత్రుశవము నర్మద
ఘనతీరము చేర్చి యంత్య § కర్మము నడిపెన్. 85

తే. అంతవానికి నిల్లాల § నైన నాకు
నతఁడు వోయిన నిందించు § కైనఁ గాని
కార్య మున్నదె యని సహ § గమనమునకు
నరిగి పతిచితివహ్నిలో § నుఱికె సాధ్వి. 86

* శ్లో. వ్రజత వ్రజత ప్రాణా అర్థిని వ్యర్థతాం గతే ।
పశ్చా దపి హి గన్తవ్యం క్వసో ఽర్థః పున రీదృశః ॥ (భో.చ.)

సీ. సురకార్యమునకుఁ జెఁ | చ్చెర వెన్నెముక నిచ్చె
నల్ల దధీచి కే | తందియాయ
నొక చిఱుపాము కై | యొడలు గరుడికిచ్చె
యక్షరా జొక కర | మంటిపట్ట
దేగమేఁతఁగను ఖం | డించి దేహము నిచ్చె
శిబి చుబుకము ముట్టి | సేమమడుగ
గుజ్జు యాచించుట | కున్ద్రిలోకి యొసంగు
బలిముందు తా బరా | బరులు సలుప
తే. సహజకుండలవర్మముల్ | స్వర్గపతికి
దాన మిచ్చిన కర్ణుండు | తనపదాబ్జ
యుగళిపైఁ జూడ్కి నిల్పి యో | హో! యనంగ
జాయతోఁడుత మాఘుండు | స్వర్గ మేఁగె. 87

తే. మాఘకవిచంద్ర! నాదొక | మనవి గలదు
పెద్దవాఁడను సుమ్మి నా | పెద్దతనము
నీవు గాపాడవలె సుమీ | యింద్రు ప్రోలి
ననుచుఁ గవిఁజేరి సురగురుం | డొనరఁ బలుకు. 88

తే. ఎంత సంపూర్ణులైన స్వ | ర్గీయు లెల్లఁ
గొత్త తముఁ జేరు కవిరాజు | గుర్తెఱింగి
మన్ననలఁ జూపి తమలోన | మలపికొనుట
లాత్మగౌరవవృద్ధికి | నగుట నిజము. 89

సీ. చరణవిన్యాసంబు | సరణి తెల్పెదొ సుమీ!
దాని నేర్పెను కవి | తకు నితండు
సంగీతమున నప | స్వరము పాడెదొ సుమీ!
గానంబు నేర్పెను | కవితకితఁడు
అక్షరరమ్యత | లలఁతి చేసెదొ సుమీ!
భువి కైతకును నేర్పి | పొలిచె నితఁడు
అర్థసంపదలఁ దెప్ప | భావయించెదొ సుమీ!
కవితకు శిక్ష నేర్పి | దవిలె నితఁ

తే. దనుచు నచ్చరల్ గుజగుజ లాడుకొనుచు
నాటపాటల జరిగింతు రమరవిభుని
కొలువుకూటంబునందునఁ గూర్మిమీఱ
వెలసి యాసీనుఁడై మాఘుఁ డలరువేళ. 90

కం. రసవంతమైన కావ్యము
ప్రసిద్ధిగను జెప్పునట్టి పండితకవి పెం
పెసఁగ నిడు దానవీరుం
డెసఁగుదు రిహపరసుఖంబు లెయ్యెడనేనిన్. 91

కం. ఇది పూర్వగ్రంథంబుల
నుదితంబగు గాథనుండి యొప్పు దలిర్పన్
గదియించినాఁడఁ జోఁచిన
యదనులఁ బెంచితిని నే రసార్థం బంచున్. 92

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన
"మాఘకవి చరిత్రము" సంపూర్ణము.



శ్రీ ర స్తు.

# శ్రీ మ దాం ధ్ర మా ఘ మం

## [ శిశుపాలవధ మహా కావ్యము ].

## ప్ర థ మా శ్వా స ము.

—*—

### —* నా ర దా గ మ న ము *—

మ. సిరి మోహించిన వన్నెలాఁడు భువన § శ్రేణీభరంబున్ నిజో
దరమధ్యంబునఁ దాల్చి సర్వజగతీ § త్రాణార్థమై దేహముల్
వరియింపంగలజాణ శౌరి వసుదే § వప్రాజ్యహర్మ్యాంతర
స్ఫురదావాసుఁడు గాంచె నింగి డిగు నం § భోజాతజాతాత్మజున్. 1

చ. ఇనుఁడు చరించు నడ్డముగ, § నింగలపుంగొన పైకి లేచు, గా
వునఁ బరికింప నిక్క మిది § ప్రొద్దును గా దనలంబుఁ గాదు; నూ
తన మగు తే జొకండు వసు § ధన్ వెలయించుచు వచ్చు నంచు భూ
జనములు తొట్రుపాటు పడ § సాగిరి తన్మునినాథు రాకకున్. 2

చ. హరియుఁ దలంచెఁ దొల్తఁ బర § మాద్భుత తేజ మటంచు నవ్వలన్
గరచరణాది సంయుత మొ § కానొక వ్యక్తి యటంచు నాపయిన్
బురుషుఁ డటంచుఁ బిమ్మటఁ ద § పోనిధి నారదుఁ డంచు నుర్వికిన్
సరగున దూరముల్ దఱుగ § సాగు కొలంది క్రమక్రమంబుగన్. 3

ఉ. చారుతుషారహీరఘన § సారసితచ్ఛవిదివ్యసుందరా
కారముతో వినీలనవ § కంధరబృందము క్రింద నాతఁ డొ
ప్పారె భుజోపరిస్థలి గ § జాజిన మొయ్యఁ ధరించి భూతి నిం
పారెడు మేనితో వెలయు § నట్టి శశాంకకిరీటుఁ బోలుచున్. 4

ఉ. శారదచంద్రచంద్రికల § సౌరునఁ బోఁచెడు మౌనివర్యుఁ డం
భోరుహకేసరద్యుతుల § పొల్పున మీఱు జడల్ ధరించి యొ
ప్పారె హిమస్థలీభవము § లై తమయంతన పండు తీవలన్
దీరుఁగఁ దాల్చు శైలవిభు § తీరును సారెకు గేలి సేయుచున్. 5

ఉ. తెల్లని తక్కు గుల్కు మెయిఁ దీరుగఁ గాంచనసూత్రబద్ధ మౌ
నల్లని చేలఁ దాల్చి బల నాముని రాముని గోము నోమి రం
జిల్లెను దెల్ల నౌ మెయినిఁ జెన్నగు పచ్చని మౌంజిబద్ధమై
నల్లని దైన లేడియజి నంబు ధరించిన మౌని యెంతయున్. 6

ఉ. తుంగశరద్ఘనంబు కడుఁ దోఁచు మెఱుంగులఁ బోలి పక్షిరా
డంగతనూరుహాయతము లౌచు హిరణ్మయభూమిఁ బుట్టుటన్
బంగరురంగు లీను నును వల్లుల తంతువు లచ్చకాంతు లు
ప్పొంగెడుమేన జందెముల పొల్పు వహింపఁగ మౌని భాసిలెన్ 7

ఉ. మూఁపున రంగురంగు మెఱు పుల్ గల మచ్చలతోడి లేడి తో
లేపునఁ దా ధరించి తను వెల్ల బిసాంకురధాళధళ్యముల్
తేపకుఁ జిమ్ముచుండ ముని దేవుఁడు బభ్రతనాలమించు వా
దాపస మీఱు దేవవిభు దంతి విధంబునఁ దోఁచె నెంతయున్. 8

చ. సతతము వీణెతంతి వరు సన్ సరి సేయఁగ మీటుచోఁ దదా
హత బొటవ్రేలిగో రరుణ మై యెదు రౌ నగమున్ బ్రవాళ గుం
ఫిత మనిపింపఁ బొల్చెడి ప విత్రతరస్ఫటికాక్షమాలతో
నతితర ముల్లసిల్లుచు మ హాముని కానఁగ నయ్యె నయ్యెడన్. 9

చ. మతిమతి గాలి సోఁకి శ్రుతి మండలముల్ నెదరన్ విభిన్న వా
స్వరములతో స్ఫుటం బగుచు జానగు గ్రామవిశేష మూర్ఛనల్
గర మెసలారఁగా శ్రుతిను ఖంబుగఁ బ్రోఁగుచు నున్న స్వీయమౌ
వరమహతిన్ గటాక్షవిభవంబునఁ జూచుచుఁ దోఁచె మౌని దాన్. 10

కం. తను సాఁగ నంప వెంటన్
జని మోక్షిక్కి సుతో నిలుక తాలుము తాకుం
దని యోశర్వజ్ఞుఁడు వ
జ్రినిలయమునకు మైన జైత్య తెవ్వ నితు నేరెన్. 11

ఉ. క్రిందికి వచ్చుచున్న రవి తేజి వెలింగెడి తాపసుండు గో
విందు పురప్రదేశగతి పృథ్విఁ బదంబు బిడ నుండు వంతతో
డెందమునన్ వితర్కుండులగ దించి ముదం బిరవొంద హేమపి
ఠం బొసఁగి లేచె గిరి దగ్గ పదాదము తీఱు నాతఁడున్. 12

చ. జతనముతోడ నెత్తినను జయ్యనఁ గ్రుంగెడు నుత్తమాంగసం
తతి సురగోత్కరంబు లెటొ దాలిచి మోయఁగ నిల్చు ధారుణీ
శతధృతినందనుండు చరణంబులు రెండు జగంబు మెచ్చఁగా
దితిజవిరోధి కట్టెదుటఁ దీరుగ నిల్పి ముదంబు గైకొనెన్. 13

ఉ. వెన్నుఁడు నాదిపూరుషుఁడు వేడుకఁ గూరిచె నర్ఘ్యపాద్యముల్
సన్నుతభక్తితోడ రభసంబునఁ బూజ్యున కాతపస్వికెం
దున్నతపుణ్యకర్మఫలయోగము గల్గనివారి యిండ్లకున్
మన్ననఁ జేరఁబోరుగదః మాన్యసుధీజనపూర్ణచంద్రముల్. 14

చ. జను లటు వారు నిల్వఁగఁ "దుషారమహీధర మంజనాద్రి" యం
చనుకొనుముందె సత్వరమ నర్ఘమణీమయహేమమంగళా
సనమును దాన తెచ్చి యిడె సాదర మందునఁ గూరుచుండఁ బె
ట్టెను మునిరాజు నారదు వడిన్ సుచిరంతనమౌని శౌరి తాఁ 15

తే. సుప్రసిద్ధమహాసీలశోభితాంగుఁ
డైన హరి ముందరాసీనుఁ డైన మౌని
యపరసంధ్యకు నెదురుగా నమరు పొడుపుఁ
గొండ వెలయించు రేఱేని కొమరుఁ గాంచె. 16

ఆ. తగు సపర్యఁ జేసి తన్నె నమ్మునిచంద్రు
యాజకప్రియుండు యదువరేణ్యుఁ
డార్యజనులఁ బూజ నలరించి తమవారిఁ
జేసికో మహాత్ము లాసపడరె? 17

ఆ. ముని యశేషతీర్థములనుండి తెచ్చు క
మండలూదకముల మహితపాణిఁ
బట్టి చల్ల హరియుఁ బాపహరము లని
శిరము వంచి కొనియెఁ బరమభక్తి. 18

చ. మునిపతి యానతీయ, యదుపుంగవుఁ డంబుదబృందనీలకాం
తిని వెదచల్లు నాత్మ తను దీధితు లొప్ప హిరణ్యపీఠిపైఁ
దవరఁ దదాసనంబు వితతంబగు నేరెడుచెట్ల నొప్పు కాం
చనవగశృంగలక్ష్మిఁ గనఁ జాలెను దత్సమయంబునందునన్. 19

తే. హరియుఁ జందురు కందును ƒ నవఘళించు
మేనిపైఁ గుందనంపుఁ గ ƒ డాని వలువఁ
దాల్చి బాడబజాతవే ƒ దఃపరీత
మైన యంభోనిధికి సాటి ƒ యై తనర్చె. 20

ఉ. ఆవసుదేవనందను స ƒ మంచితవిగ్రహనీలకాంతులున్
దేవమునిప్రకాండు మెయి ƒ తెల్లనికాంతు లొకళ్లొకళ్ళతో
నావట మౌ నటుల్ మిళిత ƒ మై నిసిఁ జెట్లఁ జలించుచున్న ప
ర్ణావలి సందులన్ వెడలు ƒ నైందవదీప్తు లటుల్ విరాజిలెన్. 21

తే. పొదలు చీఁకటిమ్రాఁకుల ƒ పూల నల్వ
లల్ల యేడాకుటనఁటుల ƒ యలరుఁ దెల్వ
లొనర నొండొంటితోఁ గల ƒ సిన బెడంగు
గనిరి హరియును నారద ƒ మునియు నంత. 22

తే. మునివరుని రాక నుదయించు ƒ ముదము హరికిఁ
బట్టరాకుండెఁ దనువునఁ ƒ బ్రళయకాల
సంహృతానంతలోకసం ƒ చయము నిల్వఁ
జాలు విస్తీర్ణఘననివా ƒ సంబ యయ్యు. 23

తే. ఇనుని మించిన డాలుతో ƒ నెనయు మునినిఁ
గాంచి ముదమున విప్పారు ƒ కన్నుదోయి
శ్రీలు చిలుకుచు హరి పుండ ƒ రీకనయనుఁ
డనెడు నామమ్ము సార్థక ƒ మ్మును బొనర్చె. 24

తే. దంతకాంతుల తెల్వ స్మి ƒ తంబు తెల్వ
మేళవించుచు మునిరాజు ƒ మేనిమేడ
వెల్ల పూయుటకో యన ƒ వెన్నుఁడు ఋషి
వరునితో నిట్టు లల్లలఁ ƒ బలుకసాగె. 25

చ. మునుపటి పుట్టునం దొలయు ƒ పున్నెపుఁ బంటకుఁ జేను భావిశో
భనచయహేతు వద్యతన ƒ పాపతమోఽర్కమహోదయంబు పా
వనభవదీయదర్శనము ƒ ప్రాణుల కెల్లరకున్ గనంగ నో
యనఘ! యిటుల్ త్రికాలముల ƒ యందును యోగ్యత వ్యక్త
మయ్యెడున్. 26

చ. కరములు వేయి గల్గియు జ x గంబు మహోద్యుతి వెల్గఁజేయు భా
స్కరుఁడును ద్రోవఁజాలని ని x గాఢతమఃపటలంబు నో మునీ
శ్వర! భవదీయశుద్ధతర x వాగ్జనితం బగు తేజ మొక్కఁ డ
చ్చెరువుగఁ బాఱఁద్రోలు నిఁకఁ x జెప్పెడి దేమి భవత్ప్రభావముల్. 27

తే. అక్షయం బగు పెన్నిధు x లైన వేద
చయము లార్జించి వాని ర x క్షణ మొనర్ప
నీవ పాత్రమ వని బ్రహ్మ x యిచ్చె నీకుఁ
బ్రజకు క్షేమంబు కలుగు నీ x వలన ననుచు. 28

తే. పాపదూరుండ వైన యో x వరమునీంద్ర!
నిన్నుఁ గన్నంతమాత్రనే x నేఁ గృతార్థుఁ
డైతి, నైనను నీపల్కు x లతిహితములు
వినఁగఁ గాంక్షింతుఁ దృప్తి క x ల్గునె శుభముల. 29

చ. ఎఱుఁగుదు నిస్స్పృహుండ వని x యియ్యెడకున్దయసేయ హేతువున్
బరమఋషిప్రకాండ! తెలు x పంగను వేడుట సాహసం బగున్
గరమును నాయెడం గలుగు x గౌరవమున్ బ్రకటించు నీదు రా
క, రహిఁ దలిర్పఁ బ్రశ్న మడు x గన్ బురికొల్పు ననల్పభంగిమై 30

చ. అని వచియించు వెన్నుఁ గని x యబ్జభవాత్మజుఁ డిట్టుఁ బల్కె ని
ట్లనఁ దగునయ్య? నీవును య x థార్థముగాఁ బురుషోత్తమాఖ్య నిం
పెనయుదు; విట్టి నిన్నుఁ గను x టెంతటి యోగులకేని కృత్య మౌ
నన భవదీయదర్శనము x కంటెఁ బ్రయోజన మన్య ముండునే? 31

శా. కామాద్యుద్ధత చోరరోధన మహో x గ్రంబై జనం బెన్నడే
నే మాత్రంబును బోమి దుర్గమము నై x యేపారు మోక్షాధ్వమున్
దామై పొందఁగఁ గోరు ధీరులకుఁ ద x థ్యం బుజ్ఝితాపాయమై
నేమం బబ్బెడి యగ్రభూమివి పరీ x క్షింపంగ నీవే కదా! 32

తే. మనసు నేకాగ్రముగఁ జేసి x మహితదృష్టి
నాత్ముఁడు తటస్థుఁడు ప్రకృతి x కన్యుఁడు వికృ
తికిని బాహిరుఁ డని యాడి x ధీరు లరసి
నిర్వచించిన వస్తువే x నీవు గావె? 33

తే. పూని లీలగ నెత్తిన * భూతలము భు
జంగమౌకమ్మునకు సమా * చ్ఛాదనముగఁ
జక్క నెలకొల్పితివి జగ * త్పతి వగుట
స్తంభమున నిల్పి శేషాహిఁ * దచ్ఛిరముల 34

ఉ. నీదు పురాణమూర్తికిని * నిక్కము మించిన దుండ దెద్దియున్
నీదు స్వరూపతత్త్వగుణ * నిర్ణయ మెవ్వ రెఱుంగలే రిలన్
నీదు మనుష్యదేహమున * నీరససంస్కృతి గెల్చి ముక్తికిన్
దావగు జ్ఞానశక్తి నెఱ * పంగ సురాసురపంక్తి గ్రింబగున్. 35

చ. దురితభరంబు మాన్ప భువిఁ * దోరపులాఘవమున్ ఘటింపఁగా
సురభువనంబు వీడి యిటఁ * జొక్కపు మేల్తను వొందినాఁడ వీ
వరిది దయారసంబునఁ గ * దా! త్రిజగంబును గుక్షి నిల్పి యున్
ధరకు గణింపరాని గురు * ధర్మము గూర్చితి వెంత చిత్రమో! 36

చ. ప్రకటభుజాబలంబున ని * రంతరమున్ ద్విజ నేఁచు లోకకం
టకుల స్వవిక్రమంబున న * డంపఁగ భూమి జనింపవేని యు
త్సుకత సమాహితోత్తమమ * తుల్ సయితంబు గనంగలేని ని
న్నకటా! యొకైనఁ గాంచఁగల * రా? మముఁబోఁటులు చర్మచక్షువుల్. 37

చ. స్థిర మవి దోర్బలంబులు మ * దించిన దుర్జనకోటిచే నిరం
తరము మూల్గుచున్న వసు * ధాస్థలిఁ గావఁగ నీకుఁ దక్కనె
వ్వరికిఁ దరంబు? నాకసము * పై నిసిఁ బర్విడి కాఱుచీఁకటిన్
దఱిమెడి శక్తి భానునకుఁ * దక్క మఱొక్కని కింత యున్నదే? 38

తే. అల హిరణ్యాక్షముఖ్యదై * త్యద్విపముల
నడఁచి హరి వైన నిన్ను లే * [illegible] కంస
ముఖ్యులను జంపుటకు జన * మ్ములు పొగడుట
లరయఁ దెగడుట గాఁగాని * యన్య మగునె? 39

మ. ఒకఁ డర్థింపకె నీకు నీవ కడు ను * ద్యోగింతు లోకారులన్
వెకలింపంగ నౌటైన నీదు చెవి ని * న్పింతువె రహస్యంబు వే
పకలేశా! నినుఁ జేరి పన్నఁ గవి నీ * సంబంధి నై యున్న నా
కొక వాచాలత యుద్భవించి పలుకన్ బ్రోత్సాహమున్ గూర్చెదున్ 40

—* శ్రీకృష్ణునకు నారదుం డింద్ర సందేశమెఱింగించుట *—

ఉ. ఇంద్రుఁడు చెప్పి రమ్మని యుపేంద్ర! రహస్య మొకండు పల్కె నా
గేంద్రశయాన! నన్ననిపె; నిప్పుడ చెప్పెద దాని నీవు ని
స్తంద్రమనస్కతన్ వినుము సర్వజనీనము సుమ్మి యద్ది యా
యింద్రుని సర్వకార్యభర మెప్పుడుఁ బూనెడువాఁడ వీవె కా. 41

కం. బలవద్రిపుభయ మెఱుఁగఁడు
బలరిపు సిరి కొల్లగొనును భాను సముం డౌ
వలఁతి దితి సుతుఁడు మేదినిఁ
గలఁ డొక బలియుఁడు హిరణ్యకశిపుం డనఁగన్. 42

తే. పరుల సుఖముల కపకార పరత నుంట
నతని కసురాభిధాన మన్వర్థ మయ్యెఁ
జిరము నట్లుండి తొలుదొల్త సురల మనసు
భయసమేత మొనర్చిన ప్రథముఁ డతఁడు. 43

ఆ. వీరభోజ్య లౌట వివిధదిక్పతిలక్ష్ము
లసురపతినిఁ గోరి యచట నిలువ
రించె నంత నుండి శ్రీలు చంచల లను
నపయశంబు గాంచె నవి ధరిత్రి. 44

తే. అసురక్షితిని రూపశోభైకఫలము
లగు పురంబులు దుర్గంబులుగను, నాయు
ధములు శితముగఁ గవచాల్ దృఢముగ సేన
ననుపమౌజమ్ముగాఁ జేసి కొనరె సురలు. 45

తే. అన్యభువనంబులో దివిజారి విడిసి
యరిది సిరి గొను నేదెస నాదిశ కభి
ముఖు లయి సురల్ త్రిసంధ్యమ్ము మ్రొక్కెచంద్రు
వణఁకు కేల్గవ మకుటాగ్ర మణుల నిలిపి. 46

శా. ఆకాశస్థపయోదభేదనచణం బౌ కేసరశ్రేణి గ్రీ
వాకమ్రస్థలి జాలువాఱ హరిరూపం బర్థమందున్ మను
ష్యాకారం బఱమేనఁ గైకొని నృసింహా! ముగ్ధకాంతాకుచో
త్సేకక్రీడల మెత్తనైన నఖపంక్తిన్ జీల్పవే దైత్యులన్. 47

ఉ. అంతటఁ బోక క్రమ్మఱ సు ♦ రాంతకుఁ డాతఁడు రావణాఖ్య జ
న్మాంతర మొంది, దర్పమున ♦ నబ్బిన బాహుల తీఁట దీఱ న
భ్యంతర మింత లేక దివి ♦ జావళిఁ జెండి దివంబు నాత్మసం
క్రాంత మొనర్చి పేర్చి త్రిజ ♦ గద్భయకారణుఁడయ్యెనే కదా! 48

కం. లోకత్రయసామ్రాజ్య
శ్రీకాముఁ డతండు దశమ ♦ శిరము తఱుగఁబో
శ్రీకంఠుఁ డిష్టవర మిడి
ప్రాకటవిఘ్నము నొనర్చె ♦ రా యని తలఁచెన్. 49

కం. వరమూల్య మిడెను దోడ్తో
హరునకుఁ గైలాస మెత్తి ♦ యాతండు త్రస
ద్గిరిజాససంభ్రమమనో
హరసుఖహేతుస్వయంగ్ర ♦ హాలింగనమున్. 50

ఉ, కట్టెడి యై మహేంద్రు పయిఁ ♦ గట్టలుకన్ వహియించి. పాకజిత్
పట్టన మాక్రమించెఁ జెఱ ♦ పట్టె సురాంగనలన్, మహార్ఘ మై
నట్టి మణుల్ హరించె నుఱు ♦ మాడెను నందన మెల్లఁ బెక్కు మా
ర్గిట్టు లహర్దివంబుఁ గన ♦ నీఁడ సురారి దివంబు స్వస్థతన్. 51

మ, అని దైత్యేశుఁడు వెన్నడిన్ దఱుమ నా ♦ కాధీశుఁ డైరావతం
బును మెచ్చండు సలీల యానముల కు ♦ బ్బున్ జెంది యుచ్చైశ్శ్రవం
బును శ్లాఘింపఁడు చిత్రవల్గనవిధం ♦ బుల్ గాంచి కానీ తదీ
యనితాంతస్యదయాన మొక్కటియె కొం ♦ డాడున్ భయభ్రాంతుఁడై. 52

తే. విబుధవిద్వేషివరుని, వే ♦ వెలుఁగునట్లు
గనులు చలియింపఁ గనలేక ♦ కౌశికుండు
హాటకాద్రిగుహాగృహా ♦ భ్యంతరములఁ
గడిపె దివసమ్ములను భయ ♦ గ్రస్తుఁ డగుచు. 53

ఉ. చట్టులఁ బోలి దిట్ట మగు ♦ శత్రుగళంబులఁ దాఁకి నిప్పుకల్
పుట్టఁగ విక్రమించెడి య ♦ మోఘ సుదర్శనచక్రధారయున్
గట్టెడి యైన రావణుని ♦ కర్కశకంఠము నొక్కటైననున్
గొట్టకపోయె నయ్యదియుఁ ♦ గొంకెనో వానికి లోకనాయకా! 54

తే. మదమున సురారి యేనుంగు మాడ్కి రేఁగి
శంఖభంగ మ్మొనర్చి పుష్పకముఁ జెఱచి
వితతగాంభీర్య మెడలంగ విత్తనాథు
మానసమ్ముఁ గలంపక మానఁడయ్యె. 55

తే. వరుణుఁ డురివోసి యేసిన యురగపాశ
తతు లసురఁ జేరి యతని హుంకృతుల బెదరి
మరలి వేవేగ పర్విడి వరుణు మెడనె
చుట్టుకొన్నవి యురిత్రాళ్ల చొప్పుదనర. 56

మ. ఒక యుద్ధంబున సంభవించిన దురుద్యోగంబు విన్నావె? వా
శక యా రక్కసి క్రొత్త విల్లొకటి నిర్మాణంబు గావింప నో
ర! కృతాంతప్రభు దున్న కొమ్ములనె బీరం బొప్పఁగా బల్మి లా
గుకొనెన్ దానఁదలెత్త దాయె నది వ్రేఁగున్ బాసియున్ సిగ్గునన్. 57

తే. శుచిసమయుఁడయ్యు స్వకరాగ్ర శోభ లంటి
యంట కుండనె దితిజు భయాన వాని
కాంతల కదుష్ణతాలస ద్ఘర్మ బిందు
మౌక్తికాలంకృతుల నిడి మనె నినుండు. 58

తే. కళలఁ బరిపూర్ణుఁడై వాని నిలయ మెడయ
కన్ను మిన్నల నెయ్యంపు టలుక లుడిపి
యసురపై హాళిఁ గల్పింప ననుదినంబు
నర్మసాచివ్యమున శశి నలఁగుచుండు. 59

ఆ. తన విలాసినులకు దంతపత్త్రికలఁ గూ
ర్పఁగ విలాసి యతఁడు వారణాస్య
దంత మొకటి పెటికెఁ దథ్య మిప్పటికిని
మఱల నద్ది మొలవ నెఱుఁగ దయ్యె. 60

ఉ. అంతిపురంపుటింతుల యధోఽంశుకముల్ గదలించి యా నభ
స్వంతుఁడు వారి లోఁదొడల సొరులఁ జూపఁగ సంతసించు దై
త్యాంతకు నండఁ జేసికొని యయ్యెడ నేర మొనర్పకుండియున్
సంతతబాధ్యమాను లగు నాకుల ముప్పులఁ బాపి ప్రోచెడున్. 61

మ. పటుతేజోనిధి యైన రావణు ప్రతా § పజ్యోతికిన్ వీఁగి యు
త్కటచిత్తోదితవేదనుం డయి తనూ § కార్శ్యంబులం గాంచి, మి
క్కుటపున్ బాష్పము లొప్ప నిశ్శ్వసనభం§గుల్ మీఱఁగా నగ్ని వి
స్ఫుటధూమోత్కర మిన్ముడింప మిడుకున్§శోకార్తిసంతప్తుఁడై. 62

సీ. పరమర్మభేదన § పాటవాంచితకళా
విభవపారీణత § విడిచిపెట్టి
లోకప్రసిద్ధదు § ర్లోలద్విజిహ్వతా
యోగ్యదుర్వర్తన § ముజ్జగించి
ఋజుమార్గగామి స § ద్ద్విజుల కనిష్టమౌ
వక్రస్వభావ మ § వ్వలకుఁ ద్రోచి
బహుళ మహాపాప § భరహేతుకం బైన
స్వీయభుజంగతా § చేష్ట మాని
తే. యాత్మచక్షుశ్శ్రవస్త్వంబు § నవలఁ ద్రోచి
కర్ణయుగముల ధరియించి § కరచరణము
లడర నెమ్మేన వంకర § నడక మాని
పాఁపజాతియు నానీచు § భక్తిఁ గొలిచె. 63

మ. సురశత్రూన్మదదంతిహస్తహతికిన్ § క్షుభ్యత్కపోలాచ్ఛదు
ర్భరదానోదకధార చెక్కుడిగి జా § ఱన్ గుండియల్ జాఱఁగా
హరిదంతంబుల దాఁకఁ బర్వి యచటన్ § బ్రాణావనేచ్ఛ న్నిరం
తరము న్నిల్వ గజంబు లెన్మిదియు ది § గ్దంతిప్రథన్ జేకొనెన్. 64

చ. విరహమహాజ్వరార్తుఁ డగు § వేలుపుగొంగకు దాప మార్పఁగా
వెరవులు గాకపోయె రణ § వీథుల బందెగఁ గొన్న దేవసుం
దరు లనిశంబు పుచ్చు పరి § తప్తపునిశ్శ్వసితంబులన్ బలెన్
సరసపుఁ జందనాంబుకణ § జాలలసద్వ్యజనానిలౌఘముల్. 65

తే. శిశిరఋతువు వసంతల § క్ష్మీసుమాంగి
రమణ హేమంతఋతువు శ § రద్వరాంగిఁ
జండమౌ గ్రీష్మఋతువు వ § ర్షాలతాంగిఁ
గూడి రావణు పురి నిల్చి § కుసుమము లిడు. 66

చ. అజుఁడ వమానుషుండవు న । హస్కరవంశసముద్భవుండవున్
నిజముగఁ దన్నుఁజంపుటకె । నీ వవతారము నెత్తినాఁడ వం
చు జనితబుద్ధి యయ్యు విరు । సుందన మెప్పఁగ సీత వీడఁడ
క్కజముగ వాఁడు పట్టుఁ బిడఁ । గా నభిమానధనుల్ దలంతురే? 67

ఉ. పాపులఁ జంప నీవు ముని । పంక్తిరథాత్మజుఁ డై జనించి యా
భూపతి యాజ్ఞఁ బోయి వన । భూమికి; సీత హరించినట్టి యా
పాపిఁ దరంగతుంగ మగు । వార్ధికి సేతువుఁ గట్టి వేగ లం
కాపురి కేఁగి చంపితివి । జ్ఞాపక మున్నదె? లోకనాయకా! 68

ఉ. అంతటఁ బోక వాఁడు మను । జాశనకాయము వీడి నవ్యవే
షాంతరమున్ నటుండు గొను । నట్లు ప్రతారణనైపుణీక్రమో
దంతము సాగ, నిత్తఱిని । దా శిశుపాలనృపాలభూమికన్
వింతగఁ దాల్చి దాఁచి తన । వెన్కటిపుట్టువు; నేఁడు గ్రుమ్మరున్. 69

తే. బాలకుండయి చందురు । వంటి మోము
మూఁడు కన్నులు నాలుగు । బుజము లొందె
యువకుఁడై నేఁడొ తేజున । రవిని మించె
నిజకరాక్రాంతభూభృత్త । నెడి ప్రసిద్ధి. 70

ఉ. ఇమ్మహి దేవదానవుల । కేన యనుగ్రహ మాగ్రహంబు, ని
త్యమ్ము నొనర్పఁగా బ్రభుఁడ । నాదిమదైత్యులు రావణాదిబృం
దమ్ము నిజేష్టదైవతప । దంబులఁ గూర్చి బలీయులైరి వా
రెమ్మెయి నాకు నీడగుదు । రే? యని నవ్వుచుఁ ద్రుళ్లుఁ గ్రొవ్వునన్

మ. బలగర్వంబునఁ దొంటి పుట్టుల బలెన్ । బాధించు లోకంబులన్
గెలువన్ గోరుచు వాఁడు నేఁడు నటు తా । నే కాదె జన్మాంతరం
బులనేనిన్ సతియౌ పురంధ్రి పగిదిన్ । బూర్వాశ్రయం బెంచి ని
శ్చలయై పొందును బూరుషున్ బ్రకృతియున్ । సత్యంబుగా నమ్ము మా.

శా. కానన్ బ్రహ్మకృతానుశాసనము ధి । క్కారించు నీముష్కరున్
గీనాశాలయవాసిఁ జేయుటకు శం । కింపంగఁ బోకయ్య య
న్యూనాపూర్జిత పత్త్రిమాపదురుబా । ధ్యుల్, సాధుబాధావినో
దానందాత్ము లవధ్యులే బుధనుత । వ్యాపారశూరాళికిన్. 73

కం. అరివధ మగునేని పురం
దరుని యురము ప్రథిమ మెనయ తన్ బులకలఁ గ్రి
క్కిఱియు చనుమొనల శచి తాఁ
దరఁగఁ గవుఁగలించు నొత్తనకుఁ దాఱకొనన్. 74

శా. ఈరీతిన్ ముని చెప్పి మిన్నొరసి పూర్ణేందుద్యుతిన్ వెల్గనోం
కారంబున్ బ్రకటించి చైద్యు నెడ నల్కన్ గొన్నయాశార్ఙ్గికే
పారన్ గేతువ వక్త్రమందు గగనంబం దట్ల తోఁచెన్ మహా
వైరిప్రక్షయసూచకంబు భ్రుకుటీవ్యాజంబునన్ జెచ్చెరన్. 75

ఇది శ్రీబుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
ద్వారకకు నారదుని రాకయు, శ్రీకృష్ణున
కిందప్రసందేశకథనంబు ననెడి
ప్ర థ మా శ్వా స ము
స మా ప్త ము.

—*—

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

## [శిశుపాలవధమహాకావ్యము].

### ద్వితీయాశ్వాసము.



—* మంత్రాలోచనము *—

తే. "యాగ మొనరింతు నరయ ర" మ్మని పృథాసు
తుండు పిలిచెన, చైద్యుపై దండు వెడల
వలసె నిప్పుడ యని మురవైరి కలఁత
నందె నించుక కార్యద్వయంబుఁ దలఁచి. 1

తే. అసురగురు దేవగురువరు లనుగమింప
నాకసంబునఁ దోఁచు శశాంకుఁ బోలి
యుద్ధవుండును బలరాముఁ డొయ్య వెనుకొ
నంగ విచ్చేసె హరి సభారంగమునకు. 2

తే. తివిరి జగతికి శాంతి సంధింపఁగోరి
వారు మువ్వురు మేలి సభాస్థలంబు
దివ్యమైన త్రేతాగ్నుల తేజుతోడఁ
జేరి యాసీనులై విరాజిల్లి రపుడు. 3

తే. అన్యు లెవ్వరు లేకున్న యచటి స్తంభ
రత్నముల వారి యాకృతుల్ ప్రతిఫలింప
వేలకును వేలు పురుషులు వెలసినట్లు
పరఁగె వారు కూర్చున్న సభాస్థలంబు. 4

తే. వార లాసీనులైనట్టి స్వర్ణపీఠ
ములు మృగేంద్రవిరాజిత భూమిభృత్త్రి
కూటముల సొంపుఁ దాలిచి కొమరు మీఱి
యున్నతము లౌచుఁ గనుపట్టి మన్ననఁ గనె. 5

తే. అయ్యెడ విచక్షణుం డగు హరియుఁ బెద్ద
లైన యా యిర్వురం గని యపు డవశ్య
మాచరింపఁగ వలయు కా ర్యద్వయమునఁ
గలుగు విప్రతిషేధంబుఁ దెలియఁ బలికె, 6

— శ్రీకృష్ణుఁడు బలరామోద్ధవులతో మంత్రాలోచనము చేయుట —

తే. కుంకుమకుళమ్ము లట్టె పల్కుదురు గల ము
కుందు నెమ్మొగమునుండి చిందు వాణి
సభ నలుంగడఁ బొలయు నా శౌరి లేఁత
నగవునన్ దోఁగి యుద్ధవ ర్ణగ వెలింగె. 7

ఆ. మీరు పలుకఁ దగు సుదారోక్తులకును బ్ర
స్తావమాత్రమె యగు నావచనము
నాటకీయ మైత నర్చెడి వస్తుప్ర
సంగమునకుఁ బూర్వ రంగ మట్లు. 8

ఆ. దిగ్జయం బొనర్ప ధృతి గల సోదరు
లెల్ల రాజులను జయించి కప్ప
మిచ్చువారిఁ జేసి; రేటికి మన మేఁగ?
శమనజుండె చేయఁ జాలుఁ గ్రతువు. 9

ఆ. హితముఁ గోరువాఁడు వృద్ధి నొందు విపక్షు
నింతయైనఁ దగ దుపేక్ష సేయ
నరయఁ బెద్ద దైన వ్యాధియుఁ బెంపొందు
నరియు నొక్కరూప యనరె బుధులు? 10

తే. నాకు మేనత్త బిడ్డఁ డై శిశుపాలుఁ
డలిగి నను నింద సేసిన నలయ నేను
జగము నీతఁడు బాధింప నోఁపలేని
వగల నొగులుచున్నాఁడఁ బగలు రేయు. 11

తే. తమదు మతము దెల్పెం దంతఁ దనుక నాదు
మతమె సమ్మతం బొచును మనుసుగాత
విదితసారుండె యయి యొరత విజ్ఞుఁడయిన
వొకఁడె యైవ సంశయతఁడై యుండుఁ గాదె. 12

తే. అనుచుఁ బ్రత్యక్షరంబు న ర్థాన్వితముగఁ
బలికి మిన్నకయుండె న న్నళిననాభుఁ
డారయ నుదాత్త చరితు లౌ నట్టివారు
ప్రకృతిచేతనె హితమిత భాషులుగద! 13

తే. అంత బలదేవుఁడు విరోధి యాగడములు
వినిన మాత్రన పొడమిన కినుక మెఱయు
వల్లభాధరబింబచుం బనచణ మగు
నోష్ఠ మదరంగ నిటు పల్కె నిష్ఠురముగ. 14

తే. పెద్దవాఁ డౌట కర్తవ్య వేది యౌట
నుద్ధవుఁడు పల్కఁబో రాముఁ డొయ్య నాపి
పలికె ముందుగ నుద్ధవ వాక్యవితతి
యెల్ల నుత్తరపక్షమై యెసఁగునటుల. 15

కం. కలు ద్రావిన కైపునఁ గెం
పొలయ మెఱసి, రేవతీము ఖోచ్ఛిష్టవిని
ర్మలము లగు తెప్పలొప్పఁగఁ
దళుకొందిన కనుల ఘూర్ణి తము లొనరుచుచున్, 16

తే. కౌఁగిటికి నాస సేయు నం గన తుటారి
చన్నుఁగవ బింకమునకును సాక్షి యైన
మృదులవనమాల గర్వవి జృంభితోష్ణ
ముఖసమీరణముల వాడి పోవుచుండ. 17

తే. సంజ కెంజాయ మెఱయు నిం గిం జెలంగు
రిక్కగమినాఁగఁబగతుని మొక్కలమ్ము
తలఁపునం బాఱ నెఱుపైన తనువునందు
స్వేదజలబిందువులు పుట్టి చిందుచుండ. 18

తే. కుండలంబులఁ గూర్చిన గొనబుకెంపు
టాకుల మిటారపుంజిగి యంసభాగ
మందుఁ దాల్చిన నీలనీ లాంబరములు
గున్నమామిడిచిగురుటా కుగ నొనర్ప, 19

తే. రేవతీకాంత పుక్కిట § లో వసించు
కమ్మతావి గుబాళించు § కల్లు చెల్మిఁ
గాంచి యాత్మీయవక్త్రాంత § రాంచిత మగు
కమ్మవలపులు నలుఁగడఁ § గ్రమ్ముకొనఁగ. 20

తే. మోముదమ్మికిఁ జెంతను § ముసురుకొనెడు
చంచరీకంబులను వెల్ల § మించు లెనయ
ధవళములఁ జేయఁగాఁజాలు § దంత పంక్తి
కాంతిఁ జిమ్మంగఁ బల్కె నీ § గతి నతండు. 21

—* బలరాముఁడు స్వాభిప్రాయముఁ జెప్పుట *—

తే. వాసుదేవుఁడు పలికెడి § పల్కు నిర్భ
యమ్ము, నిర్దోషమును, నౌచు § నలరుఁ గాన
నతఁడు నుడివెడునది యేది § యైనఁ గాని
తడయకయ చేయు టొకటె యు § త్తరము దలఁప. 22

సీ. కట్టెల మోపులఁ § గాల్చు విభావసు
కంటె భాస్కరు తేజు § ఘనము కాదె?
విస్తృతంబైన వా § గ్వితతికంటె మురారి
పలు కల్పమైన ని § స్తులితశక్తి
విపులార్థబోధక § విభవంబు దనరియు
నల్పసంఖ్యాకప § దాంచితంబు
గాఁగ నాడిన వెన్ను § కమ్రవాక్యములకుఁ
బలుపల్కు నే పల్కు § భాష్యమ యగుఁ

తే. గడువిపులు లైన వారల § మడువు లవుర
ప్రతిఘటించి వచించు వా § క్పతుల నైన
మూకుల నొనర్చు ననుకూల § ముగ వచించు
జడులనేని యొనర్చువా § క్చతురులుగను. 23

తే. ఆఱు గుణములు శక్తిత్రి § యంబు, మూఁడు
సిద్ధు లుదయత్రయం బంచుఁ § జెప్పుమాత్ర
చాలుదురు నీతిశాస్త్రపు § స్తకము లరిగ
మించి మిడిమిడి తెలివి దు § ర్మేధసాళి. 24

సీ. మదిలోనఁ గార్యంబు తుద మొదల్ చర్చింప
కుండు వాక్ఛూరు ధైర్యోక్తు లేల?
లక్ష్యమున్ గొట్టఁజాలని ధనుర్ధరుఁ డెంతొ
లీలకై చేయు వల్గితము లేల?
నయిదు స్కంధంబుల కన్యరూపాత్ముఁడౌ
యాత్ముండు లేఁడని యాడు బుద్ధ
భగవాను శిష్యుల పగిదిఁ బంచాంగంబు
కన్న మంత్రము కల్గ దవనిపతికి
తే. ననుచుఁ బల్కుదు మఱియు సర్వాంగవృతము
నయ్యు పరభేదశంకిత మగుచు మంత్ర
మొగి చిరస్థాయి కానేర దుర్వి నరయఁ
బూర్ణరక్షితుఁ డౌ జోదు పోలిక గద. 25

తే. ఆత్మవృద్ధియు శత్రుక్షయంబు ననెడి
రెండె సూ నీతిసార మీ రెంటి నూఁది
యేకదా నీతిశాస్త్రవివేకయుతులు
విస్తరించిరి తమ వచోవిభవ మెల్ల. 26

తే. ఎంత యున్నను దృప్తి యావంత వల్వ
దది మహాత్ముల కొక్క దృష్టాంత మరయఁ
బూర్ణుఁడయ్యు సముద్రుండు భూతికాముఁ
డగుచుఁ జంద్రునిరాకచే నలరుఁ గాదె! 27

తే. స్వల్పసంపద కెవఁడేని స్వస్థుఁ డంచుఁ
దలఁచు నవ్వాని సంపద దనర దింత
వృద్ధి యెన్నఁటికిని కృతకృత్యుఁ డౌను
విధియు నని యెంచుచుండు నీ విధిని నైన, 28

సీ. పూర్ణశత్రువినాశమును జేయకుండఁగా
మానధను లొకింత మానలేరు
గాఢాంధతమసంబుఁ గడముట్టఁ జేయక
రవి యుండఁ గలఁడె యుర్వరను జూడ

శత్రుసంహారంబు శ సల్పకుండఁ బ్రతిష్ఠ
యబ్బునే యెవ్వారి శ కైనఁ దలఁప
ధూళిని బురదగాఁ శ చోడ్తొ నొనర్పక
మానునే సలిల మెం శ దేనిఁ దలఁప
తే. నొక్కఁడైనను శాత్రవు శ డుండునేని
సుఖ మెటులఁ గల్గు నెందైనశసురలుచూచు
చుండ రాహువు పీడించు శ చుంతుఁగాదె
యమృతధాముని నిదియు దృ శ ష్టాంత మొకటి. 29

* ఉ. మేలును బట్టి మిత్రుఁడు న శ మిత్రుఁడు కీడును బట్టియైన నె
వ్వేళ స్థిరంబుగా సఖుఁడె శ విద్విషుఁడే యగుటన్ గరీయుఁ డిం
కోలిని బ్రాకృతుల్ సహజు శ లొక్కొక వేళల శత్రుమిత్రభా
వాల విపర్యయంబు గన శ వచ్చును నమ్మఁగ రాద వారలన్. 30

సీ. అరి పాత్రికృతుం డైన శ యటుగాక సహజుఁడె
యైనను మే ల్చేయు శ నేని సంధిఁ
జేయ నర్హుండౌను శ స్నేహితుం డట్టివాఁ
డపకారముల్ సేయు శ నట్టి డైన
వానితో సంధి నె శ వ్వా శొనర్పఁగ రాదు
సంధి కర్హుంబు లం శ క్షణములు లివియె
పాత్రిగు క్తకృతిమ శ పాత్రికృతవైరుల
యందుఁ జైద్యుం డొకం శ డనినఁ గాఁదె?
తే. ఏవి తల్లి తత్రితశ్రివ శ మేనయత్త
మనకుఁ దత్పుతుఁడౌట నీఁ శ డనఘ సహజ
మిత్రిమే యయ్యుఁ దా బద్ధ శ శత్రిఁ డగుచు
నెపుడు మన కె గ్గొనర్చుచు శ వే మెలంగు. 31

* తే. కృత్రిముఁడె శ్రేష్ఠుఁ డారయ శ మిత్రుఁడేని
వైరిమే నింక సహజుఁడౌ శ ప్రాకృతుఁ డటు
మిత్రుఁ డె విరోధి కావచ్చు శ శాత్రవుండె
సఖుఁడు గావచ్చుఁ గార్యవ శ సరముఁ బట్టి. అని ఏ కాంతరము.

తే. తాను బెండ్లాడ నున్న య౯ త్తఱిని రుక్మి
ణిని హరించి యాచైద్యుని౯ గినియఁ జేసి
తరయ స్థిరమూలముగ వైర౯ తరువు నిలిచి
వెలయఁగా స్త్రీజనమె తల్లి౯ వేఱు సుమ్ము. 32

తే. నరకుపై దండయాత్ర నీ౯ వరుగఁ జూచి
మోహరించుచు నీపురి౯ ముట్టడించె
నినుఁడు దొలఁగఁగఁ జీఁకటి౯ హేమశైల
తటము నలువంకఁ గ్రమ్ము చం౯ దమ్ము దోఁప. 33

ఆ. అల్ల బభ్రు వనెడి౯ యాదవు నిల్లాలిఁ
బతితుఁ డాతఁడు చెఱ౯ పట్టిన కథ
పలుకఁ దగునె? యిస్సి౯ ఖలుల సంస్మరణమ్ము
గూడఁ బాపమందుఁ౯ గూల్చుఁ గాదె. 34

ఆ. కీడు ముం దొనర్పఁ౯ గెరలు విపక్షు ను
పేక్ష చేయువాఁడు౯ దక్షుఁడైన
గాలి కెదురుగాఁగఁ౯ గక్ష్యమ్మునం దగ్ని
నిల్పి నిద్రవోవు౯ నియతి వాఁడు. 35

సీ. స్వల్పాపరాధముల్౯ చాల పర్యాయంబు
లైనను నొక్క మ౯ హాపరాధ
మొకసారి యైనను౯ నొనరించు నేని యా
విమతు మర్దింపంగ౯ వేగిరింప
కుండ క్షాంతి వహించి౯ యోర్వంగ వచ్చుఁగా
కనుమతుం డగు నేని౯ యట్లు గాక
పెక్కుసారులు రేఁగి౯ పెద్ద యొగ్గులఁ బూని
సలిపిన యేని యా౯ శత్రుజాల
ఆ. మింత చేయక వధి౯ యించుట కర్తవ్య
మగునుగాన నట్టి౯ యరిక బట్టు
దెగక నెవ్వఁ డోర్చు౯ జగత్త్రయం బందు
నిదియ నీతి యని గ్ర౯హింపఁ దగును. 36

చ. పరిభవవేళలందు మగ § వారికి శౌర్యము చెల్లు స్త్రీలకున్
సురతములందు సిగ్గు విడు § చొప్పున నయ్యది భూషణంబ యా
విరతము తక్కువేళలను § నీరజనేత్రకు లజ్జ కైవడిన్
బురుషులకున్ క్షమాగుణమె § భూషణ మౌ నని యాలకింపమే. 37

మ. పరసంప్రాప్తమహావమానదహన § జ్వాలావళీదగ్ధుఁ డై
ధరఁ బ్రాణాల ధరించువానికి నథోఽ § ధః పాతమే యబ్బు న
ద్దురితాత్ముండు జనింపఁడాజననిఁ జెం § దున్ గాదె సౌఖ్యంబు దు
ర్భరగర్భోద్వహనార్తియున్ బ్రసవ ఘో § రక్లేశమున్ లేక తాన్. 38

ఆ. కాలఁ దన్న ధూళి § వైళంబ తల కెక్కు
వానిఁ గ్రిందుపఱచు § వైరి పూని
పరిభవింప సైఁచి § స్వస్థుఁ డౌ నాదేహి
యట్టి ధూళికంటె § నధముఁడె కదః 39

కం. జాతిగుణకర్మసముచిత
మై తగు నొక యర్థ మేను § పార్జింపఁ డెవం
డాతని జాత్యాదు లగు న
పేతార్థము డిత్థపదడ § బిత్థపదగతిన్. 40

తే. కొండయం దెత్తెకాని లోఁ § తుండ దబ్ధి
లోఁతెకావియున్నతి సమా § లోచనీయ
మిట్టియవిలంఘనీయతా § హేతువైన
యుభయమును నుండుధీరునం § దొకవి యంద. 41

తే. అర్కచంద్రులు చేసిన § యపకృతి సమ
మైన రాహువు ఖరకరు § నప్పుడవుడు
శీతకిరణునిఁ దఱచు గ్ర § సించుచుండు
హేతు వేదన్న మార్దవ § మే కదన్న. 42

క. పరవాయు వల్పమేని వి
సరినంతన వంగు తృణము § సరణిని లఘు వౌ
నరుఁడు తనంతన నతుఁ డగు
సరగున దృష్టాంత మిదె య § సారుల కెల్లన్. 43

సకలతేజస్వులందుఁ దే | జస్వి యెంత
దూరమున నున్న గణ్యుఁడై | తోఁచుఁ బంచ
వహ్నిమధ్యతపస్వికిఁ | బంచమాగ్ని
గా రవి దవీయుఁ డయ్యు లె | క్కకును రాఁడె? 44

హేలగ నున్నత మౌ విమ
తాళితలలఁ గాలు మోప | కధిరోహింపఁ
జాలునె యాకాశపద మ
నాలంబంబగుచు కీర్తి | యంబుజనాభా! 45

మృగము నంకమ్మునన్ ధరి | యించి చంద్రుఁ
డయ్యె మృగలాంఛనుఁడుగఁ గ్రౌ | ర్యమున మృగచ
యంబు చెండాడునట్టి హ | ర్యక్షమే మృ
గాధిపతి యాయె నిదియె శౌ | ర్యంబురూపు. 46

నాలవ యుపాయమునఁ గాని | కేలఁజిక్క
నట్టి పగవాని యెడ సామ | మగును చేటు
చెమట లూరించి యామజ్వ | రము శమిల్లఁ
జేయనౌఁగాని నీరముల్ | చిలుక నౌనె? 47

స్థిరగురుకోపధారి యగు | చేదినృపాలునిపట్ల స్వాంతమే
దురమృదువాక్ప్రయోగ మది | దోషమ యౌను గుణంబు కాదు; ని
ష్ఠురతరవహ్నికీలలఁ గ | డుంగడు గ్రాఁగెడి నేతిలోనఁ జె
చ్చెఱఁ గడుఁ జల్ల నౌ జలముఁ | జల్లినచో నెటు లౌనొ యట్లగున్. 48

సంధి మున్నగు గుణముల | సంప్రయోగ
మందు నౌచితి యెఱుఁగక | యర్థమున క
నర్థకరులౌ నమాత్యనా | మాంకితులను
బగఱ మున్ముంద తొలఁగింప | వలయుఁ బ్రభువు. 46

ం. తన బలము పెరుఁగ నని కేఁ
గ నగు నని రొకండు వైరి | గతబలుఁడే నె
త్తె నగు నని రొక్కరా రెం
డు నుదాసీనున్ నిసుం గ | డుం బ్రేరేచెన్. 50

సీ. స్థైర్య గాంభీర్య విస్తారసంపదఁ గాంచి
లోకోత్తరం బైన వీఁక నెసఁగి
పరు లెట్టి వారైన వారిపై లంఘించి
పరుల కోడని యట్టి పటిమఁ దనరి
ముజ్జగంబుల క్షణంబున రేఁగి ముంచఁగా
రయ సాహసముల కరంబు దాల్చు
యాదవాగణ్య శూరాంభోధి నాపఁగాఁ
జెలియలి కట్ట నీ వలచిన క్షమ
తే. కాన నీవు తటస్థుఁడై నేన గొనెడు
జయము నీయదిగా నెంచు చతురుఁడ వయి
బుద్ధి యార్జించు భోగంబు పురుషుని దని
సాంఖ్య శాస్త్రంబు వచియించు సరణినూని. 51
తే. మిత్రుఁడైన జరాసంధ మేదినీశుఁ
డాహవంబున భీముచే హతుఁడు గాఁగఁ
గుందు శిశుపాలునకు బాస చెందు లేమి
సుదముఁడగును దాన జయము సుమ్ము నీకు. 52
తే. అనెడి పక్ష మాపద్ధర్మ మట్టి ప్రేత
మానధనునకు సిగ్గున కౌను పూర్ణుఁ
డగు శశివిభుం తుదునకెట్టు లట్లు వైరి
పూర్ణుఁడగునేని యుత్సవంబునకె యౌను. 53
తే. బలవిశృంఖలతన్ బయిఁ బడుట వేఱు
శాస్త్రచోదిత మగు నీతి సరణి వేఱు
కాంచఁ దేజస్వినకు నంధకారమునకుఁ
గలుగునొక్కొ సమానాధి కరణవృత్తి. 54
కం. ఇంద్రప్రస్థమ్మునకు ను
పేంద్రు చనక చేదిభూమి కేఁగుము మహి కుం
భీంద్రముల చేరికకు నా
య్యం ద్రిమరాజనుల మోర్చెడు లాఁగాకయటన్. 55

మ. అట మాహిష్మతిలో వసించు ప్రజ కా ఽ హారంబులున్ నీళులున్
బటుకాష్ఠంబులునున్ దృణంబులును ద్ర ఽ వ్యంబుల్ సహాయంబు లో
క్కటి రాకుండ నొనర్చి గోష్ఠముల బి ఽ గ్గన్ గోవులన్ గట్టి న
ల్లెటు పోకుండఁగ ముట్టడించెదర యెం ఽ తే దక్షులై యాదవుల్. 56

ఆ. చేయుఁగాక పాండ ఽ వేయుఁడు జన్నంబు,
నినుఁడు వెలుఁగుఁ గాక ఽ యింద్రుఁడు దివి
నేలుఁగాక మన మ ఽ హితుఁ గూల్త మరయంగ
నభిలషించు స్వార్థ ఽ మఖిలజనము. 57

తే. పగఱ కంఠాలు ఖండింప ఽ బయటి కుఱుకు
రక్తధారలఁ దడిసి శ ఽ రవ్రజంబు
మిహిరకిరణాల నెఱుపెక్క ఽ మెఱుపుఁదీవ
లట్లు వెలుఁగొందుఁగాక యా ఽ హవమునందు. 58

తే. ఉగ్రుఁడయి యిట్టు లను హలా ఽ యుధు పలుకులు
గోడలకుఁ దట్టి మాఱ్మ్రోసి ఽ కుడ్యచిత్ర
వితతి, భయపడి తద్వాక్య ఽ విసర మనువ
దించినట్లొప్పె నాసభ ఽ నంచితముగ. 59

తే. అంత శేషుని యవతార ఽ మైన రాము
వీరభాషణ మాలించి ఽ శౌరి కన్ను
సన్న మాటాడఁగా నవ ఽ సర మొసంగె
దివిజగురుశిష్యుఁ డైన యు ఽ ద్ధవున కర్థి. 60

ఆ. అర్థగౌరవం, బ ఽ నౌద్ధత్యము యథార్థ
మైన భాషణము గ ఽ దాగ్రజన్ము
నెదుట నుద్ధవుఁడు మ ఽ హేంద్రు నాచార్యుని
సరణి మెల్ల నుడువ ఽ సాగె నపుడు. 61

—* శ్రీకృష్ణున కుద్ధవుఁడు స్వాభిమతంబు నెఱింగించుట *—

తే. బల్లిదుండైన బలభద్రు ఽ పలుకు మించి
యేను జెప్పఁగ శ్రేష్ఠార్థ ఽ మింత కలదె?
లిఖితనిర్ణీతకర్తవ్య ఽ లేఖ్యమునకు
మించి యుండునె? వాచికం ఽ బెంచ నెందు. 62

తే. అతనివలె నన్ను గురు వని యధికగౌర
వాదరములను మన్నింతు వబ్జనాభ!
అదియ పురికొల్పు నన్ను నీ యవసరమున
నించుకంత ప్రసంగింప నంచు నెంతు. 63

తే. స్వరము లేడింటనే గాన శాస్త్ర మమిత
మై విచిత్రత్వ మొందిన యట్టి రీతిఁ
గతిపయాక్షరములనె వాఙ్మయ మనంత
మై యవాంతరభేదంబు లధిగమించు. 64

తే. అర్థసంబంధ మన్యోన్య మదుకకుండ
విచ్చవచ్చినయటు వచి యింప వచ్చుఁ
గాని యన్యోన్యసందర్భ గరిమ నెనయు
గ్రంథరీతుల నిర్మింపఁ గష్టమె కద. 65

క. అతిమృదుల మయ్యు ఘనమును
దతగుణకల్పితముఁ జిత్రితము నౌ తమభా
షితమును జిత్రితవస్త్రము
గతిఁ గుశలులు విస్తరింత్రు కంజదళాక్షా! 66

తే. తారతమ్యవిశేషవి త్తముఁడ వైన
నీయెదుట శాస్త్ర మెవ్వఁడు నేని దా ను
పన్యసించుట వాని య భ్యాసపుష్టి
రతకు నయ్యాది గుణనికా రంభ మగును. 67

తే. మంత్రశక్తియు, నుత్సాహ మహితశక్తి,
జిష్ణు వగు స్వామి యెటులో యా ర్జించుకొనఁగ
వలెను బ్రభుశక్తి జన్మించి వర్ధిలంగఁ
గారణంబు లవే యగుఁ గాదె తలఁప. 68

తే. సోపధానంబు సుస్థైర్య శోభితంబు
నైన బుద్ధిని మంచంబు గా నొనర్చు
కొనిన ధీరులు దానియం దున, సతంబు
విశ్రమించుచుఁ గాంచ రె వ్వేళ శ్రమము. 69

తే. బుద్ధిసూక్ష్మప్రకాండులు | ములికి యట్లు
స్వల్పముగ సోఁకి కార్యకా | యాంతరములు
సొచ్చెదరు మూఢులు బహుస్పృ | శులుగ నయ్యు
నశ్మమటు, లోనఁ జొరక బా | హ్యమున నుండ్రు. 70

తే. అల్పు లల్పంపుఁబనిని జే | యంగఁబూని
సగ మొనర్చియె విరమింత్రు | చంచలు లయి
గొప్పపనులను దలపెట్టి | కూడ నిపుణ
మతులు కలఁగరు కొంతు రీ | ప్సితఫలంబు. 71

చ. వెరవులు వేయి యున్నఁ దగు | వేళఁ బ్రమాదము నొందినట్టి య
న్నరు సకలార్థముల్ వెస వి | నాశము నొందును వేఁటకాఁడు దా
శరములు విల్లు మున్నయిన | సాధనముల్ గొని మాటు చేరి ని
ద్దురమొగ మైనచో నెటులఁ | ద్రుంపఁగ నేర్చు మృగంబులన్ వనిన్.

* క. పన్నిద్దఱు రాజులలో
నున్నతి వహియించు నొక్క | యుత్సాహియె, సూ
పన్నిద్దఱు సూర్యులలోఁ
బన్నుగ దినకరుఁ డొకండె | పడయు నుదయమ్మునన్. 73

సీ. అవ్యాహతంబును | నత్యంతదీక్ష్ణంబు
నగు బుద్ధినే శస్త్ర | ముగ నొనర్చి
స్వామ్యమాత్యాదిక | ప్రకృతు లంగములు నాఁ
దలఁచి లోపము లేని | దారి దునిచి
మహిమ మౌ మంత్రసం | వరణంబు పేరి య
భేద్య మౌ కవచంబుఁ | బ్రీతిఁ దాల్చి
నిశిత దృగ్గూఢచా | రిశతంబు లనియెడి
చక్షుర్విశేషము | సంగ్రహించి

* క. ద్వాదశభాస్కరమండలి
లో దినకరుఁ డటు జిగీష | లోఁబడి తమి ని
ద్రాదుల మఱచిన నృపతియ
ద్వాదశనృపులందుఁ దగు ను | దయ మెనయుటకున్. అని పా.

తే. బుద్ధిశస్త్రంబు పరికృతుల్లు ౹ పొలుపుటీఁలు
నంగములు మంత్రి గు ప్తి య ౹ యఃకవచము
చారు లక్షలు దూత యా ౹ స్యమ్ముగ జగతి
మనుచు భూపతి పురుషసా ౹ మాన్యుఁడగునెః 74

ఉ. ఒక్కతఱిన్ క్షమాగుణము ౹ నొండొకవేళను క్షాత్రతేజమ్మున్
రక్కఁ గాలవేది యయి ౹ రాజు ప్రయోగముచేయ నోజుమీ
యొక్కొకవేళ నోజము మ ౹ ఱొక్కయెడాటమునన్ ప్రసాద మిం
పెక్క రసజ్ఞుఁడౌ కవి గ్ర ౹ హింపఁడె యౌచితి కెగ్గురా నటుల్.

క. పరులవలని యవచారము
పొరసిన నవ్వికృతి బయలు ౹ పుచ్చ కసాధ్య
స్ఫురణుఁడయి రా జెదిరి బల
మఱినతఱిఁ బ్రకోప మొందు ౹ వ్యాధియుఁ బోలెన్. 76

తే. మిగులఁ దేజంబు గలిగిన ౹ మృదుసరణినె
కాక యర్థంబు లార్జింపఁ ౹ గలుగు టరిది
తైలమున్ గొన దీపంబు ౹ చాలునొక్క
నడుమ మేత్తని వత్తి యే ౹ ర్పడకయున్న. 77

తే. కేవలము దైవమునె కాదు ౹ కేవలంబు
పురుషయత్నంబునే కాదు ౹ బుధవతేణ్యుఁ
డభిలషించును రెండు ౘ ౹ బార్థములను
సమముగాఁబూని వర్తించు ౹ సత్కవివరె. 78

తే. స్థాయిభావంబునకును సం ౹ చారి ముఖ్య
భావములు రససిద్ధికై ౹ బానటఁయగు
నటు జిగీషు నృపాలు జ ౹ యంబు గోరి
సాయపడుదురు పలువురు ౹ క్ష్మారమణులు. 79

క. రసభావజ్ఞుం డగు కవి
ప్రసాద మోజస్సు నియమ ౹ రహితమ్ముగఁ గూ
ర్పు సరణి క్షమమో తేజమొ
రసాపతి వెలార్పు నటుల ౹ రజ్ఞుం డగుచున్. అని ప్రాంతరము.

తే. మంత్రిశక్తి బృహన్మూల ౯ మాన్య మున్న
తంబు నైన యుత్సాహపా ౯ దప మొసంగు
నెందును గరప్రచేయమ్ముఁ ౯ బృథుతరంబు
నైన ప్రభుశక్తి యను ఫలం ౯ బవనిపతికి. 80

తే. తా ననల్పత్వముననె ప్ర ౯ ధానతను వ
హించు వంశస్వరంబున ౯ కితరము లగు
స్వరములట్లు జిగీషు వౌ ౯ ప్రభువు కితర
నృపులు పరివారమై భజి ౯ యింతురిగాదె! 81

క. ఏపని తాఁ జేయక విభు
కై పరసంపాదితమ్మ ౯ లగు నర్థతతుల్
భూపతి మమత గ్రహించున్
దేపకుఁ బరకృతము స్వనము ౯ నింగియుఁ బోలెన్. 82

తే. ఎదుటఁ బగతుఁడు వెను దన్ని ౯ పృష్ఠచరుఁడు
నన్యు లందంద వెలయ నే ౯ కార్థతంతు
వందుఁ గ్రువ్వంగఁ బడ్డ మా ౯ ల్యమున నాయ
కాయితుం డయి చెన్నారు ౯ నాయకుండు. 83

తే. షడ్గుణాఖ్య నొప్పారు ర ౯ సాయనంబు
నేపు గోరెడివాఁడు గ్ర ౯ హింపవలయు
నందువలననె యాతని ౯ యంగచయము
స్థైర్యమున్ బలముం గనఁ ౯ జాలునంద్రు. 84

తే. శక్తి కలుగని తఱి యోర్పు ౯ శక్తి గలుగు
వేళ వ్యాయామము నొనర్ప ౯ వృద్ధి కలుగు
నంగముల తోడి పేండ్లకు ౯ నట్లు గాక
శక్తి మించిన పని యైన ౯ క్షయము కలుగు. 85

తే. కానఁ జేదీశునకు నప ౯ మానము ఘటి
యింపకాతఁ డుదాత్తుఁడై ౯ యేకపదము
నంద చెలరేఁగి రిపుల న్ను ౯ దాత్త మిత్రర
మైన స్వరముల నట్లు శాం ౯ తాత్ముఁ డుండె. 86

క. శిశుపాలుఁ డొకఁడె సుఖముగ
వశుఁ డగు నని యెంచఁబోకు § పార్థివగణ మా
శిశుపాలు ననుగమింతురు
యశ మని బహురుజలు రాజ § యక్ష్మనుబోలెన్. 87

తే. ఫలము నొంది సపక్షమై § పరవిభేద
దక్ష మైనట్టి బాణమై § తనరు బాణ
దైత్యుఁ డియ్యెడ గుణదామ § తం దనర్చు
చైద్యుఁ డనియెడి బలు విల్లు § చేతఁబట్టి. 88

తే. అన్యు లౌ కాలయవనసా § ల్వాదు లైన
వారు రుక్మిద్రుమాదు లౌ § వీరు లెల్ల
తామసోపేతులౌటను § దామసాత్ముఁ
డైన చైద్యుఁబ్రదోషునే § యనుగమింత్రు. 89

తే. వార లియ్యెడ సంధిసం § బద్ధులనకు
చైద్యకల్పితభేదంబు § స్వల్పమునకు
నెండుకట్టెల దహియించు § నింతగాలి
యట్లె నీపయి వారలు § నలుగువారె. 90

తే. అల్పుఁడైనను బెద్దసా § హాయ్య మొంది
కర్జములఁజక్కబెట్టును § ఘనుని మాట
చెప్పనేల? మహానదిఁ § జేరి యైన
కొండవాగులు సంద్రంబుఁ § గూడును గదః 91

తే. అరికిఁ గూర్చువారలును నీ § కహితు లైన
వార లెల్లరు చైద్యుని § పక్షమె కదః
వానితోడ విరోధమ్ము § పడెడువేళ
మిగులు వారలే నీకౌను § మిత్రగణము. 92

తే. ఇటులఁజేయుచు నృపలోక § మెల్ల రేఁపి
ధర్మసూతి మఖధ్వంస § కర్మదక్షు
లైన శత్రువులందుఁ బ్ర § ధానపురుషుఁ
డీవ యగుదువు కాన నీ § వెఱుఁగు మిదియ. 93

తే. చుట్టమైనట్టి ధర్మాత్మ § జుండు మదిని
నెంత బరువు మూఁపున వహి § యింప నేర్తు
వని నినున్ నమ్మి క్రతుభార § మును వహింప
నిచ్చగించుచున్నాఁడు విం § చే ముకుంద! 94

తే. తమ్ము భజియించు రిపుల నై § తమ్మనుగ్ర
హింతురు మహాత్ము లలఘుస్ర § వంతు లంత
రాంతరమ్ములఁ దముఁ జొచ్చి § నట్టి కొండ
సెలలను సపత్నులన, కద్ధిఁ § జేర్చుఁ గాదె. 95

తే. బలియుఁ డేనాటికేని దాఁ § బగఱ నొంది
తనకు వశవర్తులను జేసి § కొనును, గాని
మనసు విఱిగిన మిత్రు § లేమాడ్కి వశ్యు
లౌదురే వారి యిష్ట మౌ § నటులఁ జనిన. 96

తే. శాత్రవునిఁ జంప సురలకు § సంతసంబుఁ
గూర్చు టొప్పదె యని యెంచు § కొందువేని
యజ్ఞమే వారలకు విందు § లమరఁ జేయుఁ
గానఁ గ్రతువును జేయింపఁ § గడఁగు టొప్పు. 97

ఆ. అగ్నులందు వేల్చి § నట్టి హోమద్రవ్య
మమృత మంచుఁ జెప్పి § రఖిలబుధులు
మందరాద్రిఁ గడలి § మథియించి రనుగాథ
కేవలమ్ము సురల § కీర్తికొఱక. 98

క. మానార్హకు మేనత్తకు
తా నీసుతుఁగాతు నూఱు § తప్పులదాఁకన్
నే నభయ మిచ్చితిన యని
నీ నెఱపిన తొంటి ప్రతిన § నిలుపుకొనఁ దగున్. 99

ఆ. ఉత్తమునకు వాక్య § మొక్క తెఱం గగు
వాఁడి యయ్యు బుద్ధి § వఱలు మృదుత
వేఁడి యయ్యు మనసు § పీడింప దన్యుల
శౌర్యసరణికృతము § శాంతియుతము. 100

తే. తొలుత దయతోడ శపథంబుఁ | బలికి నాఁడ
వవధిలోపల నతనిపై | నలుగఁ దగునే?
తీఱి యలుగుచు సహకీర్తి | తెచ్చుకొనకు
భానుఁ డెపుడేనిఁ దప్పునే | పగటిమేర. 101

తే. వలతి మిన్నలు వేగుల | వారు తీర్థ
పదములఁ జరించి శాత్రవ | పార్థివావ
గాళిగాంభీర్యముల నెల్లఁ | గనఁగనేర్తు
రంతవఱకు నిరీక్షింప | నగును నీకు. 102

క. వాసి ననుతూన్తత్రిపద
న్యాసయు మఱిసన్నిబంధ | నయు సద్వృత్తి
వ్యాసక్తయును నపస్పశ
భాసిలునే? రాజనీతి | వ్యాకృతి పగిదిన్. 103

సీ. మఱియు నొక్క రహస్య | మెఱిఁగిరిపవలయును
శత్రుదేశనివాస | చతురులఁ బర
మర్మజ్ఞులను స్వీయ | మర్మంబు లొరు లెఱుం
గక యుండఁ జరియింపఁ | గలుగువారి
వరిదత్తవేతను | లౌ చరులను జేర్చి
మన మిచ్చు భృతిఁ గూడఁ | గొనఁగ వారి
నొప్పించి వారిచే | గొప్ప నేర్పొప్పఁగాఁ
బరరాజమంత్రుల | వ్రాఁత సృష్టి

తే. వెలయఁ జేయించి శాసన | ముల లిఖించి;
నృపుని సన్నిధిఁ జేరిచి | రిపుల కిట్లు
సహకరించెడివారని | స్పష్టపఱచి,
సచివనృపులకు భేదమ్ము | సలుపవలయు. 104

తే. విహానిపుణులైన చాతులఁ | బంపి, పొందు
పుత్రి యజ్ఞంబుకై వచ్చు | శౌరికి వెఱయ
యుద్ధసన్నద్ధులై రాఁగఁ | బ్రోత్సహించి
చేర్పు నీ మిత్రులను యుధి | ష్ఠిరుని పురికి. 105

తే. అర్ఘ్యవిధులను ధర్మరా $ జప్డు పూజ్యు
నిన్నుఁ బూజింప నోర్వఁగా $ నేరనట్టి
చపలులును మత్సరులు నైన $ శత్రునృపులు
తామె కయ్యంబునకుఁ గాలు $ ద్రవ్వఁగలరు. 106

కం. కాకములచేతఁ బెరిఁగిన
కోకిలఁ దన్నెఱిఁగి కరట $ కూటము విడదే
శ్రీకరుఁడు చైద్యుఁ డైనన్
బ్రాకటసుజ్ఞాను లపుడ $ పాయుదు రతనిన్. 107

తే. సహజచాపల దోష దృ $ గ్జనితగర్వ
మొంది దుర్బలపక్షంబు $ లూని రిపులు
పర్వి నీ పయి నీ దురా $ పప్రతాప
వహ్ని కగుదురు సుమి శల $ భములగములు. 108

తే. అనుచు నయమార్గమున దుర్గ $ యార్గళముగ
వినుచు స్పష్టార్థ మగు నుద్ధ $ వుని హితోక్తి
దన యెద వసించు శ్రీయును $ దాను మాత్ర
విని స్వపీఠంబు నుండి లే $ చెను మురారి. 109

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
శ్రీకృష్ణుఁడు బలరామోద్ధవులతో మంత్రాలోచనము
చేయుటయు, బలరాముఁడు స్వాభిప్రాయముఁ
జెప్పుటయు, శ్రీకృష్ణున కుద్ధవుఁడు స్వాభి
మతంబు నెఱింగించుటయు ననెడి
ద్వితీయాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

## [శిశుపాలవధమహాకావ్యము.]

### తృతీయాశ్వాసము

---

—✽ శ్రీకృష్ణుని ప్రస్థానవర్ణనము ✽—

క. ధనపతిదిశ విడిచి యగ
స్త్యుని మార్గము చేర తపను ✽ చొప్పున యుద్ధా
భినివేశ ముడిగి హరి యొ
య్యన నింద్రప్రస్థనగరి ✽ కరుగఁగ వెడలెన్. 1

చ. జగములకున్ బవిత్రిత నొ ✽ సంగఁగఁజాలుచుఁ గ్రాలునట్టి యా
తిగ వెలుఁగున్ నిజాంఘ్రులను ✽ దెంపునఁ బూజ్యులకెల్లఁ బూజ్యుఁడై
తగియెడు వెన్ను దాఁకదు గ ✽ దా నెఱ పున్నమినాఁటి చందురున్
మిగుల హసించు బల్సిరుల ✽ మేకొను ఛత్రమతండు దాల్చుటన్. 2

ఉ. తామరతూండ్లలోని నును ✽ దారములున్ బలెఁ దెల్లనైన విం
జామరదోయి వెన్నడిమి ✽ చక్కని నెక్కొనియున్న నీరద
శ్యాముఁడు శౌరి పొల్చె దివి ✽ జాపగ రెండు తెఱంగులై పడన్
గోముల మించు సంద్రమున ✽ కున్ సరివచ్చు చకచ్చకద్ద్యుతిన్. 3

క. మకుటగతమణులఁ జిత్రా
ధికకాంతులు వొలయ వాసు ✽ దేవుఁడు బహుగై
రికధాతురూషితశిలాం
శుక మగు గోవర్ధనాద్రి ✽ సొంపు వహించెన్. 4

ఉ. వాని శ్రవోయుగంబున వి ✽ భాసిలు బంగరు కుండలంబులన్
జానగు పచ్చరా మిసమి ✽ సల్పయిఁ గ్రమ్మఁగఁ బేరురమ్ము బా
ల్యాన నతండు నెమ్మిపురి ✽ యందపుఁ బేరు లలంకరింప నిం
పూనిన నాఁటి వైభవము ✽ వొందెనె నేఁడు ననం గనంబడెన్. 5

క. కవ్వపు మలతల చివురుల
మవ్వంబుగ సాన తిరుగు | మణుల రుచులనన్
నివ్వటిలు నంగదంబుల
వివ్వచ్చుని మేనమఱఁది | వెలసె సొగసులన్. 6

క. ముంజెయి మురుగుల కెంపుల
కెంజిగి సహజారుణంపుఁ | గేల్గోళ్లందున్
గంజాక్షుఁ డసురపేరుర
ముం జీల్పన్ వెడలు రుధిర | ముం బురణించున్. 7

క. దివి, యిరువాకల గంగా
స్రవంతి ప్రభవించి పాఱు | సరణి వినీల
చ్ఛవి శౌరి యక్కు మిక్కిలి
సవురుం గనె మంచిముత్తె | సరి ధరియింపఁగా. 8

చ. జలధి మథింప మున్ను జల | సారముగా జని గన్న కౌస్తుభో
జ్జ్వలమణి కాంతిసంతతి దె | సల్ గలయన్ బ్రసరించి మించ న
య్యలఘుఁడు దాల్చె నందు జగ | మంతయునుం బ్రతిబింబితంబు నై
చెలఁగెఁ దదీయకుక్షిని వ | సించు జగమ్మని భ్రాంతి గొల్పుచున్. 9

చ. హరి మొలిత్రాడునుండి దిగి | హజ్జలపజ్జకు వ్రేలు ముత్తెపున్
సరము, గురుప్రభావిసర | సంపదకుం గడుఁ దావలంబ యై
కరము వెలింగె నయ్యనఘు | కాలిని బొట్టనవ్రేల బుట్టి పై
కిరవుగ నెత్తు లేచి ప్రవ | హించెడి తుంగతరంగ గంగ నాన్. 10

క. హరినీలమణిద్యుతుల రు
చిరమై యరదళపుఁబసుపుఁ | జేలము గల యా
మురవైరి తమ్మిపుప్పొడి
తరఁగల పైఁ దాల్చు యమునఁ | దలఁపగఁ జేసెన్. 11

తే. చక్కఁ గై సేసికొన్న యా | శౌరి మేన
నెల్లఁ బొడమిన లక్ష్మి దా | నెల్లరకుఁ బ్రి
యగనె యౌట యుత్తంబ య | నన్యకాంత
యౌ నితరలక్ష్మి హరి యుర | మందె యుండె. 12

క. విరివి గల యురమునందున
సిరి యొకతె వసించి మిగులఁ జెలువము నిడఁగా
నరుసింప జగం బెల్లను
బెఱ సిరి మురహరుని మేన వెలసె సతంబై. 13

క. అసురపతి ప్రాణవిసరము
పసలడఁచిన గోళ్ల యాన వాళ్లన్ గాతి
న్యసరణుల వెలయు గుబ్బల
మిసిమి యెసఁగ నుండి రన్ను మిన్నలు చుట్టున్. 14

క. ఉరువును నెత్తుం గల కుచ
భర మాకర్షింపఁ బలుచ పడి నెన్నడు మా
కరిణీ యానల కొప్పెన్
గరమున్ వంగెడి నయంబు గనెనో యేమో? 15

ఉ. ఎవ్వతె నెవ్వతెన్ వలపు లీనఁగ, నోరగ శౌరి చూచునో
యవ్వగలాఁడి సిగ్గు మెయి నౌదలఁ గ్రిందికి వంచునంతలో
నెవ్వగ లెచ్చ నవ్వరమ జేమణు లీసున దాని జూచి మై
నొవ్వగఁ గొట్టుచుండుదు ర నూనకటాక్షశరాళి నాతనిన్. 16

ఆ. నల్ల యగిసిపువుల నుల్లసం బాడెడు
దితిజరిపుభుజంబు తేజు గాంచె
చక్రధారధళ్య చయము న ర్తింపఁగా
మేలి సుడుల యమున జాలు వోలె. 17

తే. పగతుర యొడళ్ల మర్దింపఁ బటిమఁ దనరి
యుర్వి సర్వత్రి విజయంబు లొసఁగఁజాలి
నిత్యసాన్నిధ్యవిభవంబు నెగడి మిగుల
మోదమున కవుఁగాదె కౌ మోదకి గద. 18

తే. సహజసత్వాఢ్యుడైనట్టి శౌరికి గజ
హయరథాదిబలంబుల జయము లరుదె
యైన నరి యుసురులఁ గొన నాఱితేజు
నందకమునకె యన్వర్థ నామ మబ్బె. 19

తే. చేతఁ బట్టంగ నెవ్వని ξ చేతఁగాక
గుణము నెవ్వాని పీ న్వజ్జ ξ కుం గడంక
కార్యములఁ జేర్పకుండెడి ξ ఘనసుహృత్తు
వలెను శార్ఙ్గంబు హరి పజ్జ ξ వచ్చి నిలచె. 20

ఉ. నీలపయోధి చెంగటను ξ నిల్చిన హంసముఁ బోలి పాంచజ
న్యాలఘుశంఖ మచ్యుతుని ξ యండకుఁ జేరి సమీరడింభకున్
హేలమెయిన్ గ్రహించి విని ξ పించెను గానము వీనువిందుగా
నీలఫయోదబృందరమ ξ ణీయగభీరనినాదరీతులన్. 21

తే. ఇష్టసిద్ధిని స్సాధించి, ξ యెల్లదిశల
కడ్డు లేక చరించుచు ξ నరుగు పుష్ప
మను రథంబు మహారథుం ξ డయ్యు హరి వ
సించెఁబుష్యస్థితేందుని ξ చెలువు గాంచి. 22

ఉ. యాదవరాజసింహుని ధ్వ ξ జాగ్రమునన్ వసియించుచున్ మణీ
మేదురమేదినీస్థలిని ξ మేన్ బ్రతిబింబితమైన వైనతే
యాదిమపక్షిరాణ్మణి ర ξ యంబున గూఢపదాన్వయమ్ములన్
ఖేదిలజేయుఁ గ్రింది భువిξకిన్ బఱతెంచు నటంచుఁ దోఁపగన్. 23

చ. మురియుచుఁ బైనమైన యదు ξ పుంగవు దుందుభి నుద్భవించు ని
ష్ఠురరవ మద్రులన్ బగులు ξ చున్ మఱి యన్యరవంబు లందునన్
గరము విలీన మయ్యె ఘన ξ కంధిజలంబులయందు నాపగో
త్కరసలిలంబు లెల్ల విధి ξ తమ్ముగ లీనము లౌటఁ జూడమే. 24

ఉ. లోకము లన్నిటిన్ గడుపు ξ లోఁ గను గందక తార్చి ప్రోచు సు
శ్లోకుఁడు వెన్నుఁ డెయ్యెడలఁ ξ జొక్కపుటజ్జల నిల్పు నయ్యెడన్
బ్రేఁకనఁ గ్రిందికిం దిగెడు ξ వేతలలన్ శ్రమ మాన్పు మూఁపులన్
బై కెగయించి మీటుఁ గదః ξ పన్నగభర్త రసాతలంబునన్. 25

క. తోరణము లున్నతనములే
యై రాజిలు, కాని పడగ ξ లవిరాయ నటుల్
సారె కవి వంచి జోదులు
శౌరి ననుగమింత్రు ఫలము ξ సారనయుబలెన్ 28

ఉ. చామనచాయఁ గావిరుచి ✽ జానగు నేన్గుల దానవారి, స్వ
ర్ణామలభూరజంబు దడి ✽ యన్ బలు నెమ్మిపులుంగుపింఛపున్
శ్యామలకోమలారుణపి ✽ శంగరజంబులఁ బోల నివ్వప
ట్టా మునుఁగన్ జరించెను గ✽డంక రథంబులు నుగ్గు చేయఁగాన్. 27

ఉ. ఏపగు నష్టలోహముల ✽ నిద్ది ప్రతిష్ఠిత మన్న కీర్తి న
ష్టాపద మొందుఁ దద్ధరణి ✽ సైంధవరింఖల రేఁగు ధూళియున్
బ్రాపును గాంచ దుద్ధతుల✽పైఁబడ దింత మహాజనంబు పై
నీపథ ముత్తమంబు గణి ✽ యింప విశిష్టగురుత్వశాలికిన్. 28

చ. కడుజతనంబుతోడఁ దుర ✽ గంబుల రౌతులు పట్టి నిల్వ ముం
దడుగుల నెత్తి త్రోవ కొక ✽ యంతరమై చను ధీరదంతులన్
గడచి చనంగఁ గోరు నటు ✽ గాధొకొ యెంత గురుత్వమేదురున్
గడిచి పురోగమింపరాకొ ✽ కార్యవిదుల్ దమ కడ్డ మైనచోన్ 29

ఉ. ఆఁపగరాక పర్వెడు హ✽యంబులఁ గళ్లెములన్ బిగించి తా
మాఁపిన పాదిమిన్నలు, ము✽దంచితరీతుల దుమ్ముతోడఁ గ్రీ
డాపరులైన బిడ్డలను✽డాయుచు వైశమ కన్నతల్లు లా
యాపథమందునుండి కడు ✽ నాదట నెత్తుకపోయి రయ్యెడన్. 30

ఉ. చిన్నతనంబునుండియు, న✽శేష మెఱింగినయట్టివారలున్
వెన్నుని జేరి కన్గొనఁగ✽వీథిని వీథిని మూఁగి రెంతయున్
తిన్నగఁ గూర్మి మొల్కఁగొని ✽ తీవలు వారెడి పట్ల నిత్యమున్
గన్నులఁ గన్న వస్తువునె ✽ గాంతురు నూతనవస్తువట్లొగిన్. 31

మ. ఇసుముం జల్లిన నేల రాలనటు నెం✽తే లెక్కకున్ మీరు శూ
రసమూహంబుల రథ్య క్రిక్కిఱియజా✽లన్ మెల్లగాఁ దేరు వోన్
లసమాంచితవైభవం బెసఁగు ప్రో✽ల న్విందుగాఁ గాంచు చ
క్రి సమీక్షింపఁడు స్వీయ మౌ రథము నే✽గెన్ మెల్లగా నంచహా!. 32

—* ద్వారకా పుర వర్ణనము *—

ఉ. ద్వారవతీపురీవరము ✽ బంగరుకోటలమేటి డాలు ది
గ్వారము దాఁకఁ బచ్చని చౌ ✽ కాటపుఁ దేజులఁ గూర్పఁగా నకూ
పారజలంబునుండి బడ ✽ బావదనోజ్జ్వలకీలి యెయ్యెడన్
జారుతరంబుగాఁ బసుపుఁ ✽ జాయలనీనెడి యట్లు దోఁచెడున్. 33

తే. భూమిభృన్మౌళి లెలసిన § మొదటి తావు
జలధితరఁగల చుట్టారు § నలఘుమూర్తి
పుడమికిని బ్రతికృతియనఁ § బోలు ప్రోలు
ధాత సృష్టించి కుశలుఁడై § తనరినాఁడు. 34

ఉ. సంతత మభ్యసింపఁ గొన § సాగిన నిర్మితి కౌశలాన ధీ
మంతుఁడు విశ్వకర్మ లస § మానవిధానము మేరగాఁగ న
త్యంతము సృష్టి చేసె నని § యాడఁదగుం బురివేల్పుటిక్క య
శ్రాంతవినిర్మలాబ్ధిమకు § రప్రతిబింబము లీల దోఁచెడున్. 35

ఉ. అంకమునందు నిల్పి తన § యన్ నగరీవరకన్య శేషప
ర్యంకున కిచ్చి పెండిలిని § రంజిలఁజేయు ముహూర్తమందుఁ బ్రే
మాంకముగాఁగఁ గూఁతునకు § నంబుధిరాజుపకంఠసీమ శో
భాంకురముల్ జెలంగు మణి § హారము లిచ్చిన ముచ్చ టెట్టిదో. 36

క. చలియించు నలలఁ బయిపయి
తొలుకాడెడు సంకుగముల § తోఁ బ్రాకారం
బొలయుఁ బురి; పెక్కు రిక్కల
వెలయు సుమేర్వద్రిసాను § విధమునఁ దోఁచున్. 37

మ. పురిలో నంగడివీథులందు బలు ప్రోకవుల్ చేయఁగాఁ బడ్డ భా
స్వరరత్నంబుల నంబునిర్గమతతుల్ § సందర్శింబునం జేర్పఁ ద
స్కరుఁడై వానిని బ్రోవుచేసికొని గ్రాం § చం గల్గె రత్నాకర
స్థిరనామం బిపు డబ్ధి; తొల్తఁ గలదే § చెన్నైన యాపేరెటన్. 38

క. నీరు స్రవింపఁగఁ గాంతిన్
వారింపఁగ నురువు మణుల § వార్నిధివీథిన్
చారుకరంబుల నెండకు
నాఱఁగ నాఁ దల్పతలము § నందుం బఱచెన్. 39

ఉ. కోటను గాచు నున్నతపు § గోడల యెత్తును గెల్వఁ గోరికల్
వాటిల దవ్వునుండి పర § వళ్లను ద్రొక్కుచు లేచు నూర్మి లే
పాటున గోర్కె తీర్చుకొనఁ § బాటివ మింతయు లేక సిగ్గుతోఁ
జీటికిమాటికిన్ లయముఁ § జెందుటఁ జూడమె నేఁడు నాఁడునున్. 40

ఉ. లోనఁ బ్రవేశముం గొనఁగ § లుబ్ధమతిన్ గుతుకంబుతో రయం
బూనుచు వారిద మ్మొకఁడు § హుమ్మని కోటపయిం జనంగఁ ద
న్మానితకుడ్యభాగములు § మత్సరతన్ దను నడ్డగింప, బల్
ధ్వాన మొనర్చి వేగ జడి § వాన నెపంబున నేడ్చు నివ్వలన్. 41

తే. మాకు ద్వారావతీవధూ § మండలికి వి
భేదకం బగు గుణము క § ల్పింపు మనుచు
నచ్చరల్ గోరఁదన బ్రజ § కపుడ మనువు
తెప్పపాటు ఘటించె గు § ర్తింప వేఱ 42

మ. ఇవపుంజాయల వేల్పుమే ల్పనల నె § ంతే లీనమై భేద మిం
త విలోకింపఁగరాని స్ఫాటికమణీ § నానోచ్చసౌధంబు లు
త్సవ మొప్పంగను నెక్కి ద్వారకపురిన్ § ధన్యాంగనారత్నముల్
దివిజాంభోరుహపత్రినేత్రలవలెన్ § దీపింతురి రే లన్నిటన్. 43

చ. జలధరమండలంబు తమ § చక్కి కధఃకృతమైన నున్జలం
బులఁ బరిపూరితంబు లయి § పొల్చు జగా నెలజాల కట్టనం
బులఁ దగు నేలలన్ దనరు § పున్గను సౌధతలంబులన్ విరా
జిలు జలమార్గముల్ ప్రతిని § శీధిని వారక ద్వారకాపురిన్. 44

ఉ. అందలి గేహినుల్ సురత § మప్పుడు సిగ్గున దీప మార్పియున్
గొందురు భీతిచంద్రు వెలుఁ § గుల్ మది జాలసమాగతంబులై
మందిరపున్ విదూరమణి § మండితభిత్తులఁ బిల్లికన్నుచాల్
చందమునన్ భయప్రదవి § లాసములై ప్రసరింపఁ గాంచుటన్. 45

ఆ. యువకు లిండ్ల గోడ § ల వెలయు నున్పులఁ
జిత్రములను వ్రాయఁ § జేతగాక
తామె ప్రతిఫలించి § తమ గోడల సజీవ
చిత్రరీతిఁ బురిని § జేయు చంద్రు. 46

ఉ. అచ్చపుఁ బైఁడికాంతి గల § యాపురయౌవతదేహలీలలన్
వచ్చనె వేఱు నేయ నను § బంగరు కంబములందు నీడలై
చొచ్చుటఁగాని క్రొమ్మరుల § క్రుక్కుచు బాండిమఁ గ్రక్కుచెక్కులే
యచ్చుగ వజ్రదర్పణము § లట్లగుటన్ భిద కొంత యేర్పడున్. 47

క. పురి మేల్గిముల గడపలు
మరకతనిర్మితము లౌట \$ మఱి ముంగిళ్లన్
వఱలిన డాల్ గోమయ మని
పౌరి గోమయమునను నలుకఁ \$ బూనరు ముగుదల్. 48

తే. బర్హములు వ్రేలఁగాఁ జూలు \$ పట్టెలందు
నెమిళు లట నొక్క క్షణమేని \$ నిలుచువేళ
మరకతశ్యామతృణమనో \$ హరము లైన
చూఱులఁ దనర్చు లేవ సౌం \$ పారు నిండ్లు. 49

సీ. బరువైన దూలాల \$ భరియింపఁ బృథులకు
 లంబు లయ్యును నిస్తు \$ లంబు లగుచు
లలితవితానమా \$ లాపినద్ధము లయ్యు
 నవితానతానిల \$ యంబు లగుచుఁ
జతురకళారహ \$ స్యవిచిత్రముల యయ్యు
 ద్వారాదులను సచి \$ త్రమ్ము లగుచు
శతసహస్రజనప్రి \$ చార ముండిన విశా
 లము లయ్యు భూరి శా \$ లంబు లగుచు

తే. నఘటనాఘటనాకర్త \$ యైన వాసు
దేవుఁ డేలెడు ద్వారవ \$ తీపురమున
వసతిగృహములు తీరుల \$ వసతు లనఁగఁ
గీర్తి కెక్కను సౌందర్య \$ మూర్తులగుచు. 50

ఉ. శీవిగ నింటిముంగిట ఘ \$ టించిన కుడ్యములందుగూఁడులన్
జీవకళల్ తొనంకునటు \$ చెక్కిన చక్కని పక్కి బారులన్
జేవ మెయిన్ లటుక్కన గ్రి \$ సింపఁగఁ జూచిన మేను నిశ్చలం
బై విలసిల్లు పిల్లిని జ \$ నావళు లెంతురు చిత్ర మం చహా! 51

క. చుక్కల కెత్తగు మేడల
నెక్కుట వృథగాదె? నేల \$ నెనసియు శశికిన్
ధిక్కారాధఃకరణముఁ
జక్కఁగఁ గావింత్రు వదన \$ జలజములఁ జెలుల్. 52

గీ. రమ్య లంచుఁ బతాకికా ప్రాప్తి గల వ
టంచును వివిక్త లగుట రా గాభివర్ధ
ను లనుచు, నమద్వశీక ల న్ను లలనాళి
సరిగ వలభుల సేవింత్రు పురిని యువలు. 53

చ. జతనము లేకయే సహజ సౌరభమున్ వెలిఁ జిమ్ముకమ్మ నౌ
నతివల మోములున్ మధువు లానగరిన్ గల కోడెకాంద్ర సం
హతికిఁ బ్రమోద మూన్ప వ్యతి హారము పూనె న చే స్వగంధసం
తతులను జిమ్ము కృత్యములఁదా మయి యద్భుతరీతి నేమనన్. 54

చ. పురిని విహారవేదికలఁ బొల్పుగ నిల్పిన మత్తవారణో
త్కరముల వేలు గూఁడుల స దా వసియించెడి పుల్గు మొత్తముల్
సురుచిర మందిరాలఁ గడుఁ జొక్కుచు దంపతు లాడు పల్కులన్
సిరు లొలుకన్ వసించుటను శిష్యగణ మ్మయి పొల్చు వారికిన్. 55

ఉ. సన్న జిలుంగుఁ బయ్యెద లె సంగును బైనను మాటెకాని యా
యన్నుల గుబ్బదోయి హొయ లంతయుఁ గన్నులఁ గట్టినట్టు లై
యున్నవె యంబరంబు లవి వ్యోమసమత్వము నామమాత్రఁ గా
దెన్నగఁ నర్థమందును వ హించుచు మించును ద్వారకాపురిన్. 56

చ. కుటిలత సుంత గైకొనక కొంచెము నేన్ మరియాద వీడకె
వ్వటికిని పంకసంకలిత పద్ధతి గాంచక ప్రాంచదాయతి
స్ఫుటగతు లై బెడం గడరుఁ బ్రోలి వినీతపథంబులందు నె
చ్చట నొక యింత జాఱ కనిశంబును నేఁగుదు రప్పురిన్ జనుల్.

శా. తన్నే చూడుఁడు తన్నుఁ జూడుఁ డని మా త్సర్యంబు లేపార సం
పన్నీరేజదళాక్షి సోయగములన్ బాటించు పౌరాంగనా
శ్రీ న్నాశీకభవుండు చేసి మును క ల్పించెన్ సిరిన్ వజ్రకీ
టౌన్నత్యంబున నన్నవాదు నెటొ పా యం గల్గె నీనాఁటికిన్. 58

ఉ. ఆపురివారి కాత్మ నుద యం బగు కోరికి యెట్టిదేని యా
రూపున నశ్రమం బపుడ రూఢిగఁ జేపడుఁ గల్పవృక్షరే
ఖాపటలీప్రభావములఁ; గన్గొనియేనియు వారి వైభవ
శ్రీపరిపాటి యూహ మొన రింపఁగ నైన నసాధ్య మేరికిన్ 59

తే. ఆత్మసౌధప్రదీప్తుల నలమి దిశల
సకల కళ లూని, రేవతీ జాను లగుచు
రౌహిణేయుండు మఱియును రోహిణీశుఁ
డాపురంబున వసియింతు రనవరతము. 60

క. బాణుని రణమున నజగవ
పాణి గెలిచినట్టి చక్రపాణికి సుతుఁడై
రాణఁ దను వెనసి సుమనో
బాణుఁడు పురిఁ దిరుగు శస్త్రపాణి యయి ధృతిన్. 61

తే. శివమరుత్తులు సేవింపఁ జిరము హరికి
వాసమై, రత్నకాంతులు పైకిఁ జిమ్మ
జలధినుండి ద్వారక మేరుశైలతటగ
తామరావతిఁ బిల్చుఁ గయ్యమున కేమొ. 62

గీ. వర్ణకాంతులఁ జెన్నారు వనితను బలెఁ
బురిని, నునుకాటుకల నల్పు పొల్పు గాంచి
వృత్తహృద్యత గని జగద్విదితతిలకుఁ
డైన హరి తిలక మటు సొంపలరఁజేయు. 63

ఉ. మేడల గోడలన్ వెలయు మేదురవజ్రపుధాళధళ్యముల్
గూడి చరింప సౌరపతి కూరిమి బల్విలుమేటి చాయ యన్
బోఁడిమి, దేవసేనలను బోలి యరిన్ భయపెట్టు తూరుపున్
వాడను జేరె శౌర్యనిధి ద్వారక నారయుచుం గ్రమంబుగాన్. 64

మ. జలజాతోద్భవు మోముఁదమ్ముల నొగిన్ జన్మించు వేదాల మం
జులశీతాంశుకిరీటమస్తకజటాజూటోద్గతాంబూర్ములన్
జలజాక్షాంగకజాతజాత మగు విశ్వప్రాణులన్ బోలి యా
నలినాక్షోరుచమూతతుల్ వెడలె సన్నాహంబుతో ద్వారకన్. 65

చ. హయముల మోములన్ వెలయునట్టి ఖలీనము లొండొకంటి పై
రయమున రాయ హేష లలరంగను ముందటికాళ్ల నెత్తి ని
శ్చయముగఁ బర్వఁబోవఁ గని సారెకుఁ గళ్లెములన్ బిగించి యా
హయములఁ బట్టి యాశ్వికజనావళి గాసికి నోర్చి రెంతయున్. 66

తే. చిమ్మచీఁకటి దివ్వెచేఁ § జెదరునట్లు
జనసమూహముల్ కర్షులకు § జడిసి పర్వ
నెట్టి యిఱుకటములులేక § యిభబలములు
పురిని వీథులవెంబడి § నరుగఁ గలిగె. 67

మ. పురి ద్వారంబును దాఁటి హస్తినఖముం § బొంకంబుగా నెక్కి తే
ర్లు రయం బొప్పఁ జరింప సారథులు ధీ § రుల్ వాగెలన్ బట్టుచున్
గరమున్ లాఁగ దురంగమంబుల మెడల్ § కై వైపు, వక్రింప, సు
స్థిరయుగ్మంబులతో రథాలు సమధా § త్రిన్ జేరె భద్రంబుగన్. 68

తే. భర్త కృష్ణుండు పరదేశ § వసతి గనఁగఁ
బ్రాణవల్లభ ద్వారక § బాహువీథి
భూషణము లైన సైన్యముల్ § మున్ను దుల్చి
ద్వారకాత్వంబుపై కోర్కి § వదలఁ బోలు. 69

— సముద్రవర్ణనము —

క. నీరధి కవ్వల యొడ్డునఁ
గారాకుల నల్పుబల్పు § గలుగు వనాళిన్
శౌరి గనె సతము తరఁగలు
పారమునకుఁ గొట్టు నాఁచు § పస మిసిమివలెన్. 70

సీ. నవనవోల్లసదనూ § నప్రభావిసరముల్
చెలువొందునట్టు ల § చ్చిని ధరించి
కనువిందు లైనట్టు § ఘనతరంగములచే
వరలెడి యొడ్డు పై § వసతి గలిగి
సజలనీరదచ్ఛాల § సామ్యంబులం గను
ౘామనచాయ బ § ల్తొన్నరు గాంచి
పుట్టిన దాదిగాఁ § బొలుపుల నేపార్చు
చారులతాసతీ § సమితి గొల్వ

తే. నల్లర్థు భూరుహచక్రవ § ర్తులును తనదు
శతసహస్రలసన్మూర్తి § పరణి గాఁగఁ
జూచెనట వాసుదేవుండు § సొబగు లెఱుఁగు
మహితవిభవాభిరాముఁడై § మాన్యదృష్టి. 71

ఉ. భూమిపయిన్ సదా పొరలు ♦ ఘోరన నాఉచు దీర్ఘవీచికా
స్తోమభుజాఖ్యకేతువులఁ ♦ జోరముగాఁ గడుఁ గ్రిందు మీఁదుగా
వేమఱుఁ ద్రిప్పుచుండుఁ, గడు♦విస్తృతి నుర్వులు గ్రక్కు నెన్నియో
బాముల నొందు నంబుధి; య♦పస్మృతిరోగి మదిన్ స్ఫురింపఁగన్.

చ. కడుపును నిండఁగా నమృత ♦ ఖండముల్తైనఁ దినంగవచ్చు నా
జడధి స్వకుక్షి నిండిననుఁ♦జంద్రమయూఖము లాబకొల్ది దాఁ
గుడువఁగఁ గుక్షి యుబ్బినది ♦ గొబ్బున గ్రక్కునఁ దిన్నదాని ని
య్యెడ నని వెన్నుఁ డెంచె దరి♦నెల్లను గప్పిన ముత్తియంబులన్.

శా. సాటోపంబుగ నెల్ల దిక్కులను గ ♦ ర్జారావముల్ విన్చి వ
ర్షాటోపాన జగాల ముంపఁ గల నీ ♦ రర్పించు మేఘాలు బ
ల్వాటం బౌ నొక చిన్న కోన జల మా ♦ స్వాదింపఁగాఁ బెద్ద ము
న్నీటన్ గాంచెను దృశ్య మొక్కటి జగ♦న్నిర్మాత ధీరాత్ముఁడై. 74

ఉ. అచ్చటనుండి తీసికొని ♦ యచ్చటికే మరలించు నీతి తీ
అచ్చుపడంగ నంబుదము ♦ లబ్ధి గ్రహించిన నీరు లబ్ధికే
యిచ్చు నదీవిధంబుల; ము ♦ నీంద్రులు నైగమసంప్రదాయముల్
పొచ్చెము లేనటుల్ స్మృతుల♦బూన్తురు వేదము త్రోవఁ బోవఁగన్.

చ. దెస దెస గల్గు వస్తువుల ♦ దీవుల నెల్లెడ విక్రయించి యా
వసుధ నలభ్యమైన విలు ♦ వల్ గల నూతనవస్తుజాతముల్
వెసఁగొని యోడలం దునిచి ♦ వేడుకఁ గ్రమ్మఱు నోడ బేరులన్
బిసరుహగర్భుఁ డారయుచు♦వేమఱు వారిని బ్రోత్సహించెడున్. 76

ఉ. అంబుజగర్భు నేవకయి ♦ యంబుధిలోపలినుండి సర్పవ
ర్యంబులు వేగ వెల్పలికి ♦ రా గమకించి విరోధిపక్షిరా
జంబు శిరంబు గాంచి నతి ♦ సల్పుచు నూర్పుగముల్ విడంగ సం
ద్రంబున లేచు వీచులు ప ♦ తాకవికాసము లయ్యె మెండుగన్. 77

క. తొలి తన, కుఱువను సెజ్జన్
జెలువారఁగఁ బండు శౌరిఁ ♦ జేరఁగఁ గని యి
మ్ముల నాపద్బంధుం డని
జలధియు నెదురేఁగుఁ దరఁగ ♦ జాల్ బాహులు గాన్. 78

క. ఏలావనముల విడివడి
చాలన్ సౌరభము లొంది § జలకణగణమున్
బాలించి జలధి తెమ్మెర
లాలించుచు వెన్ను చెమట § లను, నింకించున్. 89

తే. చాల నెత్తైన తాళవృ § క్షవనమందుఁ
బరఁగి గేదంగులకును బా § పటల దిద్దు
వాయు సంచారతీరపా § ర్శ్వములయందుఁ
గూరుచుండిరి హరి సైన్య § శూరవరులు 80

ఉ. వారలు నారికేళఫల § వారము లానుచుఁ బచ్చిపోఁకలన్
సారెకు మేల్ రసంబుల ప § సం దిలకించుచు జాను క్రొమ్ముడుల్
చారులవంగసూనప్రస § జంబులచేత నలంకరించుచున్
వారిధికిన్ బ్రియాతిథిజ § నంబులుబోలెఁ జరించి రయ్యెడన్. 81

సీ. ఇది యొక్క గుల్మంబు § నెన్నఁడో గనె మున్ను
వేవేలు గుల్మముల్ § వెలయు నిచట
దీని భూభృత్తు మ § ర్దించెఁగదా మున్ను
భూభృత్సమితి గెల్చి § పోవు నిద్ది
తొలుతఁ గలిన లచ్చి § తొలఁగఁగా మను నిద్ది
సంతతస్థిరలక్ష్మి § జరుగు నిద్ది
యొక తీరమును దాఁట § కుండుఁగదా యిది
నెల్ల ఠావులఁ జరి § యించు నిద్ది

తే. నీచనీచప్రదేశాంత § నిలయ మైన
సాగరం బిద్ది మే ల్త్రోవ § నేగు నిద్ది
వారిధికి వాసుదేవుని § బలములకును
హ స్తిమశకాంతరంబు నిం § డారె నపుడు. 82

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
ద్వారకనుండి శ్రీకృష్ణుని ప్రస్థానముయొక్క
వర్ణనము, ద్వారకాపుర వర్ణనము,
స ము ద్ర వ ర్ణ న ము న నె డి
తృ తీ యా శ్వా స ము
స మా ప్త ము.

శ్రీ ర స్తు.

# శ్రీ మదాంధ్ర మాఘము

## [శిశుపాలవధమహాకావ్యము.]

## చతుర్థాశ్వాసము



### —• రైవతకాద్రి వర్ణనము •—

ఉ. రైవతకాద్రి తోఁచె నెదు § రన్ హరికిన్ హరినీలకాంతిధా
రావృతచిత్రధాతునిచ § యం బయి భూమిఁ బెకల్చికొంచుఁ, బై
పై వడి నేఁగుదెంచు ఫణి § వారపుఁదోరపుటూరుపుం బొగల్
ప్రోవయి రత్నకాంతియుతిఁ § బొల్పు వహించుచు నిల్చెనో యనన్.

ఉ. సానువులన్ మహాశిల లె § సంగఁగ నాపయి యున్నతోన్నత
స్థానములందు నంబుధర § సంతతి సంతతమందు నెల్లెడన్
మానక క్రమ్మి భానుగతి § మానుపఁ బూనిక గొన్న వింధ్యమే
యీ నగమై పునర్జనన § మెత్తెననన్ గిరి యద్ది భాసిలెన్. 2

తే. ఇంద్రనీలంపురాజిగి § నీను సతము
హొన్ను చరియల నునుకాంతి § హొయలు గురియు
నల్లరానిద్దపున్ ముర్వు § లుల్లసిల్లు
తేఁటిగమి విందులకుఁ బిల్చు § తీవలెల్ల. 3

ఆ. శౌరి సహస్రశీర్ష § ములఁ గప్పి మిన్నెల్ల
నిల సహస్రపాద § ములను గ్రమ్మి
నెలయుఁ బ్రొద్దు నేత్ర § ములుగా వెలుంగ న
గంబు తా హిరణ్య § గర్భుఁ డయ్యె. 4

తే. నీరు వెడలంగ తెల్లని § నీరదమ్ము
లలఁతి నుదికిన తెల్లని § యంబరముల
పగిది ధరియించి నగరాజు § నగజ లేని
శర్వు భసితార్ధకాయంబు § సరణి మెఱయు. 5

ఉ. పెంటుల పల్కు తీయముల § వేయు విధంబుల సొక్కి తూలుచున్
దంటతనంబు లేచ్చ దరిఁ § దార్కొనునట్టి పులుంగుఁజేండ్లకున్
వెంటనె రేకు లెల్ల విడ § విప్పిన తామర తెల్లవెల్లులన్
బంటయి పట్టుచుండె గిరి § నాథుఁడు చల్లని నీడ లబ్బఁగన్. 6

తే. స్కంధముల నీలకంఠ సం § ఘాతములును
దరువులం దహిహారముల్ § తరళ శాఖి
కాగ్ర బాహువితానంబు § లమర నమిత
రుద్రులను దాల్చినట్టులీ § యద్రి యొప్పె. 7

తే. వ్రేలు నల్లని కలువలు § వీను సొమ్ము
లుగను లొద్దుగ పుష్పౌఘముల్ § పొలయుచెక్కు
లుగ నులవ యుక్తసైకత § రుచులనిచయ
మీను నీరము దాల్చు గి § రీంద్రుఁ డెలమి. 8

తే. అచట రాజీవరాజీవ § శాఖ లలరు
నుష్ణమూష తరుచ్ఛాయ § లొప్పు మీఱు
మఱియుఁ గాంతాలకాంతలె § వఱలు సురల
సుదతులకు శోఁకుమూఁకల § శోఁకు లేదు. 9

తే. అమరు లచ్యుతు మెప్పించు § నాశఁ దవిలి
మేరుశృంగాలఁ గొని నిల్పి § నారు గిరిని
నంచుఁ గవివరు లాడు ప § ల్కగునె కల
యంద మౌన్నత్య మిందు నం § దమర సమత. 10

తే. పేరికెక్కిన యొక మేటి § బేరినుండి
వలెను రైవతకమునుండి § ప్రస్థములను
గొల్చి యుజ్జ్వలమణిరాశి § కొదువ లేక
లోక మెల్లప్పుడున్ గొనుఁ § దేఁకువ మెయి. 11

చ. బిసరుహబాంధవుండు బలు § వెట్టల గుప్పుచు మండుచుండ నే
దెస నరవిందబృందములు § దీపిలు నాపృథివీధరంబునన్
బిసములు వంగఁదమ్మిపువు § పేన్నును దేనియ లాని మేన మ
త్తెసఁగుట నెండవేఁడి గణి § యింపవు సొంపవు తేఁటిదాఁటులున్. 12

తే. వేలకొలఁదిని గనులట్లు విచ్చు పువులు
వెలయు నొక్క మహోర్వీజ విభుని వజ్ర
రాజితం బగు గండోపశలం బొకండు
సురపతిన్ మోఱియు చౌదంతి సొంపు నింపు. 13

తే. అరుణుచే జాజువాఱు కాశయముల వెలయు
తరణి హయములు వెదురు క్రొంౘ దలిరుటాకు
పసిమి నెసలారు నయ్యద్రి పచ్చరాల
కాంతి రెట్టించి పచ్చనై క్రాలు మరల. 14

క. అన్నగమునఁ బన్నగభా
స్వన్నగ వనసీమ, గరళ వహ్ని యడఁగు ను
త్పన్నపయోదంబులు, సా
రెన్నవనీరంబులంగురిసి తడుపుటచేన్. 15

క. ఇను కిరణంబులు వ్యాపిం
చిన నినకాంతోపలములు చెఱఁగును నిప్పుల్
కన గుణములు పాత్రగుణం
బున బహుగుణితంబు లగుట భూధ్రము తెలుపున్. 16

ఉ. నిచ్చలు చూచుచున్న మల నీటులు వెన్నుని కన్నుదోయికిన్
ముచ్చట లీనె నాయెడల ము న్నెపుడున్ గననట్టి వింత సొ
రచ్చుపడంగ; నట్టిదె క దా క్షణమున్ నునుఁ గ్రొత్తక్రొత్త సొం
పచ్చుపడన్ గనంబడుచు యా రమణీయత కెన్నఁ జిన్నెగన్. 17

చ. అనువుగఁబల్క నేర్చిన వి హంగములన్ దనరారు తన్నగం
బును మన ముల్లసిల్లఁ గన మోమును నెత్తిన గోము జూచి యా
వనరుహనాభుతోడఁ బలు పల్కుల నర్మ మెఱుంగు ప్రోడ గా
వున బలు డాలుకెంబెదవి పొల్పగు దారుకుఁ డిట్లు వాకొనెన్. 18

—* దారుకుఁడు రైవతకాద్రిని వర్ణించుట *—

తే. ఆవృతామిత సర్వ దిగంబరుం డు
దగ్రశృంగాత్త గోమూర్తి నధివసించు
ప్రోడ శీతాంశుకోటి విభూషణుండు
నైన నద్రీశుఁ గని యెవ్వ రబ్రపడరు. 19

తే. పైకి వెల్వడు కాంతులే పగ్గములుగ
నస్తమించుచు నుదయించు నర్కశశులు
పార్శ్వముల వ్రేలు గంటలభాతి మెఱయ
నద్రి దిగ్దంతిలీలల ననుకరించు. 20

క. లసమాననవాంశుకమై
పస గల హరితాసువర్ణవసుధఁ జెలఁగి యీ
వసుధాధరమ్ము హరితా
లసమాననవాంశుకున్ గరము పోలు నినున్. 21

ఉ. ఇందుని బింబమందు స్ఫురియించెడి కందది ముందె యుండు నా
కం దరయంగరాని వెస కంగల చంద్రునిమూర్తి సౌరశై
లేందుని సానులందు వసియించెడి వారలు కన్నువిందుగాఁ
గందురు సుందరాంగుల చొకాటపు మోముల గోములం బలెన్. 22

ఉ. డోసముఁ బాపుకోర్కి బతితుండు భృగుస్థలినుండి క్రిందికిన్
వీసమునుం భయంపడక బిట్టు రయంబున దూఁకు భంగి నే
ల్లీసడిఁ జట్టుబండల పయిన్ బడి శీర్ణముగాఁగఁ దుంపురుల్
వాసిగ నింగి ముట్టి త్రిదివప్రమదా స్మరతాప మార్పెడున్. 23

మ. ఒకచో మేఘకదంబముల్ నిలిచి విద్యుత్కాంతకార్తస్వర
ప్రకటానంతరుచిన్ దలిర్చి యసలారన్ జాతకార్తస్వర
ప్రకరాపేతముగా జలం బిడును భాస్వద్ధూమవుల్ వేఱ యొం
డొకచో నద్రి పిశంగవర్ణమున సంయోజించి భాసిల్లెడున్. 24

తే. ఇందుకరముల రిక్కల నెత్తి నిలుచు
వద్రి శిరముల జానొందు నాకసంబు
చఱియలం గ్రమ్మి వెలయేళ్ల జలము లనెడి
నమ్మకము గల్గఁ జేయు ననారతంబు. 52

మ. ఒకచోటన్ బటికంపు రాతలుకు చెన్నొందంగ జాల్వాఱి వే
రొకసీమన్ హరినీలరత్నరుచులే పొందంగఁ బైఁ బాఱి, య
ర్కకుమారీజలసంగతిన్ వెలయు గంగాభంగతుంగచ్ఛవి
ప్రకరం బీను గిరీంద్రనిర్గతఝరీపూరం బుదారంబుగన్. 26

ఉ. మేరుసమాన వప్రచయ మేదుర సన్మణి సాను రాగముల్
శౌర విలాసినీమణుల చక్కఁదనంబుల గెల్వఁ జాలు నం
భోరుహపత్రనేత్రల స మూహము వల్లభులందు సానురా
గేరితదృష్టి నిల్పి తమ కించుట పొందగు నచ్చటచ్చటన్. 27

క. బంగరు రేఖలు సుధ రం
గుం గల యీవెండిగోడ కొమరారును మే
నం గలయ భూతి మెఱయఁగ
నింగలపుంగంటితోడి మృడు నిటల మటుల్. 28

క. అతి గురువు, లమిత జరఠము
లతి లంబ పయోధ రాలసాలసములు సం
తత వసుభృద గమ్యాలు పరి
ణత దిక్కరిక లగు తటుల నగము భరించున్. 29

ఆ. ఈ సువర్ణతటము భాసిల్లు వహ్నిగాఁ
బూచినట్టితరుల పువ్వులందు
నళులు గప్పఁ గప్పు లలరెడి ధూమశో
భలఁ దలిర్పఁ జూడు వనజనయన. 30

చ. వికసిత పుష్ప సంభరిత విశ్రుత కాంచన భూజ రాజితో
సకల దిగంతముల్ పసుపుఁ జాయ వహింపఁగ నింగి దాఁకి మే
రు కుధర సానుతుల్య తట రూఢులఁ దాలుచు నద్రి, కాన త
న్నికటపుదేశమెల్లఁ గను నిత్య మిలావృత వర్ష సంపదన్. 31

చ. కనులకు వింతవింత లగు కాంతులు బండు వొనర్ప రోమముల్
దనువుల భాసిలంగ బలు తావులయందుఁ జరించు లేళ్ళు కొం
డను గల రత్నభాగములు డంబుగ జంగమరూప మొంది యీ
యనువున గోచరించినటు లౌను జుమా! గనుమయ్య యచ్యుతా! 32

ఉ. ముప్పది వత్సరాల్ వయసు మున్నరికన్ గనుగాన నట్టి బ
ల్పొప్పిన యేన్గుగున్నలు సముద్ధతి నాడును దమ్మిపూలతో
నొప్పులకుప్ప లౌ నిజత లోదరు లొద్దను సిద్ధసంఘముల్
దెప్పరమంది డెందము గడించి స్వరంబులసల్పు గానముల్. 33

మ. తమమందుం బడి దైవయోగమునఁ దఽద్దైన్యంబు వో యుక్త కా
లము వాంఛించెడి వేవెలుంగుదొరకున్ ఽ లాఁతుల్ దరిన్ జేర సా
ధ్యము కానట్టి తదీయపావనకళఽత్రస్థానముల్ గూర్చ నో
ర్చు మెయిన్దాము వహించు నీశిఖరి నాఽరూఢంబు లౌ నోషధుల్.

ఉ. తేనియ లానఁగా ముసరుఽ తేఁటుల కోటులు కాటు కౌను, బూ
లౌను గనుల్ వనస్పతులఽ యందపుస్కంధములే భుజంబు లౌ,
వానిని బట్టి వ్రేలఁబడుఽ పల్లవముల్ మృదుపాణు లౌ, నిటుల్
మీనవిలోచనామణులఽ లీలల నేలెడి నీగిరిన్ లతల్. 35

క. బహు లయ సంగతితో నీ
విహంగములు పాడు, నీపఽ విటపి వనమునన్
విహరించి కలఁచుఁ బవనుం
డహంకృతిని ఘనవితానఽ మటు నిటు చెదరెన్. 36

ఉ. ఇమ్మలలో వసించు నిధుఽ లే నిగమప్రకరస్థ మంత్రరా
జమ్ములఁ బోలి పాపతతిఽ సంగతిఁ బాపు శుభంబు లోము శా
స్త్రమ్ము లెఱుంగు విప్రుల విఽ ధమ్మునఁ; దజ్జ్ఞులు చెప్పఁ జిత్త శౌ
చమ్ము గలట్టి వారెఱుఁగఁఽజాలుదు రన్యు లెఱుంగ రింతయున్. 37

తే. ప్రియను బింబోష్ఠి మోము చుంఽబించు కిన్న
రుం గనుచు మెచ్చు నొక్క తుఽరంగవదను
డతఁడు కుచభారనతమధ్యఽ నతివఁ గౌఁగి
లింపఁ దురగాంగుఁ డరసి హఽర్షించి మెచ్చు. 38

తే. శైలమందున వెలయు తఽమాలతాల
వనము నరయుము దట్టమైఽ వనజమిత్రు
కరము చొరనీదు చూడనీఽ కాననమున
నలరు లమరని యొక లతఽ యైనఁ గలదె? 39

సీ. రమణీయదంతాభిఽ రామాకృతులు వారు
రమణీయదంతాభిఽ రామము లివి
యమలశిలామేఖఽ లాంతాకృతులు వార
లమలశిలామేఖఽలాంతము లివి

మణిచిత్రికటకసం § పన్నాకృతులు వారు
మణిచిత్రి కటకసం § పన్నము లివి
స్నిగ్ధగండస్థలా § న్వితాకృతులు వారు
స్నిగ్ధగండస్థలా § న్వితము లివి

తే. పృథునితంబసమంచితా § కృతు లుభయము
నగుట నారీలలామ లీ § యద్రిరాడు
పత్యకలయందు విహరింత్రు § నిత్య మిచ్చ
కనుగుణంబుగఁ గంటివే § యబ్జనాభ! 40

తే. కొన్ని మాత్రమె మగరాల § గొనబుతున్క
లలము తెల్లని వెండి తా § వులు కొలంది
తడవు క్రిందట మబ్బులు § విడిచినట్టి
బుడగ లుడివోని నీటి సొం § పును వహించు. 41

మ. ప్రియసాంగత్యసుఖంబు నెంచి జనమున్ § వీడ్కొంచు నేకాంత మ
వ్యయమారాగ్నిఁ దపించుచున్ గనులక్రే § వల్ సుంతమూఁతల్ వడన్
భయమున్ జెందెడి యౌవతంబు గనియం § తన్ నెచ్చెలుల్ చుట్టు మూఁ
గి యిటన్ గాసిలుచుండి రారయుము చ § క్రీ! యాదవోద్ధారకా! 42

ఉ. కీచక వేణు సంతతులఁ § గ్రిక్కిఱియన్ జమరీగణంబు పె
ల్లేచిన వాలరోమ మొక § టేనియు ఛిన్నము గాని రీతిగాఁ
బ్రోచుకొనంగ నిట్టునటు § పోవక నిల్చును వాయుపూర్ణ త
త్కీచక రంధ్ర నిర్గమిత § గీతిరవ శ్రుతి ముగ్ధ మై నటుల్. 43

మ. నుమముత్యంబుల డాలు పాల సిరియున్ § బొల్పారఁగా నీరమున్
ఘనముల్ నింపఁగ వాపికాతతిఁ దదం § తర్లీన నీలాశ్మ ఖం
డ నిశాత చ్ఛురికాఽసితాంశువులు గ్ర § స్సన్ స్వచ్ఛ మౌ తజ్జలం
బును నీలీసలిలంబుగాఁ బరిణతం § బున్ జేయు నీ యద్రిపై. 44

ఉ. అందఱకన్న మిన్న యగు § నంబుజవక్త్రి నొకర్తుఁ బ్రేయసుం
డందఱ వీడి చేరఁ జని § ప్రార్థన సేయఁ దిరస్కరించియున్
డెందమునందుఁ గిన్క విడి § కీవిగ నిందుఁ జరించు భర్తకున్
మందముగాని సౌఖ్య మిడి § మానవతీమణి పొంగు నాత్మలోన్. 45

తే. కెంపు మిన్కులు పయిఁ బర్వఁ గిరణ మొకటి
వేయి వలెఁ దోఁపఁ జంద్రుని వే వెలుంగు
గాఁ దలఁచి పద్మిని నిసిన్ బ గంటవలెనె
వికచ కోకనదత్వమ్ము వెలయఁ బూనె. 46.

ఉ. జంకును గొంకు లేక తన సన్నిధి నంకమునన్ జరించు నీ
వంకలు స్వాత్మజాతలు స్వభర్తృగృహంబును జేరఁ బోవుచో
నింకని వత్సలత్వమున నిందలి పక్షివిలాప మెంచుచున్
బింకము వీడి తోడ విలపించెడి నిన్నగ మన్నటుల్ దగెన్. 47

క. విటపానమితలు బంభర
విట పాన సమృద్ధ వృక్షవితతి దలిర్చున్
పటుపాక పిశంగలతో
త్కట సూన రజః పిశంగకటకము లివి గాన్. 48

మ. గిరి శృంగంబులనుండి జాఱి పడుచున్ గ్రీవాడలం జేరు ని
ర్ఝరనీరంబులు రత్నకాంతు లలమన్ సంజాత శృంగారది
క్కరిశుండంబును బోలు, నింద్రుని ధనుః ఖండంబు వ్యత్యస్తమై
ఖరి బ్రేలంబడినట్లు గానఁబడెడున్ గంజాక్షి! కన్గొఁగదే. 49

చ. పలుపలు రంగు లీను సుర పాదపచారు సుమంబులన్ గడున్
జెలువము లొప్పఁగూర్చిన విచిత్రపుదండలఁ బోలునట్టి పు
ల్గల పురు లద్రిరాట్ఛిఖర కోటికి శేఖరపంక్తిఁ బెట్టిన
ట్టుల కనువిందుగా నగపడున్ క్షణకాలము తేఱి చూడుమా. 50

చ. అమృతము గోరి మంధరధరాంతికసీమకుఁ జేరు దివ్యసం
ఘములను బోలువారు, సుఖకాములు కోకనదారుణాక్షిధా
మములఁ జెలంగువారు నిజమానినులం దమతోడు గాఁగ శై
లము దరులన్ నవీనరతులన్ సుఖియింపక మాన రెన్నఁడున్. 51

ఉ. తెల్లని పూలదుప్పటిని తీరుగ కాయము నెల్లఁ గప్పి లో
నల్లన నంగభాగముల నార్చెడి యాగరవత్రిధూమ మ
ల్లెల్లెడ పావురా మెడల హెచ్చుగ నల్పు వదల్పు నల్పు రం
జిల్లు మొయిళ్ల పెంపు వెలసెన్ గిరి కెత్తిన ధూపధూమమై. 52

ఆ. వె. విగతదోష రత్న విస్తృతకిరణముల్
కలసి మింటఁ జిత్ర గతులఁ దోఁచు
గుడ్యశూన్య మైన గొప్ప చిత్తరు వని
ఖచరు లబ్రిపడుచుఁ గందు రిందు. 53

ఉ. మారుతశీత మై శిఖర మండలినుండు సుఖాభిలాషలౌ
వారలకున్ ముదంబు గొలుపన్ జల మెల్లఁ దొరంగి తెల్లనౌ
శారదవారిదంబుల పెసన్ దెరలట్టుల నిల్పి యిమ్మహో
దారనగం బుదారచరితమ్మన రూపున మిన్ను దన్నెడిన్. 54

సీ. మఱియు భోగస్థాన మాత్రమే కా దద్రి
ముక్తజనాశ్రియం బును జుమయ్య
మహితపుణ్యుల యెడ మైత్రి దుఃఖులయెడ
కరుణ సుఖులపట్ల నరిది ముదము
పాపులయెడ నుపేక్షాపద్ధతియు నాల్గు
శుద్ధిమార్గంబుల బుద్ధి నెఱిఁగి
యస్మితారక్త్యవిద్యాభినివేశవై
రములను నైదు క్లేశముల మాపి
తే. ప్రకృతిపురుషులు వేఱన్న భావ మరసి
చిత్తమును శూన్యవృత్తిగాఁ జేసి యెపుడు
బీజయోగంబు సాధించి విమలముక్తి
కోరు సాంఖ్యులకీ కొండ గొప్ప యండ 55

తే. అర్కకిరణాలు తరువిటపాంతరముల
నుండి మరకతభూములం దోలి వ్రాల
నచట మెఱసెడి యణురేణు నిచయమొందఁ
గలిగె నవనతశితికంఠ కంఠలక్ష్మి. 56

చ. నిగనిగలాడు నీలిమను నేటయి పీఱియ మీటులందు జా
మగ నునుతంత్రులం జెలఁగు నూతనగానములన్ వెలార్చు తేఁ
టిగములు పజ్జ మూఁగి కడు తీవిగ వీనుల విందొనర్చ నే
మగువ నమస్కరింప దభి మానము వీడి నిజేశుఁ జేరుచున్. 57

ఉ. సాయపువేళ రేవెలుఁగు చల్లని చాయలు చల్వరాల పై
గాయఁగ మెల్లఁగాఁ గరఁగి కాల్వలువాఱిన నీళ్లఁదోఁగి జ్వా
లాయుతసూర్యకాంతమణులన్ రహి గొల్పెడి వహ్నికీల లం
దాయత మౌ మహావ్రత మహంబులఁ దీర్చు గిరీంద్రసానువుల్.

సీ. అధికపిశ్రీలును నధికపయశ్శ్రీలు
పటుకమనీయసంపత్తిఁ జెలగ
పవమానసుతుజవ వివిధసంచారముల్
వివరింపఁజాలెడి విభవ మెసఁగ
లలితావిరతరామ లక్ష్మణాంచితములై
వీనువిందొనరించు జాను మెఱయ
నీరైవతకగిరి జారతాస్థానులై
యెన్నెన్ని సరసులో వన్నె గాంచు

తే. వరలు నిక్కొండ *"భరితకబంధభంగ
ములును" పవనజజవమునఁ బలితములును
సతతమరహితరామలక్ష్మణములు నయి
సరసు, లలనాకుభవసూక్తి సామ్య మెనసి. 58

క. కలభైరవరీతి ముదిత
కలభముల రవంబు లెల్ల కడల నలము ని
మ్మల నెల్ల వనములం జమ
రులుఁ గాంచనరత్నఖనుల రోచులఁ దోఁచున్. 60

* మూలమున "అధికపయః శ్రియమ్" అను శబ్దశ్లేష మాంధ్రీకరణమున నసాధ్యము. ఒక యర్థమున "అధిక, పయఃశ్రీ" అనియు, రెండవయర్థమున "అధికపయః" అని, "అధికపి" శబ్దబహువచనాంత రూపము తెనుఁగునఁ గుదురదు. కాన, ఆయర్థమును విడిచి అర్థశ్లేషమున కనువుగా కబంధ=నీటియొక్క; భంగ=తరఁగలచే; భరితములని సరసుల పక్షమునను, కబంధ=కబంధుఁడనెడి రక్కసునియొక్క; భంగ=నాశనముచే; భరితములని రామాయణపక్షమునకు సరిపడునట్లు "భరిత కబంధభంగము" అని యీయొక్కతావున మాత్రము మూలము విడువఁబడినది.

తే. కస్తురిమెకాల రాయిడి గంధిల మయి
రల్లక మృగాంగకముల స్పర్శసుఖ మాని
వేణురంధ్ర నిర్గతగీతి వినుచు వాయు
వలరు రాగియు బలె విషయానుషక్తి. 61

ఉ. ఈ నగసాను భూములను హేళి మరీచుల దవ్వు నేసి సం
ధానము చేసి చీఁకటిదినంబుల రేలని భ్రాంతి గొల్పి యిం
పూనఁగ నల్లమబ్బుగము లొయ్యన దంపతులన్ విలాస ఖే
లానవతశ్రమం బుడిపి యవ్యయమోదము లందఁజేసెడున్. 62

చ. కటములపై మదం బడరి కాఱఁగఁ గండువు దీర్చుకో మదో
త్కట మగు దంతి పూవులను దాలిచి నేలకు వంగినట్టి యా
కటక మహీరుహంబు విఱుగగన్ బొడవన్ నెలవేది యల్క మై
పటువిషవహ్ని గ్రక్కె ఫణి, పాపుఁ గదా! చెడు కిన్క స్వార్థమున్.

మ. సకలైశ్వర్యమహానిదాన మగు నీశానుండె శీతంబునన్
బ్రకటార్తిం బడి కట్టఁ గప్పుకొన మేనన్ సాంద్రనాగాజినం
బొకటే దాల్చు హిమాద్రి; నీగిరినో ద్వంద్వోపప్లవం బింత గ
ల్గక నిర్వేదయు సంతసిల్లు ఋతుసాకల్యోదయన్నిర్వృతిన్. 64

ఉ. చుట్టును దెల్లరా తళుకు సొంపులు నింపఁగ మధ్యనూత్నముల్
దట్టములైన మబ్బుల విధంబగు కానల కోనలూని యీ
గట్టులమిన్న భస్మపునిగారపుఁ బూఁతలఁ దెల్లనై మెయిన్
గట్టిన నాగబంధముల నల్లన యైన త్రిశూలిఁ బోలుఁ దాన్. 65

చ. వికసిలు తమ్మిపూలు కనువిం దొనరించెడు రెండుగట్టులన్
బ్రకటిత మౌ నచంబులఁ గరంబును దోఁగి శ్రమంబులాఁగి స్వ
ర్ణకృత విభూషలం దొడిగి నాణెపు బైషవమద్య మాని పౌ
లుత్తికల పయంటలన్ దొలఁగఁ ద్రోతురు యాదవవీరకుంజరుల్. 66

చ. మలఁగల వెండిగోడల సమంచిత దర్పణ నిర్మలంబులం
దలమి తమోహరార్కకిరణావళి యవ్వల వెన్కనున్న ను
జ్వల వసు కందరంబులను బర్వఁగ నయ్యెడ వల్వ జాఱు యో
షల కుదయింపఁ జేసెడిని సమ్ముఖుఁ డయ్యును హేళి లజ్జలన్. 67

* ఉ. ఈగిరి సీరపాణి ధరిఽయించిన చేలమువోలె నల్ల నై
వేగయు తానిలాహతి దిఽవిన్ భ్రమియించుచుఁ దుంగశృంగరా
జీగతి నొప్పు మబ్భ్రగమిఽచేఁ బొలుపొందుచు సంభ్రమాన న
భ్యాగతుని న్నెదుర్కొనఁగఽ నాఁదట లేచుచు నున్నటుల్ తగెన్. 68

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
రై వ త కా ద్రి వ ర్ణ నం బు ను దా రు కుఁ డు
రైవతకాద్రిని వర్ణించుటయు ననెడి
చ తు ర్థా శ్వా స ము
స మా ప్త ము.

—•—

* ఉ. ఈగిరిరాజు కానఁబడెఽ ని త్తటి నీగతిఁ జేరినట్టి య
భ్యాగతు వి న్నెదుర్కొనఁగఽ నాత్రముతో శిఖరాభమై మరు
ద్వేగవిధూత మౌటదిరిఽ గ్రేలుచు సీరి ధృతాతినీలవా
సోగతి (గ్రాలు మబ్భ్రగమిఽ సొంపెసలారఁగ లేచెనో యనన్.
అని పాఠాంతరము.

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

## [శిశుపాలవధమహాకావ్యము.]

## పంచమాశ్వాసము



### —* స్కంధావారసన్నివేశాదివర్ణనము *—

చ. ఇటువలె దారుకుండు వచియించిన పల్కులు సూనృతంబులై
పటుగతిఁ బ్రేయసీ సదృశభావము నొందుచుఁ జారుమాధురీ
పటిమను గర్ణపేయముగ భాసిల శౌరియు సాంద్ర కాననో
త్కట తట భూధరంబునను దా విహరింపఁగ నెంచె నయ్యెడన్. 1

మ. ద్విపరాజంబుల వైజయంతులను భూవిస్తార సంవ్యాప్తులన్
సుపరీతం బగు పద్మనాభు బల మక్షుద్రంపు శృంగంబులన్
విపులాంచత్కదళీ వనావళుల నుర్వీ విస్తృతి వ్యాప్తులన్
సుపరీతం బగు కొండ యందఁ జనఁగా శోభిల్లు మార్కొండయై. 2

మ. అల భాస్వత్కర మంబరాంతముల నల్లల్లన్ స్పృశింపన్ హరి
ల్లలనల్ "లోకులు తమ్ముఁ జూతు" రని మందాక్షార్తితో ముగ్ధలుం
బలె నేనల్ చను త్రోవ రేఁగి కడు సాంద్రం బౌ ఫరాగంబు ను
ష్ట్రిల సత్కంఠ కడారువున్ బయి సమాచ్ఛాదించుకొం ద్రొయ్యనన్

సీ. అలిక మాదిగ దళస్థలములం దెసఁగు నా
వర్తమ్ములే జలావర్తములుగ
రాజ్యాదిశుభఫలప్రదము లై యొప్పారు
ముత్తెమ్ములే యాణిముత్తెములుగ
సొగసు గుల్కెడు మెడన్ సొమ్మై యలరు దేవ
మణిగణమ్ములె దేవమణిగణములు
స్వామి సౌభాగ్య సంవర్ధన గళ రోచ
మానంబులే రోచమానములుగ

తే. విభ్రమ స్ఫుర దూర్మలే విభ్ర మోర్మ
లుగఁ జెలంగఁగఁ బార్శ్వంబు లొఁగి నలముచు
రయమునకుఁ 'బెట్టినది పేరు' లయి వెలయుచు
నశ్వసేనలు వార్ధుల ట్లవని నలమె. 4

తే. కుంభములక్రింద నాటినంకుశముఁ ద్రోచి
కరుణ పుట్టగఁబెట్టుచుఁ బఱచు కరియు
బరువిలఁబడంగ నెగురుచుఁ బఱచు నొంటె
దారి నొండొంటిఁ దారి భీతంబులయ్యె. 5

తే. చంచలాగ్రపదమ్ము నుచ్చలిత చామ
రాభిరామ మౌ నశ్వంబు, నర్ధ మీలి
తాక్ష మౌ దంతి నొక గతి నరసె జనము
ప్రీతిఁ గూర్చుఁ గదా! యెల్ల జాతిచేష్ట. 6

ఉ. వింతగ నవ్వి రౌక్కపతి ప్రేక్షకు లెల్లఁ గరేణుభీతమై
గంతులు వైచుచున్ బఱచు గర్దభి వీఁపున జీనువాసి యొ
క్కంతిపురంపుటింతి గళితాంబర మైన నితంబబింబమొ
క్కింతయు మాటుకో నెఱుఁగకే యిలఁ గూలుటఁగాంచి యెంతయున్

తే. నగము ప్రాంతపు నేల పై నడచు తేర్ల
చక్రధారల నలఁగు ప్రస్తర రజముల
నాదుకొని ఘూరజము మింట నబ్దమూ లయి
ఖర తనూరుహ ధూసరకాంతి మించు. 8

తే. గొరిజ తాఁకిడిఁ జెదర మిణుగురులు పలక
దేరు రానేల పౌంతల దారులందు
వారువంబులు పేరెముల్ వాఱు గిరిని
డోళ్లు వాయించునట్లు చప్పుళ్లు పొడమె. 9

తే. ద్వివిధవేగమ్ములన్ మాన్పి తీర్చి సమత
ముప్పిధంపు కశాఘాతముల నెఱుంగు
రౌతు నడిపించు నౌర! యారట్టజమ్ము
లలితపారుష్య మర్ధ పులకాయితంబు. 10

ఉ. యాదవసేన లగ్గిరి విఽహారము సల్పెడి తావులందునన్
మీఁదికి లేచు ధూళితతిఽనింగిఁ జరించి హిమంబు వైఖరిన్
బైదలిపిండు కన్గవలఽపక్ష్మపుసాంద్రత లిన్మడింపఁగాఁ
బ్రోది యొనర్చి మేలిమురుఽవుల్ గనె దిఙ్ముఖపాళిఁ గప్పుచున్. 11

మ. కరికుంభంబులఁ జీల్చుచోఁ దగులు ముఽక్తారాశి గోర్సందులం
దిరవై యుండెడి సింహసంహతుల నెంఽతే శత్రులం బోలి తెం
పరులై చంపిన రాలు ముత్తెములు గుఽప్పల్ గుప్పలై యొప్ప ని
ల్చిరి యద్రీంద్ర గుహా గృహంబులను జఽక్రివ్యూహవీరోత్తముల్.

చ. ముకుకొన బట్టినంత గడుఽమూర్ఛిలు సర్పము సాంద్రపంక యా
వక రమణీయ కాంతులనుఽభాసిలి వ్రేలెడి పుచ్ఛ మొప్ప ది
వ్యకళ రచింపఁ బడ్డ విహఽగాధిపు చిత్రము గల్గు టెక్కెమున్
బ్రకటముగా గ్రహించి హరిఽపజ్జ బసల్దిర న్యభూపతుల్. 13

మ. జనముల్ చేరిన తావులన్ దరుమహాఽచ్ఛాయాసుఖం బున్న ముం
దునకున్ సాగు మఱింత సౌఖ్యముల నెంఽతో మంచి తా వబ్బు నం
చును లో నెంచుచుఁ బ్రస్తుతాశ్రయము ద్రోఽచున్ లోక మత్యంత మొ
య్యన నాగామిసుఖాభిలాషఁ గల మాఽహాత్మ్యంబు సామాన్యమే!

ఉ. ముందుగ నేఁగి యొక్కఁడు చఽమూచరుఁ డర్హనివాస మొక్కఁ డా
నందము మీఱఁ గాంచి జతఽనంబునఁ బిల్చిన వేఱ యొండు తా
వొందఁగఁ బోవు సైనికులఽయుద్ధతి కాకులుఁడై ప్లుతస్వరం
బొంది స్వకీయులన్ బిలుచుఽనుద్యత బాహువుతో దవిష్ఠుఁడై. 15

చ. వనతరువుల్ వదాన్యతరుఽవారము కాకయుఁ బ్రోవఁ జాల డ
స్సిన హరి సైనిక ప్రజకుఁఽజిత్త మెలర్ప శ్రమంబు వాపి కూ
ర్చెను సుఖమున్ సుధా రస నిఽషిక్తము లైనటు చిత్ర మౌ ఫల
ర్ధిని విట పార్పి తాంబర పరిఽష్క్రియ లిచ్చెను గల్పకంబులై. 16

ఉ. పల్లకి మున్నుగాఁ గలుగుఽవాహనముల్ డిగు భూమిపాల సం
ఫుల్లసరోరుహాననలఽమోముల మేలి ముసుంగు జాఱఁగా
నుల్లమునం భయోత్సుకతఽలొప్ప క్షణం బరయంగనేర్తు రం
తెల్లరు దవ్వు పొందని వఽచించెడి కంచుకి గన్మొఱంగుచున్. 17

ఉ. అంతిపురంపుటింతుల హ।యంబుల జీనులనుండి దింప న
త్యంతనియోగముల్ బడయు।నాయధికారులు మార్దవార్తిబా
హ్వాంతరముల్ స్వకంఠముల।నంటఁగఁ గౌఁగిలి నొంద స్వచ్ఛసు
స్వాంతపవిత్రు లౌట మఱి।యయ్యెడ ముద్దిడుకోరు చెక్కులన్.

మ. పలు వన్నెల్ గల పూలదండ లమరిం।పన్ జూడ జాన్నైన చం
చలనేత్రా కబరీభరంబు నొక వృ।క్షచ్ఛాయ నీక్షించి నె
మ్మి లసత్పింఛపరాభవార్తి గని భూ।మీజాగ్రమున్ వీడి ద
వ్వులఁ బాఱెన్ గుణిపజ్జ నీర్ష్య గల య।ల్పుం డెన్నఁడే న్నిల్పునే?

చ. నిగనిగలాడు క్రొంబసిఁడి।నిగ్గుల నల్గడ విస్తరింపఁగాఁ
దగి యురువంశకేతనవి।తానము నింగిఁ జెలంగు గబ్బిమ
బ్బుగములఁ దాఁకు నున్నతులఁ।బొల్పగు తేరుల బారు లొప్పె బా
గుగ నల కొండదండ నెల।కొన్న యలంతులు గుండులో యనన్.

ఉ. ఛాయలఁ జిమ్ము చున్నతు లె।సంగఁగ సంతతభూతిరేఖలన్
బాయక యాణిముత్తెముల।బారుల తీరును గైరికాది సాం
ద్రాయతరక్తిమల్ వెలయు।యాదవనాథుల బల్గుడారు లు
చ్ఛ్రియ సమంచితమ్ము లగు।సామజరాజములట్ల రాజిలెన్. 21

చ. కరము పటీకుటీరములఁ।గట్టిన కాండపటాళిసందులన్
జొరఁబడు గాలి రివ్వల వి।సుర్లను జెమ్మట బిందులాఱ, రా
జరమణు లంత నిద్దుర లె।సంగ సుఖంబులఁ బారవశ్య మొం
దిరి నునుఁబచ్చికల్ సహజ।నిర్మలశయ్యలు గాఁ దనర్పఁగన్. 22

ఉ. చెమ్మట లూరఁగాఁ దడిసి।స్వీయకథావళి విస్తరించు స్వీ
య మ్మగు రైక గోటికొన।లైన క్షతంబుల రేఁప నూడ్చి చో
ద్యమ్ముగ బాహుమూలకుచ।దర్శన మిచ్చు కృశోదరీలలా
మమ్మును నేత్రపర్వముగ।మాన్పడి చూతురు యౌవనోద్ధతుల్.

ఉ. దం డటు లయ్యెడన్ విడియఁ।దత్క్షణ మావణికుల్ చొకాటపున్
నిండు గుడారముల్ నిలిపి।నేటగు బాటకు రెండు ప్రక్కలన్
మెండగు వస్తుజాతులను।మించు బజారుల వేలు వేలుగా
నుండెడు ఫక్కి నెక్కొలిపి।రుత్సుకులై క్రయకుల్ భ్రమింపఁగన్

మ. "ఫల మల్పంబు శ్రమం బనల్ప" మనుచున్§భావింప కే మట్టియుం
డలుఁ గట్టల్ గొని జట్టు చుట్టు నిలువన్ § దద్భీతిఁ గుందేలు బ్రాఁ
కుల మధ్యంబున నుండి దూఁకఁ గని యొ§క్కొక్కొం డప్పు వారించి వా
రలఁ గారుణ్యము మీఱ నా శశకమున్§రక్షించె మెచ్చన్ జనుల్. 25

చ. విడిదల చెంగటన్ బెదరి § వేగమ పర్విడు లేడి వెన్క నె
వ్వఁడు విలునమ్ముఁ బట్టి చన§వాంఛయునుం గొనఁ డట్టులైనఁ దా
నుడుగదు లేడి పర్వ, వర§యోధలతాంగుల వీనులంటఁ బ
ర్విడు కనుచూపు తూపులకు§స్వీయదృశాపజయంబు నెంచెఁ బో! 26

ఉ. త్రోవ జనించు నాశ్రమము § ద్రుంగునటుల్ పడకింటి సెజ్జ ని
ట్టే వెలయించి సొమ్ములు వ§డిన్ దొడి కట్టి ప్రసాధితాంగులై
రోవెలఁదుల్ విడెంబులు వి§రుల్ వగ నిచ్చి చిరానుషంగులౌ
భావుకులన్ బలెన్ స్వవశ§వర్తులఁ జేసిరి పూరుషావళిన్. 27

ఉ. తోఁగిరి వారిఁబట్టి దగ § దోసిలి ద్రావి విశుద్ధిఁ జేయఁగా
సాగిరి మేలివస్త్రముల § సారబిసంబుల మెక్కి రంబుజ
శ్రీగరిమంబు లొదల ధ§రించిరి యోధులు "పర్వతాపగా
పూగసమృద్ధి వ్యర్థ" మను § పూర్వుల మాటల వీటిఁ బుచ్చుచున్.

మ. నెలలన్ బుట్టు చలత్ప్రవాహజలముల్ § సీమంతినీ సానుభూ
తల సంకాశ నితంబసేతువుల రు§ద్ధం బౌచు దన్నిమ్న నా
భుల నిల్పందుచు వారి మడ్డుకములన్ § బ్రోఁగింపఁ ద్రుళ్లాడు మాం
సలవక్షోజము లందు దూఁకి పడుచున్§జాల్వారె మందంబుగన్. 29

చ. తనువులు భార మంచనక § దవ్వున కేఁగినఁ బుట్టు గాసిఁ బై
కొను నెఱ యూర్పుతో వెడలు § కుంభగతం బగు మౌక్తికవ్రజం
బనఁగఁ గరాగ్ర మెత్తి కల§యంగను జల్లెడు నీటివానలన్
గొవకొని మేనులన్ దడుపు§కొంచు సుఖించును దంతియూథముల్.

మ. చెలువుల్ మీఱు కుథాద్యలంకరణముల్§జెండాలునున్ డించినన్
బొలుపున్ గాంచు చమూమదావళము లై§మునితెక్కలం గాచుకో
జలధిం బడ్డ గిరుల్ పవి క్షపిత ప§క్ష శ్రేణులై నట్టి కొం
దలునుం నేఁడు జనించె నేమొ సరసీ§స్నానేచ్ఛ నా నొప్పెడిన్. 31

—* గజవర్ణనము *—

చ. అలఘుసరోవరంబున మహోరయయుక్తతరంగమందు ను
జ్జ్వల మగు నైజరూపమె వెసం గని తన్నెదిరింపవచ్చు నే
న్గల యెకిమీఁదటంచు భ్రమఁగొంచును వారణసార్వభౌముఁ డ,
గ్గల వేలిగ్రక్కుచూడ్కి నుఱుకున్ గన నయ్యది యుక్తమే కదా!

చ. పరగజదానదుష్ట మని వారిని ద్రావదు, తృష్ణ హెచ్చుటన్
గరము పిపాస వీడ్కొనదు, కాలు మెదల్పద, యంకుశంబు చె
చ్చెరఁ బడఁ జిమ్మి నిప్పుకలు చిందఁగఁ జూచు నొకేన్గు నీరు గ్ర
చ్చుఱఁ గొనవచ్చు వారు పెలుచన్ బఱవన్ జలరిక్తపాత్రులై. 33

చ. "కుటిలశిరోజ చూడు మదిగో యొక దంతివిభుండు దారి ప
ర్యటన మొనర్చు నీకుచము లారసి వాని పరేభకుంభపుం
దటము లటన్న భ్రాంతి కరతాండవమున్ బొనరించుఁ బోకు మ
చ్చట" కని మాన్తురయ్యెడలఁ జానల మేలము లాడుచున్ విటుల్.

ఉ. దిక్కరిరాజి గెల్చి గడిదేటిన వారణరాజ మొండు దాఁ
జెక్కు మదార్తిఁ బాపుకొనఁ జేతను బట్టుచు నీరు పై పయిన్
మిక్కిలి జాఱఁ జల్లుకొను మేదురలీలలు రెల్లుపూల స
మ్యక్కలితస్వరూప మయి మానితచామరసామ్యమున్ గనున్. 35

ఉ. ఒక్క మదావళంపుమద మొప్పెడి గాలి మెయిన్ స్పృశింప నీ
వెక్కి ఘటొక్క యేన్గు గవ కిట్టటు పుక్కిట నుండు నీరముల్
గ్రక్కున ధూత్కరించి ముసలప్రతిమానములైన కొమ్ములన్
దిక్కకొలంది నాజిలధితీరము గ్రుచ్చుచు వ్రాలె నేలపై. 36

చ. ఉరుతరదానపూర్ణుఁ డగు నొక్కఁడు ముక్కడి యై జడాల్పధీ
పరివృతుఁ డైన వానిదగు పజ్జల నిల్వ నెవండు గోరు? ను
ర్వర మరియొండు చోట నిలువం జనుఁగాని జలాలఁ దోఁగఁగాఁ
గరి యరుగన్ మిళిందతతి గండము వీడ్కొని నిల్చె నింగిపై. 37

తే. నీట నేనుఁగు మునుఁగంగఁ దేఁటిదండు
గండయుగళి విడచి యట్టె యుండె దివిని
గుణిపమాశ్రితం బైనను గుణము సతము
నీలవర్ణము పేర్చెడి నిలిచి నట్లు. 38

చ. జలముఱి విహారమందిరము, సామజపుంగవుఁడున్ సరిన్మణీ
లలనయు దంపతుల్, మమతలన్ విహరింప యథేచ్ఛ లీల ను
జ్జ్వలగజకాయ గైరికసువర్ణపటంబు గొనున్ స్రవంతి; త
జ్జలజపరాగయుక్త మగు సన్నని చేలము దంతి గైకొనున్. 39

చ. సలలితధారగా మదము జాల్కొను నేన్గు మదంబు లేశలన్
గలియుచు మండలాకృతులు గాంచుట నయ్యెడ నేత్రపంక్తి యొ
ప్పులు గనె; నీటఁ దోఁగి తటముల్ గజ మెక్కెడు వేళ నల్లగ
ల్వలు మెయి నంటఁ దోఁచెఁ "గనులన్ గొనె మాఱుగదాను"
నన్నటుల్. 40

ఉ. వైరముతోడ వన్యకరిపైఁబరువెత్తెడు దంతి నాఁపఁగా
సారతరాంకుశంపుఁగొన జయ్యన లోఁతుగ నేత్రగోళమున్
జేరఁగఁ గ్రుచ్చి యైనఁ గరి నిల్పఁగఁ జాలఁడు మావటీఁ డహో!
శూరులు సాహసంబులకె చొత్తురుగా పరు లెంత యడ్డినన్. 41

చ. చనవున బుజ్జగించుచు నిషాది యొకం డొక యేన్గుఁ గట్టఁగా
నను వగు చెట్టునీడ కెలయన్ జనఁ ద్రోలఁగ వన్యహస్తి వా
సన యటఁ దోఁచి, నిల్వ కల సాలము భగ్న మొనర్చివేసెఁ గి
న్కనెనసి, యెయ్యెడన్ బరులగంధము మానధనుల్ సహింతురే?

చ. గిరివరకాననంబులను గ్రీడకునై విహరించు వన్య మా
కరివర మొంటి చెక్కిళుల కండువు వోవఁగ రాయఁ జిందు బం
ధురమదవారి వర్ధిలిన తుంగమహీజముఁ గూల్చె సైన్యపుం
గరి విరు లెల్ల వాడ, నళికాండము రేఁగి చనన్ యథామతిన్. 43

ఉ. అల్లనఁ జేరి భూరుహశిఖావళి మేయఁగ మాన్ప రాక రా
గిల్లు మదేభయూథము స్వకీయ నియంతృనిదేశ శక్తిఁ గం
పిల్లుచు మూలశాఖలనె పెంపఱఁ ద్రుంచు స్వబంధనార్థమే
యెల్లెడ మత్తులౌ జను లొకింత యెఱుంగర యాత్మనీనముల్. 44

ఉ. వెచ్చని శీకరంబులను వే విడఁజాలిన వేఁడి లోపలన్
బెచ్చు పెరింగియుండ నవనీలసరోరుహకాంతి పైపయిన్
హెచ్చుగఁ బర్వఁ బెద్దతలలెత్తెడు నాగములందుఁ గొన్నిటిన్
గ్రచ్చుఱఁ దోలి కొన్నిటిని గంధపుమ్రాఁకులఁ గట్టి రా భటుల్. 45

చ. గమగమలాడు నాము గల గండతలంబులఁ దీఁటఁ దీఱ వృ
క్షముల ప్రకాండకాండముల సామజముల్ కడు రాయ నా సుగం
ధమునకుఁ గొమ్మలన్ విడిచి దంతుల గొంతులఁ గ్రమ్మి యింద్రనీ
లమణులఁ గూర్చు హారములలాగునఁ దుమ్మెదచాలు గీల్కొనెన్.

శా. కాలందన్నుట సిళ్ళు గ్రుచ్చుట, యెఱుంగంబోని యొక్కెదు వ
ర్షా లీడొందిన గున్నయేనుఁగును శాస్త్రప్రోక్తశిక్షావిధా
నాలన్ దర్శనభర్జనాదుల నధీనం బొనటుల్ చేసికోఁ
జాలెన్ మెల్లఁగ యంత; సిద్ధి నిడదే శాస్త్రంబు ధీశాలికిన్. 47

తే. తొంటి యున్నత స్తంభంబుఁ దొలఁగ విడిచె
సరసహస్తాగ్రదానం బొసంగఁ దెగియె
నపరబంధనశృంఖలా లపనయించెఁ
బృథుతర స్వేచ్ఛఁ గాంచెఁ గరేణురాజు. 48

తే. కుపితుఁడౌ మావటీనిచేఁ గ్రూరశిక్ష
లందియును గన్ను మూసి సుంతైనఁ గవణ
మారగింపద కడఁక గంభీరవేది
"మందుఁడును బల్మి లొంగఁ" డన్ మాట లేదె? 49

ఉ. సంబర మొప్పఁ గైకొనదు సమ్ముఖమం దిడినట్టి యిక్షుకాం
డంబుల నల్లనల్లఁ దను దగ్గఱి వేచిన తత్కరేణుర
త్నంబును నోరగంట నయి నన్ గన దక్షుల మూసి హస్తి డెం
దంబున నిల్పుఁ దా మును పొనర్చిన స్వైరవనీవిహారమున్. 50

శా. ఉత్తుంగాగ్రశరీరి యొక్క కరి యుద్యోగింప దింతేని మేల్
బత్తెంబున్ గొనువేళ వంగుట కటన్ భక్ష్యప్రదుం డాకడిన్
బత్తిం జేనిడి బాహు వెత్తు ఘృతముల్ జాల్వాఱుచున్ జాఱ వ
మ్మత్తేభంబు గ్రహింపఁ జేసెను గడిన్ బ్రాప్తామితక్లేశుఁడై. 51

ఉ. తెల్లని యంశుకంబులను దీర్చిన కప్పులు రశ్మిసంతతుల్
మొల్లముగా ఘటింపఁ బడి ముచ్చట లీను నరేంద్రవాసపుం
గొల్లెన తెల్ల నీలఘనకుంజర మండల కాంతితోడ శో
భిల్లెను నీలమేఘ పరివేష సమంచిత చంద్రులుం బలెన్. 52

—* అశ్వవర్ణనము *—

కం. గతిజితమార్గము లయ్యును
గతబహుమార్గములు హరు లఽఖండ స్వేద
స్రుతిసిక్తవార్ధిపల్యయ
నతనువులై భువిఁ బొరలి యఽణంచుకొను శ్రమల్. 53

ఉ. వంచి శిరంబు బాహ్లిజపుఽవార్వము వాసనలన్ గొనంగఁ గ
ల్గించిన యూర్పులన్ బలసిఽలేచిన సన్నని ధూళిరేఖ య
శ్వాంచితకాయసక్తి నుదఽయం బగు ధూ లల నాంగ జాత రో
మాంచ మొకో యనన్ గనఁగఽనయ్యెను జూపఱ కద్భుతంబుగన్.

ఉ. బంగరు సైకతస్థలినిఽబాగుగఁ దాఁబొరలాడి వాజి స్వీ
యాంగకముల్ విదిల్చి, మెడఽయందలి యాయతమైన జూలు ని
క్కంగను విప్పు వేళఁ గడఁఽకన్ స్ఫురదాంతరతేజ మింగలం
పుంగణరాజిఁ గ్రక్కె ననఁఽబొల్పుగఁ బర్వె సువర్ణరేణువుల్. 55

సీ. వక్షంబుపై మోముఽపై శుభంకరము లౌ
సుడి తీరు లరదోఁపఁఽబొడుచు ఖాను
విధమున మెఱయ శ్రీఽవృక్షకి సంజ్ఞఁ జె
న్నారు నొక్క తురంగఽమావతంస
మగ్ర పాద మొకండఽయవనిపై నెలకొల్పి
యగ్రకాయంబు మిఽన్నంద నెత్తి
పురుషకాహ్వయమునఽవరలు స్థానకమున
నిశ్చలాంగముల నిఽర్ణిద్రవృత్తి

తే. నుండియును గళ్లియపుఁద్రాళ్లఽరెండు హస్త
ములను బిగియించి పట్టినఽప్రోఢ రౌతు
నింతయును ధిక్కరింప వఽలంతిగాని
దాయె "రౌతు కొలంది హఽయంబు గాదె" 56

ఉ. స్నానజలార్థమై నునుపుఁఽజాయల కాయముతోడి యున్నతం
బైన మహాశ్వ మొండు గనఽనయ్యెను సాగరజాత మౌ శచీ
జాని హయంబు గేరుచునుఽస్వర్గనివాసులఁ బోలి యెల్ల ర
ద్దానినె చూచుచుండ్రు కనుఽదమ్ముల మూయక విస్మయంబుతోన్.

ఉ. ఇంచుక మ్రోఁతకే నిదుర యేదుచు మేల్కొను భాగ్యలక్షణో
దంచితులౌ నృపుల్ హరు లపాంతతృణంబుల మేయు వేళ గ్రీ
వాంచల ఘంటికా కిణకిణారవ సంమిళితంబులైన య
భ్యంచిత దంత చర్చ్బుర రవమ్ముల విందురు కౌతుకంబునన్. 58

* చ. హయ మొకఁడాత్మదర్పమున నయ్యెడ రజ్జువుతోడ శంకువున్
రయమున ఛేవనెత్తుచుఁ గురంగము వేగముతోడఁ బర్వ నే
నయువిదు లాపఁజాలరు; ఘనం బగు వేరొక వాజిఁ గాంచి య
శ్వ యని భ్రమించి దానికయి పర్వఁగఁ గుందుదు రెల్ల సైనికుల్.

సీ. పదునాల్గు తెఱఁగుల వాగెల తత్తత్ప్రి
యోగంబు లాఱు ధీయుక్తి నెఱుఁగు
సాదిమిన్న యొకండు చతురచతుర్విధ
ముఖసిద్ధు లందు సంపూర్ణశిక్ష
ణంబు నొందినది, భయం బెఱుఁగనియది
పల్లంబు మొదలౌ సవరణ లెల్ల
నమరింపఁబడి యోగ్యమైనదియును నగు
నశ్వంబు, యుద్ధాది క్షవల నేర్వ

తే. వలయు వల్గనముల వెల్లభంగు లొకటి
నొకటి గలియని విధములు; నోర్చి త్రొక్కఁ
బ్రకటనవమార్గములలోన బహువిధములఁ
దివిరి నడిపింపనేర్చె నయ్యవసరమున. 60

ఉ. ఇచ్చకు వచ్చినట్లు చరియింపఁగ విప్పిన వాజు లెల్లెడన్
బచ్చిక మేసి యాశిబిరపార్శ్వములన్ జరియించి దూష్య తృ
ట్యచ్చరపాళలగ్న మగు టాళపి షాదులు మాన్ప వల్గఁగా
గర్చ్చర పీడుచున్ శిథిలరజ్జుపదంబులతోవ నేఁగెడున్. 61

* ఉ. త్రాడులతోడఁ గంబమును దప్పన మీఁదికిఁ బెల్లగించి మై
వాఁడితనంబుఁ జూపి యొకవారువ ముద్ధతి బర్వి బట్టగాఁ
నోడుచు కాఁ దదే పఱచుచున్న మఱొక్క హయంబు జూచి బల్
గోడిగ యంచు వెంటఁబడు గోలను గాసిలి రెల్ల సైనికుల్. 59

అని పాఠాంతరము.

— * వృషభవర్ణనము * —

చ. బరువులు డింపఁగా లఘుత । బాసిలి స్వాదుమృదూలపంబు మే
సి రహిని గుడిలో బరువు । చేకుఱ మత్తిలి చర్వణాప్తిమై
నురగలు గంగడోలు పయి । నూల్కొనుచుం బ్రవహింపఁ గన్నులన్
గరమును మూసి యెద్దులు సు । ఖంబుగఁ గూర్కొను జెట్ల నీడలన్.

మ. బలదర్పంబులతో మహోక్షములు వ । ప్రక్రీడ గావింప ని
మ్ముల యగ్రంబుల మంటి ముద్దలలమన్ । మోమం దసల్ బద్ధల
క్ష్మలసద్రూపము గాంచి, యిందునిభమై । జానొందు శృంగాల నె
ద్దుల కొమ్ముల్ వడఁగొట్టి పేర్చి యలచున్ । దువ్వన్ సరిత్తీరముల్.

ఉ. ఆవును గోరి డాయ నభి । హారిమహోక్షము లొక్క పెట్టునన్
జేవను వచ్చి యుద్ధముల । జేయఁగ నన్నిటి నోడపుచ్చు దీ
ర్ఘావిల శృంగకేతుయుగ । మన్ని దెసల్ ప్రకటింపనో యనన్
గోవు పిఱుందనే యరిగె, । గోవిభుఁ డస్తసమస్తశత్రుఁడై. 64

— * ఉష్ట్రవర్ణనము * —

చ. మెడ పొడవౌ ప్రయోజనము । మించ లభింపఁగ సాచి కంఠ మ
క్కడఁ జరియించు లొట్టియలు । ఖస్థలముల్ స్పృశియించు చెట్టులన్
పొడమెడి లేఁజివుళ్లఁ గల । భూరి రసంబు గ్రహింపఁజాలె వ్రే
లెడి పెదవుల్ చలింపఁ బయి । కెత్తిన మోముల గోము దెల్పుచున్.

చ. నెఱి యలవాటుగాఁ దినెడి । నింబదళంబులతోడ మార్దవ
స్ఫుర దరుణామ్రపల్లవము । చూడక మ్రింగిన యొంటి తా నని
ష్ఠురతను గ్రక్కె దాని గరు । డుం డొక యప్డు కిరాతయుక్త భూ
సురుఁ దిని కంఠదాహమున । శ్రోత్రియు మాత్రము గ్రక్కునట్లుగన్.

ఉ. పూవులమాలికల్ వలెను । బొల్పు రహించెడి తేటమాట లెం
తే విలసిల్ల గొంతు పయి । కెత్తి బహిఃస్థితసేవకాళికిన్
భూవిభు చర్యలన్ బ్రజకు । మోదముగాఁ బ్రకటింప నేర్చి భో
గావళి సత్ప్రబంధముల । నచ్చటి మంగళపాఠకోత్తముల్. 67

మ. ఒకచో నగ్గిరి నున్నతస్థలముపై § నుద్యద్వినీలాంగక
ప్రకటేభంబులు నిల్వఁ దామ్రవసన§ప్రాంచత్ప్రభామండలిన్
వికచాబ్జాక్ష పటీగృహంబు వెలసెన్ § నీలాంబుదశ్యామభాః
ప్రకరంబుల్ నెఱ సంజకెంపు రుచులన్ § బైకొన్న మిన్నట్టులై

ఉ. "గట్టొక దాని నెత్తితని § కాదె నినున్ బొగడున్ జనంబు న
న్నిట్టుల నేనలం బఱపి § యెంతయుఁ గాఱియ పెట్టెదేల నీ
వెట్టిఁడ" వంచు రైవతక § మెల్లరునున్ వినఁ గృష్ణు గట్టిగాఁ
దిట్టెను దంతి భగ్న కుజ§దీర్ఘ రవచ్ఛల నిష్ఠురోక్తులన్.

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
స్కంధావారసన్నివేశాది వర్ణనంబును, గజవర్ణనంబును
నశ్వవర్ణనంబును, వృషభవర్ణనంబును, నుష్ట్రవర్ణనం
బును ననెడు పంచమాశ్వాసము.

సమాప్తము.

—*—

శ్రీ ర స్తు.

# శ్రీ మం దా ం ధ్రి మా ఘ మం

[ శి శు పా ల వ ధ మ హా కా వ్య ము. ]

## ష ష్ఠా శ్వా స ము



—* మ ధ్వృ తు వ ర్ణ న ము *—

* ఉ. అంత గిరీంద్రసానువులయందుఁ జరింపఁగఁ గోరువాని, స
త్సంతతి కాపదల్ వొడమ సంతత మారసి ప్రోచువాని, ర
క్షోఽంతకుఁ గొల్వఁగా ఋతువు లాఋను జేరెను స్వస్వభూరుహా
త్యంత మనోజ్ఞ పుష్ప ఫలతండముతో భువి నావరించుచున్. 1

—* వ సం త ర్తు వ ర్ణ న ము *—

తే. నవ పలాశ పలాశవనంబు మఱియు,
స్ఫుట పరాగ పరాగ తాంబ్రభోరుహంబు
మృదుల తాంత లతాంతసంపదలఁ బొదలు
సురభి సురభిని గనులారఁ జూచె శౌరి. 2

తే. అలకలఁ గదల్చి, మృగనయనాలికములఁ
గ్రమ్ము చెమ్మట లార్చి, సరస్సులందుఁ
జిఱుతరఁగలతోడఁ దామరలు విప్ప
మాఁపి, చెలఁగును జిఱుగాలి యుల్లసిలుచు. 3

తే. వెల్లఁదన మొప్పు గోరంటవిరుల నఖులు
వ్రాలి నాతెంట్ల నల్పులు వరలె; శౌరి
చెలుల కనుపాప లందలి నలుపుఁ బోలె
గుణవదాశ్రియా ప్తర్థులౌ గుణము లగుట. 4

* ఉ. అతఁడు ముందు గాంచెఁ జిగురాకులఁ దాల్చు పలాశకాననం
బాతత రేణు యుక్తజలజాళి, నభోగతభాను భానుజా
తాతపతాంతకోమలలతావళియున్ గడు ఘూర్ణితర్పణం
బై తగు పూవు తావుల బ్రియం బగునట్టు వసంతకాలమున్.
అని పాఠాంతరము.

తే. స్వర్ణకాంతుల సంపఁగుల్ పరిజ్వరిలఁగ
నడుమఁ గంకేళిసుమము లనంగదహన
కపిశితం బయి స్పష్టమై గానవచ్చు
విరహిజనభిన్నహృదయస్థపిశితమువలె. 5

తే. మావులను రాలు పుష్పరజోవితతులు
స్మరతుషానలకణ సముత్కరము లగుచు
నచట విహరించు పాంథుల కధికతాప
కరములై యేచు నెల్లెడఁ గరము మెఱసి. 6

తే. ప్రియతమాల పైనఁ గోపించు మృగవిలోచ
నలను బ్రతిమాలి మరుఁ డంపు చెలు లనంగఁ
బొగడపువు మద్యములఁ ద్రావి పొల్పు మీఱు
గానముల మించె మధుపాళి యా నగముల. 7

క. కట్టలుక దీర్ప నెచ్చెలి
గుట్టున్ వచియించునట్లు కోకిల గూయన్
బెట్టెల్ల విడిచి కోపన
యట్టే తన మేను ప్రియున కర్పణ చేసెన్. 8

క. పరివాదినీస్వరాతి మ
ధురగాన మొనర్చి యళులు తుంటవిలుతు సా
మరి వశపఱుచును విరహాల
హరిణంబుల మోసగించు వ్యాధతతి వలెన్. 9

ఆ. పూలఁ బుణుకఁ జేరు పూఁబోఁడి తన చేతఁ
బట్టి దివియ సుంత వంగకుండె
విటపిరాజు; పుంస్త్వ మెటు మది మైపోవఁ
జెన్ను గనునె యిలఁ ద దుష్కృతియును. 10

క. కుచజిత కుసుమగుచ్ఛా!
ప్రచురావత వవలతాప రాగభరసరో
జ చయాంచితరాగము నీ
కీ చలపరీకములు బర్వెడిన్ నీ కెదురై. 11

శా. కాంతాసనిశ్వసితంపు సౌరభము గ*ల్గన్ నీదు కెమ్మోవి న
శ్రాంతం బూరు సుధామధూత్కరము లె*చ్చన్ గ్రోలఁగాఁ గల్గ నా
వంతేఁ బూల్గురియించు తేనియల పై*నందొప్పు నెత్తావి పై
స్వాంతం బేఁగునె నీకునుంబలెను జం*చ చ్చంచరీకాళికిన్. 12

ఉత్సాహ:- ఇటులఁ బ్రియము వలుకు ప్రియుని * నింతి రెండు చేతు లె
త్తుటను బసలు దెసలఁబరువ * తుంగతర కుచోల్లసత్
తటములానఁ గౌఁగిలించె *దయితు రభసమునఁ దనం
తటనెయళికిఁ దలఁకి నటులు * దరవళు ల్చెలంగఁ గాన్. 13

ఉ. ఆననసారసౌరభము * లాను పనిం బలు తేఁటిమేటి లో
నూనిన యాస డాయ భయ * మొంది తటాలున నింతి యోర్తు సం
దానితమేఖలా రణిత*నవ్య కలక్వణ కింకిణీ కిణ
ధ్వానము లీనఁగా నడచెఁ * దాఁ జలి తాలక రుద్ధదృష్టియై. 14

తే. పతులె తొల్తన పల్కులు * ప్రణతి సేయ
గరువమున వారిఁ గన్నెత్తి * యరయ నట్టి
మంద ప్రోయాండ్రు తామె యా*మతి చెలంగఁ
బతులఁ జేరిరి మదనార్తిఁ * బట్టలేక. 15

తే. తియ్యవిల్తుఁడు వింట సం*ధించి విడువ
రుంయి మని వ్రాలు విరి యమ్ము*రుంతుదముగ
మేనఁ గ్రువ్వఁగ స్మృతి దప్పెఁ*జానల కని
నుడువఁగా నేల పెక్కురు * మడసిర యన. 16

ఆ. నెలఁత నీవు కంట * నీర్వెట్ట మొగ మింత
కగ్గ లేదు సొగసు * తగ్గ లేదు
కాని యిట్టి సురభి * కాలానఁ గన్ని ర్తొ
అంగు కంటె నెది య*మంగళంబు? 17

తే. "విడుచు నసువుల వైళమ * విరహవేద
నాధికత నీవె" యంచు నీ*యాప్తు లెల్ల
నిన్నుఁ బ్రేమించి యందురే * నీవు వారి
పలుకులు నిజ మ్మొనర్పు కో*భాగ్యరాశి! 18

ఉ. దూరగుఁ డయ్యె లేమ దయి ఽ తుండు వసంతమహోత్సవావధిన్
మీఱక వచ్చితీఱు ననిఽ నెచ్చెలు లూఱడఁ బల్కుచుండ నే
దారునఁ జేరు కాంత విశఽదస్వర మంతల పొంతలన్ వినన్
రా రమణీలలామ కదెఽ క్రొన్న సుధారస మై సుఖం బిడెన్. 19

విశేషకము.

చ. అలఘుమధుప్రబోధితము ఽ లై చెలు వొందెడి మాధవీసుమం
బులను దొనంకు తేనియల ఽ బొజ్జలు నిండఁగఁ ద్రావి క్రొవ్వి శో
భిలు మధుపాంగనల్ నవన ఽ వీన కలధ్వను లీన దర్పక
జ్వలనము ప్రజ్వరిల్లనటు ఽ పాడెను మై మఱువంగ నెల్లరున్. 20

ఆ. పాంథగణము మిగులఁ ఽ బరితాపములఁ గుంద
శైలవనము లెల్ల ఽ జాజువాఱఁ
బువ్వులెల్ల బలసి ఽ మోదుగుచెట్టుల
విరిసి వహ్నిలీల ఽ మెఱయఁ జొచ్చె. 21

—: గ్రీష్మర్తువర్ణనము :—

చ. దిరిసెనపూవుగుత్తులను ఽ దీపిలు పుప్పొడి రేఁగి యుష్ణరు
క్తురగ తనూరుహ చ్ఛవుల ఽ తోఁ దులఁదూఁగి చెలంగ మల్లికా
స్ఫురిత లతాంత సంకలిత ఽ మోహన సౌరభ బంధురంబు గ్రీ
ష్మఋతువు గ్రమ్మఁ జొచ్చెను గ్రి ఽ మమ్మగ నిమ్ములవిశ్వవిశ్వమున్

తే. లలితపాటలకుట్మలం ఽ బుల నగించు
చాత్మకాంతల యూర్పుల ఽ ననుకరించు
చళులు మత్తిలి చెలరేఁగి ఽ యాడఁజేసి
వన్నెకాండ్రన్నుకొన గ్రీష్మ ఽ వాయు వొలసె. 23

ఉ. చల్లని నీట దోఁగి కుచ ఽ సంగతవారికణంబు లొప్పఁ గొఁ
గిళ్ళ నొసంగి తజ్జలము ఽ కేవలమాఱినఁ జూచి చేతులన్
జల్లని మంచిగంధపుర ఽ సంబులఁ జల్లుచుఁ జల్వఁ గూర్చుచున్
బెల్లు సుఖింపఁజేసిరి త ఽ మిం బ్రియులన్ బ్రియలట్టు వేసవిన్ 24

తే. చంచలాంచితదీప్తివి ఽ శాలనయన
యగళితోరుపయోధర ఽ యగుచు తానె
వేళకాకుండ వర్షర్తు ఽ వేళ భూమి
ధరుని గాదంబిని యలఘూ ఽ త్కంఠఁ గవిసె. 25

—: వర్షర్తువర్ణనము :—

ఆ. గజబిడౌజుతేజు § గల గబ్బి మబ్బుల
నింగిఁ జూచి తన య§నుంగు ప్రియుని
గవియ నభిసరింపఁ § గడఁగ దేపదతి? లోఁ
నల వరింపకుండు § కలికి గలదె? 26

ఆ. హరిధనుర్విలాస § మవఘళించెడి మబ్బు
బహుమణి ప్రదీప్తి § పటల కుండ
లద్వయాప్త శోభ§లను వెలార్చెడి వెన్ను
దివ్యదేహకాంతి § తీరు మీరు. 27

తే. గాలిరివ్వల విరియుచుఁ § గవియు పెద్ద
మేఘములలోన మిలమిల § మెఱయు మెఱుపు
లోలి వాయువిదీర్ణ త§మాలశాఖి
కలను జెలువొందు పూవు గు§త్తులను బోలె. 28

మ. తొలి మబ్బుంగని లేమ జీవనమునం § దున్ గల్గె సందేహ మం
చు లతాంగీమణి చుట్టుఁ జేరి పలుకన్ § జుట్టాల నీక్షించి త
జ్జలదాలోకనముం బొనర్చె నది క్రో§ధ క్రాంత దైన్యంబుతో
లలితాపాంగదృగాళిఁ బ్రాణముల ని§ల్పంజాలి యెట్టెట్టులో 29

చ. విరిసిన కందళంబు లొదవ § వించిన లాలన నుబ్బు మబ్బు ప
య్యర ప్రవసన్నిజేశ లగు § నన్నుల వంతలఁ గూల్చుటల్ వనా
వళులను బట్టి వంచు టొక§పాటివె యెంచ మనస్వినీజనం
బుల మదిలోని గుట్టునె స§మూలము గూల్చెడి చెట్టుముందటన్. 30

ఉ. మృత్తును నీరు బూదియును § మేదిన సంస్కృతి నొందు మద్దెలన్
జిత్త మిగుర్పఁగా వెడలు § స్నిగ్ధ రవంబులఁ బోలు శబ్దసం
పత్తలరించి మేఘములు § మంజుల కేకము లా నెమిళ్లగుం
పత్తతి నాదఁ జేసె హృద§యంగమసంభ్రమవిభ్రమంబులన్. 31

తే. కడిమిపూవుల పుప్పొడి § గగన మెఱుపు
నేసి చెంగల్వ పూఁదావి § చిలికి యడవి
గాలి యత్తఱి తమతమ § కాంతలయెడఁ
బ్రియుల మెదలఁ గ్రొవ్వలపులు § పెనిచి కలఁచె. 32

తే. వేఁడి చల్లాఱె దుమ్మను ✽ విరిసెఁ గ్రొత్త
గురియు మబ్బులు చిన్కుల ✽ గిరినితంబ
వాసినులు సుఖియించిరి ✽ వసుధ చిమ్మ
తావి మురియింప కుండెడి ✽ తావె లేదు. 33

తే. పెద్దమబ్బు తాఁకిడిఁ గొనల్ ✽ విఱిగి దివము
తొఱఁగి భువిఁ గూలు చలివెలు ✽ తునకఁ బోలి
ద్విరద రదనాచ్ఛరుచు లాని ✽ తేఁటు లంక
భూతమృగముగ వెలుఁగొందె ✽ మొగలిపూవు. 34

తే. పెద్దనెలయేళ్ళ జలబిందు ✽ వితతి సొగసు
దళితమౌక్తికచూర్ణ ధ✽వళిమ చెలువు
పెరుఁగు చిందులతో సాటి ✽ దవిలి యడవి
మల్లిపూవు పరాగంబు ✽ మహిని వెలసె. 35

చ. తొలకరి మబ్బుచిన్కులకుఁ ✽ దుల్యములై మృదులంబులైన జా
జుల విహరింప నందుఁ గల ✽ చొక్కపుఁ బుప్పొడి మేననంట తె
ల్పుల విలసిల్లు నంగములఁ ✽ బొల్పు గనెన్ మధులిట్టు లిట్టుల్
గలయఁ జరించు చుక్కగమి ✽ కైవడి నత్తఱి నేత్రపర్వమై. 36

తే. మగ లెడసినట్టి మగువల ✽ నొగులుచు నవ
నీపవన పవనావళి ✽ నిజ మదేమొ
కాని నిజరజ మలికె బు✽క్కాము వోలె
ధృతజలదవస్త్రలైన ది✽క్సతుల పైన. 37

చ. ప్రణయరుషావిచేష్టలకుఁ ✽ బాల్పడి యవ్వల మోము పెట్టఁగా
ఘణఘణ మేఘగర్జనల ✽ ధైర్యము జాఱిన యింతి, కాంతుఁడత్
క్షణమునఁ గుప్పి కౌఁగిలిడు ✽ సందడిఁ గుంకి వళిత్రియంబు సొం
పణఁగి యధృశ్య మయ్యె నడు✽మాయతమౌచు వికాసమొందఁగన్.

తే. "మబ్బుపయ్యెర దాఁకిన ✽ మనసు కలఁగ
కున్నె యెంత విరాగుఁ డౌ ✽ మిన్న కైన
నిక్కమిది" యంచుఁ దుమ్మెదల్ ✽ చక్కఁ బాడఁ
దలిరుటాకులు సలిపె నృ✽త్యంబు లలరి. 39

చ. మెఱుపు నెపాన బెగ్గిలిచు ౯ మీనవిలోచన లాత్మనాధసుం
దరరతి మందిరంబులనె ౯ తక్కుచుఁ దారుచుఁ కామవశ్యలై
వరులను జేరి మంతనపుఁ ౯ బల్కులఁ గుల్కుచు నుందు యాదవే
శ్వరవరయూధశూర పరి౯వారము చూచి బలే! బలే! యన్. 40

—శరదృతు వర్ణనము.—

సీ. వానకారున ఘన ౯ వారిదబృందము
పాధియై కాలంబు ౯ వరలుఁ గాన
వేవెలుంగు దిగంత ౯ విశ్రాంతఘృణి గాక
నిద్రాయితం బగు ౯ ముద్రఁ గనియె
ఖగగణంబు యథేష్ట ౯ గగన విహార చా
తురిమాని గూండ్లలో ౯ సురిగి యుండె
నాఘనోపాధి వా ౯ యఁగనె కాలము శర
దృతు వౌట రవిదీప్తి ౯ దెసల నలమె
గీ. సకల విహగకులమ్ములు ౯ సర్వది గ్వి
రామముగ సంచరించు టా ౯ రంభ మయ్యె
నంచు హరి పల్కె "నౌర! యు ౯ పాధి మాఱ
నొక్కకాలమె పలు మార్పు౯లొందు" ననుచు
సీ. చక్కఁగ వికసించి ౯ సౌరుల మీఱిన
యిందీవరంబులే ౯ యీక్షణములు
తీరు తీరుగ జాలు ౯ తెల్లని మబ్బులే
సన్నని వలిపంపు ౯ సరణు లనఁగ
నొప్పులకుప్పయై ౯ యొప్పు శరదృతు
వాత్మస్త్రియుండైన ౯ యవనిభృత్తుఁ
జేరఁ దత్తుంగాంక ౯ సీమ పై నెలకొని
తత్ప్రియ సీరూప ౯ ధారిణి యయి
గీ. కన్నులకు విందొనర్చు నీ ౯ కరణి ననుచుఁ
జూచి చూచియు మఱియును ౯ జూచి మురియు
పేరు స్మరియించువారి నె ౯ వ్వారి నైనఁ
బ్రోచువాఁడగు యాదవ ౯ భూషణుండు. 42

ఉ. రేలను మచ్చరించి విహారించుచుఁ దమ్ముల తేజుఁ బాపుచున్
గ్రాలఁగ నేర్చు బత్తమము కంజహితోద్ధురదివ్యకాంతికిన్
నేలఁ జరింపలేక యట నింగిని వ్రేలును మేఘబృందమై
వ్రీలక నిల్తురెవ్వ రౌక విశ్రుతు తేజము విక్రమించుచోన్. 43

తే. వర్షఋతు కేకి కేకల పరుసఁదనము
మాని, శారదహంసముల్ మధుర భాష
ణముల వచియించు సర్వలోకముల బలిమి
కలిమి లేములు కాలసంగతము లనుచు. 44

ఉ. హంసవచోఽతి మార్దవజితాలఘు కేకశిఖండిబృంద మా
హంసకృతాభిఖ్యాత్యనలజాంగ మహావ్యధచేఁ దనూరుహో
త్తంసము లూడ్చె శారద విధానము వర్తిలు వేళ విద్విష
న్మాంసలదుష్పరాభవముమాన్యులు సైతురె భూతలంబునన్. 45

తే. వరపరాగసమేత జపాసుమాధ
రోష్ఠ మంజువనీ యోషిదుజ్జ్వలాస్య
మందునన్ నీల గోరంటయలరు లోలిఁ
గ్రమ్ముకొని భాసిలె విలోచనమ్ము లగుచు. 46

ఉ. పుప్పొడి హత్త జాజుటికిపొల్పెసలారెడి కేసరాళిచే
నొప్పుల తావు లౌచుఁ గనకోజ్జ్వలభంగపిశంగ పత్త్రిముల్
ముప్పిరి గాఁగ నయ్యసనపుష్పము లొందును సార్థకాభిధల్
దప్పక భర్తృవిపత్తికృత తన్వుల బింకము చిమ్మఁ గల్గుటన్. 47

ఉ. బాలదివాకరాతపము పర్విన పద్మము నీట నుండియున్
హాలను గ్రోలి నెత్తి నగు నంగన నెమ్మొగ మింత పోలుచున్
జాలఁగఁ బ్రేయసీవదనసంస్మరణ మ్మొలయించి యుత్సుక
త్వాలఘుచిత్తవృత్తినిల యంబులఁ జేయదె యెంతవారినేన్. 48

ఉ. సస్యము నోమ నేర్పు గల చాన యొకర్తుక లేళ్లనుండి యా
సస్యము గావ నేర్పు కర సారస మెత్తకె పాడ గానసా
రస్య వశంవదమ్మయి కురంగము లిట్టటు చూడ కిందు బిం
బాస్య ముఖంబునే కనుచు నట్టె నిలంబడె నాశ్వినంబునన్. 49

తే. కపత్రిపుటనంటి ననగుత్తి ఽ గంధ మెనసి
బంభరీగాన వైభవ ఽ భరితము లయి
తెమ్మెరలు వీచి లోకత్రి ఽ యమ్ము నొంచు
కార్తిక మతంగజమ్ము రాఽకలను జాజె. 50

తే. యాదవులు గాంచి మోదింతు ఽ రబ్దరహిత
కాలమున దిక్కు లొఱ లూడ్చు ఽ ఖడ్గము లని
నీరదావృత మౌ వేళ ఽ సౌరదంతి
చర్మనిర్మితకంచుక ఽ సహితము లని. 51

తే. తెమ్మెరలు చిమ్మఁ జెదరి కొ్రంఽదమ్మియకరు
లందలి పరాగములు గ్రిమ్మెఽ నదిర్రి నెల్ల
హరివధూటులపై శరఽదంబుజాక్షి
నవ్వులాటకు నని చల్లె ఽ నా యనంగ. 52

తే. ఆకసమ్మునఁ దన విజఽయమ్ముఁ గోరి
సురలు పచ్చని యాకులు ఽ నెఱుపు చివురు
లమరఁ గట్టిన తోరణా ఽ లనఁగ నరుణ
ముఖశుకావళు లొసఁగెను ఽ ముదము హరికి. 53

తే. వికచబిసరుహనేత్రి యౌ ఽ విమలవారి
హంసహసితమ్ములఁ దనర్చు ఽ నాకసమ్ము
దీప్రశరదంతురము లైన ఽ దిఙ్ముఖములు
గల శరత్తును ముదితగా ఽ దలఁచెఁ జక్రి. 54

—: హేమంతర్తువర్ణనము: —

ఉ. ఏనుఁగు లోఁతు నీరు గల ఽ యేఱులనేని శిలామయంబుగా
మానక మార్పఁగాఁ గలసఽమర్థత గల్గిన శీతకాల జా
తానిల మార్తులైన పథిఽకాంబురుహాక్షుల యక్షులందు నే
ర్గొ నటు లుష్ణబాష్పము లఽనారతమున్ గురియించు టబ్రమే. 55

మ. ఎలప్రాయమ్ముఁ గుచోష్ణతామహిమ లెంఽతేఁ గల్గు నిందీవరా
క్షుల వేసార్లు స్మరించు పాంథతతి కిఽచ్చో మంచుతో మించు గా
లులు ప్రాణాంతక మౌచు వీచుననఁ జెఽల్లుం బో వసంతాదివే
ళల వారల్ ప్రియలో స్మరింతురని పఽల్కన్ యుక్తమెట్లయ్యెడిన్?

ఉ. ఏచెలి యూరకే ప్రియునితో నెగ్గులు వట్టుచు పీడి యుండు ము
న్నా చెలి మార్గశీర్షమునఁ దా ప్రియునే దరహాసవక్త్రయై
యేచిన యాచలిన్ వణఁకుచున్ వెచ్చిన మచ్చికఁ గౌఁగిలించి, గా
ఢాచితబాహుబంధము రహస్యంత సడల్పద యొక్క లిప్తయున్. 57

ఉ. వాతెఱ మీఁదఁ గెంపువలె భాసిలు గంటు మఱుంగు సేయఁగా
నాతఱి నాతి కేమియు నుపాయము దోఁపఁగ నిల్పియున్ హిమా
నీతతవాయుపీడకు జనించినటుల్ ప్రకటించి సీత్కృతుల్
చాతురిఁ గప్పె దంతధవళద్యుతిచేలము చేతనంతలోన్. 58

తే. పతివలని కెంపుమోవి పైఁ బంటిగంటి
మఱుఁగుపడ కున్కి బోటి హిమంబు చిలుకు
గాలి వణఁకుచు సీత్కార కలిత యగుచు
పలుకుదుటి తెల్లడాలు దువ్వలువఁ గప్పె. 59

తే. మంచుకణములు జాల్గొను మారుతముల
కంప్రభూజలతాంగుళీ ఘటితతర్జ
నముల సహియింప రింతైన ప్రమద లాత్మ
విభుల పెనువక్షముల వీడు వేళలందు. 60

తే. స్మరభవం బయి సహజమై మహిత మైన
ప్రేమచే సీతునను బ్రభవించు చెమట
లూర వామోరు లాచలి కాఱ మేల
టంచు నెంచుచుఁ బ్రియుల మెప్పించి రెలమి. 61

—: శిశిరఋతువర్ణనము :—

ఆ. అల ప్రియంగులతల కలరుల దయచేసి
యాడు తేఁటి రొదయు హారికృతులను
శిశిర వాయువితతి చెలరేఁగి విరహిణీ
జనమునకును భయ మొసఁగె వనుల. 62

క. అరి వర్ధిలఁ గృశియించును
వరవిక్రముఁ డయ్యుఁ గాల వశమున నెవఁడున్
గరుహిమము గోల్పడెవి
గురుహిమ మెదిరింపఁ జాలఁడో మాఘమునన్. 63

ఉ. లొద్దుగపూ దుమారముల § లుప్తసుధారుచు లుల్లసిల్లుచున్
హద్దులు మీఱి సర్వహరి§దంతములన్ విహరించు రాట్చమూ
పద్ధళితావనీ రజము § భంగి నలుంగడఁ బెల్లు రేఁగి మే
ల్మద్దియలున్ బ్రియుల్ బెగడఁ § బూవిలుదాలుపుదాఁడిఁ జాపెడున్.

ఉ. లాలితమత్కుచోష్ణతకు § లభ్యఫలం బిఁకొకప్పు డబ్బునే
యేలొకొ? జాగటంచు మది § నెంచుచు నల్కల నూడ్చి శీత మా
వేళ వినమ్రులౌ పతుల§బిట్టుగ బాహులఁ గౌఁగిలించి యు
ద్వేలసుఖాఖ్యదుగ్ధజల§ధిన్ మునుకల్ గొనుచుండ్రు కామినుల్. 65

తే. సతము సుమనోదశాధివా§సమునె గోరు
నళిపతి లవంగలతఁ బొంద§నరిగి తద్ర
జఃప్రసక్తి నొందె మలీమ§సత్వ మనుచుఁ
గుందలత పూలచేతఁ బ§క్కుననునవ్వె. 66

—* వసంతవర్ణనము *—

చ. సురభిళ పుష్పగుచ్ఛభర§శోభఁ దలిర్చుచు నమ్రభావమున్
సురధరణీరుహంబు గనె § నూత్న విజృంభణ వద్వసంతరా
డ్వర వరదుందుభి స్వనవి§డంబిత కోకిలకాకలీ ధ్వనుల్
సురత విలాస లాలసతఁ § జొక్కఁగఁ జేసెను గాముకావళిన్. 67

ఆ. అతివ నలముకొన్న § నభిమాన మెడలించు
తీయమావిపువులఁ § దేంట్లు వీడ
వల వసంతసౌధ § మగు రసాలము దక్క
మనికి పట్టు గలదె § మధుపతతికి. 68

ఆ. జగము లెల్ల గెలుచు § సైన్యమధ్యంబున
జయకరంబు లని వ§సంతలక్ష్మి
వర్ధమాన యగుచు § బహూపటాంచిత కేతు
పటల మట్లు పెక్క§రఁటుల నిలిపె. 69

ఆ. తనకు వశము కాని § తనప్రియుఁ దనుఁ దానె
పట్టపగలె డాసెఁ § బ్రమద యొకతె
తనకు వానిపైని § దవిలిన ప్రేమ తే
తమము లగుచు నెగచి § తపనుఁ గప్పు. 70

—* గ్రీష్మ ఋతువు *—

ఉత్సాహ:- వేసవిన్ జలంబు దోఁగ వితతహిమసుశీత మై
భాసమాన మౌచు మెఱపు పగిది నున్న మేనితో
వాసిఁ గాంచు మించుఁబోణి పజ్జ డాసి స్వాంతసీ
మాసనం బొసంగెఁ బ్రియుఁ డనంతముదము గల్గఁగన్. 71

—* వర్ష ఋతువు *—

తే. అబ్దజల మబ్బ- నెమిలిపిం డాడఁ దొడఁగె
నదులు పొంగారె సాయంతనంపుదీప
మట్ల యెఱుపౌ శిలీంధ్ర సుమాలయముల
నళిని యళిఁ గూడి క్రీడావిహార మూనె. 72

చ. ఘనమదమత్తబంభరనికాయము మూఁగిన కొండమల్లెపూ
లను జలవర్షణోన్ముఖ విలంబిత నీల వలాహకావళిన్
మన మలరంగ రైవతపుమౌళితలంబుల నిల్చి చూచుచున్
వనశిఖి బృంద మద్భుతరవంబులఁ బాడెడి నుద్గళంబు లై. 73

—* శరదృతువు *—

తే. పొడవు లగు రెల్లుమొక్కల పొలుపు గన్న
శరదృతువునందు సంకోచ సరణి వీడి
మారసుఖముల నెదలోనఁ గోరు ప్రియుని
జేరి యలరెఁ జిరం బొక చిగురుఁబోణి. 74

తే. బెగ్గురులు బిట్టు రొద సేయు వేళ యగు శ
రత్తునఁ గుచద్వయంబున నత్తుకొన్న
చెమట బొట్లను హారమై చెలఁగి ప్రియుని
కరుచి నింపమి నంగన నదిమిపట్టె. 75

తే. కర్ణపేయంబుగా బలాకలు పొనర్చు
కాకురుతులకు నులికి యంగజుని బోలు
కాంతుఁ జేరి తనంత నేకాంతమందుఁ
గంతులీలకుఁ బూన దేకాంత ముందు? 76

—* హేమంతము *—

తే. భావజోద్దీపకాసవపానములను
మరులు నగవులు వర్ధిల్ల మగలఁ గొప్పు
పట్టి రతి కెలయించు జవ్వనుల విడిచి
యెవఁడు కనుమోడ్చె హేమంతఋతువునందు. 77

—* శిశిరవర్ణనము *—

తే. చారులవలీవనావళి సంచరించు
తేఁటిగమి దివ్యమధు వాని నీటు మీఱ
సగము వికసించు పూరేకు చతురనాట్య
ములకు వెఱఁగంద మధురగీతులను బాడు. 78

తే. కుజము లెల్ల నతంబులే కుసుమతతుల
మధురగానమ్ము వీడదు మధుపవితతి
సకల ఋతువులు వర్తిల్లు సానువులను
కృష్ణ! విహరింపవే యని కేకి పలుకు. 79

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
వసంతర్తువర్ణనము, గ్రీష్మర్తువర్ణనము, శరదృతు
వర్ణనము, హేమంతర్తువర్ణనము, శిశిరర్తువర్ణనము,
మఱల షడృతువర్ణనమ్ము నను షష్ఠాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీ ర స్తు.

# శ్రీ మం దా ం ధ్రి మా ఘ మం

## [ శి శు పా ల వ ధ మ హా కా వ్య ము. ]

### స ప్త మా శ్వా స ము.



—* వ న వి హా ర వ ర్ణ న ము *—

ఉ. రైవతకాద్రియందె ఋతురాజము లన్నియు నేఁగుదెంచి క్రొం
బూవుల మొగ్గలన్ ననల మొల్లముగాఁ గయిసేసి చక్రికిన్
సేవ లొనర్పఁ జేసిన కృశిషిన్ గనుచున్ విహరించెఁ జక్రియున్
బావనమూర్తులన్ గొలువఁ బాల్పడు యత్నము రిత్త వోవునే? 1

చ. వివిధ లతాంత సంతతుల వేడుక గొల్చు వనంబు సొచ్చి యా
దవులు చరింపఁగోరుదురు దారసమేతముగా మతెట్లు ప
చ్చవిలుతు వాఁడికోల లవ సన్నుతి కెక్కిన యైదుపూవు ల
య్యువక శిఖావతంసముల కోరువ శక్యము లొఁ దలంపఁగన్. 2

క. అంత సహజమధురాకృతు
లింతులు హరియించు చెల్ల హృదయములు వనా
భ్యంతరభూములఁ బద మిడు
నంత విలాసములు వారియందుఁ బద మిడెన్. 3

తే. చెలువ యొకరిత యిటు నటు మెలఁగె నఖర
పాళి రుచు లింద్రచాపకల్పన మొనర్ప
వలయములు మ్రోయ మృదుబాహువల్లి సారె
సారెకు నితంబమునమండి జాఱుచుండ.

క. అతితర పరిణాహముతో
రతనపుఁ జిఱుగంటగములు రవళులతో శిం
జిత మగు నొక చెలి మొలనూల్
తత మగు తజ్జఘనమునఁ గల ధ్వను లొలికెన్.

క. వెడఁద యిఱి పిఱుందుల బరు
వెడపక తము నేచుచుండ ǂ నింతుల యడుగుల్
గడు బడలి స్వరస మంతయు
నడుగడుగునఁ గ్రక్కె లాక్ష ǂ యను వ్యాజమునన్. 6

సీ. గొనములచే గౌరి ǂ కెన యైన యో చెలి!
నిను నిప్పుడే తెత్తు ǂ ననుచు నీదు
ప్రియుని నమ్మించి నే ǂ వెస నిట కరుదెంతు
నాపల్కు విత సేయ ǂ నయమె నీకు?
నీప్రతిజ్ఞ సడల్ప ǂ నే నొక్కతెను గాక
నేర రెవ్వా రెప్డు ǂ నిక్క మనెడు
వాసి గల్గును నాకు ǂ వనితామణులలోన
నాకీర్తి కాపాడి ǂ నన్నుఁ గావు
తే. నిన్ను నావెంట గొనకున్న ǂ నీకు నాకు
మాటలే యుండ వని నియ ǂ మంబు గొంటి
మనము మాటాడకొనకుంటఁ ǂ గనిన యట్టి
మన విరోధుల కోర్కెలీ ǂ మాఱు పండు. 7

సీ. అందువల్లను ధైర్య ǂ మడుగంటె నాకీక
నసువులే భారంబు ǂ లగుచుఁ దుదకు
మేన నిల్వవు సుమ్ము ǂ కానఁ గాంతుని మీఁద
గోరంత ప్రేమయుఁ ǂ గుదురకున్న
నాప్రాణములమీఁద ǂ నామీఁద దయ యుంచి
మనుపుమా నన్నని ǂ మఱియుఁ బల్కె
ననుఁగుఁజెలిమికత్తె ǂ యడుగుఁ దమ్ముల వ్రాల
దానిపై దయగల్గు ǂ దానివలెను
తే. వల్లభుని నేరముల నెంచి ǂ వనజనయన
పెద్ద కనుఁదమ్ములను గెంపు ǂ చేర్చి గదురఁ
జెలియ పలుకులఁ గరఁగిన ǂ చెన్ను దోఁప
నరుగు నద్దాని విడక వె ǂ న్నాడి చనియె. 8

తే. వెన్కఁబడియుండ నెచ్చెలి వేగ మేఁగఁ
దగునె ముందటి కేఁగ నోమగలరాజ!
కుచనితంబభరమ్మునఁ గోమలాంగి
కడు వెతం బడు టీ వెఱుంగగనిదె? చెపుమ! 9

తే. అని యొక వయస్య నిందింప నతివ వచ్చు
నందనుక నాఁగి యామె ముం దడుగు లిడుచు
నడచుచుండంగ వెన్క నాతఁడును మెల్ల
నడుచు నడుగులఁ బుడమిఁ గొల్చెడు ననంగ. 10

తే. వాఁడు నను వీడి యవమానపఱచినాఁడు
నా వెతకుఁ గుల్కుచుందువు; నీవు మెచ్చ
నతని పజ్జ కిదే యేన యరుగుదాన
ననుచు నల్కనుబలె నాడె నబల చెలికి. 11

క. పతిపజ్జ నడుచు యువతికి
నతులిత పులకాంకురాళి యలమిన కుచ మొం
డతని యెద దాఁకి వీడుచుఁ
బతనోత్థానముల వెలయు బంతిం బోలెన్. 12

సీ. చెలువ యోర్త్తధిపు డాపలి దెస సంగత
యై యుండ బహుళరోమాంచితస్వ
సవ్యబాహువు సాచి సరగ నవ్వలి కుచం
బతఁడు పట్టఁగఁ దన యతుల మృదుల
దక్షిణేతరదోర్లతాహారమును మోహ
నాంగుని మెడ వైచి యవల సడలి
కుండు రీతిని జుట్టి యొప్పుగా వేమాఱు
రవళించు మొలనూలు రాజిలంగఁ.

తే. బ్రేయసుని జఘనంబుతో బిట్టు తాఁకు
స్వీయహారావళులు చాల చిక్కువడఁగఁ
గుడికుచంబునఁ బ్రియు నెద గ్రుచ్చిగ్రుచ్చి
దక్షిణాంఘ్రి ప్రియాంఘ్రికి దవులుకతన.

తే. నాతిలోలంబుగాఁ జేసి ౘయవలి పాద
మందుఁ జిఱుమువ్వ మ్రోఁతలు ౘ సందడింపఁ
గదలుపుచు భావజాతిరే ౘ కమున మెల్ల
మెల్లగా మెట్టు భువి జగం ౘ బెల్లఁ జూడ. 14

తే. సరయసుందరగమనుఁ డౌ ౘ వరుని రెండు
మూఁపులం గరపల్లవ ౘ ములను మోపి
గాటపుం గబ్బి చనుమొనల్ ౘ గాసి గూర్ప
నతని వెన్నంటి లీల మై ౘ యతివ జనును. 15

ఆ. అలఘుపీవరోరు ౘ వయ్యు గురునితంబ
భారవహనఖేద ౘ భరిత యయ్యుఁ
బతిగళార్పితస్వ ౘ బాహు వౌట భరింపఁ
జాలె హేలఁ బృథుల ౘ జఘన యొకతె. 16

ఆ. వెలఁది వెనుక వచ్చి ౘ విభుఁడు కక్ష్యంబులఁ
గరయుగంబుఁ జొనిపి ౘ గబ్బిగుబ్బ
లంటి మోము ద్రిప్పి ౘ నంతనె చుంబించి
నేల నున్న యొంటి ౘ కాల నడపె. 17

తే. పచ్చి పారాణి రేకలు ౘ పరఁగు కాల
దయిత దన్నిన తొమ్మి ముౘ ద్రలకు సంశ
యింపకె విభుండు సఖులలో ౘ నెలమిఁ దోఁట
నాడుకొను చేడె కట్టెదు ౘ రిట్టె చేరె. 18

తే. అలఘుశృంగార రసవాహి ౘ నులు నతంబు
లైన నాభీహ్రదంబుల ౘ నలమి నింపి
రోమరాజీ పరీవాహ ౘ రూప మొంది
హంసకధ్వనితో నదు ౘ లైరి చెలులు. 19

—* ఉ ప వ న వ ర్ణ న ము *—

తే. హరివెలందులు విని రేటి ౘ దరులయందు
మరుఁడు జనతామనంబుల ౘ గుఱిగఁ జూచి
దివుచు పూవింటి గొనయంబు ౘ రవళి యనఁగ
శ్రవణసుభగంబు లైన సా ౘ రసరుతముల. 20

తే. అళికులంబులు దిరుగుచు నంబుజాక్షి
కమలనేత్రలవలె నుత్సుకతను బాడె
వనులు నవపల్లవ కరాగ్రవలనచలన
ముల నభినయించుఁ దద్భావములను గెరలి. 21

తే. అర విరియు మొగ్గలం జొరఁ దరము గాక
కలఁగి తేఁటులు చిమ్మ వికాస మెనయు
తరుల కేసరముల విప్పఁ దద్రజంబు
వారిజాక్షుల కర్పించె మారుతంబు. 22

క. వనమారుతగతి తోడన
చన నేర్చిన తేంట్లగమి కెసంగెను వనితా
జననుతపరిమళ మున్నతిఁ
దనరు జనముఁ జేర సంపద లెదురగుఁ గదా! 23

క. హరితరుణులు నునుఁగేలన్
దర మిడి తాఁకంగ సౌమనస్యము గనుటన్
విరులకుఁ దదాది నామము
పరఁగెను "సుమనస్సు" లనఁగఁ బ్రథితార్థంబై

క. ఎదురేఁగి యదుముకొనఁగా
నద నెఱిఁగిన సతుల్ల యగ్రహస్తంబుల్ల బల్
చదురుల కొడెన్ బ్రమాఁకుల
బ్రమదిమాంచిత కిసలయముల మండల మదిరా. 25

క. గల్లని మ్రోయఁగ వలయము
లుల్లసదళి యైన కొమ్మ నూఁపఁగఁ ధరువున్
జల్లు మనఁ గురిసెఁ జెలి తల
ఫుల్లసుమచయంబు మోదమున నహో యనఁగన్. 26

క. అనవరతరసము రాగము
మొనయు తరుణపల్లవోష్ఠము మదవతీ శా
త నఖక్షతి పరిచితిఁ గాం
చివ వాడె నదయముగఁ జెలిచే ఖండితమై. 27

—* పుష్పావచయవర్ణనము *—

చ. చెలువుని ముందటన్ నిలిచి చేడియ జాణతనంబు మీఱఁ బూ
వులకయి చేయి యెత్తి భుజమూలగతం బగు తన్నఖక్షతం
బులు బయలౌట కోసరిలి పొందుగ రెండవచేత నంబరాం
చలమునఁ గప్పెఁ జన్గవ వెసన్ బతి చూచినఁ జూడనట్లుగన్. 28

సీ. సమాలిక :-

తనతోనె విహరించు ధవుఁడు వనస్థలి
దాఁగి క్రమ్మఱ వచ్చి తరుణి యెదుటఁ
జనఁగ వానిని జూచియును జూడనివిధాన
మిట్టుపల్లంబుల మెఱయు వళుల
మెండైన తెల్పుతో మేలి నూఁగారు వి
లీన మై సన్న నై జాను గాంచ
తనుమధ్యమును దనుతరమగు నట్లుగా
నిగిడి విజృంభించి నెఱి మొగమ్ము
కనుదోయి నూర్ధ్వముఖమ్ముగా వెసఁ ద్రిప్పి
వలుద చన్గవ యెత్తుపల్ల మైన
యక్కునఁ గప్పఁగా ఘావణించు బల్సాలు
దిగజాఱ నుదరానఁ దేజరిలెడి
వలిపె మొకటి యున్న స్ఫష్ట మై గనఁబడు
నతనాభి తీరు విన్నాణ మొప్పఁ
దరుబాఖ పై నున్నతం బగు పూవులఁ
గోయు నెపంబునఁ గొంత సేపు
నాలసించుచునుండ నతఁడు కట్టెదుటనే
గలఁడంచు గూర్మి నెచ్చెలులు వల్కఁ
దెలియనటు నటించి యలరు గోయుట మాని
కడు తొట్రుపాటుల బెడఁగు చూపి
యన్ని తావులయందు నంశుకంబును వేగ
సవరించుకొను చెల్వు చాలఁ జూపి
భయసంభ్రమములతో భావజు నానచేఁ
దమి హెచ్చఁ గిలికించితమ్ము నర్పి

తే. చంద్రసఖమైన నెమ్మోము ౹ చక్కవంచి
కొంత వ్యవధిని కోరెడు ౹ నింతివలెను
బ్రియుని మన సెల్లఁ గరఁగించి ౹ పిన్న నగవు
చిలికెఁ జిఱునవ్వె గద! సొమ్ము ౹ చెలువ కెపుడు 29

సీ. తునిసిన చిగురాకు౹లను లిఖించినఁ బఠిం
పఁగ నసాధ్యమ్ము లై ౹ పరఁగు నివియు
కేవలమ్మును బుల౹కించిన యంగక
మందఁ గూర్పఁగ నను ౹ వైనయవియుఁ
గొఱివ్వాఁడిగోళ్ల నొ౹క్కు టె యక్కరములుగా
బమ్మెర గొన వ్రాయఁ౹బడిన వయ్యు
నారసినంతన ౹ యాకళింపఁగ వ్యక్త
మగునట్టి యర్థము ౹ లమరునవియు

తే. నైన మన్మథలేఖ లే౹శ యాఁక లేక
యమ్మహీధరవనుల వి౹హారకేళి
వళత మెసలారు యువతీయు౹వకులచేతఁ
బ్రిణిహితము లయ్యె నితరేత౹రమును బ్రీతి. 30

తే. లేని కిన్కను నటియించి ౹ చాన యొర్తు
నేరు పింతైన లేదని ౹ నేర మాడి
విడిచి నెచ్చెలిఁ గ్రొమ్ముడి ౹ విరులఁ దానె
తుఱుముకొనె బాహుమూలదీ౹ప్తులు నెలంగ. 31

సీ. అళికులంబులు మూఁగి ౹ యవనిజముల వీఁగి
నీమోము డాయఁగా ౹ నీవు పెదవి
విప్పి వారింపకు ౹ విప్పచో మధుసార
భాంచిత భవదాన౹నాబ్జసీమ
నవి గుత్తగొనును జూ౹మ్మద్దిరా సరజస
సమరందజాతప్ర౹సవకుజముల
పైరక్తి మాని సు౹ధారసంబును గ్రోల
భవదధరావాస౹పరత వచ్చు

తే. చన్నవే యని చెలి పల్కనొక్క జాణ
కంటిఱెప్పల ద్విగుణించి కన్నుగవను
మూసి మధుపాళికృతభయంబునను బ్రియుని
యంకమున వ్రాలె సతికి భయమ్మె సొమ్ము. 32

ఆ. క్రొత్తపెండ్లి యైన కోమలి మోమెత్తి
ప్రియుఁడు బల్మి ముద్దు వెట్టుకొనియెఁ
బూలఁ గోయు వ్యాజమున యెఱుఁగని యటు
యటు చరించె జాణ యగు వయస్య. 33

తే. తీవగమిచేతఁ దన సపత్ని మఱుఁగుపడ
ప్రియుఁడు ప్రియ డాసి బల్మి చుంబించి మోవి
నొక్కవెత విదళించునిందుముఖి హస్త
వలయములధ్వని సవతివీనులకు సోఁకె. 34

ఆ. ప్రక్క నున్న మొక్కపైఁ బ్రాఁకుఁ లేఁదీవ
ననుకరింపఁ గోరి వనిత యొకతె
యాశు లెదుటఁ బ్రియున కాలింగన మొసంగె
దోస మని తలంపదు చపలతను. 35

తే. ఉవిద యున్నతతరువుపై నున్న పూవు
గుత్తిఁ గోయఁగ నొక చేయి యెత్తి యితర
హస్తమును బ్రియు మూపున నాని. వాని
వెడఁద యురమును గప్పెఁ గొవ్విన చనుఁగవ. 36

తే. మృదుపదంబులు భువి నానుచదురు లేదు
కుచభరంబును వహియించుకొనను లేదు
చెట్టు పై పూవు గోయ నేపట్టు లేదు
కానఁ బ్రియు నక్కునన్ వ్రాలెఁ గలికి యొకతె. 37

తే. ఎత్తుగల కొమ్మ నున్న పూగుత్తిఁ గోరు
దాన నని పల్క బరిరంభతత్పరుఁ డయి
ప్రథితకుచభరఁ గౌగిఁటఁ బట్టి పూవు
గోసి యిచ్చె నతండు దాఁ గూర్మి పేర్మి. 38

క. ఇది తరు విదె పువ్వని పతి
ముదితను ముందటికి ముందు § ముందున నడపున్
తుది కేకాంతముఁ జేర్చున్
మదనుని సాహసము లెన్నొ § మనుజుల యెడలన్. 39

క. ఏవారు లేని తావని
తా వరు రప్పింప నన్య§తరుణి గని యటన్
దా వెఱచి యవలఁ జనఁ బో
లావున్న నతఁడాఁపఁ దాఁ ద§లంచెఁ గృతినిగా. 40

తే. "రేయి దానింటి కరుగవా? § యీయ" నంచు
నతివ కోపించి పూదండ § నంఘ్రియుగళ
మందు బంధింప నొకచేని § యడుగు గదలఁ
దేది భీతుల శక్తి హ§రింప దరయ 41

సీసమాలిక.

తలిరాకు గాన్కగా § దరిఁ జేరి యర్పింప
గూఢాపరాధి యౌ § కూర్మివిభుని
నరసి త్వదీయమ§హోదానముం గొను
యోగ్యత మాకడ § నుండదె కద
యతిరహస్యస్థలి § నధరమధువు ద్రావి
యాపద రక్షించు § నయ్యాదుండ
పొమ్ము దానికె యిమ్ము § పో యీవిటప మిప్పు
డందున సిద్ధించు § నాత్మ సదృశ
పరతరయోగంబు § పజ్జ నీతో నుండు
మఱి ధూర్త! నీదు దు§శ్చరితములను
గ్రిమ్మ యత్నము వృధా § కదె చెట్టుచివురులు
పూవులు మాకర్ణ§పూరము గనె

జను లెల్లఁ జెవులార x వినిన నీదుశ్చరి
త్రములు మాకర్ణరం x ధ్రముల నిండె
నెన్నఁడో యింతకు x మున్నె మాకికఁ గర్ణ
పూరచారుత లీల x బోఁ గదయ్య
దానింట నీవుండి x పూని యిచ్చటఁ బెద్ద
కలి నిల్పినాఁడవు x కాన నిప్పు
డిచట నీకలిక నిఁ x కేల నుంచెదవళి
కులములన్ ధ్వనియించు x కొనుచు నవ్వ

తే. ననుచు నిష్ఠుర మాడుచు x వినుతపక్ష్మ
కేసరమ్మను శ్రవణసం x కీర్ణము నగు
నల్లకలువనె కాదు కం x టను సయితము
కాంతు దయమాలి పరిహరించెఁ x గాంత యోర్తు. 42

తే. ఒకతె కంటిలోఁ బుప్పొడి x యొక్క రేణు
వాలికి యేచఁగఁ దత్ప్రియుం x డుహ్వటంచు
నూఁది యోమఁగఁ జూచెడి x యొక సవతికిఁ
గిన్కఁ గావులె గ్రమ్మె న x క్షిద్వయమ్ము. 43

తే. తోడి మీనాక్షి దా పేరి x తోడఁ దన్నుఁ
బిలిచి నునుఁబూవు తన పయి x విభుఁడు విసర
నదియె యభిచారమంత్ర మై x యతివఁ గాల్చె
సతుల కభిచారమంత్రమే x సవతి పేరు. 44

ఆ. ప్రేమ నొక్క పూవు x ప్రేయసి పైనన
భర్త యుంప దనదు x స్వర్ణభూష
ణముల నెల్ల నొక తృ x ణమ్ముగా నెంచియు
దాల్ప భార మనును x దాని సవతి. 45

తే. నీదు కను తీరులే గెల్చు x నాదు తీరు
ననుచు వనజాయతాక్షి పీ x నునకుఁ జేరి
వంగి యెలతేఁటిస్వనముతో x వాకొనునటు
చెలువ తీనున నల్లని x కలువ వ్రేలు. 46

తే. విరులఁ గోసిన తీవల ఽ వీడి పూల
దండలు గలట్టి లేమల ఽ యండఁ జేరు
తుమ్మెదల దిమ్ము లట్టు లౌఁ ఽ దొంటిసాహ
చర్య మేలొకో? మలినాత్మ ఽ చయముల కిల. 47

సీ. జాతెడి క్రొమ్ముడి ఽ భారంబునం బలె
దిగు మూఁపు లొప్పఁగాఁ ఽ దిరుగువారు
పొడవు దట్టము గల ఽ భ్రూపక్ష్మభరముచే
ననఁ గనుమూయు నాఽననము వారు
మోముబల్మిని బట్టి ఽ ముద్దాడఁ గుంకుమ
రేణువుల్ దొఁరగిన ఽ యేని వేఁడి
వెలుఁగుల గౌర ప్రతిఽబింబింపఁ గావులు
మొలకెత్తు చెక్కిళ్లు ఽ వెలయువారు
తే. లలితకార్యము లొనరింప ఽ వలయు వార
లతిలలితతరబాహుద్వఽయములవారు
తలిరిటాకుల ద్విగుణీకృఽతంబు లైన
విమలకాంతుల గరకమఽలముల వారు. 48

సీ. ఒండొరు కౌఁగిళ్ల ఽ నుండ నంటిన పతి
యక్కు బల్పొఁతల ఽ నడరు వారు
గురుఖేదమోదముల్ ఽ గూడి నిల్చిన యట్టు
లెడ లేని చనుఁగవ ఽ లెనయు వా
కుచభారనతతనుఽరుచిర లయ్యును, దూర
గమనశ్రీమానతాంఽగములవారు
అలవాటు లేని దఽవ్వుల జన నలసిన
స్తవనీయగజకరోఽరువులవారు
తె. అపుడ ఘటియించు పారాణి ఽ యవని
భ్రష్ట మైనను, గ్రిమ్మర ఽ లక్కరంగ
లొదవ నెట్టెటొ మెట్టుట ఽ కోర్వలేని
చరణకంజాతయుగముల ఽ జరుగువా 49

తే. ఇటుల నిహరించి విహరించి యటవి నటవి
నుపరమించిరి ఘనజఘనోన్నత లట
మృదులతనువులు మఱియుఁ బ్రకృత్యలసలు
వనవిహారసమర్థులే వారు జగతి. 50

తే. దీప్తగండస్థలముల ముత్తెములఁ బోలి
యావలన్ జాఱి కఠినకుచాగ్రదేశ
పాతములఁ జెంది శ్రమబిందుపటలబృంద
ములు సహస్రికణంబు లై చెలువు గాంచె. 51

తే. ప్రియుఁడు దరిఁ జేరి వెలఁదికి విపుల మైన
పులక లొదవంగఁ జేయ విపులకమె యగు
సపరిమళముం బొనర్చిన సౌరు విడదు
కుచయుగము మాత్ర మలయదు గొనదు వికృతి. 52

ఉ. మానక పూలు గోయుచు శ్రమంపడి వల్లభు కంబుకంఠసం
ధాన మొనర్పఁగా భుజలతల్ తమకంబునఁజుట్టి యుజ్వలత్
పీనపయోధరద్వయిని ప్రేయసు పేరుర మొప్పఁ గప్పి జా
నైన విధానఁ దాన పడినట్టి శ్రమంబును బాపె డంబుగన్. 53

చ. ముదిత యొకర్తు స్వప్రియుని ముందట చెల్వుగ నిల్చుచున్ జగ
ద్విదితసమున్నతిం దనరు స్వీయకుచద్వయ మంతకంతె నె
త్తు దనర మే న్నిగిడ్చి తనదోర్లతలొంట నొకండు నల్లుచున్
మది నుదయించు కోరికల మాటికి మాటికినినే వెలార్చెడున్. 54

తే. మంచుకణములఁ బోలు చెమ్మటకణముల
మఱియు మఱియుఁ బ్రయత్నించి తఱి లభించి
నపుడు తుడుచును గ్రొత్తబెండ్లైన సతికి
బతికిఁ గుచకలశము లంటఁ బదను నదియె. 55

సీ. ప్రాయంపు టింతులే ప్రవహించు నదులైరి
స్వేదప్రవాహ మంచితజలమ్ము
సరభసగతితోడి జఘనసైకతముల
జరుగుచు మధ్యదేశమ్ములాఁపఁ

దరువాయి నాభిహ్ర§దంబులం బూరించి
యావెన్క నూరుభు§జాత్తము లయి
బాహులతలఁ గూడి§పైబడి విహరించి
యుత్తుంగకుచపాళి§నుఱికి యవల
తే. రోమకూపసహస్రముల్§రూఢి నింపి
యవల గండప్రదేశంబు§లాక్రమించి
యచటనే నిల్చునట్లుండి§యాగడించి
యందఱకు నేత్రపర్వంబు§పొందు పఱచె. 56

ఉత్సాహ :_ ఘననిదాఘబిందుతతికిఁ§గాంతుకరము దాఁకు నం
తనె మఱింత లై ప్రవాహ§దర్పతన్ జెలంగఁ గా
వనవిహారజాతఖేద§పాత్ర లయ్యు నుజ్జ్వలత్
తనువిలాసవతులు స్నాన§తత్పరేచ్ఛఁ గొల్వఁగాన్. 57

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
వనవిహారవర్ణనము, ఉపవనవర్ణనము, పుష్పాపచయ
వర్ణనము ననెడి సప్తమాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీ ర స్తు.

# శ్రీ మ దాం ధ్ర మా ఘ ము

[ శిశుపాలవధమహాకావ్యము. ]

## అష్టమాశ్వాసము.



### —* జలక్రీడావర్ణనము *—

తే. మేటి కుచములతోడ నిమీలితాక్షి
పద్మములతోడ భూషణపంక్తి మ్రోయు
ధ్వనులతో నేదభూమిపై పదము లిడుచు
నలసి చెలిపిండు చనె నెట్లొ జలము కడకు. 1

తే. వంగియుంటను మూఁపులు పంక్తిగట్టి
యరుగు వనితల కెంత యంతరము లున్న
వెడలుపయి నొండొకంటిని బీడ సేయు
పిఱుఁదులకుఁ ద్రోవ లిఱుకయ్యె వెడలుపయ్యు. 2

ఉ. అంతరశూన్య భూజ శిశిరావనిసీమల సంచరించు నా
యింతుల ముట్టఁగా వెఱచియేమొకొ వేఁడి వెలుంగు గాలి నం
తంతఁ జలించు శాఖల దళాంతరవీథుల నుండి బంపి యా
వంత కరమ్ములన్ క్షణమె యంటక ముట్టనియట్ల యంపెడిన్. 3

చ. ముదిత నొకర్తు భానుకరముల్ గడు గాసిలఁ జేయ నాయెడన్
వదనసరోజ నిర్జిత విభాయుతుఁ దౌటఁ దుషారరశ్మి దాఁ
గదిసి సితాతపత్త్రితను గాంచి, తదాస్య దయావలంబమున్
హృదయమునందుఁ గోరి భజియింపఁగ వచ్చినవాఁడు నాఁదగెన్,

తే. అర్మిలిని దన యుత్తరీయముఁ బ్రియుండు
ప్రతిపద మ్మెండ సోఁకని గతిని మీఁదఁ
గప్ప ఛాయ యొక్కటై కఠినతర మయ్యె
గొడుగు లూలిన లాఁకు లా కోమలకంటె. 5

చ. వరు కరమున్ కరంబునను ౹ బట్టిన నీరజపత్త్రనేత్రకున్
గరమును స్పర్శజం బగు సుఖంబు తనూలత నంటి పూర్తిగాఁ
బరవశ మొందఁజేయుటయు ౹ బల్మి దృఢంబుగఁ గట్టినట్టి యం
బరమునఁ గల్గు పోఁకముడి ౹ మాటికి మాటికి వీడిపోయెడున్. 6

ఉ. మందముగాఁగ నెన్నడల ౹ మానవతుల్ పచరింప వారికిన్
డెందమునందు నచ్చెరువు ౹ బెంకిగొనంగను, గాంచి హంసికా
బృందము వీడె, స్వీయగతి ౹ నెవ్వఁడునే నొరు చెంత నోటమిన్
బొంది వెలార్చునే స్వగుణ౹మున్ మది సిగ్గిలకుండ నెయ్యెడన్. 7

తే. పెద్ద వయి విస్తరిల్లిన ౹ పిఱుఁదు లొప్ప
సిరులు మించిన శ్రీకృష్ణ ౹ చెలుల జఘన
ములకుఁ దమసైకతము లోడ ౹ జలధిరాణి
వాసములఁ రాలఁ బడి వేగఁ ౹ బాతెఁ గలఁగి, 8

తే. సలిలవేగాస్త శుక్తి పే౹శులను విడిన
ముత్తెముల నంద మా నదీ౹పులినములను
విడిన హారాళి రమ్య మౌ ౹ స్వీయశయన
ములకు సరి యయ్యె నని యెంచెఁ ౹ జెలుల గములు. 9

తే. శ్లాఘ్యగంధంబులును, శ్రమ౹జంబులు నగు
స్త్రీల నిట్టూర్పుగాలులఁ జాల మూరు
కొని యసల్ వన్యసుమములఁ గోర వార!
యౌచితి గణించునే విశే౹షాభిలాషి? 10

తే, అడవినుండి స్వకీయ జా౹య చనుదేఱఁ
గాంచి మఱియొక పెంటిని ౹ గానకుండఁ
బింఛమునఁ గప్పె నెమిలిని ౹ వెలఁదు లరసి
నమ్మినా-రెందు మగవా రొ౹సనర్చు మాయ. 11

క. హరివనితల పలుకుల మా
ధురి కోటమి గనఁగఁ దమ రు౹తుల్ మదహంసో
త్కర మణఁగెఁ గలువగుంపులఁ
బరు నెదుటన్ నిలుచు నెవఁడు ౹ పరుచే జితుఁడై. 12

ఆ. ముగుద చక్రవాకి ƒ మగఁడు నిశ్శంకగా
ముద్దు గొనఁగ నాత్మ ƒ భూలలితము
లందుఁ దగెడు సీత్కా ƒ రాళి ప్రియుల ముందు
చేతు లొడ్డి చేసె ƒ నాతిపిండు. 13

తే. ఎత్తుగా విచ్చు దమ్మిల ƒ నెత్తి యర్ఘ్య
మును గనఁగఁ జేసి స్నేహానఁ ƒ బులుఁ గెలుఁగుల
నాడి, నురుగున వే నవ్వి ƒ యతివలకును
నూర్మిహస్తాలఁ బాద్యమ్ము ƒ లొసఁగె సరసి. 14

ఆ. తనదు కొణయాచి ƒ తమ్మినుండి సిరిని
పాణిపల్లవములఁ ƒ బైటఁ ద్రోసి
యపుడు కృష్ణ లలన ƒ లద్దానికి సపత్ను
లౌటఁ దెలిపినారు ƒ దేటగాను. 15

—* జలప్రవేశవర్ణనము *—

ఉ. ఎంతకు నెట్ల యైన హృద ƒ యేశకరార్పిత నైజహస్తలై
కాంతలు లోనికిం జొరక ƒ కాతరతం గని నిల్చి యుండఁగా
నంతకు నక్కడన్ జలము ƒ లాతురతన్ త్వరితంబు వారిసం
క్రాంత సుబింబరూపమునఁ ƒ గల్గఁగఁ జేసెను లోఁ బ్రవేశమున్. 16

తే. కామినులు కాముల మనంబు ƒ కరణి జలముఁ
దొలుత వెఱచుచు గాథమ్ము ƒ తెలిసి యల్లఁ
బదము మోపి లోనికిఁ జొచ్చి ƒ పిదప రాగ
హృద్య మగు నంగములను రం ƒ జించి రెలమి. 17

తే. మాటికిని బెద్ద యేన్గుకుం ƒ భముల సిరులఁ
గాంచు చన్దోయి నీటిని ƒ గలఁచి మించఁ
జక్రవాకయుగంబులు ƒ జంట వీడె
నెవ్వఁ డుద్వృత్తుఁ డితరుల ƒ కిడును సుఖము? 18

ఆ. చలికిఁ దలఁకి కలికి ƒ సరసి యొడ్డునఁ గూరు
చుండు టరసి నవ్వ ƒ చునిద కరయు
గము విదల్చు విలస ƒ నముఁ గనువాంఛ మ
గండు నీట నిలిచి ƒ యుండి తడిపె. 19

తే. మగువ పతితో సరసిఁ జొర మాని తీర
మందె నిల్చి సఖుల్ చల్లు నంబువులకు
బెగ్గడిలు చూపుల నవోఢ ప్రియుని గౌఁగి
లించెఁ దప్పొనె హద్దు మీఱిన యిడుమను. 20

తే. వరుఁడు మూఁపులు మునుఁగంగ వారి నిలువ
నంత దాఁకనె తనకు లోఁతగు నటంచు
నతివ తెలియక యట నిర్భయమున రాఁగఁ
బొదివెఁ బతి కౌఁగిటను "మున్గిపోవునొ" యని 21

తే. నాభిదాఁకను గొలనిలో నాతి దిగఁగ
జలము చపలత నూర్మిహస్తముల గబ్బి
చన్నుఁగవ మీఁది కెక్కె; స్పర్శంబు గన్న
వారి కెందేని యున్నె వ్యవస్థ యనుచు? 22

చ. "ఉవిదల మోముతమ్ములకు నోటమి నాకె యనంగరా దదే
కువలయ మోడెనే కనులకున్ ద్యుతిచే" ననుచున్ మనంబునన్
మివులఁగ సంతసించుచును నీరరుహం బళిరావ గానమున్
దవిలి యొనర్చుచున్ బ్రచలితం బగు నూర్మ్యళి సల్పె నాట్యమున్.

చ. జలముల సంచరించెడి ఝషవ్రజ మూరువు రాయుటన్ భయం
బలమఁగ నూత్నవిభ్రమము లంటవుఁ బెందొడ లున్న యింతికిన్
గలిగెను; జవ్వనంబు గల కాంతలకున్ దగు హేతు వుండకే
గలుగును విభ్రమంబు లనఁగా నిఁక హేతువె కల్గ నేమనన్? 24

తే కలఁగిపోయె సరో మహాజలధి జలము
తత్పురంధ్రుల యాకృష్టతమత రాంగ
వల్లికల నీఁతలాడెడి బాహుపక్ష
ముల సముత్తుంగ కుచ గండశిలలచేత. 25

తే. ఎంత గాంభీర్య మెనసిన నేమి కొలను?
యువతి జఘనవిఘట్టన మొంది వికచ
జలజవక్త్రముతోఁ గ్రీడ సలుపఁ గోరి
కలఁగి మర్యాద మీఱె నాక్షణమునందు. 26

తే. ఆకడన ముగ్ధ నాథుని ᛍ నరసి తెచ్చు
కొలఁకుఁ బలె నలల గతిచేఁ ᛍ బఱుపఁ బడిన
వితత చలిత శిఖాంగుళీ ᛍ యుతము కేశ
హస్త మలరారె సిరులొల్కు ᛍ చతివ కపుడు. 27

ఆ. విచ్చు ప్రియక కుసుమ ᛍ వితతుల సిరిఁ దాల్చు
పడఁతి మేను కొలన ᛍ బయలు వడియె
నమలతాంచితుల జ ᛍ లౌఘమ్ము లాక్రమిం
చినను బరిభవంబు ᛍ సేయ గలవె? 28

ఉ. దూరమునుండి డోఁచునది ᛍ తోయజమా యని శంకఁ జేసి కా
సారముచెంత కేఁగి యిది ᛍ చాన ముఖం బని నిశ్చయించె శృం
గారరసజ్ఞుఁ డొక్కఁడల ᛍ కంజములన్ బకవాసభూములన్
చారువిలాస మేకడకొ ᛍ జాఱి పరోక్షతఁ బూని యుండుటన్. 29

— * జలక్రీడా వర్ణనము * —

చ. ద్రుతకనకోజ్జ్వలంబు లగు ᛍ తోయపు జంత్రములున్ సుగంధసం
గతమగునట్టి ద్రవ్యములు ᛍ గబ్బిచనుంగవకుండలందు శో
ణతనుపటంబు లాసవము ᛍ నాధసమీపముఁ డోయకేళి కా
యత మయి యిట్లు సాధనము ᛍ లన్నియుఁ జేకుఱె యౌవతానకున్.

తే. ఉన్నత తటాంతమునఁ బతు ᛍ లుండి, భయము
కొంచ నవ్వారి యెదలతోఁ ᛍ గటిభరములు
మందగతి లేవ నీటను, ᛍ మరలఁ బడుదు
రతివమిన్నలు వాయుచ ᛍ లాంశుక లయి. 31

మ. మగ లవ్వేళ నొనర్చు ధౌర్త్యము గ్రహిం ᛍ పన్ లేని మౌగ్ధ్యంబునన్
మగువల్ గెల్వఁగలేకయున్ మరల నం ᛍ భఃపూరమున్ బాణులన్
దగఁ గైకొంచు నిజేశులన్ గదిపి మీఁ ᛍ దన్ జల్లుచున్ సంతతం
బుగఁ గ్రీడించి రొగిన్ నిజాభిసరణం ᛍ పుర బన్నిదం బొడ్డుచున్. 32

చ. హరనయనాగ్ని దగ్ధకుసు ᛍ మాయుధ సైనిక రాజ్యలక్ష్మి నే
ర్తెఱఁ గొన యోగ్యమైన యొక ᛍ తీవియఁబోణి ముఖేందుమూర్తికిన్
గర కలశోద్యతంబు లుద ᛍ కంబులు పెల్చనఁ బట్టి యెత్తుచున్
సరసకళావిదుం డొకఁడు ᛍ సల్పెను దానె మహాభిషేకమున్. 33

చ. మదనకృతార్తి దుర్బలపు § మానిని యెట్టెటొ చేతు లెత్తి ప్రే
మ చనరఁగాఁ బ్రియున్ గదిసి § మజ్జన మార్చుచునుండు నంతలో
వదులయి తత్కరాగ్రమును § జాసిన కంకణ మొయ్య జాఱె న
య్యదన లతాంగి మై మిగిలి§నట్టి మిటారపుఁ గాంతిలక్ష్మి నాన్. 34

చ. యువకునియందుఁ జూపుగమి § నొప్పుగ నిల్పి నిజానురాగమున్
వివరణ చేసి మారవశ § సీత హృదంతర యయ్యు వేఱ యొ
క్క వనిత నెచ్చెలిం వడుపు§కైతవముం గొని వాని ముందె రూ
పవు ప్రణయంబు నాఁగ జల§ మంజలి నిండ ఘటించి నెక్కొనెన్.

చ. ప్రియతమ హస్తతోయములఁ § బ్రేమ దలిర్పఁగ సిచ్యమాన మై
రయమున సంతసంబును గ§రం బొక శ్యామ మొగంబు దాల్ప; నా
యయమున కోర్వలేని యొక § యంబుజవక్త్రి ముఖంబు సిక్తమే
యయిన గురుశ్రమాంబువుల § నయ్యెను స్నానము చేసినట్లుగన్. 36

చ. తన పతిహస్తకుట్మలస్రు§తం బయి పర్వెడు తోయధార చ
ట్టన పెఱపూవుఁబోఁడి నిబి§డ స్తనయుగ్మము సేచనం బొన
ర్చిన నది గాంచి యీర్ష్య గొని § చేడియ స్వీయవిశాలనేత్రసం
జనితమహాంబులన్ దడిపె § సారెకు నాత్మకుచద్వయిన్ రుషన్. 37

శా. ఏనీరంబులచేత నొక్క సరసుం § డిద్దచ్ఛవుల్ మోమునం
బూనంజేసెనొ నింతి; కట్టివగు సం§పూర్ణేందు విద్యోత సం
ఘానా నాచ్ఛతరాంచి తాంబువులు దూ§రాపాస్త మైనన్ సప
త్నీనారీమణి కొప్పెఁ దాఁ గలుషతన్ § జేకూర్పఁగా హేతు వై. 38

చ. అపరమితానురాగమున § నాంధ్యము గన్న ప్రియుండు దా మవ
శ్చపలతఁ జేరి మానవతి § సన్నిధిఁ దప్పుగు పేరు చెప్పి మో
ముపయిని జిమ్మువారిపవి § పుట్టువుచేతను మంద మయ్యె దే
హపతిత మై పగుల్ప హృద§యం బది దుస్సహ మయ్యె నింతికిన్.

ఉ. ప్రేమ దలిర్పగా బ్రియుఁడు § ప్రేయసి వక్షమునందు నూత్న నీ
రామలబిందువుల్ గురియ § నక్కఱిన స్తనమండలాహతిన్
వేమఱు రాలు చాఁపెమెయి§వేఁడిమి నొంది సమీపవర్తినిన్
భామిని నొక్కదానిఁ బయి§పాటున నొందఁగ జేసెఁ దాపమున్. 40

తే. అంగనకు నంటు వరుని వక్షోంగరాగ
పటలి యిప్పుడు గడుగఁగాఁ బడియె నీట
నంచు పొంగెడు సవతికి నధికతాప
మొదవఁ జేసెను స్ఫుటనఖపదము లకట. 41

చ. చెలులు వినంగఁ దన్నుఁ బెఱచేడియ పేరిడి కాముకుండు తొ
ట్రిలి పిలువన్ ముఖేందురుచి డింది యపత్రపఁ గ్రుంగఁ గాంచి య
క్కొలనునఁ గొమ్మ డాచుటకొకో యనఁగా వెస నావెలంది క
న్నుల జలవర్షముల్ వడిన నూనసమృద్ధి ఘటించె నీటికిన్. 42

ఉ. అన్న మతోర్తు పైఁ బతి జలాంజలిఁ జల్లి క్షణంబు పిమ్మటన్
దన్ను జలాభిషిక్తఁగ నొనర్పఁగ నక్కట మోము కోపసం
పన్నతచేతనే నలుపువాఱెను నేత్రయుగంబునుండియున్
గ్రన్నన జాఱు కజ్జలజలంబులు తా మపశబ్దమై చనన్. 43

తే. స్వర్ణభూషోద్వహనశక్తిఁ బాసి భర్తృ
కల్పిత మృణాళ సూత్ర కంకణము దాల్చి
కృతసపత్నీకటాక్ష సంగతభర మయి
గురుతరం బయి పెంపొందెఁ దరుణి భుజము. 44

తే. మిన్న లగు పెక్కు చిఱుగంట లున్న నేమి
సతతజలగాహమునఁ దేలు సతుల మేఖ
లాకలాపము ధ్వని లేక మూఁక మయ్యె
జడగుణాప్తుల కబ్బునే నుడులతీరు? 46

ఉ. ఎంతయు స్వచ్ఛమౌ కొలన నింతి పయోహృతచేల గాఁగ న
త్యంతము చూపు నిల్పి మదనాహవదేశికుఁడౌ ప్రియుండు ద
న్నంతటఁ జూచె నంచు బిడియంపడఁ బద్మిని వీచిహస్త సం
క్రాంత దళాంబరంబునఁ బురంధ్రిని గప్పె వెనన్ వయస్యయై.

చ. గురు జఘనస్థలాహతులకున్ గుఱిసేసి ముఖద్యుతిన్ వికా
స్వరకమలాళి గెల్చి చెలువల్ తనుఁ గిన్పఱుపన్ జలాశయం
బెరియుచు లోలబుద్ధి త్యజియింపఁగలేక తదంగరాగముల్
సరగ హరించెఁ గాని కలుషం బయి గోచరమయ్యెఁ దాఁ దుదిన్.

కం. వనితల సౌగంధ్యము గని
యును-దవ్వాయి తన్ముఖముల కుపమానం బై
తిని; జేరువ యయి యోడితి
నని కమలము కదలునీటియందు మునింగెన్, 48

తే. విచ్చు గురివెందపూలట్లు పచ్చ నైన
వనితల పసిండి నగలు సత్వర వగాహ
సలిలకేళుల జాటి యక్కొ-లన బాడ
బానల ద్యుతిఖండమ్ము లట్లు మెఱసె. 49

క. య్యువతుల చూడ్కు-ల కనపా
యి విభ్రాపాదకము లయ్యె నిదె యాస్మాక
చ్ఛవు లని స్వగుణముఁ గప్పిన
రవరవ నునుఁగాటుకలఁ గరంచె జలంబుల్. 50

క. హరిచందన మంబురుహుల
గరఁగఁగ నాపాండు వైన కలికి చనుఁగవన్
దొఱఁగి పరభాగ మెడయుట
సరగఁ దెగియె హారయష్టి సహృదయ కాదే. 51

తే. అధిక మౌ నమృతగుణంబు నధిగమించి
దళిత విస్ఫురి తాజ్ఞావతంస యయి ప్రి
యోపభోగ్యంబు నగు సురయును సరసియుఁ
కామినుల దృక్కు-లందు రాగము ఘటించె. 52

ఉ. చెన్నయి నిర్మలోద కణచిత్రము లై జలకంబు లాడు న
య్యన్నుల చన్నుఁగుండ లలరారెను గేళిరయాన సూత్రముల్
ఛిన్నము గాఁగ సద్గుణవిశిష్టసమాశ్రయవాంఛచేఁ దమున్
గ్గన్ననఁ జేరు హారమణిరాజికి నాశ్రయ మయ్యెనో యనన్. 53

తే. పడఁతుల చెవులయందుండి పడిన నల్ల
కలువలను నొడ్డునకు గెంపె నలల గములు
ఉన్నతిని గాంచి, పతితుఁడై యున్న నాత్మ
భవుని నేని స్వచ్ఛాత్ములు పరిహరింత్రు. 54

తే. అంగమున లేపనము వో నఖాంకములును
అధరమున లాక్ష వో రదనాంకములును
జానలకు శ్రీలనే నింపె సలిలకేళి
సిరులె కూర్త్రిగదా సదాశ్రితు లెడరున. 55

చ. సలిల భరావలంబులుఁ బిశంగిత కేసర పూరితాంతరం
బులు నయి వ్రాలు ముంగురులఁ బొల్పగు వల్లరు లుల్లసిల్లుచున్
గలికి ముఖంబునన్ మకరికాముఖపత్త్రిలిపుల్ జలాహతిన్
దొలఁగిన లోపమున్ దొలఁగఁ ద్రోచె ఘటించిన చిత్రశోభచే. 56

తే. సరసి జలములు యదువుల యురములందు
దట్టమౌ నంగరాగమున్ దలల విరులఁ
గొనిన; మద రాగ మది మాత్ర కనుల విడద
ఘనుల చక్షుష్య ధర్షింపఁగలరె యొరులు? 57

తే. వారి వెలుపటి రాగమే వాసెఁ గాని
వారి మనముల రాగంబు వాయ దాయె
ధీరులగు వారి నడుమను జేరు నెవఁడుఁ
బరిభవ మటంచుఁ బొందు నే పరులవలన. 58

తే. రమ్యకుచముల ఫేనహారములు జఘన
సీమలందున శైవాలచేలములును
జెక్కులను నాకుదీవల చిత్రరచన
లమరె జలముల సొమ్ములై యతివలకును. 59

తే. గురుతరాలంకృతులు స్త్రీల వరతనువులఁ
బాసి నీటను సిగ్గుచేఁ బలె మునింగెఁ
దోన నిర్మాల్యము నటింపఁ బూనె నీట
నల్పుఁ డభిభూతుఁ డయ్యు దార్ఢ్యమునె చాటు. 60

తే. బొట్టుసిరు తేఁగిపోయెను బూలదండ
లంబరము కావులను బాసె నంగరాగ
మరిగె స్వబలంబు వోయిన యార్తినిబలెఁ
జారుతరరూపలుగఁ జేసె స్మరుఁడు స్త్రీల. 61

తే. అంబుసేచన జాత శీతార్తినిబలె
శీతపవన కంపిత షౌచు నూతనాంశు
కమ్ర నవయౌవనోష్మకర్కశము లైన
కామినీ కుచతటములఁ గౌఁగిలించె. 62

తే. అంగముల నంటఁ దమ్రంటి నట్టి లవణి
మంబు రూపొందినట్టుల యంబు లురల
నలలపై నాడ నేర్చిన వలువకొంగు
లడరఁ జెలిపిండు ప్రియులతో వెడలె సరసి. 63

తే. వేల్పులకుఁ గూడ వింతను గొల్పఁ జాలి
భాసమానాంబురుహ చారు పాణి యగుచు
సరసి వెడలెడుచెలి లచ్చి సరణి నెదుటఁ
జూచి కృష్ణుఁడు కడలిఁ ద్రచ్చుట స్మరించె. 64

తే. తమ్ముఁ గప్పంగ ధరియించు తనుత రాంబ
రము జలాసక్తమై యంట రమణుల వగు
విమలతర పీవరోరుయుగములు స్వీయ
కాంతులను జిమ్మిలో దాఁచి కప్పె నంట! 65

తే. చెలులు గట్టిన వలువలు తెలిమొగుళుల
సిరులఁ గొని మోదమున నవ్వు కరణి మెఱసె
వారు విడిచిన నీరోడు చీరలు వగఁ
గన్నునీరోడ రోదించు కరణి నెఱసె, 66

తే. సరసతను దద్ద సంసక్తి నెఱపి యుంటఁ
బలుమఱును బట్టు ద్రోపులు వడియుఁ బడియు,
నూత్నరక్తకతతి వెలందుకల యంగ
కముల విశ్లేష మెట్టెటో కాందఁ గలిగె. 67

తే. పెన్నెఱుల్ మూఁపునం బడ వెలఁది యొకతె
తాన మొనరించి యంగమ్ము తడిని నార్చెఁ
బెద్దతడవున కెట్టెటో ప్రియు నెదుటను
నరయఁ బెంపొందు శ్రమ వారి నెఱుఁగ కట్టె. 68

తే. పాపటను దీర్ప నిరుగేలు ♦ పైకి నెత్తు
లలన కుచతట బాహుమూ♦లముల వంక
మఱిమఱి కనుంగొనును గోర్కు♦లలుమఁ బ్రియుఁడు
విషయములపట్లఁ గుతుకమ్ము ♦ విరతిఁ గనునె? 69

క. మరుఁ డెడయకయున్నెడ సుం
దరికిఁ జలువ వలువ స్నపన♦ధౌతాంగముఁ గ
ప్పురవిడెముతోడి మోవియు
నిరవగు నేకతము గలుగ♦నేటికి సొమ్ముల్? 70

చ. ఇటుల సరోఽభిషేకమున ♦ నింతుల మచ్చరముల్ కడంగి మి
క్కుటమగు శోభ నొందుచు న♦కుంఠిత నిర్మల దేహకాంతి ని
వ్వటిలఁగఁ బొల్చు యాదవులఁ ♦ భానుఁడు తాఁ గని పశ్చిమంపు ది
క్తటిఁ గల కంధి నీరముల ♦ దానును గోరెను దాన మాడఁగన్. 71

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
జలప్రవేశవర్ణనము, జలక్రీడావర్ణనం బనెడి
యష్టమాశ్వాసము
సమాప్తము.

——*——

శ్రీ ర స్తు.

# శ్రీ మం దా ం ధ్ర మా ఘ మం

[ శి శు పా ల వ ధ మ హా కా వ్య ము. ]

## న వ మా శ్వా స ము.



### —※ సూ ర్యా స్త మ య వ ర్ణ న ము ※—

క. అంత న్నిజతేజోఽధిక
సంతాపము నోర్వలేని ఛాయను నపరా
బ్ధ్యంతర జల పతనేచ్ఛా
స్వాంతుఁడు రవి పాఱెఁ జరమ శైలము నెక్కన్. 1

క. సురతోత్సుకత్వ మెంతయు
వరలఁగ మునుముంద చెలి గవాక్షద్వారం
బు రహిఁ గదిసి చూడ్కుల వే
మఱు కొలిచె నినాస్తగిరుల మధ్యతలంబున్. 2

క. విరళాతప కాంతియు ను
ష్ణరహితతను వధికపాండుసహి తామ్రశిరం
బురుపరిణతి గత రవిమం
డలవీక్షణమును దివా శ్లథవిధం బయ్యెన్. 3

క. సాయంతన శీతలతర
వాయువుచే మెల్లఁ గదలు వల్యంగుళి "రం
డో"యని పిలిచెడి గృహశా
ఖాయుతునకు మాఱు వల్కె ఖగతతుల రుతుల్. 4

తే. సంజ నిన తను కిరణాళి శైలశిఖర
ములను నాక్షణమందునఁ బొదలె; మంచి
వార లస్తంగతుల యైనఁ బరఁగుఁ గాదె
యుచ్చతర మైన స్థానమే యొక్క టరయ. 5

క. దైవము ప్రతికూలింపం
గా విఫలం బగును బెక్కు। గల సాధనముల్
భావింప వేయి కరముల
చేవయుఁ బడిపోవకుండఁ। జేయునె భానున్? 6

తే. క్రొత్తకుంకుమ కావి గైకొను పయోధ
రముల జానొంది, నిజకరలగ్నసురుచి
రాంబరము నొందు వరుణదిగంగనఁ గడు
రంజిలఁగఁ జేసె నతిసక్తిఁ। గంజహితుఁడు. 7

తే. మివుల నెఱ్ఱని కెంపుల। రవల నడుమ
చెలఁగునది వలె నుండి దిగ్వలయ మొప్ప
నల జపాసుమ గుచ్ఛ కాంతులను మీఱు
భానుబింబమ్ము సంజను। వ్రాలి వ్రేలె, 8

తే. తప్తశాత కుంభమ్ము చందనమునఁ దోఁచి
సగము నీట మునుంగు భాస్కరుని బింబ
మజనఖ విభిన్న ఘనజగ। దండ కైక
తర విభాగముకైవడిఁ। దనరి క్రాలు. 9

తే. సానురాగుఁడు, నయనసౌ। ఖ్యావహాంగ
యుతుఁడును, నతాపకరుఁ డయి। యొప్పుఁగాక,
గతవసుం డౌట, నపరదిగ్గణిక రవిని
వేగ గగనాలయమునుండి। వెడలఁ గొట్టె. 10

ఉ. వేఁడి వెలుంగులన్ దనరు। వేలుపు గ్రుంకెడు నంతవట్టు రె
ప్పాడక నిల్పి పెద్దతడ। వారయఁగాఁ దమి వాడి జాలుగా
వీడెడు బంధురాశ్రువుల। పెంపును గాంచెడు నబ్జనేత్రమున్
మోడిచి నీటిలో నిలిచిపోయెను బద్మిని సంజవేళఁ దాన్. 11

తే. రవి తొలఁగె జంద్రబింబము। రాదు రిక్క
లగపడవు దాప మేపతె। నంధకార
మొదవ దైనను నింగి సొంపెక్కె నరయ
విగుణునకు దోషహైన్యమే। యగు గుణంబు. 12

౹౦ కున్కిప ట్టగు స్వ * కాంతుఁడు దాఁ బరలోక మేఁగ న
త్యంతము నిర్మలమ్ము లగు * నాతని రశ్మిసతీ సహస్రముల్
బంతులు దీటి యొక్కమెయి * వహ్నిఁ బ్రవేశ మొనర్చె నౌర! యా
కాంతునె ముందు జన్మమునఁ * గాంచుట యెట్లు మఱొక్కభంగిచేన్

—* సంధ్యావర్ణనము *—

తే. పితరుల సృజించి వేలుపుఁ * బెద్ద చాల
కాలమై త్యజియించిన * కాయ మయ్యు
పుల్లకౌసుంభశోణతఁ * బూని జనుల
యంజలుల నొంది సంధ్య పాయదు ప్రకృతిని. 14

తే. చట్ట మౌ సంజ వెలుఁగు క * తమున నెఱుపు
గలిగి జక్కవవులుఁగులు * కవలు వీడె
విరహమున గాసిలంగను * బ్రీలు వాని
యెదల వెల్వడు రక్తమ్ము * గదిరినట్లు. 15

తే. నిచ్చలును లచ్చి కిల్లని * నెగడు నీప
యోరుహము పగలు గడవఁ * బాఱిపోయె
నల్ల లచ్చియుఁ ద్యజియించి * యట్ల కాదె
సాజ మౌఁ గృతఘ్నత చపలాజనులకు. 16

తే "మిత్రుఁ డణఁగిన బగలును * మృతిని జెందెఁ
గాన నబలను నే మున్న * గార్య మున్నె?"
యని వెలుఁగుతేని విరహార్తి * నాక్షణంబ
సంజ కంటికిఁ గనరాక * చనియె నార్తి. 17

తే. తనదు ప్రతిబింబమును గాంచి * యినమృగేంద్రుఁ
డలుకచేఁబలెఁ బడియెఁ దా * నంబునిధిని
బిదపఁ జీకట్లు జగ మెల్ల * గదిసి మించె
నాగయూథమ్ములను బోలి * నలుపు చెలఁగ. 18

తే. సాంద్ర మగు పంకమును బోలు * సంజయిరుల
గములు వెడలెనో భూధర * కందరముల
నుండి వెలికిని? వెలినుండి * యుర్విధరపు
గుహల సేవించెనో లేక * కొఱఁత దక్కి? 19

తే. మింటియందుండి వ్రేలెనో మేదినీత
లమ్మునందుండి మీఁదికిఁ జిమ్మెనొక్కొ?
కాక దెసలను జన్మించి కలయఁబర్వె
నో యనఁగ నిర్ధరింపరా కొలనెఁదమము. 20

తే. మిన్ను మన్నును కనరాక మీఱ నిరులు
జనుల కనులకు నొక గ్రుడ్డితనము కలిగెఁ
గాని నూతనతమ సిద్ధకజ్జలాప్తిఁ
గామినులు ప్రియవేశ్మమార్గములఁ గాంత్రు. 21

ఆ. గాఢసంతమసము కార్యభార మెఱుంగు
టను క్రియాభిసరణమునకుఁ గడఁగు
చెలికి వెఱపు గొల్పు దలఘుస్తనముల నూ
గారుతెరువు వణఁకనట్టిరీతి. 22

తే. దినము సూర్యుని కాంతిచే గనఁగరాని
గ్రహగణ మ్మది మించు చీకటిని రేయి
పొంది యెంతేని తేజమ్ముఁ బూనె నౌర
యల్పులు రహింత్రు గద మలినాశ్రయమున. 23

తే. కలపములఁ బూలదండలఁ గాంతకుపిత
సుందరుల దీపశిఖలను సుప్త మదన
బోధనం బగు రీతిఁ బ్రబోధములను
సలుపఁ జెలరేఁగె నాప్రదోషంపువేళ. 24

—* చంద్రోదయవర్ణనము *—

తే. భూమిదరినుండి వెల్వడు భోగిభర్త
ఫణసహస్రాశ్మకాంతుల పటలి భంగి
సిరుల మించెడు శీతాంశుకరవితతులు
దేవతాధీశదిగలంకృతిఁగ జెలంగె. 25

తే. ఉదయగిరిఁ దలఁ దన్ని శీతోస్రమూర్తి
తెల్ల నౌ కాంతులం గని తేజరిల్లెఁ
బలువరుస దాఁగురించి తాఁ బ్రాచిదిక్కు
లీలకై నవ్వు నెమ్మొము లీల నూని. 26

క. ముందట శశికలచేఁ బరి
మందంబుగ భిన్న మగు తమఃపటలి జటా
బృందముగ; గగనమును జను
లందఱు శివుతను వనిరి తదంగ మగుటచేన్. 27

ఉ. క్రొన్నెలతళ్కు పూవులను గూర్చిన చీకటికొప్పు యొప్పులన్
జెన్ను వహించు తూర్పుదిశ శ్రీయుతవక్త్రలలాటపట్టికన్
గ్రన్ననఁ బోలి తేజరిలి గంధపుబొట్టున సిక్తమైన య
ట్లున్నది యోషధీశుని నవోదితఖండము సొంపు నింపుచున్. 28

తే. మొదట షోడశభాగంబు పిదప సగము
మీఁదఁ బూర్తిగఁ జంద్రుండు మించి తోఁచె
నెంత ద్యుతిశాలికేనియు నెసఁగు వృద్ధి
క్రమంబుగాఁ గాని వేవేగ కాదు నిజము. 29

చ. వికచ విపాండు రాబ్జగణవిస్తృత శోభల మేర మీఱు శీ
తకరువి బింబ మాయెడఁ బతంగవిభూత్తమవాహనుండు బల్
సుకమునఁ బండు పాన్పుపయి సుందరి యిందిర నిద్ర మాని మ
చ్చిక మును లేవఁ దన్ముఖశశిద్యుతియెట్టుల మించు నట్లయై. 30

తే. ఋక్షసేవక సంఘ మెల్లెడలఁ గొల్వ
లక్ష్మణానుగతుం డగు రమ్యమూర్తి
చంద్ర దశరథసూనుఁడు చండధాటి
నంధకారాసురగణమ్ము హత మొనర్చె. 31

తే. గగనవీథులఁ జరియించు కైరవేశుఁ
డనెడు ముగ్ధవణిక్పుత్రు నర్ధకళల
స్వీయవృద్ధికి సేవించి చెలఁగెనంట
సంద్ర మనియెడుఁ గడుసరి సాహుకారు. 32

తే. తేజు గాంచెను విధుండు రాత్రిని బొంది
రాత్రియును నిందు పొందున రాజిలె నఁట
యాక్షణంబున, నట్లు మహాత్ము లొక రొ
కరికి నుపకారములు సేయు గాథ లొప్పు. 33

మ. పగటన్ వేఁడివెలుంగు పాదహతులన్ బల్గాసిచే నైన పె
న్వగతో సంతత చంచరీకరుత సంతప క్రోదనన్ బొక్కు నా
తొగకన్నెన్ బలుమాఱు లగ్ర కరసంద్రోహంబుచే నంటి తా
మగఁ డౌటన్ హిమధాముఁ డావ్యథ వెసన్ మాయించె
నూరార్చుచున్. 84

ఉ. జానగు కన్నుదోయి గల చానలు నాథుల పజ్జ మన్మథా
నూన వయో విభూషిత తనూకలిత ప్రతిమానినీమణిం
గా నివపున్వెలుంగుదొర కాంతిఁ గరంగిన నీటిబొట్టులన్
బూనిన యిందుకాంత మణిపుత్రికఁ జూతురు బీతు పైకొనన్. 35

క. అమృతమునఁ దడియు కరముల
నిమురుచు నోషధులపతి వనితలన్; దద్దే
హము లెల్లఁ బర్వి సంతా
పము గూర్చెడు కోపవిషముఁ బాపెన్ మిగులన్. 36

తే. మివుల దిక్కుల శోభల మీఱఁ గూర్చు
చంద్రకాంతుల సంతతి సారెసారె
స్వచ్ఛ మగు యౌవత కపోల ఫలకములను
నంతటను బర్వి కడు దట్ట మగుచు వెడలె. 37

శా. వేలన్ స్వీయ మహోర్మిబాహువులనొ విన్నాణపుం కౌఁగిటన్
జాలం గూడి సుఖించు నబ్ధి నయినన్ సంక్షుబ్ధమున్ జేయఁగా
జాలున్ శీతకరుం డనన్‌గలుగ దాశ్చర్యం బొంకితేని, గో
పాలాబ్జేక్షణలన్ స్మరాలసల క్షోభల్ పెట్టె వీఁడన్నచో. 38

తే. ఎంతొ మందుండు గావున నిండ్ల మేను
మఱచి కూర్కు మరుఁడు జాలమార్గ నిర్గ
తములు నిర్మల స్ఫాటికదండ నిభము
లగు సుధాకరు కరము లూఁతగను లేచె.

తే. మున్ను తమమున శరలక్ష్యమును గనంగ
నేరని సుమాస్త్రుఁ డప్పు డిందీవరాప్తుఁ
డుదితుఁడై లక్ష్య భాగ మొయ్యొయ్యఁ దెలుప
విల్లుచేఁ బూని వెడలెను విజయకాంక్ష. 40

తే. పూవువిలుకాని దగు ధనుస్సవునకు వెలికి
వెడలు నట్టి శిలీముఖవితతి చంద్రుఁ
డుదయ మందంగ విరియు కుముదమునందు
మించుఁబోఁడుల యెదలందుఁ గాంచెఁ దావు. 41

తే. దిఙ్ముఖంబుల పేవేగ తేజు నింప
రతికి నౌత్సుక్యగరిమ గసరంబు కూర్చి
యత్రినేత్రజ మగు నపరాగ్ని యిందుఁ
డంగజుని బ్రజ్వరిలఁ జేసి యలరఁ జొచ్చె. 42

—* ప్రసాధనవర్ణనము *—

క. ఈవిధముగ చంద్రోదయ
మై విలసిల నిశ్చితప్రియ సమాగమ లై
పూవుంబోఁడులు తొడవుల
సేవించిరి; తఱి యెఱింగి సేఁత సఫల మౌ. 43

తే. అతివ చనుదోయి యొక రమ్య హారలతనె
సమముగ ధరించె నీరంధ్ర సమతఁ గనుట
సంతతమును నీరంధ్రతా సంహతతల
నలరువారికి సమ భాక్త్వ మబ్బుఁగాదె. 44

తే. అరఁటికంబము లన నందమైన యూరు
తరుల జఘనస్థలీ పరిసరమునందుఁ
గాంచికా భూష యన్ త్రాటఁ గలికి మిన్న
కంతుఁ డనెడి గజంబును గట్టివైచె, 45

ఉ. చారు విశాల నేత్రయుగ చంచలకాంతులు చాలఁ గల్గు నా
నారుల మోవులందుఁ గడు నాణెపు లత్తుకరంగుఁ జెక్కులన్
దీరగు లోధ్రపున్రజము నేత్ర పయోజము లందుఁ గాటుకల్
సౌరయి మైక్యమున్ బడనె సంకునఁ బోసిన పాల కెక్కుడై. 46

చ. కదలు మెఱుంగు మోవు లనుకమ్రదళంబులతో వికాసవత్
సదమల దంతకాంతు లను సన్నుతి కెక్కిన కేసరాళితో
ముదమును నింపు కర్ణికల పుంజము నాఁ దగు గండపాళులన్
వదనము లన్న విచ్చు నళినమ్ములతో ప్రమదాళి రాజిలెన్. 47

మ. మును తన్ మించినవాని కోడి పెఱభూరుహముల్ పట్టుటో-గాక మే
లనినన్ వానికి వెన్క నే యరుఁగుటో కార్యంబు లోకంబులో
ఘనలావణ్యముచేత నుజ్జ్వలము లౌ గండంబు లింపొందు శో
భన లోలాక్షుల మోములందు నెల బింబఖ్యాతి మై నుండెడున్.

చ. అతికఠిన స్తనస్థలి నసంగుని యమ్ములు తాఁకుతోడనే
ప్రతిహత మయ్యె నౌర! యితరం బగు నంగములట్లు గాక యు
ద్ధతిఁ గుచపాళి నైజభర మంతయు మోపి యలంప మధ్యమం
బతి తనిమంబు నొందెఁ గద యాగురుతాదృఢతల్ దురూహముల్.

ఉత్సాహ:- ప్రియుఁడు గీము చేరు నని యెఱింగి, మేటి జాణ లే
యయినఁ జారునేత్ర, లలరులందుఁ, బూఁతలందు, మే
లయిన చేలలందు, నిదియె యద్దె యోగ్యమంచు ని
శ్చయము చేయఁజాల రవియు జాను మీఱి యొప్పినన్. 50

తే. ఆతివ కౌఁగిలి సుఖమున కంతరమ్ము
గలుగు నని భీతిచే మెయి గంధ మలఁద
దనవలేపన మే దేహమునకుఁ దగును
గరము నిజహృదయేశు సంగమములందు. 51

తే. ఆస్యకమలోద్గత మ్మగు ననిలములను
నాసికారంధ్రమును జొర దనదు పాణి
పల్లవతలంబులను వీచి భామ మోము
తావి గుర్తించి మెల్ల సంతసము గాంచె. 52

తే. ఎదుట మిన్నును, జెలియును నెత్తిపట్టు
నిండు మండలకాంతి, నిశ్ఛిద్ర మైన
చందురునియందు నద్దంబు నందుఁ గనిరి
స్వీయముఖలక్ష్మి మాటికిఁ జేడె లపుడు. 53

ఉ. చాన మఱొర్తు కయ్యెడఁ బసందుగఁ దాల్చు కపోలసీమ పై
యానుట వంగు హస్తతరుణాంచితపల్లవమున్ ధరింపఁగా
జానగు బాహువున్ దనదు జంఘను నిల్పి గళంబులోఁ గలం
బైనను శబ్దశూన్య మగునట్టుల గాన మొనర్చె లీలకై. 54

ఉ. మిక్కిలి మోహజాలములు మేరలు మీఱఁగఁ జెల్మికత్తెలన్
గ్రక్కున నక్కునం గలుగు రాగము దెల్పఁగ జాలి, యింపు పెం
పెక్క బిరాన తప్పక నిజేశుని మానసమున్ హరించు నా
చక్కని చూపులుంబలెను జవ్వను లంపిరి కాంతుఁ దోడి తేన్. 55

—* దౌత్య వర్ణనము *—

క. "నను చుల్కన సేయని గతి
మనమున దయఁ జూచు రీతి మానిని! ప్రియు చెం
తను జేరి కుశల మడుగుమ"
యనుచును దూతికకు నబల యాన యొసంగెన్. 56

తే. గరువము గలట్టి మఱియొక 1 కలికి ప్రియుని
జెప్పకయ తోడి తే వేగఁ జెలియ యేఁగెఁ
జెలులకుఁ బ్రియంబు హితమును జేసి ధన్యు
లౌదు రాప్తులు, ప్రేరితులైన మఱియు. 57

తే. తప్పు చేసిన ప్రియు ననాదరము చేసి
నట్టి నేనె యాతని పీడ కరుగు టిప్పు
డుచితమే; కాని యెంతువే మో "మనమున
నింత యభిమాన మొదవని యింతి" ననుచు. 58

మ. "పొలఁతీ నాథుఁ దిరస్కరించి యటుపైఁ బూనంగలేవైతి గా
యలుకన్ ధైర్యముతోడ నాతని పయిన్ హా" యన్న నీతోడనే
బలుకన్ రానిది యొండునుం గల దొకో పద్మాక్షిరో సాహసం
బలుసౌ, దానను నేను నీతెగువఁ జేయం జాల నిక్కంబుగాన్. 59

తే. వాని కడ కేఁగి తప్పులఁ బట్టకమ్మ
అతని నేరంబులను మన మరయకుంటి
మంచు విశ్వయ మొనరించి యతివ యెగ్గు
నొనరిచిన ప్రియు చెంతకు ననిపె దూతి. 60

ఆ. ఏమి రాయబార మింతి! చెప్పఁగవలె
నన్న సుంత పల్క దబల లజ్జ
నతను నిశిత విశిఖ హతిఁ జాలఁ జిక్కిన
తనదు తనువు నల్లఁ గనులఁ గాంచె. 6

తే. పురుషులను జేరి దూతికల్ పురుషులవలెఁ
ప్రౌఢమతిగర్భవచనముల్ పలికి రంట
అకుటిల మతులు చెలుల కై యాచరించు
నవ్వి ప్రకృతి విరుద్ధంబు లయ్యు వెలయు. 62

తే. ఎవఁడు మద్రూప కీర్తి హరించె నతని
యెడఁ బ్రసన్నత వహియించు నిది యటంచు
నీయెడల నీసుచేఁ బలె నీరజాక్షి
నక్కటా! మారుఁ డదయుఁడై స్రుక్కఁ జేసె, 63

తే. త్వత్కథాశ్రవణమును జేయు వనిత తనదు
శ్రవణ మంగుళముఖముచే స్ఫాలనంబు
చేసి నీ గుణపూగముచేత నింపఁ
దృప్తి నొందని చెవికిని హెచ్చె ఘనత. 64

తే. అకట! యిందీవరాక్షి శోణాధరంబు
కరము వెచ్చని యూర్పులఁ గంది యిగుర
నపుడ వేసిన తమలంపు టాకు కెంపు
రసము నసమర్థమై పోయె ద్రవము గూర్ప. 65

తే. ఎంత పదనైనవో కాని కంతు శరము
లంతరము లేక కర్కశమగు పయోధ
రముల మండల మావరణముగ డాఁగి
నట్టి చెలిమానసంబు చెండాడివైచె. 66

తే. క్రొవ్విరులకంటె నత్యంతకోమలమ్ము
కలికి మైఁదీవ యనినచోఁ గల్ల గాదు
కుసుమబాణుఁడు తన వగు కోల లేసి
కరుణ విడనాడి తరుణిని గలఁచుచుంట. 67

తే. చెడును విష మయి విపరీతసేవవలన
నమృత మైనను సర్వమ్ము ననుట తెల్ల
మమృతజనితంబ యైన హిమాంశువెల్గు
లతివ దహియించు నీవిరహమునఁ గడఁగి. 68

తే. ప్రేయసిని గూర్చి దూతి సƒప్రీతి నిట్లు
చెప్పు మాటల విశ్వసింƒచెను బ్రియుండు
మునుపె యింగిత మెఱింగిన ƒ జనునియందు
నాఁటి వలుకులు తోడ్తోడ ƒ నాటుకొనవా? 69

తే. మొదటఁ జొప్పును గానక ƒ పిదపఁ జంద్రుఁ
డుదయ మందినఁ దస్కరƒపదము లెఱింగి
ప్రేయసీహృత మనముల ƒ వెదుకఁబూని
బయలుదేఱిరి పయన మై ƒ పడుచువారు. 70

తే. తొట్రుపాటునఁ గదిరెడు ƒ తోయజాక్షి
శ్రవణమందుండి రణితాళి ƒ సంకుల మగు
జలరుహము జాఱెఁ, బ్రియుని గాంƒచంగఁ బోవ
విచ్చు కనుతాఁకునను బోలె ƒ విలసనమున. 71

తే. కాంతు నాకస్మికమ్ముగాఁ ƒ గాంచి యెదుర
నతిరయంబున రాఁబోవ ƒ నాకసమ్ము
నున్నతిని నెట్టు చన్దోయి ƒ యూఁత బల్మి
వంపఁ జెలిఁ బతి కౌఁగిటఁ ƒ బట్టి నిలిపె. 72

ఆ. తనదు వెనుకనుండి ƒ దయితుని గురుబింబ
మంతరమునఁ దాల్చు ƒ నద్ద మధిక
భరము గల్గి మివుల ƒ వడఁకు నవోఢ క
రాననుండి యెట్లు ƒ యైనఁ బడద. 73

తే కుచయుగము వక్షమునఁ గూడుƒకొనెడునట్లు
వంగి ప్రియురాలి బిగ్గఁ గƒవుంగిలించి
కదలు మొలనూలి మువ్వల ƒ కల రవంబు
మించ దయితుండు నవ్వుచు ƒ మీఁది కెత్తె. 74

తే ప్రియుఁడు దరిఁ జేర వెస లేచిƒవెలఁది నీవి
జాఱఁ గని కేలఁ గొన్న వƒస్త్ర మ్మొకింత
బయటి కగపడు బంగారుƒపలకఁ బోలి
మెఱసెడి తదూరుదేశమ్ము ƒ మఱుఁగుపఱచె. 75

తే. వెనుకపాటుగ దరిఁ జేరి x ప్రియుఁడు కనుల
మూయ 'వీరెవ్వరో చెప్పు x ముగ్ధ!' యనిన
బోటికిని నోటితో చెప్పఁ x బోదు గాని
పులకలను నూత్నవధు వదే x పోలఁ జెప్పె. 76

తే. కాంతు సన్నిధి నూరువుల్ x గదలకుంట
మివుల వడకుట సిగ్గును x మీఱు వికృతి
కార్యమూఢత మొదలుగాఁ x గలిగియున్న
నాదరాధిక్యమునె తెల్పె x నతివ తనువు. 77

తే. విభుల కుపచారము లొనర్ప x వేడ్క నూరు
భారమున మెలమెల్లన x పదము పదము
దొట్రిలుచునుండ నిండ్ల బో x ల్తుకలు సంచ
రించుచుందురు పతులు లా x లించి మెచ్చ. 78

తే. దృగ్విలాసంబుఁ, గనుబొమ్మ x లెగురవేయు
లలితమును, జేయి త్రిప్పుచుఁ x బలుకు హొయలు
నైజములె యయ్యెఁ దరుణికి x నాట్యచతుర
గురుఁడు గఱపిన నాట్యమ్ము x కరణి మెఱసె. 79

తే. గోత్రభేదమ్ము నాయెడఁ x గూడఁ జేసి
జగతి నిపు డింద్రభావమ్ముఁ x జాటితి గద
అట్టి నీకును నయనస x హస్రతయము
స్రష్ట కల్పింపకుంట య x సాంప్రతంబు. 80

తే. అతిసమీపమునం దుండి x యనిశ మక్షి
గతనె యైనను నావంకఁ x గాంచ వెపుడు
హృదయగత యయి యున్న నీ x యిష్టరాలి
యెదుటనే సారెకును జూతు x వేమొ కాని. 81

తే. అని వచించుచు ముందుగా x నరుగఁ గోరి
చూడఁ ద్రుటికాల మొం డొరు x చూపు కలయ
విచ్చుమో మొప్ప దయిత నాఁ x పెను యువకుడుఁ
గరమున గ్రహింప గళిత మై x కాంచి మొఱయ. 82

తే. వెలఁది యీసునఁ బతిని మున్ వెడలఁ గొట్టెఁ
గదలి వాఁడేగుచోఁ గృతకకముగఁ దుమ్మె
దాని కల రూ పెఱింగి యాతఁడును నిలిచె
నపశకునశంక వగచుచు నాఁగినట్లు. 83

తే, ప్రియతముని జూచినంతనే ప్రిదిలి నేలఁ
జీర జాఱ ముఖేందు వంచికొని మాన
వతి నిలిచియుంట యరయ సత్వరమ చనిన
మానము పదాంకములఁ గాంచఁ బూనె నిజము. 84

తే. పచ్చి యాఱని తప్పు తాపంబు, నిండు
జవ్వనపుఁ దాపమును, సుమశరుని తాప
మిరువుకొన్న లతాంగి పాలిండ్ల వేఁడి
నాథు కవుఁగిట గోర్వెచ్చనయును గాద. 85

తే. ఉర్వశీతలకుచముల నొప్పు నొకతె
ఉర్వర జరించు నుర్వశి కుద్ది యయ్యె
దన్ముఖమ్ము తులారహితమ్ము మెఱసె
మేనక తదీయసౌందర్య మేన కనద. 8

ఉత్సాహ:- ఇటుల కోప మనెడు విఘ్న మెడయఁ జేసి జ్యోత్స్న శ
క్కటము కామినులను కాముకులను గూర్పఁ జాలె వి
స్ఫుట లతాంతశర విలాసములఁ జెలంగి యడ్డు సి
గ్గటులె దీర్ప నేర్చి మద్యమయ్యె రతుల గురువు గాన్. 

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రిమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
సూర్యాస్తమయవర్ణనము, సంధ్యావర్ణనము, చంద్రో
దయవర్ణనము, ప్రసాధనవర్ణనము, దూత్యవర్ణ
నము ననెడు నవమాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

[శిశుపాలవధమహాకావ్యము.]

## దశమాశ్వాసము.



### —* మధుపానవర్ణనము *—

తే. సజ్జితమ్ములు సౌరభస్వచ్ఛములు సుఘటి
తమ్ము లుల్లసదక్షిపద్మములు నయిన
ప్రియల మోములె యువకు లౌ ప్రియుల కయ్యె
వాంఛ లిగురొత్త మధు పానపాత్రములుగ. 1

ఉ. లాలన సేసి, సందియము లంద గమానిచి తెప్ప వాల్ప కా
కాలములోనఁ గోపము వికావిక లై చనఁ దోలి యాకృతిన్
దాలిచినట్టి ప్రేమఁ గడుఁ ద్రావఁగఁ జేసిరి మద్యసారమున్
గ్రోలు నెపంబు పెట్టి తమ కొమ్మల దప్పిక దీఱఁ గాముకుల్. 2

చ. అతుల మనోజ్ఞతాయుత ముఖాంబుజముల్ ప్రతిబింబ మొందఁగా
జితసహకారపల్లవవిశేషసముద్గత మైన తావు ల
ర్పితముగఁ జేయఁ జల్ల నయి పెల్లుగఁ దుమ్మెదదిమ్ము మ్రోయఁగా
నతిమధురమ్ము నైన మధువందునె డిందె హృషీకముల్ వెసన్.

ఉ. పెక్కుగ మద్యవాసనల పెంపొదవన్ సవికాసదృష్టులన్
జొక్కెడి సుందరీముఖము చూచి సరోజపుసౌరభంబులన్
జక్కని పానపాత్ర గని శంకిత మై యళి వ్రాల కెందునన్
మిక్కిలి మద్యపానమున మేని నెఱుంగక పాఱె నద్దెసన్. 4

ఉ. నింపిన మద్యసారమున నిగ్గులు దేఱెడి పానపాత్రలో
సొంపులు గుల్కఁగా ముదిత సోగకనుల్ ప్రతిబింబ మొంద మ
వ్వంపుసరోజ మంచు మధుపంబు తదీయ సుగంధ మానఁ గాం
క్షింపుచుఁ గూలె, భ్రాంతులకుఁ జేకుఱు నొక్కొ వికాస మెన్నఁడేన్

తే. ప్రియతమా దత్త మద్యమ్ము ప్రీతిఁ గ్రోలు
ప్రియున కెంతేని రసవంత మయి రహించు
టరుదె? చేతన లేని బంగరు మకుటవుఁ
బ్రభలచేతనె పీత మై పరఁగె ననఁగ. 6

ఉ. ఏయది మున్ను ద్రావినది యేనియు నామధువే యపూర్వ మౌ
తాయమువోలెఁ గ్రొత్తరుచి దాల్చి ప్రియున్ దనియించె నంతటన్
బ్రేయసి క్రోలువేళఁ బెదవిన్ జనియించిన తీపి దానిలోఁ
బాయక లీన మై కలయఁబాఱుట యెన్నఁగ ముఖ్యహేతు వౌ. 7

తే. అతిమధుర మద్య గత విమలాబ్జగంధ
ములను వికసించు నాననములను నాసి
కావివరముల నేక మౌ కాలమందె
గైకొనంజాలెఁ బ్రేయసీగణము కెరలి. 8

తే. తీపుల మధువుఁ బోలెడు తెఱవ యోష్ఠ
రుచకమును నంజుకొనఁగ గోరుచును బంటఁ
బట్టి నాథుఁడు గ్రోలఁగాఁ బాసినట్టి
లత్తుకకు, జాజుచే నాత్మలబ్ధి గలిగె. 9

చ. మదనవికారముల్ చెలఁగ మత్తును గూర్చెడి యొక్క ప్రేయసీ
వదనము పానమున్ సలుపు వాంఛల మైమఱ పొంది యున్న యొ
క్కదయితుఁ డెన్నఁడున్ మునుపు గానక గ్రోలెడు నంజువోలి యా
యదన మధుద్రవంబె కడు నచ్చెరువున్ సమకూర్చె వానికిన్. 10

క. కలు ద్రావిన మిథునంబుల
వలపు మొగంబులకుఁ గ్రిందు వడి సిగ్గుమెయిన్
గలుగిండిఁ బడిన నీలో
త్పల మళికులరుతుల నేడ్చుపగిది నగపడెన్. 11

శా. ముమ్మాఱాసవపానమున్ సలుపఁగాఁ బొల్పారు నాప్రాతిభం
బిమ్మౌ వారిజపత్రనేత్రలకు నయ్యెన్ వక్రవాక్యంపు టం
దమ్ముల్ తొల్లి సుగూఢమై యిపుడు వ్యక్తం బౌ రహస్యాత్తహా
స్యమ్ముల్ చాలఁగఁ గల్గి యొప్పు పరిహాసమ్మెంతయున్ మీఱఁగన్.

చ. వరలెడు కైపుచేఁ దరుణవల్లభుచేఁబలె ముగ్ధయైన సుం
దరికినిగూడ సంధిలె నదాటుగ హావవిలాసరుచ్య మౌ
నరవిరి నవ్వు, భాషితముఖలం దొక జాణతనంబుఁ, జూపులన్
మెఱయు వికారరీతులును మిక్కుటమై మదశక్తి నే మనన్. 13

మ. అపరాధం బొనరించు నాథువిషయంబై యప్రసన్నంబుఁ గ్రో
ధపటిష్ఠానలదీపితంబు, నచలద్ధైర్యంబు, దీక్ష్ణంబు నౌ
చపలాక్షీమన మామధు క్రమములన్ సంక్షాళితం బయ్యెనో?
స్నపితం బై శమితంబె యయ్యెనొ? బిరానన్ ద్రావితం బయ్యెనో?

క. ధాతు విలీ నార్థములకు
ద్యోతక ముపసర్గ మైన యోజ, వధూటీ
వ్రాతాంగ లీన లీలా
ద్యోతక మయి మధుమదంబు తోఁచెన్ బెలుచన్. 15

తే. సగము పల్కిన మాటయు స్రస్తమాల్య
వసనభూషాదరము లేమి పరఁగ హేతు
వింత గల్గకె పో లేచు టింతులకును
మదవికారము సూచన గదురఁ జేసె. 16

తే. ఆసవము గ్రోలియుంట నల్లల్ల జాఱు
సిగ్గు లలరారు తెప్ప కొంచెముగ నెత్తి
యొప్పు చూపునఁ జూచె నవోఢ కాంతు
ముఖము మెల్లన తనదగు మోము వాంచి. 17

తే. మున్ను చెలికత్తె ప్రేరణమునన యెట్లొ
యే చెలి ప్రగల్భతను బ్రియు నెదుటఁ జూపు
నదియె మధు వాన మరల సిగ్గలమి పొలిచెఁ
గై పెనయ; నెల్లరును గాంత్రుగాదె ప్రకృతి? 18

ఉ. ఏది ప్రియానుషక్త మయి యెట్టెటులో కడుపెద్దకాల మా
చ్ఛాదిత మయ్యె సిగ్గునను జాన మనంబున నట్టి రాగమే
యాఁదట మద్య మానఁగనె యబ్బెడు మత్తునఁ గన్నుదోయి లీ
లోదయభంగిఁ గానఁబడె న్యొయ్య నశంకముగాఁగ నయ్యెడన్. 19

తే. ఆగతుల నగణితప్రతియాతు లైన
వల్లభులఁ దామె యభిసరింపంగఁ గోరి
కాంత లనుతాప మెదలనుగాంచు తఱిని
నాసవాస్వాద మవసర మగుచు వచ్చె. 20

తే. మదవిమోహితచిత్తనై మరల నాకు
నెగ్గు సేసిన పతికి నై యేఁగఁ జన ద
టంచు నొక్కతె సురఁ గోర దారయఁ బొల
యలుక సుఖమునకంటెఁ దుస్త్యజము గాదె? 21

ఆ. సప్రసాద మనుచుఁ జానలు సురఁ ద్రావఁ
దోన నది ఫలించెఁ ద్రోనె సిగ్గు
జాడ్య, మాత్మనాథసామీప్యమును జేర్చె
రతిసుఖమ్ము లొందిరంజిలంగ. 22

క. చెలువుఁడు పుక్కిటఁ బట్టిన
కలు మదనోద్దీపకముగఁ గడు రుచి మెఱయన్
లలి నీయఁ గ్రోలుదురు ప్రమ
దలు మదమును నామసార్థకతయుఁ దమ కమరన్. 23

ఉ. కల్లున నంగనాస్యచషకంబుల రెంటను దోఁచి, తుమ్మెదల్
పెల్లుగ మోదమొందు సరవిన్ విలసిల్లెడు రెండుతావు ల
ల్లలన నొండొకంటఁ గలయంగను నూతనమై తనర్చెనో
యల్లవిమిశ్రమే యతిశయంబును గాంచెనొ యేమొ నాఁ దగెన్. 24

చ. అలుకను మాన్పఁ జాలి, రతి కాస జనింపగఁ జేసి, సొగక
న్నులకును రాగసంపదల నూల్కొనఁ జూపుచు, వేగవేగ స
ల్లలితము గాఁగ మానసమ్ముల గరగించి నిజాధినాథులం
బలె మదిరామదం బసితవారిజనేత్రల కయ్యె నయ్యెడన్. 25

తే. కల్లు ద్రావంగ వవయావకమ్ము కావి
రంగు వాయుంగ నాధరగత రాగ
మునను రంజించి రఁట తమ మోవు లాంత్రు
వద్దఁ జెలులుంట గుప్తచుంబనచతురత. 26

తే. వేఱొకతె పేరు కొని కల్లు § విభుఁ డొసంగ
నాను నింతికి మద మింత§యైనఁ గలుగ
దానకున్నను రెండవ § యబ్జముఖికి
మద మొదవె దానిఁ గన్గొన్న § మాత్రముననె. 27

క. పరవనితా గత చిత్తుఁడు
వరుఁ డని లో నెంచు వనిత § వారుణిరస మే
త్తెఱఁ ద్రావి మదము నొందదు
మరలని మానససుఖమ్మె § మదహేతు వగున్. 28

క. మును కోపంబునఁ బ్రియు ప్రా
ర్థన లొల్లక పిదప మధువు § ద్రావంగ మరల్
కొని విరహఖిన్న చిత్త
మ్మున సతి "యలిగెనొకొ" యని వి§భున్ బ్రార్థించెన్. 29

తే. కనుఁగవల మూసి పలుకులఁ § గట్టి వైచి
సిగ్గు వెడలించి మై చేష్ట § చెఱచి మైక
మీర్ష్యచేఁ బోలె హ్రీగుణం § బెల్లఁ దానె
కలుగఁజేసె నచ్చో నున్న § కామినులకు. 30

తే. చెలుల సమవర్ణ గండభి§త్తులను వేఱు
పడఁడు తొలుతను బ్రతిబింబ§ వనజవైరి
పాన పాటలకాంతులు § పర్వ లోధ్ర
చూర్ణ తిలకాకృతిఁ బిదపఁ § జూడ నయ్యె. 31

తే. గర్వమునఁ బలె నొండొంటి § గాసిలంగఁ
జేయు కుచకుంభముల జంట§చేత, నతిమ
దంబుచేతను విభ్రమో§దారము లగు
భామినుల కోమలాంగముల్ § బ్రమసిపోయె. 32

తే. సతుల తనువుల సౌరును, § సౌరు నింపు
జవ్వనపుఁ గల్మి, దానిని § శంబరారి
సంపదయు, దానిఁ బ్రియసంగ§సమయ భూష
యైన మదమును, గై సేసి § యందగించె. 33

తే. మత్తలై మాటికిని రోష మహిత తోష
ములను గను చెలుల యెడల నలరువింటి
వాఁడు బాణంబుతో విల్లు వట్టినాఁడొ?
విగతతూణీరముగ దాని విడిచినాఁడొ? 34

క. పరయువతి సంగ శంకను
వరు నిజ మట్లబ్జముఖులు వంచించిరి_మ
త్సరహత సంవృతి చిత్తం
బురు తత్త్వవిచారమునకు నోర్వం గలదే? 35

తే. ప్రియులు దరి నున్న తఱిని నం ప్రీతిఁ బులకి
తము లగుచుఁ దనువు లొప్పె, వ దనము లెంతొ
విచ్చె, నెదలును సరసమై వెలసెఁ, బలుకు
లందుఁ గల కోపమును గూడ నెందొ డిందె. 36

తే. సహజ సౌందర్య రూపంపు సరణి_కార్య
మించుకయుఁ గోరనట్టి పెం పెనయు ప్రేమ_
కృతక సంభ్రమ దూర మౌ ప్రియవచనము_
వెలఁదులకుఁ గార్మణము లివి ప్రియులపట్ల. 37

ఆ. మానవంచన క్షమత్వమ్ము లావణి
కత్వ మెనయు సతి ముఖంబుచేత
గౌరవాఢ్య మయ్యెఁ గాంతుని స్వాంతంబు
లీలఁ దులిత మగుచుఁ గ్రీత మయ్యె. 38

—* సురతవర్ణనము *—

తే. తగ సుఖస్పర్శమును, విశదప్రథయును,
సురతలీలార్థ కల్పితస్ఫూర్తి, సన్న
తియు వహించిన నాథుని దెసను బాన్పు
దెసను నెడలేక చానల దృష్టి లొలసె, 39

తే. రాగతారళ్యశాలులు రమణు నెడఁ ది
రఃపతనశీలు లంచుఁ బేర్పడియు దీర్ఘ
దర్శు లగుటను జెలుల నేత్రములు చనవు
శ్రుతిగుణాంచిత శ్రవణమ్ము నతకరించి. 40

"తిరో ంతర్ధా తిర్యగర్థే" అమరము. కావున "తిర్యక్ప్రాప్తి" శబ్దమునకు "తిరఃపతనశీలి" పర్యాయపదముగా గ్రహింపఁబడినది.

క. పలుకాడఁ జూడఁ దనువున్
నలు వొప్పఁగ ముట్టఁ గోరి ♦ నాతి పతికి మా
ర్పలుకఁగ నేరదు సన్నిధి
వలనొప్పఁగఁ బిలువలేదు ♦ వణఁకున్ దాఁకన్. 41

క. పతి పయ్యెద దిగలాగిన
నతని కనుంగవకు నడ్డ♦మౌటను గని యొ
క్కతె గప్పెఁ గుచములను వి
స్తృతిగల్గిన ప్రియు నురంబు♦చేతనె తోడ్తోన్. 42

తే. పైఁట దిగలాగి పతి తన ♦ బాహుయుగము
స్వస్తికాబంధముగ నొడ్డి ♦ చారుతర కు
చాగ్రములఁ గప్పు ముగ్ధ నొ♦య్యనఁ గవుంగి
లించుకొనె శంఖవలయముల్ ♦ చిట్లిపోవ. 43

క. పంతము డిగి తత్తఱమునఁ
గాంతలఁ గవుఁగింటఁ బట్టు ♦ కాముక తతిపై
నంతకు నెత్తిన పేర
మ్మంతట మరుఁ డేసె నలుక ♦ యాఱఁగ నగుచున్. 44

క. సవతి దరి ప్రియుఁడు తమిఁ దన్
గవుఁగిట నలరింప స్వేద♦కలితాంబర మొ
క్క వనితమెయి జాఱ జఘన
మవరోధ మొనర్చెఁ దానె ♦ యతిచతురతతోన్. 45

ఆ. సవతి యెదుట నొక్క ♦ చాన కుచద్వయి
మగని హృదయ మదిరః ♦ పగులఁ బొడువఁ
బ్రిదిలె నడుమ సవతి♦హృదయ మాపతి హృద
యమునఁ దన్మయత్వ ♦ మందియుంట. 46

క. మరు లెనయ బిగువుఁగౌఁగిట
నురమునఁ బతి గాసివెట్ట ♦ నురు కఠినతచేఁ
బొరయదు వక్రత్వం బట
తరుణీ కుచకుంభములకు ♦ ధన్యత మీఱన్. 47

క. ప్రియతములు కౌఁగిలింపఁగఁ
ప్రియలకుఁ దద్హృదయములఁ బ్రవేశింపఁగఁ గో
ర్కియుఁ గలుగు మగల యెద నె
ల్లయెడలఁ దా ముంట మనములం దెలియదుగా. 48

తే. స్నేహరసపూర్ణములె కానఁ జెలుల తనువు
లంతటను మిగుల నార్ద్రిత నందు నిజము
గాక తరుణులు గట్టిగాఁ గౌఁగిలింప
నొడల వెడలునె వసనమ్ము తడియ ద్రవము. 49

తే. ప్రియతములు కౌఁగిలింపఁగఁ బ్రేయసులకుఁ
బొడము ప్రమదంబు లోపల నడఁగకుండ
బైట మిక్కిలి ప్రసరించి పర్వి తనురు
హంబులకు నైతము వికాస మబ్బఁ జేసె. 50

తే. ప్రియులతోఁ గూడి చెలఁగెడు వెలఁదుకలకుఁ
గలిగియుండఁగ నంగజపులకలు గడు
నుచ్ఛ్వసితనీవులకు నపు డొందఁ గగ్గె
బంధములనుండి విడివడు భాగ్యమహిమ. 51

చ. కవుఁగిటిలోన నున్న తటి కమ్రముఖమ్మను సిగ్గుపెంపుచే
నువిదలమిన్న వంచినను నొయ్యన ముచ్చిలిగుంట పెన్నెఱుల్
ధవుఁ డను రాగ మొప్పఁ దగ లాగుచు మీఁదికి నెత్తు మోముద
మ్మి వెలయు నోష్ఠపత్త్రము నిమీలితనేత్రము గాఁగ నానెడున్. 52

తే. చివురుఁ బోలుటఁ దన్మైత్త్రిఁ జెలఁగు నధర
బింబమును బ్రియతముఁ డాని పీడ సేయఁ
దార లోల వలయములు దనరు తరుణి
కరము ధ్వనియించె నవ్వేతకతనఁ బోలె. 53

తే. తీయఁదనము రాగంపుదీప్తియుఁ గలిగిన
విరహతాపమ్ముచేతను వేఁగె ననియొ
తరుణి వాతెఱ విడనాడి సరస మైన
కన్నుఁగవ ముద్దుగొనె నొక్క క్షణ మొకండు. 54

ఆ. ఒరులు లేక తాము యున్కి నొండొరుల పైఁ
బొలయు రక్తి దంపతుల గృహములు
కనులతోడి శౌరి గల యుగాంత పయోధి
సామ్య మొంది మిగుల సౌరు గాంచు. 55

ఆ. ఎడము సుంత లేక కడు నున్నతము లైన
గొప్ప చన్నుఁగవలఁ గప్పఁబడియుఁ
జెలుల యెదలు చిక్కెఁ గలయ నీయాయెడ
తడవు ప్రియకరాబ్జతతికి నౌర! 56

తే. మితిరహిత ఘర్మజలముల మెత్తవడిన
కాముకుల నఖరంబులు కామినీ క
ఠిన కుచతటమ్ములందు ఘటింపఁ జాలె
నెట్టెటో నెలవంక లించించుకంత. 57

తే. వేఁడి చన్గొండ నెత్తముల్ వీడి ఘర్మ
జలయుతము లైన యువకహస్తములు సతుల
వికచజలరుహ చారు నాభీసరసులఁ
బడియెఁ జల్లని లోఁతైన పదము లనుచు. 58

తే. తరఁగలను బోలు వళుల నంతటను నిమిరి
లోలమానంబు లగు నిడుప్రేళ లొప్ప
కేలుఁదమ్ములఁ బ్రియతముల్ స్త్రీల నడుము
పిడికిటను గొల్వ ననుభవవృత్తిఁ గనిరి. 59

తే. మజ్జనం బాడి బొడ్డను మడువునందు
వేగఁ బుట్టంబుఁ గొన బయల్ వెడలి పోఁక
ముడిని బట్టిన ప్రియు కరమును బడంతి
యాత్మహస్తద్వయంబున నాఁపె నట్టె. 60

క. ధవుని కరము నాభి యను మ
డువున మునిఁగి వలువఁ గొనఁ గడున్ వడి తీవిన్
దవిలి విఘటింపఁ జనఁ బో
న్నువిద కరమ్ము లొడ్డి చేరకుండఁగ నాఁపెన్. 61

తే. చీర నెడలించు ప్రియతము చేతి కింతి
కరయుగమునకుఁ బగ యయుక్తం బటంచుఁ
దలఁచి వారింప నన శింజితము నొనర్చె
కంకణంబులు మొలనూలి కింకిణులును. 62

తే. పోఁకముడిఁ బట్టి పతి విప్పఁబోవఁ గోక
తాఁకఁగా మానధన యైన తలిరుఁబోణి
కన్బొమలు రోమరాజియుఁ గనె విభేద
మొక్క తూరియ సమముగా నక్కజముగ. 63

తే. ప్రియు కరాగ్రము నీవిని వేగ దాఁటి
యూరువును జేర నరమోడ్పు నోరదృష్టి
తరుణి పలికెను యంత్రగాత్ర ప్రవీణ
వాది తాధర తంత్రీరవ క్రమాన. 64

తే. ఆయతాంగుళి ప్రియు కరం బబ్జముఖుల
యసదు నడుములఁ బెద్దవి యయ్యెఁ గాని
స్పర్శమాత్రాన కెల్లెడఁ జాలియుండెఁ
గరతలము కామినుల పెద్ద పిఱుఁదులందు. 65

తే. అరఁటికంబాలకంటెను నధికకోమ
లంబు లగు స్త్రీల పెన్దొడలన్ స్పృశింపఁ
గదలు కాముకు పాణినఖంబు లనిభృ
తంబు లయ్యును రేఖలఁ దగ నొనర్చె. 66

తే. తొడలసందుల నారయు వెడఁగు చూపు
గలుగు ప్రియుఁ గొట్టి రింతులు కర్ణకుసుమ
ముల నవియె సుమబాణాంకమును మనోభ
వునకు నర్థయుతంబుగాఁ బొనరఁ జేసె. 67

చ. ఉదిత మనోజరాగపు సముద్ధతి గల్గియు ధీరభావమున్
గొదకొని కంతుకేళి కనుకూలముగాఁ దను విచ్చి వక్రతన్
మదనసమీక ధార్ష్ట్యము ఘనంబుగఁ గల్గియు లజ్జ పేరిమిన్
సుదతులు నంటుకాంద్రయెడఁ జూపిన చాతురి చెప్ప సాధ్యమే? 68

చ. అతిమధుర స్మితాంతరిత మై యలరారెడు తర్జనంబులన్
బతికరమున్ దదీప్సిత మవారిత మౌ నటు లాఁపుసేఁత హృ
ద్యతఁ గడు మించు శుష్కరుదితంబు సుఖంబు చెలంగుచున్న నం
చితగతి మీఱఁగా నొనరిచెన్ గరభోరు వాకరై యంతటన్. 69

తే. సారె కీసున వెడ సిగ్గు చౌకలింప
"వలదు వల"దనుచును దొట్రుపాటు పలుకు
లాడు యువతుల కనను కూలాచరణవి
ధమున యువకులు చేసి రిష్టములు తుదకు. 70

తే. సంగమేతర సమయ వర్జ్యంబు లైన
రెండు గుణము లిర్వురయెడ గండు మీఱఁ
గాంతలకుఁ బ్రియుల యెడఁ బ్రాగల్భ్య గరిమ
దయితులకు స్త్రీలయెడల నిర్దయిత యపుడు. 71

తే. ఇంత దయ దలఁపక కౌఁగిలించి కొప్పు
వట్టి నఖదంతముల నానవాళ్లు నునిచి
చెలఁగు నంతకు లేజవ్వనుల యెడళ్లఁ
గూర్కుచున్నట్టి మరుఁడు మేల్కొనె జరీన. 72

తే. నిపుణహస్తుఁడు కాముకుఁ డపుడు గౌఁగి
లించి పయ్యెద నెడలింప నెంచుఁ గాని
క్రిక్కిఱియు గుబ్బలనె చూపు నెక్కొనుటను
మున్న జాఱిన పయ్యెద తెన్ను గనఁడ. 73

క. జవ్వని కుచతటహతికిన్
నొవ్వ దిది యటంచు స్వ రమణుని యురమందున్
నివ్వటిలె సరులు ద్రెళ్లఁగఁ
బువ్వులసోనలను బోలె ముత్తెపుసోనల్. 74

మత్త. జాలిపల్కులు సీత్కృతంబులు "జాలు వ"ల్దను పల్కులన్
మేలుదెల్పెడి సూక్తులున్ రతి మీఱు పావురకూఁతలున్
లీలఁ బేరులు సొమ్ము లోలిఁ జలింప మ్రోసెడు మ్రోఁతలున్
బాల కయ్యెను గామసూత్రపు భవ్య లక్ష్యము లయ్యెడన్. 75

తే. ఒంటియయి మధ్య విశ్రాంతి నొందుచు మఱి
సన్ననై చెలిమణితమ్మె శ్రావ్య మయ్యెఁ
బెక్కువై యెప్పు డాఁగక పెలుచ నంది
యలుగు నొడ్డాడ మెలతగా నులియుచున్న. 76

మ. రతులన్ దొట్రిలుపాటునన్ భువిని జాఱన్ మేలియొడ్డాణ మా
యతమై యొప్పెడి "నిట్టినీ కుపరికేళ్యానందవేళన్ మహో
త్పత నైతాదృశ లాఘనం బెటుల లక్ష్యంబయ్యెనే సారె" కన్
గతి వోఁవన్ జఘనంపుగౌరవము వక్కాణించి చూపించుచున్.

తే. చెక్కుదోయిని జిత్రక చిత్ర రచన
చెడఁగ నూత్న నఖక్షతచిత్ర మొలసె,
రభసమున ముంగురులఁ బూలు రాలిపోవఁ
జెమట చుక్కలు పువ్వులై చెన్ను మీఱెఁ. 78

తే. ఏది యేది ప్రియేష్టమై యెసఁగు నద్ది
చేసి, రేకాంతమందునఁ జెలువ లప్పు
డానుకూల్యాప్తిఁ బూరుష మానసముల
నిజవశము చేసికొందురు గద ప్రమదలు. 79

తే. మోయఁగా రాని చన్వ్రేగు పొదల మదన
రాగ మెచ్చంగ సురతపారమ్ము గాంచి
యలసి రసితాయత కచలౌ నతివ లలిక
మందుఁ జెమటల ముంగురు లత్తమిల్ల. 80

—* సురతావసానవర్ణనము *—

చ. ఎనసెడిముంద నాథు లక్షయింపఁగ నెట్టెటొ పాయలేక పా
సిన నునుసి గ్గహో! క్షణము సేపును వీడని చెల్మికత్తె రీ
తిని వనవిల్తుకేళి యవధిన్ గనెనో కనలేదొ యింతలో
నన యెదఁబాటు నైఁపని దక్షవంగను జేతెఁ దదంగనాతతిన్. 81

ఉ. సారెకు సిగ్గుపెంపునను జంకెపచూపులఁ దొట్రుపాటుమై
జాఱిన చీరలన్ మఱలఁ జయ్యనఁ గప్పెడు స్త్రీలయంగముల్
జారు రతాంత వేళలఁ బ్రసందుగఁ జొక్కుక్షణంబుమాత్ర పా
ల్పారెను నాటకాదులను నయ్యెడు దృశ్యముఁ దద్దఁ బోలుచున్.

ఉ. పయ్యెదకొంగుఁ బట్టుకొని ప్రాణవిభుం డొగి వీడకుంటచే
నయ్యలివేణి పెన్జఘన మంతటఁ గప్పక యొక్కయూరువే
యయ్యెడఁ గప్పెదువ్వలువ నారసి, చేతుల బిగ్గఁ బట్టుచున్
జయ్యన నూడ లాగికొనె, సందడి చేసెడి సిగ్గుపెంపునన్. 83

తే. చందన తమాలపత్త్రి రచనలు మాపి
పూలదండల నులిచి, సొమ్ములను జార్చి
వైచి, యుపభోగ మపరాధివలెఁ దొలఁగియు
నింతులకు భూష యయ్యెఁ దానంతఁ దానె. 84

తే. మేలిమి పసిండి మొలనూలు మిగుల రతులఁ
బెనఁగ దిగజాఱె యువతుల పిఱుఁదులందుఁ
గాని యొకచిత్ర మేఖల కరణిఁ జుట్టు
నమరె నంతఁ వినూత్ననఖాంక లక్ష్మి. 85

చ. మెఱయుట యేమి చిత్ర మది! మీనవిలోచన చెక్కుదోయిపై
వరలెడు పాండిమంబునను వావిరి శోణ రద క్షతాంకముల్?
గురుతర శోణకాంతి గుణగుంఫనమందు సమానసంపదన్
బొరసిన మోవి సమ్ముఖతఁ బొందియుఁ దాఁ బరభాగ మొందెనే!

ఉ. స్రుక్కని వేడ్క నాథులు సరోరుహనేత్రల యుబ్బుగుబ్బలన్
మిక్కిలి గాసిపెట్టుతఱి మీటగు ముత్తెపుఁబేర్లు త్రెవ్వి యం
దొక్కటి ముత్యమున్ మిగులకుండ దిగంబడ సూత్ర మొక్కటే
నెక్కొని చుల్కనయ్యును గనెన్ గురుతాభర మేమి చెప్పఁగన్.

చ. బడలిక దీఱఁగాఁ బ్రథమభావజకేళ్యవసాన మైన య
య్యెడలఁ బ్రియుల్ తమిన్ సతులకిచ్చెడు బిగ్గకవుంగిలింతలే
పడఁతుల కాత్మలందు సుమబాణవికారము రేఁచిపెట్టి దం
దడిగ ద్వితీయ మైన సురతంబునకున్ మొదలయ్యె వెండియున్!

మ. మివులన్ లేఁతచిగుళ్లతో విరులతో మెత్తందనం బొప్పు మే
లవు సెజ్జల్ విలసిల్లుచున్ననెడ మాపంతేని లేకుండఁ గ్రొం
బువువిల్కాని దురంబునన్ గెరలు పువ్వుంబోండ్ల కాశయ్యాలం
దవురా! యొక్కక్షణంబునున్ క్షణద తానై పండుకో నీ దయో!

చ. కడు నెలవంకలన్ జెలఁగి కంజదళాక్షుల మేను లింతయున్
బడవుగదా కొఱంత, నిజబంధుర సుందర కాంతి సంపదల్
వడి హృదయంబులన్ గలఁగఁబాఱఁగఁజేసి యదూద్వహాళి కిం
పడర మనోజరాగము నననంతగుణంబుగ వృద్ధి గొల్పెడున్. 90

ఉత్సాహవృత్తము :

ఇటుల మరుఁడు మదము రాగమెంతొ వెలికిఁ బుచ్చినన్
భ్రుకుటియు విడక వారొగిన్ రతులను దేలఁ జూచి, యం
తటనె వ్రాలు నెలనుగూడి న్యస్తహస్త రేయి సి
గ్గటమటింప మోము వాంచియవలి కరుగఁ బోయెఁ దాన్. 91

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
మధుపానవర్ణనము, సురతవర్ణనము, సురతావసాన
వర్ణనము ననెడి దశమాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీ ర స్తు.

# శ్రీ మ దాం ధ్ర మా ఘ మం

## [ శి శు పా ల వ ధ మ హా కా వ్య ము. ]

### ఏ కా ద శా శ్వా స ము.



—* శ్రీ కృ ష్ణు ని వై తా ళి కు లు మే లు కొ లు పు ట *—

చ. శ్రుతు లిరవొందఁగా బుషభశూన్యముఁ బీడిత పంచమ స్వరాం
చితమును గాఁగ భిన్నతను జెందిన షడ్జము నూఁది, రుక్మిణీ
పతి కొగి విన్నవించిరి కృపా పరిణామ_మకాకు దూరసం
శ్రుత మధు రోచ్చ కంఠు లగుచున్ వఱువాతను గూడి మాగధుల్.

ఉ. కూటమి వేగిరంపుఁ గులుకుల్ గఱవన్ వసివాడి నిద్ర కా
రాటము నొందు కామి నికరంబు కనుంగవ మూయ నున్న య
ప్పాటన వేగుఁబోక దెలుపన్ మినుముట్టె మృదంగ నిస్వ నా
ర్భాటము లింకఁ గాంత లెడఁబాయుదు రన్వగ నిద్ర రూపఱన్. 2

క. మినుమిను కను ధ్రువునకు మీఁ
దను దలక్రిం దగుచు స ప్త తాపసి బాల్యాం
బున హరి! నీచరణక హతి
వినువీథికి నెగయు బండివిధమునఁ దోచెన్. 3

చ. తన ప్రహరంబు కాలము నతంద్రతఁ బుచ్చిన యామికుండు ని
ద్ర నెనయఁ గోరి స్తారె కితరప్రహరిన్ బిలువంగ వాఁడు మే
ల్కనియును నస్ఫుటాక్షరము గా విగతార్థపదం బెదో వచిం
చెను గనుతెప్ప విప్పకయ చి త్తము మేల్కొనకుంట నిత్తఱిన్. 4

క. ఇంతి వెడంద పిఱుందుల
సుంతయుఁ బాన్పునఁ బరుండఁ జో టొదవమిఁ ద
త్కాంతుఁ డెటొ యుడిపె నిద్రా
శ్రాంతి రతికి మొగిసి; యేమి సలుపఁగలఁ డిఁకన్. 5

చ. క్షణశయిత ప్రబుద్ధులు, నిశా పరభాగ ధృత ప్రసాద ధీ
చణులును నై కవుల్ పగిది క్ష్మారమణుల్ చొరరాని యబ్ధి ధో
రణి గల కావ్యమందు వలె రాజ్యమునందుఁ బ్రయోగ కల్పనా
నణు మతిఁ జేయుచుండ్రి గహనం బగు నర్థము లూని ధ్యానమున్.

ఉ. మెండగు దానపంకమున మే న్మునుఁగన్ క్షితిఁ బండి, లేచు వే
దండముఁ జేరి హస్తిపకుఁ డల్లనఁ బార్శ్వము మార్చి భూమిపైఁ
బండఁగఁజేసెఁ దచ్చరమపాదములందలి యందుకంబు లొం
డొండ చలించు చించుక మృదూల్లసిత ధ్వనులన్ సృజింపఁగన్. 7

చ. అతి లఘుహస్తతన్ వలఁతులై యమరావళివోలె మంథప
ర్వత మటు కవ్వమున్ జలధిపైఖరిఁ గుండల నైచి, చంద్రమో
గతి నవనీతమున్ బడయఁగా సలిలంబులకై వడిన్ బెరుం
గు తరువఁ బూని రిత్తఱిని ఘుంఘుమ రావము మీఱ గోపకుల్, 8

చ. మఱిమఱి కాంతుఁ డెంత బతిమాలిన నేనిఁ బరాఙ్ముఖత్వమున్
దొఱఁగక దొంగనిద్రఁ గొని తొయ్యలి యున్నెడఁ గోడికూఁత వి
గ్గఱ చెవిలోఁ బడన్ నిదుర గాటపు మంపునఁబోలెఁ గన్గవన్
దెఱువకె కౌఁగిలించెను బతిన్– బరివర్తన మొంది యెట్టకేన్. 9

శా. వీణారావ విమిశ్ర వేణురుతులన్ వెంటాడు తాళ ధ్వనిన్
గాణల్ మేల్కొలుపంగఁ బాడెడు సుధాకల్పంబులౌ గీతముల్
క్షోణీశావళి వించు సెజ్జలను వీడ్కోలేక సౌఖ్యాప్తి ని
ద్రాణంబై కననయ్యె విష్ణుడును మూఁతల్ వడ్డ కన్దోయితోన్. 10

మ. చెవులున్ గుత్తుక వ్రేలఁగా ముకుళితాక్షి ద్వంద్వమై యూర్ధ్వజా
నువుగా నిల్చి క్షణంబు నిద్రగని కన్నుల్ తోడనే విచ్చి సైం
ధవ మిఁగ త్స్ఫురదోష్ఠమై వివృత ఘోణం బౌచు నగ్రక్షితిన్
బ్రవికీర్ణం బయి యున్న పచ్చికఁ దినన్ వాంఛించు నొయ్యొయ్యనన్.

ఉ. "మామక సంగతిన్ ద్యుతి సమంచితుఁడై యుదయంబు గన్న యీ
సోముఁ డిసీ! పరాశను వశుం డగుచున్ బలితాత్ముఁ డయ్యె మ
చ్చే మది నెంచ నిద్ది" యనియామవ నవ్వెడు ప్రాచి మందహా
సాము రోచి నాఁగఁ గననయ్యె నిశే తెలిఛాయ చాయగాన్. 12

క. చిరరతి నలసి ప్రియులు ని
ద్దుర గను వెనుకను బరుండి తొలి మేల్కొనియున్
దరుణులు గదలర దృఢభుజ
పరిరంభము లెనసి చక్రబంధగతలు నాన్. 18

చ. ముదురు మృణాళ ఖండములఁబోల్కిని దెల్లని వయ్యు రక్తిమన్
గదిసిన యంశుపాళిఁ దుహినద్యుతి పశ్చిమ దిజ్మృగాక్షి నె
మ్మది గయిసేయుచుండె నణుమాత్రము కుంకుమరేక సోఁక నీ
ష దరుణ మైన చందన రజః పటలంబునఁబోలె నియ్యెడన్.

ఉ. ఒక్కొక తేకుగా ముడుఁగుచుండఁ దొఱంగెడు లక్ష్మిఁ గల్వపూ
లొక్కొక తేకుగా విడుచుచుండుటఁ జేరెడు లక్ష్మిఁ దమ్మిపూ
లక్కట తగ్గు మొగ్గు లిటులందినన్నేన్ భ్రమ రోపగాన స
మ్యక్కృత గౌరవంబున సమస్థితినే కనె నుత్పలాబ్జముల్.

తే. ఉదయ దరుణునిచే మదద్యుతుల మించి
చిరముగా నున్న సిగ్గు త్యజించి నట్టి
పూర్వ దిక్కాంత నెమ్మొగంబునకు మేల్ము
సుం గనఁగ నొప్పు సితక రాంశువులు జాఱె. 16

చ. అవిరత కంతుకేళి శ్రమమందిన కాంతల దుర్బలాంగమం
దు విరతి డాఁగి యున్న సుమనోవిశిఖానలమున్ బొరిం బొరిం
రవులఁగఁ జేయఁజొచ్చె నిసి రాలిన జాతిలతా ప్రసూన పాం
సువులను గూర్చి యొాషసికసుందర మంద సమీరవారముల్. 17

మ. అనివార్యంబుగ సాగినట్టి యనురాగాయత్తులౌ వారి నూ
తన సంభోగకళా విలాసముల నాస్థన్ సర్వరాత్రంబు మూ
యని కంటన్ గనియుంట నిద్రిలుచు హీనాలోకమై దీపికా
ర్చి నిశాంతాక్షి విధాన వేకువను ఘూర్ణిల్లంగఁజొచ్చెన్ గవన్. 18

మ. మదనుండున్ ముదమున్ మదంబు నొదవింపన్ యౌవనోద్రిక్తలౌ
ముదితల్ వొందు రతిశ్రమాంబులు శ్రమంబుల్ దిటయై నెట్టుచున్
మృదభృంగాళి స్ఫుటాబ్జ గంధముల నంధం బౌనటుల్ స్నేయుచున్
గదిరెన్ మెల్లఁగ గాలి తేనెలకు సౌగంధ్యంబు నంధిల్లఁగన్. 19

తే. కలుషితాక్షి తారకలును క్షామముఖ సు
ధాంశు బింబలునై రాత్రు లట్లు వార
నారు లిరు లట్టి క్రొవ్వెదల్ జాఱుచుండ
నిదె వెడలుచుండి రెకిమీండ్ల యిండ్లనుండి. 20

ఉ. రేవనబోణి దా నభిసరించి హిమాంశు దినాంతమందు మం
దానిలగంధి యౌచు నిపుడౌరః యనింద్య త దంశు కాంగరా
గానఁ బరిమళా క్త మయి క్రాలెడి నిద్దపు టంబరాంతమున్
బూని రయంబు మీఱ నదె పోవుచునున్నది యెంత జాణయో. 21

చ. సమధిక దీప్తి యౌ శశి నిశన్ నవ కైరవషండ లక్ష్మి హా
స మధురకేళిఁ జిక్కుకొని జాగరితుం డయి, వాడిపోయి పాం
డిమమున కగ్గమౌ తనువు నెమ్మది వ్రాల్చె నిదే ప్రతీచి యం
కమున; శ్రమం బఱన్ నిదురఁగాంక్ష యొనర్చుచువాని కైవడిన్.

తే. సరయ పరిరంభ సంరంభ భరితుఁ డైన
వల్లభుఁడు రాత్రి యూడ్చిన వనిత వలువఁ
దెల్లవాఱిన మరల నీ నొల్లఁ డకట!
చక్ర విపుల నితంబ వీక్షించి యేచ్చ. 23

* క. "కుముదినులు నిశియుఁ దారలు,
సమనెనె యిప్పు డొకట" ననుచు శశి వెతతో నం
గము దాల్చెఁ గృశము రుచి విక
లము నగునద్దానిఁ బ్రియ కళత్రుం డగుటన్. 24

ఆ. అంశుమాలి కనుల కగపడకయ మున్న
యరుణుఁ డరుగుదెంచి యణఁచెఁ దమముఁ
బగఱ నొడుచు తేజసము గలట్టిప్రభు పుర
స్సరుఁడు గూడఁ బగఱఁ జదుపుఁగాదె. 25

* చ. కుముదిని కన్నుమూసె నిశి క్రుంగెను గ్రుంకెను దార లేకకా
లమునవె యంచుఁ దాఁ బ్రియకళత్రుఁడు గావుటఁ బట్టరాని శో
కమున మునింగి యేమొ యనఁగాఁ గృశమై గతతేజమైన యం
గము వహియించి కానఁబడెఁ గైరవబాంధవుఁ డిప్పు డక్కటా.

అని పాఠాంతరము.

తే. గత తిమిరపంకమై చదల్ కనఁబడఁగనె
విరహ తప్తమౌ జక్కవ విప్పె ఱెక్క
యంతలో వచ్చి వ్రాలె స్రవంతి కవలి
తటమునుండి జక్కవ పెంటి తమక మంటి, 26

ఉ. నక్తము వచ్చుడున్ యువ మనః ప్రమదార్థము * కల్పితంబులున్
యుక్త విభూషణా లగుచు నొప్పె సమంబుగ స్రగ్వధూతతుల్
నక్తము వోవుడున్ బరిమళ ప్రసరాంచిత లానెలంతలే
భుక్తము లౌటఁ గం దెనయుఁ బువ్వుల మాలల రువ్వి రవ్వలన్.

ఉ. తమ్ములదిమ్మ నూఁచుచు, లతాతతిఁ జిమ్ముచుఁ గొమ్మలన్ బ్రసూ
నమ్ములఁ దూల్చుచున్ బ్రతివనం బెటనే ననవస్థుఁడై నితాం
తమ్ము చరించు మారుతుఁ డతంద్రత నిల్చె విలాసినీ విమ
ర్దమ్మున గంధిల మ్మగు లతాంతము లొప్పు గృహాంతరమ్ములన్.

మ. పలుగంట్లన్ నెలకూనలన్ వళులత్రోవన్ నాభి సంధిస్థలం
బులఁ జోఁ కించుక తోఁచు వర్ణకము దామూకంబె యయ్యెన్ మహో
త్పలపత్రాక్షి రహఃకృతం బగు సుమాస్త్రక్రీడఁ గైకొన్న లీ
లల నన్నింటిని ✦ వర్ణకం బగుచుఁ దెల్పం జొచ్చె నిప్పట్టునన్. 29

తే. ప్రకట మలినాంకుఁడు విభాత వికల రుచియు
నగు శశిని నవ్వె నన నొప్పె నబ్జముఖుల
కాశసుమపాండు గండభాగములు మృష్ట
పత్త్రికము లయ్యె సురత శోభల నలరుట, 30

ఉ. "కామవిలోల యైన పరకామినితోడి రతంబుధాటి కు
ద్దామపు టంగరాగము నితాంత విలుప్తమ యైన నద్భుతా
రాముఁడ వైన నీదు ముఖరాగమునం దరయంగ భేద మం
చేమియుఁ గానరాదె, కలదే మఱి యద్భుత మింతకంటెనున్. 31

* గుంఫితంబులున్.

✦ వర్ణకము = 1. అంగరాగము. 2. వర్ణించునది. వ్యాఖ్యాత.

చ. స్ఫుటముగ గోచరించు నిది సుందరు లన్యలు చూడకుండ్రు గా
కిటుపయి" నంచు శంక జనియింపనటుల్ మదిరాక్షి నీతనూ
ఘటిత నఖాంక మంఘ్రితల కంజము తాఁకున సోఁకినట్టి య
చ్చటి నెఱజాజు లత్తుక రసంబునఁ గప్పె సవర్ణ మన్ మతిన్. 32

ఉ. నా కొకనీవె ప్రేయసివి నమ్ముమి యన్ భవదుక్తి సత్యమై
తాఁకెఁ బ్రియోప భుక్త పరిధానము దాలిచి, చూపఁగా మదీ
యౌకముఁ జేర వచ్చుట నహో!_సఫలం బగుఁగాదె వల్లభా
లోకన లబ్ధిఁ గామయితృలోక విభూషణలక్ష్మి యారయున్. 33

ఉ. కాచితి చేలచే నవ నఖక్షత సంగము నంగ మెట్టిటో
డాఁచితి పాణిచే రదనటంక విఖండిత మోష్ఠ బింబమున్
దాఁచు టిఁకెట్లు? అన్యవనితా గమ సూచకమై దిగంతముల్
లాఁచిన నూత్నమౌ పరిమళంబుల గంధము? నీవ చెప్పుమా. 34

తే. అనుచుఁ దెగడుచుఁ గన్నీరు నినిచె దయిత
యంత దయితుండు బెగడి తదంఘ్రులఁ బడె,
గరుణ మయ్యు నింతుల యశ్రుకణముఁ బ్రణయ
కలహమున మాన భేత్రాశుగమ్ము గాదె. 35

---

సీ. అంగరాగము వోఁ బరాంగనఁ గరఁచి నన్
ముఖరాగమున బెలువుచ్చ వత్తె
గోరొత్తు లలదాని పారాణిఁ గప్పికోఁ
దలఁచి తచ్చరణాహతుల సహింతె
యన్య కామిని కట్టినట్టి పుట్టము దాల్చి
వచ్చితి నీసొంపు మెచ్చుకొంటి
చేలాన మేను కెంగే లూని మోవి గ
ప్పితి నిదే నఖ రదక్షతులు వోమె

తే. ననుచుఁ దెగడుచుఁ గన్నీరునినిచె దయిత
యంత దయితుండు బెగడి తదంఘ్రులఁ బడెఁ
గరుణ మయ్యు నింతుల యశ్రుకణముఁ బ్రణయ
కలహమున మాన భేత్రాశుగమ్ము గాదె.

మ. మదమున్ గామము హెచ్చి ధార్ష్ట్య మొదవింపన్ రెచ్చు లీలావతీ
మదనాజిన్ దెగి రాలు భూషణములన్ బ్రాప్తార్చనా పూర్తులౌ
సదనాళిన్ "విఫలంబు లౌ" నని వయస్యల్ మానినా రీయఁగా
ముదమారన్ బ్రతికల్య మిచ్చు వికసత్పుష్పోప హారంబులన్.

ఉ. ఒక్క విలాసి మేనఁ దళుకొత్తెడు నైశము లైన గోటి ప
ల్నొక్కులు దద్విలాసిని గనుంగొని యన్య వధూ కృతంబు లం
చక్కిలి నొంద వాఁడు "గతయామిని మత్తిలి గూర్తు వీవ కా
దొక్కొ తలంచుకొ మ్మనుడు నూరడిలెన్ జెలి వ్రీడమానయై. 37

చ. గురుతర హారముల్ దునియఁ గోమలి బిగ్గఁ గవుంగిలించి, క్ర
చ్ఛుఱ శిథిలీకృతాంగుఁ డయి చల్లఁగ నాథుఁడు పోవ వేఁడ న
త్తరుణి కుచద్వయంబు గళితంబగు ముత్తెము లశ్రుబిందు ల
ట్లురలఁగఁ గుందుచుండినటు లొప్పెసఁగెన్ క్షణమాత్ర మయ్యెడన్.

ఉ. మత్తిలి వాని కట్టెదుట మాటల నాడితి నంట! యెవ్వియో
యొత్తిలి ప్రోడకై వడిఁ జటూక్తులఁ బల్కితినంట! యన్నిశా
వృత్తము నెచ్చెలుల్ దెలుప నిప్పు డెఱింగితి నంచు ముగ్ధ యా
బిత్తఱి మత్తు వోఁ బగటివేళ స్మరించుచుఁ గ్రుంకె సిగ్గునన్. 39

తే. పాటలాబ్జముల్ మృదు హస్తపాదతలము
లళులు కాటుక, నీలోత్పలాళి కనులు,
వులుఁగులరుతుల్ నుడుల్ గాఁగఁ బూర్వసంధ్య
రాత్రి వెనుకొనెఁ బూపయౌ పుత్రివోలె. 40

(తమిని వెనుకొనెఁ బొత్తులతనయ పగిది. —పాఠాంతరము)

మ. కృత ఘోరాఘ ఘటా వినాశముగ శాస్త్రీయ స్వరోచ్చారణా
చ్యుత నధ్వర్యులు సామిధేనులను బెల్చన్ బల్కి సాన్నాయ్యమున్
హుతమున్ జేయఁగ నాస్వదించెడిఁ బ్రియుం బొప్పార నగ్న్యాహిత
ప్రతిగేహంబున నక్షతార్చి యగుచున్ వైశ్వానరుం డిత్తఱిన్. 41

ఉ. సారెకు నోష్ఠ్యవర్ణముల సందడిఁ దోఁపక, లాఁతి వ్రాల యు
చ్చారణమందుఁ దోఁచు రదసంహతితోడి ప్రగే జప క్రియో
దార తపస్విలోక చలదాస్యము లొప్పెను దేపతేప ము
క్తారుచి దోఁప ఘట్టిత మఘట్టితమౌ పటుశుక్తులుం బలెన్. 42

క. ప్రాచిదెసఁ దోఁచె దినకరు
రోచిఃపటలంబు బంగరువు పసిమి మిసన్
గ్రాఁచి జలము, లబ్ధిపయిన్
జ్యాచక్ర దిధక్ష నేఁచు నౌర్వాగ్నిక్రియన్. 43

తే. చలిత ఖగరుత కలకలములు చెలంగఁ
జాఁపఁబడినట్టి నిడుత్రాళ్లసాటి ఘృణుల
కృష్టి నెత్తిరి పెను బానరీతి సూర్య
జలధి జలములనుండి దిగ్జ్వలినముఖులు. 44

తే. నిజముగా నీరవి రాత్రి నీరరాశిఁ
గూలి బడబాగ్ని కీలలఁ గాలినాఁడు
గాన నుదయించుచునె పూనఁగలిగె మండు
చంద్రకళ యింగలంపుఁ గెంజాయ మేన. 45

చ. క్షణ ముపరి స్థితుండయిన ఘర్మ మయూఖునిచేతఁ బ్రాగ్ధరా
గ్రణి యిది యొక్కఁ డేల? క్షితిఁగల్గిన సర్వ శిలోచ్చయంబులున్
క్షణ ముపరి స్థితాభినవ సౌర మరీచుల బంధుజీవకా
రుణ సుమగుచ్ఛ శేఖరము రూఢిగఁ దాల్చినటుల్ వెలుంగవో. 46

శా. బాలార్కుం డుదయాద్రి శృంగముల త్రోవన్ జిక్కి దోఁగాడుచుళ్
నాళీ కానన హాస మొప్ప నళినుల్ నర్తింపఁగాఁ జూచుచున్
డ్యోలీలావతి పక్షిరావములఁ దన్నుం బాడ నంకంబునన్
వ్రాలెన్ గోమల పాట లాగ్రకరముల్ నల్వంకలన్ జూచుచున్.

తే. క్షణము కూర్చుండి పాదము క్షమను మోపి
ప్రణతు లగు లోకులను బ్రీతిపరతఁ జూచి
సకల భువన నిరీక్ష ణేచ్ఛను గిరితట
పీఠినుండి సప్తాశ్వుఁ డుద్వేత్తు లేచె. 48

---

ఉ. మట్టుగ మౌక్తికచ్ఛవులు మాటికి మాటికిఁ దోఁప ఘట్టితో
ద్ఘట్టిత మైన శుక్తుల విధంబున నోష్ఠము లుచ్చరింపఁ గ
న్పట్టక, యన్యవర్ణ వచనంబునఁ దోఁచు రదాళితోడఁ జూ
పట్టు ప్రగే జపోత్సుక తపస్వుల యాననముల్ విరాజిలెన్.

42 పాఠాంతరము.

శా. ఆదిత్యుండు కరాశుగంబుల సమస్తాశాంత రుద్యత్తమో
వేదండంబులఁ జీల్చి వెల్వడు తదుద్వేలాసృగౌఘంబు నా
నాదేయాంబుఝరంబు తీరయుగళాంతర్లీన-మాపక్వ హా
లా దీప్రంబయి యొప్పెఁ గ్రమ్మఁగ దెసల్ బాలాత పారుణ్యముల్.

ఉ. తోరణగండ్లనుండి యిలు సొచ్చిన బాల దివాకర ప్రభల్
“వారక వేగె నం చళికి వల్లభు లేఁగఁగఁ గోరఁ గుందు నా
య్యారుల పాలికిన్ బ్రకుపితాంగజ చాప విముక్త తప్త దు
ర్వారత రాయసాంబక పరంపర లాయె సుదుస్సహంబులై. 50

తే. రాత్రిఁ బువుఁబోంట్లు మధువెల్లఁ ద్రావ రిత్త
యగు పసిఁడిగిన్నె గోరోచనారుణ మగు
నుదయ దర్కుని రుచుల నిర్యాదన సైత
మాసవాపూర్ణమై యున్నయట్లు మెఱయు. 51

తే. ప్రియుఁడు నిసి నేకతమ్మున శయనమందు
వీడిన సితాంశుకమ్ము రవిప్రభలఁ గు
సుంభరుచి యైనఁ దన దంచు సుదతి పయఁట
గా ధరింపఁగఁ గని చెలికత్తె నవ్వె. 52

సీ. కనదుదయాద్రి శృంగ ప్రాంగణమ్ములం
దనురాగ మెసఁగ దోగాడ నేర్చి
జలరుహ వదన హాసము లిగురొత్తఁ బ
ద్మినులు వేగనులఁ గన్గొనఁగఁ బేర్చి
తమిమై శకుంత కాంతలు మధు రాలాప
ములను లాలింపఁ బెంపునఁ దనర్చి
మృదు పాటల కరమ్ము లెత్తి ద్యోలలితాంగి
యంకాన ప్రాలి బాల్యమును దీర్చి
తే. క్షణము కూర్చుండి పాదము క్ష్మను మోపి
ప్రణతు లగు లోకులను బ్రీతిపరతఁ జూచి
సకల భువన నిరీక్షణేచ్ఛను గిరితట
పీఠినుండి సప్తాశ్వుఁ డువ్వెత్తు లేఁచె.

47, 48 లకుఁగలిపి పాఠాంతరము.

ఆ. రాజతాద్రి పొంతుఁ గరము మందిరము చంద్ర
కాంతి సోఁకి స్ఫాటికముగ రేయి
మెఱసె; నదియ బాలమిహిరాంశువులఁ గుంకు
మాంబు సిక్త మట్ల యలరె నిపుడు. 53

ఉ. కాంతల గోళ్ల పచ్చి నునుగంట్లఁ దగుల్కొనినట్టి కేశమున్
గాంతుఁడు మెల్లనన్ దిగువఁగా జనియించిన పీడ సీత్కృతో
త్క్రాంత తదీయ దంతములఁ దాఁ బ్రతిబింబితమైన బాల భా
స్వంతుని కాంతి శోణమణిపంక్త్యనుకారము గూర్చె వానికిన్.

చ. సతత నిజాభికాంగ దృఢసంగ సమాత్తము నూత్న రక్త స
మ్మితమును నైన కుంకుమను మేదుటఁ గాంచన శాణ రేఖ య
ట్లతికమనీయ మైన జలజాక్షుల దేహలతల్ త్యజింపఁబో
వతి మృదు వయ్యు నాతపమునం దయినన్ దమఛాయ లేశమున్.

తే. జలజవనకాంత మాలోకశక్తి హేతు
వైన కరలోచన సహస్ర మంది జగము
లతిమహిమ నాఁకగొన్న వృత్రాఖ్య వైరి
నమరపతి మాడ్కిఁ దరణి రూపఱఁగఁ దునిమె. 56

చ. ఉడుతతి చర్చనీయ మయియున్నను జీఁకటులన్ హరింప వె
ల్వడు రవిచే బలాత్కృతి నపాస్తములౌ టొకవింతయే? రిపున్
గెడపఁగఁ బూను శౌర్యనిధికిన్ ద్విష దాశ్రయణమ్మునన్ సిరుల్
వడసినవారు వధ్యజనపక్షము వారలె యౌదురే కదాఁ

చ. ఎదురుగఁ దోఁచినట్టి శశభృత్కిరణామల సాంద్ర కాంతిసం
పద నెసలారు కొండచఱిపైఁ బ్రతిబింబిత మౌ కరావళిన్
సదమద మాచరించె రవి శైల బహిఃక్షితి నిల్వ భీత మౌ
చు దరులఁ దూఱి ప్రోవులగుచున్ మను ధ్వాంతచయంబు నైతమున్

క. వెలుపలనె వెలుఁగు రవి దీ
ప్తులు భవనాంతర్గత తమస్తతుల మాపుట చి
ట్టిలె? తేజస్వు లెపుడు నిలు
వెలలకె తేజున విపక్షపీఁచ మడఁపరో. 59

చ. పునరుదయంబు గోరుచు నభోమణి స్వీయము ధామ మొంది గ్ర
క్కున రసలుబ్ధబుద్ధిఁ జిరకాలముగాఁ జెఱపడ్డ తేఁటులన్
వనరుహపత్త్రి సంహతి కవాటము విస్ఫుటితమ్ము నర్చి బం
ధన పరిముక్తులన్ జలిపినాఁడో యనంగ వెలింగె నింగిపై. 60

ఉ. వేయి దళంబు లొక్కపతి వేయి కరంబుల వేడ్క విప్పి, ప
ద్మాయతనంబునం దళిచయంబుల పాటలతోడి లాలనన్
హాయి శయానమైన సిరి నాదర మొప్పఁగఁ జూచుచున్నవాఁ
డోయనఁగా సహస్రకరుఁ డొప్పెసఁగంగ వెలింగె నింగిపై. 61

తే. వేకువను రాగియై వేఁడి వెలుఁగు చంద్రుఁ
గరములం బట్టి పీడింపఁ గాఁ జలధ
రాంబు సితమైన కాంతి నిర్యాసమును సి
తాబ్జకుడ్మల నించుచున్నట్లు మించె. 62

తే. సృష్టి నెల్లఁ బ్రకాశింపఁ జేయు దినవి
భుఁడు ద్వితీయాక్షివలెఁ జిరంబునకు విప్పు
నంద; గళితాంశు వైన సితాంశుచేత
వ్యంజితైకాక్షివలె ద్యోలతాంగి యొప్పె. 63

ఉ. కైరవషండ లక్ష్మి చనెఁ, గంజవనీ రమ హెచ్చె, ఘూకసం
చారము చింతచేఁ దఱిఁగె, జక్కవ లుబ్బి చరింపఁ జొచ్చె; నం
భోరుహబాంధవుం డుదయమున్ గనెఁ గల్వలరాయఁ డింకఁగాఁ
బాఱెను; దైవచేష్టిత విపాకము చిత్రముగాఁ గనంబడున్. 64

మ. హరి దబ్జాక్షుల పాణి వట్టిన ధవుం డా యన్నరేవన్ క్షణం
బిరవుం బాసి ప్రవాసియై మరల నిడ్డేతెంచి ప్రాగ్గీతి భా
స్కరుఁ డగ్రంబునఁ దోఁపఁ; జందురుఁడు వేగన్ స్రంసమానాంశుక
స్ఫురణన్ జాఱెడిఁ బశ్చిమాంతమునఁ బెంపున్ వీడి జారుండు నాన్.

శా. తారాలోకము లన్నియున్ విలయ మొందన్ జేసి లోకోత్తర
శ్రీ రమ్యుండయి సానురాగ యగు లక్ష్మిన్ దాల్చి చాకాశ పా
థోరాశిన్ బవళించె నంబురుహనేత్రుం డట్లు లేకాకి యా
కారం బబ్బఁగ వారిజాప్తుఁడు నిశాకల్పావసానంబునన్. 66

సీ. సతత చరాచ రాంశచ జ్జగ జ్జాలమ్ము
        లకు సంతత ప్రబోధకుఁడ యయ్యుఁ
    గలువ పూలకు జక్కవలకు సాజమ్ముగాఁ
        గల సిరుల్ దొంగయై గిలుబుకొనును
    మాచి కాభేద్యమై దోఁచు తమస్సును
        దలయెత్తనటు చెండవలఁతి యయ్యు
    వేగునేమో యంచు వెతఁ జెందు కామినీ
        కాములకును వియోగము ఘటించు

తే. గుణము లిటు హెచ్చుగను దోష మణుతరముగ
    గ్గలు చతురుఁ డహర్పతి కమలనాథ!
    శిష్టులం గాచి దుష్టుల శిక్ష సేయు
    నీకు సుప్రాత మొనరించుఁగాక నేఁడు. 67

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన
శ్రీమదాంధ్రిమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
శ్రీకృష్ణుని వైతాళికులు మేలుకొలుపుటయు, ప్రభాత
వర్ణనము ననెడు ఏకాదశాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీ ర స్తు.

# శ్రీ మ దాం ధ్ర మా ఘ ము

## [ శి శు పా ల వ ధ మ హా కా వ్య ము. ]

## ద్వా ద శా శ్వా స ము.



### —* శ్రీ కృ ష్ణ ని ష్ప్ర స్థా న వ ర్ణ న ము *—

చ. ఇటులఁ బ్రభాత మైనఁ దురగేభ రథావళి నెక్కి వచ్చి యా
పటనిలయాంగణంబులను బారులు దీఱిచి రాజనందనుల్
పటుతర జైత్రయాత్రకు శుభంబగు వేసము శౌరి దాల్చి కొం
చట క్షణ మాలసింపఁగఁ దదాగమనార్థము వేచి రయ్యెడన్. 1

తే. స్వక్షము సుపక్షమును స్వర్ణవర్ణము జవ
హసిత నాగమౌ తార్క్ష్యవాహనము నెక్కి
యాకసంబునఁ బలె నడ్డమూఁక లేక
సుఖసరణి భూమిమీఁద నచ్యుతుఁడు వెడలె. 2

చ. కరమున జాను మీఱెడి యఖండిత చక్ర మురఃస్థలంబునన్
వరలెడి లక్ష్మియున్ నరక భంజన శీలము సద్విజేంద్ర కాం
త రుచియు సత్యరక్తియును దాలిచి సర్వగుణంబులందు శ్రీ
వరుఁడు చరించు త్రోవనె నృపాలురు నేఁగిరి వెంట నంటుచున్.

ఉ. తారయుతంబు లౌచు విశదప్రభలై ముకుళీకృతంబులై
కైరవిణీ లతాంతములఁ గ్రాలు మడుంగులటుల్ గుడారు లే
పారు కుముద్వతీతతులకట్లు వధూటులకున్ ప్రభాతమున్
శౌరి చమూ ప్రయాణమును సంధిలఁజేసె వియోగ ఖేదమున్. 4

తే. నింగి కుఱికెడు గుబ్బలిభంగి దోఁపఁ
నెలమిఁ బూర్వకాయము మీఁదికెత్తి గజము
వంచినపదంబునన్ నిజపదయుగంబు
నుంచు మావటివాని నెక్కించుకొనియె. 5

ఉ. ఉల్లము పల్లవించునటు లొయ్యనఁ దట్టుచు బుజ్జగింప మే
నెల్లను దేజు రాజిలఁగ నింపగు వాజుల నెక్కి రాశ్వికుల్
పల్లము నొక్కహస్తమునఁ బట్టి మఱొక్కకరంబునందు మేల్
కళ్లెము పట్టి యెక్కునెడఁ గల్గెడు లాఘవ మెల్లఁ జూపుచున్. 6

ఆ. దవ్వుత్రోవ వోవఁ దగు పల్లముల్ సాదు
లూఁది కట్టకుండ నొయ్య లేచి
పట్టరాని పర్వు పరఁగంగ లొట్టియల్
పాఱఁదొడఁగె నపు డవారితముగ. 7

చ. స్ఫురితసుగంధముల్ రుచులఁ బొంపిరి వోవని నాభిచక్రముల్
హరువు నవోదరాభల శుభావిధురత్వము గాంచి యొక్కనా
త్సరమణిఁ బోలి భాసిలు రథమ్ము సుసారథి గల్గినట్టి యొ
క్కరథికుఁ డర్థిఁ బూన్చెను సుఖంబున నౌ గమనంబు కోరుచున్.

ఉ. క్రన్నన లేచి యేఁగ సమకట్టిన యొంటెను ముందు బల్మిమైఁ
బన్నుగఁ బట్టి మూఁపుపయి భారవహంబగు యంత్ర ముంప మున్
దిన్న తృణంబు సాము వెలిఁ ద్రేన్చుటచే విషమస్వరంబునన్
బన్నుగ నార్చె నంత రవణం బను పేరు యథార్థ మౌనటుల్. 9

ఉ. క్రొవ్విన యెక్క గిబ్బ ముకుగుట్టిన త్రాళ్లను బట్టి యుంచినన్
నొవ్వక రోస మెచ్చి మదినూల్కొన బుస్సమటంచు గొమ్ములన్
రివ్వన నూఁపి వెన్నెముక క్రిందికియెడన్ బలుమాఱు ద్రిప్పఁ దా
నెవ్విధి గోనె పై నిడఁగ నెత్తెడివాని కశక్య మౌనటుల్. 10

శా. నానాభంగుల మించు సామజ లసన్నాదంబు లొప్పన్ సహ
స్రానూనాధ్వములం జెలంగుచు నధీతాగమ్య దూరస్థమౌ
స్థానం బంచును గీర్తి మోసి నవ గాంధర్వ ప్రపూర్ణంబునై
సేనాంభోనిధి సామవేద సమతన్ జెన్నొందె మి న్నందుచున్. 11

తే. బారకోఱల శిర మెత్తి పరగజమ్ము
పై కుఱుకఁబాఱు మదకలేభమును మావ
టీఁడు కుంఠితమగు సృణి వీడి క్రొత్త
యంకుశమ్మని తుద కెల్లొ యూఁపఁ గలిగె. 12

తే. చక్రధరుఁడు ప్రయాణంబు సలుపువేళ
సాంద్ర ముచ్ఛృంఖలము నౌచు శంఖరవము
పటహరవమును క్షోణిభృద్ద్వయమునఁ గల
మేటి సత్త్వమ్ములకుఁ గూర్చె మిగుల వగల. 13

ఉ. రైవతకాద్రికిన్ దిగువ రంజిలు బంగరునేల నశ్వముల్
పోవునెడన్ ఖుర క్షతులఁ బుట్టు రజశ్ఛట లుద్య దంశుమ
ద్భావితతిన్ హసించుచు నభంబును గ్రమ్మి దిగంగనాళికిన్
ఠీవి దలిర్ప నత్తఱి ఘటించెను గుంకుమపాంసు చర్చలన్. 14

శా. తేరుల్ వాఱ జనించు మంద్రరవమున్ దృప్తేభరాడ్బృంహితో
దారారావము లొక్కతీరగుట భేదంబేమి లే దింక నా
దారిం గాక విలక్షణంబు సముదాత్తం బౌటఁ దారధ్వని
శ్రీ రమ్యైక హయాళి హేషలు దగన్ జెన్నొందె విస్పష్టమై. 15

చ. దరి నరుదెంచు నేన్గునెలఁతన్ గని మత్తిలి యేన్గొకండు క్ర
చ్చఱఁ దన మావటీని గొన కాఁగక యేఁగఁ దలంప వాఁడు త
చ్ఛిరమున గ్రువ్వ నంకుశముఖశీర్షము ప్రక్కకుఁ ద్రిప్పెఁ గాని తాఁ
గరమును ముందు సాచి కదఁకన్ విడనాడద మధ్యమాగతిన్. 16

మ. కడు వేగానఁ బదంబు లుర్విపయిఁ దాఁకన్ మానిన ట్లొప్పి ప
ర్విడుచున్ జామర తెల్లపైపులకునున్ విప్పారి చెన్నార "ని
ప్పుడునున్ మొక్కలువోని తెక్కలను డంబుల్ మీఱె సేనాశ్వముల్
బెడఁగై" యంచును విస్మయాత్త మతి భావింత్రప్పుడున్ జూపఱుల్.

ఉ. పుట్టుక సూటియౌ మెడలముందున కొయ్యనఁ జాఁచి కుచ్చు లి
ట్టట్టును నాడ ఘర్ఘర రవాధికతన్ దగఁ బొల్చునట్టి యా
ఘోట్టియ లట్టె యొక్క త్రుటిలోపల నెంతటి దూరమేనియున్
బిట్టు రయంబుతోడఁ జనెమెట్టిన ధాత్రిని వ్రయ్యఁ జేయుచున్. 18

చ. ఎలుఁగును నెత్తి యంత యదలించుచు చెచ్చెరఁ బర్వ హెచ్చరిం
తల్లు సలుపంగ వేసరయుతం బగు తేరు స్వచక్రధారలన్
బలిత్తముగాఁగ లేచెడి దుమారము లేమెడ వచ్చి కప్పునో
మ్మలసిన నంచు భీతిలిన మాడ్కిని ద్రోవను బర్వు గైకొనెన్. 19

తే. సైన్యచరులాస్యములు ద్రిప్పి చనుచునే ని
జాస్యములఁ గాంచ క్షణమాత్ర నదరు నుదుటు
గబ్బిగుబ్బలతోఁ గంచుకములు గదల
రాణివాసంబు చనియె గుఱ్ఱముల నెక్కి. 20

చ. అరదపుఁజక్రఘాతముల నయ్యెడఁ ద్రోవలు వ్రయ్యలయ్యె మున్
గరు లటమీఁద వేగిరముగాఁ జనుతావుల నెల్లెడన్ బటో
త్కరములఁ ద్రొక్కి మిఱ్ఱులు దిగంబడఁ గూలిచి పల్లమౌనెడల్
సరగున నింపుచుండ వరుసన్ సరిసేయు పొలాలనం దగెన్. 21

ఉ. పట్టఁగ రాక గంతిడి గుభాలునఁ గూలఁగ రౌతుఁ జిమ్మఁగాఁ
జట్టన వీఁపునుండి దిగజాఱి యురంబున వ్రేలుపల్లమున్
బట్టి నిలంగలేక యిలపైఁ బడఁగాఁ బెడత్రోవఁ దేజి దా
బిట్టు రయంబునన్ బరువువెట్ట నహో యని నవ్వి రెల్లరున్. 22

ఉ. ఉన్నత భూమిభృత్తతికి నొక్కెడ నాఁపఁగరాక పెద్దవై
చెన్ను వహించి మించు నలసింధు చయంబుల నెల్లఁ గప్పుచున్
మిన్నున సర్వలోకమున మేదిని ముత్తెరు వేఁగు గంగకున్
మిన్నలుగాఁగ లెక్కలకు మిక్కిలి త్రోవల నేఁగె సైన్యముల్. 23

శా. సామీప్యంబునఁ జేరి మత్తకరి బుస్సల్ గొట్టు నప్పట్టునన్
భీమత్రాసము నొంది పగ్గములఁ జే వీడెన్ గటా సాది యా
బామున్ గాంచి తురంగముల్ వెఱచి పైపైఁబాఱి శుద్ధాంతపున్
భామల్ క్రిందఁబడంగఁ జుల్క నగు తేర్ భంజించె మార్త్రోవలన్.

ఉ. జాఱిన నంగసంధులును జన్న నిజాక్ష దృఢత్వ సంపదల్
మీఱిన దుస్స్థితుల్ గనుట మిక్కిలిదుర్బలమౌ రథంబు ధీ
స్ఫారుఁడు మిత్రసత్తముఁడు వర్ధకి వైద్యునియట్ల నయ్యెడన్
వారక లంఘనక్రమమునన్ దగఁ దేఱిచెఁ దత్క్షణంబునన్. 25

చ. శకటము బండకున్ దగిలి చక్రము ముక్కలు గాఁగ లోని మ
ద్యకలశ మట్టె భగ్నమన నందలి మద్యము కాల్వగట్టి యాఁ
గక పథ మెల్ల రొంపి యయి కానఁగ రా విలపించెఁ గల్లువ
ర్తకుఁడు క్షణంబునేపు మును దానన లాభము పొంది యుండుటన్.

శా. భేరీధ్వాన విదారి తాఖిల గుహాగహ్వరం దాస్యమున్ గేతుసం
ఘా రాంచ చ్చల దంబరోచ్చలిత రంగద్భావ త్రి సందోహమున్
సారోత్తుంగ మతంగ జాంగక జితోగ్రచ్ఛైః ప్రస్తరం బౌటన
య్యారే! యగ్గిరిమౌళి వెన్కఁబడె గృధ్రస్థానికిసీరాజికిన్. 27

చ. వనగజరాజ గండమదవాసిత వాయువు డాయ నెంతయున్
గనలి నిమేష మాయెడనుగల్గుకుజంబుల లీలఁ జెండి లో
నెనసిన కిన్క వీడ్కొని మదించిన చెన్నఁటియేన్గు లెట్లొ ద
వ్వున నడపంగ మావటులుఁ బోయెను తప్పక తప్పుత్రోవలన్.

ఉ. పెక్కము లన్న కోనలు, గడించి గజంబు లటన్న గుబ్బలుల్
మిక్కిలి నేయెడన్ గణనమీఱుజనంబు లటన్న యేరులున్
జక్కఁగఁ బిక్కటిల్ల మురసంహర పాలిత సైన్యసంతతుల్
పెక్కు ధరాతలంబులను భేదము గానఁగరాక గప్పెడున్. 29

చ. హరిణుల చూడ్కులేమొ? యనునాసను లేమల కన్నుదోయిఁ దా
మరసి నిమేష మాయెడల నాఁగెను లేళుల సాము లంత నా
తరుణుల కన్నులందు లలితంబులు కానఁగనైన నోయ్యనన్
బఱవఁగ జొచ్చెఁ దత్తఱముపైకొన నెత్తిన భీతి పెంపునన్. 30

ఉ. మిట్టులనుండి పల్లములుమెట్టెడుపట్టుల రౌతు లెట్టులో
యట్టులఁ గల్గు పగ్గములనట్టె బిగించిన మెల్లమెల్లఁగా
గుఱ్ఱము లేఁగుఁ బగ్గములఁ గొంచెముజబ్బగఁ బట్ట దౌలకున్
దుట్టునఁబాఱు డెక్కలనుదోఁచెడి చప్పుడు లుప్పతిల్లఁగన్. 31

ఉ. ప్రాయపు టొంటె ముందు పఱవంగ నొకండు పిఱిందివారు తన్
డాయఁగ మాటిమాటికి దిటంబుగ దారినె యాఁపి వీఁపునం
బాయక కూరుచుండఁ బిమ్మమందము నయ్యది మేయఁ జొచ్చె నౌ
రా! యెపుడేన్ ఫలించునుగదా బలితం బగు దాక్ష్య మున్నచోన్. 32

ఉ. వెన్నునిదౌ ప్రతాపమున వీఁగిన వైరినృపాలు రింత నం
త నన్నతు లౌచుఁ గొల్వ సవిధస్థలి గ్రమ్మకొనంగ వారిదౌ
నున్నమిత తాతపత్త్రచయ మొక్క సితాతపవారణంబు న
ట్లున్నలినాక్షు సైన్యమునకయ్యెడ నయ్యె నతర్కితంబుగాన్. 33

చ. వెనుకటినుండి వచ్చు కరిబృందముఘంటలు "ఘల్లుఘల్ల" నన్
వినిన ప్రియాంగనామణులు భీతిలఁ గన్గొనినట్టి సైనికుల్
ఘనతర భారవాహణములన్ వెస దూరమునుండి ప్రక్కకున్
జనునటు త్రిప్పి వారలునుజయ్యనఁ ద్రోవను వీడి రంతటన్. 34

ఉ. ఓజ సుదారవర్ణరచితోజ్జ్వల వృత్తము మేల్ప్రసాదమున్
యోజిత గోత్రసంవి దితనూదిత సంపద యొప్పు శ్రీశ వి
భ్రాజిత సద్గుణైక నికరంబునకున్ దులయైన పద్దెముల్
రాజిల రాజుముందు మధురమ్ముగఁ బాడిరి వంది సత్తముల్. 35

తే. సంద్రము చలించి యఖిలభూచక్ర మంబు
ఝరులలో ముంచి మర్యాద తొఱఁగుఁ గాని
పట్టఁగా రాని జోదులఁ బల్లెలందు
విడిచి వీడఁడు మర్యాద వెన్నుఁ డింత. 36

చ. కుసుమశరార్తిఁ బొట్లపువ్వుగుత్తుల తెల్పున మీఱు మోములన్
బసలు చెలంగ విప్పుగొను బాణసుమంబులఁ గేలుకన్ను లు
ల్లసిలఁగఁ బల్లెటూళ్ల వృతులన్ లతకూనలు ప్రాఁకి మీఁదనుం
డి సరసిజాక్షుఁ గన్గొనిరి శీవి జనుల్ తముఁ జూడకుండఁగన్. 37

ఉ. మందబయళ్ల రచ్చలుగ మ్రాఁకులనీడలఁ గూరుచుండి క
ల్లుం దనుపారఁ గ్రోలుచు నెలుంగుల నొత్తిలి పల్కు చట్టిటుల్
చిందులు ద్రొక్కుచుండియును శ్రీహరి యంచు స్వనామకీర్తనల్
గ్రందుగఁ బాడు గ్రామ్యజనకాండము గాంచె ముకుందుఁ డర్మిలిన్.

మ. నెఱిగోలల్ గద గోపికాజనము తన్నేత్రంబులన్ బ్రౌఢతా
సరణుల్ శూన్యము లోకసంవిదిత విస్తారంబులే యయ్యెఁ ద
న్నరలోకేశుని గృష్ణుఁ గాంచి సఫలత్వప్రాప్తిఁ జెన్నొంది యు
బ్బురపాటుం గనుఁ గాని తృప్తి గన వా పూఁబోండ్ల వాలుంగనుల్.

ఉ. కాలికిఁగట్టు లేఁగల నెగాదిగ మేనుల నాకు నావులన్
బాల వసంటి నూరుయుగ మధ్యమునం దిడి జుంజుమధ్వనుల్
గ్రాలఁగ క్షీరధారలఁ గరంబు గరంబుల దోహనక్రియా
పాలన మొప్పఁగాఁ బిదుకువారిని శౌరి చిరంబు గన్గొనెన్. 40

ఉ. బందపు(ద్రాడు చేతఁ గొని * వచ్చెడు గోపకుఁ జూచి లేఁతలేఁ
గం దమిమీఱఁ జేరఁ ద్వర * గా నెదురేఁగఁ గలంగు చింపుసొం
పొందఁగ "హుమ్ముమహా" మ్మనుచు * నొయ్యన గోవులమిన్న యొందు దా
మందను బాసి యేఁగ మధు * మర్దనుఁ డారసె సంతసించుచున్. 41

చ. చిలుకలఁ (దోల నయ్యెడకుఁ * జేరఁగ నియ్యెడ లేళ్లు వచ్చి వి
చ్చలవిడిఁ బంటచేలఁ దిన * సాఁగె ని దెట్లని చాల బేలలౌ
పొలములఁ గాచుగుబ్బెతల * ముగ్ధవధూజన చిత్తచోరుఁడౌ
వలపులతేని యయ్యె కను * పండువుగాఁ దిలకించె నవ్వుచున్. 42

ఉ. పైరులు గాచు పేడియల * పాటలు వీనులవిందు సేయ నా
సౌరునఁ జొక్కుచున్ గలమ * సస్యము ముట్టవ యింత లేశ లా
దారినె మమ్ముఁగూడఁ బెడ * దారిని బట్టఁగ సేయు టబ్రమే
వీరలపాట? లంచు యదు * వీరుఁడు సేసె వితర్క మాత్మలోన్. 43

చ. జలములు గల్గుతావులను * జానలు లీలలకై చరించుచో
వలనుగ నెఱ్ఱకల్వవిరి * వన్నెల నీను పదద్వయిన్ విరా
జిలియెడు నందె (మోఁతలటు * చెల్వయి కృష్ణమనంబు నేయెడన్
జలితము గాకయుండ మద * సారస చారు రుతంబు లోఁగొనెన్. 44

చ. హరి బహుదూర మార్గగతుఁ * డైనను నుచ్చతర (ప్రవర్తియై
పొరయక జాఱు టింతయును * భూరిగరిష్ఠత గంట యాదవే
శ్వరు బలధూళి కొండొక ర * సాభృదనీకమునున్ దదాజ్ఞ నా
సరణినె తాల్చె వేఱొక ర * సాభృదనీకము భక్తి నొఁదలన్. 45

చ. తెరువు సుగమ్యమై మిపులఁ * దీఱిచి యుండినఁగాక లోకు లె
వ్వరుఁ జిఱుగట్లనేని నడు * వంగ సమర్థులు గారుగాదె? యా
మురహరు సేన తుంగతర * భూదర శృంగములన్ జరించున
త్తఱిఁ బయి కెక్కఁజేసె సుప * థంబుల నెల్లయెడన్ విచిత్ర మౌ.

ఉ. ఘోటిమలల్పయిన్ నడచె * మేదుర గంధగజేం(ద్రయూధ మ
చ్చోటఁ బయోదబృందముల * జొప్పడఁ గొమ్ములఁ (గుమ్మ నెంచి బ
ల్పాటవ మొప్ప, నెత్తుచుఁ ద * లల్ నిజగండ గళ న్మదాపగల్
గాటపులోఁతు గల్గు తమ * కర్ణపుటంబుల నిండి పాఱఁగన్. 47

క. తొఱఁగు మదబిందులును జల
ధర బృంద ద్యుతులుఁ బెద్దదంతము లొప్పన్
గురుతను వగు నొకకరి భూ
ధరమేనియు నాఁపలేని దారినె యడ్డెన్. 48

— సేనానివేశవర్ణనము —

తే. ఇటు నటు స్వభగ్న కుజములొ నెల్లదిశల
నెలకొలిపెఁ గేతనారణ్యములను మరల
స్వబల చూర్ణిత గిరులైన స్థలుల నిలిపెఁ
గరులు తమమేను లద్రిదుర్గములు గాఁగ. 49

చ. మలలపయిన్ జరించు నలమత్త గజాళి, శతాధికంబులై
వెలయఁగఁ జూచెనంట మురభేది యుపత్యకలందునుండి మి
క్కిలి విపరీతవాయువు లొగిన్ బయి కెత్తుగ బిట్టు వీవఁ ద
త్కలిత మహాజ వోత్పతిత దారుణభార శిలావళింబలెన్. 50

తే. గిరుల నెక్కి పరిచితిఁ బొంగిన కుచద్వ
యములు చెన్నొందఁ బర్వతీ యాబ్జవదన
లుసిరితోఁటల విహరించుచుండి విప్పుఁ
గనుల వెలువాఱు చూపులఁ గనిరి హరిని. 51

చ. దరిని జరించుచున్న మురదైత్యవిరోధి వరూధినీ సము
త్కరము ననాదర మ్మొసఁగఁగాఁ ద్రుటిఁ గన్నులువిప్పి యొక్కమా
అరసియ తోన కూర్కొని మృగాధిపుఁ డింతయు లోఁ గలంగఁ డీ
కరణిని గాక యేపగిదిఁ గాంచఁగ నౌను? సురాజభావముల్. 52

తే. ఉన్నత ధ్వజపాళిచే నోలి భూరు
హంబులఁ గదల్చి, నరసమూహంబుచేత
నదుల రయ మాఁపి, కరులచేఁ జదిపి రాల
సైన్యములు పర్వతములపై సంచరించె. 5

ఉ. అక్షయ ఖర్జు, వాఱ గజ మాత్మకటంబున రాయఁ గంప్రమౌ
వృక్షమునందు శ్మశ్రుగతి వ్రేలెడి తేనియపట్టునుండి వేల్
లక్షలు తేనెటీఁగలు చలంబున వెల్వడి వజ్రతీవ్ర తుం
డ క్షతులన్ నలంపగఁ దడంబడి పర్వులువెట్టి రెల్లరున్. 5

తే. కట్టెఁడి గజాంతకుఁడు మేని కరణిఁ బరిచి
తోర్విరుహమును గూల్ప నంత దుండుక్రోఁతు
లచ్ఛదేహములను జేరు నాత్మలట్ల
యాక్షణమె చేరుకొనియె నన్యద్రుమముల. 55

తే. ఒక్కచోఁగడుఁ బ్రహ్వత నొకట నుద్ధ
తిని బ్రకాశత గహ్వరస్థితిని నొకట
విషమతను జెందు గురు గిరివితతిఁ గూడ
దేవకీసుతు సేన లతిక్రమించె. 56

తే. అపథములఁగూడ నలువంక నాక్రమించు
కొనుచు సర్వపథీనమౌ తనబలమున
హరి యొనర్చెఁ బ్రతీప నామాంకితలుగ
నీట మేటిదరుల్ దాఁటు నిమ్నగాళి. 57

చ. కరిఘట లెల్లఁ జొచ్చి యవగాహ మొనర్పకముందు సైంధవో
త్కర ఖుర శాతధారలఁ బదంపడి రేఁగిన ధూరజంజె, స
త్వరగతి వాయునీత మయి పర్వి సరిద్విమలాంబు సంతతిన్
గరమును పంకిలత్వమును గాంచెడునట్టుల చేసి యెచ్చిరెన్. 58

మ. ప్రకటోత్తుంగ నితంబ భూములను భాస్వత్కాశి నొప్పించి సా
రెకు డెందంబుల సంతసించి మదపారీణంబులై మించి స్వీ
య కరాపావృత శైవ లాంశుకములై యాయండ వేదండరా
జ కులంబుల్ ఘటియించెఁ బంకము సరస్స్వత్కామినీపంక్తికిన్.

తే. పెనుదరులఁ బొర్లి తొలియేళ్ల వెలయునీట
ధూళి నింకించి మిట్టుఁగా డోన చేసి
స్వమదధారలఁ గూలంక షౌఘనదుల
నిభములు పురాగతిన్ బ్రవహింపఁజేసె. 60

ఉ. తమ్ములు గల్గుఁ గాని వనితాతతి మోముల గోము లేద హం
సమ్ములు గల్గుఁ గాని తెలిఛత్రరుచుల్ గనరావ రాల మొ
త్తమ్ములు గల్గుఁ గాని మదదంతులఁ బోల వనన్ నదుల్ దవీ
యమ్ముల యోఁగదా! యరుగనాహరిసేనలఁబోల్చి చెప్పఁచోన్. 61

మ. ఘన నీలాంజన కాంతి సంయుత మహాకాయాంచి తౌన్నత్యముల్
దనరన్ మత్త మతంగజాళు లతిసాంద్రప్రక్రియన్ మీఱ న
వ్వనజాక్షయ సైన్యలక్ష్మికి సులభ్యం బయ్యె బల్వెల్లలన్
గనుమేడ ల్గలపట్టణాళి పరభాగం బొందెఁ బెంపొందఁగాన్. 62

చ. మురరిపుఁ డేఁగుత్రోవను జనమూవితతుల్ వసియించు తావులన్
వరలు పటీగృహంబులు ఘనంబగు మేడలజాడ నొప్పెడున్
గరమును దన్నుఁ బ్రోచు నిజకాంతు వియోగము సైఁపఁజాల కీ
సరణిఁ బురీరమాసతియ చయ్యన ముందుగ వచ్చి నిల్చె నాన్. 63

తే. ఒరయఁ జెక్కిళ్ల వెడలు మదోదకముల
నార్ద్రమగు చెట్లకొమ్మలం దణఁగి రొదలు
సేయు తేంట్లాటవికుల కాసింధురమ్ము
లింత యెత్తైన వని చిరం బెఱుకసేసె. 64

క. కరియూధ శతాయామత
నురు పటమందిరత వారిజోదరు సేనల్
స్ఫురదట్టావళు లున్నత
శరణములున్ గలుగు నగర శతముల గెలిచెన్. 65

తే. దండుచేఁ బైకి రేఁగిన ధరణిరజము
రవిని గ్రమ్మి తత్ఖరకాంతిఁ గ్రాఁగిపోయి
పడియె నాహ్లాది కహ్లారపవన చలిత
మైన యమునాంబుపూరంబునందు నెదుట. 6

—* యమునానదీవర్ణనము *—

మత్తకోకిల :—

వేఁడివెల్గులపట్టి యయ్యె స్రవించు శీతలవారిచే
తోడఁబుట్టువు మిత్త్రి కయ్యెను దోఁచు జీవనహేతువై
యేడఁ గృష్ణతఁ గాంచియున్న నహీన శుద్ధికరాంబు సం
తాడితాఘ మమోఘవిశ్రుతిదక్షమైయది యొప్పెడిన్. 6

ఉ. ఏనదిలో ద్రవీకృత మహేంద్ర దృషచ్ఛయ నీలతోయ సం
తానము లానియాని వితతంబగు వానిసమానవర్ణమున్
బూనిన వేమొ గాక యనఘారి తుషార కఠోర పాండిమన్
జానగు మబ్బుమొత్తములు చయ్యన గాటుకకప్పు లందెడున్. 68

చ. నిగమముకంటె యుక్తి ధరణిన్ బలవత్తర మేని సూర్యజా
పగయె పయోధి నింపె నదిస్వర్ణది కాదటు కానిచో సురా
పగఝురి భస్మ మంతయు నపాస్తము గాఁగ వెలుంగు శంభుకం
ఠ గతవినీలిమల్ గలుగునా ప్రతి వాఃకణమందు వార్ధికిన్. 69

తే. పుడమి జవమున దాటంగఁ బూనినట్టి
కృష్ణ సేనాంబునిధికి నయ్యెను దమాల
నీలమై యాయతిం గనినెగడు కట్ట
గా మహానది కాళింది క్షణము నేపు. 70

మ. ఇరుపార్శ్వంబులఁ దెడ్డు లాడ వడి నెంతేఁబాదవంతంబులౌ
కరణిం బర్వెడు నావ లెక్కి భటు లాకంజాతమి త్రాత్మభూ
వర నీరంబుల నేఁగి, రారయమునన్ భ్రాంతాత్మలై స్వీయ బం
ధర వేణుల్ కనుదోయిమోడ్చి ఘటియింపంగా స్వయం గ్రాహముల్

మ. తొలుతన్ మూఁపులఁ దాఁకఁ జాలెడి సరిత్తోయంబులం గాంచి యిం
తలె సీః యం చొకచీరికిం గొనక మాద్యద్దంతి యూథంబు త
జ్జలమున్ జొచ్చి క్షణంబులో స్వ మద పాథఃపూర సంపత్తి ని
మ్మల నీరంబుల పెంపు నింపి ప్రమదంబున్ జెందెఁ గ్రీడించుచున్

మ. శ్రవణానందములై స్ఫుటధ్వనులు మీఱన్ విస్ఫుర త్ప్రోథము
ల వెసన్ మోముల నెత్తి పీనుఁగవ నిక్కంబెట్టి గ్రీవంబులన్
సవిలాసంబుగఁ బైకిఁజాఁచి పృథుపుచ్ఛశ్రేణులన్ విప్పి యొ
డ్డవలోకింపఁగఁ జూడ్కులన్ నిలిపి వాహంబుల్ తరించెన్ నదిన్.

ఉ. ఎట్టును దాఁట రానియది యేనియు నొట్టునుబోలె నానదిన్
బిట్టు రయంబు దోఁపఁ గడువీఁకను దాఁటఁగఁగల్గి కొమ్ములన్
గట్టుల మట్టిఁ ద్రవ్వి యొడికంబుగ మూఁపులు దూఁగ నుక్షస
మ్రాట్టులు కర్ణపర్వముగ నంకెలు వేసె దిశల్ చలింపఁగన్. 74

ఉ. ప్రోదిగఁ బాపటన్ నిలుపఁ బొల్పున మత్తకరీంద్రశేఖ రా
పాదిత కుంకుమాంక మొదవన్ గవ లాసిత కాంతిమంతమై
మేదిని దీర్ఘ వేణి నుపమించుచునానది శోభ లీనఁగా
నీదరినుండి యాదరికిఁ నేఁగెను యాదవభూప సైన్యముల్. 75

మ. అనివార్యాధికవేగ విక్రమము నత్యక్రామితాయామమున్
గని నూత్నోర్మ్మలసౌరు మీఱు భుజసంఘాతంబుచే నిమ్నగా
ఘన నావ్యాంబువులన్ దరించి రెలమిన్ గంజాక్షు సేనాచరుల్
వినుతోత్తుంగత నాయతిన్ దనరు దద్వీచీఘటన్ గెల్చుచున్. 76

ఉ. కొమ్ముల దొడ్డయెద్దులను గూలఁగఁ గ్రుమ్మిన పుంగవాళి, న
క్రమ్ములు కాళులన్ దిగువఁగా వెలి కీడ్చు మదేభపంక్తి, స
ర్వమ్ము జలమ్ములన్ గలఁచి వైచిన ధీర రథిప్రవేక పుం
జమ్ము నెసంగ శ్రీవిభుని సైన్యము లేఁగెను గెల్చి యానదిన్. 77

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన
శ్రీమదాంధ్రిమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
శ్రీకృష్ణుని ప్రస్థానవర్ణనము, సేనానివేశ వర్ణనము
యమునానదీ వర్ణనము ననెడు
ద్వాదశాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీ ర స్తు.

# శ్రీ మం దా ం ధ్రి మా ఘ మం

[ శి శు పా ల వ ధ మ హా కా వ్య ము. ]

## త్ర యో ద శా శ్వా స ము.



—* హ స్తి పు ర ప్ర వే శ ము *—

చ. అల యమునాతరంగిణి మహాత్ముఁడు కృష్ణుఁడు దాఁటె నన్న వా
ర్తలు విని ధర్మజుండు హరి దాఁటినవెన్క ననంగ నేల న
వ్వలమురి యే నిమేషమున ద్వారక వీడ్కొనెనో తదాది గాఁ
గల సకలంబు రేవగలు గ్రన్నన నెప్పటి క ప్డెఱుంగఁగాన్. 1

ఉ. యాదవకుంజరుండు తను నాదటఁ జేరఁగ వచ్చి యుంట స
మ్మోదము పట్టఁజాలక ప్రఘాతశరీరము పొంగిపోవఁ ద
త్సోదరు లందఱుం గొలుచుచున్ వెనుకోఁగ ధరాధినేత ధా
మోదరుఁ డేఁగుదెంచుదెస కొయ్యఁ బురంబుననుండి వెల్వడెన్ 2

చ. ఎనయు ముదంబుపేర్మి మొఱయించు కురూద్వహు సైన్యదుందుభి
ధ్వనులకు వీనులన్ జెవుడు పట్టిన లోకుల కాప్తులైన వ
క్త్రనివహ మంతకున్ మునువు ప్రీతిని జెప్పెడు వార్తలందుఁ ద
క్కినవిషయంబు నప్పు డెఱిఁగింపఁగ నయ్యెను హస్తసంజ్ఞలన్. 3

తే. తేరు లెడలేక నంతటఁ బాఱ వడిగఁ
దిరుగుచక్రాల మేలిబంగరపుఁగమ్మి
నెగయు రజములు పెక్కింబు లెనసి యోర
గాలి కాడుచు నొక్క టొక్కటినిఁ బోలు. 4

తే. పాణితల ఘాతముల మ్రోఁగు పణవవితతి
భంగి నశ్వఖుర క్షతావనులు మ్రోసె
జలదగర్జితముల మీఱు సమద కరుల
ఘీంకృతుల కాడెఁ గూయుచుఁ గేకిపిండు. 5

తే. ప్రణయమున వాసుదేవ ధర్మజుల సేన
లొక్కటయి యేఁగుచుండ నర్దుండు కొమ్ము
టేనుఁగు లనుక్షణము కలహింపఁ గెరలెఁ
బొడమునె వివేకము మదాంధబుద్ధుల కిల? 6

ఉ. దూరమునుండి మాధవుఁడు దోఁచినయంతన సంతసంబునన్
దా రథమందునుండి డిగ ధర్మజుఁ డెంచెడి నంతలోనె తా
నే రథమందునుండి డిగియెన్ బ్రథమంబుగ భూమిపైకిఁ బ
ద్మారమణుండు సంభ్రమయుతం బగుచున్ వినయంబు దోఁపఁగన్

తే. అఖిలజగములు మ్రొక్కుల నందుకొనెడు
ప్రోడ యయ్యు సనాతన పురుషుఁ డయ్యుఁ
దనకు మే నంచు మేనత్త తనయు మ్రొక్కెఁ
జిక్కువడ భూరిహారముల్ క్షితిని వ్రాలి. 8

చ. రమణఁ గిరీటకాంతులఁ బదాగము రంజితమౌనటుల్ రమా
రమణు శిరంబు ముందటి ధరాస్థలి సోఁకకమున్నె మన్ననన్
గ్రమము గణింపకుండఁ గురురాణ్మణియున్ భుజపంజరంబునన్
మమత దలిర్పఁ బట్టి మురమర్దను నత్తఱి నెత్తెఁ జయ్యనన్. 9

తే. తలుపుపలె వెడఁదయౌ సిరిదయితు నురము
నృపుని యెదకంటెఁ బెద్దదై నెగడుచున్నఁ
గడుఁ బొడవు లొప్ప బాహాయుగంబు విప్పి
కొదువ గాకుండఁ గౌఁగిటఁ గూర్చె నెట్లొ. 10

ఉ. పొక్కిలివిమ్మి వీఁడి చిరమున్ హృదయాంతరసీమఁ బ్రేమ పెం
పెక్కఁగఁ గాఁపురంబు గని యెచ్చిలు లక్ష్మి కురూత్తమాత్త స
మ్యక్కఠినాంగపీడకు భయంపడియో యన నక్కునుండి తాఁ
గ్రక్కున నెక్కె నల్ల మురఘస్మరుసుస్మిత వక్త్రసీమపై. 11

ఉ. మున్ను బలిన్ జయించుటకుఁ బూనిన కైతవవామనత్వ సం
పన్నుఁడు శౌరి నమ్రతను వామనుఁడై యిపు డొప్ప బాహు శౌ
ర్యోన్నతిఁ గొన్న పౌరకుసుమోత్తమ మచ్చపుఁ గీర్తివైఖరిన్
జెన్నయి వాసనల్ గొలుపు శీర్షము ధర్మజుఁ డల్ల మూర్కొనెన్.

తే. హరిని గౌఁగిటఁ బట్టి భూǂవరుఁడు పీడెఁ
గాని సుఖజాతమౌ పులǂకములతోడి
తత్తనూలత వికసత్కǂదంబ ముకుళ
బృంద సౌందర్యగరిమంబు ǂ పీడ దాఁచె. 13

ఉ. ఊనివబల్మి రక్కసుల ǂ నుక్కడఁగించెడి ప్రోడ లోకస
న్మానితుఁ డాయదూద్వహుఁ డǂమందముదాప్తి విశాలనేత్రుఁడై
మానసమున్ దలిర్పఁ బరǂమానవపాళికి ధర్మసూను భూ
జాని యనుంగుఁదమ్ముల కొǂసంగె యథోచిత గౌరవంబులన్. 14

మ. సమకాంతిత్వ శిలాఘనత్వ ఘనపǂక్ష ద్వంద్వ దీర్ఘాతిదీ
ర్ఘ మహాబాహుత లొప్పు భూమిపతులన్ ǂ గాఢంబుగా భూప బృం
దము లొక్కుమ్మడిఁ గౌఁగిలించి; రట మున్ ǂ దంభోళిధారోగ్రఘా
తములన్ జెందకయున్న భూధరములన్ ǂ ధాత్రీ ధరంబుల్ వలెన్.

ఆ. కుంభికుంభ తుంగǂకుచము లొండొంటి హ
త్తఁగఁ గృశోదరములు ǂ దవ్వ తలఁగఁ
గౌఁగిలించికొనిరి ǂ గబుపాబు చెక్కులై
కుకుర కౌర, వాలిǂచికుర లెలమి. 16

చ. కరిణులుఁ గాల్బలంబుఁ దురǂగంబులుఁ దేరులుఁ గూడి యున్న య
య్యిరువుర సేన లొండొకట ǂ నెంతయు లీనము లయ్యెఁ గాని త
త్కరిఘట లెంతమాత్రమును ǂ దాయక వేఱుగ నుండె-నట్ల యా
నరయ జనాతిగం బయి మǂహాత్ముల వర్తన మొప్పెడిన్గదా! 17

తే. రథ మధిష్ఠింపు మని ధర్మǂరాజు పలుక
నర్జునుని కయిదండ గొంǂ చంబుజాక్షుఁ
డరద మెక్కెఁ గుబేరహǂ స్తావలంబ
మ్మెనసి ఘనవాహనుఁడు మేఘǂమెక్కు కరణి. 18

తే. ఇటుల రథమెక్కి నగరికి ǂ నేఁగఁ దలఁచు
హరికి ననురాగ భావితుంǂడగుట ధర్మ
మూర్తి యగు ప్రజాపతి స్వయంǂబుగ వహించె
సారథిత్వంబు మును త్రిపుǂరారి కట్ల. 19

ఉ. సోరణగండ్లనుండి వెడ§సొచ్చెడి చంద్రకరాళియట్లు సొం
పారెడు చామరంబు నని§లాత్మజుఁ డొయ్యనఁ గేలఁ బూని డిం
డీరనికాయ మూని తటి§నీపతికిన్ బలె వీవఁజొచ్చె దై
త్యారికిఁ బ్రక్క నిల్చి విన§యం బనయం బెనయంగ నల్లన్. 20

మ. వికసత్కాలను మాసితద్యుతులతో§ వెల్గొందు లోకాధినా
యకుఁడౌ కృష్ణున కిచ్చె జిష్ణుఁ డమితా§హ్లాదంబునన్ స్థూల తా
రక పాండుచ్ఛవియౌ చమేయ యమునా§ర్ణఃపూర్ణ పూరోపరి
ప్రకటాచ్ఛచ్ఛద మండలీద్యుతి జయిం§పన్ బాత్రమౌ ఛత్రమున్.

* తే. వడముడికిఁ గ్రీడికి నడుమ § వాసుదేవు
డుండి మిక్కిలి వెలసెను § రెండుగ్రహము
లకును నంతరమునను జె§లంగి ధురుధ
రాఖ్య యోగంబు గన్న శీ§తాంశునట్లు. 22

తే. అయము నయము జితేంద్రియుఁ§డైన భూపు-
యమము నియమము నియతుఁడౌ § యతిని ననుస
రించురీతి జయేందిరా§వృతు ముకుందు
ననుసరించిరి కవ 'లని§లార్కు లనఁగ. 23

చ. ఇటుల మదిన్ దృఢత్వము వ§హించిన భక్తిని నాదరంబుచే
స్ఫుట మొనరించి దైత్యకుల§సూదను మ్రోలను గూరుచుండి యు
త్కటమగు నమ్రభావములఁ § దద్ద భజించిరి దేశికున్ బలెన్
దిటమగు నీతిరీతి నవి§నీతుల దండన సేయుపాండవుల్. 24

తే. జాహ్నవీ యమునానదీ § జలములట్టు
లెక్య మొందిన యుభయసై§న్యముల మంగ
ళానకంబు లపార మో§దానఁబోలె
మ్రోఁగె సురవిమానాల్ మాఱు§మ్రోఁగునట్లు. 25

---

* క. భీమార్జున మధ్య స్థితుఁ
డై మాధవుఁ డొప్పె గ్రహయు§గాంతర గతుఁడై
హైమాంశుండు 'ధురుధరా'
వామక యోగమున మెఱయు § నాఁటి చెలువునన్.

అని పాఠాంతరము.

ఆ. ధర్మసుతుని యజ్ఞదర్శనార్థము వచ్చు
నృపులసేన లాపురికిని బయట
నిలుపు వసతు లరసి తలఁచె నన్నగరంబు
ముట్టడింపఁబడిన యట్టు శౌరి. 26

తే. మాఱుమ్రోఁతల రోదసీ మండలంబు
గ్రమ్మఁ బురబహిర్ద్వారంబు కడకు నేఁగు
దండుమున్నీరు చెన్నారెఁ దతహిమాద్రి
గుహల కెదురేఁగు సురసింధులహరిఁ బోలి. 27

తే. పలుమఱు ననేకతనువులఁ బడసి యింద్రి
యములపంచకమట్టి నృపాత్మభవులఁ
గాని విభక్తమ్ములగు నవగోపురములు
గల పురములోనఁ బురుషుఁ డగ్గలికఁ జొచ్చె. 28

తే. అచటి మగవారు ముక్కంటి యరయకున్న
నాఁటి మదనుని మూర్తు లనన్ దనర్తురి
రాజయక్ష్మము సోఁకని రాజమూర్తిఁ
బోలు మొగముల మగువ లప్పురిఁ దనర్తురి. 29

ఉ. రక్కసిమూఁకలం గెలుచు రాజితశక్తి యుతుండు కృష్ణుఁడే
యిక్కడ కేఁగుదెంచె నని యిందునిభాస్యలు తొట్రుపాటుతో
దిక్కృత సర్వకార్య లయి తెప్పునఁ బోయిరి రాజవీథికిన్
మిక్కిలి భేరికా ధిమిధిమింధిమి రావము లొయ్యఁ బిల్చుటన్.

ఉ. జాఱెడు కట్టుపుట్టములఁ జయ్యనఁ బోఁకముడిన్ గరంబులన్
జేరిచి పట్టుకొంచుఁ గయిసేఁత సగంబు సగంబు దీర్చి రాఁ
జారువిలోచనామణుల సౌధము లారసి బిట్టు నవ్వె నా
మాఱు మెలంగె గోడలకు మధ్యమునన్ బటహప్రణాదముల్.

తే. హారముగఁ గాంచి క్రొవ్వేదయందుఁ గర్ణ
పూరమును గంకణమునకు మాఱు శ్రవణ
పూరకము తాఱుమాఱుగాఁ బుట్టములను
వడి ధరించి సతుల్ వచ్చి వ్రాలిరంత. 32

ఉ. బందపుఁ బ్రాఁడు చేతఁ గొని వచ్చెడు గోపకుఁ జూచి లేఁతలేఁ
గం దమిమీఱఁ జేరఁ ద్వరగా నెదురేఁగఁ గలంగు చింపుసొం
పొందఁగ "హుమ్మహూ" మ్మనుచు నొయ్యన గోవులమిన్న యొంటు దా
మందను బాసి యేఁగ మధుమర్దనుఁ డారసె సంతసించుచున్. 41

చ. చిలుకలఁ ద్రోల నయ్యెడకుఁ జేరఁగ నియ్యెడ లేళ్లు వచ్చి వి
చ్చలవిడిఁ బంటచేలఁ దిన సాఁగె ని దెట్లని చాల బేలలౌ
పొలములఁ గాచుగుబ్బెతల ముగ్ధవధూజన చిత్తచోరుఁడౌ
వలపులఱేని యయ్య కను పండువుగాఁ దిలకించె నవ్వుచున్. 42

ఉ. పైరులు గాచు చేడియల పాటలు వీనులవిందు సేయ నా
సౌరునఁ జొక్కుచున్ గలమ సస్యము ముట్టవ యింత లేళు లా
దారినె మమ్ముఁగూడఁ బెడ దారిని బట్టఁగ సేయు టబ్రమే
వీరలపాట? యంచు యదు వీరుఁడు సేసె వితర్కమాత్మలోన్. 43

చ. జలములు గల్గుతావులను జానలు లీలలకై చరించుచో
వలనుగ నెట్టికల్వవిరి వన్నెల నీను పదద్వయిన్ విరా
జిలియెడు నందెమ్రోఁతలటు చెల్వయి కృష్ణమనంబు నేయెడన్
జలితము గాకయుండ మద సారస చారు రుతంబు లోఁగొనెన్. 44

చ. హరి బహుదూర మార్గగతుఁడైనను నుచ్చతర ప్రవర్తియై
పొరయక జాఱు టింతయును భూరిగరిష్ఠత గంట యాదవే
శ్వరు బలధూళి కొండొక రసాభృదనీకమునున్ దదాజ్ఞ నా
సరణినె తాల్చె వేఱొక రసాభృదనీకము భక్తి నొందఁదలన్. 45

చ. తెరువు సుగమ్యమై మివులఁ దీఱిచి యుండినఁగాక లోకు లె
వ్వరుఁ జిఱుగట్లనేని నడువంగ సమర్థులు గారుగాదె? యా
మురహరు సేన తుంగతర భూదర శృంగములన్ జరించున
త్తఱిఁ బయి కెక్కఁజేసె సుపథంబుల నెల్లయెడన్ విచిత్ర మౌ.

ఉ. ఘోటిమలల్పయిన్ నడచె మేదుర గంధగజేంద్రయూథ మ
చ్చోటఁ బయోదబృందములఁ జొప్పడఁ గొమ్ములఁ గ్రుమ్మె నెంచి బ
ల్పాటవ మొప్ప, నెత్తుచుఁ దలల్ నిజగండ గళ న్మదాపగల్
గాటపులోఁతు గల్గు తమ కర్ణపుటంబుల నిండి పాఱఁగన్. 47

శా. ఎన్నన్‌రాని వెడందయౌ నుదరమం దెవ్వాఁడు కల్పాంత వే
ళ న్నానాభువనంబులన్ గొనుచు లీలన్ నిల్పి మున్నీటిలో
న న్నిద్రించు సుఖాన నట్టిఘనునిన్ హాలామదైకార్ధమీ
ల న్నేత్రాంచల దృష్టిలోఁ గొనియె బాలారత్న మొక్కర్తు దాన్. 40

ఉ. మిక్కిలి బాహు లెత్తి చనుమిట్టల గట్టితనంబు దెల్పుచున్
నెక్కొని యాడు నెమ్మికరణిన్ గలనాదము గాజు లీనఁగా
నొక్కతె కృష్ణకట్టెదుట నొద్దికమై నొకకర్ణరంధ్రమం
దక్కలఁ గ్రుచ్చె వ్రేలికొన నాఱనికండువు మాన్పనో యనన్. 41

ఉ. అంతట నెఱ్ఱదామరలయంచలిఱేకుల సౌరు గాంచి బల్
వింతగ సౌరెకున్ గదలు వ్రేళ్ల చివుళ్లటు లొప్పఁ గేలనే
స్వాంత నిగూఢభావమును బల్కకయే తలయూఁచి తెల్పి దై
త్యాంతకుఁ బిల్చె నొక్కతె యనక్షరమై నిభృతార్థ మౌ క్రియన్.

తే. తమ్మిఁ గూర్చిన చివురుచందమున నొక్క
కేలు మోమున నమరించి కేలివ్రేళ్ల
యంతరంబుల దంతప్రభాంకురములు
మెఱయఁగా నావులించెను మెలఁత యోర్తు. 43

ఉ. చాలుగఁ గంకణమ్మునఁ బసందుగఁ జెక్కిన యింద్రనీలపున్
డాలున నారు సన్నమయినన్ బరిపుష్టమొనర్చి క్రొన్ననన్
బోలిన కేలఁ బట్టెఁ బువుఁబోణి యొకర్తు తదేకదృష్టి గో
పాలుని గాంచి మైమఱచు పట్టున జాఱెడు కట్టుపుట్టమున్. 44

ఉ. కమ్మని తావికిన్ వలచి క్రమ్మిన తుమ్మెదఱెక్క వీవనన్
బమ్మినతెమ్మెరల్ చెమటఁబాపఁ గనుంగవ మూఁత లేనిరూ
పమ్మున నొక్కకొమ్మ కనుపట్టెను గంసవిరోధి కాభిము
ఖ్యమ్ము భజించి యే మనఁగనోఁ బురదేవత యేమొ యీమె నాన్.

శా. "మాకన్నుల్ తమిదీఱఁగాంచకయె యీమాన్యుం డిదే యేఁగు" నం
చాకుల్యంబున మున్గిపోయిరి నితంబాభోగ లింతుల్ మనో
జాకారున్ హరి సర్వదా గనియు బ్రహ్మజ్ఞానియున్ దృప్తిఁ దాఁ
గైకోఁజాలఁ డటన్న సూక్తి నెఱుగంగాఁజాలరేమో? కదా! 46

తే. మనసు హరితోన యేఁగిన మగిడి రాఁగ
వేచియుంటను గాఁబోలు వెలఁదు లొక్క
క్షణము నిశ్చేష్టలై చిత్రసామ్య మెనసి
యట్టె నిల్చిరి యిండ్లపై నాస మాని. 47

క. కనుఁగవ యను దోసిళులన్
గొనకొని మాధవరసంబు గ్రోలుట మద మె
క్కిన మేనుల సోలుచు నం
గన లిండ్లకు నరిగి రలసగమనము లొప్పన్. 48

ఉ. ఇమ్ముగ నున్నతస్థలుల నెత్తు పతాకలచేల లొప్పఁగా
గుమ్మన వింతతావులు బుగుల్కొను గొజ్జఁగినీరు చల్లి పెన్
దుమ్ము నడంచు వీథుల ననూనముగా బహు ధూప ధూమ జా
తమ్మగు రేణు విభ్రమము దాల్చిన మాధవుఁ డేఁగె నప్పురిన్.

చ. మును వృషపర్వుఁ డన్నసురముఖ్యునకై మయుఁడన్ సురారిశి
ల్పి నిపుణతన్ రచించుటకు బిందుసరంబున నుండి దెచ్చి కూ
ర్చిన మణిదారువుల్ మెఱయఁ జెన్నగు వేల్పులయిండ్ల మించి శో
భన వివిధార్థముల్ గల సభన్ హరి చేరె ముదంబు మీఱఁగన్.

తే. ఆసభను వెండియటు తెలుపైన స్ఫాటి
కపుగృహంబుల రోచు లాకసము గ్రమ్మ
నందు రేలఁ జరించు నేణాంకుఁ డొప్పు
క్షణము దుగ్ధాబ్ధి గర్భవాస్తవ్యుఁ డట్లు. 51

చ. కనఁదగు నందునందు సలికంబుగఁ గ్రమ్మిన నాఁచుతీవలన్
దనరెడు జామదగ్న్యి పితృతర్పణ తోయములో యనన్ నికే
తనములఁ బద్మరాగ ఖచితంబగు భూములు నీలిరాల చా
యను హరితీకృతాంతరములై చెలువొందఁగ నమ్మహాసభన్. 52

ఉ. మాపటివేళఁ జంద్రసుషమన్ గన నైక్యము నేర్పరింపఁగా
నోపక మర్త్యు లంధతమసోద్ధతియం దటువోలెఁ జేతులన్
జాఁపి స్పృశించి యెప్పటికొ జాడ నెఱింగి యతిక్రమింతు ర
చ్ఛోపలనిర్మితంబు లయి యొప్పెడు మేడల పంక్తి నాసభన్. 53

తే. ఆసభఁ గలట్టియిండ్ల నశ్రాస నీల
మణిరుచులు పద్మినుల నవశమానపఱచు
ఖలచరిత మెంచి చంద్రాంశుశవుల నుపాంశు
వునఁ గెడపు గౌరవమున యాశమినులయంచ. 54

క. తొలికూటమి లజ్జాభర
మలయింపఁ గలంగి విముఖశలగుమగువల నీ
డ లెదుటిమణిమయ కుడ్యం
బుల నభిముఖ మౌటఁ గంద్రుశముదమునె భోగున్. 55

ఉ. అందలి పచ్చరాల నిలశయాలఁ దృణాశను సారె కాస్యముల్
గ్రిందికి వంచి నాల్కలను శ గిల్కొనఁ దత్కిరణాంకురంబు లిం
పొందు కురంగరాజిఁ గనిశయూహ యొనర్తు జనుల్ "నిజంబుగా
నిందలి లేఁతగడ్డి గ్రసిశయించుచునున్నవ" యంచు నాత్మలన్. 56

తే. తత్సభాంతికసీమలఁ శ దరువరములు
బృథుల నై జాలవాల సంశభృత జలముల
నద్దములఁబోలెఁ బ్రతిబింబిశతాకృతు లయి
యడరును సమూలముగ శ నాకుఁదొడిగినట్లు. 57

ఆ. పాఁపఱేండ్ల తలలశపైఁ బుట్టు రతనాల
డాసి మబ్బు లుఱుముశటయ తడవుగ
నూత్న వాలవాయ శ రత్న స్థలాంకురాల్
గా సభాంగణ స్థశలములు మాఱు. 58

ఉ. అందొకచో నిగూఢజలశమైన కొలంకు స్థలంబుగా భ్రమన్
జెంది సుయోధనుండు పడశనెట్టన భీముఁడు విట్టు నవ్వ రా
జ్ఞిందను లెందఱో రణముశనన్ మరణంబును బొంద హేతు వౌ
నందురు దేని నాసభ మశయప్రతిభన్ బ్రకటించు నెంతయున్. 59

క. ఇతరులు దెలిపినను నవా
గత జన మసికోమల ప్రశకాశ మగు దివ
స్పతిమణి భువి జల మనుకొని
దృతవసనము లెత్తి నడతుశరెల్లరు నవ్వన్. 60

తే. అట్టి సభ కట్టెదుట నిల్చినట్టి యరద
మధికతేజస్వులాహరియమ తనూజు
లక్షి పర్వమ్ముగాఁగఁ బ్రాగద్రినుండి
దివికి డిగు చంద్ర శుక్రుల పవిది డిగిరి. 61

చ. ఇటు లిటు లంచు నాదృతి నరేంద్రుఁడు మార్గము చూపుచుండ న
స్ఫుటమగు రత్నభిత్తికల పొల్పును, దెల్పగు రాలడాలులో
నెటు గనరాని ద్వారముల హృద్యతయున్ మది కద్భుతంబు ము
చ్చటయు ఘటింప శౌరి పరిషద్భవనంబునఁ జొచ్చె నల్లనన్. 62

చ. సదమలు పొచ్చి యందు నొకచాయ ముకుందుఁడు గాంచె భూమిభృ
త్సదనముఁ గాంచనేష్టక చితం బగుదాని నభఃస్పృశంబులౌ
సదమల రత్నదీధితుల సంహతిచే దివి వెల్గు దేవతా
సదనములన్ హసింపఁగల సారము నూనిన దాన్నిజానుగన్. 63

తే. ఉదయభూధర శిఖరమం దొక్క మాఱు
వెలయు రవి పూర్ణశశులకుఁ గలుగనట్టి
శోభ వహియించి హరి పాండుసూను లొక్క
సింహపీఠమునందు నాసీను లైరి. 64

క. అంత నఖిలార్తి హరుఁ డగు
కంతుజనకుచే సుఖంబు గనెఁ గురుకుల మ
త్యంతము జలనిధి నెలచే
సంతప్తాంగమ్ము గగనజముచేతఁ బలెన్. 65

(ఆకాశాధ్యాయః)

మ. సవిలాసంబుగ లాపకీజనము లాస్యప్రక్రియం జూపెఁ బా
టవ మెంతే నవవద్య వాద్య లయ పుష్టంబయ్యు నుం గోమల
త్వ స్వరంబై నవగీతమే యనవగీతంబై విభాసిల్లఁగాఁ
దమ్ములన్ సాత్త్విక వాచి కాంగిక విధాధారాభినీతి క్రియల్. 66

ఉ. అంబుజలోచనుం డటు గృహాగతుఁ డౌటయు నుత్సవం బకా
లంబుననేని సల్పఁగ శిలాపతి పీఁటను జాటఁబంచె జి
త్రం బగు సంతతోత్సవ ధురంధరమా పుర మన్న షూ సై మో
దంబున మున్గిపోయి వసుధాపతి విస్మృతి గాంచి యుండెడిన్. 6'

ఆ. అడిగె హరి యనామఽయము చుట్టముల నాకు
మార మెఱుకఁ బేరుఽ పేరు పరుస
సిరుల వెన్ని యున్నఽగరువింప కుత్తమ
చరితుఁ డెదియు నెపుడుఽ మఱువఁడె కద! 68

తే. మర్త్యలోకదుర్లభ మసఽమాన రుచి న
మంచితమ్ము నొండొంటిని ఽ మించి నూత్న
మైన యన్యోన్య బహు సంకఽథామృతమ్ముఁ
ద్రావిరి యధిష్ఠిరుండును ఽ శ్రీవరుండు. 69

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
హస్తిపురప్రవేశ మనెడు త్రయోదశాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీ రస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

## [శిశుపాలవధమహాకావ్యము.]

## చతుర్దశాశ్వాసము.



### —* రాజసూయయాగవర్ణనము *—

చ. నిరుపమ రాజసూయవిధి నిశ్చితచిత్తుఁడు సద్వచోధురం
ధరుఁడు నృపాలమౌళి యనె దా నిటు వాక్యవిదగ్రగామి యౌ
హరికిఁ బ్రసాద మేదుర నిజాక్షిసరోజయుగంబుచేతఁ బ్రే
మరస లస న్మరందము నమందముగాఁ గురియించు వైఖరిన్. 1

మ. పరు లెంతో నుతియింపఁగాఁ బడియు గర్వగ్రస్తులై, సిగ్గు గాం
చరు; లజ్జింతురు స్తోత్రవాదులె కడున్ సత్యేతరావాప్తికిన్
గురుకల్యాణ గుణున్ నినున్ బొగడి సిగ్గున్ గాంచ రవ్వారు శ్రీ
ధరమున్ బూజ్యుఁడ వౌట నీవ కనె దవ్వారల్ ప్రియం బాడఁగన్

ఉ. పొంగును నింగికిన్ బరుఁడు బొల్లిపొగడ్తల; నవ్వి విమ్చ వా
రుం గల రెందఱెందఱో నరుల్ నినుఁగూర్చి ప్రియంబు లాడుచో
టం గనరా దబద్ధ మొకటన్ స్తవనార్హచరిత్ర! సుంతయే
విం గనఁబోవు సంతసము నీమదియందుఁ దలంపఁ జిత్ర మౌ. 3

తే. అఖిలహిత! పాపరహిత! నీయందు సకల
గణ్య గుణసంపదలు గల్గుగాన నిన్ను
నెంత నుతిసేసినను వీసమంత యైన
ననృతదోషంబు నాజనుండెనయఁ బోఁడు? 4

ఉ. భారతఖండ మిప్పు డనపాయతఁ గోట్లకొలంది యేఁడు లిం
పారఁగ నేలఁగాఁ గలుగు నంతటివాఁడుగ నౌట, నెంచ నా
సారత రైకవైభవ మొసంగినయట్టి యనంతమైన నీ
భూరి మహానుభావరమ పొల్చుటనే కద విశ్వధూర్వహా! 5

తే. యజ్ఞ మొనరింప నెంతు ననుజ్ఞ యిమ్ము
సదయ హృదయుండ వగుచు నో సరసిజాక్ష!
తొలుతఁ దరుమూలమై నీవు నిలుతు వేని
గాంచెదను ధర్మమయ వృక్షతను మహాత్మ! 6

చ. వలయు పదార్థసంచయము భద్రము చేసితి వేచియుంటి ని
ర్మలముగ జన్నమున్ సలుప మాధవ! నీదగురాక కిమ్మెయిన్
బొలమున ధాన్యముల్ నుఱిచి ప్రోవిడినట్టి కృషీవలుండు దా
వలనుగఁ దూరుపెత్తుటకుఁ వాయువుకై కనుపెట్టి యున్నటుల్. 7

తే. ఇపుడు నాజన్న మమరుత నింత దొసఁగు
విఘ్నమును లేక నీయండ వెలయుకతనఁ
బ్రొద్దు పొడిచినఁ బగలింటి భూరిశోభ
నణఁపఁగా శక్తి గలవారలయ్య యెవరు? 8

తే. ధర్మ వొక్కింత తప్పనిదారి సంత
రించి పాలించి పెంచిన సంచితార్థ
మెల్ల సత్పాత్ర వినియోగమేను జేయ
ననల ముఖమున హుతమట్లయదియుఁ గొనుము. 9

తే. కాక తొలుదొల్తఁ జేయుమీ క్రతువు సోమ
పానమును జేసి యవబృథస్నాన మీవు
సేయు మామీఁద మచ్చిరేప్సిత నిరుపమ
రాజసూయాహ్వయాధ్వర యాజి నగుదు. 10

మ. అటుగా కున్నెడ నీప్రభావమున నేనార్జించియున్నట్టి మి
క్కుటపున్ లచ్చికిఁ బాత్రమౌ విధుల నీకున్ జెల్లు శాసింపఁగా
బటులోకత్రయ శీర్ష రాజిత మహాభాగ్య స్ఫుర చ్ఛాసనా
ఘటియింపంగదె నాకు నాన యను జౌఘం బేను నీవారమే. 11

తే. అనుచుఁ బల్కెడు ధర్మజు ననియె నచటి
నృపతు లెల్లరు వినుచుండఁ గృష్ణుఁ డంత
దంతరుచిమండలంబు నాఁదగెడు ముత్తి
యముల పేరులు పలురంగులలమ మెయిని. 12

ఉ. నీనయలక్ష్మి శక్తి హవ§ణిల్లిన నీపటుతేజమే మహీ
జానుల నెల్ల గెల్వ నను§సన్నుతి సేసెదు కర్త నన్నటుల్
పూనిన పథ్యభోజనమె § భూరిగదార్తి నివారణ క్షమం
బౌనెడ వైద్యశక్తి యిది§యం చితరంబు నుతించినట్లుగన్.

ఉ. రాజుల మేలుబంతి విక్ర§రాజులలోనఁ దగం డొకండు రా
రాజు లొనర్చు నీసవన§రాజము సల్పఁగ నీదుముందటన్
రాజిత పర్వ తాబ్ధి కుజ§రాజ భరంబున నొప్పు నుర్వరన్
దేజున నాదిఘోణికిని§ద్రిక్క మఱొక్కని కెత్త శక్యమే.

ఆ. ఎంత దుష్కరంబ § యేని నీశాసన
మునఁ జరించు నన్నుఁ§బనుపు దెలుపు
కోర్కి యేమి? యెంచు§కొనుము నీవానిఁగా
వేఱు లేదు నాకు § విజయునకును.

శా. ఈయజ్ఞంబున ధారుణీపతులలో § నెవ్వండు నీభృత్యుఁడై
చేయెం దప్పనొ యెల్లకార్యములఁ ద§చ్ఛీర్షంబు ఖండింతుఁ ద
త్కాయం బుర్విని గూల్చివైచుఁ జుమి పం§కజాళన్నోదార ధా
రాయుక్తంబు సుదర్శనం బిది మహా§రాజాగ్రణీ ధర్మజా!

క. అని పలుకు హరికి ధర్మజుఁ
డనె "నానేమమున కీవ§యాదుకొనుటచే
తన నాసంపద సుస్థిర
తను గనె" నని పూనె గ్రతు వి§ధానంబునకున్.

తే. మొగముపైఁ జంద్రకళ గల § సొగసు గాంచి
కంటిచూపునఁ గామవి§గ్రహము మాపి
విమల సలిలావగాహన § విధిని మెఱసి
యష్టమూర్తి యష్టమమూర్తి § యయ్యె నతఁడు.

తే. తాను గ్రియ మాని యాజక§తతి పొనర్చు
క్రియల నంతరంగమున నం§గీకరించి
పొందెఁ గర్తృత్వమును బాండు§పుత్రకుఁడు
బుద్ధిసాన్నిధ్యమున సాంఖ్య § పురుషుఁ డట్లు.

తే. యాజ్ఞికులు వాక్యలక్షణా § భిజ్ఞు లగుట
యాజ్యయుఁ బురోనువాక్యయు § ననెడి ఋక్కు-
లనవశబ్దమ్ము నుచ్చైస్స్వ § రాంచితము గఁ
జెప్పు చమరులఁ బిల్చి § వేల్చిరి మఖాగ్ని. 20

తే. సామవేదంబు కరమును § జాఁచి స్వరము
లేడు విస్పష్టముగఁ దోఁపఁ § బాడె సామ
విదుఁ డొకఁడు సత్యవచనులౌ § విబుధవర్యు
లెలమి నధ్యయనించిరి § ఋగ్యజుషము. 21

తే. దర్భమయ కాంచిదామంబు § దాల్చి సోమి
దమ్మ వీక్షించు హోమంపు § ద్రవ్య మెల్ల
ప్రణయనాది సంస్కృత మైన § వహ్నికీల
లందు వేల్చిరి యాజ్ఞికు § లధ్వరమున. 22

ఉ. ఉన్నది యున్నటుల్ నుడువ § నొప్పెడి యాగమమంత్ర * మూహమం
దు న్నెఱవాదులౌ యజన § ధుర్యులు ఋత్విజు లాక్రతుక్రియన్
గ్రన్న విభక్తి లింగ వచ § నంబుల శాస్త్రవిరోధ మొందకుం
డ న్నెఱి నన్నిటన్ విపరి § ణామ మొనర్చి పఠింత్రు హేలగన్. 23

తే. సంశయము గల్గునటు రూప § సామ్య మెనసి
యభిమతార్థ విరుద్ధార్థ § మావహించు
నాసమాసాల విగ్రహం § బనువుపడఁగ
శబ్దవిదు లుచ్చరించిరి § స్వరము వలన. 24

తే. జ్వాల లను వేయినాల్కలు § సంచలింప
వెలయు వెలుఁగులు నవ్వులు § వలెను దోఁపఁ
బ్రజ్వరిలుచు వషట్కృ తా § పరిమితాజ్య
ధార మఱిమఱిఁ గ్రోలె వై § తానికాగ్ని. 25

* "ఊహః ఖల్వపి న సర్వై ర్లింగై ర్న చ సర్వాభి ర్విభక్తిభి ర్వేదే మంత్రా నిగదితాః, తే చావశ్యం యజ్ఞగతేన పురుషేణ యథా యథం విపరిణ యితవ్యాః; తన్నావైయాకరణః శక్నోతి యథాయథం విపరిణమయితుం. తస్మా దధ్యేయం వ్యాకరణమ్" ఇతి పాతంజల మహాభాష్యమ్.

తే. మంత్రపూత హవిర్భుక్తి మహిమ నొక్క
తనువె కాదు హవిర్భుజుండను సమాహ్వ
యమును స్ఫుటవర్ణ సంపద నంది, యుజ్జ్వ
లంబు నయ్యె నగ్నికి దన్ముఖంబునందు. 26

ఉ. అంటిన వెచ్చనై యపుడ యంటుకొనం గల నైజ మొప్ప పెన్
మంటలదంట హవ్య మతిమాత్రము నుగ్గొనరించు టబ్రమే
తొంటి యఘోర పాతకతతుల్ హుత హవ్యసముత్థ గంధ మే
వెంటను నంటినన్ జదిపివేయు శరీరుల కెల్ల నన్నచోన్. 27

చ. రయి రయి మీఁదుమీఁ దెగసి గ్రక్కున దిక్కుల నల్వొనర్చి బల్
మొయిలు నధఃకరించి తమమొత్తము గుత్తముగాఁగఁ బర్వుచున్
బ్రియము దిలేకఆవళికి వేడ్క వచించెడిరీతి దోఁపఁగా
బయలి నలంకరించె నలి వాయుసఖాయత కేతుజాతముల్. 28

చ. జలధి మథించుకాలమున సర్వమహౌషధులందునుండియున్
వెలువడు సారమౌ నమృత బిందువు నానిరి తొల్లి వేల్పు, లీ
యిల యమపుత్రయాగమున కెంతయు వాఁపిరిగొట్టుమోములన్
గలఁగుచు "నెప్పు డెప్పు" డని కాచియ యుం డ్రమృతాప్తికత్తఱిన్.

క. ఎడతెఱపి లేక పిల్వఁగఁ
బడి జన్నంబునకు మగలు వనివడి పోవన్
జడముడులఁ గల్పసుమముల
నొడఁగూర్పరు గోము నామరోత్పలగంధుల్. 30

* క. యమతనయ యాగ హవనీ
యము వెస గ్రసియించి చిరతరామరులై యో
జము పెరుఁగ వధించిరి దు
ర్దము లగు దైతేయులను సురల్ పలుగతులన్. 34

* క. భవ్య యుధిష్ఠిర మఖమున
హవ్యముల భుజించి యమరులై సంప్రాప్తౌ
జోఽవ్యాహతులై రణములఁ
గ్రవ్యాదులఁ జంపి జయము గైకొనిరి సురల్.

తే. సాధనములందు లోపలేxశంబు లేద
కర్మముల నపచారమ్ముx గలుగ దాయె
నొండొకటి మించి పోయె నxయ్యుర్వీధవుని
నంపదలు ఋత్విజులx బుద్ధి సంపదలును. 32

తే. క్రతు విటు సమాప్త మయ్యె భూxపతియుఁ బంక్తి
పావనులు దక్షిణీయులౌx బ్రహ్మకులుల
కొసఁగెఁ దద్రాజసూయకాంxడోక్తరీతి
దక్షిణలఁ బంక్తిఁ దీర్చి తాxదక్షిణుఁ డయి. 33

తే. వలయు సంస్కారముల నెల్లఁxబడసి శుద్ధి
నలరు భూమీసురక్షేత్రxముల ధనమ్ము
బీజములఁబోలె విత్తె నుxర్వీధవుండు
వారిపూర్వంబుగా మహాxఫలము లొదవ 34

తే. యజ్ఞవేదికపై నుండి x యవనిసురల
దక్షిణలఁ దన్పి నరపతిx దాఁ బవిత్రుఁ
డౌట చిత్రమె? యనఘుఁడౌx నధిపువలని
దానముల వారును బవిత్రxతను వహింప. 35

శా. భూచక్రాన మహేంద్రశాసనుఁ డనన్ x బొల్పారు ధర్మాత్మజుం
డాచంద్రార్క సముద్ర తారక మహీxయస్థాయిగాఁ జెల్లఁగాఁ
బ్రాచుర్యంబున దానపత్త్రిముల ముద్రల్ నింపి యాత్మాంక సు
శ్రీచాతుర్యము మీఱ మాన్యముల నిxచ్చెన్ దానె విప్రాళికిన్. 36

చ. శ్రుతి కవిరుద్ధ మౌచుఁ బరిxశుద్ధము నుజ్జ్వల మైన శాస్త్రసం
హతి ధరియించినట్టి ద్విజxమండలిచేతను వాచ్యమాన సం
గతులను నాలకించె మహిxకాంతుఁడు శ్రద్ధ నవర్ణ సంకరో
న్నతిఁ దనరారు పుస్తకగxణంబు సమంబుగ లోఁ దలంచుచున్. 37

చ. క్షితి సకలాశ్రమంబులను x క్షేమము లారసి నిల్పి రాజ్యప
ద్ధతిఁ జతురత్వమున్ నెఱపు x ధర్మతనూభవుఁ డొయ్య స్వీయ మౌ
క్రతువును జూచి పుణ్యగతి x గాంచుతలంపున వచ్చు బ్రాహ్మణ
ప్రతతికి నాతిథేయము లxవారణఁ గూరిచె నశ్రమంబునన్. 38

ఉ. ఎంతప్రయత్నముల్ సలిపి యేనియుఁ బొందఁ దరంబు గాని దిం
తం తనరాని మూల్యము గలట్టిది నూత్నము రత్నరాశి భూ
కాంతకుమార సంఘములు కానుకగాఁ గొని తెచ్చి యజ్ఞశా
లాంతికమందు దర్శనముకై నిలుచుండిరి వేళఁ గోరుచున్. 39

తే. ఒక్కొకనృపాలుఁడే యిచ్చు రొక్క మొకటె
యాగసంపూర్తికిం జాలునైన నేమి
శమనసుతుఁడు వదాన్యతాశాలి యగుట
నెల్లరాజుల ధనము వ్యయింపఁబడియె. 40

చ. నిజగృహసీమ నెల్లెడల నిండుటకంటెను శ్రేయమంచు ధ
ర్మజు ప్రియ మాచరింప ధనరాశు లివేళలు కాన్క లిత్తుర
క్కజముగ, దానికిన్ మదిని గాంచు యుధిష్ఠిరుఁ డెంతొ తృప్తి దా
న, జిత పయోధి సౌరతరునాక, గవీశుఁ డటంచు నెన్నఁగన్. 41

చ. జితరిపుఁ డైనధర్మజుఁడు శిష్యసమంబుగ నేనృపాలు సం
తతమును నెంతయున్ లఘువిధంబగు కృత్యము చేయఁబూన్చినన్
క్షితిపులుఁ దక్కువా రతనిఁ జిన్నగఁ జూడఁగ నోడి గౌరవో
న్నతిఁ గనుచుండ్రు మానసమునన్ దమి హెచ్చఁగ నెల్లవేళలన్.

ఉ. తొంటి యుగంబునన్ బుడమి తొయ్యలి నాదివరాహమూర్తి దాఁ
బంటన యెత్తి నిల్పఁ బిదపన్ బృథివీసతి గాసిలన్ జగ
త్కంటకులైన దైత్యులకతంబున; ధర్మజుఁ డొక్కవాక్కుచేఁ
బంటవలంతి నాఁపియు నృపాళి కొసంగెను బంచి దేశముల్. 43

చ. వినమితవైరి యైన కురువీరవరేణ్యు మహాహవాంగణం
బున కరుదెంచుపట్టునఁ బ్రభూత దృఢీకృత చిత్తవృత్తిచే
నగువగు నర్థులందు నభియాతులయందుఁ బలెన్ బరాఙ్ముఖుం
డనఘుఁ డతండు కాఁడు మదినందఁడు సత్త్వముచే వికారముల్.

తే. చులకనగ నెన్నఁ డర్థిని జూడఁ, డెల్లి
నేఁడు ర మ్మంచు వేడిన నాఁడఁబోవఁ
డిచ్చు నేనుఁగుపాఁడిగా నిచ్చి పొగడి
కొనఁడు కోర్కు లొసంగి వ్యసనపడఁడు. 45

ఆ. దానశౌండుఁ డైన ధర్మజు మ్రోల ని
రుణుఁడునేనియు విముక్తుండు గాఁడు
పరిహరించు నొక్క వార్షుకోన్నతమైన
నీరదంబు చవుటి నేలనేని. 46

చ. గొనములయందు నాదరము గూర్పకపోవుటచేతఁ గాదు, మేల్
గొనములకున్ దదన్యమునకున్ గనుపట్టెడి తారతమ్యమున్
గనకయుఁ గాదు; దానము లఖండగతిన్ సలుపంగఁ గోర్కిచే
త నగుణికిన్ గుణాఢ్యున కుదారుఁడు భేదము లెంచఁ డర్థులన్.

తే. కంటఁ బడినంత మాత్రానఁ గనక మిచ్చు
కెచ్చుగా నర్థులకు లభియించు కతన
ప్రార్థనార్థమ్మునను గాక ప్రభుని త్యాగ
మనవె "దీయతా" మను టర్థమును వహించె. 48

చ. ధనములఁ గోరువాఁడు పెను ద్రవ్యము నొందక క్రమ్మఱండు, రో
గనిహతుఁ డైనవాఁడు తిరుగండ యరోగుఁడుగాక; యాఁకటన్
గనగనలాడువాఁడు మఱి గ్రమ్మఱఁ డాత్మను దృప్తి గాంచ క
య్యనఘుని సత్సభాంతరపు టంతికసీమకుఁ జేరనంతటన్. 49

తే. సంకరము గాని పాత్రసంచయము లొప్పి
సంస్కృత ప్రాకృతానేకసరణు లలర
భావశుద్ధుల మది రసాస్వాద మెసఁగ
భోజనము నాటకము పోలె ముదముఁ గూర్చె. 50

చ. చెడుగుల నందఱన్ వెదకి శిక్ష యొనర్పఁగఁ జాలు శ్రీహరిన్
గడఁకను యాగరక్షకునిగా వరియించి పృథాసుతుండు దం
డడిగొను దాన హోమ యజనంబుల కింతయు నంతరాయమున్
పొడమనటుల్ మఖంబు పరిపూర్తి యొనర్చెఁ బ్రమోదపూర్తితోన్.

క. "హరి యొకఁడె యాయజూకుల
కిర వగు సఖుఁ" డనుచు నభినయించుచు భూసుం
దరి యెత్తె యూపభుజ ముం
గరమట్లు చషాల మొప్పఁగాఁ జన్నమునన్. 52

మ. ఇటు నానావిధమైన పెం పెనయఁగా ఽ నింపొందు జన్నంబునన్
బటు ధర్మార్థ నిబద్ధబుద్ధి చతురఽత్వ స్ఫూర్తి పార్థుండు "ముం
దట నర్ఘ్యంబు గొనంగఁ దగ్గ సుజనోఽత్తంసున్ విచారించి యొ
క్కటియై మీరు వచింపుఁ" డం చనుడు, గంఽగానందనుం డిట్లనున్.

—* అర్ఘ్యమునకై భీష్మకృత కృష్ణమహిమ వర్ణనము *—

చ. "గొన మిది, దోస మిద్ది" యని ఽ గుర్తెఱుఁగందగు నేర్పు పుట్టుతో
డనె గడియించికో వాకొ? యెఽడందను గార్యవివేకసంపదల్
ఘనములు గాకయున్న వాకొ? ఽ కర్జము దీర్పవు పెద్దలైన వా
రిని మును పృచ్ఛసేయక యఽరిందమ! శిష్టపథానువర్తివై. 54

ఉ. "స్నాతకుఁ డొజ్జ, ఋత్విజుఁడుఽ సఖ్యమునన్ దనరారు వ్యక్తియున్
బ్రాతిగ బాంధవుండు, నరఽపాలనదక్షుఁడు తోడిఱేఁడు వి
ఖ్యాతులు వీర లారుపురు ఽ నర్ఘ్యము నిచ్చి భజింప నర్హు" లం
డ్రేతజీ, వార లందఱు నిఽదే సమకూరిరి త్వత్సభాస్థలిన్. 55

చ. అతిశయిత ప్రతాపు లయి ఽ యాపదలన్ ఘనమంత్రశక్తి న
ద్భుతముగ మాపువార లయి ఽ పూనికతోఁ బరలోక మెల్ల సం
తతము వశమ్ము కాఁగలవిఽధానము నేర్చినవారలై మహీ
పతులు మహీసురుల్ సమత ఽ భాసిలుచుండ్రి త్వదీయ సన్నిధిన్.

క. గుణులగు వీ రెల్ల సమ
ర్హణ కర్హులె వేఱు వేఱ ఽ యయినన్ వినుమా
గుణవత్తముఁ డొక్కఁడె య
ర్హణ కర్హతముం డటంచు ఽ నందురు పెద్దల్. 57

ఉ. ఇందఱు బ్రాహ్మణప్రవరు ఽ లిందఱు భూపకులావతంసులున్
గ్రందుగఁ జేరి యున్న సభఁ ఽ గాంచఁగ నియ్యెడఁ దోఁచినాఁడు నా
డెందమునందు నొక్కఁడు, కఽడింది గొనమ్ములవాఁడు దేవతా
బృందవిరోధి ఘస్మరుఁడు ఽ కృష్ణుఁడె పూజ్యుఁ" డటంచు ధర్మజా!

క. అనమిత దైత్య దానవుఁ
డౌ నితని మనుష్యమాత్రుఁ ఽ డనుకొన; కతిలో
కానూన శక్తి, జన సం
తా నాంతర్యామి తత్పఽదార్థ కళ సుమా. 59

తే. ధ్యేయుఁడే కాని కుజ్ఞాని § దృష్టిఁ బడఁడు
స్తుత్యుఁడే కాని మాటల § దొరకఁ డెపుడు
దూరగుఁడె కాని యోగి సం§దోహ విమల
చిత్త సాన్నిధ్యగతుఁ డయి § చెలఁగు నితడు. 60

చ. ఇతఁడు రజోగుణంబును వ§హించి జగత్తు సృజించు బ్రహ్మ-సం
తతమును వాని సాత్త్వికగు§ణంబునఁ బోషణచేసి నిల్పు న
చ్యుతుఁ-డిఁక వానిఁ దామసము § నూని లయించు హరుండు-నై గుణ
త్రితయముచేత ముత్తెఱఁగు§దీప్తుల వెల్గు నొకండె యయ్యుఁ దాన్.

చ. జనులు వచింతు రీఘనుని § సర్వవిదుండు ననాది దేహులన్
మనుప నొడల్ ధరించు నస§మాన దయామయుఁ డాత్తకర్మ సం
జనిత ఫలానుభోగమును § సంగతదుఃఖముఁ గాంచ కొక్క విం
తను దనరారు పూరుషవ§తంసము నీశ్వరుఁ డంచు సారెకున్. 62

చ. అనిశము భక్తివత్సలుని § నాత్మఁ దలంచుచు సర్వపాప ము
క్తుని గని పావనైకఘన § తేజము రాజిల భక్తితత్పరుల్
జననము చావునున్ మరల § జన్మము చావును గల్గ దుఃఖ భా
జనము భవాఖ్య నాటకము § చయ్యన నిర్వహణం బొనర్తురిహా!

తే. పామరత్వము పోఁ గోరి § వర ముముక్షు
జనము మనమును ఘనయోగ§మునను నిల్పి
చేరఁగా రాని యీతనిఁ § జేరుచుందు
రొక్క పరి చేరి, తిరిగి రా§కుండుకొఱకు. 64

తే. తా ననాది, శరీరి సం§తతికి నాది
తా ననంతుఁడు, సర్వ భూ§తాంతకుండు
నెల్ల జగముల క్రిం దయ్యు § నెత్తి సత్య
జగముపై నిల్చు వీని కం§జలి ఘటింతు. 65

తే. సరగ సృజియించు శాసించు § సంహరించు
నను క్రియల్ కర్తఁ జెప్పు ప్ర§త్యయము లొందు
నితని యెడఁ గర్మవాచుల § నెపుడుఁ గనవు
గాని స్తోత్రియ వ్యత్యస్త § మౌను జూడ. 66

క. మును దా సృజించి జలముల
ననివార్యము వీర్య ముంచె§నం దితఁ డదియున్
గనకవికారము గొనె; నం
దు నజుఁడు జనియించి చేసెఁ§ దొలి నీజగమున్. 67

తే. పాలవెల్లి నెజ్జఁ§ బవళించి యున్న యీ
విభుని సుఖసుషుప్తి§ విఘ్న మొక్క
క్షణము మత్కుణముల§ కైవడి మధుకైట
భులు పొనర్చుమాత్ర§మునకె యైరి. 68

తే. శ్రౌత సుఖగాన కోవిద§ బ్రహ్మ భృంగ
గర్భ మైనట్టి యీగుణా§కరుని నాభి
కా సర స్సరసిజము వి§కాస మొందు
నౌర! లక్ష్మీముఖేందుఁ§ డయ్యుండ నున్న. 69

తే. ఋతచరిత్రుండ యయ్యు మా§యికుఁ డటంచు
లోకవృద్ధయ్యుఁ గూర్కు బా§లుండ టంచుఁ
జన్మి యయ్యు నజుం డంచు§ జగము లీ పు
రాణపురుషుని మివుల స్తో§త్రం బొనర్చు. 70

చ. బలిసిన నాసతోఁ దనువు§ భాసిల నాది వరాహమూర్తియై
వెలయుచు నీవిభుండు మెడ§వేగఁ గదల్చిన నిక్కుకేసరం
బుల నలసాగరాంబువులు§ పోవఁ గనంబడు భూమిదేవి యు
జ్జ్వల యయి తన్నుఁ గ్రుచ్చి సర§సంబుగ నెత్తినజాడ తోఁచె మున్.

చ. బలితపు శస్త్రసంహతికి§ భంగము నొందక సంగరాంగణ
స్థలులఁ జరించియున్ గెడపఁ§ జాలని తీఁట గలట్టి మేటికం
డలు గల నా నిశాటుని వె§డంద యురమ్మును గ్రుచ్చి వ్రచ్చు కో
మల నఖపంక్తిఁ జెన్నగు న§మానుషమూర్తి హరీంద్ర మీతఁడే!

తే జలధి తరఁగలఁ బోలె నఖ§ సంచయంబు
దిగ్గజంబులతల గొట్టు§ తీరు మీఱు
ముత్యముల గర్భముల నొప్పి§ మొనయు నఖర
శుక్తి పుటముల వెలసి య§సుర వధించె. 73

మ. తతమధ్యాహ్న విరోచన ప్రభలతో ఽ దైవాఱు వైరోచనిన్
క్షితిచక్రంబును వేడువేళ భువన ఽ శ్రేయంబు కాంక్షించి యం
చిత లోకంబుల కెల్లఁబెద్దయయి భాఽసిల్లన్ స్వయంభ్వాఖ్య స
మ్మతుఁడయ్యున్ త్రిదశేశు తమ్ముఁడగు చీఽమాన్యుండు దాఁబుట్టఁడే?

తే. పొట్టిబాపఁడు వీఁ డెంత ఽ భూమి నలము
ననుచు దైత్యులు గేలి సేఽయకయ మున్న
సూర్య శశిమండలంబుల ఽ చొప్పు గడచి
నింగి మ్రింగిన పాదంబు ఽ నెట్టె బైకి. 75

క. గిరివలె దుర్భరమై యం
బర మొఱయు పదంబుచేఁ జుఽమా నిబద్ధ గళుండౌ
పురుషుఁ డటు బలి యితనిచేఁ
బురుహూతున కయ్యె సులభఽముగ బంధింపన్. 76

తే. ఆకసము గ్రమ్మ నతినీల ఽ మైన వీని
యూరు వటు పైకిఁ బర్వెడు ఽ తీరు దూర
మందె కని యెంచిరి యమర్త్య ఽ లభ్ర గంగ
కలిగి భువినుండి లేచిన ఽ యమున యనుచు. 77

క. తలకొట్టఁ బడిన యలుకన్
మలపంగా వెరవు లేక ఽ మాన కితని మో
మెలమిని బోలుట నా జా
బిలిని విధుంతుదుఁడు పట్టి ఽ పీడ నొనర్చున్. 78

తే. గురుపరంపర విచ్ఛిత్తి ఽ గూరి పతన
భంగ మొందు శ్రుతిస్మృతి ఽ పటలి నుడువ
నత్రిగోత్రంబు నందు దఽత్తాఖ్యఁ బుట్టె
నీతఁ డవ్యయుఁ డవిహత ఽ స్మృతి యుతుండు. 80

ఉ. ఇచ్చకు వచ్చినట్లు బహుఽవృద్ధి జెలంగెడు నర్జు నాటవిన్
రెచ్చిన పత్త్రిపాళిఁ బ్రహఽరించె మహోయత బాహుశాఖలన్
గ్రచ్చఱఁ ద్రుంచె ఛాయ యెటుఽగానఁగ రానటు మచ్చరించెఁ దా
నొచ్చెము దీఱ రేణుకకుఽ నుద్భవ మొందిన నాఁడు పుత్త్రుఁడై.

తే. పుడమిఁ గల బడుగుల నెల్లఁ బ్రోవ నితఁడు
దశరథాత్మజుఁడై పదితలల వానిఁ
బీఁచ మణఁగించి యధిక విభీషణముగ
రక్కసుల పట్టన మొనర్చె నక్క మీఱి. 81

తే. అవుల స్వీయముగ నా స్వయంభవుఁడు వేడ
నెల్ల పొలదిండులను సమయించుకొఱకు
వసుధ వసుదేవ రూపానఁ బరఁగు చున్న
కశ్యపబ్రహ్మ కడుపునఁ గలిగె నితఁడు. 82

83. కన మహోదధిఁ ద్రచ్చ నీకంబె మమ్ము
నరయు వానిని గన మంచు సాదరాను
లాపముల గొల్లలును సురల్ జగదధీశు
దైవరక్ష ధురీణు నీతని బొగడిరి. 83

తే. నాత్త గంధంబు ఛాయాపనుత్త సురవి
తాన సంతాప మైన సుత్రాముని యభి
మాన మటు పారిజాత ద్రుమము దివమ్ము
నుండి యున్మూలితమ్ము నీతం డొనర్చె. 84

తే. అల్ల ముక్కంటి మేల్నోబ గావహిల్ల
మసలు చేదిధరాపాలు నొసటి కన్ను
మాయమై పోయె నీతని చాయ శోఁక
నోరుగాలికిఁ బెనుదివ్వె యాఱినట్లు 85

క. కిటియై గోపాలకుఁడై
పటుదంష్ట్రా భుజ బలముల వారించి పయో
ఘటి తాపద లీతఁడు మి
క్కుటమగు తమి నుద్ధరించె గోమండలమున్. 86

ఉ. ఎవ్వఁడు దౌల నున్న యజియింతురొ యజ్వలు భక్తి నెమ్మదిన్
నివ్వటిలం బురఃస్థుఁగ గణించుచు జన్మములం; దతండె తా
నివ్విధి గోచరుం డగుటకీ విట ధన్యుఁడ వైతి వర్ఘ్య మీ
కవ్వడియంత కిచ్చి కలకాలము గాంచుము సజ్జనస్తుతుల్. 87

చ. అని కురువృద్ధు భీష్ముఁ డమృతాయిత సూక్తులఁ నానతీయఁగా
మనమున స్వీకరించి యభిమానధనుల్ వసుధాతలాధిపుల్
గనుఁగొనఁ జక్రవర్తిసిరి గల్గు యుధిష్ఠిరుఁ డర్ఘ్య మీయ నొ
య్యనఁ గొని వాసుదేవుఁడు నర్తించె ముజ్జగంబునన్.

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
రాజసూయయాగ వర్ణనము, అర్ఘ్యమునకై భీష్మ
కృత కృష్ణమహిమ వర్ణనము ననెడు
చ తు ర్ద శా శ్వా స ము
స మా ప్త ము.

—*—

శ్రీ రస్తు.

# శ్రీ మదాంధ్ర మాఘము

[శిశుపాలవధ మహాకావ్యము.]

## పంచదశాశ్వాసము.



—* శిశుపాలుని యసూయ *—

శా. శ్రీరమ్యం బగు నాసభాస్థలి ధరిత్రీభర్త దా భక్తివి
స్ఫారుండై హరి కర్ఘ్య మిచ్చి కడు సంభావించుటన్, జేది భూ
దారుం డోర్వఁగ నేరఁ డయ్యెను బరోత్కర్షాన మాత్సర్య మే
పారుం గాదొకొ మానవంతుల మనంబందున్ దురాధర్షమై. 1

తే. మున్నె వెన్నునియెడఁ బగఁగొన్న చైద్యు
నలముకొనె నల్క హరికి నర్ఘ్య మిడన
పథ్యసేవన కాలవిపాక సమత
జనితమైనట్టి జ్వరము దేహి నలముగతి. 2

మ. జగముల్ మూఁడు వడంకఁజేయు ఘనమౌ సామర్థ్య సంపత్తికిన్
దగు శీర్షంబు కిరీటసంగత లసన్మాణిక్య రుగ్జాల మె
చ్చఁగఁ గుప్పించుచు దిక్కులన్ గమియఁగాఁ జైద్యుండు పంకించె మె
ల్లగ నచ్చోఁ గల రాజకంబు మనముల్ గంపింపఁ జేయంగ నాన్

తే. కనుల నశ్రువుల్ గ్రక్కుచు గండ మండ
లమునఁ గాఱఁగ ఘర్మజలమ్ము, హస్త
యుగము చెమ్మగిలంగఁ జైద్యుండు దోఁచె
ద్రివిధ మదధార లొలికెడి ద్విరద మనఁగ. 4

తే. దిక్కృతాఖిల రాజకుం డక్కుటిలుఁడు
చెమ్మటలు చిమ్మ మేనఁ దోఁచెను; జలకణ
రాజిఁ జిమ్మెడి మేనితోఁ బ్రళయవారి
రాశి వెల్వడ్డ యాదివరాహ మట్లు. 5

శా. శుంభ ద్రోషముతోడఁ జేదిపతి సంక్షుబ్ధాత్ముఁడై తత్సభా
స్తంభం బల్లలనాడి పోవఁగ మహాశైలోరు శృంగంబు వా
సిం భాసిల్లు వెడంద మూఁపునన వ్రేసెన్ దన్నిరాఘాట సం
రంభం బారసి తత్సభాసదులు సంత్రస్తాత్ములై కీడ్వడన్. 7

మ. ఎదలో రాఁజుచుఁ బైకి లేచిన తదీయేర్ష్యాగ్ని కీలాచ్ఛటల్
విదితంబై తగు నొక్కరూప మమరన్ వెల్గొందె నా నద్భుత
ప్రదమై యాతని బాహుయుగ్మకముపై భాసిల్లు కేయూరపున్
బదియా ర్వన్నె పసిండిడాలు మెఱసెన్ భాస్వత్తటిత్కోటియై. 8

ఉ. పుట్టువుతోడనే కుటిలపుం గుణ మొందిన వాని కన్బొమల్
పట్టఁగరాని యల్కకును బాల్పడుటన్ భ్రుకుటిన్ వహించి క
న్పట్టెను వానిమోము మునుపాసిన మూఁడవలోచనంబు న
పట్టునఁ దాల్చెనేమొ యనుభావము దోఁప భయంకరంబుగన్. 8

తే. సాహసము పూని యతిరక్త సరణిఁ గాంచి
భయ మెఱుంగని యాశిశుపాలు చూపు
చెంగటన యున్న కత్తిని జెలిమికత్తెఁ
బోలె నవలంబముగఁ గని పొంగి పోయె, 9

చ. కొలువున నున్నయట్టి నృపకుంజరు లెల్లరు త్రుళ్ళి యిట్టు న
ట్టుల పరువెత్తఁ జేసిన కఠోరనినాదము పుట్టి మేటిగు
బ్బలి బలితంపు బండవలె భాసిలునట్టి నిజోరుపాళిఁ గు
ట్మలిత కరంబునన్ జఱచెమానని కిన్కను జైద్యుఁ డొయ్యనన్.

తే. మేర మీఱెను శిశుపాల మేదినీశు
కోప మటు లెంత శాంతుండు గూడ నప్రి
యోక్తు నొందిన క్షుభితాత్ముఁడగున యనినఁ
బలుక నగునొక్కొ సహజకోపనుల యలుక. 11

తే. మొదట మెయిఁ బుట్టు వికృతుల మొగ్గదొడిగి
భావికలహంబు ఫల మోచుఁ బరిఢవిల్ల
జం.కెఱుంగని చైద్యు రోషప్రసూన
మెనసె వచనంబునన్ వికసనము పెలుచ. 12

తే. పట్టరానట్టి కినుక నిర్భయుఁ డతండు
సజలజలదంబు గర్జిల్లు చందమునను
గఠినతర విస్ఫుటాక్షర కలితముగను
బలికె సభ యెల్ల భయమునఁ గలఁకఁ జెంద. 13

తే. సజ్జనులకు నపూజ్యుఁ డౌ శౌరి నిచటఁ
బార్థ! పూజింతు విది ప్రేమవశత నె చుమి
జనము తలపోయుఁగద గుణాఢ్యునిగ నెవఁడు
తనకుఁ బ్రేమాస్పదుం డయి తనరు నతని. 14

తే. అగ్నులటు వెల్గు బహు ధరాధ్యక్షు లుండ
రాజు కానట్టి వీఁ డెట్లు రాజ యోగ్య
మైన యర్ఘ్యంబు గొన నర్హుఁ డగును నేఁడు
శునకము హవిస్సు గొనఁగఁ దగునె తలంప. 15

క. కుంతీసుత! "దబ్బఱ యా
వం తాడ" వటంచు ఖ్యాతి నందితి జగమం
దెంతటి యసత్య కృతివో
యంతయు బయ లయ్యె నింద్యు హరిఁ బూజింపన్. 16

క. జనము నిను "ధర్మరా" జని
యనుట "యధర్మంపురాజ" వను నర్థమునం
దుననె యమంగళ వాసర
మును మంగళ వాసరాఖ్యముగఁ బలుకు గతిన్. 17

చ. గొనములతోఁ బనేమిటికి గొల్లఁడె మా కిఁకఁ బూజ్యుఁడంచు మీ
మనమున నిశ్చయించుకొను మాటయె తథ్యమయేని యూర కీ
ఘనతర మాన భంగమునకా యిటకున్ నృపకోటిఁ బిల్చుటల్
పని యిఁక నేమి యున్నది సభాస్థలిఁ బాండవులార! వారికిన్? 18

తే. ఎఱుకయే సున్న యాచారమింత గనరు
మూర్ఖు లగు మీకు ధర్మము బోధపడునె
యనవహితుఁ డాయె మతిహీనుఁ డౌట భీష్ముఁ
డరయ వృథ వీనికిం దల నఱయుటయును. 19

ఉ. ఆడితి వీవు కొందఱను ♦ నర్ఘ్యము చేకొన నర్హ, లంచు నీ
వాడిన వారిలో నొకరుఁ ♦ డొనొకొ యీమురదాన వాంతకుం?
దేడను నేర్చుకొంటి? స్తుతి♦యించెడు పట్లను బెద్ద బట్టవై
నాఁడవె? యాపగాతనయ! ♦ నాలితనంబున కెట్టు లోడితో. 20

క. ఉన్నతు లగు నీనృపగణ
మున్న విడిచి నీచు నొకని ♦ యోగ్యుఁగఁ బలుకం
గన్న నిను నిమ్నగాసుతుఁ
డన్నా రనఁ దగినవాఁడ ♦ వగుటనె గదరా. 21

క. కేవల రాజార్హము పూ
జావిధి నీ కెటు ఘటిల్లు ♦ శౌరి!' యే నిం
దేవాఁడ' ననుచు నరయుము
తావల మాపదకుఁ దన్నుఁ ♦ దా నెఱుఁగమి సూ. 22

క. మధుదైత్యుని నీ వెన్నఁడొ
వధియించితి వనుట యెల్ల ♦ వట్టిది, గడచే
మధుమక్షికఁ గారించుచు
మధువును గాఱించి కంటి ♦ మధుసూదనతన్. 23

క. మును ముచుకుందుని తల్పం
బును శర ణొందితివి మగధ ♦ భూప హతౌజుం
డన నైతి వబలు! రోహిణి
తనయునితోఁ గూడి సబల♦తన్ మురిసెదవే. 24

క. ప్రత్యేక కపట నట నాఁ
సత్యములను ముజ్జగమున ♦ జరిగెడు నీకున్
నిత్యము సాత్రాజితి సాం
గత్యంబున "నిష్టసత్య" ♦ ఘన విఖ్యాతుల్. 25

క. అరి భీత నైజచక్రము
పరిరక్షించుటను గాదు ♦ బవరంబున నొ
క్కరథాంగము చేకొనుటన
స్థిర చక్రధర ప్రశస్తి ♦ చేకుఱె నీకున్. 26

క. నిన్ను సిరిలేని దీనుని
నెన్నఁగ "శ్రీపతి" యనంగ హేతువు-బంధుల్
మున్నీటి కూఁతు "శ్రీ" యని
పన్నుగఁ బిలుచుటయు, దానిపతి వగుటయు నౌ! 27

క. పగఱ నని విక్రమంబున
నెగిచితి వని కాదు సుమ్మి యెంతయు శ్రమమై
గగనమున నడుగుఁ బెట్టుట
జగతిని "విక్రమివి" యని ప్రశస్తి లభించెన్. 28

క. భూమి మును భరించినచో
'భూమిభృ' దంకంబు దగు రిపుక్రామితమై
భూమి యని లేని నీయెడ
'భూమిభృ' దంకంబు వట్టి బూటకమె కదా! 29

తే. అఖిల ధరణి * భృత్తులితుఁడ వయ్యె నెట్లొ
యొక్క-క్షణ మల్పశైలము నొక్క-టి యఱ
చేత నిల్పిన మాత్రాన క్షితిని దులిత
భూమి భృత్ఖ్యాతి గంటి వీపుణ్య మేమొ. 30

క. నిరత పరిపాక దారుణ
నరక జయము గాంచలేక నరకాఖ్యా వసుం
ధరసుతుఁ జంపి" నరకజి
త్వరుఁ" డను పేరొందఁ గంటి పాపాహరాఁ. 31

క. గుణహీన సకల దోషా
పణమును, గుణశూన్య మగు భగవద్దేహ మ్మే
ఘణితిం ద్యజింపఁ గలవు త్రి
గుణములః శ్రమ మొందె దేలొకో వ్యర్థముగన్. 32

క. గౌన మెఱుఁగని నీయెడఁ గూ
ర్చిన యర్చన-కురులు లేని శిరసును మేల్దు
వ్వైన దువ్వట యగు, నగుబా
టున కగును ధ్రువంబుగాఁ గఠోర చరిత్రా. 33

* తులితః = అవధూతః, తిరస్కృత ఇత్యర్థః అని వ్యాఖ్య.

క. వినుఁడు నృపులు, సింహములకు
నెన యగు మీ రరయుచుండ నీ వన శునకం
బును బోలు కృష్ణుఁ గుంతీ
తనయులు పూజింప మీకుఁ దలవంపుగదే. 34

క. హతవృషుఁడు వీఁడు మాలని
గతి వృషవధ చేసినట్టి కలుషాత్ముఁడ యె
ట్లితనికి నస్పృశ్యునకు నృ
పతి యోగ్య సపర్యఁ గూర్ప వచ్చునో చెపుఁడా. 35

క. నాతి యని వీని హృదయము
పూతనయెడఁ గరఁగకుండెఁ బో పా లిడుటన్
మాత యను ధర్మ మైనను
జేతంబున నిడఁడు కఠిన చిత్తుం డగుటన్. 36

క. బండిని జెఱచుటయును జిన
కొండ నొకటఁ దాల్చుటయును గుజయుగ్మంబున్
ఖండించుట మున్నగున వ
ఖండ స్థిరమతులు వింతగా నెంచునవే? 37

క. వీఁ డల కంసు పసులఁ గా
పాడుచు స్వామినె వధించెఁ గాపురుషులలో
నీ డున్నె యీనృపశువున
కేడ నయిన? నింత వింత యెందున్ గలదే. 38

సీ. గుణ మున్న నెవఁడేని గౌనుఁ బూజ్యతను హరి
నిర్గుణుఁ బూజింప నీకు గుణమె?
మేటిగాఁ, డితరుల సాటి గాఁడు గుణాలఁ
ద్యక్తాభిమాని పృథగ్జనుండు,
రసభావములఁ గళా విసరమ్ము లేక క్షే
త్రజ్ఞుఁడై పురబాహ్యతను వహించు
భక్తులై శుచులైన వారి కేనియు "దుర
పచరుఁ" డౌచుఁ గృతఘ్న భావ మూను

తే. ననుచితుం డయ్యు బంధుత్వ మంటఁగట్టి
వినయమునఁ గొల్చు జను నైనఁ గనుఁ బగతుఁగ
నపరిచితచిత్తుఁ డౌట నిత్యము పరత్వ
మంది జగతి కసమ్మతుం డౌను వీఁడు. 39

సీ. కను సమంబుగ నపకార్యుపకార్యప్రి
య ప్రియాఽసాధు సాధ్వబుధ బుధుల
నుపకారియౌ గుణాఢ్యున కార్తి గల్గఁ గిం
చిత్తు మేల్సేయ నిచ్చింపఁడె కద
తృణము దా వంపలే డితర కర్తృక కర్మ
ఫల మారగింప సిగ్గిలఁడు మదిని
సుఖ దుఃఖ యుగ తటస్థుని వీనిఁ గొల్వ వి
కరణత్వమె కాని కల్గ దుదయ,

తే. మెడయు గుణులను-జపలులు జడులు చుట్టి
కొనఁగఁ దా నొక్కఁ డయి మోదమునను దేలు
జగ మెఱుఁగఁ బెద్దతడవు క్లేశములఁ బొందు
నెవ్వనికొ యెద్దొ దర్శనం బిచ్చు వీఁడు. 40

క. అనుఁగులు బంధులు ప్రేమము
నను గొల్వఁగ నిక్కఁతిన మనస్కుఁడు వారిన్
గనఁ డర్మిలి; నిరపేక్షుం
డన మసలు చపేక్ష సేయు నాత్మ సుఖంబున్. 41

తే. క్షణము తా రాజసుం డయి జగ దుదయ ధు
రీణుఁ డయి సత్త్వ గుణహిత కృతమతి యయి
యంతలోపలనే తామ సాత్ముఁ డగుచు
సర్వమును నాశ మొనరించు జాల్ముఁ డితఁడు. 42

క. కొట్టఁబడుఁ గొట్టుఁ, దాపము
బుట్టించుఁ బెఱలకుఁ, దాను బొందు, ననెడి పెన్
రట్టితనికి దానం గల
దిట్టిద కద చంచల ప్రకృతి క్షితి నెందున్. 43

క. అతిసత్త్వ యుక్తుఁ డనుచున్
స్తుతియింతురు సూక్ష్మమతులు ♦ సుంతేనిన్ సం
భృతసత్త్వుఁ డైన నిలువఁడె
ధృతచాపుం డగుచు నెవఁ డెదిర్చిన వేళన్. 44

ఆ. ఇతరుఁ డెంత మేటి ♦ యేని దద్గుణములఁ
గూల్చు స్వరుచి; నిస్సు ♦ ఖుండు వీఁడు
గుణముఁ గంటగించు ♦ కొను నీతనికి సదో
షముగఁ దోఁచు టరుదె ♦ సకల జగము. 45

సీ. నీట మున్గిన ధారు ♦ణీ చక్ర మెత్తిన
పరమాత్ముఁ డనిరి పా ♦ మరులు వీని
నరసింహరూపుఁడై ♦ నఖముల రక్కసుఁ
జీల్చినాఁ డన విశ్వ ♦ సించు నెవఁడు
స్వార్థసిద్ధికిఁ బరుఁ ♦ డగు బలి యాచించె
మానంబు వీడి నై ♦ చ్యాన కొగ్గి
చద లాక్రమించె వి ♦ శ్వస్వరూపత నందు
నైంద్రజాలికుఁడు చే ♦ యండె మాయ

తే. రావణారిగ మాత్ర మే ♦ లా వినుతులు?
జగదతీత సత్త్వుం డని ♦ చాట రాదొ?
పదయుగళిఁ బండిఁ దన్ను ట ♦ బ్రమ్మ గాదొ?
దధిఘట విభేద నాదులు ♦ దైవికముల. 46

సీ. తల్లి వైఖరి స్నువత్ ♦ స్తన యొచుఁ జేరు పూ
తనఁ ద్రుంచె న ♦ దయుఁడై వనిత యనక
దోఁగాడు నపుడ మ ♦ద్దులఁ గూల్చు టర్భక
కృత్యమ్మొ యది దైవ ♦ కృతము గాని
మధుపటలము ద్రుంచి ♦ మధుసూదనుం డయ్యొ
విజనాటవుల గోప ♦ వేష మూని
గోవధామము లెక్క ♦ గొన కుపగవ మెద్దుఁ
ద్రుంచె "వీఁ డసురుఁ" డ ♦ టంచుఁ జాటి

తే. వికట రద కేశవక్త్రి ప్రవిష్టమైన
వీని బాహు పటుత్వాన విడువఁ దక్కె
వాన పైఁబడనటు కొండఁ బాణి నెత్త
ధేనువుల భాగ్య మది కాని వీని దేమి? 47

సీ. తన జగత్సాక్షిత్వమున నగోత్సవవేళఁ
గొండంత యన్నంబు కుడుచు టరుదె?
కువలయాపీడంబు కోఱఁ బెఱికి చంపె
నద్దాన వింతె బృహద్బలునకుఁ
నది యదృష్టమ బాలుఁడయ్యు నియుద్ధాన
హతు నొనర్చుట కర్కశాంగు మల్లు
సురలోక భయదుఁ గంసు నయుధ్యమానుఁ జం
పుట హృష్టులై జనుల్ పొగడు టేలొ
తే. యంచు హరి దూఱు నుడు లెల్లనయ్యె నుతిగ
హరి పగఱకైన సంస్తుత్యుఁ డగుటఁ జేసి,
కాని చేదిపు హృదయ వైఖరిని బట్టి
హరికి నపరాధ గణ గణనార్థ మయ్యె. 48

చ. పర బలదర్పమున్ గెడపు బాహుబలాఢ్యుఁ డసూయ పేరి పెన్
జ్వరమునఁ బీడితుండు నగు చైద్యమహీపతి నిష్ఠురోక్తు లి
ట్లరయక యాడియాడి నరకాత్మజు పాణితలంబుఁ బాణితోఁ
జఱచుచు నట్టహాసము వెసన్ బొనరించె నహంకరించుచున్. 49

తే. వాఁడిమిని గ్రాలు శిశుపాలు వాక్కులకును
గలఁత నొందఁడు మది రమా కాంతుఁ డింత
సత్యసంధుఁ గలంపంగఁ జాలునొక్కొ
యెట్టి పరుసంపుఁగూళయు నెన్నఁడైన. 50

తే. కాఱు లిటు ప్రేలుచున్నను గనలకుండి
రతనిపై నింత యాదవ క్షితి రమణులు
నగధరు ప్రతిజ్ఞ గౌరవింపఁగ దలంచి
జనము ప్రభుచిత్తమును బట్టి చనును గాదె! 51

తే. తొల్లి తన కొనర్చెను వీఁడు దొసఁగు లెన్నొ
యిదియ తొలుదొల్త నిన్నవయది యటంచు
మానసంబున గణియించె మాధవుండు
గట్టువడి తొంటిప్రతిన కప్పట్టు నందు. 52

తే. పగతుఁ డైనట్టి యాశిశుపాలు వలని
యపకృతులు శౌరి స్మృతి పథంబంట కునికి
నదియ మొదలిటి దయ్యె గుణాళి నెంచు
నుత్తములు స్మరింతురే యెన్నియున్నఁ గీళ్ల? 53

ఉ. శౌరిని నిట్లు దూఱు నతిసాహసు మాటల నాలకించి యా
సౌరనదీసుతుండు పెలుచన్ భువనంబుల నెల్లఁ బట్టి వే
మాఱు వడంకఁజేయు ఘనమారుత పద్ధతికిన్ గలంగి పొం
గారు పయోధి ఘోష కెనయైన యెలుంగునఁ బల్కె నీగతిన్.

క. తనయవమతి గణియింపక
మనమున హరి నింద కెరిసి మావితధైర్యం
బున జాహ్నవీతనూజుఁడు
గొనకొని వాకొనియె నిట్లు క్రోధోద్ధతుఁడై. 55

ఉ. ఈసభ నచ్యుతార్చనము నేను విధించుట కెవ్వఁ డోర్వ లేఁ
డాసభికుండు వింట గొనయమ్మును నెక్కిడి డాయ రావలెన్
రోసము వీస మున్న మదరుల్ తలఁ గాచికొనుండు నేలపై
వేసిన యీ మదంఘ్రి నిదె పెట్టెద నౌదల నింద తూరయన్. 56

చ. స్థిరమగునట్టి భీష్ముని ప్రతిజ్ఞ ఫలించినయట్లు చైద్య భూ
వరగత పక్షపాతి నరపాల సమూహము లొక్కుమొత్తమై
యరత్రుటిలోపలన్ గలఁగి రాత్మహృదంతర కోపభారులై
కరమును ప్రజ్వలించిరి సెగల్ పొగ లీనెడు నిప్పు లొల్కుచున్.

చ. పటుతర రోషభావముల బాణుని నెమ్మొగ మెఱ్ఱవాఱె నం
తటఁ గను లెఱ్ఱవాఱె విశదప్రభ దక్కె, వెసన్ కనీనికల్
స్ఫుటమగు నైల్యసంపదల చొప్పుల మాత్రము వీడ, వాస్యము
త్కట భయదాయి కీలమును దాల్చిన భాస్కరబింబమో యనన్.

తే. పొడుచుతఱి నెఱ్ఱవాఱిన ప్రొద్దువోలి
ద్రుముఁ దనెడు ఱేఁడు తా విషద్రుమ మపరము
పుట్టె నన విష్వ మిగులఁ గెంపుగఁ దనర్చు
చటుల దృక్ప్రసూనములఁ బ్రచండుఁ డయ్యె. 59

క. ఆఱని వైరానలమున
నాఱఁగ నార్ద్రిత రుషానిలాహత మగుచున్
బోరున మండెకీ తరు వటు
దారున జ్వలియించె వేణుదారి నృపుఁ డటన్. 60

చ. కసిగొని యెద్దియో పలుకఁగా గమకించెడునట్టి యుత్తమౌ
జసుఁ డను ఱేనిమోము రదసంతతి పాండిమ బైటఁగ్రక్కు నో
ప్పెసఁగెను నిండుచంద్రు గ్రసియించెడి పూనిక విచ్చు రాహు వ
క్త్ర సమతఁ గాంచి చూపఱకు గాటపుభీతి జనింపఁ జేయుచున్.

తే. ప్రకృతిచేతనె యల్గిన వాఁడు వోలెఁ
బరభయంకరుఁడౌ దంతవక్త్ర నృపతి
వజ్ర దళితాద్రి సాను నిస్వన నిభాట్ట
హాస మెఱఁగించె నొగిఁ గ్రుద్ధుఁడయ్యె నంచు. 62

ఉ. ఎల్ల నరేంద్రమండలికి నిప్పుడ పైఁబడెఁ గాని కిన్క, మున్
చెల్లెలి రుక్మిణిన్ బలిమిచేఁ గొనిపోయిన నాఁటనుండి లో
నల్లన డాఁగియున్న కినుపంతయు నప్పటి భీష్మ పల్కులన్
బెల్లయి రుక్మిపట్లఁ గనుపించె బహిర్గతమౌ చవార్యమై. 63

ఉ. గట్టులకట్లు త్రుంగిపడఁగాఁ దటసీమలఁ దాఁటి వార్ధి నీ
రట్టు నిటుల్ తొనంకఁగ; ఫణీంద్రుని వేదల లుక్కు దక్కఁ గ్రిఁ
బట్టులకున్ దిగంబడఁగఁ బాదము మీఁదికి నెత్తి భూస్థలిన్
బిట్టుగఁ దన్నినాఁడు పృథివీపతి యౌ సుబలాఖ్యుఁ డత్తఱిన్. 64

మ. ఎదియో మాట వచింపఁగాఁ గడఁగి యెంతే నల్కకున్ దాను నా
స్పద మౌటన్ బలు కెద్దియున్ దెమల కప్పాటన్ విరుద్ధాత్మకం
ఠ దర ప్రోద్ధత మౌచు సర్వ జగదండంబున్ డిగన్ మ్రింగు నా
సఁ దగన్ దెర్వఁగఁబడ్డ కాలయవనాస్యంబొప్పె భీ హేతువై. 65

ఆ. ఇనుపకట్ల గుదెల కెనయగు బాహులఁ
జాచి యెల్లనృపులఁ జంప నడవ

వ్రేలుచున్న నుత్త§రీయ మంసమునుండి
వసుధ జాఱిపడియె § వసునృపతికి. 66

చ. ఇటు మదిలోఁ గలంగిరి క్షి§తీశ్వరు లెల్లరు నొక్కసారి యె
ప్పటివలె నుండె నేకలఁత§పాటు నెఱుంగక చిత్తమందు న
ప్పటుతర ధీరుఁ డచ్యుతుఁడు; § భావజునేనలు బోధిసత్త్వ చెం
గటఁబలె జేండ్లు శౌరికడ § నాతురులై చెడకుండ నిల్తురే? 67

చ. బొమిడికలన్ వెలుంగు మణి§పుంజరుచిచ్ఛట రచ్చలోని కు
డ్యముల మెఱుంగు లీను స్ఫటి§కాశ్మరుచిన్ బ్రహరించి త్రోయఁగా
సమరములన్ బరాభవ వి§చార మెఱుంగని చైద్యపక్ష భూ
రమణులు డెందమందు సమ§రంబునె కోరుచు లేచి రుద్ధతిన్. 68

క. చల నేత్రసు మోష్ఠదళం
బులు గంపిత చారు దీర్ఘ§భుజ వల్లరులున్
జలి తావనీప కుజములు
గలిగి కొలువు గాలి కొరగు§కానన మయ్యెన్. 69

తే. సరకుగొనరైరి హరిఁ గురు § సార్వభౌము
లెక్కగొనరైరి భీష్ముని § నొక్కలవము
భయము పడరైరి ప్రబలగ§ర్వమున ముజ్జ
గమును నిరసించు చైద్యప§క్ష క్షితిపులు. 70

తే. మిగుల రోఁజుచు నూఁగాడు § మేనితోడఁ
బైకిఁవెల్వడు దంతశో§భాగ్నితోడ
నొప్పె పెనుసర్పముంబోలి § యుగ్రమైన
వాగ్విషము గ్రక్కె నాశిశు§పాలుఁ డిట్లు. 71

తే. ఏల చంపక విడుతు రి§లేశులార
వీని నొకప్రేష్య వధ్యుని § విటులవలనఁ
గన్న నేవురతోడ నిం§ దున్న ముసలి
రాచకన్నియతోడఁ బ§రాక్రమించి. 72

తే. పోర దివ్యుల గెల్చిన § భూరియశులు
మీర లటు చూచుచుండుఁడు § మిన్న కిపుడ
కదనరంగములం దే నొ§కఁడనె యున్న
బాపురే వీఁడు నాకంటఁ § బడఁగలండె? 73

ఉ. ఎల్లరు గల్గు నీసభను నీతని ధర్మజ భీష్ము లెన్నియో
పొల్లు లుపన్యసించి కడుఁ బూజ్యతముం డని రంతెకాని శౌ
ర్యోల్లస దాజిరంగముల నొక్కఁడ రాఁగఁ బరీక్ష కాఁగునే
కల్ల నిజంబు లాజి నెఱుఁగందగు మాటలతో బ నే మగున్? 74

క. ఈ గ్రిద్దగుఱుతువాని ర
జాగ్రభువిని దాఁకి శరచయం బదసీయా
సృగ్రసముఁ గ్రోల శేష ము
దగ్రగతిన్ బ్రావు విహగతతియున్ క్షితియున్. 75

ఉ. ఈగతిఁ దీవ్రపక్కి వచియించి, పృథాసుతు లంద జేకమై
"యేఁగకుమీ" యటం చనునయించుచుఁ బ్రార్థన సేయుచుండనే
యాఁగక, వారిపల్కుల ననాదరణం బొనరించి తత్క్షణం
బేఁగెను రచ్చ వీడి; యెలయింప నహంకృతి చాపలంబుఁ దన్.

తే. తల్లిచెల్లెలి కొడు కంచుఁ దాము పిలువ
నాగతుండైన యతిథి యం చలఘుశాంతి
పరులు ధర్మాధ్వచరులు నౌ పాండుపుత్ర
కులు దయాళువు లౌట మార్కొనర వాని. 77

తే. ఇచ్చ వచ్చినయటు చరియించునట్టి
చైద్యుఁ డల ధర్మజునిజన్నసాల వీడ
వెంటఁబడె నాప్త నృపసూను విసర మపుడ
యశ్వమేధీయ హయము వెంటాడినట్లు. 78

ఉ. వాయుజవంబులై చెలఁగు వాజుల నెక్కిన రౌతు లెంచతో
పాయక వెంట రాఁగ శిశుపాల నృపాలుఁడు రాజవీథులన్
బోయెడిపట్టులన్ దలిరుఁబోఁడులు వానిని జూచు కోర్కెచే
నాయతిఁ బర్వెలెత్త విఫలాశలఁ జేసెనుఁ వాఁడు వారలన్. 79

తే. ఔర! యిపు డేమి మూఁడెనో యని జనంబు
లొకరి కొక రాడుకొం చద్వమూవి నిమిష
మరయ రయమున శిబిరాన కరిగి జంకు
మాని సమకూర్చె సేన దుర్మాని వాఁడు. 80

చ. త్వరపడి శాంఖికుల్ వదన వాయువు బిట్టుగఁ బూన్చి యూఁదఁగా
గిరుల నితంబసీమల నొగిన్ బ్రతిశబ్దము లీనఁ జైద్య భూ
వరు రణయాత్రలోఁ జెలఁగు వారిజ భాంకృతు లొక్కపెట్టునన్
గరము నభంబు ముట్టె క్షణకాలములోపల దుర్నివారమై. 81

క. లోకాంతసమయ విశద
ప్రాకట గర్జనముఁ బోలి బహు గురురవముల్
వీఁకఁ గొని లో నడంచెడు
జోకను, రణభేరు లొక్కచొప్పున మొరసెన్. 82

క. శిబిరం బెల్లను మిగులఁ గ
జిబిజిమెయిన్ దిరుగునరులు చెలఁగఁగ నెంతేఁ
బ్రబలి నడయాడు చుక్కల
సొబగగు నంబరముఁబోలి చూడ్కికి నొప్పెన్. 83

క. జగములు గడగడ వడఁకఁగఁ
బగగొని శిశుపాలపక్ష పార్థివవర్యుల్
పొగ గప్పిన నగములవలె
తగు కవచము లంగములను దాల్చిరి వేగన్. 84

క. మందుఁ డయి లెంక కవచము
నందిచ్చుట కొక్కక్షణము యాలస్యము కాన్
గ్రందుకొను రోసమున దా
నిం దా నుసినుగ్గు చేసె నృపుఁ డొకఁ డంతన్. 85

క. కయ్యంపువేడ్క సేనల
నొయ్యన దలయెత్తు మేటియులివున మద మ
క్షయ్యముగఁ గురియు కరిపై
నయ్యెడఁ జవుదోలు వైవ నలసిరి జనముల్. 86

తే. మేలిబంగారు మోము పట్టాల వేవె
లుంగు బింబమ్ము ప్రతిఫలింపంగ లోని
తేజు వెలిఁగ్రక్కుచున్న రీతిని దనర్చె
నాయతాంగముల్ శ్రీపుత్రులగు హయములు. 87
(లక్ష్మీపుత్రో ఉశ్వ ఆధ్యశ్చ 'ఇతి వైజయంతీ' అని వ్యాఖ్య).

చ. గిరగిర చక్రముల్ దిరుగఁ గ్రిందికి మీఁదికి రేఁగునట్టి దు
మ్మరిది మొగిళ్లలై వెడల; నందులఁ బుట్టు గభీర నిస్వనో

త్కారములు గుండియల్ ప్రిదులఁగా మహిఁ బ్రాణులు సోలి వ్రాలున
ట్లలవఱసేయు పెన్పిడుగులై పరఁగం బఱచెన్ రథావళుల్. 88

చ. కలుగును విప్రయోగ మని గాసిలి యాసవ మాన మానినీ
తిలకము మానివేసినఁ దదీయగుణంబులె కల్గె; దుఃఖ మ
గ్గలమయి యప్డు చెక్కుళులఁ గావియుఁ, జూపుల సామువిప్పు, ప
ల్కుల సగమాడుటల్, మెయిని గూడిన బల్ వసివాళ్లు మీఱఁగన్.

క. మృగలాంఛిత మృగధరు భా
తిగ విలస దురశ్ఛదములు దేహము లలరన్
మగువలఁ గూడి నృపులు త్రా
గఁ గడఁగి రయథార్థ సిద్ధిగా మధురసమున్. 90

ఉ. క ల్లొకకంచుగిండి నిడి కమ్మని వాసన గూర్చ నాపయిన్
హల్లక మొండు నిల్పి పతి కాదట నీయఁగ వెత్తఁ బో నళుల్
మొల్లములై పయిన్ ముసరు భూరిభరంబున కోపలేక గా
సిల్లి కరంబునుండి యొకచేడియ వీడెను ధాత్రిపైఁ బడన్. 91

చ. తరుణవయస్కులౌ ప్రియులు తాము రణంబున కేఁగనుంటి మం
చురుతర ఘోరవార్తలను నొక్కెడఁ దెల్పినయంత వేగ బి
త్తరులకు నొక్కమాటయుఁ బదంపడి చొప్పడదయ్యెఁ గన్నులన్
దొఱఁగెడి నశ్రు పూరములతో బదులాడిరి వార లెట్టులో. 92

చ. బలసిన చన్నుదోయి బిగిపాటున నక్కున యుక్కుజోడు నొ
క్కులువడి తూంట్లుపోవునటు కోర్కులు మీఱఁగ గ్రొత్తజవ్వనం
బులు వెలయించు సైనికులు పోరికి బోవక ముందు డాసి యు
గ్మలులఁ గవుంగిటన్ గొనిరి గ్రావవిశాల కఠోరవక్షులై. 93

చ. ఒక యెలనాగ తన్ విడి ప్రియుండు రణంబున కేఁగువేళ న
శ్రుకణ మమంగళంబ యనుచున్ దడిపెట్టదు కంటఁ గాని పూ
నికమెయి చేయి చిక్కి యవనిన్ బడు బంగరుగాజుమాట య
మ్ముకురకపోల గుర్తెఱుఁగఁబో దళుభంబును మాన్పఁగల్గెనే? 94

ఉ. దవ్వు ప్రవాస మేఁగుట కెదన్ దలపెట్టిన నన్పుకాని, బల్
నెవ్వగ వల్దటంచుఁ దరుణీమణి తాను నవోఢ యౌట వా

క్రువ్వగ లేక కట్టెనఁట × కోమల పాదయుగంబు నేర్పుమై
మవ్వపు నల్లకల్వ విరి×మాలికఁ బోలిన చూపుసంకెలన్. 95

ఉ. పోవఁగ సిద్ధమైన యొక×పూరుష ధైర్యము విచ్చెఁ "దండ్రి యి
ప్డీ వెట కేఁగుచుంటి" వని × యేకట వచ్చియు రాని మాటలన్
దా వచియించు బిడ్డఁ గని×తన్వి యదల్చిన నేని దానితో
బోవక బాలుఁ డల్గి మును × ముందటివల్కులె మాన కాడుటన్. 96

ఉ. చివ్వకుఁ బోవు భర్తఁ గని×చెల్వ యొకర్తుక యింద్రలోకపున్
జవ్వని మిన్న కౌఁగిలి య×జస్రము నొందఁగ ధూర్త! చిత్తమం
దువ్విళు లూరుచుండు; విఁక×నొందెదులే ప్రమదంబు దానిచే
నెవ్విధి నైన నంచు గడు×నీసునఁ బల్కె వియోగభీతిచేన్. 97

చ. సమరము సేయు నుత్సుకతఁ × జయ్యన వల్లభుఁ డేఁగ నుండఁగన్
బొమలను వంచినట్టి విరి×బోణి కొకర్తకు తెప్ప లెంత య
డ్డము నొదవించి యాఁపినఁ గ×టా! పరుషాశ్రులు పొంగి పొర్లెని
క్కము వల పున్న నిష్కపట × కాంతల కిట్టివి నైజమే కదా! 98

ఉ. కాటుకకంటి నీ ర్నయన×కంజములన్ విడి పాఱఁగా నిరా
ఘాటము గాఁగఁ జెక్కుల ది×గంబడి జాఱినరీతు లే మనన్
జోటికిఁ జిత్తమందుఁ గల × శోకము పేరిటి కృష్ణవర్త్మ పెన్
బాటల కీడుజో డయి క×నంబడె నైల్యము పెల్లు మీఱఁగన్. 99

చ. అడుగులు కొన్ని సాగినను నాన×తమై బొమదోయి రంజిలన్
బడఁతుక కేలనుండి భువి×పైని దటాలునఁ బడ్డ బంగరుం
గడెమునఁగల్గు మ్రోఁత యొక×కట్టఁడి తుమ్మ్రనుబోలె సాహసం
బుడుగఁగఁజేసి యా పయిని × యోధవరున్ క్షణమాపె నయ్యెడన్.

చ. పుడమిని మింట నట్ల రయ×మున్ విడకుండఁగ సంచరించు నా
వడికిని నంగదట్టమును × బాసిన యట్టి వినిర్మ లాంశుకం
బడరఁగఁ బూర్ణిమా హిమక×రాస్య పథంబున నాభిముఖ్యమున్
బడసి కనంబడన్ బ్రియుఁడు × భావన సేసె మహోల్క మేమొ నాన్.

చ. కలనికిఁ బోవ వేండ్లు కుతు×కాన మెలంగిన నైన బిక్కమో
ములఁ బరిచారికల్ తమకు × ముందట నశ్రులు పెట్టుచున్న భీ

తిలదు ఖట్వాంగనాజనము తెంపున నాజికి భర్త లేఁగున
వ్వల నసువుల్ త్యజించుటకు వారలు సుస్థిరచిత్తలౌటచేన్. 102

చ. మరలఁగ సీతనిం గనెడు మంగళ మబ్బె దటంచు ముందుగా
నెఱిఁగిన దానిఁబోలె నొకయించుక తృప్తియు లేక చూపు లే
వఱకును భర్త వోవు నలబాటను బర్వెనొ యంతదాఁకఁ దో
నరసెను తెప్పవేయ కొకయంబుజలోచన యేఁగు వల్లభున్. 103

క. "అని కేఁగి సేమముగ ర"
మ్మని ప్రేమన్ బతికి నిచ్చు నాశీర్వాదం
బును వమ్మొనర్చెఁ గట! యాఁ
పిన నాఁగక యింతి కనుల వెలువడు నశ్రుల్. 104

సీ. కీర్ణ రజఃపుంజకీలిత దివ మట్లు,
కొందఱు క్షమ వక్త్రేందు లైరి
యుద్భ్రాంత సత్వులై యొకకొంద అంతర్ది
శల వలె నైరి శ్రీల్ తొలఁగిపోవఁ
గొందఱు సకలదిక్కుల వాత్యలవిధానఁ
దిరుగుచుండిరి యొక్క తీరు లేక
సైన్యముల్ నఱువంగఁ జాల వడంకెడి
ధరఁ బోలి వడఁకిరి మఱియు గొంద

తే. ఱివ లిటు చైద్యు జైత్రయాత్రావసరము
నందుఁ మున్ముంద దుర్నిమిత్తాళి భావి
జరుగఁ బోయెడి యశుభసంచయము నకట!
సూచన మొనర్చె నెంతయుఁ జోద్య మయ్యె. 105

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
శిశుపాలుని యసూయా వర్ణనాదికము ననెడు
పంచదశాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీ ర స్తు.

# శ్రీ మం దా ం ధ్రి మా ఘ ము

## [ శి శు పా ల వ ధ మ హా కా వ్య ము. ]

### షో డ శా శ్వా స ము.



—* శి శు పా ల దూ త వా క్య ము లు *—

క. పిదప శిశుపాలుఁ డంపఁగ
సదమున కొకదూత వచ్చి నరస పరుష తా
స్పదముగ శౌరికిఁ జెప్పెను
విదితోక్తి విదగ్ధుఁ డగుట వెల్లడి గాఁగన్. 1

తే. అటుల యప్రియ మాడి యత్యంత మను
శయంబు గని రోషయుక్తుండ వైన నీకు
మానన యొనర్ప నఖిమనుండై నితాంత
మభిలషించు చున్నాఁడు చైద్యావనిపతి. 2

తే. ఉన్మనుండైన చైద్య నృపోత్తముండు
విపుల విగ్రహ నిష్ఠుర పీడి తాంగు
నతిశ యాధిగ తాంగ నిర్వ్రతిని గాఁగ
ని న్నొనర్చి సంతోషింప నున్నవాఁడు. 3

క. నీదగు శాసన మొనరుచు
నొదల నేదఁగను బ్రణతుఁ డఖిల నృపులచే
నాదృతుఁ డగు జనపతి దా
మోదర! పరవంతుఁ డగుట నొక నీయెడనే. 4

మ. నియతస్వాంత సమర్థకర్ముఁడవు వహ్ని స్ఫార దుర్వార రు
క్ఛయ సంక్రాంత పతంగతేజుఁడ వశేషాజ్ఞాక రోత్సాహ ని
శ్చయకృత్యుండవు గాన నీ కెపుడు రాజన్యాంకు లెవ్వారు నీ
నయముం గాంచి నమస్కరించెదరు కృష్ణా వేయు నేలా యికన్.

చ. తవిలి పరాభిభూత జనతా పరిపోషణ మాచరించుచున్
భువిపయి పేరుమోసి వెలుపుం గన కింతయునేని కృష్ణ! భూ
ధవ! యెసలారు నీదుగుణతండ మగణ్యతఁ గాంచి మించెడిన్
నవతు వచింప నీకు సరిజంతువు కాఁనగరాద సృష్టిలో. 6

తే. అహితనామంబునకె భయంకరుండెద, వన
పత్త్రిపుండవు-నతిమాత్ర భగ్న సాధ్వ
సుఁడ వనాస్తికుఁడ వవిస్మయుఁడవు నౌదు
నిన్ను నౌరనెడి గుణవంతుఁడున్నె జగతి. 7

తే. గొల్లయిల్లాండ్ర రతికేళిఁ గూడిమాడి
వృషముఁ దెగటార్చి, పాప ధిక్కృతి నొనర్చి
వెలయు నీ చేసిన నరక విషయపుఁ బ్రతి
పత్తి యిత్తఱి జన తాభివర్ణ్య మయ్యె. 8

తే. నియతిఁ జేదీశుఁ డపచితి నిన్ బొనర్ప
రిపుబలంబు భయంబు గాటింప నరయు
చున్నత మహీభృ దౌ ఘోపరి న్నెలకొని
సానుచరుఁ డౌచు బ్రదుకంగ నౌను నీకు. 9

క. వనజ మృగాది వికీర్ణం
బును ఘనజాలాభ నాగపుంజంబులచే
తను నెందు దురాసదమై
తనుపగు నీనగరవీథితతి విలసిలుతన్. 10

చ. అతులిత ధీ వికారముల నందని నిన్ విడకున్న వైరి సం
తతమును నీతిమంతుఁ డగుఁ దాల్చుత వ్యాధి నతంబు, వ్యాపద
న్వితుఁ డగుఁగాక, యెల్లయెడ నిచ్చలు వోవు నవర్ధితోదయ
స్థితి సకలాపినద్ధ నిజధీ బల పౌరుష యుక్తుఁ డయ్యెడున్. 11

చ. సుర లలమంగఁ బజ్జ నవసుందర నీల సరోజపత్త్రి నే
త్రరుచులు కందళింప బహుధా వృత గంధముతో నవాసవ
స్ఫురణము గల్గఁగా నయినముచ్చటలన్ బ్రదు కెల్లఁ బోవుటల్
జరుగును శౌరి! చైద్యుఁడు చెలంగి ఘటన్ నిన్ఁ జేర్చిపేర్చినన్.

క. చలి తానక దుందుభివి, స
బలుఁడవు, సగదుఁడవు నై రణభసమున సమితి
స్థలి సహ సారణకేళీ
కలన నతని నభిగమింపఁగాఁ దగు నీకున్. 13

తే. ఆజియందు నమిత్రఘ్నుఁ డని ప్రసిద్ధి
గన్న శిశుపాలుతో నభిగమన మిపుడ
సలిపి యాదవనికురుంబ సహిత మీవు
చిరము విశ్వస్త యౌవతా శ్రితుఁడ వగుము. 14

క. జిత రోషగుణుని నసకృ
జ్జిత సంయతు సకల రాజశేఖరుల మహో
హితు సప్రమదుని నిను మా
క్షితిపతి కనుఁగాక సంతసించుచు భావిన్. 15

—* దూతకు సాత్యకి ప్రతివచనము *—

క. అని పగతు దూతుఁ డిటువలె
నని యూరక యుండఁ జక్రహస్తుని భ్రూసం
జ్ఞను జోదితుఁడై సాత్యకి
జనులు వొగడ మాఱుపల్కె సంరంభముతోన్. 16

చ. వెలికిఁ బ్రియంబు లోపలను విప్రియముం గదురంగ నీగతిన్
బలికినవాఁడ వైతి నిపుణత్వము నీదగు సొమ్మొ యై ననున్
గలిగిన యర్థముల్ తెలియఁగా బహిరర్థము లప్రియంబులై
యలరెడి నంతరార్థమె ప్రియం బవు మా కెటు లెంచి చూచినన్.

క. కడుఁ గోమల మొక్కెడ నొ
క్కెడను సరస వారిజాతవృంత పరుషమై
కడుకొని శాకపలాశము
వడువున నీనుడువు గాన వచ్చె నరయఁగన్. 18

తే. పైకి సరసము లోపలఁ బరుస మగు త్వ
దుక్తి మార్గవర్తులకు మాకొప్ప దెనయఁ
బైకి రమ్యమౌ పింగళ ప్రభృతి పక్షి
కులము కూఁత లొగిన్ బధికునకుఁ బోలె. 19

శా. కౌంతేయాగ్రజుఁ డల్లనాఁడు హరికిన్ గావించె సత్కార మం
చెంతో యీసున గ్రుంగునే యెవఁడుఁ జేదీశుండు తక్కొక్కరుం
డంతస్తాపము నొందువాఁడు గలఁడా యౌ నన్న మేల్తావి పూ
బంతిన్ జక్క శిరంబునందు వెరవొప్పం జేర్ప నెప్పట్టునన్. 20

ఆ. అల్పుఁ డప్రియమ్ము నంతరంగంబున
నడఁచుకొనఁగలేక వెడలఁ గ్రక్కు
సజ్జనుండు దాని స్వాంతంబునంద జీ
ర్ణింపఁ జేసికొని స్మరింపఁ డెపుడు. 21

మ. అనిశం బేరికినైన లగ్గులను జేయం బూనుచే చాల స
జ్జనుఁడై వాసియు వన్నె గన్నతని నైజం బెంచి చూడంగ; నం
దున వాఁ డొందిన యున్నతిం గనుచు సంతోషింప కింతేని మూ
ల్గును దుర్మార్గరతుండు డెందమున గగ్గోలొందుచున్ దానికిన్.

ఆ. పెఱల వృద్ధిఁ గని తపింపఁ డుత్తముఁడు, మ
ధ్యముఁడు మాటుకొనును దాని నాత్మ
నధముఁ డాహిత వ్యథాకులుఁడై బహి
ర్గత మొనర్చుఁ దన దురాశయమ్ము. 23

తే. తాపభరంబుఁ జోప దిఁకఁ దగ్గఫలంబు నొసంగ దెప్పుడున్
దోఁపద యించుకేని సుమనో రమణీయతతో నొకప్పుడున్
దేపకుఁ దేపఁ గాంచు నసతీత్వ మిసీ ఖలతా సమానమై
యేపఱఁ జేయుఁగా ఖలత? యేబుధుఁ డాసనొనర్చు దానికై. 24

క. బదులాడెనె హరి తను నా
సదమునఁ బడఁదిట్టుచున్న సాత్వతి సుతుతో
ముదిర ధ్వనికిం గర్జి
ల్లఁ దగుహరి సృగాలరుతములకు గర్జిలునే. 25

క. జిత రోషోద్గతులు మహా
మతు లనలఘుమతులు నా న్యమర్ష విజితు లా
జితుచేత విజితుఁడగు దు
ర్మతికిం బగ చాటఁదగునె మతిమంతులతోన్? 26

ఆ. ఓగు లాడుపల్కు × లాకవేళ రేఁగిన
దొడ్డవానిగొప్ప × తొలఁగిపోదు
మున్నుధూళి గప్పు × మాత్రాన వెలలేని
మానికంపు విలువ × మాయ దెపుడు. 27

తే. పరుల సంతోసపఱుపంగ × వరగుణ మ్మొ
కండు తనయందుఁ గల్గని × యొండి పరుల
లేని తప్పులు వట్టుచుఁ × బూని తన్నుఁ
గొల్చువారికి మోదమ్ముఁ × గూర్పఁగోరు. 28

మ. తనదోసంబు గణించుపట్ల జనుషాం×ధత్వంబు వాటించు నో
య్యనఁ జూడన్ బరు సూక్ష్మదోషముల ది×వ్యాక్షిన్ బ్రయోగించు వ
ర్ణనమున్ జేయును గొండగా స్వగుణమున్×స్వల్పంబునేన్, మానిరూ
పున నౌ నన్యగుణంబులన్ బలుకుచో × మూర్ఖుండు నిర్లజ్జుఁడై. 29

తే. పరుల దోషాలు కొండలై × ప్రకట మైనఁ
జిరము కప్పఁగా నేరిచి, × పరుల గలుగు
గుణలవంబుల నైనను × గోర్కు లలరఁ
బొగడతలఁ గూర్చి పేరొందు × సుగుణశాలి. 30

తే. తాన యొకరుండు నుడువఁడు × తనదు గుణము
సజ్జనుండు; జగ మ్మెల్లఁ × జాటుఁ గాని
తాన యొకరుండు నుడువును × దనదు గుణము
లల్పుఁ డది యెవ్వఁడును గొని×యాడ కునికి. 31

తే. మాటకారి కాని × పోటుమానిసి పగ
దీఱ విసపుఁబోటు × తీర్చి పొడుచు;
నట్లుకాక రజ్జు×లాడునాతఁడు డప్పు
మ్రోసినట్లు నోరు × చేసికొనును. 32

చ. అది యటులుండ నిమ్ము; నర×కాసురభేదిని చేదిభూమిపుం
డెద నెటు చేరఁగోరు? నటు×లే రయమారఁగఁ జేరనిమ్ము; త
త్సదృశ విధాన మప్డు కొన×సాగనె దీర్పఁగలేక యున్నఁ జూ
చెద మిఁకఁ; దారతమ్యముల×చే నొకవానికిఁ దీసిపోదుమే. 33

శా. ఓయీ! నీ విటు చూడు మీప్రభువు మాయుర్వీశుతో సంధిలన్
జేయంగా మదిఁగోరునే నిటుల సంసిద్ధుండుగా నేల? శౌ
ర్యాయత్తం బగుపద్ధతిన్ విడిచి దైన్యంబొంది క్షీతాత్ముపై
ధేయంబౌ గతిఁ జేకొనన్ హరి స్వబుద్ధిన్? నీవ వాక్రువ్వుమా.

ఉ. చాలని బుద్ధివాఁడు బలశాలులపైఁ గదియంగఁబోవు; దో
షాలఁ దనంతఁ దాను, దనచావును తెచ్చినవాఁడ యౌఁ జుమా
చాలఁగ వేఁడినాల్కల నెసంగెడి యింగలమో పతంగికా
జాలము గీడ్పడంగ సహజంబగు హేతువు స్వీయసంగమో. 35

ఉ. తొల్లి స్వయంబుగా సభను దుందుడు కొప్పఁగ నెన్ని యెన్నొ భూ
వల్లభుఁ డాడియాడి కొదువల్ పరిపూర్తిగఁ జేసి దూఱులన్
దెల్లము గాఁగ నూటిటిని నేఁటికి లెక్కకు నప్పగించె, సం
ఫుల్లసరోజ నేత్రునకుఁ బొందుగ దూతముఖాన నిత్తఱిన్. 36

చ. తలుపును ద్వారబంధమును దప్పిన గొప్పగు కోటగుమ్మమున్
బలె వెలుపైన నోటను నవాచ్యము లెన్నొ వచించినాఁడ వి
ట్టుల నిఁకఁ బల్కెదేఁ గడుఁ గడున్ జతనంబునఁ బాఁపికొన్న మా
యలుకకు భాజనంబ వగుదౌర! యెఱుంగవె యింత పుట్టుటల్. 37

క. అని యర్థ నిబిడముగ న
య్యనఘుఁడు శినిమనుమఁ డాడినట్టి వచనముల్
విని, రిపుఁ డనిపిన దూతుఁడు
మనమున భయ మింత లేకమరల నిటు లనెన్. 38

క. తమకు హిత మేదొ యది మం
దమతులు తా మెఱుఁగలే రితరు లొగి నుపదే
శము నేసినయేని, విచి
త్రము గలదే యింతకంటె ధర నరయంగన్. 39

ఉ. పండితుఁ డైనవానికి స్వభావముచేతన యైనఁగాక యొ
క్కం డుపదేశముల్ సలుపఁగా నయినన్ దెలియున్ సతంబు రా
నుండు నపాయముల్! దయ నొకొండు వచించిననేని దాను ద
ఱ్ఱండయియుండి గాంచఁ డెఱుఁగున్ మతిహీనుఁడు నెత్తిపైఁ బడన్.

క. నాపలుకు నర్థ మెల్లను
నీపట్లం గుశల మగుచు § నెగడుం గృష్ణా!
యాపదలోఁ బడ నున్నెడఁ దా
మై పరునకునేని దెలుప § రా హితము బుధుల్? 41

తే. సామముఁ దదన్యమును నొక్క § సారి సమతఁ
బలికితిని దొందరగ. నీవు § స్వగుణ మనుస
రించి విభజించి యొండు వ § రించి తెలివి
దేటలను నీవ జగతికిఁ § జాటుమయ్య. 42

తే. వ్యర్థ మగును దురాగ్రహా § వ్యక్తమతుల
పట్లను హితోపదేశంపు § భాషితములు
తరణి కిరణాల కలరెడి § తమ్మికొలని
పట్ల వితయగుఁగద హిమ § భానురుచులు? 43

ఉ. మంచియుఁ జెడ్డయుంగని ప్ర § మత్తుఁడు స్వేచ్ఛమెయిన్ జరించు; వాఁ
డెంచఁడుగా గుణాగుణము § లెన్నఁడు బుద్ధివిలాస మొప్ప వ
ర్జించి సభాస్థలంబున న § రేంద్రుని; ని న్నొకగొల్లవాని న
ర్చించెను భీమపూర్వజుఁడు § చెప్పెడి దే మిఁక మూర్ఖచెద్ధముల్.

తే. నీయెడల భక్తి గలుగు కౌం § తేయుఁ డర్చ
సేయకున్నఁ జైద్యుఁడు పూజ § నీయుఁడె సుమ
సింగ మామిష మెల్ల గ్ర § సించి విడిచి
నంత గజకుంభభవ మణి § యధమ మగునె. 45

ఉ. చారు వినిర్మలాకృతులు § చక్కఁగ నిర్మలులన్ దలందు సిం
గారమొనర్చుకొందు రధి § కంబుగ నెంత్రు మలీమసాత్ము లా
వార లధఃకరింత్రు; సుర § వాహిని శంభుఁడు మౌళిఁ దాల్పఁగా
శౌరి ధరించె దానినె వి § చారవిహీనతఁ బాదమందునన్. 46

తే. మూర్ఖ కుంతీసుతులచేతఁ § బూజ లప్పు
డందుమాత్రాన యోగ్యత § నొందఁగలవె
కోఁతి సీతునఁ జలి కాఁగఁ § గూర్చుకొనిన
పెద్దగురిగింజలకు నౌనె § వెచ్చఁదనము? 47

క. మావిభుని నూఱుతప్పుల
నీవు క్షమించితివటంచు చనెను సాత్యకి, ము
న్నావగ రుక్మిణి దొంగిల
మావిభుడు క్షమించుతప్పు మఱఁపదొ వానిన్. 48

ఉ. ముద్దుమఱంది నీ కితఁడు, భూమిపుఁ డాపయి; వాని కాలిఁగ్రా
ముద్దియ నీయరే గురులు? మ్రుచ్చిలి తెచ్చితి దాని, ద్రోహివై
సుద్దియు బద్ధముం గలదె; శూన్యము నీయెడ ధర్మమర్మముల్
దద్దఁడుఁ జిత్తజాతునకుఁ దండ్రివి గాఁదగు దీ వొకండవే! 49

ఉ. కోకిలతెక్కఁ బిక్కటిలు గొప్పగు నీలిమ కాలవాలమై
వాకొనరాని రూపముల వావిరి సర్వజగంబు నిండు బ
ల్చీఁకటిగుంపుఁ బోలు నిను జేదినృపాలకుఁ డంశుమాలియై
లై కెడయించు, నాపలికి నంతయు సత్యము; నమ్ముమీ హరీ. 50

ఉ. పట్టఁగరాని యల్క శిశుపాలుఁడు నీయెడఁ బూని యుంట నే
నెట్టుల యట్టియల్క శమియింపఁగ వాకొన నేర్చువాఁడ? మి
న్ముట్టి యుగాంత కాలమునఁ బొంగెడు సంద్రము నేమిచేయు బల్
గట్టులలోనఁ బాఱెడు జగజ్జలనిర్గమ మార్గసంహతుల్. 51

చ. అయిన నిఁ కేల వచ్చి తని యంటివయేని నిజమ్ము చెప్పెదన్
రయమున యాదవాళి సమరం బొనరింపఁగ రం డటంచుఁ జె
ప్పి యరుగుదెమ్మటంచు ననిపెన్ నను జేఁడు ప్రతాపదీపితా
శయులు మలిమ్లుచుల్వలె మిషంబున వైరుల కెగ్గొనర్తురే? 52

ఉ. గుబ్బలికొమ్మునుండి దిగు ఘోరఝరీ సలిలప్రవాహమ
ట్లుబ్బర మొందఁగాఁ బెను రయంబున నాఁపఁగరాని రీతితో
నబ్బలియుండు నిన్నలమ నాయిత మయ్యె నయంబు నేర్చి బల్
ప్రబ్బలివోలె నుండుము చిరంబుగ; నిల్వకుమా ద్రుమంబటుల్. 53

క. శిశులనె పాలించుటఁ గనె
శిశుపాలాఖ్యా నని విశ్వసింపకు, పాలిం
చు శర ణని వచ్చు పగతురఁ
బ్రశమమున క్షమించి పడుచువారల నైనన్. 54

క. స్వార్థపరు లరు లౌవర్తు ర
నర్థముల నశంకముగ మహాత్ములకేన్! ర
జార్థ మెవఁడేని మ్రొక్క, స
మర్థుఁ డతఁడు కుపితుఁ డయ్యు మనుచున్ గరుణన్. 55

ఉ. వీనుల కప్రియం బయిన విన్నది నీకు హితం బగున్ వెసన్
దీని గ్రహించి చేయుము సుధీమణి! సంధిని, గానినాఁడు నీ
కౌనుజుమీ వినాశము! ప్రియంబున సత్యమునే గ్రహింతువా
మానక గల్గు గెల్పును, సమగ్రతరాయువు భూపతిత్వమున్. 56

క. పెక్కుర రక్కసిఱేండ్లను
జక్కాడిన నిన్నెగెల్చు జన్యంబున దాఁ
జక్కన రాహ్వాఖ్య తమము
దక్కఁగ మ్రింగదె తమోవిదాహకుఁ దపనున్. 57

ఉ. ఖండనతాండవంబుల నభంగురభంగి నటించి, సంగరో
గ్రుం డయి సూనసాయకహరుం డయి సంగత భద్రుఁడై బలో
ద్దండ గణార్పిత ప్రణతిదామ పరుం డయి నిర్జితాంధకా
జుం డయి వేగ మావిభుఁడు శోభిలుఁ గేవల శూలిలీలలన్. 58

తే. దుష్టకుంజర వధ సముద్భూత భూరి
కీర్తి యగు * హరి పైన నీకే భయంప
డండు మాశిశుపాలుండు భండనమున
నన్న • వృష్ణిచయంబు మాకెన్న నేల? 59

మ. అరిరాజుల్ శిశుపాలు నాననము జన్యంబందునన్ దద్ద ద
ద్దరిలన్ జూతు రటన్న మాట యొకచిత్రం బౌనె? యా భూమిభృ
ద్వరుఁ డీక్షించినమాత్ర భీతు లగుచున్ ధావించు వైరిక్షితీ
శ్వర పృష్టంబులె కాని వక్త్రములఁ గాంచం డంచు ఖ్యాతిన్గనన్.

తే. ప్రతను లస దచిరద్యుతుల్ పటుతర శర
దాశ్రయ బలాప్తిచే ఖండితాయుధ తతు
లగుచు నాసారభృత్తులై యలరె నేని
జలదఘటలు తద్వైరుల సామ్య మెనయు. 61

* హరి = (1) సింహము (2) కృష్ణుఁడు

• వృష్ణులు = (1) యాదవభేదము (2) మేఁకలు-అని శ్లేష.

తే. యుద్ధభూమిని రేఁగు దుమ్మెల్లఁ గ్రమ్మెలసి మలిన
మైన యానృపు చరణద్వయంబు వైరి
కాంత లశ్రుప్రవాహాలఁ గడిగివైవఁ
బూయుదురు మౌళిమణిరుచిన్ భూమిపతులు. 62

తే. కదన మొనరింప నొకమాట గాటముగను
వింటి నాతఁడు పంప నావింటితోనె
పగఱకౌల మెల్ల "భంగింపఁబడెద" మనుచు
నళికి, యానతిఁ గాంచెద రద్భుతముగ. 63

తే. "మంచువెలుఁ" గంచు హితులును "మంట మారి
వేలు" పంచును నహితు లవ్విభుఁ దలంత్రు
గారడీనిచే దృగ్భ్రమఁ గన్న జనము
త్రాడు స్రజమంచుఁ, బాఁమంచుఁ దలఁచునట్లు. 64

తే. అక్షయప్రాప్తిచేత నేకాంతరతము
చే నమానుషకాయమ్ముచేత వేల్పు
లౌట భువి నిల్వ స్థానంబు లంద కతని
వైరితతి నాకమున స్థిరావాసు లైరి. 65

తే. అచ్చెరువు పుట్టఁగాఁ జేయు నతనిపౌరు
షమ్మునేఁ గానరాఁ డొక్క శత్రు వేని
నయవిదుం డైనయాతఁ డక్షయ మగు రిపు
కులము నొందించు క్షయ మనావిల మనీష. 66

తే. పైకిఁ దేలు కబంధ సంపదలఁ బొదలి
యసులభ మకరవ్యూహ దుర్గాధ్వము లగు
విపుల రణసాగరముల భూవిభుఁడు పెక్కు
మాఱు లీఁదెను తనభుజసార మహిమ. 67

క. ఉర్వీశుఁడెవఁడు తనతల
గర్వంబునఁ జైద్యు కాళ్లకడఁ జేర్పఁడొ యా
దుర్వృత్తు నెత్తిమీఁద న
ఖర్వోద్ధతి నాతఁ డెడమకాలిడి త్రొక్కున్. 68

చతురంగబలములే, కా
యత భుజయుగ మాయుధముగ ౹ నైంద్రగజముతో
నతఁ డొనరిచెఁ బలుమఱు, ను
ద్ధతిని జతుర్దంతమైన ౹ యాహవ మహహా. 69

ఎసఁగును జారుచక్ర మది ౹ యిర్వ్వరకున్, సిరి మెచ్చి కౌఁగిలి
చ్చి సవు రొసంగు నిర్వ్వరకుఁ, ౹ జిత్ర మగున్ సమభావ మిట్లుగాఁ
బొసఁగిన మీకు నిర్వ్వరకుఁ ౹ బొల్చెడి భేద మొకం; డుపేంద్రుఁడై
మసలుదు వీ వతీంద్రుఁ డయి ౹ మానరనాథుఁడు దాను బేర్వడెన్.

ఇరువు రహీన భోగపరు ౹ లిర్వ్వరు భూతి భరించు వారు ద్వి
ట్పురము లనేక మిర్వ్వరును ౹ బూవి యొనర్చిన వీరముద్రికా
ధరులు హరుండు మానృపతి ౹ తథ్యముగా నొకభేద ముండె భూ
వరుఁ డగుఁ బూర్ణచంద్రరుచి ౹ భర్గునకో రుచి చంద్రరేఖికన్. 71

(సర్వతఃప్రాస సీసము)

భంగంబు నొందించు ౹ రంగదుద్ధతి నుత్త
మాంగంబు లెత్త న౹భంగురగతి
వంగి భూమీతలం౹బుం గడు భుజశాఖ
లంగంబు లంట, నె౹త్తుం గడంగి
చంగున మండలం౹బుం గంటుచేసి మూ
లాంగంబులను ద్రవ్వి ౹ క్రుంగఁజేయుఁ
దుంగపత్త్రోద్గతు౹లం గొన్ని తనకు వెం
టం గూర్చుకొను బల్మి ౹ పొంగులెత్తఁ

తే. జెంగట దృఢప్రతిజ్ఞ ను౹ప్పొంగుచున్న
ముంగలిగఁ బ్రాతికూల్య మ౹డంగఁజేయు
సంగరంబుల నారాజ౹పుంగవుం డె
సంగి రాజకముం జెట్ల౹నం గలంచు. 72-75

సీ. అతులోపలశ్రేణి ౹ నలరారి సంరుద్ధ
సాంద్రాంబరాప్తి మిం౹చంగఁ గాంచి
యలఘు నితంబ పా౹ళుల విరాజిలుచు మే
ఖలలఁ దీర్చి సతంబు౹గాఁ జరింతు

రభినవ ముక్తాఫఽలాభరణమ్ములొ
భుజములఁ గటకముల్ ఽ పూనుచుండ్రు
స్నిగ్ధ గండస్థలీ ఽ చిత్రకంబుల నెడఁ
బాయ కెప్పుడు మురిఽపములఁ గండ్రు

తే. భూధరేంద్ర మూర్ధంబులఁ ఽ బొలుపుమీఱ
రేపులను మాపులను విహఽరించుచుండ్రు
నేఁడు విధవ లయ్యైన నాఽనాఁడు సధవ
లైనతఱిఁబోలె శిశుపాలు ఽ నరుల యాంధ్రు. 76_78

క. ఘన కుకురాంధక తరువుల
వనశిఖివలెఁ గాల్చియు నఽవని నెల్లను గృ
ష్ణునిగా శిశుపాలుఁడు చే
యు ననుటకంటెను విచిత్రఽమొక్కటి గలదే. 79

ఆ. అతని యానతి ప్రమిఽతాక్షరమయ్యు స
మస్త విషయములను ఽ వ్యాప్తిఁ గని ప్ర
తిష్ఠఁ జెంది యప్రఽతిహతమై పరిభాష
పగిది మెఱయుఁ జెప్పఽనగునె తలఁప. 80

చ. పుడమిపడంతి రక్కసులు ఽ ముష్కరులై వెనుకోఁగ నంబుధిన్
బడెను బురాణపూరుషుఁడు ఽ పాపము రూపఱఁ బందిరూపుతోఁ
గడుకొని యుద్వహించెఁ ద్రుటిఽకాలమ యక్షతఁగా క్షతారి మా
యొడయఁ డెఱింగి యుద్వహనఽమూన ధరిత్రి సుఖించు నిప్పుడున్

ఉ. లెక్కకు మీఱి భారతరఽలీలలఁ దేఱి మహోన్నతాభ పెం
పెక్కఁగ జాలువాఱి యుదఽయించు, నృపాల గుణోర్మిమాలికల్
చొక్కక పారమొంది నిలుఽచున్ జలరాశి మహోర్మిమాలలోఁ
గ్రక్కున శీర్ణమౌచు నడఁఽగారును బారముఁ జేర సారెకున్. 82

శా. లోకాలోక నిరుద్ధ రుక్చయ మహాఽలుంఠంబు లౌటన్ విశా
లాకాశైక మణీద్య తేజములు లోఽకానీకముల్ చూడ బల్
వీఁకం దాఁకవు సిగ్గునన్ బఱెను భూఽభృద్బృందమున్ జేదిరా
జైక ప్రాకట తేజ మన్ననో సదాఽవ్యాపించు భూభృత్తతిన్. 83

సీ. ఒడలిపై గంద మే। యెడఁ బొందు విచ్చిత్తి
        పెదవి లత్తుకరంగు । భిన్న మగును
అచ్ఛంబు లయి పతి।తాంజనం బగు కనుల్
        పిఱుఁదుల మేఖలల్ । పెరిఁగిపోవుఁ
గుంభి కుంభోన్నత । దంభముల్ సవరించు
        మానిత వక్షోజ । మండలమున
ధాళధళ్యాత్త ము।క్తాహారదర్శనం
        బగును నిచ్చలును నెం।దరుగుచున్న

తే. నిటల నిత్యవిభూషలై । యెసఁగుచంద్రు
సంప దాపదలన్ భిదాం।శంబు లేక
శత్రువన దావవహ్ని యౌ । చైద్యనృపతి
పగతు రైనట్టి భూతల । పతుల సతులు. 84

మ. స్థిరుఁడౌ మాశిశుపాలుఁ డూర్జితబల । శ్రీలుండు దండెత్తి ని
న్ను రణక్షోణి వధించు నీక్షణమునం।దున్, నీవు చావంగ నీ
తరుణుల్ పెల్లడలంగ నీదయిన బు।త్రవ్రాతమున్ బుజ్జగిం
చి రహిన్ దా శిశుపాలనామము విభా।సిల్లన్ జరించున్ జుమా! 85

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్యప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
శిశుపాలదూత వాక్యములు, దూతకు సాత్యకి ప్రతి
వచనము, మరల దూత వాక్యము ననెడు
షోడశాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీ ర స్తు.

# శ్రీ మ దాం ధ్ర మా ఘ ము

## [ శి శు పా ల వ ధ మ హా కా వ్య ము. ]

## స ప్త ద శా శ్వా స ము.



### —* కృ ష్ణ స భా సం క్షో భ ము *—

చ. విలయ సముద్భవోచ్చలిత భీకర వేగ సమీర ధీరమై
యలరెడి పల్కు వాక్చతురుఁ డౌ నలదూతుఁడు పల్కఁ దత్సభా
స్థలి కలగుండు నొందె నుదిత ప్రళయార్ణవ భంగ ఘుంఘుమో
జ్జ్వల మయి యాక్షణంబున దిశావలయం బనయంబు కంపిలన్.

సీ. అల రావి చివురుల చెలువంబు గా దనఁ
గల మించు లీను రాగంబుతోడ
నుడికిన నోడ లెల్లఁ దడుపఁ జాలుచుఁ జాలఁ
జొఱఁబాఱు చెమ్మట సోనతోడఁ
గరములఁ జఱచిన ఘననాద మొదవెడు
పృథు లోరుపీఠంబు పెంపుతోడ
మాటిమాటికిఁ బల్లు నాటంగ నెఱు పెక్కి
పొదలుచున్నట్టి కెంపెదవితోడ

తే. రూపమును గాంచి విభ్రమరూఢ మైన
విందు లొనరించి మించెడి వెలఁదుకవలె
కోపదేవత సేవింపఁ గూర్కు విడిరి
సభ సుఖాసీను లైన రాజన్యవరులు. 2

చ గదుఁ డనుశౌరి సోదరుఁడు కట్టలుకన్ దన జబ్బమీఁద న
య్యదనఁ గరంబునన్ జఱవ నక్కడ నొప్పులు గుల్కఁ దాల్చు నం
గదములు వ్రీలఁగా నదరు గగ్గెను దద్గత శోణ రత్నముల్
చెదరఁగ ముక్కలై వడియెఁ జిందు రుషాగ్ని స్ఫులింగముల్ వలెన్.

ఉ. దారుణ కోపవహ్ని యెడఁదన్ జ్వలియింపఁగ నెఱ్ఱరంగు సిం
గారములన్ దనర్చు నిజకాయమునన్ బలరామదేవుఁ డ
య్యారె! యటంచు దంత జనితాంశు తతిన్ దిశలెల్లఁ గప్పి దే
హారుణిమంబు మాన్పి తెలుపావహిలన్ గయి సేసె నవ్వునన్. 4

చ. చకచకఁ జైద్య దూతపయి సాగ మెడన్ గల తారహారముల్
గకపిక లౌచు సుళ్లపడి గాసిలఁ జేయుచు మించునట్టి యు
ల్కకుఁ దెఱఁగించె ముందు జగముల్ శిలకంపెను గట్టిదైన వీ
ని కఠిన బాహు ఘట్టనము నెక్కొన నిట్లు భ్రమించు నంచొగిన్.

తే. తత్తఱించు నల్కను యుధాజిత్తు మోము
వేఁడియూర్పుల నెగడి వజ్ఞోడు చెమట
జిలుఁగుచలువ నెంత వీచినను సారె
కడఁగ కంతంత హెచ్చుగాఁ బొడమ నెగడె. 6

చ. కడుకొని వైరిఁ ద్రుంచు తమకంబునఁ బుట్టినయట్టి రోష మన్
జడధి మునింగి లేచి తనశక్తి యెఱుంగని యట్టి నైషధే
శుఁడు; మును దక్షయజ్ఞమును ద్రుక్కఁగఁ జేయఁగ లేచినట్టి య
య్యుడుపఁగరాని రుద్రుజ్వరమో యనుచున్ జను లెంచఁగాఁదగెన్.

ఉ. మానుపరాని కోపమున మండుచు రెండు కరంబులన్ సుధ
న్వానుఁ దొకంట నొంట నలుపంగ నిజాంగుళలం దలిర్చుచున్
జానగు నుంగరాలు మణిజాలములున్ బొడి గాఁగఁ బంకిలం
బైన కరంబులన్ గడిగె నాతఁడు తద్గత ఘర్మవారితోన్. 8

చ. బగబగ లాడు మంటలను బర్వెడి యుల్మకరేఖ లోక మే
ర్వఁగఁ దగఁ జుట్టుద్రిప్పు గతిఁ బావకకీలను బోలు గోటి పె
న్వగలఁ జెలంగు తర్జనికొనన్ బరివేషముఁ బోలి తేజ మె
చ్చఁగ నల యాహుకిప్రభుఁడు సారెకుఁ ద్రిప్పె భయానకంబుగన్.

మ. దురమున్ జేయఁగ వాఁడిముల్కులను బ్రద్యుమ్నుండు చేపట్టని
ష్ఠురమై యొప్పు తదీయరూపము నెవండున్ జూడ లేఁ డన్న ద
బ్బుఱగా దానుడి; తొల్లి యమ్మదనుఁ గాల్పన్ గన్న ముక్కంటియున్
బరుషంబైన తృతీయనేత్రమున సందర్శింప లేఁ డయ్యెడున్. 10

ఉ. ఎన్నఁడు వచ్చు సంగర మదెన్నఁడు సేయుదు నంచు నుర్విశుల్
గ్రన్నన నూరుచుండు పృథురాజు వెసన్ నిమిరెన్ వధూజనా
త్యున్నత కర్కశ స్తన తటోద్ధుర మర్దన సంప్రముష్ట చం
చ న్నవ చందనంబయి విశాలము నౌ నెదఁ బుట్టు గగ్గుఱున్. 11

మ. అతినీచంబగు చైద్యదూత పరుషవ్యాహారముల్ సోఁకఁగా
"నతిశాంతుండు గురుం"డనన్ జనెడు నయ్యక్రూరుఁ డాత్మీయమౌ
స్థితి లంఘించి క్రుధావశాత్ముఁ డగురీతిన్ గాంచి కల్పాంతమా
రుతముల్ పుట్టి గిరుల్ చలించు ననుచున్ రూపించినా రెల్లరున్.

తే. మద కలుషితాక్షి యుగముఁ బల్మాఱు ద్రిప్పు
చవనిఁ గరమున దారుణారవము పొడమ
నడఁచుచుఁ బ్రసేనజిత్తు కోపారుణాకృ
తిని బొలిచె గైరికారుణ ద్వీపము వోలె. 13

ఉ. కుంకుమ పంకిలంబు లయి కొబ్బున జాఱెడు స్వేదబిందువుల్
పొంకము మీఱు దాడిమలఁ బోల్చెడి యెఱ్ఱఁదనంబు చెంది క్రో
ధాంకుర ఖిన్నదేహ బహిరాగత శోణితబిందు రాజి నా
సంకలితంబు లయ్యె నునుఁజాయ గవేణుషుఁడన్న జేనికిన్. 14

చ. శినినృపుఁ డట్టె కట్టలుకచే నలకాలను దన్ని బీటవా
ఱిన క్షితి బల్పగుళ్ల రవిఘృష్టు లతోభువనంబు జొచ్చి యం
దనయము చల్లఁగా బ్రదుకునట్టి భుజంగమకోటి కెల్ల మున్
గని వినవట్టి తాప మెసఁగన్ వెలుగొందఁగఁ జేసె నెల్లెడన్. 15

ఉ. సారణభూపపుంగవుఁడు సారెకు రోషముచే శిరంబు నే
పారఁగ నూఁపి యూఁపి తలయందు వెలుంగు కిరీటరత్నభాః
పూరము లిట్టునట్టు నొఱపుల్ గనఁ ద్రిప్పె నశంక మీనృపుల్
పోఁకికి నేగుచుండి రనిముందు నివాళిని బట్టెనో యనన్. 16

చ. ఎనసినయల్క బాహులత లిట్టటు లెత్తుచు నేమొ యేమొ బ
ల్కెను మదిఁ గోరి కేవలచలంబగు నాల్కను నోటిలోనె దా
ల్చె, నల విదూరదాధిపుఁడు చిత్తభయంకర సర్ప మొక్క తో
ఱ్ఱను దిరుగాడఁ జూడ నయరాజిలు భూరుహరాజుఁ బోలుచున్. 17

క. పగతుని దుర్వచనముల క
లిఁగి కలఁగిరి తక్కునృపులు § లేశము హరి దా
బెగడఁడు; వానల నేళ్లు క
లఁగుఁ గానీ సాగరము క§లంగునె యెపుడేన్. 18

క. పొగడికొనుఁ దన్నుఁ బెఱలన్
దెగడుఁ దులువ యనుచు నెంచి § దేవకికొమరుం,
డు గనఁడు వికృతి నవిస్మితుఁ
డగుటను, నుద్ధవుఁడు సస్మి§తాననుఁ డయ్యెన్. 19

క. కుపిత యదు ధిక్కృతిం గని
రిపుదూత చనన్ మురారి § రిపుభయదంబై
న పటహమున్ మ్రోయించి, పి
దప, రణసన్నాహ కార్య§తత్పరుఁ డయ్యెన్. 20

—* యాదవ సేనా సన్నాహ వర్ణనము *—

తే. పలురణంబులఁ బగఱయ§మ్ముల వృథాక
రించి స్థిరములు శౌర్య పూ§రితములు నగు
తనువులం దుక్కుకవచముల్ § దాల్చి, రాజి
నీతి యని, మాత్ర యాదవ§నృపతు లపుడు. 21

ఉ. పో రనుమాట విన్నపుడు § పొంగిన యంగములోని భాగ మే
పారఁగ నిండి పైకుబికి § యాపఁగరాక యెసంగి సంతసం
బూరక వెల్లివాఱు వెలి§నొప్పెడి కంచుకముల్ క్షణంబునన్
జారుశరీరమం దమరు § జాడయుఁ గానఁగరాదు వారికిన్. 22

క. కరులఁ దురగముల రథములఁ
ద్వరతో సవరణలఁ దీర్చి§త త్తత్పురుషో
త్కరము దరిఁ జేరుకొని తొం
దరపెట్టఁ దొడంగి రపుడు § నరనాథవరుల్. 23

ఉ. ఝిట్టు కల ధ్వనుల్ నెగడ § వీనుల విందొనరించు భృంగస
మ్రాట్టుల గానముల్ వినుచు § మార్తుర డీకొన బద్ధకక్షమై
దిట్టతనాన హస్తపిత§తిన్ నలిలంబుల ధార లొప్ప న
ప్పట్టున దంతిరాడ్ఘటల§పారముగా వెలలించె దానముల్. 24

చ. సితతర దంత చారురుచిఁ జెల్వగు మేఖల మార్దవ స్ఫుర
న్నతతను విభ్రమైక పరిధానముతోఁ బులకప్రకాండ మ
ద్భుతముగఁ దాల్చి మేలి, యసిపుత్రిరణోత్సుకుఁ డైనపూరుషున్
ద్రుతగతిఁ గౌఁగిలించె ధృతితోఁ గుతుకన్ ప్రియురాలివైఖరిన్.

చ. సురుచిర మూర్తినున్న యెడ సుందరమూర్తులఁ దాల్చి యాజిభీ
కరుఁడగు వేళ భీకరముగా నగుచున్ హరియందనపాయు లౌట నా
హరి దరిఁజేర వచ్చెను నిజాయుధరత్నము లెల్ల నేకమై
యరయఁగ నవ్వి యన్నియును నాతని మూర్తుల కావె ఘేమనన్.

క. అట నిరుదెస భూమీభృ
త్కటకంబులు నిగుడ నడుమ గరువమున భిశం
కట ధృతి హరి యెక్కె రథము
పటురాక్షస హృదయ రుధిరపాయిప్రథిఁ దాన్. 27

క. సరిలేని పెద్దతెక్కవి
సరునన్ బలుగాలి పుట్టి స్తంభము గదలన్
మెఱసె ధ్వజాగ్రమునందున్
గరుడి స్వతనుకాంతి దిఙ్ముఖము లెఱుపెక్కన్. 29

—* సేనా ప్రస్థాన వర్ణనము *—

క. ఉలివున మద్దెలనాదము
గెలిచి, పగతుఁ డనెడి యంచ గీడ్పఱచి ముదం
బలవఱిచి కేకిమూఁకకు
బలుమొయిలుం బలెను రథము పయనం బయ్యెన్. 29

ఉ. ఎల్లెడ సాంద్రమై యరుగు కృష్ణు విశాలబలంబులన్ జగం
బెల్లను గన్నులారఁ గని యేడ్తెఱ నింగిని భూమి ముంచు ద
ర్పోల్లసనంబుఁ గాంచు ప్రళయోదధి మేరలు మీఱునట్టి పెన్
వెల్లి యె టుండునో యనుచు వేఱుగ నారయఁగోర రెవ్వరున్. 30

మ. కరిరా జొయ్యన ఘీంకరించెను, దురంగస్వామి బల్ హేషలన్
ద్వర మోచం బలరంగఁ జేసెను, రథోత్తంసంబుఁ గల్పించె సుం
దరమౌ మర్దల మంద్రనాదములఁ, దద్రావంబులన్ శైలకం
ధరముల్ బిట్టు ప్రతిధ్వనించె ధ్వని కాధారంబు మిన్ ప్రీలఁగన్.

ఉ. శూరజనాగ్రయాన మయి శోభిలుచున్న మురారి సేనలోఁ
ఘోరముగాఁగ మ్రోయ జయదుందుభి; తద్ధ్వని గబ్బిగుబ్బలుల్
చారు గుహాముఖంబులను జయ్యన వెల్వడు సింహపంక్తులన్
సౌరు జనింప సారె ప్రతిశబ్ద మిషంబున నవ్వఁ బెల్చనన్. 32

చ. బలము లొనర్చు మేటిరొద పర్వి సుమేరుగిరీంద్ర కందర
స్థలులఁ దమిన్ విలాసములు సాగఁ జరించు దివౌకసాళికిన్
జలమునఁ గూర్పఁగాఁ జెవుడు సౌరవిలాసవతీ రతాంతరో
జ్జ్వల మణిత ధ్వనుల్ వృథగ సాగెఁ జెవుల్ వినలేమి నయ్యెడన్.

చ. మురరిపు జైత్రయాత్రలను మ్రోసెడి తూర్యరవంబు విన్న య
చ్చరపడుచుల్ జగా సొగసు జగ్గు వగన్ గయిసేసి పట్టు స
న్నరకపు వల్వ గట్టి బలు నాణెపు దీప్తులు దోఁప ముంగిటన్
వరలుచుఁ దొంగి చూచుచును వార్తురు వీరభటాళి రాకకై. 34

మ. 'యతయాతంబు' లటన్న మర్మముల వేదండాగమంబందు ధీ
యుతులౌ మావటివాండ్రెఱుంగుటను నేర్పొప్పారఁ దోలన్ గజ
ప్రతతుల్ పాణుల నొక్కమాఱు కదలింపన్ నాశికల్, మాన కు
న్నతి గంటల్ రవళించుచుండ నడచెన్ గంభీరయానంబులన్. 35

మ. కడుఁజోద్యంబుగఁ గూర్పఁ బడ్డ బలుసింగారంబుతో లీల చొ
ప్పడఁగా నజ్జల వేయు నేర్పునను నిట్టట్టుల్ జలింపం గడున్
బెడఁగుం గాంచు తురాయితో ఖురములన్ వే లేచు పెన్ధూళితో
బడబానీకము సాగఁగా నరయు నెవ్వం డన్య మింతేనియున్? 36

సీ. వ్రేలన్ మెదల్చి బల్ కేలన్ గదల్చి పీన్,
సొమ్ము లాడఁగను నృత్యమ్ము లాడు
మదపునిగ్గులు వాఱ మధుపవేణులు జాఱ
డంబు తీపులను గానంబు వాడు
ఘూరజంబులు తడియాఱగాఁ బూర్ణకుం
భముల మదాంబు పూరములు వీడు
చెవులపండువులుగా నివుడు రవము లుబ్బఁ
జెలి గుల్కుపల్కుల వలెనె నాడు

తే. నంబరము ముట్టి చెల్లాడు § నంచులు గల
కేత నాంబర సంపత్తి§చేత మెఱసి
యెదిరిపై నేఁగు కృష్ణుని § యెదుట మంగ
ళాచరణముల నొనరించు § హస్తిఘటలు. 37

తే. ఘనతరం బగు సైన్య మె§క్కడకొ తరలి
పోవ విడిపట్టు శూన్యమై§పోవ దింత
ప్రలయమున నీరు భూమిపైఁ § బాఱి పొంగ
రిత్తయై పోవునాక్కో స§రిద్విభుండు. 38

క. హరి చనఁగోరు దిశన్ రిపు
ధరణీవరు సేన పర్వఁ§ దనరిన ధూళుల్
గరము పొగవలెను ముది కా
సరపున్ శృంగంబు వలె నె§సఁగె ధూమ్రంబై. 39

క. తనసేన మ్రోయు తూర్య
స్వనములు మాఱ్మ్రోసి యయినఁ § బరరణభేరీ
ధ్వనివలె వీరునిమనమును
బెనగొని యాకర్షణంబు § పెనుపవ యింతేన్. 40

క. హరివరుని కుఱంగటఁ బట
హరవమ్ము చెలంగఁ బొంగు § నంగముతోడన్
బరసేన సంతసము గనె
వరవర్ణిని వరునిచెంత§వలె డెందమునన్. 41

తే. పిదప గాలికిఁ జెలరేఁగి § పెడలు ధూళి
పర్వఁ మాలిన్య మొందిన § వైరిసైన్య
కేతుతతి నింగి నిండారి § కేవలమ్ము
ప్రలయకాళిక కెన యయి § ప్రబలె నపుడు. 42

తే. ప్రతిముఖం బగు రవితేజు § ప్రతిఫలింప
భీకరం బగు కరవాల § వితతి దుర్ని
రీక్ష్య మయ్యెను బరసేన § కృష్ణుసైన్య
ములకహో! దర్శనీయత్వ§మునఁ దనర్చె. 43

క. గగనమున జరుగు మొగిలున
నగు నీడటు భూమి నలమి యటు పల్లంబున్
దగ మిఱ్ఱనక క్షణంబునఁ
దెగి కృష్ణ చమూపయోధి తేజము గాంచెన్. 44

ఉ. జేనెఁడు కుక్షిలో సకల సృష్టిని నిల్పఁగనేర్చు ప్రౌఢ సం
ధానకళా ధురంధరుఁడు దానవ యోధచమూసమూహమున్
జానుల మీఱుచున్ గడు విశాలము నాయితమైన కన్గవన్
మానుగఁ జూచె నన్నుఁ; గరిమంబున కచ్చెరు వంద నేటికిన్. 45

చ. కదనముఖంబునన్ "రతిముఖంబున లేజవరాండ్ర కట్టు" ల
య్యదువరసేనకున్ జెమటలావహిలున్, పులకాంకురావళుల్
గుదురుపడున్ శరీరములఁ, గోరిక లూరఁగ సాహసంబులున్
బొదలును, మానసంబునను బొల్పగుఁ దత్తఱపాటు మేటియై. 46

చ. చల దనుకూలవాయువు ప్రసారముచే ఘనకేతనాంబరం
బులు దయివాఱ బల్మి మెయిఁ బోరికి రమ్మని బిల్వఁ బోలు శ
త్రుల; నటుఁ గాకయున్నఁ గసితో రయ మారఁగ వారలేల య
మ్ములు విలు పూని యాదవ చమూనివహంబులపైకి నేఁగుటల్.

ఉ. చెచ్చెర నయ్యెడన్ బగఱసేనపయిన్ హరిసేన తీవ్రకో
పోచ్చలి తాంగమై యుఱికి యొప్పు గనున్ మఱి యట్టు లేఁగఁ దా
మచ్చర మొప్పఁగా నరి నమందరణంబునఁ గూల్ప నెంచుఁ జం
చచ్చరితార్థ ధీరగుణశాలులు సైఁపుదురే రిపున్ గనన్. 48

తే. ఒడలఁ దొడిగిన కవచాన నొప్పు మెఱయ
జిగి జగా రాల డాల్గమిచేత వాఁడి
ములుకు లలమినయట్ల బల్ముచ్చు టెనయ
రాచబిడ్డలు మెఱసిరి రణధరిత్రి. 49

తే. సేనల పదాహతికి రేఁగు క్షితిరజంబు
ముసలి పారావతపు మెడమొనయు వెండ్రు
కలఁ గలుగు ధూమ్రవర్ణంబు గాంచి మేఘ
మండలం బెల్లఁ గ్రమ్మె నుద్దండలీల. 50

క. హయబల పదహతిచే నెం
తయు సారెకు సారె కుద్ధతం బయి ధూళీ
చయములు హయముల కెత్తుగ
పయనము సాగింపలేక § పడు నట క్రిందన్. 51

తే. గరిమయు బహుముఖత్వంబు § గల నలువకు
జగముల సృజింపఁ గారణం§బగు రజంబు
గరిమయు బహుముఖత్వంబు § గల బలమున
కఖిల విలయకారణ మయ్యె § నారజంబె. 52

చ. బవరము సాగ నున్న దిఁక§వాఁడి యలుంగుల గంట్ల నెత్తురుల్
దివి కెగఁబాటి పెన్బురద§తీరుగ మే మగునట్లు ముంచు నం
చు వెఱపుఁ గాంచి మించుటనొ § స్రుక్కక చేరు సమీరుఁ గూడి యె
త్తువు వినువీథిఁ జేరె భువి§నయ్యెడ రేఁగిన దుమ్ము లిమ్ముగన్. 53

మ. ఒకచోటన్ గమనీయ నీరద వినీ§లోరు ప్రభల్, చింద వే
ఱొకచోటన్ దపనీయ వర్ణ సముదా§యోదారపీతప్రభాం
శుక మింపొంద మఱొక్కచోటను శర§చ్చంద్రాంశు ఖండావదా
తక రౌపమ్యముఁ బూన రేఁగె ఖురఘా§తప్రోద్ధ ధూరేణువుల్. 54

ఉ. ఆకసమున్ స్పృశించెడు ది§గంతము లన్న మహాగజాలకున్
బ్రాకటమైన మోముపయిఁ § బర్వఁగ సైన్యవిధూత ధూళి, బల్
కోకిలరాజి నల్పువలెఁ § గోమల నీలమునైన యంబుదా
నీకము పేరిటన్ మదము § నెక్కొనె నంచు వచింప నయ్యెడిన్.

ఉ. తోరపుఁగప్పుడా లొలయు§తుమ్మెదలట్టి శిరోరుహంబు లిం
పారఁగ గల్గువా రగుట§నాజిని డింకఁ గొనంగఁ గూడ దం
బారసి యేమొకాని కురు§లందునఁ దెల్పుల నిల్పి, సాంద్రపృ
థ్వీరజ మంతలో ముసలి§వేసము గూర్చు యువప్రజాళికిన్. 56

చ. అలసులె యైనఁ గాని యరు§లందఱు నొక్కటఁ జక్కఁగూడి మి
న్నలమిన వీరతేజముల § నందెడివానిని ధిక్కరింతు; ర
ట్టులకద! దుర్నిరీక్ష్యతఁ గ§డున్ వెలుగొందెడు వేవెలుంగునేన్
నలుసులు లేచి యొక్క టగు§నాఁడు తిరస్కృతుఁ జేయ కుండునే?

ఉ. సారరయంబుతోఁ విపుల§సంగర రంగమునందుఁ బర్వు బల్
తేరుల చక్రధారలను § దీరుగ లేచిన ధూళిలోపలన్
ధారుణి మున్గిపోయె విత§తంబు యుగాంత సమీరణంబుచే
బోరున నుద్ధతం బగుచుఁ § బొంగుపయోనిధిలోపలం బలెన్. 58

ఉ. తమ్ములవిందునెమ్మొగము § ధామచయంబుల మించి యంబరాం
తమ్ములయందుఁ జాల మలి§నమ్ములఁ నొంది రజస్వలావిలా
సమ్ముల కిమ్ములై నయన§సంగతి కర్హము గాక శిష్ట బృం
దమ్ములు దగ్గఱన్ వెఱవఁ§దద్దయు నొప్పె దిగంగనాతతుల్. 59

ఉ. ఎట్టి మగంటి మెట్టి దిట § మెట్టి యపూర్వపు సాహసంబు లీ
దిట్టలు సంగరంబునను § దేజ మెటుల్ మెఱయించువారొ యీ
పట్టున నంచు నింగిని సు§పర్వులు బారులు దీర్చి తెప్ప పా
టెట్టులు లేక చూడ నల§యింపఁ బరాగము-పాఱి రత్తఱిన్. 60

తే. క్రమ్ముకొని మించుల హరించి § ప్రతిపదమున
నీటి హరియించి ధూళులు § నీరదములఁ
గలియ, వానలు మాని పం§కంబుబరువు
కతన నామబ్బు లెల్లెల్లో § కదలుఁ జదల, 61

క. మిన్నేటినీట విమలతఁ
గన్నదిశాకరుల యంగ§కముల కమరెఁ బ్ర
స్కన్నతురంగ ఖురాహతు
ల న్నెగసినధూళి మునుక§లను బెనుసుఖముల్. 62

చ. కరితతి పాదఘాతముల § గాసిలి భూమి రసాతలంబునన్
జొరఁబడె నోపలేక పలు§చొప్పుల నేల నలంగిపోయి స
త్వరముగ రేణురూపమును § దాల్చి నభోంగణ మెల్లఁ గప్పె, న
బ్బురముగ నిట్టు లేకమయి § ముజ్జగమున్ దిలకింప నయ్యెడున్.

ఉ. ఏయెడఁ బల్లమున్న గణి§యింపక గప్పెడు మేటి భూరజం
బాయెడ సర్వ పర్వత గు§హావళి ప్రేలెడి కర్పురాంబర
ప్రాయముగాఁ జెలంగుచుఁ ద్ర§పాయుత సౌర విలాసినీమణీ
గేయ రతంబు గోరు సుర§కిన్నరనాథుల కిచ్చె లగ్గులన్. 64

క. బలు ముఖపటములవలె ని
మ్ములఁ దఱచై రజము గప్పి మోహారమున దం
తులు తెలియుఁ బరస్పరమును
జల మదగంధములఁ జూతసమ గంధములన్. 65

క. కర కట మేహన నేత్ర
క్షర న్మదాంబువుల భూరజ మథఃస్థలిఁ గ్ర
చ్చఱఁ దడియ నేనుఁగులపై
వరలు రజము వస్త్రమండపమ్ములఁ బోలున్. 66

ఉ. ఉన్నతి విస్తృతుల్ సమత నొప్ప గ జాబ్దము లద్రిసామ్య సం
పన్నములై సువర్ణమయ భవ్యవిభూతుల బల్మెఱుంగు సొం
పు న్నవలీలఁ దాల్చి హరువుం గల యంగ విలేపనంబు లు
త్పన్న సురేంద్రచాపములు గాఁ జూపును ధూళి మదాంబువృష్టులన్.

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతం బైన
శ్రీమదాంధ్రిమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
శ్రీకృష్ణ సభాక్షోభ వర్ణనము, యాదవసేనా సన్నాహ
వర్ణనము, సేనా ప్రస్థాన వర్ణనము లనెడి
సప్తదశాశ్వాసము
సమాప్తము.

—*—

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

[శిశుపాలవధమహాకావ్యము.]

## అష్టాదశాశ్వాసము.



—* ఉభయసేనల సమావేశము *—

క. ఱెక్కలు తెగ కుండిన నాఁ
డొక్కెడ వింధ్యాద్రి సహ్యమొగి నిలిచినటుల్
లెక్కింప కపాయముఁ బెం
పెక్కనరాదఁ గవిసె వేగ నిరుసేనాబ్ధుల్. 1

తే. కాల్బలము కాల్బలమ్మును, గజము గజము,
హయము హయమును, నరదంబు నరదము, నిటు
ముట్టె సేన యనూరాగమునను బ్రతిబ
లాంగ మందమ్మనను వల్లభాంగము నటు. 2

ఉ. స్యందనబృంద నిస్వనము హస్తిఘటా పృథు బృంహణంబు నా
నందక రాశ్వ హేషలు పెనంగొనఁ దోఁచు బ్రణాద మత్తఱిన్
దుందుభిన్నాదమున్ గలిసి తోరముగా నటుఁ బర్వి నింగి జా
నొందెను బ్రహ్మఁబోలి కడునొప్పుచు వ్యక్తముగాక సుంతయున్.

శా. చాలం బంటొకరుండు బంటుపయి మాత్సర్యంబు హెచ్చంగఁ గం
బాలంబోలెడు బాహుదండములఁ బైపై దూరమం దుండి య
వ్వేళన్ వ్రేయఁగ దీర్ఘఖడ్గలత వేవే వైజయంతీ ప్రభా
జాలం బిట్టిదె యంచుఁజెప్పఁగఁ దగెన్ సామ్యం బసామాన్యమై.

చ. ద్రుతగతి గుఱ్ఱపుందళము త్రోవ సలీలఁ జరించునట్టి ధౌ
రితమున మీఁది మీఁదికిని గ్రేళ్లుఱుకన్ దిగి టంగువారు సం
గతమగు పైఁడి స్థానక నికాయ మెసంగెను దేహ మెల్ల వ్యా
ప్తతఁ గని పట్టరా కుబుకు దర్పపు మాఱటమూరులో యనన్. 5

చ. నలువది యేండ్ల యీడునకు § నైజపుఁదేజును మేనఁ గాంచి బల్
దళమగు త్వక్కునన్ బెడఁగు § దాలిచి తల్పల బద్ధ కక్ష్య మిం
పొలయఁ మదద్విపాళి ప్రళ § యోద్గత దారుణ వాత ధూతమై
మలయు మహోపలావళి స§మానములై తిరుగాడె నెల్లెడన్. 6

చ. రయమునఁ బర్వు తేరుల భ§రంబున గిఱ్ఱనునట్టి యక్షధూ
శ్ఛయము లెసంగ, గుఱ్ఱములఁ § జయ్యనఁ ద్రోలెడి పట్టులందు మీఁ
దియొడలు పెంచి బ ల్చబుకు § తేపకునెత్తి నియంత పల్కు "హై
హ"యను నుడుల్ వచింప నపు§నౌ నని మెచ్చుచు వచ్చినట్లుగన్.

క. అని కడ్డమౌ పరాగం
బును దుడువఁగ మృత్యు వెత్తఁ § బొల్చెడు సమ్మా
ర్జను లనఁగఁ, గేతుపటములు
గన నయ్యెడి నున్నతులను § గ్రాలుచు నింగిన్. 8

క. అతికఠినత, విరివియు, ను
న్నతి, మండలతన్ దనర్చు § నాగ ఘనశిరః
ప్రతతి ధనుర్వితతి రవో
ద్ధతిఁ దట్టిరి హస్తిపకులు § ధన్వికులములున్ 9

క. గంటల గింగురు, డిండిమ
టంటం శబ్దములు, కరిఘ§టా బృంహితముల్
కంటసరుల ధ్వని, మావటి
దంటల హెచ్చరిక కొప్పు§దల సూచించెన్. 10

—* తుముల యుద్ధ వర్ణనము *—

ఉ. ఆయుధజీవు లైన భటు§లందఱు చుక్కఁదనంబు సౌష్ఠవం
బాయతిఁ జెంది, నత్తెఱఁగు§లై విలసిల్లు, నముక్త ముక్త భి
న్నాయుధ పాళితోడఁ దాలి§నాదృతి నేర్చిన నేర్పుఁ జూపి యా
ప్యాయము నొంద భీకర ర§ణాంగణ ధీర విహారులై రటన్. 11

మ కరవాలంబులు మొక్కవోవ నటుపై § ఖడ్గంబులన్ వీడి దు
ర్భర రోషంబున యోధు లిద్దఱు మిథః § ప్రాంతంబులన్ జేరి యొ
క్కరిచే యొక్కఁడు పట్టి జెట్టులవలెన్ § గాటంపు బల్ముష్టి ఘా
త రయంబున్ గడు మించఁగాఁ బొడిచి యు§ద్ధంబున్ బ్రసాధిం
త్రాగిన్. 12

సీ. ఆదిత్య వహ్ని శోభాభిరామ జ్వాల
త్సహజ నిర్మలిన తేజంబుతోడ
సర్వతోముఖ మహాసంచార దీక్షా వి
నోద విక్రాంతి మర్యాదతోడ
నతిదూర నిర్గతాయాత కీర్తిస్ఫూర్తి
ప్రాపిత లక్ష్య వైభవముతోడ
మాతరిశ్వ ఖగేంద్రమాన సాధికతర
రయ విలాసైకసంభ్రమముతోడ
తే. నెదిరిదండున బలిమి నెయ్యెడలఁ జొచ్చి
వాజితాఽవాప్తికిని దగునోజ మెఱసి
యుచితకృత్యంబు లన్నియు నొక్కపెట్ట
సాయకంబులు చక్కఁగా సలిపె నపుడు. 13

ఉ. పోరుల వెన్ను చూప మని మున్ ప్రతినల్ గయికొన్న శూరతా
కారులు సంగరాగ్రిమపుస్కంధము నెక్కి భయంబు దక్కి, వి
స్తారిత తచ్ఛిరఃస్థలిని దానకముల్ గొని పైని లీల లిం
పార నమానుషాధ్వ గమనాదృతిఁ జేరిరి విష్ణుపాదమున్. 14

మ. లలి దేహమ్మున నొక్కచో నిముడు లోల ప్రాణసంఘాతమున్
గలి తానంత పరాక్రమాప్త మగు సంగ్రామాంగణం బన్న ను
జ్జ్వలమౌ నాపణమందు మూల్యముగఁ బెల్చన్ గూర్చుచున్ విల్తు రా
యలఘుల్ శాశ్వతకీర్తులన్ సకలదిగ్వ్యాప్తోన్నత స్ఫూర్తులన్. 15

మ. కలనన్ మున్ వినరానియట్టి గురు విక్రాంత్యుత్సుకత్వంబు సం
ధిలు కార్యంబు లొనర్చియున్ రిపులకేని వీనులన్ సోఁకన
ట్టి లసన్నామముఁ బేర్కొనన్ హృదయపీఠిన్ లజ్జలన్ బూను మా
నుల శ్రీనామము ముక్తకంఠముల వందుల్ విన్చి రుచ్చైర్గతిన్.

క. కినుకను గను గానక పరు
గున నెదురుగ వచ్చు వీరకుంజరములు తొ
మ్మున దింపికొనిరి పిడి దాఁ
కను జొరఁ బగవారి చేతికత్తులఁ దామై. 17

మ. ఇరువాగున్ గలయన్ రణాంగణమునం § దేకాకృతిన్ డోఁచినన్
గుఱుతుల్ రెంటను స్వీయు నన్యుని నెఱుం§గున్ జోద దెట్లన్నచో
దురమున్ వీడ్కొను వైరియేనియు నవ§ధ్యుం డే యగున్, దత్స్వామి
ద్ధరణిన్ సంముఖమైన స్వీయుఁ డయినన్§దధ్యంబు వధ్యుం డగున్.

క. (పుట్టెను వహ్ని విశుద్ధిని
బట్టెను జగదేకవీరు § పాణి నయినఁ గ
న్పట్టిన పరుమెడ గట్టిగ
గట్టా! యసిపుత్త్రి దరిసి § కౌఁగిటఁ బట్టున్).

తే. అమలవంశోద్భవ యటంచు § నంగసంగ
తిని ఘటించి గౌరవమున § దృఢనిబద్ధఁ
ద న్నొనర్చిన వానికే § తలఁచె ఘాత
వంచనకు లోఁగి పరునిచేఁ § బడి కృపాణి. 19

క. నూఱిన వాదఱ గలుగు క
టారుల నీలాంబుదంబు § డంబగు గవచాల్
సారె దెగ నెత్తు రుబ్బిన
సారపు వ్రేటులు చెలంగె § సరిగ మెఱపులై. 20

ఉ. పెద్ద యలుం గొకండు సర§విం జని చంకలదాఁక దూఱినన్
దద్దయు గాసి నొందియును § ధైర్యము వీడియు, శక్తిఁ బాసియున్
బ్రొద్దది యెంతయైన దృఢ§ముష్టిఁ జెలంగెడి చేతినుండి వి
ల్విద్దె వలంతియౌ భటుఁడు § వీడఁ డహా! పలకన్ విచిత్ర మౌ.

క. రౌ తొకఁడు కుంతముం గొని
మాతంగము బొడువఁ బోవ § మాతంగముచే
భీతిలదు హయము: సిగ్గునఁ
బ్రోతురె ఘనకార్యపరుల § దొరలను లెంకల్. 22

ఉ. ఏనుఁగు నెక్కి జోదుగము § లేఁగి జగంబు నథఃకరించి వి
ల్బూనుచు వేనవేలు శర§ముల్ గురియించుచు శైలదుర్గముల్
జానుగ నాక్రమించు వరు§సన్ దగి ఘూర్తర కింతయేన్ జయ
శ్రీ నిడకుండురీతిగ జ§రించి రరాతిదవాగ్ని మేఘులై. 23

శా. నానాంగాఖ్య తరంగ మాలిక లనంతాశావళిన్ బర్వ బల్
సేనాంభోనిధి దవ్వ చొచ్చిన హితున్ స్వీయున్ గనంగోరి యా
జానూదారభుజుం డొకండు తన యిచ్చన్ జొచ్చి పోసాగె భూ
మాని న్యుద్ధర ణార్థి యైన కిటి సమ్రాట్టున్ విడంబించుచున్. 24

—* గజ యుద్ధము *—

తే. మదము గదియింప మావటీం డ్రదర నెఱింగి
యంజనము గూర్పకయ మున్న యాచమూని
నాదములకె జనించె మదోదకుల్య
లమిత మౌచు గజేంద్ర బృందముల కందు. 25

చ. పసిగొని దవ్వునుండి పరవాహినిఁ గల్గెడి దంతి దాన గం
ధస్మృతికి నల్కతోఁ బరిణత ద్విపరాజు నిషాది యాజ్ఞ మా
ట సరకుసేయకుండి నికటస్థ కుమారగజంబు నిర్వదేం
ల్లెసఁగెడిదానిఁ గొట్టె దెసలెల్లఁ దదార్తరవంబు నిండఁగన్. 26

క. ప్రతికరి డగ్గఱి నిలువఁ గు
పితమై కరి కన్దెఱచియు వీక్షింపదు వి
స్తృత ముఖపటమా లేదయ
మిత కోపాంధుండు క్రిందు మీఁదు లెఱుఁగునే. 27

క. మావటి తన కరిముఖపట
మావంతయుఁ దీయ కుండు నంతకు శితబా
ణావళిఁ బఱపుచుఁ గుట్టెను
వేవే ముఖపటము నెదిరి ద్విపపాలుఁ డహో. 28

క. అరిగజముమీఁది కరిగెడు
కరి నయనపటంబు యంత గ్రక్కున దీయన్
ద్విరద ముఖ లగ్నశంకు
స్ఫురిత విమలపింఛ మపుడె చూపులఁ గప్పెన్. 29

క. పూనికతో సుస్థితమును
హానాపేతంబు ననుచు నాసించి తుదిన్
జానగు నాపద్ధన మని
యేనుఁగు గజపాలుఁ డొకరుఁ డేర్తైఱ నోమున్. 30

క. ఒండొకటి వ్రేలికొన, మద
ముండెడితావులను దాఁకి యుచ్చిరముగఁ గూ
ర్చుండి కడు ముడిచి తోఁకల
దండిగఁ గోలలు ధ్వనింప దంతులు పోరెన్. 31

చ. కడు పొడుగున్ స్థిరంబు ధృఢ ఘట్టిత ముగ్రము నింపు నెన్నఁడే
నుడుగక వాఁడియై చెలఁగు చుండెడి కొమ్ములు శత్రుదంతి బెం
పడరెడి కొమ్ముపోటులకు నమ్మోయి వ మ్మయి పోయినన్ రణం
బుడుగదు భద్రదంతి త్రిదివౌకసు లచ్చెరు వంది చూడఁగన్. 32

క. కరిరద ఘర్షణ జనిత
స్ఫుర దగ్నులు కనక శకలములఁ బోలుటచే
వర మాంజి ష్ఠాంచిత చా
మరములఁ దవులంగ జగము మఱి యెఱుఁగునొకో! 33

తే. రోసమే లయవాయువు, రూఢ దంత
రాజియే చెట్లు, కోరాట రాపు వలన
గలుగు మిఱుఁగుర్లె ప్రళయాగ్ని గాఁగఁ గాలెఁ
గరుల తల లను నింగి నక్షత్రమాల. 34

తే. మబ్బుగమి నల్పు లొందు సామజములందు
రక్తపాతాన నెఱుపెక్కి రదము లలరుఁ
గడలినీటను బొడముచు గడనకెక్కు
పగడపుందుంప లనుచు ముజ్జగము వొగడ. 35

క. జెంజాకొన లల్లాడఁగ
దండిగ మ్రోయన్ బెకల్పఁ దవిలిన గాసిన్
వెండి ప రేఖా స్యాంత
శ్చండరదముఁ బెఱుకఁ గరికి శ్రమ మయ్యెఁ గడున్. 36

ఉ. నాగలికోలఁ బోలుచు ఘనంబగు కొమ్మునఁ గ్రుమ్మ, విద్విష
న్నాగము నొండు బట్టి, గగనంబున జీవము లూడ నిల్పి పే
రాగడముల్ బొనర్చెడి గజాధిపుఁ డొక్కఁడు తుంగశృంగమం
దాఁగిన మబ్బుతోడఁ బొలుపారెడి గుబ్బలిరీతి రంజిలెన్. 37

క. తనగజము నేలఁ గూలిన
వెనుదీయక జోదు బాణవితతిఁ బఱపి చ
య్యన యరి జయ దుర్గర్వం
బును గరి నరికట్టెఁ ద్రిజగమును నుతియింపన్. 38

చ. వెడలఁగఁ గష్టమై భువనవిస్తృతిఁ గాంచిన యుద్ధగర్భపుం
బుడమిని జొచ్చి యొక్క గజముఖ్యము మిక్కిలి భాసిలెన్-బయల్
వెడలఁగఁ గష్టమై భువన విస్తృతిఁ గాంచిన పద్మనాభు పెన్
గడుపున సుప్రవేశమును గాంచిన బ్రహ్మకు సాటి గాంచుచున్.

క. ఎలదేంట్లనలుపు గలిగిన
యలుఁగుగములు కాయ మెల్లనలమిన భయవి
హ్వలత నెఱుంగని కరి ము
త్పులకలతో వెలసినట్లు పొలిచెన్ మిగులన్. 40

క. కటమదము గావిగొనె, ను
త్కట కోపావేశముననొ కాక నిఖాతో
చ్చటు లాగ్ర మార్గణోద్గత
పటురుధి రోదార ధార ప్రసరించుటనో. 41

క. జము మంచవుఁదొడుగఱ లన
నమరు గజముకోఱ లెక్కి నతిసాహసు నై
న్యము దలఁచె దివికిఁ జను మా
ర్గము సగమున నున్నవానిఁ గాఁగఁ గలఁకతోన్. 42

క. మాటికి మాటికిఁ గత్తుల
వ్రేటుల కిభకుంభములను వెలువడు ముత్యాల్
పేటలు వెన్నెల యుండల
సాటి వగుచుఁ జదల రిక్కచాలై మెఱసెన్. 43

క. గుఱుసుంగైదువు దవులనె
వడి నఱికిన భూమిఁ గూలఁబడి తనతొండ
మ్మెడఁ గొట్టుకొనన్-రుషఁ గరి
కడు నెత్తురుపడట నలిపెఁ గాలన్ దానిన్. 44

క. సమరమున ముందు జబ్బలు
సమూలముగఁ దెగిన సామజం బాధారం
బమరక తల వాలుచు నెడ
నిముసంబున నిల్చె రెండు నిడుద రదమ్ముల్. 45

మ. ఇరుకోలల్ భువి గ్రుమ్మ, నావడుమ నెంతే క్షేమసంపత్తి సు
స్థిరుఁడై యొక్కభటుండు దా నిలిచి బల్ చేవన్ శితార్ధాసిచే
గుతు దంష్ట్రి పృథుమండలంబు పొడిగాఁ గూలన్ గరీంద్రంబు న
చ్చెరువు వొప్పన్ వధియించి మించె జయలక్ష్మీ హస్తసంగ్రాహియై

చ. ఒకగజ మొక్కనిర్భయుని నొయ్యనఁ దొండముచేత నింగిమీఁ
దికిఁ గడు నెత్తి రివ్వనను తెంపరియై యెగురంగవేయ, దా
నికి ముదమంది, నింగిపయి నిల్చి తమిన్ గనుచున్న యప్సరో
వికచసరోజనేత్రలకు వేడుకకాఁ డయినాఁడు వాఁ డహో! 47

చ. విసువక ప్రాస మొండు గొని వేసిన ప్రేటుల మొక్కవోయి బల్
పస చెడినట్టి తొండమున వారణ మొక్కఁడు చుట్టుపట్టు లా
వెసఁగఁగ లాఁగఁ జెంత వసియించుచు శోఁగిన బంటుఁ గూడ న
క్కసమునఁ బట్టఁజాలద వకావక లౌటఁ సమస్తశక్తియున్. 48

క. కరి మీఁది కెగుర వైచిన
పురుషు నొడలనుండి దివ్యమూర్తి వెలువడన్
సుర లెంచిరి కంసుం డసి
నఱకఁగఁ జండికగ వెలయు నందాత్మజఁగాన్. 59

చ. హృదయ మదెంత రాయియొకో యేనుఁగుగున్నకు నొక్క జంఘపై
బద మిడి యొక్కజంఘఁ దనపాణిని గట్టిగఁ బట్టి నిల్వఁగా
విదళనమున్ బొనర్చె నొకవీరుని మే నిరుపాయలై చనన్
బిదబిదఁ నెమ్ము లెల్లఁ 'బెటపెట్టనుచున్ విఱుగంగ నయ్యెడన్.

చ. ఇరువురు పార్శ్వభృత్యు లొకటే త్రుటిఁ దాఁ గనుచుండఁ జావఁగా
"మరణము తప్ప దేరికి సమంజసమౌ బహుమాన మింత వీ
రిరుపుర ప్రాణ ముండఁగనె యే నొనరింపక పోతి" నంచు వం
దురె యజమానుఁ డామరణదుఃఖము క్రిందగునట్లు పెద్దగన్. 51

చ. అరతొగవిందు కైదువు రయంబున దాఁక విలూనమౌచు నం
బరమున కెత్తఁగాఁబడి కబంధముపై మరలన్ గుదుర్పడెన్
బరు తల, రోష దష్ట దశనచ్ఛదమై మొగమొప్ప, మొండెమ
చ్చెరువుగ నృత్యమున్ సలిపెంజే నసిఁ ద్రిప్పుచు భీకరంబుగన్. 52

తే. తత ఘుభధ్వని కడుగులు తాళమీయఁ
గాహాకార్భటుల్ గానంబు గాఁ జెలంగ
శూన్యదృష్టిని చెయి ద్రిప్పుచున్ న్నటించు
మొండెముల శంఖముల్ బిట్టు మొరసి నవ్వె. 53

క. తనవా రోడిన మగతన
మును పీడ కొంకం దెదుర్ప ముంచిరి విద్వి
డ్జనము శరంబుల, సిద్ధులు
ననసోనల, సాధువాదనముల నుభయులున్. 54

ఉ. సాది యొకండు బాణహతిఁ జచ్చి ధరం బడ దిక్కు లేమికిన్
ఖేదము నొందు నేన్గుఁ బరికించి యరాతులు చుట్టుముట్టి, యే
యేదెస తీవ్రకోపమున నేగఁగ నయ్యది సంభ్రమించు నా
యాదెస నడ్డగింపఁగ రణావని యయ్యెను గట్టుకంబమై. 55

క. నెత్తుటి వాసన లలమిన
మత్తిలి కోపించి కరి జమరి జనులను లో
త్తిత్తి తెగ లాగ నది కా
లత్తఁగఁ బదరజ్జువట్ల నయ్యెడ లాగున్. 56

ఉ. ఆజికి బ్రాణపంచకము నర్పణచేసిన ప్రాణనాథు ప్రే
మౌజ మెలర్పఁగాఁ గరిణి యందున నెక్కొని చూచి తోడనే
రాజవధూటి యొర్తసువులన్ విడనాడి సతీత్వ శక్తి చే
రాజిలు దివ్యమూర్తి యయి ప్రాణవిభున్ గదియించెఁ గౌఁగిటన్.

క. అమ్ముల గ్రుమ్ముల సొమ్ములు
గ్రమ్మిన భటుఁ డేన్గు శీకరములఁ దడిసి శ్వా
స మ్మెనయఁగఁ, దద్వరణా
ర్థ మ్మట కేతెంచు నప్సరస మూర్ఛిల్లెన్. 58

క. నునువాఁడి యలుఁగువన్ దెగి
వినువీథికి నెగయుదెంచు వీరుని తలఁ గ

నొని బెగడొందెను ఖేచర
జన వక్త్రేందువులు రాహుశంకను మిగులన్. 59

చ. పతి మరణించె నంచు నొకపత్ని వియోగము సైఁపలేక స్వీ
యతనువు నగ్ని వేల్చి తదంతికసీమకుఁ రాక ముందె బల్
చతురతఁ గౌఁగిలించి రతిసౌఖ్యము లొందెడుకోర్కి మీఱ దై
వతహరిణాక్షి యొక్కత జవంబునఁ జేరె సుమేరుకుంజమున్. 60

చ. నవనవ చారుతా ధృతు లనంతము గాఁగ నహర్దివంబు స్వ
ర విమలమందిరంబులఁ జిరంబు, సురాంగన గారవింప, ను
త్సవ సుఖజీవియైన యొకశౌర్యధనున్, భువిమీఁదఁ గూడ నా
ర్జవము దలిర్ప గీర్తి యను జవ్వని మెచ్చి భజించు నిచ్చలున్.

ఉ. ముమ్మరమౌ రణంబునను మూర్ఛిలి వీర కులాగ్రయాయి స్వ
ర్గమ్మునఁ గలు నిస్తుల సుఖంబు రుచిన్ గని యుద్ధభూమికిన్
గ్రమ్మఱఁ బోలు, నట్టు లదికా దనిరేని మ తేల యాతఁ డు
గ్రమ్మ రణమ్ముకై వెడలి ప్రాణము గోల్పడు లబ్ధసంజ్ఞుఁడై. 62

తే. పగఱ ములుకుల మూర్ఛిల్లి పడిన వీరుఁ
డత్సుఖుఁడు గొంచుఁబోయి సేదను దొలంచి
'వల' దనుచునుండఁగనె వాఁడు కలన నుఱికి
యొగ్గె నప్పుడ లోకానువృత్తి యేమొ? 63

ఉ. దూరమునందు నిల్చి పగతుం డొకఁ డేసిన యొక్కకోలకే
దారిత వక్షులౌచు దరిదాపుల నిల్చిన వీరు లిద్దఱ
య్యారె! పరస్పరాశ్రయ బలాధికయుక్తిని నూర్ధ్వ కోటికిన్
జేరుటె కాద యొండొరుఁ ద్యజింపక చేరిరి నాకలోకమున్. 64

చ. ప్రదర కఠోర ఘాతములఁ గ్రచ్చఱ మూర్ఛితులైన శూరులన్
సదమలవంశ్యులన్ వధమొనర్పఁ దమిన్ గొను స్వీయులన్ దయా
స్పదుఁ డయి మానిపించి చెఱపట్టి సజీవముగాఁగఁ బట్టఁగా
మొదలిడె వీరుఁ డొక్కరుఁ డమోఘ యశోగ్రహణంబు చేఁదొకో.

—* రణరంగమందు బీభత్సము *—

చ. కర మరుదై పదార్కశలఁ గ్రాలెడు చందురు చంద మొందుచున్
గొఱఁతలు లేని వెల్లగొడుగుల్ రణభూమిని నెల్లతావులన్
విఱిగినకామ లొప్పఁగను బేర్మి యముండు భుజింపఁ బెట్టు సుం
దరమగు వెండిపళ్లెము లనన్ బడియుండె భయానకంబుగన్. 66

క. కోరిక తీఱన్ నెత్తురు
సారెకుఁ గొను మిత్తి కోఱ-సరణిని ముక్తా
హార మమరెఁ గుంకుమ సిం
గారముతో, గచ్ఛ దసు ని-కాయుల యెదలన్. 67

క. క్షితి పల్లంబుల నింపిన
క్షతజాసృ జ్నివహ మెల్లఁ-గాలు నగరు గు
బ్బెత వలువ కావికై సం
భృతమౌ కౌసుంభజలము-విధమునఁ బొదలెన్. 68

చ. ఇరువదియొక్కమాఱు పృథి-వీశ్వరులన్ వధియించి రాముఁ డ
బ్బురపు మడుంగు లైదిటిని-బొల్పుగ నింపెను బెక్కునాళ్ల కే
ద్తైఱ మును రక్తనీరములఁ-దెంపున నేఁడు రణాన రక్తశం
బరఝురు లెన్నొ యొక్కక్షణ-మాత్రన పుట్టెను దొట్టి నద్దెసన్.

ఉ. ఏనుఁగుకాళ్ల శృంఖలము-లెప్పుడు గట్టెడి తావు క్రిందుగా
జానగు నస్త్రనైపుణి లె-సంగెడి ప్రోడలు వాఁడిముల్కులన్
బూని తెగంగ నేయఁ బద-ముల్ గన నొప్పెను, మేటి కూర్మముల్
గా, నట పాఱు తద్రుధిర-కాండ నదీతట మధ్యభూమిలో. 70

ఉ. నెత్తుటియేఱులం జెలఁగు-నీటి తరంగములందుఁ దమ్మిపూ
మొత్తములై వెలుంగు పర-భూపతి యోధముఖంబు లెంతయున్
మత్త కరీంద్ర కర్ణయుగ-మానిత చామరజాల మూడి హం
సోత్తమలీలలం దనరి-యుజ్జ్వలమై కడుఁ దేలియాడెడిన్. 71

చ. అసువులు చన్నవారి పల-లార్థము వచ్చిన పుల్గుగుంపు లా
కసమున మండలాకృతులు-గా భ్రమియించుట దోఁచె నత్తఱిన్
బసగిల వాఁడికోలలను-బల్మిని బాసిన ప్రాణపంచకం
బెసఁగుచు మూర్తి నొంది, మెయి-నీక్షణ సేయుచుఁ గాచుచుండె నాన్

మ. రిపు రివ్వంచు నచేతనంబు లగు ప-త్త్రి వ్యూహమున్ ఱెక్కలన్
దవుదవ్వందులనుండి వచ్చి నిశితో-దంచ న్ముఖాగ్రాళి ను
త్సవ మొప్పంగను ద్రావువీరుల యసృ-గ్జాలంబు ప్రాణాల్ మెయిన్
దవులన్ మున్నిపుడో తొఱంగ నసువుల్-ద్రావున్ సజీవంబులై.

ఉ. నిక్కపుసాహసంబు లవ-నిన్ బ్రకటించి గతించు జోదులన్
నక్కలు చేరి యాయపఘ-నంబులతోఁ దదనంత తేజముల్

గ్రక్కనఁ దిన్న హేతువునఁ గావలయున్ బెనుమంట మోములన్
నెక్కొన నార్చుచుండు నవి, నిచ్చలు భీకరమైన వైఖరిన్. 74

ఉ. పెక్కు లకోరు లంగముల వీడక నాటుటఁ బెద్దనిద్రఁ గై
పెక్కిన వారి మాంసముల నెమ్మెయిఁ మ్రింగఁగ వీలు లేమికిన్
నక్కలు పేర్చి యార్చి రసనం గల యింగలపుం గవోష్ణతన్
జక్కఁగఁ గాల్చి బాణములఁ జయ్యన వెచ్చని మాంసముల్ దినున్

ఉ. లెక్కయ లేక పెల్చఁ గబళించిన మాంసము జీర్ణమైన యా
నక్కలు, తద్రుజన్ గెడపనా; రుధిరంపుటరిష్ట మొం దొగిన్
గ్రుక్కలు వేసి యాఁకటిని గోరుచు నెమ్ముల దుమ్ము పంచదా
రెక్కటి తెచ్చి జల్లుకొని యింపుగ ప్లీహము నంజి యార్చెడున్.

ఉ. దుందుభి మున్నుగాఁ గలుగు తోరపు వాద్యములందు నెత్తురుల్
బొం దగు నంచు నెంచి ముఖముల్ విదళించెను గృధ్రబృంద మా
చందము నేమి చెప్పఁ హయసామజ యోధవ రాదిజీవులన్
విందుగ మ్రింగఁగాఁ దెఱచు భీకర మృత్యుముఖంబులే యగున్.

ఉ. జీవులమేను లం దెసఁగి ఛిన్నములైన తదంగ భాగముల్
ప్రోవులుప్రోవులై సమర భూమిపయిం బడ నద్ది యొప్పె రా
జీవభవుండు క్రమ్మఱ సృజింపఁగ భిన్న విభిన్న దేహి రూ
పావయవంబు లుంచిన గృహంబును బోల్పఁగఁ జాలి సారెకున్.

చ. ఉడుగని వేగసంపదల నొప్పుచుఁ బర్వెడు శత్రుసైన్యముల్
గడితపు శ్రీశు సైన్యముఁ గలంచెడి కోర్కులఁ జేర, బల్నదుల్
కడలి మహోర్మి వేగము లలంపఁగ వచ్చుటఁబోలి యుద్ధ మి
వ్వడువున డోల యయ్యె నిరువైపు జయంబొ మఱొండొ దోఁపమిన్.

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతం బైన
శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ)' మహాకావ్యంబున
ఉభయసేనల సమావేశము, తుములయుద్ధ వర్ణనము,
గజ యుద్ధము, రణరంగమందు బీభత్సము ననెడు
అష్టాదశాశ్వాసము
సమాప్తము.

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రమాఘము

[శిశుపాలవధమహాకావ్యము.]

## ఏకోనవింశాశ్వాసము.



—* ఉభయసేనల యుద్ధవర్ణనము *—

ఉ. పిమ్మట, సంగరాటవిని భీకర శాత్రవ వేణుదారియై
పమ్మినతేజు రాజిలఁగ. బాణతనూజుఁడు వేణుదారి నా
మమ్ము గలాఁ డొకండు, నృపమండల భూజము లొండొకండు పై
రమ్మున రాయఁగా రవిలి రాలిన యగ్గివలెన్ బయల్పడెన్. 1

ఉ. మీఁదికిఁ బర్వ నయ్యలఘు మిక్కిలిదూరమునందు నుండి లో
కాద్భుత విక్ర మాంచితుఁ డటంచుఁ బ్రసిద్ధిని గాంచి మించి శో
భాదయి తాంగుఁడైన బలభద్రుఁడు చూచె మెఱుంగుఁజూపులన్
వే దరిఁ జేరు నేనుఁగును వేచి కనుంగొను సింగముంబలెన్. 2

ఉ. చూచినతోడనే బలుఁడు శూరరణంబుల గెల్చువాఁడు గం
డేచినవారి వంపఁగల యేపుగలాఁడు, గ జాజిపాండితీ
రోచిఁ జెలంగువాఁ డగుటఁ గ్రోధర సారుణనేత్ర దృష్టియై,
వే చనె వేణుదారిపయిఁ బెద్దరథం బొకఁ డెక్కి యుక్కునన్. 3

మ. కలుగున్ నామము తద్రథంబునకు నిర్ఘాతం బటంచున్ జగం
బుల; నద్దానికి యుక్తరీతిఁ బెలుచన్ మ్రోయున్ మహోగ్రాశనుల్
వలె, సర్వంసహ సర్వమున్ వడఁకిపోవన్ బిట్టుగా దోఁచు భీ
చలితం బౌనటు ప్రాణికోట్లు రథ మంచల్లిలఁ బర్వెత్తుచోన్. 4

ఉ. షో రొకపండు వంచుఁ దలపోసి యనేక జయాళి గొన్న యా
శూరుఁడు రాముఁ దీవ్రశర శూరత నొంచెను, రాముఁ డంత నా
గారి రయాన్వితంబు లగు నట్టియలుంగులు బాణపుత్రుపై
సారెకు సారె కేసి బలుసంతస మొందుచు నార్చెఁ గెవ్వనన్. 5

చ. వెలుఁగులు మందగించు నెడ వేయివెలుంగులవాని తేరు దా
వలని నెఱింగి సూతుఁడు పథంబుపథంబున దక్షిణాశకున్
మలఁపెడురీతి సొమ్మసిలి మాసిన శౌర్యము తోడి వేణుదా
రి లఘుత సూతుఁ డొం డెడకు రేఁగెడి పోరుననుండి చేరిచెన్. 6

చ. అతులితమౌ ప్రభావము గలట్టి శినిప్రభుసేన సాల్వభూ
పతివరు సేనపైని బగపట్టి సమూలముగా వినాశ మం
చితగతి చేసి యందులకుఁ జెల్వుగ నిల్చిన తమ్మిపూవు సొం
పు తగుమొగంబులెత్తి ముదముల్ గని యార్చెను బేర్చి బిట్టుగన్.

ఉ. పేరికిఁ దగ్గయట్లు వెఱపించుచు నుల్ముకుఁ డన్నఱేఁడు ది
గ్వారములన్ బ్రతాపము నఖండముగా వెలయించి భీకరా
కారత రేఁగుచున్ ద్రుముని గాఱియపెట్టు తదీయ పత్త్రిసం
భారము లెల్ల శౌర్య మనుమంటల బుగ్గిగఁ గాల్చెఁ జెచ్చెరన్. 8

ఉ. భూపతులందుఁ బెద్ద యని ప్రోసినపేర్గల యాపృథున్ "భవ
చ్చాపము కాల్చనే" యనుచు సాహస మొప్పఁగ రుక్మిభూపుఁ డా
క్షేపము సేయు నోటన "విగీతచరిత్రు ననున్ క్షమింపు మే
నోపను బోరికిన్ దొలఁగుచుంటి" నటంచును వేడెఁ గావఁగన్. 9

ఉ. ఆపగ లెన్నియేని రయమారఁగ నొక్కట నెత్తి రాఁగఁ దా
నాఁపగలేని వాఁడొకో మహామహుఁడైన సముద్రుఁ డట్ల యెం
తో పగఁ బూని నల్దెసలనుండి యవాటుగఁ మీఁది కెత్తి రా
భూపతిసేన లెల్ల యదుపుంగవుఁడౌ స్మరుఁ డాఁపె నొక్కఁడే. 10

క. ఆప్రద్యుమ్నునిపై గుం,
పై ప్రథితాయస తనుత్రహారు లగుట న
బ్దప్రతిము లగుచు శూరులు
క్షిప్రగతి శరాశనులను జిమ్మిరి గిన్కన్. 11

క. అధిగత నఖాంశు గుచ్ఛము
నధిరూఢ శిలీముఖంబు నయి దీర్ఘ కరో
ర ధనుశ్శాఖము ప్రద్యు
మ్న ధరారుహ మిరవుకొనె రణక్షితియందున్. 12

చ. అరిజనకాలుఁ డాతఁడు భయంకర సంగరరంగభూమిలో
నరిది విహారముల్ సలుపు నప్పుడు, వంగి నమస్కరించు జో
దరిజనుఁ డైనఁ, జూచి, యభయం బిడి వాని బహూకరించు బ
ల్గరువము నొందువానిని నిలంబడఁ గూల్చును, జీల్చు గుండియల్.

ఉ. అంత నృపాలు రెల్లరు భయంపడి 'హా! జయలక్ష్మి వీఁ డిదే
బంతము పట్టి తీసికొని పాతెడి' నంచు దలంచి ముందు కా
లాంతకతుల్యు బాణవిభు నాహవనాయకుఁ జేసి నిల్చినన్
గొంతుక నుత్తరించి ధరఁ గూలఁగఁ జేసెఁ గుమారుఁ డాతనిన్.

చ. పిదపఁ దదీయ సైన్యములు వేయువిధంబుల మాయ పన్ని పే
రదవద చేయఁగాఁ దొడఁగి యార్చుచు బిట్టుగ సంతసించి య
భ్యుదయముఁ జెందిన ట్లయిన భూరిరణక్షమ మైన విల్లు వాఁ
డదన ధరించి లాగి విశిఖావళి ముంచి గలంచె సేనలన్. 15

మ. అటు ప్రద్యుమ్నుఁడు విక్రమించి నిజబాహాటోపముం జూపి ప్ర
స్ఫుటమౌ నోజము నుత్తమౌజసుఁడు గోల్పోఁ జేసి, తన్నామ సం
ఘటితార్థమ్ము ననర్థవంతముగ వేగన్ సల్పి, నైజాంక సం
ఘటితార్థమ్ము యథార్థమై వెలయఁగా గావించి చేవల్ గనెన్. 16

క. ఆపిన్నవాని కోల్తల
నోపక దృప్తారిశూరు లొగిఁ దమవెన్నుల్
చూపి మఱి పోరుతావున
కేపగిదిని జేరఁ బో, రిఁకేలా పల్కుల్? 17

క. ఆపాపనిచేతం బర
భూపతులు నలంగి యెట్లొ ముక్తు లయి మదిన్
ప్రాపింత్రు విలక్షత్వ మిఁ
కేపట్లు విలక్షతను వహింపక శరముల్. 18

క. దేవర్షులు దేవతలున్
లేవన్ బులకాళి యొడల; లేఁబ్రాయపుజో
దా వడిఁ జూపు పరాక్రమ
మే పొగడిరి నింగినుండి యిలపైఁ గనుచున్. 19

క. దెస లెల్లం బరిమళముల్
ప్రసరింపఁగ వాడు లేని § బహుసుమమాలల్
బసివాళి కొసఁగె నాకస
మొసఁగె నతఁడు ప్రతిగ దాని § కురునిజ కీర్తుల్. 20

తే. గబ్బి బెబ్బులిబొబ్బ లా § గుబ్బు కొనఁగ
నుబ్బునెడి వాఁడి గల. జోదు § లబ్బలియుని
యబ్బురపు దెబ్బలకు డింద § మబ్బుగముల
గెబ్బి తత్కీర్తి దివిఁ గ్రమ్మ § నుబ్బుకొనుచు. 21

క. కేశాధికలోక మ్మయి ప్ర
కాశించెడి రణశిరము వి§కాసి, సుమాంకా
భ్యాశమున సుమాంకం బగు
కేశాధికలోకు శిరముఁ § గ్రేణి యొనర్చెన్. 22

చ. విడువని యట్టి పట్టుదల § వింతగఁ బో రొనరించి యైన నా
బుడుతని విక్రమంబునకు § మొగ్గి నలంగిన సేనఁ జూచి యె
న్నఁడు నిటువంటి శౌర్యము క§నంగను లేదు వినంగ లే దటం
చుడిగిరి చేష్ట లెల్ల భయ§మొందుచు చూపఱమొత్త మత్తఱిన్.

ఉ. లావు గలాఁ డటంచు జయ§లక్ష్మి యిటుల్ గరిమంబు మీఱ నా
పూవిలుకానిఁ జేరఁగను § మున్ వరియించి వెలార్చు బల్ రుషా
దేవియుఁ గావి యైన ముఖ§తీవ్రతఁ బూని త్యజించి వానిఁ జై
ద్యావనిజాని నానిముస§మంద కవుంగిటఁ జేర్చెఁ జేరువై. 24

చ. ఎగురఁగ నేర్చు నేర్పుగల § యేనుఁగుగున్న లనంగఁ జాలు నె
త్తు గలుగు గుఱ్ఱముల్ మొదలు § తోరపు నాల్గగు రీతు లైన సే
న గరువ మొప్పఁగా నడువ § నవ్య జయుం బొడఁగూర్చుకొంట కై
తగునటు రేఁగి, చేరి వసు§ధాపతి శూరత వైరిపైఁ బడెన్. 25

ఉ. కొండలవంటి విండులకుఁ § గూర్చి గుణంబుల లాఁగఁ బుట్టు ను
ద్దండపుఁ జండ టంకృతి వి§తానములే ఘన తూర్యరావమై
మెండుగ బోర్కొనంగ నుప§మింపఁగ నయ్యెను దండిదండు ప్ర
చండ లయ ప్రకాండ ఘుమి§తాంబుధి కాండపు గంతుతో నుతన్.

సీ. ధనువు పీడుటకం బెంఁ దనుష్ప్ర పీడుపె యను
వనుచుఁ బూనిక యోధు లలరుచుండఁ
గొండ పిండిగఁ గొట్టి యుండఁ జేసెవ మంచు
దండు పరువళులం దవిలియుండ
నంగముల్ నఱుక వాఁడిం గందు మనుచుఁ గ
డంగి బిట్టురుకు కటారు లెసఁగ
హయహేషలను మించి యయలాభములఁ గూర్తు
రనుచుఁ దెల్పెడు శుభధ్వనులు నిగుడఁ
తే. గాలసర్పంబులను బోలు కత్తులాడ
నుక్కుజీరాల నలుపురంగొప్పు మీఱ
శమనునకుఁ దోడ్పడంగఁ బజ్జను వెడలిన
తత్సహోదరి నాఁడోఁచెఁ దవిలి సేన. 27

ఉ. బిట్టుగ సింహనాదముల పెంపు సెలంగుచునుండ గట్టురా
పట్టులఁ బోలు మత్తగజవల్లభముల్ నడువంగ సేమముల్
దట్టములై యెసంగ రణతాండవ దీక్షలు మాటిమాటికిన్
దిట్టతనంబు గాంచిఁ గడు తీవ్రముగాఁ జనె సేన లయ్యెడన్. 28
క. నరపాలక వంశాగ్రే
సరులున్ గ్రొవ్వాఁడి ఖడ్గజాలము ఝుళిపిం
చి రయమున రణాగ్రమునం
దరిగిరి ప్రభుభక్తి నికషమగు నావేళన్. 29
శా. శీతోష్ణాదుల లట్టి ద్వంద్వగణ మేసీమన్ లవంబైన సం
భూతిన్ బొందక యుండు, నెయ్యది సదామోదంబు సంధించి సం
ప్రీతిన్ గూరుచు నట్టి స్వర్గపురిహృద్వీథిన్ దగన్ గోర్కియే,
శాతాసిప్రభవుండు మెల్ల నిడఁ డజ్జన్ యుద్ధరంగ స్థలిన్. 30
మ. ఉరువేగంబున శత్రుసంఘములపై నుద్రేకముం జూపి సం
గరరంగంబున జోదు లందఱును నుగ్ఘాటింతు రుద్దామ బా
హురయంబుల్ దయివాఱ; స్వీయజన మన్యోన్యంబు జన్యావనీ
స్ఫుదదాస్యంబున నిల్వ, జాను రయవిస్ఫూర్తిన్ జయింత్రయ్యెడన్

తే. పరులమానము సురుఁగ బంధుర మదేభ
తత మయిన యారణాన సోత్సాహ సింహ
నాదములు రేఁగ నిర్వహణ ప్రభూత
భార మా సైనికులపయిఁ బడెను మీఱి. 32

ఉ. కొండలవంటి యేనుఁగులు గూడి రయంబునఁ బర్వు వెట్టుచు
ద్దండరవంబు సేయ, భటతండము లొక్కట సింహనాదముల్
మెండుగ సేయు, చోజమున మించఁగ దండు చలంబు నూని బ్ర
హ్మాండము నిండు క్రోధరసమావహిలంగఁ జెలంగెఁ బొంగుచున్.

చ. పిడికిటఁ బట్టఁగా నిముడు విశ్రుత మధ్యము లొప్పి యెన్నఁడున్
జెడని సువృత్త సంపదలఁ జెల్వము గాంచు ధనుర్లతాళి, నె
క్కుడుబలిమిన్ రయం బొనరఁగొప్ప దృఢంబుగఁ గట్టి యబ్బురం
పడఁ బడుచుం దనంపు గరువంబున జోదులు లాఁగ మ్రోఁగెడిన్.

క. కరుల చిఱుగంటలన్ గిం
గురు పుట్ట రణంపు గోలకున్ బలమిడెఁ, ద
త్కరముల తుంపురు లడఁచె స
మరంబులను రేఁగు దుమ్ము మబ్బుల నెల్లన్. 35

క. అభినవ శృంగార రస
ప్రభము లగు కరుల్ రణాగ్రభాగమున లసత్
ప్రభ గలుగ రోషసంభ్రమ
విభూషణము దనర రౌద్రవృత్తిఁ జరించున్. 36

—: చిత్ర యుద్ధ వర్ణనము :—

క. తొలిసత్కృతు లుపకారం
బుల నొందన కొల్పుల మ్మపుడు విశ్వాసం
బుల సుంత యెదలఁ దలఁచి స్వ
విలయభయంబులను వీడి వెసఁబోరి రనిన్. 37

ఉ. గాటపు నారిదెబ్బలకుఁ గాంచెడు తోళ్లల చేతు లొను బల్
వాటపుఁగొమ్మ, లొదురు చలంటున విల్లొనువారు చెట్లుగాన్
నేటగు నమ్ములన్ బొదులు నిక్కము పాములు తొఱ్ఱలొను ఘో
రాటవియే యగున్ గద రణాంగణ మెన్నిట నెన్ని చూచినన్. 38

మ. రయవిక్రాంతుల నెల్లరన్ గెలిచి చిత్రాయోధనంబందు, దు
ర్జయ శౌర్యాంచితు లెల్లరుం మిగుల సాంద్రంబై విరాజిల్ల, ని
ర్భయ చిత్తంబలరంగఁజైద్య ధరణీపాలామితానీక సం
చయముల్, చేరఁగవచ్చె నచ్చట విపక్షప్రాజ్యసైన్యంబులన్. 39

మ. కుతలంబందునఁ బేరుగాంచినలసద్గోమూత్రికా చక్రబం
ధతతుల్ మున్నగు చిత్రబంధముల నందంబై మహాకావ్యసం
తతిబోలెన్ గడు బింకమై యలరె నానావ్యూహ సంపన్నమై
తత చైద్యావనినాధ సేనలు మహాదర్పోన్నతిన్ జూపుచున్. 40

—: శ్రీ యాదవసేనలు శిశుపాలునిసేనలతోఁ దలపడి పోరుట :—

ఉ. కోరిక మీఱఁ బోరు లొడఁగూడునొ యెన్నఁడటంచు సారెకున్
సారెకు నుమ్మలించు యదునాధులు లోకుల శ్లాఘ గన్నబల్
శూరులు గల్గు సేన, సొగసుల్ దయివారఁగ వెంట రాఁ బగల్
దీఱఁగఁ బోరు సల్పుటకు ధీరతఁ జేరిరి శత్రుసేనలన్. 41

సీ. అద్రిసన్నిభమైన యాకృతుల దురవ
గాహమై యొప్పెడు గజచయంబు
విక్రమోదయ వినిర్భీక సైనికపాళి
వెలయఁ గూర్చెడు పెద్దకలకలంబు
నేను బోరుదు వీనితో నని విరియించి
ప్రతివీరుతోఁ బోరు భటపటలము
నడ్డేమి లేక దిగంతరాళములందు
సరవిగా జరుగు సంచారములును

తే. గలిగి, తిరుగాడు జనముల నలరి పొడుపు
నొంద యదుసేన విస్తృతి నొప్పు పరబ
లమునఁ జొచ్చెను నరసమూహముల నెసఁగు
దీర్ఘరధ్యా నృపాలు విస్తృతపథమటు. 42

తే. వేగముల నొప్పి తోఁకల విప్పు దనరి
ఘోరశల్యాయుధాలు మయూరములను
బోలి నాగాలపైఁ బడి లీలఁ బ్రాణ
చయముల హరించెఁ జయ్యన సమరమందు. 43

ప్రమాణివృత్తము - గోమూత్రికాబంధము :

స్వనప్రభావ సారమై
దనర్చు దండు దారమై
జనస్ఫుభాప్తి సారె మై
దనర్చు దంతి దానమై. 44

తే. ముందుగా సాగి నృత్య మింపొందఁజేసి
హృదయసంశుద్ధి నొప్పారి యెసఁగునటులఁ
దనర సంగర మాలాప తతులఁ జెలఁగు
గానమును బోలి మిగుల జగానమనును. 45

తే. మండలాగ్రంబుచే రిపు మండలంబు
ఖండనం బొనరించు నుద్దండ ఖండ
నుం డొకండు భటుండు భూమండలాగ్ర
మున యశము పర్వ ననవద్యతను వహించె. 46

చ. వలతితనంబుతోడఁ బరివారమునందు నణంగి యుండి య
వ్వల నరులన్ వధింపఁగఁ జివాలున నొక్కక్షణంబునందె యు
జ్జ్వల వలమాన తేజము లెసంగఁగ రోషమునన్ గృపాణి యొం
డలఘుఁడు దాను ఖడ్గము బయల్పడి యాడుచు నాడఁజేసెడిన్. 47

చ. మఱి యొకవీరుఁ డంత లసమాన విలాస కళా విశేష సం
భరితము నొక్క వాఁడికరవాలము గైకొని భీకరాకృతిన్
వరలుచు వీరనృత్యము లొనర్చుచు ఘోర పయోధి విస్తృతి
స్ఫురిత విపక్ష సైన్యముల గ్రుక్కఁగఁజేసెఁ గలంచి బిట్టుగన్.

ఉ. పాయనివాఁడి గల్గు కరవాలముఁ గేలను బూని త్రిప్పుచున్
స్వీయుల వేవురన్ మనిచి, వేవు రరాతుల మస్తకంబులన్
గోయఁగ వేయిలోపల నొకొండు కబంధము తద్ద నృత్యమున్
జేయఁగఁ జూచి హర్షమునఁ జేసెను దా నొకజోదు నృత్యమున్.

గాఢ శస్త్రవ్రణాళ్యలంకరణ భూషి
తుం డగుచు యుద్ధభూమి యోధుం డొకండు
కొల్లిట నలంకరణ భూషితుండయి కని
పించెడి దశాననుని దలపించుచుండె. 50

క. వైరిని వధించుతఱి భి
న్నోరుయుగళుఁడగుచు నెత్తుఁరురలుచునుండన్
శూరుఁడొకం "డరుణుం" డ
నూరుఁడు నను రెండుపేళ్ల కుక్తుం డయ్యెన్. 51

క. జలధివలెఁ బొంగు నప్పెను
కలన మహామహుఁ డొకండు కడుభీమత్వం
బలవడ వెలువడె, దఱని
యలఘుమఖము గెడప వెడలు హరుకోప మటుల్. 52

క. వైరుల కత్తులఁ గాల్వురు
దారిత కరవాలు లగుట దరికొను కినుకన్
గోఱల గ్రుచ్చిరి పగతురఁ
దారిత కర వాలమగు మదద్విపము లటుల్. 53

క. హస్తిగముల నఱకిన వాల్
గత్తులు నలువంక మెఱయు కదనము జరుగన్
జిత్తమున భయము నొందఁడ
యొత్తిలఁడు రణోర్వినుండి యొక్కండేనిన్. 54

ఉ. "స్వామిఋణంబు తీర్పక యచత్తుమె" యంచును సత్కృతుల్ ఘట
గ్రామణు లాజిఁ బ్రాణములు గాచుకొనన్ దలకో; నసత్కృతుల్
"స్వామి యుపేక్ష యేల సలుపన్వలె మ" మ్మని రోష మూని సం
గ్రామమునందు గడ్డిపరకన్వలె వీడిరి ప్రాణవాయువుల్. 55

ఉ. సంగరభూవిహార మరిఁ జంపుట, కోపము దుర్దమౌజమున్
మంగళభూషలై తనరు మానిత శూరజనాళికిన్ యశో
భంగము గల్గ నట్టి సదుపాయము లెన్నిటి నెన్ని చూచినన్
సంగర భూమికిన్ దను వొసంగుటకంటె మఱొండు కల్గునే? 56

చ. పదను చెలంగుటన్ బరిభవం బొకనాఁడును బొందకుండి యా
స్పదమయి సత్ఫలంబునకుఁ బ్రౌఢిమఁ గాంచిన లోహశక్తి నో
యదనను శాక్తికుల్ విడచిరంతియు కాని యొకింతయున్ దురా
పదమగు నైజదేహ గతశక్తిని వీడ రరాతి భీకరుల్. 57

ఉ. శూరజనాగ్రయాయి యయి § శోభిలు భూపవితాన ముక్కునన్
వైరివనీ దవాగ్ని నిజ § బాహుపటుత్వము చూపి పోరుచో
భీరువులై యనిన్ విడిచి § వీఁగిన శత్రుల వీడి యన్యులన్
జేరి వధింత్రు దివ్యజన § చిత్తము లచ్చెరువొంద నత్తఱిన్. 58

తే. త్రిణత మైన విండ్లు § గుణతతి నమ్ములన్
ఫలము నందుఁగాకఁ § బట్టి లాఁగి
విడుచుచుండె విటుల § వేశ్యలు గుణశక్తి
లాఁగి విడుచునటు ఫ§లంబు ముట్ట. 59

క. ఓజోర్జ్యములు మెఱయఁగఁ
దేజులు బాణముల్గు వింత§తెంపున ననిలో
రాజిలు చయ్యిరు దెఱఁగుల
వాజుల్గఁ జొఱఁబాఱె వైరి§బల మధ్యమునన్. 60

చ. ఫలము పురస్కరించుకొని § వారక లోకమునన్ బ్రశంసలన్
వెలసిన మేలిపక్షముల § నేత్రము గాంచిన మార్గణౌఘ ము
జ్జ్వల కృత పుంఖతల్ దనర § సర్వ ధరాధిప మౌళి సన్నిధిన్
వలగొని చేరి సంతసిలె § వారము వారము లక్ష్య లబ్ధి చేన్. 61

చ. సమరతలంబుఁ జేరు పర§సైన్యములందు నిశాతబాణ సం
ఘములు విహారముల్ సలుపఁ§గాఁ దనవింటను నేసి కార్ముకో
త్తముఁ డగుకాలుబం టొకఁ డు§దారరణం బొనరించుచున్ జపా
సుమసమ శోణభాన మగు § శోణితమున్ బఱవంగఁజేసెఁ దాన్. 62

—: గజ యుద్ధ వర్ణనము :—

క. ఘోరంగోరి కరిద్వయి
దూరంబుననుండి వచ్చి § తొడరం బోవన్.
వారణకుణపము నడుమ న
యారె! వరండక విధాన§నడ్డై నిలిచెన్. 63

చ. భయము జనింపఁ గ్రిమ్మరును § భారము మ్రోయును భిత్తిఁ బోలు భీ
గయికొన, వింతయున్, భువికి § గాటపుబర్వగు భూరినీర దో
దయ ఘననీలకాంతులను § దాల్చును భేరులఁ బోలి ఘీంకృతుల్
వియతి వొసఁగు నాగము ల§సనిన్ వడిఁ బోరునొకం డొకంటితో. 64

చ. అసి న్నున్నువాయి గాయపడి హస్తములూడఁగ వాఁడికొమ్ములన్
గసిఁగొని పోరి మత్తగజకాండము వింత విహస్తతాభరం
బెసఁగఁగ దీప్తినొందు; మఱియెయ్యెడఁ గయ్యమునందు దంతముల్
బసచెడి యంత మొంది,నను బర్వు విహస్తత వాని కెయ్యెడన్. 65

చ. కరముల రెంటఁ జాకి యుదుకన్ వసనంబుననుండి నీరముల్
దొరలెడునట్లు లొండొకటి దొంతులు తొండము లెత్తి చాల ము
ష్కరమున, మొత్తఁగా మదనికాయము కాయములం దొఱంగి పె
న్వరదలుగా స్రవింపఁగ ననారత ముక్కున నిక్కె నేనుఁగుల్. 66

ఉ. అమ్మెయి ఘోర వారణరణాంగణమందు మడుంగు గట్టి చి
త్రమ్ముగ సారవ ద్విప విరాజిత దానజలమ్ము నిల్వ, మ
ధ్యమ్మున నిల్చి కొండొక మదావళరాజ మొగిన్ గలంచె గ
ర్వమ్ములు ముమ్మరింప శతపత్త్రిములన్ జలపట్టు లాగుచున్.

ఉ. దానకళా నిదాన కర ధన్య వదాన్యుఁడిభాన్వయాబ్ధి సం
తానకుజాధిరాజు బహు దారుణ శాత శరాహతిన్ గటా!
పూనెను బెద్దనిద్ర రణభూమి నటం చళికాంత లేకమై
దీనరవాళి నేడ్చిరి, గతించెను సాది విషాదియై వెసన్. 68

చ. రదములు శూన్యమైనఁ గడు రక్తము నోట ధరించు దంతు ల
భ్యుదయముఁ జేరదు నంతకుని భూరి శుభాస్పద చారు శయ్య యా
కదనతలంబునందుఁ గనఁగాఁదగె నెత్తురు పొట్టనిండఁ గ్రో
లి దగలు దీర్చుకొంచు బవళించి చలింపని నల్లులో యనన్. 69

సీ. గెలుపొ? యచ్చరకన్నె వలపొ? గైకొందు నం
చును నూట లూఱు నాతనికి ముదము
ప్రాణమ్ము బెల్లంబు కంటెఁ దీఁ పని యెంచు
పిఱికిపందకును హృద్విదళనంబు
"జయము నాపా; లపజయము నీపా" లని
కోరు వీరున కిష్టపూరణంబు
చచ్చి చంపుట లోకమెచ్చె? యంచు నసహ్య
పడు జోదునకు మెడఁబట్టి త్రోపు

తే. నొసఁగి రవణిల్లు ఖండన ముపమ లేక
యతిభయంకరమై వితతాసురత్వ
మూర్తి యగు నని జేరి, యమోఘబలులు
పోరిధరఁగూలి సుర భూయమును వహింత్రు. 70

మ. తిలమాత్రంబును సందులేని పగిదిన్ దేదీప్యమానంబుగా
నలఘు క్రూరత రాయుధాహతులఁ గాయం బెల్ల దీపింప బ
ల్విలు నమ్ముల్ కరవాలముల్ గొని మహావీరుం డొకం డంత ని
స్తుల పాండిత్యముఁజూపి స్వర్గసుఖముల్ చూఱల్ గొనెన్ లోభియై.

తే. అనుపమంబైన యాసమరాంగణము ని
పాతిత స్వామి మాతుల భ్రాతృయుత సు
హృ త్పితృవ్యం బగుట ధీరు లెంచినారు
పాణినిమహర్షి రచిత శబ్దశ్రుతముగ. 72

ఉ. కన్నుల దూరవస్తువులు గన్గొనఁగాఁ బ్రతిరోధమై ధరన్
మిన్ను గ్రసించు ధూళిపతి మేదుర సాంధ్య పయోద మాలికా
సన్నిభ రక్తనిర్ఘరుల సంహతి మున్గి శమించి పోవఁగాఁ
గ్రిన్నన బోరొనర్పఁ గుతుకంబుదయించెను వీరకోటికిన్. 73

తే. కరము విదళితమైన పుష్కరచయంబు
చెవరిపడు శంఖములుఁ దేలి కదలుపత్త్రి
రథములుం దయివారఁగా రక్తనదులు
కొల్లలై పాఱె సంగర క్షోణియందు. 74

తే. వాఁడిములకుల పోటుల వరద లగుచు
పాఱు నెత్తురు జీవజవంబు గొనఁగ
వీరతతి మజ్జ రక్త నవీన భోజ్య
సమితి విందిడె రక్షః పిశాచములకు. 75

క. జ్యారహితము లగువిండ్లను
దారములగు రక్తబహుశతహ్రదముల నా
వీరాశసన మపు డొ
ప్పారెను ఘారాధ రోచ్చయము చందమునన్. 76

ఉ. చుట్టము లయ్యునీన్ వధియు చోటను బందుగు లల్లవారివిన్
జుట్టి, యనేకరీతులను శోకవశంబులఁ జేయుగోల మిన్
ముట్టెను; దొల్లి గంటలను మ్రోసెడి యేనుఁగు పీనుఁగైన య
ప్పట్టున, నెట్టిసద్దు కను పట్టదు, భీతివిగూర్చె రెండునున్ 77

ఉ. లోకులప్రాణముల్ రణము లోనునఁ బిండిగఁ గొట్ట మిత్తి తాఁ
గైకొని, కార్యసిద్ధి వెసఁ గాఁగనె పీడిన యట్టి జోఁకలున్
రోఁకళు లివ్వియే యని నిరూఢిగఁ జెప్పఁగవచ్చు నాజిఁబెన్
బాఁకుల నేలఁ గూలినయిభంబుల దేహములున్ రథంబులున్ 78

క. తన్నొక్కనిఁ దక్కఁగఁ దన
కున్న వజీర్లను జయించి యుబ్బెడు పగఱన్
జిన్నతన మొంది యభిమా
నోన్నతి నోడించి [illegible] 79

—: శ్రీకృష్ణుఁడు యుద్ధమున శత్రుసేనఁ దునుమాడుట :—

సీ. వేల్పురా విలుపజ్జ వ్రేల్ మెఱుంగుంబోలె
నెదకెంపు నొరయు పక్షియిండిపటము
తూఁడు గల్గని తమ్మి దొరయు నెమ్మొగముపైఁ
గమ్మతావులకునై గ్రమ్ము తేంట్లు
తబిసిఱేఁడులును గ్రొందలిరుఁబోఁణులు నర్థిఁ
జొక్కి కౌఁగిలి గోరు సోయగంబు
లెక్కపెట్టఁగరావి చక్కఁదనంబుల
కిక్కయై వెలుఁగొంది యెసఁగు శీవి

తే. మున్నుగా నెన్నఁ దెలియని వన్నెగన్న
తన్నుఁ గామించి క్రేఁగంటి తళుకు లొలికి
విజయలక్ష్మి కెంగేలంటి వెంట రాఁగ
ర్తి విస్ఫూర్తి శ్రీకృష్ణ మూర్తి వెలసె. 80

సీ. నింగి చుక్కలకన్న నేదైన రతనాల
పలుదెఱంగుల సిరి పరిఢవిల్ల
ముజ్జగంబుఁ గరంబు బుజ్జగించెడు బొజ్జ
పలుచనయ్యును బ్రభావమున మించ

ఓర్వ విశ్వాంత సంవిదిత తేజశ్ఛటా
వ్యాప్తి స్ఫురద్విభవం బెలర్ప
వెలసి దా నన్నింట వెలయించు నునుమేలి
డాలు కాళిమ మిక్కుటమ్ము గాఁగ
తే. భవము భవదుఃఖమును నింత పాటి గనక
సర్వభవ పాత రక్షణ శక్తి దనరి
గరుడి నెక్కి వినిర్భీక ఘనత కెక్కి
ద్వారకానాయకుఁడు హరి దారసిల్లె. 81

తే. అతవి ప్రాంతంబు గోరి శుభ్ర భాళ దవులు
పరులు, కృతయోగభరులు సంప్రాప్తి నిశ్చ
యాంతరులు త్యక్త నైజదేహాభిమాన
భరులుగాంచిరి వాని దిగ్భ్రమితు లగుచు. 82

సీ. అల సుధాంభోధి మహాన్వయంబునఁ బుట్టి
యాభిజాత్యైశ్వర్య మందు నెవతె?
సీమంతినీ జన శ్రేణీ మణీమాల
యనఁగఁ గీరితిఁ తావు లెనసె నెవతె?
అలరులజోదుఁ గన్నమ్మ యంచుఁ బ్రసిద్ధ
సౌందర్యవతియై యెసంగు నెవతె?
లాలితబహుగుణో ల్లసితానవద్య సీ
మాభిరామతఁ జెలువందె నెవతె?
తే. యట్టి సిరి గబ్బిగుబ్బపయిం టంటుఁ బ్రోడ
పాపములఁ బాపెఁ దనకలు వారి నరసి
మేలుమందు స్థిరారోగ్య మేల నీయ
కుండురోగికి వెగటయ్యెయుండుఁగాక. 83

చ. అనులను బెక్కుచేసి విజయంబులఁ గాంచిన మేటిశూరులున్
చనువుల వీడి కయ్యమునఁ దాము దివంబును జేరి యందు నీ
యన పెఱవారికిన్ బ్రణతుఁడౌట యెఱుంగఁ డటంచుఁ బల్కు ధా
త్రిని నీక వానిఁ బోర నెదిరించెడి పాటి మగండు గల్గునే? 84

చ. ఉరుతర కార్యదీక్షల నియోగముఁ జేయు ప్రభూత్తముండు న్ని
ర్భర బహుసార చారు గుణ భాసుర కార్ముకరత్నమున్ సదా

విరళ మహః ప్రభావ సమ ǂ వేత కరంబున భూరి గౌరవో
త్కరము సెలంగఁజాల ప్రణ ǂ తమ్మగఁ గూర్పఁగ నేర్చు జాణయై.

క. ములుకుల సుపరుష్కమ్ముల
నలరు గుణముతోడఁ గూర్చి ǂ యాకర్షింపన్
వెలయు బలునాదు పగతుర
బలముల సుపరుషమ యగుచు ǂ బలియన్ బలియున్. 86

క. పశ్చా త్కృత నరులం బలెఁ
బశ్చాత్కృత సార బాణ ǂ పటలములోనన్
నిశ్చిత గుణమును గను నది
యాశ్చర్యమె కృష్ణ కర్ణ ǂ మనిశము చేరన్. 87

మ. తొలి మత్స్యాధిక దేహముల్ వడసి తాǂదుష్టారులం జంపి వే
ద లసన్మార్గ చరిష్ణు లోకులకు మంǂదారంబయై కోర్కులన్
వెలయంగా నిడి వన్నెకెక్కు పరమున్ ǂ నిష్పాపు లక్ష్మీపతిన్
ములుకుల్ గాఁడఁగ నేసి యేసి కడు బెంǂపుం గాంత్రు వైరుల్ వెసన్.

గీ. పక్షమును జెంది, క్రొవ్వాఁడిఁ ǂ బరఁగి, భీమ
నినదముల నొప్పి, మర్మభేǂదన పటుత్వ
మలర నెల్లెడ వ్యాపించు ǂ నహితగణము
నిశితవిశిఖంబులం బద్మ ǂ నేత్రుఁ డేసె. 89

గీ. వర శరాసన కేతన ǂ స్ఫురిత మగుచు
శరపరంపర లొక్కటఁ ǂ గురిసి కురిసి
కృష్ణ కైతవ జలదంబు ǂ వృద్ధి బొంది
నీలనీలాంచితం బయి ǂ నేటు గనును. 90

గీ. తెఱపి లేకుండ నలుఁగులఁ ǂ బఱపువేళ
వింటనే కాదు నుడిఁబెట్టు ǂ దంట యగుచు
తమ్మికంటి విజృంభించి ǂ దాయ లైన
యెల్లరను సుళ్ళనుంబెట్టు ǂ యుల్లసిల్లు. 91

సీ. లోకత్రయాంతర ǂ ప్రాకటైక విహార
ధీరమా నేదేవు ǂ దృగ్యుగంబు

నళిని ఫాలకమును గలభాషణమ్ము నై
యేవేల్పు నెమ్మొగ మ్మింపు గనును
నిర్జితాంతఃకల హార్జిత పాపాప
నోదనం బే పావనువిహృదయము
నీల నీరదబృంద నిర్జరేశ్వరరత్న
నీలిమాంచిత మేకృపాణ మేను
తే. తొల్లి భూదేవి దుఃఖాబ్ధిఁ దొరలి మునుఁగు
నట్టి దురవస్థఁ గనిపెట్టి యిట్టెపట్టి
పంటికొన నిల్పి వెసఁ దన పట్టమహిషిఁ
జేసె నేదఱఁ డాయశ శ్శ్రీకుఁ డితఁడె. 92

క. దానముల స్థూలలక్ష్యత
గాని, శరాసనమునందుఁ గలుగని కతనన్
బూని పరిహరించు వైరిక
నివికలం దప్ప కతఁడు నిడుకోలలచేన్. 93

క. వరదుఁడు వివరవిరహితుం
డరి బలవారకుఁడు వారి దారావుండున్
వరవీరుఁ డుర్వరా గత
తరణియు నగుహరి యరాతి తతిఁబరిహరించెన్. 94

గీ. వాసుదేవీయ మైన చాపంబు తీసెఁ
బగఱప్రాణాలు శరపరంపరలు నేసి,
యనిన నింతె? సజీవమ్మె స్వాన్యధను లె
దేవి యొప్పార సహియింప లేనిదకద. 95

సీ. పుట్టు వొందక స్వయం భూప్రసిద్ధాఖ్య ము
జ్జగములం దెల్లెడ జరుగువాఁడు
కాలంబునకు మీఁదికాలంబును నెఱింగి
తుది యెఱుంగక యెప్డు దోఁచువాఁడు
నఖిలమ్ము తా నయి యలరుచుండుటఁజేసి
మనమున భయ మెప్డు గననివాఁడు
సంవిదాకారుఁడై స్వచ్ఛతావాప్తిర
జోగుణంపుఁ దలంపు పొరనివాఁడు.

తే. నజుఁడు నరజుఁడు, నజరుం డుదారతేజు
లవు పగఱఁ ద్రుంచు బలము నార్జనమువాఁడు
స్థిరతరుఁడు నైన హరి రణాజిరమునందు
రాజరాజిని బరిమార్చి తేజరిల్లె. 96

గీ. గర్వితారాతి పాంత యౌ కమలనాభు
నంపలు విరోధిరుధిరమ్ము లాస్వదించి,
భువనములఁ గాచి "పా" ధాతువునకుఁ గలుగు
నర్థములు రెంటి నొందె నాహవమునందు. 97

సీ. దుష్టశిక్షార్థమై శిష్టరక్షార్థమై
యవతారముల నందు నట్టిప్రోడ
దంతిఘటా దాన దక్ష కరామోఘ
పాండితీ మండన భాసురుండు
నాకకోటి సూర్యుల చకచక ద్యుతులతోఁ
బదునాల్గు భువనాలఁ బరఁగు వెలుఁగు
బహు కర్క శావనీ పతులతోడి రణాల
నతికర్కశుం డయి యమరువాఁడు
తే. నైన హరి పద్మమృదుపాణి నమ్ము విల్లు
పట్టి రణభూమి విహరించి పగఱనెల్ల
యాతనలఁ బొందఁజేయుచు నడుగడుగున
వెఱఁగుపడఁ జేసి కలఁచుచు విక్రమించె. 98

ఉ. భూమిభరమ్ము దీర్పుటకుఁ బుట్టిన యాజగజెట్టి మెట్టి యు
ద్దామ రణోజ్జ్వలైక వసుధాస్థలిపైన యఖర్వ మంగళ
శ్రీమహితాత్మపాదము, నశేష రిపూత్కరముల్ వధించి త
ద్భూమిభరమ్ముఁ దీర్చు నలపోటరి, మేటిశవాల కోటిచే. 99

సీ. పూతాష్టమహిషీ ప్రమోదసంధాత; యా
తత భీరుతా దరిదారిణ భూమి
దాన నిర్జిత పయోద క్షపాకరవార్ధి
ధీరతా ధూత సుమేరుశిఖరి

సర్వదేశ ప్రతిష్ఠా కేతుభూతుండు
సాధుజ నాతిసౌ × జన్యసీమ
యహిత జనక్షయో × ద్యతకాలకూటంబు
భక్తజ నావన × వజ్రకవచ
తే. మగు మురారాతి దూరంబు × నందునుండి
శత్రు వనునట్టి యెండుకా × ష్ఠముల నిట్టె
ముట్టకయె తున్క తున్కగాఁ × గొట్టఁ గలుగు
నట్టివాఁ; డాతని నెదుర్చు × నట్టిఁ డెవఁడు ? 100

గీ. మున్ను రామావతారాన × ములికి నొకట
సప్తతాళ ద్రుముల నొక్క × సారి గూల్చెఁ
గృష్ణరూపాన నేఁడు దు × ర్వాల త్సహస్రి
ములనె యొకపాటి దైన తూ × పునను గూల్చు 101

ఉ. శూరుఁడు వైరిఁ జక్కడఁచు × చొప్పులఁ గూరుఁడు వార్ధికన్యకా
చారు కరాంబుజ గ్రహణ × చాతురిధీరుఁడు యాద వాన్వయో
దారుఁడు శౌరి వైరి జన × తాఘనమస్తక కోటి నాశు గా
సారముచేత బోరున ర×సాస్థలిఁ గూలఁగ వేసె హేలఁగాన్. 102

చ. అరయ మనోహరాఖ్య కగు × నట్టిది యెల్లమనోవిలగ్నమై
పరఁగును గాని యాదవనృ×పాలుని శాతశరమ్ము లాజిలో
గరువము నొందు శాత్రవ ని×కాయముపట్ల మనోహరంబులై
వఱలుచె కాక వక్షముల × వ్రస్సి చనున్ బగ ప్రస్ఫుటంబుగా 103

చ. శరములఁ జెక్కియున్న ముర × సంహరు నామలిపిన్ బవిత్రితల్
దఱుగునొ యంచుఁ దద్విశిఖ × తండము లెల్ల విరోధి కంఠముల్
దరుగుచుఁ గేవ లాసుతతిఁ × దాము హరించియు నెత్తు రింతయున్
బొరయక నిల్చి యవ్వలికిఁ × బోవు రయంబున నామహాజిలో. 104

ఉ. జీవనంబుతోడ రణ×సీమకుఁ బోయెడు యోధసార్థులన్
జీవనసంబు దోఁచికొని × చెచ్చెర నచ్చటఁ బర్వి మాయమౌ
గ్రావ కఠోరమైన యదు × రాడ్విశిఖ ప్రతతుల్ రణాటవిన్
ద్రవలు గొటునట్టి గడి× దొంగలుగా నవి యెంచి చూచినన్ 10

క. కేతువులున్ శరములును బ్రి
ఘాతములై వెలయ ఘోర । యుగంబోరు తతిన్
ఖ్యాతి గల పగఱ రుధిరా
పాతంబులందడిపె జినుఁడు । ప్రథనాంగణముల్ 106

ఉ. శూన్యము నిష్క్రియంబును విశుద్ధమునౌ గగనంబునందు రా
జన్య శిరో విరాజి పద । సారసుఁడౌ హరి యేయు పత్త్రులున్
శూన్యము నిష్క్రియంబును విశుద్ధమునౌ పరసైన్యమందు సా
మాన్యగతిన్ బతత్త్రిలును । మాంసముఖంబులతోడఁ బర్వెడున్ 107

సీ. యజ్ఞదానాది క్రియాపుణ్యచరితుల
కౌగి సత్ఫలం బిడు । నొక్కకరము
సాధుసంతాన హింసాదుష్టకర్ముల
కురు దుఃఖఫల మిడు । నొక్కకరము
ఎలమి భక్తాగ్రేసరులకుఁ బవిత్రతల్
మక్కువతో నిచ్చు । నొక్కకరము
వేద నిషిద్ధ క్రియా దోష నిరతుల
నుఱిక్కించు నరకాన । నొక్కకరము
గీ. నేకగతి దాతకు నదాత । కిచ్చుకరము
నిఖిలము గ్రసించు ఖలుల ఖండించివైచు
నచ్యుతుం డట్టి బహువిధ । మగుకరముల
దురమున వధించు రిపుల నంపఱను ముంచు. 108

గీ. హృదయ విక్షతులన్ జని । యించి, కుంభి
కుంభముల నురోజముల నౌ । క్కొటను దడిపి;
పాఱునటు చేసె శౌరి సపత్నులయుఁద
దీయపత్నులయశ్రునదీ శతంబు. 109

గీ. భవ్యమతి, సదా మదబల । ప్రియగతి, స
ముద్ధృత రసుండు నుర విక్రమౌజసుండు
నైన యాహరి రెండవ । హరిని బోలి
శ్రీయుతుం డౌచుఁ గడుఁ బ్రకాశించె నపుడు. 110

క. హరి నొక్కరునే కవి యి
ప్పరుగా మువ్వురుగ నల్వురుగ నెన్నుచు నం
గరమున భయవిభ్రాంతిన్
బరబలములు గాంచె నంతఁ బంచత్వంబున్. **111**

క. నిరతాలంకృతుఁ డిటు దై
వ రచిత జయగాథ చెలఁగు బవరములందున్
బరతేజం బుడివోవఁగఁ
జరించెఁ దనతేజ మొప్ప జలధితటమునన్. **112**

చ. అరివధ రూప మైన పతి యావతి నిర్వహణం బొనర్చి తా
చ్ఛరము లథోముఖంబు లయి చయ్యనఁ బృథ్విని జొచ్చి నట్లయోఁ
బరజన మధ్యమందుఁ దమ భర్తయ చిమ్మ నథోముఖమ్ముగా
కరయ మఱొక్కవృత్తి యెటు లబ్బు విశుద్ధిగలట్టి వారికేన్. **113**

సీ. దురితంబు లెల్లను దునుమాడు మరపిటు
తత శుభమ్ములకు ముత్యాలపేట
యలఘు పవిత్రత కలరఁగట్టిన మూట
మోహనాంగుల పాలి ముద్దుమూట
నిర్భయశ్రీకి మావితపువజ్రపుఁగోట
యురువగు శ్రీవత్స మొప్పపేట
పరమృగంబులకుఁ బేర్పడ్డ తోరపువేఁట
విందుసౌభాగ్యంబు నిల్పుతోఁట
తే. యైన హరి రణరాగ సక్తాప్తిఁ ధవర
ఘోరమగు సింహనాదంబు బోరుకొనఁగ
నాకసం బెల్ల బాణమయమంబుగానఁ
గోపుఁదూపుల వేయుచు వేపుచూపు. **114**

ఇది శ్రీ బుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున నుభయసేనలయుద్ధ వర్ణనము, చిత్రయుద్ధవర్ణనము, శ్రీయాదవసేనలు శిశుపాలునిసేనలతోఁ దలపడిపోరుట, గజయుద్ధవర్ణనము, శ్రీకృష్ణుఁడు యుద్ధమున శత్రుసేనలఁ దును మాడుటయను నేకోనవింశాశ్వాసము సమాప్తము

శ్రీరస్తు.

# శ్రీ మందాంధ్ర మాఘము

[శిశుపాలవధ మహాకావ్యము.]

## వింశాశ్వాసము.



—* శ్రీకృష్ణుని శిశుపాలుఁడు యుద్ధమునకుఁ బిలుచుట *—

క. సుడివడకఁ గన్బొమలు ము
గ్గడి నుదుటన్ గదుర నిలుపఁ§గారాని రుషన్
బడి, మెడ నిగుడించుచుఁ గడు
వడిఁ జైద్యుం డనికిఁ బిలిచె § వారిజనాభున్. 1

క. నునువాఁడి గుడుసువాల్వా
యినిఁ బిల్చుచు మిత్తిబుజము § లెక్కి నటింపం
గ నియతి సారథియై చ
య్యన రథముం దోలఁ జైద్యుఁ § డచ్యుతుఁ గదినెన్. 2

ఉ. చక్రపుఁగమ్మి క్రిందఁబడి § చచ్చినవారల యేని నెత్తురి భూ
చక్రముఁ గ్రమ్మి కుంకుమర § సంబటు లెఱ్ఱనిపూఁతపూయ ని
ర్వక్రపరాక్రమంబును గ § రాళగమాగ మనక్రియంబునౌ
చక్రిరథంబు చైద్యమహి § జాని రథంబు నెదిర్చెఁ గ్రిచ్చఱన్. 3

ఉ. పీనిని జంపకుండ ముడి § వేయ శిరోజము లంచు గట్టి యొ
ట్టూనిన కాలు మూర్తి యిదె § యొక్కొ యనం దగి చైద్యుతరితో
జానుగ నాయతం బయి యె § సంగెడి కేతు చల త్పటాంతమై
మానిత కింకిణీరవ సమగ్రము§నౌ హరితేరు దార్కొనెన్. 4

గీ. నీటిమబ్బుల యుఱుముల § నీటు గాంచి
దెసల మసలెడి కృష్ణుని § తేరిరవము
నెమ్మిలేమలు కుత్తుకల్ § నిగుడ నెత్తి
పెద్దగాఁ గేక లొనరింప § విస్తరిల్లె. 5

గీ. ధాత్రీకుచ కుంకుమా రోపితంబు
ముదిరి గనుపట్టు వెడఁదయౌ మురజిదురము
నరసినంతన చైద్యుఁడు చిరపరిచిత
మైనను గుఱిథామహాదేవి కగ్గమయ్యె 6

—* శ్రీకృష్ణునిపై శిశుపాలుఁడు క్రుద్ధుఁడై బాణములు ప్రయోగించుట *—

శా. కోపోద్దీపిత మానసుం డగుచుఁ బల్ఘోరాశని ధ్వాన సం
ఘోపమ్యమ్మును గాంచు క్రూరతర శబ్దాటోపముల్ పుట్టిన
ట్లేపారన్ బఱిశ యాని లేరిత మహాగ్నిద్యచ్ఛిఖా సన్నిభం
బై పెంపొందిన నారిమీఱు విలు మ్రోయంజేసెఁ జైద్యుండహా! 7

క. తొడగుటయు నారిలాగుట
విడచుటయును నెఱుఁగరాని విధమున నొక టౌ
యెడసన్ని గలుగఁ జేదివి
భుఁడు హరిఁ దత్సేనఁ గప్పె ములుకుల గములన్. 8

క. ఋజుతా ఫలసంసిద్ధుల
భజించి గురుపక్ష మొందు బాణాళికి సం
భజనీయము పొందగు వి
శ్వజనీన గుణాంక మైన చాపముతోడన్. ౯

చ. పరఁగ నృపాలుఁ డైన శిశుపాలుఁడు దారుణకర్మ నిష్కృతిన్
గరమును సంఘటింపఁగ నొకానొక యాజ్ఞ నొసంగ దాని స
త్వరగతిఁ దీర్ప నొండు బలవంతముగా వితతార్తి కర్షణం
బరుదుగ సల్ప జీవ మసియాడ శరాసన మార్చె బిట్టుగన్. 10

క. ఎడతెగక పరఁగి శుద్ధిం
బడసి పటుత్వంబు గాంచు పక్షము గొని నే
ర్పడరెడు వాదిమొగమ్మున
వెడలు పలుకులట్లు ధనువు వెడలును శరముల్. 11

గీ. మహిషశృంగ వినీలమౌ మహిపుబాహు
దండమే ముక్కురీతి మధ్యమునఁ దనర
విల్లు కుపితాంతకుఁడు ముడివెట్టు కన్ను
బొమలఁ గూడిన దారుణ ముఖముఁబోలె. 12

గీ. మించు మించెడు బంగారు ƒ మిసిమిఁ జెలఁగు
ములుకులు గల నల్లని యలుంƒగులు నభమున
వేగముగఁ బర్విసుంతైన ƒ విడువ కెల్ల
యెడల మబ్బులగుంపు కైƒవడిని గప్పె. 13

గీ. పసిఁడిములుకులు సర్వత్రి ƒ పర్వి మబ్బు
మర్మములఁ గాఁడఁ దాఁక దిƒఙ్మండలంబు
వేదనకుఁ బాలుపడి పెద్ద ƒ రోదనంబు
సలిపి విడిచెడి కన్నీటి ƒ సాటి యగును. 14

చ. వసుధఁ జెలంగు సొంపులు, దిƒవౌకసులున్ గగనంబునందు నిం
పెసఁగెడు చిత్రముల్ భువి వƒసించెడువారును గాంచ కుండ, నా
కసమునకున్ వసుంధరకుఁ ƒ గల్గినయంతరమందు సాంద్రమై
దెస లఖిలంబుఁ గ్రమ్మి ఖర ƒ దీధితికాంతులఁ గప్పె బాణముల్ 15

ఉ. గ్రక్కునఁ బ్రొద్దుచాయ గల ƒ గాటపువెట్ట నడంచి మించి నల్
దిక్కులయందుఁ బర్వ బహుƒ తీవ్రశరంబులఁ జైద్యుఁ డేసి, యే
చక్కని జూడరాని యొక ƒ చక్కని మేలుబవంతిఁ గూర్చె నా
రక్కసి గొంగయైన యదుƒరాజసుధాంశుని సైన్యపాళికిన్. 16

ఉ. చేదినృపాలకుం డపుడు ƒ చెచ్చెరఁ బైఁబడ వచ్చుచున్న యా
యాదవరాజసేనల విƒహంగతలిన్ బలెఁ జుట్టుముట్టి చే
ష్టోదయ హీన మౌచుఁ బడిƒయుండునటుల్ సృజియించె నాసమి
న్మేదిని బాణపంజరము ƒ మెచ్చి కనుంగొనఁగా వియచ్చరుల్. 17

—* కృష్ణుఁడు శరవృష్టిఁ గురియించి శత్రుసేనలను జెల్లాచెద రొనర్చుట *—

ఉ. తూపుల జల్లువానలను ƒ దోరముగాఁ గురియించి వైరు లా,
టోపము చూపఁ దా నొకరుఁƒడున్ హరి మాన్పెను వాని నన్నిటిన్
ధీపటు వౌచు వాది హవƒణించు ప్రమాణము నన్యమౌ ప్రమా
ణోపచయంబుచే నడఁచి ƒ యోర్చిన తత్ప్రతివాది వైఖరిన్. 18

క. మోఁకాలు వంచి చెవికిన్
దాఁకఁగ నల్లియను లాఁగి ƒ దడయక విడువన్
శ్రీకాంతు ధనువు మ్రోసెను
బ్రాకట జలదాంత మత్త ƒ బకరవ సఖమై. 19

ఆ. ఎడఁద§వెడఁదఁ జేసి § మెడను నట్టువపుల్గు
వలెను నిగుడఁ జేసి § వనజనాభుఁ
డంసముల గుదించి § యల్లియన్ బిడికట్టుఁ
బిడికిలించి బొమ్మ § వడువు గాంచె. 20

గీ. టంకృతులు గర్జ లల్లె బె§డంగు మెఱపు
సింగిణియ మబ్బు తూపు లె§చ్చిరులు వాన
గాఁగ శ్రీకృష్ణుఁ డనెడు వ§ర్షాగమంబు
వింతవర్షంబు కురిసి వి§ద్విషుల ముంచె. 21

గీ. ఎత్తురువుకొమ్ము లన మూఁపు § లెనసి పొడవు
లందములు చెంది దెసకొన § నలమి యొక్క
కైన హరి బాహుదండంబు § నతని సైని
కులు గనుంగొని తలఁచిరి § గుబ్బలిగను. 22

గీ. పట్టి పగవారు పఱపిన § వాఁడియలుఁగు
గముల నవ్యర్థ ముఖములు § గలుగువేఁగు
వాండ్రచేఁ బరమంత్రిసం§పదల నెల్ల
చెఱచునట్టుల శరములఁ § జెఱచు నతఁడు. 23

చ. మెఱయు సువర్ణరేఖలను § మీఱు మురారిశరాళి యన్నట
క్కరి యగునాథు కట్టెదుట § ఖండితమై యరిముక్త సాయకో
త్కర వరణీయ కామిని య§ఖండపరాభవ మొంది సత్ఫలో
త్కరములు మొక్కవో భువిని § గాటపుగాసిని వ్రాలె నయ్యెడన్ 24

చ. మఱి యొకపట్టునందు యదు§మాన్యశరావళి దాఁకి నంతనే
యరిజన ముక్త బాణచయ § మానినసీమను సంగత క్షతిన్
మరలుచు నెంతదవ్వున క§మందగతిన్ జన శక్తిగల్గు ని
బ్బరముగ నంతదవ్వు చని § వావిరి గూలెను భీతిచే బలెన్. 25

గీ. అలుఁగు లన్యోన్యమును దాఁక § నగ్గి పుట్టి
కొనలు నొండొంటి దాఁక మి§ణ్గురులు పొదలి
మొగులుగమి నాకునందాఁక § మొలచునాల్క
లెనయ నొకకొంతతఱి జ్వలి§యించి మించె. 26

ఉ. ఇందుకులప్రభుండు హరి * యేయుశరవ్రజ మాయరాతి గో
బృందతటిత్వదాభఁ గడు * వేగ శరత్సమయంబునంబలెన్,
డిందఁగఁ జేయఁ బొల్చెను గ*డిందిగ నందము నొంది యాదవా
నందథు వాహినుల్ వికచ * నవ్యసరోజయుతాళలున్ బలెన్. 27

ఉ. ఏనుతశౌర్య చాపమున * నెక్కిన బాణము పర్వువెట్టునే
కాని తొడంగి లాఁగుటయు * గాంచఁగరాక నిసమొందనో
యానళినాక్షు నయ్యెడ శ*రావళి గుప్పిన నొక్కవేవెలుఁడి
గూనిన నాని గప్పెనను * టొప్పదు, నింగి చెలంగి గప్పుచో. 28

చ. సరసిజలోచనుండు రభ*సంబున నేయునిశాతతోమరో
త్కరము సపక్షమయ్యు బలు*గాసికి నౌ శిశుపాలు నేనకున్,
బరఁగ విపక్షుచేత విభ*వమ్మును గాంచినయట్టివాఁడు తా
నరిది సపక్షతల్ గనిన * యంతనె లగ్గుల కౌనె యేరికిన్. 29

ఉ. వేగిరపాటునన్ రొదలు * విస్తృతి గాంచిన. పెద్దఱెక్కలన్
బాగగు చక్రిపాణి శిత * బాణపరంపర, హొన్నుబచ్చెనల్
సాగఁగ వైనతేయు బలు * సాటువ లొప్పఁగ సర్పరాజముల్
భీ గొని పర్వ భోగవతిఁ * బేర్మిని జొచ్చె నవార్యఘోరతన్. 30

క. శిశుపాలభూపవర్యుని
నిశితాగ్రిశరంబు లరుల * నెఱి మర్మములన్
వెశసింపఁ గలిగియును నవి
వశివంద్యు నలంప నతనిఁ * చాపములువలెన్. 31

—* శ్రీకృష్ణునిపై శిశుపాలుఁడు స్వాపనాస్త్రముఁను బ్రయోగించుట *—

సీ. ఏదేవుమాయచే * నీరేడు జగములు
సృష్టిస్థితులఁగని * చెలఁగుచుండు
సర్వలోకావళి * సమయువేళలఁ గాని
యేస్వామి కనుమోడ్పు * లెఱుఁగ కుండు
యట్టి యఖర్వమా * యాజాలముల కెల్లఁ
బుట్టినిల్లయి పొల్పు * పురుషునందు
నట్టిసంతతజాగ్రి * దనిమేష చక్షుఃప్ర
భావసంపద నొప్పు * భవ్యునందు

తే. నెంతసాహసవంతుఁడో § యింత చింత
లేక చైద్యుండు తనమాయ § లీల చెంత
గెలుపు నొందఁగఁ గాంక్షించి § వెలయు స్వాప
నాస్త్ర మరివోసి యేసె ర§యంబు మీఱ. 32

ఉ. నీటి మునుంగఁగాఁ దడిసి § నీలిమ దేలు వరాహదేహపున్
నేటుల నొప్పఁ భాస్కరుని § నెట్టన నర్థవిహీనుఁ జేసి బ
ల్మాటుకకొండపై యిరులు § కంజదళాక్షుని సేన కాంధ్యముల్
గాటముగాఁగఁ గూర్చి త్రిజ§గమ్ములఁ గ్రమ్మెను ముమ్మరమ్ముగన్ 33

— * స్వాపనాస్త్రముచే శ్రీకృష్ణుని సేనలు నిద్రించుట * —

ఉ. కన్నులు చీఁకటుల్ బలిసి § కప్పక మేల్కనియున్న వేళనే
సన్నుత చాపసంగతి నె§సంగుచుఁ గష్టముఁ బాపికొంద్రు శౌ
ర్యో§న్నతిమై యదూద్వహుని § యోధవరుల్ మును నట్టివింటనే
పన్నగ నంధకారములు § పైకొను వేళల వీడకుం ద్రొగిన్. 34

ఉ. యాదవసింహు పక్షపు ధ§రాధిపు లెంతటిశూరు లైన వి
క్లేదరు చీఁకటుల్ గనుల § నెంతయుఁ గ్రమ్మి యలంచువేళలన్
పై దరికొన్న కష్టములఁ § బాయఁగఁజేతురు విల్లు చేతిలో
మోవ మెలర్ప నుంచుకొని § బో మును జాగ్రదవస్థనుండియున్. 35

శా. అయస్త్రం బొకదేహ విస్మృతి రయం§ బారంగఁ గావింపఁగా
నేయత్నంబులు చేయకుండియు నిజా§హీనోల్లసద్ధారణ
శ్రీ యొప్పారెడు సక్తి గోల్పడిన బల్చే§పట్టులం దుండి కా
పేయంబౌ మతినుండి శాస్త్రముబలెన్ § వే జాఱె నారాచముల్. 36

శా. మున్నీటం బవళించువాఁడు స్వబలాం§ భోరాశి మధ్యస్థలిన్
గన్నుల్ మూయక సర్వలోకచయ ర§క్షాదీక్ష పెంపొందఁగిం
చిన్మాత్మార్కమరీచిజాలము కడున్ § జెల్వొందివెల్గొందఁగన్
వెన్నుం డొక్కఁడు మాత్రి మేకనఁబడెన్§నిర్నిద్రుఁడై యయ్యెడన్. 37

— * శ్రీకృష్ణుని దివ్యతేజస్సుచే స్వాపనాస్త్రము వమ్మగుట * —

చ. కలువల రాయనిన్ గలువ § కన్నెలదాయని గన్నుదోయిగా
వెలయఁగఁ జేసికొన్న యదు § వీరుని కన్నుల కెంపు తొమ్మపైఁ

జెలఁగెడి కౌస్తుభంబుపయిఁ ౹ జెచ్చెరఁ దాఁకి కఠోరసూర్యదీ
ప్తులు ముకురంబుపైఁ బడినౕ పోల్కి బయల్పడె దుర్నిరీక్ష్యమై. 38

క. వసుదేవసుతుని యురమునఁ
బసగొను రతనంపుడాలు ౹ బలసి నలుదెసల్
పొసఁగించు నరయు వారికిఁ
బ్రిసన్నతం;గురులదయలు ౹ ప్రణతులకుఁ బలెన్. 39

ఉ అంతటఁ గ్రిమ్మ అ నళినీ
కాంతునిపాదములు నైజ ౹ కాంతుల నెనయన్
సంతమస ముడిగిపో మూ
ర్ఛాంతము గని బ్రితికె జీవ రాశులు తెల్విన్. 40

క. ఇరు లటు విరియుటయును గ్రి
మ్మఱి యరులను యదుభటాళి ౹ మఱిమఱి గ్రిఁచెన్
నెఱిమబ్బు విడిన యెండలు
సురసుర నెరియింపవాకొా వ ౹ సుంధర నెల్లన్. 41

— *శిశుపాలుఁడు నానాస్త్రములను బ్రయోగించుట* —

గీ. అవని మిథ్యాభియోగమ్మ ౹ న్యాయమునకు
నోడునటు లిర్లు కౌస్తుభో ౹ ద్యోతమునకు
నోడుటయుఁ జైద్యుఁ డురుశరీ౹ రోగ్రి ఫణి వి
తాన మపుడ పుట్టించు మంౕత్రిము జపించె. 42

గీ జల్లెడలఁ బోలఁ పడగలు
పెల్లుగ విసమును గలాఁపి ౹ విధముగఁ గోఱల్
జల్ల నిరునాలుకలు నెల
వు ల్లోలము లగుచుఁ బోఁపఁ ౹ బొడమె నురగముల్. 43

చ. నిగనిగలాడు వెండ్రుకల ౹ నీలిమలన్ ధరియించి మాయ ప
న్ని గెలువఁగోరి తత్క్షణము ౹ నింగిని వ్రేలుచు జాలఁ గప్పెఁబ
న్నగ నికురుంబముల్ దొలఁత ౹ నవ్యసు ధాద్రి జనించి మించి ము
జ్జగముల వన్నె కెక్క నల ౹ సైంధవరాజము తోఁక కైవడిన్. 44

గీ. ముఖమున విశాలములు నాను § పూర్వి సన్న
మయిన ఫణులు ముఖమునం § దధిక మాను
పూర్విఁ గృశ మౌచుఁ గ్రథితాంక § ముగఁ దనర్చు
నాటకప్రపంచ ముపమా § నముగఁ గొనియె. 45

చ. విసములఁ దూలి గాలిఁ బ్రభ § వించి పొగల్ రయిగప్ప మేనిబల్
పసలు వెసన్ దొలంగి యల § భానుఁడు రాహువు దన్ను మ్రింగు క
ష్టసమయమందుఁ బొందు కపి § శద్యుతి దోఁచెను రాగి పళ్లెరం
బు సవతు గాంచఁ బాఁపతుటు § ముల్ వెసఁగ్రమ్మె దిశావకాశముల్. 46

గీ. నెమలికుచ్చుల జెండాల § నీటు గాంచి
యొక్కత్రుటి బెగ్గిలి ముడింగి § యురగచయము
తత్క్షణంబున యమపాశ § తతులఁబోలె
గట్టివెచెను బగతుర § గాటముగను. 47

క. తెల్లని కేతుపటంబులు
నల్లని పాముల యొడళ్ల § నడుమను గుబుసం
బుల్లసిలునట్లు, సంద్రపు
వెల్లి తరఁగలందు నురువు § విధమునఁ దోఁచెన్. 48

ఆ. వె. జనుల తలలఁ జుట్టు § కొనియు బొమ్మల వ్రేలు
చుండు నురగభోగ § తండ మొప్పెఁ
బరువమెనసి నిండ § విరిసిన నునునల్ల
కలువపూల నూలి § కల హసించి. 49

ఆ. వె. కాలు మొదలు శిరసు § కడఁగా ఫణుల్ చుట్ట
జనుఁడు ఫణమణిచ్ఛ § విని జెలంగె
బూచినట్టి తీఁగ § మూలమ్ము మొదలగ్ర
మునకుఁ బ్రాఁక మెఱయు § భూజమట్లు. 50

ఉ. హావిత కజ్జలాచల ప§మాహిత నీలరుచిన్ జెలంగుటన్
జీనులు జాఱకుండఁగ ర§చించిన యట్టు వరత్రరజ్జు నం
దానమువోలె నొప్పెఁ బెను§నాగము లశ్వబలంపు విభ్రమా
న్యాసములైన వాలముల§నున్ మఱి ప్రక్కలనున్ జరించుచో. 51

ఉ. ఉక్కవలెన్ వినీలతలనొంది కడున్ బొడవైన దార్ఢ్యస
మ్యక్కలితాంగముల్ గల మహాహి చయంబు రయంబు మీఱఁగా
న్యక్కృత దిక్కరీంద్ర చలనంబుగ మత్తకరీంద్ర సంఘ మే
చక్కిఁ జరింపకుండ బలు సంకెలలై తగిలెన్ బదంబులన్. 52

—* శ్రీకృష్ణుని భ్రూసంజ్ఞ చే ధ్వజస్థ గరుత్మంతునుండి గరుడసమూహము పుట్టుట *—

ఉ. చేదినృపుం డొనర్చు చెడుచెయ్వులచే నగు సిగ్గుఁ జూచితో
లేదొ యటంచుఁ బల్కి నటులేనగవున్ నగి యొక్కకన్బొమన్
మీఁదికి నెత్తి యెక్కియముమీఁది ఖగేంద్రుని వెన్నుఁ దారయన్
వే దెస లెల్లఁ గప్పె నొకవేయి విహంగమరాజ రూపముల్. 53

ఉ. మండెడి యగ్గినుండి లసమానవిభా యుత విస్ఫులింగపున్
దండముఁబోలి గాఢపరితప్త సువర్ణ సవర్ణ పర్ణ భా
రాండజ యూధముల్ ఖగకులాధిపు కాయమునందునుండి యు
ద్దండరవంబుతో వెడల దండుజనంబులు చూచి రొయ్యనన్. 54

క. పెనుఱెక్కల గాడ్పుల దూ
లిన మబ్బులు చేఁపలున్ ఖలీల జలధియున్
వినతాసు తాయుతంబులు
ఘన మేరు కులాచలములుగా నొప్పెసఁగెన్. 55

చ. గరుడుల పెద్దఱెక్కలను గల్గెడు పచ్చఁదనాల మేలిడాల్
సిరితళుకుం జగాసొగ సశేష దిశాంతములందుఁ బర్వి భా
స్కర పృథుబింబమందు నెసఁగగన్ మిఱుమిట్లొలయంగ మీఱుత
త్కిరణతతిన్ వికర్తనుఁడు దీపిలు నద్దముఁబోలి తేజుమై. 56

చ. అల విహగాధినాథ విపులామల కాంచన ధామపుంజ సం
ఫలితము లైన నాగములు మందర పర్వత మంబురాశినిన్
గలఁచెడిపట్ల వాసుకి ముఖంబుల వెల్వడు పైత్యసారమై
చెలఁగెడు రత్నసంచయపుఁ జెల్వులఁ బూనె, ననూనపద్ధతిన్. 57

—*గరుడ సమూహము భుజగ సందోహమును బాఱఁదోలుట*—

చ. చెలియలికట్ట దాఁటు ఘనసింధువునన్ గల హోరు మీఱుచున్
బలితపువ్రేళ్లతోడ నురు పాదపముల్ పెకిలించి వైచుచున్

విలయ సమీరణంబులను ॥ వే స్మరియింపఁగఁజేసి వైనతే
య లసదనూన పక్షజని ॥ తానిలముల్ బ్రిభవించె నెల్లెడన్. 58

శా. భీతుల్ మేరలు మీఱఁగాఁ నోడలు గం ॥ పింపన్ బరాయత్తమై
పాతాళంబును జేరఁగల్గె నెటులో ॥ పార్గ్జన్మ దేశంబు మా
కీతా వంచు నగేంద్రిబృందములు ప ॥ క్ష్మీశస్ఫురత్పక్ష సం
జాతా ఖండ సమీర జోద్ధృత మహా ॥ శై లోరు మార్గంబులన్. 59

—*శిశుపాలుఁ డాగ్నేయాస్త్రమును బ్రయోగించుట*—

చ. ఎన్నఁటికిన్ నశింప దని ॥ యెంచిన పాపము వుణ్యకార్యసం
పన్నతచే నశించు నటు, పాములఁ ॥ బక్షులు ద్రోలఁ జేదిరా
జెన్నఁగరాని రోసమున ॥ నింగలమున్ వలె మండి పావకా
భ్యున్నత మైన యస్త్రమను ॥ వాక్యాక్షణంబు జపించె భక్తిమై. 60

ఉ. వైశము చూడ నమ్యో జన ॥ వారము భీతిల ఘోరనిస్వనా
భీలత రాట్టహాసములఁ ॥ బెంపు వహించుచు మిన్నుముట్టు పెన్
జ్వాలలు బాహులై తనర ॥ సంగరరంగమునందుఁ బెద్ద బే
తాళుఁడొ నాఁగ రూపమును ॥ దాల్చినయట్టు ధనంజయుం డొగిన్ 61

ఉ. చెంగున నింగిపై దుముకఁ ॥ జేవగు రోహిత సైంధవంబుతో
డం గగనంబుదాఁకఁ బ్రిక ॥ టంబుగ నెత్తిన ధూమకేతనా
భంగురలీలతోడ రయ ॥ భాసుర వాయునియంతతోడ బల్
బంగరుతేరు సౌరు లొగి ॥ భాసిలఁగా శిఖి పర్వె నెల్లెడల్. 62

తే గీ. పొగలు గప్పిన మబ్బులు ॥ చిగురుటాకు
లాకసము కోటరంబుగా ॥ నఖిల దిశలు
శాఖలుగఁ గ్రాలు విశ్వవృ ॥ క్షంబు నెల్ల
నేర్చఁగాఁగల్గె నటఁ గల్గు ॥ నింగలంబు. 63

గీ. వెట్టలకుఁ గ్రాఁగి నీరముల్ ॥ వట్టిపోయి
మంట లలమిన నెఱుపు రం ॥ గంటి క్షణము

సార ముడివోయి, బొగ్గయి § జలదపటలి
నల్లనయి తొంటిరంగు గ§నంగ నయ్యె. 64

క. బంగరుకమ్ముల వలువల
చుంగులపై మంట లెగసి § చురచురమని చూఁ
డంగాఁ గాలుచు జెండా
లింగమ్ములఁ ద్రుటిని బాసె § నిరవగు పొడవుల్. 65

—*శ్రీకృష్ణుఁడు మేఘాస్త్రమును బ్రయోగించి యాగ్నేయాస్త్రమును జల్లార్చుట*—

క. అనలంబు కొంత సేపున
కును నిటు పచ్చందనమ్ము § గూర్పఁగ నింగిన్
గని తన్నివారకంబగు
ఘనకర మస్త్రంబుఁ దమ్మి§కంటి తలంచెన్. 66

సీ. ముల్లోకములు రూప§మున్ దాల్చ టబ్బె నే
ఘనుని మాయాశక్తి§ కలనవలన
సంద్రముల్ నాల్గు వి§శాలమై యిరవొంది
గ్రాలు నేగంభీరు§ గర్భగుహను
వినువాక మొదలుగా §నెనయు నేర్లెవ్వాని
తనుసంధుల నణంగి § మణఁగియుండు
యలరి "రసోవైస" § యంచు రసాత్ముఁగా
శ్రుతు లేమహాత్ము సం§స్తుతు లొనర్చు

తే. నట్టివసుదేవుపట్టి కే§శాళి వెడలి
కడలు గప్పుచు, గర్జించి § కమలమిత్రు
కరనికరముల నోడించి § గగన మెల్ల
నలువులం గూర్చి పేర్చె ఘ§నంబు లోలి. 67

సీ. శూన్యతానంత్య వి§స్ఫుట సింధుజకు లీల
పుట్టినిల్లని పేరు§మ్రోసె నెద్ది
బంగారురంగులఁ §బరిఢవిల్లుచు నెల్ల
యెడ పచ్చఁదన మూని § యెసఁగు నెద్ది

మెఱుఁగు మెఱపు గముల్ § మిఱుమిట్లు గొల్పుచు
నట్టహాసస్ఫూర్తి § నలరు నెద్ది
పటపటధ్వనులు మి § క్కుటమౌచు వీనుల
కచ్చెరువుంగూర్చి § హెచ్చె నెద్ది

తే. యట్టినింగిని బ్రొద్దు చా§యల మఱుంగు
పఱచి స్నాతగజౌపమ్య § పటుతఁ దనరి
గ్రక్కునను దిక్కులను బర్వి § గబ్బి మబ్బు
లగ్గివేలుపుజెండాల § కయ్యె సాటి. 68

గీ. కలుగువాఁకల నిండి పె § న్గట్ల పైకిఁ
బొరలునట్టుల వర్షించి § భూరిజలము
మొగిలు మొత్తంబు లయ్యెడ § మొనసి తన్మ
హానలం బార్పె విలయజ§లాబ్ధిఁ బోలి. 69

ఉ. స్వాదు హితప్రియుక్త సర§సంపుఁ బ్రసంగముచేత భామినీ
మేదుర దీప్తిమ త్ప్రణయ§ మేళన కోప హుతాశన ప్రభా
వాదులఁ బోలె నొక్కపరి § బగ్గన మండి ప్రశాంతమయ్యె నం
భోదపుఁదివ్యనైనజల § పూరమునన్ హుతభు క్ప్రభావముల్. 70

మ. ఘనసంతానము లిట్టు నిష్ఠురగతిన్ § గాటంబుగా నెల్లెడన్
బెనుపొందన్ శరవర్షముల్ గురిసి ని § ర్వీర్యత్వమున్ బల్మిమై
గనఁగాఁజేసిన నగ్గి యోడి చపలా§కారంబులన్ బూని యా
ఘనసంతానము నాశ్రయించె నని బ§ల్కన్వచ్చు వేభంగులన్. 71

గీ. కన్నతల్లికి దాస్యంపుఁ § గష్టములను
బాప సమకట్టి యమృతమ్ముఁ § బక్షిరాజు
గొనెడుతటి వజ్రి వజ్రినఁ § దునిమిన గరు
దంశ మట్టుల శమియించె § నగ్నిశిఖలు. 72

ఉ. కారుమొగిళ్లు దిక్కుల ము§ఖంబుల వ్రేలెడు నగ్గి నార్పి యెం
తే రయమార యాక్షణమ § యేఁగెను వేఱొకచోటి కట్టులా

సార పరోపకార గుణ శాలులు లగ్గొనరించి సుంత నె
వ్వారికి నడ్డులేని ఘనవర్తనమున్ భజియింతు రెప్పుడున్. 73

ఉ. క్రూరతరాగ్ని సంజనిత రూక్షశిఖావళిఁ గ్రాఁగి నీరదో
దార జలాభిషేకమునఁ దాపము వీడి నిరబ్దదోష శృం
గారమునన్ నభోఽంగణము గాల్చి తటుక్కున నీట ముంచి నే
ర్పారఁగ మీఁది కెత్తిన ఖరాసిలతన్ బురణించె నత్తఱిన్. 74

ఉ. ముమ్మరమైన రోగమునఁ బుట్టు వికారములట్లు తీవ్రకో
పమ్మున మండుచుండుశిశు పాలుఁడు సూటిగ నేయుతూపుమొ
త్తమ్ము నుపాయశాలియగు ధైర్యవిరోధి మహౌషధీప్రభా
వమ్మునఁజేసి ప్రోడ యగు వైద్యుఁడువోలె నడంచె హేలగన్. 75

గీ. నిర్మలము లెంత యైనను మర్మఘాత
మొనరుపఁగ లేవు హరి కంచు మనసునందు
నెంచి వాల్తూపు లెల్ల వ ర్జించి చైద్యుఁ
డలిగి కశ్మలవా క్సాయ కాళి గుప్పె. 76

—*శ్రీకృష్ణప్రయుక్తమగు సుదర్శనము శిశుపాలుని శిరమును ద్రుంచుట*—

చ. తనువు నశింపఁజేసి తల ధ్వంసమొనర్చుట మాని రాహు నే
ఘనశర మార్తిఁగూర్చి ప్రియకాంతకుచద్వయి తుళ్లుటన్ వృథా
మును పొనరింనట్టిది యమోఘ సుదర్శన చక్ర ముగ్రమై
సునిశితకీల లొప్ప రిపు సుస్థిర మస్తము నేలఁ గూలిచెన్. 77

—*శిశుపాలుని తేజస్సు శ్రీకృష్ణునిలోఁ గలియుట*—

మ. హరి మేనత్తకుమారు భౌతిక శరీరాభ్యంతరమ్మందు ని
ర్భరతేజోఽంశ మొకండు వెల్వడి వడిం బద్మాక్షుమైఁ జొచ్చె భూ
వరులీక్షించుచు నబ్బురంపడ నభ స్స్వ ర్భావితానమ్ము చి
మ్మ ఋషుల్ "జే" యన గొప్పవ్విరుల్ గురియఁగన్
మ్రోయఁగన్ దుందుభుల్. 78

చక్రబంధచిత్రము.



—*చక్రబంధము*—

శా॥ రక్షోమణ్డల శిక్షణా! శుభద! భద్రాలగ్న! శ్రీవర్షుకా!
వక్షోహారిత శుభ్రకౌస్తుభ! మునీన్ద్రధ్యానస్థ! లోకత్రయీ
రక్షా! దేవ! కృపారసాబ్ధి! భవమిత్రా! ధన్యా! సంవిద్ధకా
కా! క్షోణీరమణీవరా! మురహరా! కాలత్రయీపాలకా!

ఇది "కవితావిశారద" శ్రీబుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతం
బైన శ్రీమదాంధ్రమాఘ (శిశుపాలవధ) మహాకావ్యంబున
శ్రీకృష్ణునిశిశుపాలుఁడు యుద్ధంబునకుఁ బిలుచుట.

శ్రీకృష్ణునిపై శిశుపాలుఁడు కుపితుఁడై బాణములు ప్రయో
గించుట. శ్రీకృష్ణుఁడు శరవృష్టిఁ గురియించి శత్రుసేన
లనుజెల్లా చెదరొనర్చుట, పరస్పరదివ్యాస్త్రప్రయోగ
ములు, శ్రీకృష్ణప్రయుక్తమగు సుదర్శనము శిశు
పాలుని శిరంబును ద్రుంచుట, శిశుపాలుని
తేజస్సు శ్రీకృష్ణునిలోఁ గలియుటయు ననెడు
వింశాశ్వాసంబు సర్వంబును సమాప్తము.



260పుట : గోమూత్రికాబంధచిత్రము:



ప్రమాణివృత్తము

స్వనప్రభావసారమై। దనర్చు దండుదారమై,
చనన్ముభాప్తిసారెమై। దనర్చుదంతిదానమై।

(ఈకావ్య ముద్రణానంతరమున మహాదేవకవి వ్రాఁత ప్రతిలో
నీపద్యములుదొరకుటచేఁ గ్రింద నీయఁబడినవి).

## మాఘప్రశంస.

క. మాఘుఁడు సురుచిరకవితా
మేఘుఁడు నిజదానతోయ మేదురసరయా
ఘౌఘుఁడు సల్లపవార్ధా
మోఘుఁడు శమితాంతరంగ మోహాఘుఁ డిలన్. 1

ఉ. భారవి కర్థగౌరవము వావిరి నొప్పును; దండి కన్ననో
సారమధూరులాలితప్రసంగము సాజము; కాళిదాసు కిం
పారుపమా రమా ఘటిత మైన వచోరచనప్రభావ మీ
తీరులు మూఁడునుం గలిసి తీరుగ నిల్చును మాఘు పట్టునన్. 2

క. తొమ్మిది సర్గమ్ముల మా
ఘమ్మును బఠియించు నట్టి ఘనునకు నిఁక నూ
త్నమ్మగు శబ్దమ్మొకఁడును
నిమ్మహిఁ గనరా దటంచు నెంతురు తజ్జ్ఞుల్. 3

సీ. ఒకచోట హావభావ కలాపములఁ జూపి
సొక్కి తా రసికులఁ జొక్కఁ జేయు
లలితతరానూన లావణ్యసంపద
లొకట గుప్పించి తలూపఁ జేయుఁ
భారగంభీరధీ సారంబు లోకసీమ
నొలికించి యచ్చెరు వొందఁ జేయు
నసమానవృత్త శీలాభిరామత లోక
పరి ప్రకటించి కైవసము చేయుఁ
తే. గష్టనిష్ఠురతర బంధ గరిమ మొక్క
వడిఁ బ్రదర్శించి గరిడీల వరవిచిత్ర

చిత్ర మైనట్టి పల్లటీల్ § చేసి మాఘ
కవిత గడసానిఁ బోలి య § క్కజముఁ గూర్చు. 4

తే. ఎట్టి యమృతంబు మాఘుండు § పట్టి తెచ్చి
యుగ్గుపాలుగఁ బోసి పెం § పొప్పఁ గైతఁ
బెంచెనో గాని వయసునఁ § బెద్ద యయ్యుఁ
బదియునాఱేండ్ల జవ్వని § వలె రుచించు. 5

తే. పువ్వులను మాఘ్యకుసుమంబుఁ § బోలు నెద్ది?
చదువులం దాత్మవిద్యకు § సాటి యెద్ది?
సురలయందు మహాదేవు § సరి యెవండు?
కవుల లోపల మాఘుఁ బోల్ § కవి యెవండు? 6

క. తెలియని శాస్త్రము గల్గదు
తెలియని రుచి యొకటి లేదు § తెలియని రచనా
వలి యెవ్వలనను బుట్టదు
తెలివికిఁ బుట్టిండ్లు మాఘు § ధీరుని కైతల్. 7

మ. రససాంకర్యముచేత బల్ రసము లూ § రంజేసి ధీవల్లరీ
కుసుమోదార సువాసనా ప్రకటనా § కుంతప్రభావంబు పెం
పెసలారన్ రచియించు మాఘకవి కీ § డెవ్వారలున్ గల్గరీ
వసుధన్ దక్కినలోకవాసులన నె § వ్వారైన నీక్షించిరే? 8

సీ. సర్వాంగ లాలిత్య § సంపూర్ణయై జిలి
బిలి పల్కులను జంటి § బిడ్డ మురువు
గంభీరభావ సం § కలనాకఠోరయై
కొమరుఁబ్రాయపు లేమ § గుబ్బ హరువు
పాదవిన్యాస సం § భావ్య చాతుర్యయై
హుందా నడక నేర్చు § సువిద పరువు
హృదయంగమార్థ సం § విదితలక్ష్మీకయై
యక్కునఁ జేరు ని § ల్లాలి యురవు

తే. చాలఁ గైసేయ లోకవిశాలకీర్తి
సన్నుతులఁ గాంచి ప్రవిమల సంస్కృతోక్తి
మహిమలను వెలయించి యీ మహిఁజరించు
మాఘకవిరాజ కావ్య రసమావధూటి. 9

తే. వీరబీభత్సరసము లింపాదునట్లు
చెలఁగి యద్భుతశృంగారములను నచ్చ
టచ్చటం జిలికించి నేర్పచ్చుపడఁగ
సలిపి మాఘుండు లోకప్రశస్తుఁడయ్యె. 10

క. కృతు లొనరిచి కృతులం గొను
చతురుఁడు భోజుండు దాన శౌండుఁడు లక్ష
త్రితయము మాఘకవీశ్వర
చితమగు నొక శ్లోకమునకుఁ జెల్లించె వెసన్. 11

తే. మేఘ మాఘంబుల వయస్సు మేము గడపి
నార మందున ధన్యులై నార మనుచు
నలరి శ్రీపెద్దిభట్టు వ్యాఖ్యానకర్త
తనివితీఱఁగ ననుకొనెఁ దనకుఁ దానె. 12

ఇది "కవితావిశారద" శ్రీబుద్ధవరపు మహాదేవామాత్య ప్రణీతంబైన "మాఘప్రశంస" సంపూర్ణము.

## మా ఘ క వి వ ం శ వ ర్ణ న ము.

చ. ప్రకటమృదుస్వభావగుణభాసురుఁ డోర్పున కాటపట్టు ద
త్తకుఁ డను నాత్మజుం డతని ధన్యుని జేయు నుదారచిత్తుఁడై
సుకృతిని నాతనిన్ జనులు చూచి గదాః మును బాదరాయణుం
డొకయెడ ధర్మజుం గుఱిచి యొప్పుగఁ బల్కిన పల్కు నమ్మటల్

"తస్యాభవద్దత్తక ఇత్యుదాత్తః" మూలము.

తే. అద్వితీయుఁడు సజ్జను లందు ముఖ్యుఁ
డై ద్వితీయంబు గౌణంబు నై యెసంగు
నట్టి సర్వాశ్రయాభిఖ్య నలరి సర్వ
జనము లౌనఁగఁగ గ్రహియించె స్వయ మతండు.

'సర్వేణ సర్వాశ్రయ ఇత్యనిన్ద్యమ్' మూలము.

మ. ప్రతిసర్గాంతమునందు శ్రీపద మొగిన్ రమ్యంపు మేల్పిన్నె సు
స్థితి నొందన్ సిరియెమ్మెకాని గురుకీర్తి స్ఫూర్తిచే నందమై
క్షితిలోనన్ శిశుపాలరాడ్వధముగాఁ జెల్వొందు నీకావ్య మా
మతిమత్పుత్త్రిఁడ నేరచింతుఁ గవిసత్రమాత్కీర్తిదుర్లోభినై.

'శ్రీశబ్దరమ్యకృత సర్గసమాప్తిలక్ష్మ' మూలము.

—***—

తే. తంత్ర మావాప మెఱిఁగి యుద్దండ యోగ
ములను మండలాధిష్ఠానమును బొనర్చి
యెసఁగు చున్న నరేంద్రునకెపుడు శత్రు
లెల్లరును వశ్యులగుదు రహీంద్రు లట్లు.

ఈ పద్యమును 'స్థాయిభావంబునకు' (ఆ. మా. 2-79) అను పద్యము తరువాతఁ బఠింపవలయును.



# శ్రీ కొప్పులింగేశ్వర దండకము.

శ్రీ కూచిమంచి సోమసుందరకవి విరచితము.



శ్రీమన్మహాఖండ గోదావరీ ప్రాక్తట ప్రోల్లసద్రాజమాహేంద్ర విఖ్యాత పూర్ధర్మదిఙ్మండల ద్వాదశ క్రోశ దూరస్థిత క్ష్మాలస త్కౌశికీ దివ్య తీరోజ్జ్వలత్పల్వల క్షేత్రవాసా! జగద్వాస! నీదివ్య చారిత్రముల్ గూర్చి పూదండగా దండకం బొక్కఁడర్పింతు నీకేను గైకొమ్ము! మేలిమ్ము! శ్రీలిమ్ము! వే కొప్పులింగాహ్వయ శ్రీమహాదేవ! దివ్య ప్రభావా! విశుద్ధస్వభావా! కృపాపూర్ణభావా! సజాతీయభేదాద్యభావా! నిజాధీనజీవా! భవారణ్యదావా! భవద్దివ్య చారిత్రముల్ బూని వర్ణింప నేనెంతవాఁడన్? సహస్రాస్యముల్ గల్గు శేషాహి కింతైన శక్యంబు గాదన్నచో నజ్ఞులైనట్టి మాబోఁటి మూఢాత్ములం జెప్పఁగానేల? దిక్చేల! దృక్ఫాల!

మున్ గుంభసంభూత మౌని ప్రకాండుండు కైలాస శైలాంచితాధిత్యకా భూమి శీతాద్రిరాట్కన్యకా భవ్య కల్యాణ దివ్యోత్సవారంభ వేళన్ ద్వదీయాజ్ఞచే లోకబాధాపనోదార్థమై దక్షిణాశాతటీ భూమికిన్ వచ్చుచో నిచ్చటన్ ముచ్చటం జేరి మీరచ్చటం దత్కాలంబు నందుత్సవం బొప్ప నెట్లుండిరో యంచు నౌత్సుక్యముం జెంది మీమూర్తి దర్శింప నేకాగ్ర చిత్తంబునం బూని ధ్యానింపఁగా మీరు సద్యస్స్మితోద్యద్విలాసంబుతో నిందుఁ బ్రత్యక్షమై నిల్చినం జూచి వేభంగులన్ మిమ్ముఁ గైవారముల్ సేసి తన్మంగళాకార రేఖావిశేషంబుతో నిందునిల్వంగఁ గాంక్షించినన్ దత్స్వరూపంబుతో నెమ్మిఁ బ్రత్యక్షమై మీ రగస్త్యేశ నామంబుతో నిల్చి యోగీంద్ర సంసేవితైకాంత భావంబుతో నుండఁగాఁ బెద్దకాలం బతిక్రాంతమై యేఁగె నావెన్క నుద్యత్కలివ్యాప్తి వర్తించె.

ఇట్లుండఁగా నొక్క కాలంబునన్ నీదు పూజాకరుం డైన పూజారి యొక్కండు వారాంగనా నిత్య సాంగత్య శీలుండు నీపూజనార్థంబుగాఁ గూర్చి యున్నట్టి చొక్కంపు మేల్తావి పూదండ లావేశ్య కైశ్యము

నందుంచి యాకల్కితోఁ గుల్కి పూముల్కి విల్కాని మేల్కేలి గావించి
తద్గణ్య లావణ్య పణ్యాంగనా భుక్త శేషంబులై నాంతమూల్యంబు
లైనట్టి మాల్యంబులం దెచ్చి నీపీఠ భాగంబు నందుంచి నీదివ్య సందర్శ
నార్థంబుగా వచ్చి యున్నట్టి భూమండలస్వామి కర్పింపఁగా నాతఁ
డాపూలదం డాత్మహస్తాబ్జ మందుంచి వీక్షింపఁగా నందు నీలంపుటా
సొంపు డాలింపుగా నింపు మేలౌ శిరోజం బొకండుండినం జూచి
యాతం డుదగ్రాగ్రహవ్యగ్రుఁడై 'స్వామినిర్మాల్యమౌ మాల్యమం
దిప్పుడీ గంధతైలార్ద్ర చంచచ్ఛిరోజంబు రాఁ గారణంబేమి? యోభ్రష్ట
దుష్టార్చకా!' యన్న భీతాత్ముఁడై వాఁడు సర్వాంగముల్ కంప మొందంగ
'నోచండ కోదండ దోర్దండ! భూమండ లాఖండలా! సావధానంబుగాఁ
జిత్తగింపం దగున్ భూమిదేవా! మదీయాపరాధంబు లేదీ శిరోజోత్త
మం బెంత మాత్రంబునున్ వేఱుగా దీసుధాంశూజ్జ్వలన్మౌళిదేగాని'
యంచున్ దిటం బొప్పఁగాఁ బల్కనన్ విస్మయం బంది యామానవాధీ
శ్వరుం 'డిట్టి దృష్టాంతమున్ మాకుఁ జూపింతువా? చూపలేకున్న నీకున్
శిరశ్ఛేద రూపంబుగా శిక్ష సేయింతు, మన్నన్ 'సరే! చూడుఁడీ! క్ష్మాత
లాధీశ!' యంచుం బ్రకాశంబుగాఁ బల్కి తా నంతరంగంబులో 'నీశ!
మాంరక్ష! రక్షే'తి వాక్పూర్వకైకాగ్ర నిష్ఠా పరాయత్తుఁడై యుండఁగా
నప్పుడీ వొప్పుగా మెప్పుగాఁ దప్పులేకుండఁగా ముప్పురాకుండఁగా
రప్పులేకుండఁగాఁ గొప్పుపోకుండఁగాఁ దాల్చి మీభక్త సంత్రాణ దీక్షా
మహోదార విస్ఫూర్తి లోకంబునం దేటతెల్లంబుగాఁ జూపి యున్నట్టి
ప్రత్యక్ష దైవంబ వోస్వామి! నీదివ్య లీలాచరిత్రంబు లెన్నెన్నియో
సన్నుతింపంగ నెవ్వారి శక్యంబు? సర్వామర గ్రామణీ! దీనచింతా
మణీ! యార్తరక్షామణీ! హృత్తమోద్యోమణీ! సోమ! నీదాసుఁడం
బ్రేమ నన్నేలి రక్షింపుమీశా! నమస్తే! నమస్తే! నమః.

శ్రీ శ్రీ శ్రీ

ఇది శ్రీ కూచిమంచి సోమసుందరకవి ప్రణీతంబగు
శ్రీ కొప్పులింగేశ్వర దండకము సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

## సమీక్ష.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 18 | మాఘని | మాఘుని |
| 3 | 14 | ఘూర్దర | ఘూర్జర |
| 3 | 16 | ద కుని | దత్తకుని |
| 6 | 15 | సఃవిజంత | దీనినివిడువవలెను |
| 6 | 16 | వావ్య | తిఙ్వాచ్య |
| 6 | 30 | మతస్కంద | మవస్కంద |
| 14 | 25 | అసుపముఁడు | అసుసముఁడు |
| 21 | 29 | బబృహింరే | బబృంహిరే |
| 23 | 22 | నేతాస్మి | నేతాస్మిన్ |
| 23 | 33 | జూచ్చుటలో | జొచ్చుటతో |
| 24 | 28 | హర్యాంతర | హర్మ్యాంతర |
| 29 | 10 | నెత్తైన | నెత్తైన |
| 29 | 15 | వర్ణనాతీరము | వర్ణనాతీతము |
| 31 | 2 | నేంచ | నెంచి |
| 34 | 20 | ల్లిలితము | ల్లలితము |
| 36 | 12 | రాతోత్సవైః | రతోత్సవైః |
| 38 | 31 | కాలంకారాః | కాలంకారికాః |

## భూమిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 40 | 10, 12 | మహాత్మ్యము | మాహాత్మ్యము |
| 44 | 24 | 24-9-1889 | 26-4-1889 |
| 45 | 1, 2, | తెలుసుకొను | తెలిసికొను |
| 54 | 29 | కపమో | కపయో |
| 60 | 30 | నప్తృనేప్తృ... | నప్తృనేప్తృలో భ్రాతృశద్దము |
| 64 | 13 | శ్లోకః | శ్లోకః |
| 64 | 23 | ధౌరేయస్యా | ధౌరేయస్యా |
| 65 | 17 | త్వేవేమాని | త్యేవేమాని |
| 68 | 6 | మంతల | మండల |
| 68 | 22 | తురజ్గపక్త్రి | తురజ్గవక్త్రి |
| 68 | 30 | బ్రియను | బ్రియను |
| 69 | 2 | వర్ణించిఖాఁడు | వర్ణించినాఁడు |
| 69 | 5 | బర్వ | బర్వ |
| 69 | 35 | కిన్నరీణామ్ | కిన్నరీణామ్ |
| 70 | 8 | బింబముఖి | బింబముఖి |
| 71 | 16 | వక్షస్థలము | వక్షఃస్థలము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 71 | 18 | ధర్యరా | ధర్మరా |
| 72 | 2 | డపళనున | డపళకున |
| 72 | 16 | కాబిద్ | కాచిద్ |
| 74 | 16 | చోటటకెలుకలు | చోటకెలుకలు |
| 75 | 33 | సతతము వీణెతంతి | మతిమతి గాలిసోకి |
| 76 | 19 | శ్చతశ్చైవ | శ్చతుశ్చైవ |
| 78 | 28 | ప్రాకృత్తై | ప్రాకృతై |
| 80 | 6 | మొరలగు | మొదలగు |
| 83 | 11 | ద్వోవురప్యా | ద్వావురస్యా |
| 83 | 35 | గుఱ్రము | గుఱ్ఱము (ఇట్లే తక్కినచోట్ల నెఱుంగవలెను) |
| 85 | 13 | వల్లాగ్రహణ | వల్గాగ్రహణ |
| 85 | 27 | విక్షిపైక | విక్షిప్తైక |
| 86 | 5, 10 | పార్షి | పార్ష్ణి |
| 86 | 12 | గుణము | గుఱ్ఱము |
| 86 | 18 | రేవతోత్తలము | రేవతోత్తరము |
| 87 | 20 | విర్దిషాట | విర్దిష్టా |
| 88 | 22 | రెండునీత్రములు | రెండునేత్రములు |
| 88 | 27 | స్త్వల్పలాశ్లిష | స్త్వల్పలాశ్లిష్ట |
| 89 | 18 | విచిచిపెట్టిన | విడిచిపెట్టిన |
| 90 | 28 | గాంధర | గాంధర్వ |
| 92 | 32 | సువర్ణమర్ణః | సవర్ణమర్ణః |
| 93 | 3 | సాగరపూణీ | సాగరపూరణీ |
| 93 | 11 | సమ్మకతము | సమ్మతము |
| 96 | 35 | ఋత్విలజా | ఋత్విజాల |
| 96 | 36 | గర్తృక్వారోపణము | గర్తృత్వారోపణము |
| 98 | 6 | యావ్యాపురోఽమ | యాజ్యాపురోఽను |
| 98 | 15 | స్నానాయ్య | సాన్నాయ్య |
| 98 | 22 | ఋత్విజా | ఋత్విజా |
| 98 | 31 | పురోఽమవాంక్య | పురోఽనువాక్యా |
| 99 | 16 | మౌక్షైన | మౌక్షేన |
| 101 | 29 | నచైత్తేనంక్లేదయత్యాపో | నచైనంక్లేదయన్త్యాపో |
| 102 | 7 | విజానీతా | విజానీతో |
| 104 | 34 | నమకాలంకారిక | నసునాలంకారిక |
| 106 | 5 | శమ్యో | శమ్యో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 106 | 14 | శ్లోక | శ్లోక |
| 106 | 19 | యషమూర్తి | యష్టమూర్తి |
| 107 | 4 | ముష్ఞం | ముష్ణం |
| 107 | 25 | తీమ్రప్రతి | తామ్రప్రతి |
| 108 | 35 | గుణమున్న నెవఁడేని (5-18) అను పద్యమువఱకు | 'గుణమున్న నెవఁడేని (15-39)' అను పద్యము మొదలుకొని 'హరికినపరాధగణగణనార్థమయ్యె' (15-48) అను పద్యమువఱకు |
| 110 | 12 | బనిచె నతని నవఁడు నతడ | బనిచె నతని నతఁడు నపుడ |
| 110 | 17 | రిఅవధము | అరివధము |
| 112 | 21 | ప్రలోమయమకము | ప్రతిలోమయమకము |

## శ్రీమదాంధ్రమాఘ మహాకావ్యము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 24 | 4 | స్తంభమున | స్తంభముగ |
| 24 | 7 | సంస్కృతి | సంసృతి |
| 24 | 11 | త్రిజంగంబును | త్రిజగంబును |
| 27 | 9 | వినొన్నవె? | విన్నావె? |
| 31 | 3 | ఛైద్య | చైద్య |
| 32 | 6 | అట్టె | అట్టి |
| 34 | 1 | పుక్కట | పుక్కటి |
| 38 | 23 | శితకిరణుని | శీతకిరణుని |
| 39 | 17 | స్వాంతమే | సాంత్వమే |
| 39 | 19 | లోనఁజెచ్చుట | లోనఁగ్రిచ్చుట |
| 45 | 14 | నేకార్థు | నేకార్థ |
| 46 | 4 | రాజయక్ష్మను | రాజయక్ష్మము |
| 47 | 5 | భజింయించు | భజియించు |
| 52 | 26 | యొసురులఁగొన | యొసురుంగొన |
| 53 | 10 | పుష్పమను | పుష్యమను |
| 53 | 21 | తార్చి | తాల్చి |
| 53 | 25 | తనములే | తములే |
| 54 | 11 | గడచి | గడిచె |
| 54 | 23 | అసమాదాంచిత | అసమానాంచిత |
| 55 | 14 | తొలుకాడెడు | తొలఁకాడెడు |
| 55 | 16 | దోఁచున్ | దోఁపన్ |
| 55 | 27 | గోర్కె | గోర్కి |
| 57 | 9 | బృధులకులంబు | బృధులతులంబు |
| 58 | 3 | నమద్వశీక | నమద్వలీక |
| 58 | 12 | వసించుటను | వచించుటను |
| 58 | 22 | సంపన్నిరేజ | సంపన్నిరేజ |

| | | | |
|---|---|---|---|
| 61 | 7 | గ్రిక్కున | గ్రిక్కను |
| 66 | 2 | నర్కాశకులు | వర్కాశకులు |
| 70 | 14 | నిర్ఝర | నిర్ఝర |
| 70 | 18 | బోలునట్టి | బోలునట్టు |
| 70 | 27 | హెచ్చుగ | హెచ్చగు |
| 73 | 7 | ఖేలానవత | ఖేలానుగత |
| 74 | 13 | మౌటదిరి | మౌటవిరి |
| 77 | 12 | దిరన్య భూపతుల్ | దిగిరన్య భూపతుల్ |
| 78 | 25 | వణికుల్ | వణిజుల్ |
| 83 | 26 | సాంద్రజలార్ద్ర | సాంద్రజలార్ద్రి |
| 84 | 24 | బర్వి | బర్వం |
| 87 | 22 | బగునట్టు | బగునట్టి |
| 88 | 10 | బ్రతిమాల | బతిమాల |
| 89 | 1 | కాంతాసనిశ్వ | కాంతానిశ్వ |
| 89 | 8 | దరవశ | దరవశ |
| 90 | 26 | బ్రియులట్టు | బ్రియులట్టి |
| 91 | 4 | లోనతివరింపకుండు | లో[illegible]వరింపకుండు |
| 93 | 4 | బతే: బలే: యన్ | [illegible]: [illegible]లే: యనన్ |
| 93 | 22 | మొన్ప | [illegible]పొప్పేరు |
| 93 | 23 | సిప్రియుండైన | [illegible]యుండైన |
| 96 | 6 | దోవగ | [illegible]పక |
| 100 | 5 | ఘూర్తులన్ | [illegible]లన్ |
| 105 | 16 | చన్న[illegible] | [illegible]ంచన్న |
| 105 | 21 | తరుశా[illegible] | [illegible]శాఖ |
| 107 | 3 | మధుసా[illegible] | [illegible]ధుపాళి |
| 107 | 7 | యెఱుఁగనియ[illegible] | నెఱుఁగనియటులటు |
| 109 | 28 | తీనున | వీనున |
| 110 | 3 | అటులేఁడొంటి | అటులొఁదొంటి |
| 110 | 26 | — | భ్రష్టమైనను గ్రన్మర*లక్కరంగు |
| 110 | 11 | వెలుఁగులగొర | వెలుఁగులదొర |
| 111 | 20 | మాటికినినే | మాటికినిన్ |
| 113 | 21 | లూలినలాఁకులే | లూనినలాఁకులే |
| 114 | 22 | గాసకుండ | గానకుండ |
| 116 | 27 | పవ్వుచునిద | నవ్వుచువిద |
| 116 | 7 | నిర్భయమున | నిర్భయమున |
| 116 | 10 | హస్తముల | హస్తముల |
| 116 | 22 | యాకృష్ట | యాకృష్ట |
| 117 | 24 | గదిపి | గదిసి |
| 117 | 25 | బొద్దుచున్ | బొద్దుచున్ |
| 118 | 21 | అపర | అపరి |

| | | | |
|---|---|---|---|
| 120 | 14 | పాండువై ప | పాండువైన |
| 121 | 25 | లేఁగిపోయెను | లేఁగేఁబోయెను |
| 121 | 28 | స్మరుఁడుస్త్రీల | స్మరుఁడుస్త్రీల. |
| 122 | 24 | కాంద | కాంచ |
| 125 | 13 | చందనమున | చందమున |
| 128 | 25 | గాంచెను | గాంచె |
| 133 | 2 | బ్రౌడమతి | బ్రౌఢమతి |
| 125 | 27 | సొంపెక్కె | సొంపొందె |
| 126 | 11 | జక్కవవులుఁగులు | జక్కవపులుఁగులు |
| 128 | 5 | కొప్పుయొప్పులన్ | కొప్పునొప్పులన్ |
| 130 | 5 | దిఙ్ముఖుండు | దిఙ్ముఖుండు |
| 148 | 4 | నొడ్డాడ | వొడ్డాణ |
| 148 | 26 | జంకెప | జంకెన |
| 154 | 12 | యొనర్చుడు | యొనర్చెదు |
| 158 | 9 | నిజముగానీరవి | నిజముగారవియా |
| 159 | 4 | దెనల్ | దెసల్ |
| 160 | 1 | పాంతురము | పాండురము |
| 160 | 27 | చిట్టిలె | చిట్టలె |
| 161 | 15 | వేత | చేత |
| 165 | 3 | ద్ద్వమున | ద్ద్వయమున |
| 169 | 11 | వస్యము | పస్యము |
| 176 | 26 | వామ్రినుఁడై | వామనుఁడై |
| 176 | 27 | సోరతుసుమ | సౌరకుసుమ |
| 182 | 11 | భూప | ధూప |
| 183 | 8 | భోగున్ | భోగుల్ |
| 188 | 14 | చేయెందప్పునొ | చేయందప్పునొ |
| 189 | 13 | నొప్పెజియాగమ | నొప్పెడియాగమ |
| 189 | 14 | క్రిడుక్రియన్ | క్రితుక్రియన్ |
| 189 | 15 | శాస్త్రవిలోధ | శాస్త్రవిరోధ |
| 190 | 11 | దిలేకఆవళి | దివాకఆవళి |
| 191 | 16 | బ్రివితత్రిత | బవిత్రిత |
| 192 | 10 | లిపేఖలు | లిలేఖలు |
| 197 | 10 | పదంబుచేఁజూమానిబద్ధగఖుండౌ | పదంబుచేనిబద్ధగఖుండౌ |
| 198 | 16 | దానర్పె | దానర్చె |
| 201 | 1 | తత్ప్రభా | తత్ప్రభా |
| 266 | 12 | కరణత్వమెకావి | కరణత్వమేకాని |
| 209 | 8 | స్మరింతురే | స్మరింతురె |
| 213 | 20 | మనినుగ్లు | మునినుగ్గు |
| 219 | 11 | నవర్రిమదుని | సవర్రిమదుని |
| 219 | 20 | గరిగిన... ప్రియాంబులై | గలిగిన... ప్రియంబులై |
| 219 | 25 | పీనుదువు | పీనుడువు |

| | | | |
|---|---|---|---|
| 220 | 18 | రమణియత | రమణీయత |
| 221 | 3 | మున్నుధూళి | మన్నుధూళి |
| 223 | 23 | శంభుఁడు | శంభుఁడు |
| 225 | 24 | పృష్ణంబులై | పృష్ఠంబులై |
| 233 | 23 | ద్వరతో | ద్వాఃతో |
| 234 | 6 | భీకరముగానగుచున్ హరి | భీకరముగాహరి |
| 248 | 8 | చ్చెరువువొప్పన్ | చ్చెరువొప్పన్ |
| 256 | 21 | శీతోష్ణాదులలటన్న | శీతోష్ణాదులటన్న |
| 257 | 28 | స్ఫుదద్యాస్య | స్ఫురదాస్య |
| 258 | 26 | గాంచెడు | గాచెడు |
| 261 | 4 | వేళ్ళకుత్తుండయ్యెన్ | వేళ్ళకు త్తుండయ్యెన్ |
| 262 | 6 | ఫలమునందుఁగాక | ఫలమునందుదాఁక |
| 264 | 14 | ధూళిపతి | ధూళితతి |
| 265 | 25 | ర్తివిస్ఫూర్తి | కీర్తివిస్ఫూర్తి |
| 267 | 26 | విజృంచి | విజృంభించి |
| 268 | 14 | కనినికలన్ | కనీనికలన్ |
| 268 | 21 | యనినవింతే?...ధనులై | యనినవింతే?....ధనువై |
| 269 | 5 | పాంతయా | పాంతమా |
| 270 | 27 | రాడ్వీశిఖ | గ్రావకఠోరమైనయదురాడ్వీశిఖ |
| 271 | 6 | పత్తులున్ | పత్త్రిలున్ |
| 272 | 23 | బాణమయమంబుగాన | బాణమయంబుగాఁగ |
| 272 | 24 | వేయుచువేపుచూపు | నేయుచునేపుచూపు |
| 273 | 15 | చైద్యుతెరితో | చైద్యుతేరితో |
| 274 | 1 | రుక్మిణికుచ | రుక్మిణీకుచ |
| 274 | 6 | బిల్వోరాళ | బిల్వోరాళ |
| 274 | 14 | బుజుతాఫల | ఋజుతాఫల |
| 275 | 18 | విహంగతలిన్ | విహంగతతిన్ |
| 276 | 15 | మంత్రి | మంత్ర |
| 277 | 6 | విసమొందునో | వికాసమొందునో |
| 277 | 7 | నయ్యెడ...వేవెలుడిగూనినవాని | ఁడయ్యెడ...వేవెలుంగూనినవాని |
| 277 | 19 | శసింప | విశసింప |
| 277 | 20 | నతవిఁచాపము | వతనిపాపము |
| 278 | 7 | కొండవై | కొండలై |
| 278 | 12 | శౌర్యో*న్నతి | శౌర్యోన్నతి |
| 278 | 14 | శూరులై | శూరులైనవి |
| 280 | 20 | మూలికల | మాలికల |
| 280 | 28 | ప్రకక్ఖణమున్ | ప్రక్కలమున్ |
| 281 | 11 | సవర | సవర్ణ |
| 283 | 6 | లింగమ్ముల | లింగలముల |
| 284 | 2 | హాసస్ఫూర్తి | హాసస్ఫూర్తి |
| 285 | 5 | పీటముంచి | పీటముంచితూ |

# విజ్ఞాన ప్రచార నిలయము,
## కొత్తపేట, తూర్పుగోదావరి జిల్లా.

# VIGNANA PRACHAR NILAYAM,
## Kothapeta, East Godavari Dist. [A. P.]

మాచే ప్రచురింపబడిన గ్రంథముల నూతన ఖరీదుల జాబితా.

This Price-List Cancels all the Previous Price-Lists
Prices are Subject to Fluctuation.

| No. | Title | Price |
|---|---|---|
| 1. | ఆంధ్ర హోమియోపతి ఔషధవిజ్ఞానము 1వ భాగము | 38-00 |
| 2. | ఆంధ్ర హోమియోపతి ఔషధవిజ్ఞానము 2వ భాగము | 20-00 |
| 3. | సంపూర్ణ హోమియోపతి మెటెరియా మెడికా | 40-00 |
| 4. | హోమియోపతి తత్వశాస్త్రము | 12-50 |
| 5. | డా॥ హానెమాన్ "ఆర్గనాన్" (హోమియో సిద్ధాంతము) | 14-50 |
| 6. | డా॥ హానెమాన్ "దీర్ఘవ్యాధులు" (క్రానిక్ డిసీజెస్) (సిద్ధాంతభాగము) | 14-50 |
| 7. | డా॥ హానెమాన్ "మెటెరియా మెడికా ప్యూరా" (సంగ్రహ సంపుటి) | 30-00 |
| 8. | డా॥ కెంటు "హోమియోపతి మెటెరియా మెడికా ఉపన్యాసములు" | 45-00 |
| 9. | డా॥ నేష్ "హోమియో ముఖ్యఔషధములు" | 20-00 |
| 10. | డా॥ ఏలెన్ "హోమియో ఔషధ కీలక లక్షణములు" (కీ-నోట్సు) | 16-00 |
| 11. | డా॥ బోరిక్ & డ్యూయి "12 టిస్యూ ఔషధములు" 1, 2, 3 భాగములు | 17-00 |
| 12. | డిటో 4వ భాగము | 13-00 |
| 13. | హిందూదేశ మూలికల హోమియోపతి ఉపయోగము | 8-00 |
| 14. | డా॥ బోనింగుహాసెన్ "లక్షణసూచిక (రిపెర్టరీ)". | 30-00 |
| 15. | డా॥ లిప్పి "లక్షణసూచిక (రిపెర్టరీ)" | 37-00 |
| 16. | లక్షణసూచిక (రిపెర్టరీ) నుపయోగించు విధానము | 4-00 |
| 17. | డా॥ రాబెర్ట్సు "ఉన్నట్లున్నదని రోగిచెప్పు బాధలు" Sensations as if | ... |
| 18. | డా॥ డ్యూయి "హోమియో చికిత్స ముఖ్యవిషయములు" (130 వ్యాధులకు హోమియో చికిత్సలు-ప్రశ్నోత్తరములు) | 12-50 |
| 19. | డా॥ ఘోషాల్ "అచరిత హోమియో చికిత్సలు" | 5-50 |
| 20. | హోమియోపతి విచిత్రగుణమంజరి | 20-00 |
| 21. | సమస్తవ్యాధులకు అద్భుత హోమియోపతి చికిత్సలు | ... |
| 22. | మానసిక వ్యాధులు : హోమియో చికిత్సలు | 10-00 |
| 23. | కేన్సరు : హోమియో చికిత్సలు | 8-00 |
| 24. | కొన్ని ప్రాణాపాయకర వ్యాధులు (టెటానస్, ఎక్లాంప్సియ, పిచ్చికుక్కకాటు, పాముకాటు) : హోమియోచికిత్సలు | 4-50 |
| 25. | టైఫాయిడ్ : హోమియోపతి చికిత్సలు | 4-50 |
| 26. | కలరా : హోమియోపతి చికిత్సలు | 1-00 |
| 27. | పశు-పక్షి వ్యాధులు : హోమియో చికిత్సలు | 14-00 |

28. డైబెటిస్ (మధుమూత్రము) : హోమియో చికిత్సలు 6-00
29. "స్త్రీలవ్యాధులు : హోమియో గృహవైద్యము" —డా॥ హెర్రింగు 2-50
30. "శిశుచికిత్స, మసూచికము మొదలగువ్యాధులు : హోమియో గృహ
వైద్యము" —డా॥ హెర్రింగు 2-50
31. యుక్తవయస్సు వచ్చిన యువతీయువకులు తెలిసికొనవలసిన
"శరీర ముఖ్యవిషయములు : వ్యాధులు" (80 బొమ్మలతో) 12-50
32. స్త్రీ పురుష జననేంద్రియ వాంఛలు, అనుభవములు : ప్రేమకళారాధన
(అనేక బొమ్మలతో) 12-50
33. స్త్రీ పురుష జననేంద్రియ వాంఛలు, అనుభవములు : హోమియోపతిచికిత్సలు 9-00
34. "గర్భధారణ, ప్రసవము : శిశు సంరక్షణ" (212 బొమ్మలతో) 15-00
35. గర్భధారణ, ప్రసవము : హోమియో చికిత్సలు 8-00
36. "గర్భిణి : శిశుజననము" (అనేకబొమ్మలతో) డా॥ ఎలాన్ ఫ్రాంక్ గట్మాకెర్ 12-00
37. డా॥ ఇంగ్లింగ్ "ప్రసూతివైద్య అత్యావసర గ్రంథము" (హోమియోచికిత్సలు) 8-00
38. కుటుంబనియంత్రణము : స్త్రీ పురుష ఆధునిక గర్భనిరోధ విధానములు
(105 బొమ్మలతో) రచన: లేడీడాక్టరు సుభద్రాదేవి, L.M.P. & వి.వి.శర్మ 8-00
39. "ఆహారము : ఆరోగ్యము" డా॥ రాబెర్టు బెర్ 1-50
40. ఆంగ్ల-ఆంధ్ర వైద్య నిఘంటువు
English - Telugu Medical Dictionary 17-00
41. స్త్రీ రోగి వైద్యునకు తెలుపవలసిన విషయములు
Female Case-Taking Form 2-00
42. పురుషరోగి వైద్యునకు తెలుపవలసిన విషయములు
Male Case-Taking Form 2-00
43. హోమియోత్రిశతి (పద్యములలో మెటీరియామెడికా) డా॥ బి. సుబ్రహ్మణ్యం 1-50

మా ప్రచురణలు మావద్దగాని, ఆంధ్రదేశమందలి హోమియోపతి స్టోర్సులందుగాని, పుస్తకముల షాపులందుగాని దొరకగలవు. మీఆర్డరుతో కొంతసొమ్ము ఎడ్వాన్సుగా పంపవలయును. పుస్తకములను పంపుటకయ్యేడి పోస్టలుఛార్జి అదనము.

ఎట్టి అసాధ్యవ్యాధులకైనను హోమియో చికిత్స ప్రజ్ఞావంతముగ చేయబడును.

వేమవరపు వేంకటరమణశర్మ,
హోమియోపతి డాక్టరు,
విజ్ఞాన ప్రచార నిలయము,
[illegible] (Pin No. 533223) తూ॥గోదావరి జిల్లా.